# తిక్కన చేసిన మార్పులు ఔచిత్యపు తీర్పులు

## (విరాటోద్యోగ పర్వములు)

ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి
పిహెచ్.డి., పట్టమును పొందిన సిద్ధాంత వ్యాసము

**డాక్టర్ పి. సుమతీ నరేంద్ర**
ఎం.ఏ., పిహెచ్.డి.,
ఆంధ్రోపన్యాసకురాలు, కస్తూరిబాగాంధీ మహిళా కళాశాల
సికిందరాబాదు.

ప్రచురణ :
బాలకృష్ణ భారతి
విజ్ఞానపురి, హైదరాబాదు - 500 044.

# TIKKANA CHESINA MĀRPULU - AUCHITYAPU TIRPULU

By Dr. P. SUMATHI NARENDRA, M.A., Ph. D.,
Lecturer in Telugu, Kasturba Gandhi College for
Women, Secunderabad - 500 026.



First Edition : Feb., 1982
Copies : 1000
Price : Rs. 50/-

Copies available with

BALA KRISHNA BHARATHI
18/3, Vigyanpuri,
Hyderabad - 500 044.

Y. B. REDDI
Indukurpet (p. o.)
Nellore Dist.-524 314

Printed at : Progressive Press Private Limited
Hyderabad - 500 001.

# అంకితము



శ్రీ వై. బి. రెడ్డి – శ్రీమతి రంగనాయకమ్మ

ఆంధ్రసాహిత్యంలో అభిరుచి, తిక్కన కవిత్వంలో మక్కువ కలిగించి,
నా విద్యా సముపార్జనా ప్రయత్నాన్ని నిరంతరం ప్రోత్సహించి,
ఈ గ్రంథావిర్భావానికి అనవరతం కృషి చేసిన అమృతమూర్తులు
అమ్మమ్మ తాతగార్లకు హృదయపూర్వకంగ అంకితము !

# భక్త్యాంజలి

అమ్మా ! అమ్మను మరిపించిన అమ్మా
ప్రేమామృతాన్ని పంచియిచ్చిన అమ్మమ్మా
మా సేమమే నీ ధ్యేయమని భావించినావు
కన్న బిడ్డ మరణాన్ని కళ్ళారా చూచి నీవు
గరళాన్ని శివుని వలె దిగమ్రింగినావు
అమృతాన్ని మాకు పంచి యిచ్చినావు
ఆడంబరమనునది నీ వెరుగవు గాని
అపురూపంగ మమ్ము పెంచినావు
విద్యా బుద్ధులు గఱపిన తల్లి వి నీవె
ధనధాన్యాలిచ్చిన మహాలక్ష్మివి నీవె
మా మనుగడకు పెడుగడ వైన గౌరివి నీవె
ఆ ముగురమ్మలు మూర్తీభవించిన రూపం నీవె
ప్రేమానురాగాల ప్రతిరూపం నీవె
ఆదరాభిమానాలకు ఆలయమీవె
ఏ లోకాన ఉన్నా నన్ను దీవించమ్మా
నా భక్త్యంజలిని ప్రీతితో అందుకోవమ్మా.

# FOREWORD

Dr. B. GOPALA REDDI
President,
A. P. Sahitya Akademi,
Ex-Governor, Uttar Pradesh.

Tikkana occupies a central place in Telugu literature. He introduced a greater element of Telugu words some of which are not in use now. He had a sense of appropriateness in choosing his words. When his characters move and speak, they do with a touch of drama and the right word gets animated. Over the centuries, he had emerged as an artist endowed with a sense of word-wizardry. He is the one in the great trio responsible for translation of *Vyasa Maha Bharata* into Telugu. He accounts for fifteen out of eighteen *Parvas* of the *Mahabharata*. He began with Virata and Udyoga *Parvas* and they are considered his illustrious chapters.

Srimati Dr. P. Sumati after passing her science degree, switched over to M. A. in Telugu literature of Osmania University after obtaining the necessary exemptions for not doing Telugu at graduate level. With her intelligence, application and her previous familiarity with Telugu literature, she came out successful with a first class first in the University much to the delight of her well-wishers. Encouraged by her success, she opted for a doctoral course with all the rigours of the discipline. She ought to get enough knowledge of Sanskrit to do research work on Tikkana's translation of Virata and Udyoga *Parvas*. She applied herself for three years and completed her thesis to the great satisfaction of her examiners. She had an able guide in Dr G. V. Subrahmanyam, her teacher and benefactor. When I heard of her choice, I did not feel greatly enthusiastic. I thought there was nothing original in trying to find out how Tikkana did his translation. what he omitted and what he added in it and the reasons for his

omissions and additions. He did abridge the original which was obvious. He did enlarge which was equally obvious. But when the researcher began discussing why he undertook the amendments, she had to explain the why of it. Herein lies her originality and scholarship. She had to unfold the entire theory of *Ouchityam*-the appropriateness and aptness. There was a lot of discussion on the theory of *Ouchityam* by scholars of yester centuries. Elaborations and contradictions were galore. She had to discuss the general theory and apply it in specific cases. The classifications of *ouchityam* are elaborately discussed. Thus the thesis becomes her original commentary on the theory and the application of *Rasa* which was given great importance by Kshemendra and other *Alamkarikas*. This treatment is a new approach to the translation of *Mahabharata* and one examiner thought all the *Parvas* must be put to this sort of test. The translation did everything deliberately and for good reason. Nothing was done in hurry in a slip-shod manner. The entire gamut of aesthetics has to be covered in this humble-looking title.

Dr. Sumati did a commendable job and threw much new light on the translation work of our Telugu ancients. Vyasa and Tikkana were seen through new binoculars. I heartily congratulate Dr. Sumati on her efforts and feel no hesitation in declaring that she richly deserved the highest recognition. She was carefully guided and closely examined and richly conferred the degree of a doctorate.

This is the fruit of her literary harvest and I commend it to the scholarly club of Telugu elite.

I have an avuncular interest in this work. A lovely lotus has a long stalk that cannot be seen.

Sri. Yarramreddi Balakrishna Reddy of Indukurupet, abbreviated as Sri Y. B. Reddy was my senior colleague in Andhra Jateetya Kalasala, Machilipatnam in 1921-23. He was interested in Telugu classics and continues te evince interest up to date. He married Smt. Ranganayakamma. who had a Good schooling in Sanskrit and Telugu literature

upto 1927. Her learning was known among the inner circles of the community. It was not a common feature of the community for girls to be learned in classics, I was present at the wedding from the bridegroom's side. We were all happy that both were interested in Telugu literature.

When their baby-girl was born, I congratulated Sri Y. B. Reddy in October 1928, that the girl born should become a votary of Saraswathi, excelling her mother. That was a blessing made over fifty three years ago The baby-girl became a mother of three boys and a girl and died prematurely in 1953 My prophecy had a belated fulfilment Instead of Smt. Ranganayakamma's daughter Smt. Yasodhara excelling her, Smt. Yasodhara's daughter Dr. Sumati excelled her and my prophecy took a concrete shape in her thesis just being released. Having lost her mother very early in life, Dr. Sumati lost her grand mother, Ranganayakamma June this year, and as such the grandmother could not see the thesis in print. Late Srimati Ranganayakamma made all the arrangements for its print by depositing the necessary money, but due to the printers' delay and the precipitation of her disease, she predeceased the completion of printing That was an unfortunate incident marring the full joy of this release function.

Sri Y B Reddy being an admirer of poet Srinatha honours a scholar annually to perpetuate the memory of his deceased daughter. The scholar speaks on some aspect of Srinatha's preeminence in Telugu poetry.

Once again I congratulate Dr. Sumati on producing a learned thesis and getting it printed at a great cost We are happy that Sri Y. B Reddy is hale and hearty at eighty and witnessing Dr. Sumati's doctorate thesis being made available to the public. The memory of his deceased daughter and the fresh bereavement of his wife, follow him in the evening of his life, leaving their foot-prints and shadows, ruesome in his solitudes.

I am greateful to be invited to write these few lines to this learned book.

29-11-81
Nellore

ఆశీః ప్రశంస

# కళా ప్రపూర్ణ

—డా. దివాకర్ల వేంకటావధాని
ఎం.ఏ. ఆనర్సు., పి. హెచ్.డి.

శ్రీమతి డా. పి. సుమతి మాకు శిష్యురాలు. ఉస్మానియా విశ్వ విద్యాలయమున తెలుగులో ఎం.ఏ. చదివి అందు ప్రథమ శ్రేణిలో సర్వ ప్రథమురాలుగా నుత్తీర్ణత గాంచిన మతిమంతురాలు. సుమతి నామధేయ మామెయెడ నన్వర్థమైనట్టిది. ఆమె బాల్యము మాతామహీ మాతామహుల సాకతమున పెరిగినది. ఆ పుణ్యదంపతులు భారతీయ సంస్కృతి సంప్ర దాయములు ద్విధారూపమొందిన ధన్యమూర్తులు. ప్రాచీనాధునికాంధ్ర సారస్వతముల సారసౌరభములు స్వాయత్తీకరించుకొన్న విజ్ఞాన సంపన్నులు. అట్టివారి శిక్షణలో పెరిగిన చి.సౌ. సుమతి తన వర్తనచే, వాఙ్మయ విజ్ఞానముచే చదివించిన వారికిని చదువు చెప్పిన వారికిని కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చి వంశ గౌరవమునకు వన్నె కలిగింప జాలినది. ఆమె నెల్లూరు ప్రాంతమున పుట్టి పెరిగినది. అందుచే తిక్కన మహాభారత మామెకు బాల్య పరిచితము. ఆ పరిచయ మామెలో తద్రచనయందభిమానమును పెంచి యీ సిద్ధాంతన్యాసమున నక్షర రూపమొందినది.

మహాభారతము శాస్త్ర కావ్యము; మఱొక మహాప్రపంచమని చెప్ప దగినది. ప్రపంచమున నెన్నిరకముల మానవులుందురో అందన్ని రకముల పాత్రలున్నవి. "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తినతత్క్వ చిత్తను" సూక్తిలో నతిశయోక్తి యిసుమంతయు లేదు. వ్యాసుడు చతుర్వదనుడైనను బ్రహ్మ కావున నట్టి మహాసృష్టి చేయగలైను. దానిని కవిత్రయము వారాంధ్రీకరించిరి. ఆంధ్రీకరించిరనుట సామాన్యోక్తి. యథార్థము పరిశీలించినచో వారు అంధ్రీకర్తలుగా కాక అపర స్రష్టలుగా కనిపింతురు. అవసరమని తోచినచోట్ల వారు పెంపు కావించిరి; కొన్ని

చోట్ల సంగ్రహించిరి; కొన్ని భాగములు విడిచి వైచిరి; కొన్ని చోట్ల నన్యథా కల్పనలు చేసిరి; కొన్ని చోట్ల మూలమును యథాతథముగా ననుసరించిరి. అందుచేత చి.సౌ. సుమతి అన్నట్లు వ్యాసుని శాస్త్ర కావ్యము వారి చేత కావ్య శాస్త్రమైనది. శాస్త్ర కావ్యమున శాస్త్ర ప్రమేయమును, కావ్య శాస్త్రమున కావ్య ప్రమేయమును అధికముగా నుండును. ఈ మార్పులు కర్తల రచనోద్దేశముచే కలిగినవి. కవిత్రయము వారు వ్యాసుని గురువుగా భావించిరి. వారేమైన మార్పు చేర్పు లొనరించినచో నందుకు హేతువు దేశకాలానుగుణ్య దృష్టియే కాని భారతీయ సంస్కృతి మహావృక్షమునకు మూలభూతుడైన ఆ మహర్షి యెడ గౌరవలోపము కాదు; అతనికంటె తాము మహత్తరులమను నహంకార మంతకుముందే కాదు.

మహాభారత మాద్యంతమహృద్యము. అయినను వయోభిరుచిభేద మును బట్టి కొందఱాది సభా పర్వములను, కొందఱు విరాటోద్యోగములను, కొందఱు శాంత్యానుశాసనికములను ఎక్కువగా నభిమానింతురు. పలువురు విరాటోద్యోగములకు ప్రాధాన్యమొసంగుదురు. తిక్కన విరాట పర్వా రంభమున "హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు, నానారసా భ్యుదయోల్లాసి విరాటపర్వ" మని విరాట పర్వము నందలి గుణములు పేర్కొనెను. ఈ విశేషణములన్ని పర్వములకును సాధారణముగను విరాట పర్వమునకు ప్రత్యేకముగను అన్వయించును. ఇతర పర్వములందు కంటె విరాటోద్యోగములందు తిక్కన స్వతంత్ర కల్పనా చాతుర్య మెక్కువగా కనిపించును. తిక్కన భారతము నంతను మూలముతో పోల్చి అందలి మార్పులను, ఔచిత్యపు తీర్పులను సమగ్రముగా ప్రదర్శించుట యెవ్వరి కైనను మహాభారమనిపించును. అందుచే చి.సౌ. సుమతి విరాటోద్యోగ పర్వములు రెండింటిని మాత్రమే గ్రహించి ఆ మార్పు తీర్పులను నేర్పుతో ప్రకటించినది. ఇతర పర్వముల విషయమున నీ మార్గమవలంబింపనెంచు వారికీ సిద్ధాంత వ్యాస మొజ్జబంతి యగుననుటలో సందేహము లేదు. ఆమె దీనిని రచించుటలో చూపిన ప్రతిభా ప్రావీణ్యము లట్టివి.

తిక్కన భారతమునందలి యొక్కొక్క పర్వము నొక్కొక్క ప్రబంధముగా భావించెను. అందుచేతనే తాను రచించిన భారత భాగము నాతడు ప్రబంధమండలి యని పేర్కొనెను. పర్వములనే కాక ఆయా పర్వములందున్న బృహత్తర కథా సన్నివేశములను కూడ నతడు స్వయం సంపూర్ణములైన ప్రబంధములుగా తీర్చిదిద్దెను, కీచకవధ, ఉత్తర గోగ్రహణము, ఉత్తరాభిమన్యుల వివాహము మున్నగునవిట్టి వానికి నిదర్శనములు. చి సౌ. సుమతి ప్రధానముగా వ్యాసభారతమున లేక పోయినను లేక సూచ్యమాత్రములుగా నున్నను తిక్కన ప్రతిభాపరి పూర్ణముగా కల్పించిన కల్పనలను, పోషించిన ఔచిత్యమును, కావించిన వర్ణనలను, చిత్రించిన పాత్రల వైచిత్రిని, ప్రకటించిన రసములను, చేసిన ఉపదేశములను, ఈ సిద్ధాంత వ్యాసమునందు విశదీకరించినది. అది సులభ సాధ్యమైన పని కాదు. అయినను ఆమె పరిశ్రమించి, పరిశోధించి పై విషయములనన్నిటిని సమగ్ర సుందరముగా సంతరించి ప్రత్యంశమునందును కొంత నూతనత్వమును ప్రదర్శించినది.

తిక్కన భారతము పఠించు వారతని కవితాకౌశలము, సంభాషణ చాతుర్యము, వర్ణనవైచక్షణ్యము, వ్యంగ్యవైభవము, కథాకథనము, రస పాత్ర పోషణము మున్నగువానిచే నాకర్షింపబడి పారవశ్యము పొందుదురు. వ్యాసుడెటు వ్రాసెను, తిక్కన యెట్లు వ్రాసెను అను విషయమునంతగా పట్టించుకొనరు. ఈ సిద్ధాంత వ్యాసము పఠించినచో తిక్కన మూలము ననుసరించుచునే మధ్యమధ్య ప్రదర్శించిన మహనీయ కల్పనా విశేషము లెట్టివో గోచరించును. విరాటుడు ఉత్తరను బృహన్నల కప్పగించిన సన్ని వేశము నందలి ఔచిత్యమును, ఉత్తరవర్ణనమునందలి ఔచిత్యమును శ్రీమతి సుమతిగారు ప్రదర్శించిన తీరత్యంత ప్రశంసా పాత్రముగా నున్నది. అర్జునుడు వేషధారియైన విష్ణువువలె నుండెననుటయు, ఉత్తర అలదువిలుతు పూవుటమ్ము వోలె నుండెననుటయు సూచించి ఆమె యచ్చటి యలంకార ధ్వనిని చక్కగా విశదీకరించినారు. ఉత్తరకు మొదటినుండియు నర నారాయణులేడుగడగా నిల్చియుండిరనుట పరమాద్భుతముగా నున్నది. కీచకవిరహము తరువాతి ప్రబంధ కవుల కొజ్జబంతి యగుట యథార్థము.

అధ్యాయారంభమున కల్పనా ప్రయోజనమును శ్రీమతి సుమతిగారు వివరించిన తీరామె పరిశీలన పాటవమును చాటుచున్నది.

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణ" మ్మను లాక్షణికోక్తి కావ్యమున నౌచిత్యమునకు గల ప్రాధాన్యమును చక్కగా తెల్పుచున్నది. శ్రీమతి సుమతిగారు ఔచిత్యమును వాక్య వస్తు పాత్ర రస రచనా వృత్తములకు సంబంధించిన ఆఱు భాగములుగా విశ్లేషించి వాని కన్నిటికిని తిక్కన విరాటోద్యోగపర్వములనుండి సముచితములైన యుదాహరణముల నొసంగియున్నారు. తిక్కన ఔచిత్య పోషణమున కృతహస్తుడు. ఉత్తరాభిమన్యుల వివాహసందర్భమున నతడు వర్ణించిన శృంగారమౌచిత్య శోభితమై మహోదాత్తముగా నున్నది. పైని పేర్కొనబడిన ప్రధానము లైన ఔచిత్యములను మరల పెక్కు విధములుగా విభజించి వ్యాసకర్త వాని కన్నిటికిని సరియైన నిదర్శనములు చూపినారు. ఔచిత్య విచారమను అధ్యాయమున ఆమె ప్రకటించిన సూక్ష్మ పరిశీలనము శ్లాఘా పాత్రముగా నున్నది. తిక్కన వృత్తౌచిత్యమును చక్కగా పాటించెను. విరాటోద్యోగ ములలో నతడు స్రగ్ధరలను రెండింటిని మాత్రమే వాడెను. ఆ రెండింటిలో కూడ మరల సందర్భమును బట్టి వైలక్షణ్యమును ప్రకటించెను. నృపాదుల శౌర్యమును వర్ణించునప్పుడు శార్దూలముచితముగా నుండునని క్షేమేంద్రుడు తెలిపెను. తిక్కన క్రోధ రౌద్రములను వర్ణించునప్పుడే శార్దూలములను వాడెను. ఏ సందర్భమున, ఏ రసమును పోషించునపుడే వృత్తమును వాడ వలెనో అతనికి తెలిసినట్లింకెవరికో కవులకు తెలియదు. నీతులను బోధించు నపుడాతడు సాధారణముగా కందములను వాడును. విదుర నీతిలో కొంచె మించుమించుగా నన్నియు కందములే. ఇచ్చట నాతడు మూలమును చాల సంగ్రహించి ధృతరాష్ట్రుని హృదయమునకు సూటిగా తాకు వాటిని మాత్రమే చెప్పియుండెను.

విరాటోద్యోగములలో ప్రాతఃసూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలున్నవి. ఇవి అమూలకములు. తిక్కన వానిని కథలో లీనములగు నట్లు సుందరములుగను, భావబంధురములుగను, ఔచిత్య శోభితములుగను కావించెను. ప్రకృతినేకాక వస్తువులను, వ్యక్తులను, వర్ణించునప్పుడు

కూడ నాతడు చాల మెలకువ చూపును. అర్జునుడు విరాటునకు పాండవులను గూర్చి చెప్పినప్పుడు వారి రూపములను, గుణములను, వ్యక్తిత్వములను చక్కగా నిరూపించెను. యుద్ధ వర్ణనమున నాతడు ప్రదర్శించు నైపుణ్య మనన్యసాధ్యమైనది. భీమ కీచకుల యుద్ధమును, ఉత్తర దక్షిణ గోగ్రహణ సందర్భములందలి యుద్ధములును ఇందుకు దృష్టాంతములు. ఆతడేది వర్ణించినను ఔచిత్యవంతమైన క్రమమును పాటించును.

పాత్ర చిత్రణమునను తన్మూన సత్వ ప్రకటనమునను తిక్కన అందె వేసిన చేయి. అతడు ధర్మజాదుల నొక్కొక్కరిని నొక్కొక్క విధముగా వర్ణించును. వారందఱును ధర్మబద్ధులే. అయ్యును వారి యందించించుక తారతమ్యము గోచరించును. ద్రౌపదీ పాత్రము నాతడు చిత్రించిన తీరు నిరుపమానము. ఆమె నన్నయ ద్రౌపది వలె కాక సుక్షత్రియ కాంతగా గోచరించును. తిక్కన కీచకుని విషాద నాయకునిగా వర్ణించెను. అతని యందు కామ మొక్కటే దోషము. ఆ దోషమునకే ఆతడు బలి అయ్యెను. సుదేష్ణ కీచకుని యందభిమానమును చూపెనే కాని అంతఃపుర కాంతోచిత మైన ఔదార్యమును చూపలేక పోయెను. ఉత్తరుని పాత్ర హాస్యరసమున కాలంబన మైనది. శ్రీకృష్ణ సంజయుల పాత్రలను తిక్కన పోషించిన విధ మాశ్చర్యము కలిగించును. అతడు కావ్యము నందలి వివిధ పాత్రలను పఠితలకు సుస్పష్ట రేఖలతో సాక్షాత్కరింప జేయును.

రసాభ్యుదయ ప్రకరణమున శ్రీమతి సుమతిగారు భారతము బహు నాయకమను రాజశేఖరుని వాదమునే కాక యితర లాక్షణికులయు, పండిత విమర్శకులయు వాదములను కూడ చక్కగా సమీక్షించి యున్నారు. వ్యాసునికిని తిక్కనకును రచనా దృష్టిలో భేదమున్నది. తెలుగున శాస్త్రత్వమును సంస్కృతమున కావ్యత్వమును గౌణములు. ఈ దృష్టితో పరిశీలించి విరాటోద్యోగములకు సంబంధించినంతవఱకు ధర్మవీరమునే శ్రీమతి సుమతిగారు బలపఱిచినారు. ఇతర రసములేవేని యెక్కడెక్కడ నంగరసములుగా నున్నవో చక్కగా నిరూపించినారు.

తిక్కన కొన్ని ఉపాఖ్యానములను సూచించి విడిచివైచెను. కొన్నిటిని పూర్తిగా వదలివైచెను. కొన్నిటిని సంగ్రహముగా చెప్పెను. విరాట

పర్వమున ఉపాఖ్యానములు లేవు. అందుచే తిక్కన ప్రధాన కథనే అందౌచిత్య శోభితముగా పెంచి మనోజ్ఞముగా వర్ణించెను. ఉద్యోగముననుపాఖ్యానము లున్నవి. అందు శంకరుల భాష్యమునకు పాత్రమైన సనత్సుజాతీయ మొకటి. దానిని తిక్కన ఒక్క వాక్యములో చెప్పి వైచెను. అందుకు దానివలన నెట్టి ప్రయోజనమును సిద్ధింపమియే కారణము. కావ్యదృష్టి అనగా నిదియే. వ్యాసునిది శాస్త్రదృష్టి కావున నతడు దానిని విపులముగా వ్రాసెను. తిక్కన కొన్ని యుపాఖ్యానములను సంక్షేపించినను సారవంతమైన ఉపదేశమును మాత్రము శక్తిమంతముగనే నిరూపించెను. అతడేది యెట్లు వ్రాసినను మహాకవిగా ప్రత్యక్షమగుచుండును. అతడు వ్యాసుని రచనయందలి అంతరార్థమును సమగ్రముగా గ్రహించి రచన సాగించుటయే అతని నవీన పరాశరసూనుత్వమునకు దృష్టాంతము.

శ్రీమతి సుమతిగారు గురువులమైన మేము తరగతిలో నెప్పుడును-చెప్పియుండని క్రొత్త విషయముల నెన్నిటినో ఈ సిద్ధాంత వ్యాసమున వెల్లడించినారు. అది వారి అసాధారణమైన ప్రతిభకు దృష్టాంతము. వారి వచనశైలి సహజమై, ధారాశుద్ధిశోభితమై, శక్తిమంతమయ్యు సర్వ సుబోధమై. నిర్దుష్టమై. స్పష్టవ్యక్తీకరణ సంశోభితమై విరాజిల్లుచున్నది, ఇట్టి శైలి యలవడుట కూడ నొక అదృష్టము. అది విషయానుగుణమై. వివిధ విషయ విస్తృతమై విద్వద్విద్యార్థులకు కూడ వేడుక కలిగించునట్లున్నది. ఆమె యింకను వ్యాఖ్యానవద్యములైన విశిష్ట రచనలెన్నో రచించి ఆంధ్ర సరస్వతి కభినవాలంకృతులను, ఆచార్యుల కఖండానందమును చేకూర్చు గాక యని ఆశీర్వదించుచున్నాను.

# ఆశీస్సు

—బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రి
గుంటూరు–6

"ఆ సంసారం కవిపుంగవైః ప్రతి దివస గృహీత సారోఽపి।
అద్యాప్యభిన్నముద్రః ఇవ జయతి వాచాం పరిస్పందః" (కుంతకః)

ఈ సూక్తి కేవల వాక్పరిస్పందమునే గాక మహాకవి వాక్స్పందమునకు గూడ వర్తించును తిక్కయజ్వ భారత పారావారమును ఎందరెందరో తమ ప్రజ్ఞా మందరమున మథించి ఎన్నెన్నో యపూర్వ విషయ రత్నములను వెలార్చిరి. ఇప్పటికిని వెలార్చుచున్నారు. అది యొక మహారత్నాకరము. ఈ మథనము ఏనాడో ఆరంభమయినది. ఇంకను జరుగుచున్నది. ఇక మీద గూడ జరుగును.

తిక్కయజ్వ భారతేతిహాసము నంతను 'ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణము" గలదిగానే తలచెను. కాని చతుర్థమగు విరాటపర్వము 'హృదయాహ్లాది" "ఊర్జితకథోపేతము' "నానా రసాభ్యుదయోల్లాసి" అని ప్రత్యేకముగా చెప్పెను. అట్లు మఱియే పర్వమును గూడ తిక్కయజ్వ స్తుతింపలేదు. ఉద్యోగాదిపర్వములతనికి సామాన్య విషయములు కావుననే అతడు "ఉద్యోగాదులంగూడంగాఁ బదుయేనింటి" అని సామాన్య దృష్టితో పల్కెను కాగా తిక్కయజ్వ ఇంతటి శ్రద్ధతో స్తుతించిన యీ విరాటపర్వమును లోకమునకు అతడు ఎట్లు అందించెను. ఇది ఆంధ్రలోకము తప్పక తెలియవలసిన విషయము. ప్రతిపరవి రసోదయముగా కీర్తింపబడు భారతములో ఈ విరాటపర్వమునే హృదయాహ్లాది, ఊర్జితకథోపేతము, నానారసాభ్యుదయోల్లాసిగా ఎట్లు అతడు నిరూపించినాడు ? అను జిజ్ఞాస గల్గుట సహజము.

దీనికి డా. సుమతిగారు రచించిన యీ విమర్శ వ్యాసము చదువుడు అనునదియే సమాధానము. ఈ గ్రంథమున విరాటోద్యోగములను మాత్రమే ప్రధానములుగా జేసికొని తిక్కయజ్వ విశిష్టత నిరూపింపబడినది ఒకానొక గ్రంథమును విమర్శించునపుడు ఆ గ్రంథమెప్పటి దేశకాలములకు సంబంధించినదో ఆనాటి సాహిత్య శాస్త్రమును ఆధారముగా జేసికొని విమర్శింపవలయునుగాని నేటి సాహిత్య నియమములను ఆధారముగా దానిని విమర్శింపగూడదు. భారతము ప్రాచీన గ్రంథము. కావుననే దానిని ప్రాచీన సాహిత్య విమర్శకులగు ఆలంకారికుల దృక్కోణమును బట్టియే విమర్శించుట తగవు. డా. సుమతిగారు విమర్శనము నందలి విశేషమేనగా గ్రంథ విమర్శమెట్లు గావింపవలయునో పేర్కొనుచు ఆలంకారికుల లక్షణ సిద్ధాంతములను దెల్పి అవ్వానిని తిక్కన గ్రంథమున సమన్వయము గావించిరి.

అనువాదములలో కల్పనమునకు తావు గలదా? అట్టివానిలో కల్పనమునకు అవసరమేమి? అను విషయములు ఇందు చక్కగా చర్చింపబడినవి. "తనుగావించిన సృష్టి తక్కొరుల చేతంగాదునాన్" అను ఎఱ్ఱన పల్కులోని తిక్కయజ్వ సృష్టిని విభాగపురస్సరముగా పలు విధముల మనోహరముగ డా. సుమతి నిరూపించినది. అట్టి సృష్టి (కల్పనము) లోని ఔచిత్యము, ఆవశ్యకత గూడ ఇందు లెస్సగ ప్రతిపాదింప బడినవి.

మఱియు మూలగ్రంథములో లేని కల్పనములు ఇందు ఎందెందు గావింపబడినవో తెల్పుచు అవ్వాని యౌచిత్యము లెస్సగా నిరూపింపబడినది. క్షేమేంద్రుని ఔచిత్య విచార చర్చలోని ఔచిత్య భేదములను నిరూపించి తిక్కయజ్వ వచనములలో ఆ భేదములకన్నింటికిని సమన్వయమును గావించుట ఇందొక విశేషము. వృత్తజాతుల నడకను బట్టి ఏ పద్యము ఏ రసమును స్ఫురింపజేయునో దేనిని ఎందుకుపయోగింపవలయునో ఆ విషయమున తిక్కన ప్రదర్శించిన రీతి స్పష్టము చేయబడినది. పూర్వమిద్దానిని గూర్చి బహువిధములగు చర్చలు జరిగినను ఇందొక వైలక్షణ్యమగపడును.

అమూలకములగు వర్ణనములలో తిక్కన వర్ణనావైశిష్ట్యము సహేతుకముగ ప్రదర్శింపబడినది.

తిక్కయజ్వ తీర్చి దిద్దిన ప్రధాన పాత్రముల శీల నిరూపణము ప్రత్యేకముగ గావించుట వేఱొక విశేషము.

ఈ గ్రంథమున "రసాభ్యుదయము-రసోల్లాసము" అను ప్రకరణమున భారత సమైక్యము-నాయక విమర్శము గావింపబడినది. ఈ చర్చ చాల ప్రాచీనమైనను అవ్వానిని విడువకయే వాని మంచి చెడ్డలను విచారించుచు ధర్మజ నాయకత్వమునను, ధర్మవీర ప్రాధాన్యమునను మొగ్గు చూపబడినది. కాని ప్రాచీనులు. హరివంశగ్రంథము భారత శేష గ్రంథమగుటచే అద్దానిని గూడ గ్రహించి విమర్శింపవలయుననియు అట్లగుట శ్రీకృష్ణుడు నాయకుడనియు శాంతము రసమనియు నిరూపించిరి. ఏది ఎట్లయినను రసచర్చ మనోహరము. రసము శాంతమని తెల్పినను ఈ శాంతము కావ్యరస రూపమే గావున వికారరూపమగుచు సాక్షాత్తు మోక్ష ప్రాపకము కాజాలదు గదా! రసములలో ఉత్తమ రసముగా కానొప్పను.

మూలభారతము ఉత్తమమా, తిక్కయజ్వ రచనము ఉత్తమమా అను విషయమున చాల విప్రతిపత్తులు గలవు. వ్యాసుడు విశ్వమునకును, అందునను భారత దేశమునకును, సంబంధించిన క్రాంతదర్శియగు కవి. ఒక్క భారత దేశముననే అవాంతర రాష్ట్రముల మనస్తత్వములు ప్రవృత్తులు భిన్నభిన్నములుగా నుండును. హిమాచలము నందలి జనుల మనస్తత్వములకు, ప్రవృత్తులకును ఆచారములకును, దాక్షిణాత్యుల మనః ప్రవృత్త్యాచారములకును భేదము స్పష్టము గదా! కావున వాని నంతటిని మనమున నిడుకొని సంతరించిన వ్యాసుని విమర్శించుట కంటె, ఆంధ్రుల మనస్తత్వములను ప్రవృత్తిని ఆచార ధర్మములను మనమున నిడుకొని, అవ్వానిని రసోత్కర్షముతో మనకు అందించిన తిక్కన భారతమును జదివి ఆనందించుట మేలుగదా! కావుననే తిక్కయజ్వ గూడ—

"కావున భారతామృతము కర్ణపుటంబుల నారఁగ్రోలి యాం
ధ్రావళి మోదముంబొరయునట్లుగ నాత్మవతేయ సంస్కృతి
శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహా కవిత్వ దీ
క్షావిధినంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్ (వి. 1-30.)

అని వ్రాసుచ్చెను. కావున మనకా వైమనస్య మక్కరలేదు.

ఏది యెట్లున్నను ఉత్తమమైన విమర్శ గ్రంథము. విషయమును సర్వత్ర విశ్లేషించి చూపుటలోను, విమర్శించుటలోను శ్రీరామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వ విచారము వలె దీనికొక విశిష్టత గలదు. ఈ గ్రంథము విమర్శకులకు మంచి మార్గదర్శకము కాగలదనుట నిశ్చప్రచము.

కావున ఇట్టి యుత్తమ విమర్శన గ్రంథములను ఇంకను పెక్కింటిని రచించి సాహితీలోకమునకు మేలు సమకూర్చుచు లోకాదరము వందుటకు పరమేశ్వరుడు రచయిత్రికి ఆయురారోగ్య మేధా ప్రజ్ఞాది సంపద లొసగి సర్వదా అనుగ్రహించు గావుతమని కోరుచున్నాను.

29-11-1931.

# ఆశీరక్షరి

పద్మశ్రీ, కళాప్రపూర్ణ
—డా॥ సి. నారాయణరెడ్డి

తిక్కన్న మొదటి తెలుగన్న (నన్నయను మన్నించమని కోరుతూ). పాలకురికి సోమన్న తెలుగు బావుటా పైకెత్తినా చాలా భాగం నన్నయ గిరిలోనే ఉన్న నడిమన్న. తిక్కన్న పక్కపీటలో తెలుగును కూచో బెట్టిన వెర్రినాన్న వేమన్న. తిక్కన్న పట్టి చూపింది మార్గభక్ష్యాలమధ్య దేశి కలకండను. వేమన్న ఎత్తిచూపింది సుసంస్కృతుల వలయాల మధ్య అచ్చతెలుగు జెండాను.

తిక్కనపై వెలువడిన వ్యాసాలకు, గ్రంథకోశాలకు లెక్కలేదు. తిక్కనరచన కోస్తాతీరంలోని చేదబావి లాంటిది. ఎంత తోడితే అంత నీరు. చేదేవాడి చేవనుబట్టి. ఉడుకు నెల జెడదలేదు దీనికి.

ఇదుగో—ఈ రచయిత్రి డా॥ సుమతి తిక్కన్నను ఔచిత్యరజ్జువుతో తోడుకున్న యువ విదుషీమణి. ఈ చిరంజీవి ఎం. ఏ. లో మా విద్యార్థినిగా చేరినప్పుడే నిగూఢంగా వ్యుత్పత్తి రేఖలను ఆవిష్కరించింది. ఈ గ్రంథరూపంలో ఆ రేఖలకు బింబాకృతి ఏర్పడింది.

తాతగారి చేయి, గురువుల వాయి తోడుగా డా॥ సుమతికి సంక్రమించిన వ్యుత్పన్నత ఔచిత్యదర్పణంలో తిక్కన్నను ప్రతిబింబించుకున్నది. క్షేమేంద్రుడు ప్రాతిపదికగా కొనలు సాగిన ఔచిత్యశాఖలనేకాక, నాటి నంటుకుని పుట్టిన మరికొన్ని రెమ్మలను ఆధారధాతువులుగా చేసుకుని డా॥ సుమతి తన పరిశోధనకు పూలు పూయించింది. పండ్లు పండించింది. వ్యాసహృదయం ఊపిరిగా తిక్కన్న తీర్చిదిద్దిన మూర్తి కొత్తగుండెతో, ఒత్తుకండతో ఎలా సాగిపోయిందో ఈ గ్రంథంలో విద్వదుపేతంగా వివేకవినీతంగా చర్చించింది.

ఈ సిద్ధాంతగ్రంథం ప్రకరణాలు ఎన్నెన్ని విమర్శాంశాలను పుడిసిలించుకున్నదో నిర్ణయించే బాధ్యత గ్రంథ పరీక్షకులది. గురువుగా నా ధర్మం ఈ చిరంజీవి కృషిని సమదృష్టితో పరిచయం చేయడం; భవిత వ్యాభ్యుదయానికి ఆశీరక్షగా శ్రుతి చేయడం.



# తీర్పులలోని నేర్పులు

—డా. జి. వి. సుబ్రహ్మణ్యం.
ఎమ్.ఎ.పిహెచ్.డి. రీడర్
యూనివర్సిటి ఆఫ్ హైదరాబాదు.

డా॥ పి. సుమతిగారి పరిశోధనను పర్యవేక్షించు కార్యమునందు ఉస్మానియా విశ్వవిద్యాలయము నన్ను నియోగించినది. నేను సంతసించితిని. దానికి కారణములు రెండు. ఒకటి - ఆమె యెన్నుకొనిన సమస్య సున్నిత మైనది. రెండు - ఆమె బుద్ధి సూక్ష్మమైనది. ఈరెండింటి కలయికచే ఒక ఉత్తమ పరిశోధనగ్రంథము వెలువడగలదను విశ్వాసము నాకు కలిగినది. గ్రంథమును పరీక్షించిన విద్వాంసులు—ఆచార్య జి.యన్. రెడ్డిగారు. డా॥ పి.యస్.ఆర్. అప్పారావుగారు - దీనిని ఉత్తమ సిద్ధాంతవ్యాసము లలో నొకదానిగా ప్రశంసించిరి. ఆమె కృషి ఫలించినది డాక్టరేట్ పట్టమా మెకు లభించినది. నా పర్యవేక్షణలో పరిశోధనము నారంభించిన వారిలో డా॥ పి. సుమతిగారే మొదట డాక్టరేట్ పట్టమును పొందినవారు. అదియు నాకు మఱింత హర్షదాయకమైనది.

ఒక విశ్వవిద్యాలయ పరిశోధన ప్రణాళికలో పరిశోధకుని - లేక - పరి శోధకురాలి చిత్తమునకెక్కిన పరిశోధనాంశము లభించుట అదృష్టమే. డా॥ పి. సుమతిగారు నెల్లూరువారు. వారికి వారి తాతగారు, అమ్మమ్మ గారు, తండ్రిగారు చిన్ననాటినుండి సాహిత్యసౌమనస్యమును కల్పించి, పోషించినారు. తిక్కన కవితయనినచో వారందఱికి తిరుమంత్ర పారాయ ణము; శ్రీనాథుని కవితయనినచో చింతామణి యుపాసనము. అందువలన 'తిక్కనగారి అమూలక కల్పనలు - వాని ఔచిత్య విచార'మను నంశము డా॥ పి. సుమతిగారికి సహజాభిమానమును సంతరించుకొనిన సాహిత్య మీమాంసయైనది. ఎచ్చట ఆత్మీయత కుదురునో అచ్చట అధ్యయనము

లోచూపుతో కూడిన లోతుల నందించుచు. అట్టి అవకాశము డా॥ పి. సుమతి గారికి లభించుట ఆమె అదృష్టము.

ఈ పరిశోధనలో డా॥ సుమతి మొదట రెండు సమస్యల నెదుర్కొనవలసి వచ్చినది. మొదటిది - తిక్కనగారు చేసిన అమూలక కల్పనలను నిర్ధరించుట. అనువాద గ్రంథమునందు అమూలక కల్పనల నెన్ని చూపవలసి వచ్చినప్పుడు మూలముతో తిక్కనరచనను పోల్చి చూడవలెను. ఆ పని పదునేను పర్వముల మహాభారతము నాశ్రయించి సాగవలెను. ఆ పని శ్రమతో కూడినది. ఒకవేళ అట్లుచేసినను గ్రంథము పెద్దదగును. సూక్ష్మపరిశీలనను నకు తగినంత యవకాశ ముండదు. సిద్ధాంత గ్రంథము సమీక్షా గ్రంథమగును. అందువలన పరిశోధనమును విరాటోద్యోగ పర్వములకు మాత్రమే పరిమితము చేసికొని, పరిశోధన ప్రణాళికలో ఔచిత్యమును పాటించినది డా॥ సుమతి. ఇక రెండవ అంశము—ఔచిత్య విచారచర్చ. ఔచిత్య చర్చచేయు విమర్శకు లకు కావ్యమును గురించియు, కావ్యజీవితమును గురించియు, రసమును గురించియు, కల్పనలు, కావ్యాంగములు, పాత్రశీలములు మొదలైన అనేకవిషయములను గురించియు ప్రామాణికములైన, నిశ్చితములైన కొన్ని ప్రమాణములు, అభిప్రాయములు ముందే యేర్పడి యుండవలెను. డా॥ పి. సుమతిగారు సిద్ధాంతవ్యాసరచన కుపక్రమించుటకు పూర్వమే యీరెండు సమస్యలను దృష్టియందుంచుకొని, తగినంత అధ్యయనము చేసి, తనవైన కొన్ని దృఢ నిర్ణయములకు రాగలిగినారు. అందువలన గ్రంథరచనమునందు సమన్వయాత్మకమైన దృక్పథమును సర్వత్ర ప్రపంచించి, పూర్వాపర వైరుధ్యము లేని యొక ప్రస్థానమును సాగింప గలిగినారు. ఇట్టిది పరిశోధన గ్రంథములందు ప్రాథమికముగా పరిశోధకులు సాధింపదగిన అధికారము. దీనివలన పరిశోధనకు ప్రామాణికత్వము కలుగగలదు.

డా॥ పి. సుమతిగారు మొదటి అధ్యాయమునందు కల్పన అనగా నేమి ? అనువాదమునందు కల్పనకు గల స్థానమేమి ? తిక్కన చేసిన సన్నివేశ కల్పన లేవి ? వాటి సార్థక్య మేమి ?—అను అంశములపై చర్చ నారంభించుట ఈ గ్రంథమున కుచితమైన ఆరంభ శిల్పము. కల్పన వలన కావ్యాంగములకు ఆకృతి, అలంకృతి, నిష్కృతి, వ్యాప్తి—అను నాలుగు

ప్రయోజనములు కలుగునని వారు చేసిన వివేచనము సారవంతమైనది. ఆ నాలుగు ప్రయోజనములను ప్రపంచించి చూపుటకోయనట్లు తిక్కన విరాటోద్యోగములందు నాలుగు సన్నివేశములను కల్పించినట్లు పరిశోధన వలన తేలుట సాహితీలోకము హర్షింపదగిన విషయము. వాని సార్థక్య విచారము కవిబ్రహ్మ ప్రతిభామూర్తికి పట్టిన నీరాజనము.

తిక్కన రచనలో అమూలకాంశములను నిర్ణయించుటలో సన్నివేశములను గూర్చిన భాగము ప్రాణతుల్యమైనది. ఇక మిగిలిన అంశము లన్నియు కథలో నీరక్షీరన్యాయమున కలసి యుండునవి. మూలముకంటె పెంచి వ్రాసిన వర్ణనలు, వాక్యములు, పదములు, పాత్రల గుణశీల వివరణములు, స్వభావచిత్రణములు, అలంకారములు, హావభావములు—ఇట్లు ఎన్నియో చర్చనీయాంశములగును. వీనికి తోడు మూలమునుండి గ్రహింపక వదలినవి, సంగ్రహించినవి, అన్యథాకరించినవి—ఇట్టివి యెన్నియో పరిశీలింపదగియుండును. సంక్లిష్టముగానున్న ఈ యంశముల నన్నింటిని అనుశీలించెడి విధానము నేర్పఱచుకొనుట పరిశోధనలో మఱొక గట్టి సమస్య. డా॥ సుమతీగారు తమ పరిశోధన ప్రణాళికలో ఈ అంశము లన్నింటిని స్పష్టమైన సరవగావానతో వర్గీకరించుకొని వాని విలువలను నిగ్గు తేల్చెడి నైపుణ్యమును ప్రకటించినారు. ఏమి చెప్పవలయునో నిర్ణయించుకొని యెట్లు చెప్పవలయునో నిర్ధరించుట పరిశోధన ప్రణాళిక. ఎట్లు చెప్పవలయునో వివేచించుకొని, తర్కసహముగా ప్రతిపాద్యాంశమును ప్రపంచించుట రచనాప్రణాళిక. ఈ రెండింటికి సామరస్యమును సాధించుట సాహిత్య విమర్శలో గణనీయమైన రచనా శిల్పము. ఈ గ్రంథ నిర్మాణమా శిల్పపద్ధతిని చిత్తశుద్ధితో చిత్రించినది.

'అమూలకాంశములు—ఔచిత్య విచారము' అను ద్వితీయాధ్యాయము ఈ సిద్ధాంత గ్రంథ రచన కాకృతి నిచ్చెడి భాగము. కావ్యమునకు రసమాత్మ; ధ్వని ప్రాణము; ఔచిత్యము జీవితము; వృత్తులు ప్రవృత్తులు, రీతులు రూప వైభవములు, గుణములు శోభాహేతువులు; అలంకారములు శోభాతిశయ హేతువులు. కావ్య జీవితము ఔచిత్యముపై నాధారపడియుండును. ఆత్మయున్నను, అలంకృతులున్నను, ఎన్నియున్నను జీవించెడి విధమే జీవిత

సారము. అందువలన ఔచిత్యము కావ్యజీవిత వ్యాపి. తిక్కన రచన యొక్క జీవితసారము అతని ఔచిత్య పాలనము. ఔచిత్యవాదుల ఔచిత్య విభాగమును గ్రహించి, ఆధునిక వివేచనలోని అంశములను వానికి జోడించి, ఔచిత్యాంశములను వాక్యసంబంధులనియు, వస్తుసంబంధులనియు, పాత్ర సంబంధులనియు, రససంబంధులనియు, రచనా సంబంధులనియు వర్గీకరించి, తిక్కన యమూలకాంశముల వాయా శీర్షికల క్రింద అనుశీలించిన విధానము విమర్శనలో విశ్లేషణాత్మక వివేచనమునకు విశిష్టోదాహరణము. డా॥ పి. సుమతిగారు ఈ భాగమును సమర్థతతో నిర్వహించినారు. విశేషించి వాక్యౌచిత్య ప్రకరణము రసౌచిత్యానుశీలనము ఛందశ్శిల్ప సమన్వయమును సహృదయ ప్రశంసలకు పాత్రము లైనవి.

తిక్కన వర్ణనలు, పాత్రచిత్రణము అను నంశములపై నీ గ్రంథమున రెండధ్యాయములు రచింపబడినవి. అమూలకవర్ణనాంశములతో తిక్కన రసశిల్పమును పోటించిన వివిధాంశము లిందు విపులముగా చర్చింపబడినవి. అన్నియు నొక యెత్తు, తిక్కన యుద్ధ వర్ణనములలోని ఔచిత్య శిల్ప విచారము మఱియొక యెత్తు. తిక్కన ప్రతిభ యొక్క యెత్తులను, లోతులను దర్శించి, చిత్రించిన భాగమిది. పఠితకు ఆసక్తి కల్గించెడి విమర్శ ఈ భాగములందు విస్తారముగా కానబడుచున్నది. పాత్ర చిత్రణలో తిక్కన తీర్చిన తెలుఁగుదనమును డా॥ సుమతిగారు తేటతెల్లమగునట్లుగనే కాక తేనెలూరునట్లు రచించి గ్రంథపాకమునకు రుచిని హెచ్చించినారు.

'రసాభ్యుదయము-రసోల్లాసము' అను అధ్యాయము ఈ గ్రంథమునకు గుండెకాయ వంటిది. తిక్కన రస శబ్దమును చిత్రముగా వాడును. రసాభ్యుదయము, ఉల్లాసము అని పేర్కొనును. ప్రబంధమండలి యని తన రచనను కీర్తించును. వీని నన్నింటిని సమన్వయించుకొనుట యొక సమస్య ఇదివఱ కెందరో నడచిన బాట. అయినను, అన్వయము చేయవలసిన అంశము లింకను మిగిలిన మాట. డా॥ పి. సుమతిగారీభాగమున సమ్యగ్దృష్టితో కూడిన సమన్వయ దృక్పథమును సారించినారు.

ఆంధ్ర మహాభారతము 'కావ్యరూప శాస్త్ర కావ్యచ్ఛాయాన్వయి' అనియు, కావ్యేతిహాస ప్రక్రియకు సంబంధించిన దనియు, అందలి అంగిరసము

ధర్మవీరమనియు స్థాపింపబడిన పూర్వసిద్ధాంతముల నామె గ్రహించుట ఔచిత్య దృష్టికి ప్రమాణము. ఇచ్చట నొక విషయము చెప్పవలయును. నేను మహాభారతమునందంగరసము ధర్మవీర మను వాదమును తెలుగు నాట వెలుగులోనికి తెచ్చిన వాడను. నా పర్యవేక్షణలో జరుగు ఈ పరిశోధనమునందు డా॥ సుమతిగారిని నా వాదమునే గ్రహింపవలెనని నేను ఒత్తిడి చేయలేదు. దాని నామె విచక్షణకే వదలినాను. ఆమె తెలుగు నాట నున్న ప్రసిద్ధ పండితులతో చర్చించినది మహాభారత రసవాదములను చేసిన గ్రంథములను చదివినది. నాతో కూడ చర్చించినది. చివరకు ధర్మవీర వాదము నంగీకరించినది. తాను నమ్మినది తన గ్రంథమునందు రచించినది. పరిశోధనలో 'బలవంతపు మాఘస్నానముల' ప్రసక్తి యుండ కూడదు. డా॥ సుమతి ధర్మవీర వాదమును తర్కవితర్కానంతరము అంగీకరించినందులకు నే నామె నభినందించుచున్నాను. సహృదయ పండితులను కూడ ఆ వాదబలమును గుర్తింపుడని అర్థించుచున్నాను. అభ్యుదయ - ఉల్లాస శబ్దముల కామె యిచ్చిన సమన్వయము సహృదయామోదయోగ్యము. ప్రపంచమండలి కామె కావించిన వ్యాఖ్యానము అనువర్తిత విమర్శలో అనుసరణ యోగ్యము. యోగ్యత నెఱిగిన విమర్శ ఔచిత్యసారము.

'ఉపాఖ్యానములు - ఉపదేశములు' - అను చివరి అధ్యాయము ఈ గ్రంథమునకు చక్కని ముగింపును సంతరించుచున్నది. ఆఖ్యానోపాఖ్యాన సంబంధమును వివేచించి సార్థకముగా వానిని సంక్షేపించుటయో, సూచించి వదలివేయుటయో, పరిత్యజించుటయో, చేయుట కవియొక్క ఔచిత్య దృష్టిని తెల్పు విషయము. తిక్కన రచనలో వాని స్థితిగతులను ఔచిత్య ప్రమాణముతో అనుశీలించిన ఘట్టమిది దానితో అనుశీలనమున కొక సమగ్రత యేర్పడినది.

"Literary criticism, in the most widely aecepted sense, is judgement of books, reviewing and finally the definition to taste, of the tradition. of what is classic" అనిన రెనే వెలక్ (Rene Wellek) మాటలను మనము స్మరించినచో-ఆ ప్రమాణమునకు

ప్రపంచనముగా నిలిచిన పరిశోధక విమర్శ గ్రంథమిది యని స్పష్టపడగలదు. తిక్కన చేసిన మార్పులకు తీర్పు చెప్పుటలో నెన్నుకొనిన ప్రమాణము ఔచిత్యము. ఔచిత్యము కావ్యజీవిత పరమార్థమగుటచే కావ్యానుశీలన మునకు ప్రమాణ ప్రస్థానము. కావ్యార్థముల ననుశీలించుటలో, విలువలకు విలువయైన రసదృష్టి కావ్య పరమార్థ నిర్ధారకము. కావ్యస్వభావ శీలముల నిర్దేశించు ప్రక్రియా రచనాసంప్రదాయము సమన్వయ మూలసూత్రము. ఒక ప్రక్రియలో వెలువడు అవశ్య రచనము దాని సమగ్ర దర్శనమునకు శిల్ప శిఖరము తిక్కనరచన కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయియైన ఇతిహాస రచనమున కాదర్శ శిల్పశిఖరము. దాని సంప్రదాయము వెలుగుట విమర్శమూల సూత్రము. దాని అనుశీలనము దాని రుచికి రుచిరప్రసారము. ఆ రచనలో కానవచ్చు అమూలకాంశములు తిక్కనప్రతిభకు కీర్తిపతాకలు. వాని కళాజీవితములోని నేర్పుల కిచ్చెడి తీర్పులు ఔచిత్య విమర్శకు సాహితీ తపస్వి అందించెడి అక్షర నీరాజనములు. డా॥ పి. సుమతిగారు ఈ గ్రంథములో నిచ్చిన తీర్పులు ఆమె నేర్పులకు నాదెమైన కూర్పులు.

ఈ గ్రంథము డా॥ సుమతిగారి ప్రథమ ప్రయత్నము. తొలియత్నమైనను ప్రౌఢ పరిపాకమున పరిఢవిల్లుచున్నది. ఇక ముందు మణి దీపముల వంటి మరికొన్ని రచనలు చేసి సాహితీవిమర్శకు వెలుగుతోరణము కట్ట గలదని విశ్వసించుచున్నాను. భగవంతుఁ డామెకాశక్తి నిచ్చుగాక ! యని ఆశించుచున్నాను.

6-12-1981



# ముందుమాట :

అక్షరాభ్యాసం మొదలు ఆంధ్ర సాహిత్యాధ్యయనం వరకు నా మార్గాన్ని సుగమము గావించిన వారు, నా అభివృద్ధికై అహరహము పాటు పడినవారు, నేను సాధించిన ఏ చిన్న విజయానికైనా కారణభూతులైన వారు, అడుగడుగున నన్ను దీవించి మున్ముందుకు సాగమని ప్రోత్సహించిన వారు మా అమ్మమ్మ తాత గార్లు. ఈ గ్రంథవిషయంలో కూడా ఎంతో ఆసక్తిని కనబరచి, ముద్రణకై అన్ని ప్రయత్నలను చేసినారు వారు. గ్రంథం పూర్తి యగుసరికి మా అమ్మమ్మ లేకపోవడం నాకు తీరని కొరత-ఎన్నటికీ పూడని వెలితి. ఏలోకాన ఉన్నా ఆమె నన్ను దీవిస్తూనే ఉంటుంది. అమ్మమ్మకు ప్రేమ పూర్వక భక్త్యంజలిని ఘటిస్తున్నాను.

మా తాతగారు నాకు తొలి గురువు. నాలో సాహిత్యాభిరుచిని పాదుకొలిపి, పెంచినవారు వారే. వారికి తెలుగు సాహిత్యంపై గల రక్తి నాలో ఆసక్తిరూపమై భాసించినది. వారు ఏటేటా నిర్వహించే శ్రీనాథజయంతి వారి కవితారాధనకు నిదర్శనం. వారికి తిక్కన కవిత్వంపై ప్రీతి గౌరవములు మెండు. "తిక్కయజ్వ – హరిహరనాథ తత్త్వము" వారి సాహితీ సమారాధనకు తార్కాణము. ఇటీవల వారు ఆంధ్రసారస్వత పరిషత్తు ఆధ్వర్యంలో వారి దాంపత్య జీవన స్మృత్యంకముగా ఒక నిధిని కల్పించి ఏటేటా ఒక కవిపండితుని సన్మానింప దలచుట కవి పండితులపై వారికి గల గౌరవాదరములకు చిహ్నము. అట్టి మహోన్నత వ్యక్తిత్వం గల మా తాతగారు సాహిత్యాన్నే కాదు, జీవితాన్ని కూడ ఎలా అర్థం చేసికొనవలెనో నేర్పారు. వారికి నామనః పూర్వక వందనములు.

మా నాన్నగారు జీవితంలో ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొన్న వారు. దేనికీ చలించని మేరు గంభీరులు. ఋజు వర్తనం వారి ఆదర్శం. నైతిక విలువలు వారి కలువు. నిరాడంబరం వారి జీవిత విధానం. వారు స్నేహితులుగ మెలిగే వారు మాతో. వారికి నా వందనానేకములు.

వివాహం విద్యా నాశాయ అంటుంటారు. కాని వివాహానంతరమే ఎమ్.ఏ., పి హెచ్.డి. చేశాను నేను. అప్పట్లో ఏర్పడిన ఎన్నో అవాంతరాలకు అడ్డు నిలిచి నన్ను ముందుకు సాగనిచ్చినవారు మా శ్రీవారు. వారి సహకార, ప్రోత్సాహాలు లేనిదే నేను ఏమీ చేయగలిగేదాన్ని కాదు. ఈ గ్రంథ ముద్రణకు పూనిక మా అమ్మమ్మ తాత గార్లది అయితే నిర్వహణ మా శ్రీవారిది. వారికి నా హార్దిక నమస్సుమాంజలులు.

స్త్రీకి కుటుంబ పరిధిలో ఉత్సాహాన్ని కలిగించి, ఆటంకాలను కలిగించకుండ సహాయపడువారు కుటుంబ సభ్యులు. ఆ విధంగా నా కృషికి పరోక్ష కారకులైన నా కుటుంబ సభ్యులందరికీ నా శుభాభివందనములు.

ఎమ్. ఏ. పూర్తి కాగానే, పరిశోధన చేయమని ఆదేశించి, విషయాన్ని సూచించి, అవసరమైన సలహాలనిచ్చి, గ్రంథముద్రణానంతరము తమ అమూల్యాభిప్రాయాన్నొసగిన అస్మద్గురువర్యులు ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారికి హృదయపూర్వక వందనములు.

తిక్కయజ్వ-హరిహరనాథ తత్త్వ గ్రంథకర్తలు, వేదాంత విషయ పారీణులు బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రిగారు తమ ఆశీర్వాదములను, అభిప్రాయమును తెలిపిరి. వారికి నా నమస్సులు.

మా తాతగారికి ఆబాల్యమిత్రులు, సాహిత్యసేవా ధురంధరులు, నా పై అత్యంతాభిమానము గలవారు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు తమ అభిమానాన్ని అక్షరరూపంగ తెలిపిన వారికి నా కృతజ్ఞతాభివందనములు.

బహుకార్య మగ్నులై యున్నను శిష్యురాలనను వాత్సల్యంతో నన్ను ఆశీర్వదించి నా పురోభివృద్ధిని కాంక్షించిన గురువర్యులు, ఆధునికాంధ్ర కవిత్వాన్ని ఆపోసన పట్టిన అగస్త్యులు, కవిత్వమే జీవితంగా భావించిన కవివరేణ్యులు డా. సి. నారాయణరెడ్డి గారికి నా నమస్సుమాంజలులు

కార్యనిర్వహణ కావించువారికన్న పూనికనిచ్చువారు, ప్రథమ గణ్యులు. పర్యవేక్షణ అంటే కేవలం పరామర్శించడం అని అనుకొనకుండ ప్రారంభమాదిగ విషయాన్ని చక్కగ వివేచించి, సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించే వరకు వసరమైన సలహాలనిచ్చి, మార్పులను చేర్పులను సూచించి, నా లోపాలను నిష్కర్షగ ఎత్తి చూపి, గుణాలను గుణించిన గురువర్యులు, ఆధునికాంధ్ర సాహితీలోకంలో విఖ్యాత విమర్శకులు, సిద్ధాంత వ్యాసాన్నే కాదు, గ్రంథముద్రణనుకూడ పర్యవేక్షించిన హితైషులు డా జి. వి. సుబ్రహ్మణ్యం గారికి, నాశతసహస్ర వందనములు.

చిన్ననాట విద్యగరపిన శ్రీ వట్టిపల్లి మల్లినాథ శర్మగారికి శ్రీ బంక్ల వేంకట రమణయ్య గారికి, కాలేజీలో తెలుగు బోధించి ఇప్పుడు తోడి కోడలుగ తోడుగా నిలిచియున్న శ్రీమతి రావి భారతిగారికి, అక్షరాలంకరణ చేసి యిచ్చిన శ్రీ శీలా వీర్రాజుగారికి నా వందనములు.

ఎంత ప్రయత్నించినను అచ్చు తప్పులను పూర్తిగ అరికట్టలేక పోయినాము. వాటిని అధిగమించి విషయాన్ని గ్రహింపగలరని సహృదయులగు పాఠకులకు విన్నపము. గుణగ్రహణ పారీణులగు సహృదయ లోకానికి వినయ పూర్వక వందనములు.



# నివేదనము

—డా॥ ఏ. సుమతి

ఆంధ్ర మహాభారతము సంస్కృత మహాభారతమునకు స్వేచ్ఛానువాదము. దీనిని కొందరు కథానువాదమనిరి. కొందరు స్వతంత్రానువాదమనిరి. స్వేచ్ఛానువాదకర్తకు మూలమొక ఆలంబనము మాత్రమే. మూల పరిధిలో తన మౌలికమైన ప్రతిభను స్వతంత్రముగా ప్రకటించుట స్వేచ్ఛానువాద లక్షణము. దీనియందు అనువాద కావ్యప్రణాళికలో నొదిగెడి మూలాంశములు మాత్రమే ముచ్చటగొలుపుచుండును. మిగిలినవానిని తొలగించుటయో, సంగ్రహించుటయో జరుగును. ఇదియొక పక్షము. రెండవ పక్షమున అనువాద ప్రణాళికకు అనువైనచోట్ల స్వతంత్ర కల్పనలు చేయఁబడవచ్చును. మూలమునకంటె కొన్నిచోట్ల సన్నివేశములను విస్తరింపవచ్చును. సంభాషణలలోగాని, వర్ణనలలోగాని, కథాకథనములో గాని మూలార్థమును స్పష్టీకరించుటకును, సమగ్రముగా సంతరించుటకును అనువాదకర్త మూల వాక్యములకనుబంధములుగా తనవైన కొన్ని భావములను, వాక్యములను కల్పింపవచ్చును. ఇట్లగుటచే స్వతంత్రానువాదమునకు మూలానుసరణమొక పక్షమును, స్వతంత్ర కల్పనమొక పక్షమును అగుచున్నవి. స్వతంత్రానువాద విమర్శనమున ఈ రెండు పక్షముల స్వతంత్ర ప్రతిపత్తితో వివేచింపవలసిన ఆవశ్యకతయు తెలుఁగున నున్నది.

ఆంధ్ర మహాభారతమును మూలముతో పోల్చిచూచి అనువాద విశేషములను, ఎడనెడ కవిత్రయమువారు కావించిన స్వతంత్ర కథార్థ వర్ణనాదికములను, కవితాశిల్పాదికములను విమర్శించెడి మార్గము విస్తరించి సాగినది. ఎందరో మహానుభావులిందులో కృషి చేసినారు. కాని తిక్కన చేసిన అమూలక కల్పనలను ప్రత్యేకముగా పరిశీలించి, ఔచిత్య దృష్టితో వాని సార్థక్యమును సమీక్షించిన విమర్శ తెలుగులో నింతవరకు వెలువడలేదు. ఇట్టి దృక్పథముతో ఆంధ్ర మహాభారత రచనా పరిశీలనమును ప్రారంభించి విరాటోద్యోగ పర్వములలో తిక్కన చేసిన మార్పులను గూర్చియు, వాని

ఔచిత్యపు తీర్పులను గూర్చియు పరిశీలించెడి అదృష్టమును నాకు ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు కలిగించినారు.

తిక్కన మూలముకంటె చేసిన మార్పులను గురించి పర్యాలోచింప వలసి వచ్చినపుడు మూలముతో నతని అనువాదమును పోల్చక తప్పదు. పోల్చి మూలమున లేని అంశములను గ్రహించి, వాని ఔచిత్యము నాలోచించుట ఈ సిద్ధాంత వ్యాస పద్ధతి. ఈ ధోరణిని ఆదరింపని ఆధునిక విమర్శనా పద్ధతి యొకటి కలదు. కవిత్రయమువారు ఏ మూలప్రతిననుసరించిరో నిర్ణయించుట కష్టము. కాబట్టి మూలముతో పోల్చు పద్ధతి ఉపయోగకారి కాదనియు, మూలానువాద తుల్యపరిశీలనలో ఒక్కొక్కసారి అటు వ్యాసునకు కాని, ఇటు కవిత్రయము వారికి కాని అన్యాయము జరుగవచ్చుననియు తలంచుట ఈ వాదమునకు మూలము. ఈ దృక్పథముతో పరిశీలించినచో కవిత్రయము వారిది స్వతంత్ర రచనయే అనవలయునే కాని స్వతంత్రానువాదమనుటకు వీలులేదు. అనువాదమని అంగీకరించినచో కొంత కాని, కొండంత కాని మూలముతో పోలిక ఉండక తప్పదు. ఆ పైన కొంత స్వాతంత్ర్యము కనబడక తప్పదు. అట్టియెడ అమూలక కల్పనలను నిశ్చయించుటెట్లు అను ప్రశ్న ఉదయించును. దాని వెంటనే తిక్కన అనుసరించిన మూలప్రతి ఏది అను వితర్కముదయించును. నా పరిశోధనలో తేల్చుకొనవలసిన మొదటి పెద్ద ప్రశ్న యిదియే యైనది. భారత దేశమునందలి భారత ప్రతులన్నింటిని పరిశీలించి, పూనాలోని భండార్కర్ ప్రాచ్యపరిశోధన సంస్థవారు సంస్కృత మహాభారత సంశోధిత ప్రతిని తయారుచేసిరి. ఇందు ప్రసిద్ధ భారత ప్రతుల పాఠములన్నియు లభించుచున్నవి. అది పరిశోధకులచే ప్రామాణిక గ్రంథముగా పరిగణింపబడుచున్నది. తిక్కన చేసిన మార్పులను ఈ గ్రంథముతో పోల్చి నిశ్చయించినచో తిక్కన అనుసరించి యుండిన ప్రతియే కాక, అఖిల భారతమునందున్న భారత ప్రతులలో లేని మార్పులనే సంభావించినట్లగుచున్నది. ఇట్టి మార్పులను మార్పులని అంగీకరించుటలో ఎట్టి విప్రతిపత్తియు నుండరాదు. అందువలన అమూలకములైన మార్పులను నిశ్చయించుటలో సంశోధిత గ్రంథ ప్రతిని ప్రాతిపదికగా గ్రహించుట ప్రమాణబద్ధమని ఈ సిద్ధాంత వ్యాసమున స్వీకరించుట యైనది.

సంస్కృతాంధ్ర భారతములలో భేదములకంటె సామ్యములెక్కువ. ఈ పరిశోధన విధానమున సామ్యములను చర్చింపవలసిన అవసరము లేదు. ఒక భాషలోనున్న అత్యుత్తమ భావములను యథాతథముగా తమ మాతృ భాషలోనికనువదించుట విజ్ఞులైన కవులు చేయునట్టి కార్యమే. ఇక భేదము లున్నవి. అవి యట్లుండుటకు హేతువులేమి? ఆ మార్పులవలన అను వాదము నందొనగూడిన కావ్య ప్రయోజనము లెట్టివి? అని పరిశీలింపవలెను. ఇందువలన మూలమునందలివియు అనువాదమునందలివియునగు విషయ ములు చక్కగా తెలియును. ఇక అనువాదములో నొక యంశము బాగుగా నున్నదనుట మూలకర్తను తక్కువ చేయుట ఎంతమాత్రమును కాదు. మూలకర్త చెక్కిన శిల్పమునకు, సదనుకర్తలు ఆ శిల్ప సౌందర్యమును ద్విగుణీకృతమగునట్లు అలంకారములను చేసినచో నది మూలకర్త మనసును గ్రహించినట్లగును కాని తక్కువ చేసినట్లు కాదు. కవిత్రయమువారు సవేదవ్యాసుని యెడల భక్తిభావముతో భారతము ననువదింపఁ బూనిరేగాని స్వతంత్ర గ్రంథ రచన చేయఁజాలక కాదుగదా!

వ్యాసుని కాలమునకు కవిత్రయమువారి కాలమునకు ఎంతయో అంతరము కలదు. సంఘవ్యవస్థ మారినది, సామాజికుల అభిరుచి భిన్నమైనది. దానితో భారతేతిహాసము సంగ్రహింపఁబడవలసిన ఆవశ్యకత, ధర్మ ప్రబోధ ములు కుదింపఁబడవలసిన అవసరము, పురాణ పద్ధతిలో కాక రసపరిపుష్టమగు కావ్యధోరణిలో రచన చేయవలసిన పరిస్థితి ఏర్పడినవి. మూలానువాద భారతములలోనున్న మార్పులకివి ప్రధాన హేతువులు.

మాతృక పురాణధర్మపురంధ్రి. పుత్రిక అభినవ కావ్యసుగంధి. తల్లికంటె ఒక గుణము పుత్రికలో నున్నదనుట ఆ తల్లికి బాధాకరము కాదుగదా, ఆహ్లాదకరమగును. ఆ తల్లి లేక ఈ పుత్రిక లేదను సంస్కారము అంతర్లీనముగా నుండిన చాలును

"జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశభాషలందు తెలుగు లెస్స
జగతి తల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడు బిడ్డ మేలు గాదె"

తిక్కన విరాటోద్యోగపర్వములలో నీ యౌచిత్య భేదముల నన్నింటికిని ప్రస్ఫుటముగా గానవచ్చు నంశముల నెన్నుకొని వానివలని కావ్య ప్రయోజనములను వివరించుట యైనది.

ఆధునికులు ఔచిత్య భేదములలో వర్ణనౌచిత్యమును, పాత్రౌచిత్య మును విశేషించి సంభావించుచుందురు. ఈ రెండింటికిని రెండధ్యాయములు కేటాయింపబడినవి. వర్ణనలు-వైశిష్ట్యము అను నధ్యాయమునందు తిక్కన అమూలకముగా గావించిన వర్ణనలను ప్రకృతి వర్ణనలనియు, వస్తు వర్ణనల అనియు యుద్ధవర్ణనలనియు వర్గీకరించి వానినాయా తావులందు తిక్కన నిబంధించుటలోగల ఔచిత్యమును, సార్థక్యమును పరిశీలించుటయైనది. తిక్కన యుద్ధవర్ణనలను కొన్ని యెడల మూలాతిశాయిగా వివరణములు చొప్పించియు, విభావముల వర్ణించియు, రస భావముల నలంకరించియును రసోచిత రచనా ఫణితులను సాధించియు చైతన్యవంతముగా చిత్రించి విధము సూక్ష్మేక్షికతో సమీక్షించుటయైనది.

తిక్కన సజీవపాత్రచిత్రణము నందసమానసామర్థ్యమును ప్రకటించెను. మూలమునకంటె విశేషించి తెలుగునందాయన పాత్ర వ్యక్తీకరణము నందును, స్వభావ సూచనమునందును, అనుభావ, సాత్త్విక, సంచారుల అభివ్యక్తీకరణమునందును సంభాషణలలో ప్రౌఢ చాతుర్యమును చెళుక్కు పలుకుల పొందికయందును. పలుకుబళ్ళ జిలుగుశిల్పమునందును. వాక్య విన్యాసమునందు భావింపఁజేయు వక్రతావ్యంగ్యవైభవములందును, ఉచిత ప్రవర్తనలనలవరించుట యందును ప్రదర్శించిన ప్రౌఢిని ప్రకాశింపఁ జేయుటయైనది.

తిక్కన విరాటపర్వమును 'రసాభ్యుదయోల్లాసి' యని కీర్తించెను. అభ్యుదయము అంగికిని, ఉల్లాసము అంగమునకును సహజ లక్షణములు. శాస్త్రేతిహాసమైన సంస్కృత భారతమును తిక్కన కావ్యేతిహాసముగా మలచి, నాయక చిత్తవృత్తిని అంగిరస ప్రవృత్తికనుగుణముగా పోషించినవిధము సమీక్షించుట యైనది. రాజశేఖరుఁడు భారతమును, బహునాయకేతిహాస మని వివేచించిన విధమును ప్రధానోపనాయక కావ్యవృత్తములననుసరించి సమన్వయించుటయైనది. తిక్కన భారతమును ప్రబంధమండలిగా సంభావిం

చిన విధము అంగరసోల్లాసముతో సభ్యుదయము చెందు అంగిరసమును వ్యంజింపఁజేయుటఁ కెట్లు తోడుపడునో సమన్వయించుట యైనది. పర్వమొక ప్రబంధమండలియనియు, అందలి స్వయంసమగ్రములైన ఘట్టములు ప్రబంధములనియు సుపలక్షించి ప్రతిఘట్టమునందును ప్రధానపాత్రల ప్రవృత్తిని, వారినాశయించిన రసభావాభివ్యక్తిని విలోకించుట యైనది.

తిక్కన కావ్యకళాదృష్టితో తెలుగుభారతమును నిర్మించుచు మూలమునందలి వృత్తాంతములను కొన్నింటిని పూర్తిగా వదలివేయుటయు, కొన్నింటిని సూచించి వదలి వేయుటయు, మఱికొన్నింటిని మిక్కిలిగా సంగ్రహించుటయు కావించెను. సంక్షేపించిన భాగములందును సారవద్రచనగావించుట తిక్కన సహజలక్షణము. ఆంధ్రభారతమున ఉపాఖ్యానోపదేశములు ప్రధాన కథారసప్రవృత్తికి ఒదిగి నిలిచినవే కాని అంగిని మ్రింగివేసెడి అంగబలమును చూపించలేదు.

పై పర్యాలోచనమువలన తిక్కన అమూలక సన్నివేశ కల్పనలు చేసినది నాలుగైనను మూలమునకు మెఱుంగు పెట్టునట్లున్నవనియు, కావ్యరసమును కొనియాడెడి తిక్కన రసభంగహేతువైన అనౌచిత్యము వెచ్చుటను తన కావ్యరంగమున అడుగుపెట్టనీయక, కావ్యజీవితమునే ఔచిత్య శోభితముగా సంతరించెననియు, వర్ణనలుకాని, పాత్రములుకాని రసోదయవికాసహేతువులై రాణించునట్లు చిత్రింపఁబడినవనియు, అంగిరసమైన ధర్మవీరము విరాటోద్యోగపర్వములలో మనోబుద్ధులనురంజించునట్లుగా పోషింపఁబడినదనియు ఫలితార్థముగా తేలినది.

తిక్కన ఔచిత్యము నెఱిఁగి మూలమననుసరించెను. అతఁడు కల్పన చేసెననఁగా కథలో ఆ అవసరమున్నదన్నమాట. అతఁడు పెంపుచేసెననఁగా కావ్యరసపోషణకది కావలసి యున్నదన్నమాట. అతఁడు తగ్గించెననఁగా కథాగతికి వేగము నెక్కించెనన్నమాట. అతఁడు వదలివేసెననగా అది ఎంతటి మహాపదార్థమైనను రసమార్గమున కంతరాయమన్న మాట.

తిక్కన ఒక రసశిల్పి. ఔచిత్యమాయన ప్రమాణము. విజ్ఞానశిఖరమైన వ్యాసభగవానుని మూలభారతమునుండి రసనిష్యందమైన కావ్యేతిహాస జీవి

తమును జీవనస్రవంతిగా తెలుఁగునేలకు మళ్ళించిన కవిబ్రహ్మ తిక్కన ఆయన చేసిన మార్పులన్నింటికి తీర్పునిచ్చెడినేర్పు నాకున్నదని చెప్పలేను. కాని ఆ మహాకవి కవితాశిల్పముపై భక్తిమాత్రము కలదు. అదియే ఈ పరిశోధనలో నాకున్న శక్తి. దానిని గుర్తించి నా ప్రయత్నమును పండితలోకము ప్రసన్నముగా చూచినచో నా రచనము ధన్యము



# విషయానుక్రమణిక

## సన్నివేశకల్పనలు - సార్థక్యము



## అమూలకాంశములు - ఔచిత్యవిచారము

## వర్ణనలు-వైశిష్ట్యము



## పాత్రచిత్రణము—తిక్కననేర్పు .... 295

# సన్నివేశకల్పనలు_సార్థక్యము

## 1. కల్పనము

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథ
లావిరి పుట్టు రత్నము లవారిత సత్కవికల్పనాకథా
సావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్"[1]

సాహిత్యమునకు కల్పనాకథను సంబంధించినదిగా బహుళప్రచారమున నున్నది.[2] వస్తువు ప్రఖ్యాతమనియు, ఉత్పాద్యమనియు, మిశ్రమనియు మూడువిధములు అని లాక్షణికులు పేర్కొనియుండుట ప్రసిద్ధము.[3] ఈ మూడింటియొక్క తారతమ్యవివేచనమును రామరాజభూషణుడు పై విధమున అలంకృత మొనర్చి పేర్కొనినాఁడు. అతని దృష్టిలో కల్పనాకథలు కృత్రిమరత్నములు. ఆద్య సత్కథలు పుట్టురత్నములు. మిశ్రమ వస్తువులు సానలు దీరిన జాతిరత్నములు.

ఆద్యసత్కథ లనఁగా పురాణేతిహాస ప్రసిద్ధములని తాత్పర్యము స్ఫురింపవచ్చును. రామరాజభూషణుని వివేచనము కావ్యములకు మాత్రమే సంబంధించినది యగుటచేత పురాణేతిహాస కథలు కల్పితములా లేక పూర్వ ప్రవృత్తములా అను ప్రశ్న యతనికి పుట్టలేదు. అత్యంత పురాణ గాథా ప్రపంచము పురాణము.[4] పరంపరా కథనాత్మకమైన సత్యకథా ప్రపంచము ఇతిహాసము.[5] పురాణములందు వేదార్థ ప్రపంచనార్థము ప్రతీకాత్మక కథా కల్పనము జరుగవచ్చును. ఇతిహాసమునందు చారిత్రక సత్యమైన ఆద్యకథకు పరంపరాకథనమునందు కథకులు స్వీయకల్పనాపరంపరను జోడింప వచ్చును. ఇట్లు పురాణేతిహాస కథలయందు కల్పనకు సముచితమైన స్థానము కలదు. ఒక విధముగ చూచినచో పురాణకథలలో నధికముగ కల్పితకథలు చోటు చేసికొను నవకాశము కలదు.

ఇతిహాస కథలలో మిశ్రేతివృత్తమునందువలె పూర్వకథకు అపూర్వ కల్పన పైదోడుగ నిలుచుట కవకాశము కలదు. భారతీయలాక్షణికులు రస ప్రధానమైన కావ్యమునందలి ఇతివృత్తమును మూఁడు విధములుగా దర్శించిరి కాని, వేదార్థబృంహితములైన పురాణేతిహాసప్రక్రియలకు[6] ఈ సూత్రమును వర్తింపఁజేయలేదు. అవి కల్పనలకు అనల్పస్థానములైనను కావ్యకవులచేత అవి ఆద్యసత్కథలవలె గౌరవింపఁబడుటచే ప్రఖ్యాతములను ప్రశస్తికి పాత్రములైనవి.

ప్రాచీనలాక్షణికులు కావ్యమునందు రసమున కిచ్చిన ప్రాధాన్యమును రచనాచమత్కారమున కీయలేదు. కల్పనము వస్తుసంబంధి. వస్తువు ధ్వనిమంతమై రసధ్వనియందు పర్యవసించును[7]. కల్పనము వస్తువు ధ్వనిమంతమగుటకుఁగాని రసానుకూలప్రవృత్తిని ప్రదర్శించుటకుఁగాని తోడ్పడు కావ్యాంగమని ప్రాచీనులు భావించియుండిరి. రామరాజభూషణుఁ డన్నట్లు ఆద్యసత్కథ పుట్టురత్నము కావచ్చును. దానికి కల్పనలు తోడైనప్పుడే సానలఁదీరిన జాతిరత్నమగును. అనఁగా మూలవస్తువునందు రసపోషణసామగ్రి కొఱవడియున్నప్పుడు దానిని సంతరించి రసాభివ్యక్తిని కల్గించుటయే మిశ్రేతివృత్తమున కవిచేయు కల్పనలకు సార్థక్యమని సంభావించుటకు వీలున్నది.

మిశ్రేతివృత్తమునందలి కల్పనకే యింత గౌరవమున్నచో కల్పితేతివృత్తమునందలి కల్పనకు నిజమున కెంత గౌరవ ముండవలెను ? కల్పితేతివృత్తము కల్పనాకళాపూర్ణోదయము. అందు ఆద్యంతము కల్పనయే. మిశ్రేతివృత్తమున కల్పనము పాక్షికమే. కాని, రామరాజభూషణుఁడు కల్పితవృత్తమును కృత్రిమరత్న మనినాఁడు.

స్థూలదృష్టికి ఇది విపరీతముగ కనుపట్టుచున్నది. కాని, దీని తత్త్వమును విమర్శకు లిట్లు భావించియున్నారు.— "మూఁడు విధములైన కావ్యవస్తువులలో మిశ్రమున కంత మిన్నయైన స్థానమిచ్చుటకు కొన్ని హేతువు లుండవచ్చును. కావ్యము కథకొఱకే వ్రాసినచో కల్పితేతివృత్తమున కున్న గౌరవము మిగిలినవాని కుండరాదు. అపరిచితమైన వస్తువు నామూలాగ్రముగా తెలియునంతవఱకు సామాజికుఁ డూపిరి త్రిప్పుకొనలేడు. నాటకమున

కథాగతితోపాటు కథార్థములను భావన చేయవలసియుండును సామాజి కుఁడు. కల్పితేతివృత్తమున ఆసక్తి కున్నంత అవకాశము ఆలోచనమున కుండదని ప్రాచీనుల యభిమతము కాబోలు. ఇక ప్రసిద్ధేతివృత్తమే యైనచో కథయందు చమత్కారముకంటె కవి ఉక్తియందలి చమత్కారమే దానికి ప్రాణము పోయుచుండును. మఱల చెప్పిన కథ ఎంత చమత్కార ముగా చెప్పఁబడినది యను నంశమే అందాలోచనాంశ మగుచుండును. మూలముకంటె ముచ్చటగొల్పుకున్నచో ఆవస్తువు మొగనుమొత్తినట్లుండును. మిశ్రేతివృత్తమునందు కొంత మెలకువ కలదు. మూలవస్తువు సామాజికు లకు తెలియును. అది సహజముగా రమణీయమైనచో కవి కల్పనారామ ణీయకమును ద్విగుణీకృతము చేయవలెను. మూలకథ లోపభూయిష్ఠ మైనచో కల్పనలు దానిని పుటము పెట్టిన బంగారమువలె వన్నె కెక్కించవలెను. మొదటి పద్ధతికంటె రెండవది చమత్కారతరము. కథాగతిచమత్కారము ఆసక్తిని పెంపొందించును. ఆశ్చర్యముతోపాటు ఆలోచనము కలిగించును. కాళిదాసాదు లందువలననే మిశ్రేతివృత్తమును స్వీకరించి నాటకములు రచించి విఖ్యాతులైనారు."[8]

నాటకములందు (దృశ్యకావ్యములందు) వలెనే శ్రవ్యకావ్యము లందును ఇట్టి దృక్పథమునే యేల యనుసరింపవలెనను ప్రశ్నయుదయించును. శ్రవ్యకావ్యము ఆలోచనామృతము కదా! సమాహితముతో చదివి సమాధి గతుఁడై భావన చేసి శ్రవ్యకావ్య కథార్థములను సామాజికుఁడు చర్వ ణము చేసి రసానుభూతిని పొందును గదా! దృశ్యకావ్యమునం దిట్టి యవ కాశము సామాజికున కుండకపోవచ్చునుగాని శ్రవ్యకావ్య పరనమునం దట్టి యవకాశముండుననుటకు వీలున్నది. ఆధునికులు కళాపూర్ణోదయము వంటి కల్పిత కథా కావ్యములను సైతము కల్పనాదృష్టితో గౌరవించుట చూచు చున్నాము.[9] కాని, పింగళి సూరన వసించిన యుగమునందే యుండిన రామరాజభూషణుఁడు మాత్రము కేవలకల్పనాకథలను గర్హించెను. అది అతని యొక్కని దృక్పథమే కాదు. ప్రాచీన లాక్షణికదృక్పథము. వసు చరిత్రకారుఁడు లక్షణగ్రంథకర్తయునై యుండుట యొకవిశేషము.

ప్రాచీను లపూర్వకథ కిచ్చిన గౌరవముకంటె ప్రసిద్ధేతివృత్తమునందలి అపూర్వకల్పనలకే అధికగౌరవ మిచ్చినట్లు స్పష్టమగుచున్నది. కల్పిత

కావ్యము రసప్రధానము కాదా? అనునంశమున ప్రాచీనులకును ఆధునికుల కును అభిప్రాయభేదమున్నట్లు కానవచ్చుచున్నది. ఆధునికులు ప్రఖ్యాత కథకు వెనుకనున్న కల్పనను గూర్చియే ప్రశ్నించుచున్నారు. ఒకనాటి కల్పితకథ మరొకనాటి కావ్యమునకు ప్రసిద్ధేతివృత్తము కావచ్చునుగదా! అట్లగుచో కావ్యమునందలి కల్పితకథ మొదట కల్పింపఁబడినప్పుడు ప్రామా ణికము కాక పోవచ్చును గాని దానిని మఱియొకఁడు అనుసరించినప్పుడు మాత్రమే ప్రామాణిక మగుటయు, అనుకర్త కావించిన యపూర్వకల్పనలకు మాత్రమే లాక్షణికులగుర్తింపు లభించుటయు సంప్రదాయమని చెప్పవలసి వచ్చును. అట్లగుచో కర్త ప్రఖ్యాతుఁడు, అనుకర్త విఖ్యాతుఁ డనుట యుచిత మేమో! అనుకర్త యేర్పడినగాని కర్తకు ప్రఖ్యాతి రాదేమో! మూల కథను గుర్తించి, శోధించి దానిని ఉజ్జ్వలముచేసినయనుకర్త తనకును తన మూలకర్తకును గౌరవము నాపాదించినవాఁడగుచున్నాఁడు. మట్టి యొకనిది పాత్రము మఱియొకనిది; నూలు ఒకనిది, నేత యొకనిది. ఘటపటములు రెండును మెరుగుపెట్టఁబడినప్పుడే మెప్పుకోలు వహించునని ప్రాచీనుల అభి ప్రాయము కావచ్చును. ఏమైనను ఒక విషయము మాత్రము సత్యము. కథలో క్రొత్తదనము రావలయునన్నచో ప్రాచీనకాలమున పదికాలములు పెట్టెడిది. ఉన్నకథకు ఊపిరి పోసిన కల్పననే ప్రాచీనులు ఉన్నతముగ భావించిరి. నవీనులు పాతవస్తువులను మెఱుఁగు పెట్టి ధరించుట ఆమో దింపరు. నిత్యనూతనవస్తుకల్పనావిశేషమును ప్రత్యంశమునందును ప్రశం సించెదరు. అందువలననే తెలుఁగున, ప్రతాపరుద్రీయమును, కన్యాశుల్కమును ఉత్తమనాటకములుగ సంభావించెడి సహృదయత్వము కానవచ్చుచున్నది. భావకవిత్వయుగమునుండి వెలసిన నూత్నప్రయోగము లన్నియు నపూర్వ ములే. అందువలన కల్పన యెచ్చట నున్నను, ఏ ప్రమాణములో నున్నను అది యౌచిత్యవంతమైనచో కావ్యతత్త్వజ్ఞుల ప్రశంసకు పాత్రమగుననుట నిర్వివాదాంశమైన విషయము.

## 2. కల్పనాప్రయోజనము

కల్పనాశబ్దమునకు నైఘంటి కార్థము లీవిధముగా నున్నవి– అమర కోశము రాజారోహణార్థమై యేనుఁగును శృంగారించుట 'కల్పన' యని

పేర్కొనినది.[10] గురుబాలప్రబోధిక దాని వ్యుత్పత్తిని చెప్పుచు 'కల్ప్యతే కల్పనా', కృపూసామర్థ్యే— కల్పింపఁబడునది' అని పేర్కొని నది. ఊహాకల్పనము, నూత్నసృష్టి, కావ్యనిర్మాణము, అలంకరణము, భావనము, సృజనము ఇత్యాద్యర్థములను మోనియర్ విలియమ్సు సంస్కృత కోశము పేర్కొనినది.[11] ఈ యర్థములను బట్టి కథయందును, కావ్యము నందును, భావనయందును, వర్ణనమునందును కల్పించునూత్నసృష్టి 'కల్పన' మని భావించుటకు వీలగుచున్నది. తాత్పర్యమున కావ్యమునందపూర్వ మైన సృష్టి యెచ్చట భాసించినను అది 'కల్పన' మని సాధారణముగా పేర్కొనవచ్చును. ప్రాచీనులు ప్రతిభను నిర్వచించుచు 'అపూర్వవస్తు నిర్మాణక్షమమైన ప్రజ్ఞ'[12] ప్రతిభ యని పేర్కొనిరి. అనఁగా అపూర్వ వస్తునిర్మాణము కల్పనము. తన్నిర్మాణకారకమైన ప్రజ్ఞ కల్పనాశక్తి. దానినే ప్రతిభయని భావింపవచ్చును. నిజమునకు ప్రతిభకును, కల్పనాశక్తికిని సూక్ష్మముగ తారతమ్యమును భావించినచో ప్రతిభ నవనవోన్మేషశాలిని యైన ప్రజ్ఞ[13], కల్పనము తదున్మేషశాలినియైన ప్రజ్ఞనుండి అపూర్వవస్తు నిర్మాణము చేయుశక్తి. పుష్పవికాసరూపమైన శక్తి ప్రతిభయైనచో ఫలో త్పత్తికి సాధకమైన శక్తి కల్పనాశక్తి వంటిది. ఇట్లు భావించినచో కల్పనకు మూలము ప్రతిభ, కల్పనావ్యాపారము కాండము, అపూర్వవస్తునిర్మాణము ఫలము. ఇట్టి యపూర్వవస్తునిర్మాణక్షమమైన కల్పనాశక్తి మూలమున కావ్యాంగములకు ఆకృతి, అలంకృతి, నిర్మితి, వ్యాపృతి కల్గుట ప్రయో జనములని భావింపవచ్చును.

## 3. అనువాదము : కల్పనము

'అనువాద కావ్యమునందు కల్పనకుగలస్థానమెద్ది?' అనుసంశయము సమీ క్షింపఁదగియున్నది. అనువాదములు ప్రధానముగా మూఁడు విధములని విమర్శకులు పేర్కొనియున్నారు. ''అందొకటి కథానువాదపద్ధతి. ఇందు భాషాంతరీకర్త మూలగ్రంథమునందలి కథను గ్రహించి, యందలి వివిధ సన్నివేశములను విడువకుండ వర్ణనాదులను, రసపోషణమును తన యిచ్ఛ వచ్చినట్లొనరించుచు రచన సాగించును. ఇందు మూలమునకును అను వాదమునకును కథానిధానమున మాత్రమే సన్నిహిత సంబంధము కానిపిం

చును. మిగిలిన రసభావవర్ణనాదులందించుట మూలకర్త యాత్మీయత కంటె ననువాదకర్త యాత్మీయతయే యధికముగ గోచరించును. అందుచే నిది నామమున కనువాదమయ్యును స్వభావమున స్వతంత్రగ్రంథమువలెనే కానవచ్చును. రెండవది భావానువాద పద్ధతి. ఇందుభాషాంతరీకర్త మూలమునందలి కథనే కాక భావనులను గూడ సన్నిహితముగా ననుసరించును. ఇందు మూలకర్త వెలువరించిన భావముల నుచితమైనభాషలో సుందరమైన శైలిలో స్పష్టముగా వ్యక్తముచేయుటయందే యనువాదకర్త నైపుణ్యము గోచరించును. ఈ పద్ధతియందు కథాఘట్టములు కాక భావములు లేక వానిని వెలువరించు వివిధ శ్లోకాదులు ప్రమాణముగా (unit) స్వీకరింపబడును. ఇది యంత యతి స్వతంత్రమును అతి విధేయమును గాని మధ్యస్థపద్ధతి. ఇందు మూలకర్త భావనులన్నియు సమగ్రముగా వ్యక్తము చేయఁబడినను అతఁడు వాడిన పదములన్నిటికిని బర్యాయ పదములు కనబడకపోవచ్చును. మూడవది పదానువాదపద్ధతి. ఇందు మూలమునందలి కథాభావములే కాక పదములు కూడ ప్రమాణములుగా గ్రహింపఁబడును. మూలస్థపదములన్నియు నిందనువదింపఁబడును. ఇది మూలమున కతివిధేయమైన పద్ధతి. ఇందు మూలమునందలి పదమునకు పదమువేయుటకంటె భాషాంతరీకర్త స్వతంత్రత యేమియు గోచరింపదు''. 14

పై మూఁడు పద్ధతులలో పదానువాద పద్ధతియందు అనువాదకుని కల్పన కాస్కారమేలేదు. భావానువాద పద్ధతియందు భావవర్ణనాకల్పనలకు అవకాశముండవచ్చును. కాగా, నీ రెండింటికంటె కథాకల్పనలకును రస భావవర్ణనాకల్పనలకును కొంత విరివియైన అవకాశము కలిగినది కథానువాద పద్ధతి. కథానువాదమునందు ప్రధానలక్ష్యము మూలవస్తుస్వభావము చెడకుండుటయే. స్వభావమనఁగా వస్తుతత్త్వమును తెలుపు పద్ధతి. మూలము శాంతరసప్రధానమైనచో తత్కథాప్రవృత్తి తద్రసస్వభావమునకు పోషకముగ నుండును. అనువాదకర్తయు మూలమునందలి రసమునకును మూల కథా ప్రవృత్తికిని భిన్నమైన కల్పనలు చేయుటకు వీలు లేదు. పోషకములైన కల్పనలుచేసి రసపుష్టిని సంతరింపవచ్చును. కావ్యమునందు రసవ్యంజక ద్రవ్యములు ప్రధానముగా వస్తువు, అలంకారములు, రసభావములు రచనాం

గములు. మూలప్రవృత్తి చెడకుండ వీనిని విస్తరించియు, సంగ్రహించియు అన్యథాకరించియు, కల్పించియు రసపోషణము కావించుట యనువాదకుని కర్తవ్యము.

ఇట్లయినప్పుడు అనువాదకుని కల్పనము మూలకథా ప్రవృత్తిచే శాసింపఁబడుచుండునని తేలుచున్నది. మూలకథ యొకపరిధి. ఆపరిధిలో నొదిగి యనుసరణమునందును తనదైన యొక ప్రజ్ఞను అనువాదకుఁడు ప్రదర్శించునెడ కల్పన జీవము పోసికొనుచుండును. పైన చెప్పఁబడినట్లు కల్పన మూలవస్తువునకు ఆకృతిసౌష్ఠవమును, అలంకారశోభను, గతిసౌందర్యమును, వ్యంగ్యవైభవమును సాధించుట కుపయోగపడునని తలంపవచ్చును. ఇందు ఆకృతి సౌష్ఠవము కథాసంబంధి. కథా కార్యారంభ ప్రస్థాన నిర్వహణాత్మకమైన వస్తువు సుసంధిబంధమై సమాంగసంపుష్టమై విరాజిల్లవలెను. కథాంగములయందు కార్యకారణసంబద్ధమైన వికాసశీల ముండవలెను. కథ చెప్పునప్పుడు రసదృష్టిగల కవి చెప్పెడి విధము వేరు. ధర్మదృష్టిగల కవి చెప్పుదృష్టి వేరు. లోకదృష్టిగలకవి చెప్పెడి విధము వేరు. రసదృష్టిగలకవి సర్వకథాప్రపంచమును సహృదయునకు రసానుభూతి నందించు ప్రవృత్తి కనుకూలముగా చిత్రించును. అడుగడున అనుభూతి కల్గించుటకే అతడు యత్నించును. అట్టి శిల్పమునకు మూలసూత్రము సమన్వయము. ప్రతి కథాంగమును ప్రతీయమానమగు రసమునకు ప్రాతిపదిక కావలెను. ఇట్టిదృష్టితో మూలకథ వ్రాయఁబడినచో అనువాదకుఁడు సామాన్యముగా భావానువాదమునే స్వీకరించును. శ్రీనాథుని శృంగారనైషధరచన మట్టిది. మూలమున కొన్ని ఒదుగుబోదుగు లున్న కథను ఔచిత్యమండితముగ అనువదించుట కవకాశమున్నప్పుడు సామాన్యముగా కథానువాదపద్ధతి సరిపడును. తిక్కన మహాభారత రచన మట్టిది. ధర్మదృష్టిగలకవి ధర్మప్రబోధమునకు కథ నొక సాధనముగ గ్రహించును. కథయందు వీలగుచోట్లనెల్ల ధర్మమును బోధించు పద్ధతినే యాశ్రయించి కొంతవఱకు ప్రబోధకునివలె రచనము సాగించును. రసదృష్టిగలకవికూడ తనకావ్యమున ధర్మములను బోధించును. కాని వానిని వాచ్యముచేయక ధ్వనింపఁజేయును. కొందఱీ ప్రక్రియను ధర్మధ్వనియని పేర్కొనుచుండుట గమనింపఁదగియున్నది.[15]

లోకదృష్టిగలకవి ధర్మము చెప్పుట యందు కంటె లోకవిజ్ఞానము నందించు ప్రవృత్తి నెక్కువగ ప్రకటించును. వేట వర్ణనలందు వేటకుక్కల పేళ్ళు వివరించుట, అశ్వగజాదిభేదములను పేర్కొనుటవంటి వివరణాత్మకమైన యంశము లట్టి కవులదృష్టి నాకర్షించుచుండును. పరిశీలించినచో ధర్మదృష్టి పారలౌకికము, లోకదృష్టి భౌతికము. కావ్యమున నీరెండును కథకు ఒదిగి నిలువ వలసినవే. కథాప్రగతికి అవరోధములు కాక మసలవలసినవే. రసదృష్టిగలకవి వీనికి విస్తృతప్రాతినిధ్య మీయజాలఁడు. తిక్కన భగవద్గీతాదులను అత్యంతము సంగ్రహించుటలోని తాత్పర్యమిదియే. రసావరోధకములైన పై యంశములను తత్త్వము తెలిసివదలుటగాని, సంగ్రహించుటగాని చేయుట కల్పన పరమార్థము; తెలిసిన కవి ప్రదర్శించెడి నైపుణ్యము.

సంస్కృతమహాభారతము ఇతిహాసమనియు పురాణమనియు, పంచమ వేదమనియు ప్రసిద్ధిగాంచినది. ఆనందవర్ధనాచార్యులు దానిని "శాస్త్ర రూపకావ్యచ్ఛాయాన్వయి"[16] అని నిరూపించినారు. అనఁగా సంస్కృత భారతము ప్రధానముగ శాస్త్రస్వరూపము కలది యనియు దానియందు కావ్యచ్ఛాయయు కలదనియు ఆనందవర్ధనుని యభిప్రాయము. అట్లగుచో గీర్వాణభారతమునకు శాస్త్రత్వము ప్రధానధర్మము, కావ్యత్వము గౌణ ధర్మము. శాస్త్రము చతుర్విధపురుషార్థవ్యుత్పత్తి ప్రబోధమున కుపకరించు గ్రంథము. కావ్యము రసప్రధానము. వ్యాసునిది ప్రధానముగా ధర్మ దృష్టి. తిక్కనది ప్రధానముగా రసదృష్టి. ఆనందవర్ధనుని వివేచనమును తిక్కన రచనకు అన్వయింపవలసి వచ్చినచో 'కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయి' అని వ్యాఖ్యానింపవలసి వచ్చును. తెలుగుభారతము ఇతిహాస మయ్యును ప్రబంధముండలిగి భావింపఁబడినది.[17] ధర్మప్రతిపాదక మయ్యును దానిని ధ్వనిసుందరముగ సాధింపఁగలిగినది. కథను రసౌచిత్య చితబంధముగ[18] సంతరించుట జరిగినది. ఇట్టి ప్రక్రియ యెట్లు సాధింప బడుచున్నచో — కథ, నాయకుని చరిత్ర—లేక—యతని జీవితము కథాజీవితము. అతని ప్రవృత్తి రసానుకూలవృత్తి. ధర్మము అతని ప్రవృత్తియందంత ర్భూతమగ ప్రసరించుసంస్కార విశేషము. కావ్యేతివృత్తమున ధర్మమును పాత్రముఖమున ప్రవచింపఁజేయుటకంటె పాత్రప్రవృత్తులయందును సంభాషణలయందును దానిని వ్యంజింపఁజేయుట కావ్యశిల్పము. ధర్మప్రబోధ

మునకు సూక్తులు మాత్రమే ఆలంబనములు కారాదు. సజీవవ్యక్తులు దృష్టాంతములు కావలెను. రసదృష్టిగల తిక్కన మూలమహాభారతకథ యందలి ధర్మతాత్పర్యమును అనువాదమునందు కథాపాత్రల కమనీయ జీవితప్రపంచమునందు వ్యంగ్యముగ ప్రతిపాదించినాఁడు. అప్పుడు కథలో రసమునకు రాజ్యము కట్టుటయైనది. రాజునకు సింహాసనమువలె రసపోషణ మునకు ధర్మము ఆలంబనమైనది. ఈ మార్పే తిక్కన యనువాదము స్వతంత్రరచనవలె భాసించుచునని తెలుపుచు విమర్శకులు కీర్తించుటకు హేతు భూతమగుచున్నది.

మహాభారతేతిహాసమును అనువదించునెడ తిక్కన తాత్త్వికవిషయ ములనిట్లను, ఉపాఖ్యానముల నిట్లును సంగ్రహదృష్టినే ప్రకటించినాఁడు. అమూలకములైన కథాకల్పనలను స్వేచ్ఛతో చేయకపోయినను రసదృష్టితో ఎడనెడ కావించినాఁడు. కథాప్రవృత్తిని పరిపోషించుటయే తత్కల్పనల పరమోద్దేశము. వీనికంటె తిక్కన ప్రతిభ యంతయు పాత్రస్వభావోన్మీలన శిల్పమునందును రసభావవ్యంజకములైన అనుభావ సాత్త్విక భావాభినయ వర్ణనలయందును కథానుకూల ప్రకృతి వర్ణనావిశేషములందును మనకు విస్తృతముగ కానఁబడును. శాస్త్రవిషయములను తగ్గించి, కథను శోధించి, పాత్రప్రవృత్తులను పెంచి, రసభావస్ఫూర్తిని పెంపొందించి అనువాదము నందు రసానుకూలకల్పనలకు విస్తృతావకాశములను కల్పించుకొనినాఁడు. తిక్కన దృష్టి ఆకృతిపెంపుదలకంటె ప్రవృత్తిపెంపుదలకే మొగ్గుచూపు చుండును. అందువలన అమూలకకథాకల్పనలకంటె మూలకథను రమణీయ మొనర్చు వివిధకథాంగకల్పనలకే ఆయన ప్రాముఖ్యము కల్పించినాఁడు. అమరకోశము చెప్పినట్లు 'కల్పన' యనఁగా రాజారోహణార్థమై ఏనుఁగును శృంగారించుటయగుచో తిక్కన రసరాజారోహణార్థమై కావ్యగజమును శృంగారించుటయే కల్పన యొక్క పరమప్రయోజనమని భావించెను. అను వాదమున ఇట్టి ప్రజ్ఞను ప్రకటించుటయే యపూర్వము. తెలుగున నిట్టి కల్పనావైభవమునకు తిక్కన శిఖాప్రాయుఁడై వెలయుచున్నాఁడు. ఎఱ్ఱయగారన్నట్లు——

"తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదునా నేమ ఖం
బుగఁ దాఁ బల్కిన పల్కు లాగమములై పొల్పొందు నా వాణిసా[19]
త్తను నీతం డొకరుఁడనా జను మహాత్మ్యా ప్తిన్ గవిబ్రహ్మ నా
నినుతింతుం గవి తిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్''[20]

తిక్కన కావించిన సృష్టియనఁగా నతఁడు కావించిన కల్పనలే.

## 4. తిక్కన చేసిన నాలుగు కల్పనలు

అపూర్వవస్తునిర్మాణక్షమమైన కల్పనాశక్తి మూలమున కావ్యాంగములకు ఆకృతి, అలంకృతి, నిష్కృతి, వ్యాసృతి కలుగునని మున్దు భావించితిమి కదా! ఈ నాలుగు ప్రయోజనముల నుద్దేశించిన లక్షణమునకు లక్ష్యములో యనునట్లు తిక్కన విరాటోద్యోగ పర్వములయందు నాలుగు సన్నివేశములను కల్పించినాఁడు.

1. తొలుత ఉత్తరను నాట్యాచార్యుఁడగు బృహన్నలకు సభాముఖముగా నప్పగింత వెట్టిన ఘట్టము తిక్కన కల్పించినది.[21] ఉత్తరను బాలకేళీమీది భరము వీడని ముగ్ధగా, అలరువిలుతుని పువ్వుటమ్ము వలె సింగారించి రంగప్రవేశము గావించుటవలన ఆసన్నివేశము 'అలంకృతి' నందితదనంతర కథను ఉత్సుకతతో నడుపఁజాలినది. మూలమున నత్యంత సామాన్యముగా నున్న యీ సన్నివేశమును తిక్కన రమణీయముగా వర్ణించి ముచ్చటగొలుపు ముద్దరాలిని కనులముందుంచినాఁడు. ఉత్తరపాత్ర కొక చక్కని ఆకృతి, సన్నివేశమునందు అలంకృతి ఇం దొనగూడిన ప్రయోజనములు.

2. కీచకుని వలపును, గాఢరతిభావమును, మోహపరితాపమును తిక్కన యెక్కువగా కల్పించి వ్రాసినాడు.[22] రతి స్థాయిభావముగా పోషింపఁబడుట వలన ఈ కల్పనములో రసాభావము రూపుకట్టి, ఆ ఘట్ట మత్యంత ఆస్వాదనీయముగా వినిర్మాణము నందినది. కీచకుఁడు పశు ప్రవృత్తిగల కాముకునిగా గాక అస్థానపతితమైన తనవలపుమూలమున వంచనకు గుఱియై మడిసిన విషాదనాయకునివలె భాసించినాడు. తిక్కన యాతనియందు నాయకోచితములైన మన్మథావస్థలను సైతము కల్పించి వర్ణించినాఁడు. కీచక మోహపరితాప కల్పనము వలన ఈ సన్నివేశము విరాటపర్వమునకు, భారతకథకు మాత్రమే కాక ఆంధ్రసాహిత్యప్రపంచమునకే ఒక మణిదీపముగా భాసించినది. ఈ ప్రతినాయకుఁడే తదనంతర కవుల కావ్యనాయకులకు ఆదర్శప్రాయుఁడైనాఁడు. విరాటపర్వము రసభరితమైన స్వతంత్రకావ్యప్రతిపత్తి నందుటకు ఈ సన్నివేశకల్పన మొకప్రధాన కారణము. విరాటపర్వమున కొక ప్రత్యేక 'ఆకృతి', కథకు 'అలంకృతి', 'వ్యాకృతి', కీచకపాత్ర 'నిర్మితి' ఇచట సాధింపఁబడినవి. అత్యంతాస్వాదనీయముగా రసాభాస మిచట తొలుత పరిపోషింపఁబడినది.

3. దుర్యోధనుని రాజనీతి పాండిత్యము మూలమున స్పష్టముగా నేర్పడకయున్నది. అతని యాలోచనా వ్యగ్రతను తిక్కన విస్పష్టముగా వర్ణించి దుర్యోధన పాత్రకు సజీవకళ నాపాదించి, సూక్ష్మబుద్ధిగల ప్రతి నాయకునిగా, వ్యక్తిత్వముగల రారాజుగా తీర్చి దిద్దెను. దుర్యోధనునికొక స్ఫూర్తిని ఆకృతిని ఇచ్చిన సన్నివేశమిది.[23]

4. విరటుఁడు ధర్మజుని గాయపరచెనని యెఱింగి భీమార్జునులు కోపోద్రిక్తులగు సన్నివేశము అమూలకము.[24] ధర్మజుని యుదారత, కృతజ్ఞతా భావము, అతనియం దనుజులకు గల గౌరవాభిమానము లీఘట్టమున ప్రస్ఫుటములు. మూలమునందు ధర్మజుఁ డిట్లగుటను ఊహించినట్లు కలదు గాని ఈ ఘట్టము లేదు. లోపించిన ఈ సన్నివేశమును ధర్మజభీమార్జున పాత్రల స్వభావానుగుణముగా కల్పించెను. ఈ సన్నివేశము సంభాషణలతో కూర్పఁబడి, నాటకీయతను భాసింపఁ

జేయుచున్నది. ఈ సన్నివేశ కల్పనవలన కావ్యమునకు సమగ్రత, నాటకీయ రచనా శిల్పమువలన అలంకృతి ఏర్పడుచున్నవి.✓

## 5. సన్నివేశకల్పనలు - ఔచిత్యపోషణము

తిక్కన అమూలకమైన సన్నివేశ కల్పనమందెంతయో నిగ్రహమును ప్రకటించెను. కథకును సంవిధాన శిల్పమునకును, రసపోషణమునకును తోడ్పడని కల్పనను ఆయన చేపట్టలేదు. ఆయన చేసిన అమూలక సన్నివేశ కల్పన లన్నియు కలిపినను చేలిగ్రవేళ్ళమీద లెక్కింపఁదగినవే. తిక్కన కల్పన చేసినాఁడన్నచో మూలమున పూరింపవలసిన వెలితి యున్నదని నిస్సందేహముగా చెప్పవచ్చును.✓ సన్నివేశకల్పనము కథకు సమన్వయ సౌందర్యమును నందించుటకు సమర్థమైన సాధనముగా తిక్కన తన రచనలో తీర్చిదిద్దినాఁడు.

### (i) ఉత్తరను బృహన్నల కొప్పగించుట

బృహన్నలకు ఉత్తరను శిష్యురాలిగా సమర్పించిన ఘట్టము మూలకము. బృహన్నలా ప్రవేశ ఘట్టమునందు విరాటుఁ డిట్లనినట్లు మూలమున నున్నది—

విరాటః- "దదామి తే హంత వరం బృహన్నలే
సుతాం చ మే నర్తయ యాశ్చ తాదృశీః।
ఇదం తు తే కర్మ సమం న మే మతం
సముద్రనేమిం పృథివీం త్వమర్హసి॥

వైశంపాయనః- బృహన్నలాం తా మభివీక్ష్య మత్స్యరాట్
కలాసు నృత్తే చ తథైవ వాదితే
అపుంస్త్వ మప్యస్య నిశమ్య చ స్థిరం
తతః కుమారీపుర ముత్ససర్జ తమ్॥"25

మూలమున విరాటుఁడు బృహన్నలను గాంచి చతుస్సముద్రవలయితమైన భూమండలము నేలఁదగినవాఁడని భావించెను. నాట్యబోధ యతని కుచితము కాదని తలంచెను. అయినను బృహన్నల యిష్టమును మన్నించి తనకూతున కాచార్యుఁడైన యాతనికి ఉత్తరను 'మే సుతాం దదామితే' అని యతనితో ననినాఁడు. తిక్కన మూలమునందు వాగ్రూపముగనున్న 'దదామి' అను ధాత్వర్థమును తెలుఁగున వాక్క్రియా రూపమున నిర్వర్తింపఁదలఁచి యొక చక్కని సన్నివేశమును కల్పించినాఁడు. ఇది పదునేను గద్య పద్యముల విస్తృతి గలిగియున్నది. ఈ సన్నివేశమును ముగించుచు 'ఇత్తెఱంగున నయ్యిరువుర నొండొరుల కప్పగించి' యని పేర్కొనుటచే నీ సన్నివేశ తాత్పర్యము సూచితమగుచున్నది.

మూలమున - అంతిపురమునం దుండవలసిన కన్నియను నిండు కొలువునకు రప్పించుట యుచితము కాదని బృహన్నలనే యచ్చటకు పంపుట జరిగినది. అందును రాజమర్యాద పాటింపబడుటచే కొంతవఱ కౌచిత్యము పోషింపఁబడినదనియే చెప్పవచ్చును.

తిక్కన రాజమర్యాద తెలియనివాఁడు కాఁడు. అతఁడు మనుమసిద్ధికి ఆచార్యపీఠమువంటివాఁడు. గురు శిష్య మర్యాదలు తెలిసినవాఁడు. తిక్కన దృష్టిలో నీ సన్నివేశమున రాజమర్యాదకంటె గురుశిష్య మర్యాదకు ప్రాముఖ్యమిచ్చుట ప్రధాన మని తోచియుండవచ్చును. ఉచితజ్ఞుఁ డట్లే భావించును.

మూలమునం దంతఃపురమున కంపఁబడిన బృహన్నల రాజోద్యోగివలె మాత్రమే కన్పట్టును. విద్య నేర్వవలసిన ఉత్తర కుపాధ్యాయునియందు ప్రామాణికబుద్ధి కలుగవలెను. విద్య భయభక్తులవలన గాని బిడ్డల కబ్బదు. ఇట్టి భయభక్తులను కల్పించుటకై యుత్తరను సభా ప్రవేశము గావింపఁ జేసినాఁడు తిక్కన. ఇట్టిది మహాపురుషుల సేవార్థము రాజులు కూతులను నియోగించుపట్లగాని విద్యాభ్యాసమునకై గురువులకడ నుంచుపట్లగాని జరుగుచుండును. అట్టియెడ గురుపూజ విధివిధానము. "కర్పూరసహితంబగు తాంబూలంబు వెట్టి చిత్రంబులగు చీనాంబరములిచ్చి మణిమయంబులగు

నాథకరణంబు లొసఁగి" సంభావించుటవలన అట్టిశాస్త్రాచారమునకు సార్థక్యము గలుగుటయేగాక ఉత్తరకు గురువునందు భక్తి భావ మలవడుటకు ప్రాతిపదికయై పరిఢవిల్లుచున్నది.

"నీవు చతురమతివి నీకు నిక్కన్నియ
నప్పగింపనేల యైన నాదు
హృదయమతులు దీనియెడ గడునార్ద్రమై
యుండుఁ గావఁ జెప్పకుండరాదు." (4-1-249)

ఇందు బృహన్నల చతురమతిత్వమును కీర్తించి తన కూఁతునకు ఆతని యెడ ప్రామాణిక భావమును కల్పించినాఁడు. దీనివలన వేయికన్నులతో కనిపెట్టిచూడఁగల గురువువొద్ద ఏమరుపాటులేక వర్తింపవలయు నను భయము కల్పించినాఁడు. దీనికితోడు ఆమె కేళీసక్తిని విడమరచి చెప్పి తగిన విధమున శిక్షింపుమని నిపుణముగ పేర్కొనినాఁడు.

"బాల కేళిమీఁది భరము క్రమంబున
విడువఁ గళలయందు వేడ్క చొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవ కాదె" (4-1-251)

ఇందు బృహన్నల నెరపవలసినవిద్యావిధానమును ఒడుపుగ నుడివినాఁడు. ఉత్తర బాల, క్రీడాసక్త. క్రీడాసక్తి కళాసక్తికంటె వెనుకంజవేయునట్లు విద్య గఱపవలెను. శిక్షణయందు నయమార్గముదప్ప దండనమార్గము నాశ్రయింప వలదనియు, శిష్యురాలగు నామెకు ఏడుగడ బృహన్నలయే యనియు చివరకు భారమంతయు నాతనిపై నుంచినాఁడు. ఏడుగడలలో గురువుప్రధానుఁడు; మొదట నెన్నఁ దగిన వాఁడు,[26] తరువాత తల్లిదండ్రులు. అట్లగుటచే జన్మ నిచ్చిన తాను జ్ఞానము నిచ్చెడి గురువునకు కూతును అభినివేశముతో నప్పించి నాఁడు. అంగన హస్తమును బట్టి తత్కరమునఁ గదియించినాఁడు. అప్పుడు "పొలతి! నీ గురువును తగినవిధముగ కొనియాడుము, ఆతఁ డెట్లుచెప్పిన నట్లు భక్తితో నడువుము, అన్నాహారాదులను చందనకుసుమాదులను తగినట్లుగ

నాతనికి సమర్పించి 'గౌరవింపు"మని శిష్యురాలుగ ఉత్తర నిర్వర్తింపవలసిన శిష్యధర్మములను నిర్దేశించెను. "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః" అన్న వైదిక సంప్రదాయ మెట్లున్నను ఆమె కర్థమయ్యెడి మాటలలో నిట్లు పలికెను-

ఆ. "ఎల్ల చుట్టములును తల్లియు తోడును
చెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గురువ యింక నొక్క కొరతయు లేదిందుఁ
జేరి బ్రతుకు బుద్ధి గౌరవమున." (4-1-258)

అప్పగింతల పాటకు బదులు ఆటవెలఁది పద్దె మిచ్చుట కూర్పఁబడినట్లున్నది. అంతఃపురమున నామెకు తోడునీడలుగ నుండువారిని మాత్రమే పేర్కొని వారితో నాటలు చాలించి గురుశిక్షయందు సమాహితవం సాధించుమని నిర్దేశించినాఁడు. శిష్యురాలికి ఏడుగడయై నిలిచి విద్యను గఱపెడి బాధ్యత గురువుది; గురువున కెట్టిలోపము రాకుండ పోషించి గౌరవించెడి బాధ్యత శిష్యురాలిది. వారిరువురి నడుమ పోష్యపోషక సంబంధము కల్పించినాఁడు విరాటుఁడు. కన్యను గురువున కిచ్చుట, ఆపై వరునకు నిచ్చుట ప్రకటముగనే జరుగవలసిన యంశములగుట లోకమర్యాద. అట్టి మర్యాదకు ఆదర్శమైన రాజు సభయందు రాచకన్నియను నాట్యాచార్యునకు నలుగురినడుమనే సమర్పించుట లోకవిరుద్ధము కాకపోగా సహజలోకాచారపరిపోషక మగుచున్నది. ఇట్టిలోకమర్యాదను సాధించుట తిక్కన సాధించిన యొక ప్రయోజనము.

భారత కథలో ఉత్తర పాత్ర చిత్రణమును పరిశీలించు భావుకుఁడు ఈ సన్నివేశసౌరభమును మఱింతగా నాస్వాదింపఁగలఁడు. 'తల్లిదండ్రులు పిల్లలఁ గందురే కాని వారి తలవ్రాతలను గందురా' యను తెలుగు లోకోక్తి యొకటుండు గలదు. విరటుఁ డుత్తరను కనెనే కాని యామె యుత్తర జీవితమున వాఁడు కర్త కాఁజాలఁడు. విధి అర్జునుని నాచార్యునిగ నను సంధించినది. అప్పటినుండియు నామె జీవితమున కండగ నరనారాయణులు నిలిచియున్నారు. మధ్య వచ్చిన మగఁడు మధ్యనే కనుమూసినాఁడు. కాలికి గజ్జెకట్టిన నాటినుండి కన్నకొడుకును రక్షించుకొనునంతవరకు ఆమె

జీవితమున నరనారాయణ శక్తి పరివేష్టించియుండుట మనము కాంచెదము. ఉత్తర జీవితనాటకమునకు నిజమైన నాంది యిదియే. విరటుఁడు ఈ భావి మహోతాత్పర్యము నెఱుంగకయే యతనిచేత తనకుఁతు నుంచినాఁడు. 'ఏడు గడ' వని శ్లాఘించినాడు. విరటున కది తెలియక చేసిన పని, తిక్కన కిది తెలిసిచేసిన పని. కావ్యమునందు తెలిసి చేసిన పనినే శిల్పమందురు. భావి కథార్థచర్వణాసక్తులైన సహృదయుల మనోభూమి కీ సన్నివేశము ఆలోచ నామృతసేచనము వంటిది.[27]

## (ii) ఉత్తరాభివరణానము

ఇంతటితో నాగలేదు తిక్కన. విరాటపర్వ కథాభాగము నంతటిని భావించినాఁడు. ఉత్తరాభిమన్యుల వివాహఘట్టముతో మంగళాంతముగ ముగియనున్న యీ పర్వప్రబంధమునందలి కన్యయొక్క ప్రసక్తి మొదటిసారి ఇచ్చట వచ్చినది. ఆమె పాండవ వంశాంకురము వహించు పాత్రము. ఈ పాత్రమును రంగమున ప్రవేశపెట్టుచున్నాఁడు తిక్కన. "ఉత్తర చనుదెంచె నలరువిలుతు పువ్వుటమ్మువోలె" అని యలంకరించి ప్రవేశపెట్టినాఁడు. ఉపమానముచే నీ పర్వమున నామె నాశ్రయించిన నవవసూళ్ళంగార వేంల వ్యంగ్యమైనది. ఆమె యౌవనశోభను సీసపద్యమునందు చెలువారు వర్ణించి నాఁడు—

సీ. "అల్లదనంబున యనువు మైకొనఁ జూచు
నడపు కాంతికి వింతతోడవుగాఁగ
వెడవెడనూఁగారు వింతయై యేర్పడఁ
దారని వళులలో నారు నిగుడ
నిట్టలఁ ద్రోచుచు నెలవుల కల మేర
లెల్లను బిగియెక్కి యేర్పడంగఁ
దెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు
తారకంబులఁ గల్కితనము దొడరఁ

ఆ. చరణములలోను నడుము, జన్నులుఁ గన్నులు,
జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికిఁ దెలుపుచుండ నుత్తర చనుదెంచె
నలరుఁ బిలుతుపువ్వుటమ్ము ననఁగ." (4-1-245)

అర్జునుఁడు సభాప్రవేశము చేయునెడ నతనిరూపును సీసమునందు వర్ణించినాఁడు. "వేషధారియైన విష్ణుండు వోలె" అతఁడు రాగా మన్మథబాణము వలె నీమె వచ్చినదని చెప్పినాఁడు. ఇచ్చట అలంకార సార్థక్యము నరసినచో అర్జునుఁడు తండ్రివంటివాఁడు. ఉత్తర మారుని సాయకము వంటిది. తాత్పర్యమున కోడలువంటిది. ఇది యలంకారధ్వని. ధర్మజభీమార్జునుల రూపవర్ణనమునందు వాడిన సీస పద్యమునే ఉత్తరావర్ణనమునందు వాడి యామె పాత్రగౌరవమును సూచించుట వృత్తౌచిత్యమువలన నేర్పడిన ధ్వని.- చతుర్థాశ్వాసమున కూడ నామె వర్ణనము సీసమునందే చేయుట మఱియొక విశేషము—

సీ.. అడుగుల నునుఁగాంతి నయ్యెడ పద్మ రా
గంబుల నెలకట్టు కరణి నొప్పఁ
బాలిండ్లు దనువెడ వ్రాలింపఁ జెన్నొందు
నసదుఁ గౌఁ దీఁగె యల్లాడుచుండఁ
దఱి వేచి వెనువెంటఁ దగులు కామాంధ కా
రము లీలఁ గ్రొవ్వెద కొమరు మిగులఁ
గర్ణభూషణ మౌక్తిక ప్రభా డోలన
మిథునదీప్తుల నినుమడింప

తే. నందియల మొరపంబున కగుగుదెంచి,
ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించు చందమునఁ దోన
చనఁగ నుత్తర నర్తనశాల కరిగె.'' (4-4-26)

మొదటి వర్ణనము అజ్ఞాతవాసారంభకాలమునందున్న ఆమె రూపాభిరామవర్ణనము. చతుర్థాశ్వాసమునందలిది అజ్ఞాతవాసాంత కాలమున వివాహయోగ్యయైన యువతీ యౌవనాభివర్ణనము. ఆమె నాట్య విద్యాభ్యాసము చేసెడి కాలమునకు ఈ రెండు పద్యములును రెండు ఎల్లలు. ప్రథమాశ్వాసమున ఆమె అంగ విన్యాసము "జవ్వనంబు చెన్ను నివ్వటిలుచునికి" తెలుపుచుండినది. యౌవనావిర్భావము కలదే కాని నాట్యకళా వైదగ్ధ్య మానాడు లేదు. పువ్వుటమ్ము వలె నుండుట సౌందర్యము వలన ఆమె కబ్బిన గుణవిశేషము. చతుర్థాశ్వాసమున ఆమె రాయంచవలె నడచినతీరు కనవచ్చినది. ఆమెనడకయే ఒక నాట్యముగ భాసించినది, మొదట కనవచ్చిన కన్నె అశిక్షితయయ్యును అందముచే ఆకర్షణీయ. తరువాత కనవచ్చిన కన్నె సుశిక్షిత యైన ప్రజ్ఞావతి. రెండు రూపముల యందును అంద మొకటియే, అర్హతలు వేరు. మఱి కొంతసూక్ష్మముగా పరిశీలించినచో మఱియొక విశేషము కాననగును. రెండు పద్యములయందును వర్ణింపఁబడిన అంగములు చాలవరకొకటియే. చరణములనుండి కన్నులవరకు వర్ణించిన విధమును ఒక్కటియే. అదేవరుసలో కాలగతివలన ఆ సంవత్సర కాలమున నామె యౌవనమందు కానవచ్చెడి పరిణామదశకూడ నిరూపింపఁబడినది. మొదట నామె విద్యకుయోగ్య. ఇప్పుడామె వివాహ యోగ్య. పంచమాశ్వాసమున (వ. 356) ఆమెను పాండవుల ముందుకు రావించినప్పుడు తిక్కన గొడుగు పట్టించినాఁడు. రాజవధూసూచన మందు వ్యంగ్యముగ నిబంధించినాఁడు. ఆ పైన విరాటపర్వాంతమున నామెను నాథునితో నేకముచేసి రెండు సీసపద్యములందు వర్ణించినాఁడు (395,402). విరాటపర్వమున పాండవుల ప్రతదీక్ష ముఖ్యకార్యము. తత్కార్యము నిర్విఘ్నముగా సమాప్తమగుట ప్రధానఫలము. ఉత్తరాభిమన్యుల వివాహము తదనుబంధఫలము. ఇందు శృంగారము ద్రౌపదినాశ్రయించిగాని ఉత్తరనాశ్రయించిగాని పోషించుటకు వీలున్నది. ద్రౌపది నాశ్రయించిన శృంగార మిందు రసాభాసమన దగినది. ఉత్తర నాశ్రయించిన శృంగారము వివాహఘట్టమున మొగ్గతొడిగినది. విరాటపర్వమున రెండు రంగములు కలవు. ఒకటి నాట్యరంగము, రెండు యుద్ధరంగము. మొదటిరంగమునకు వన్నెతెచ్చిన ముద్దరాలు ఉత్తర. రెండవరంగమున వెలుగొందిన వీరుఁ

డర్జునుఁడు. వీరిరువురి ప్రాధాన్యమును రచనాశిల్పమున సూచించుటయే సీసపద్య రచనలోని చమత్కారము. రసానుకూలమైన విభావ వర్ణనమునకు తావిచ్చుటచే తిక్కన ప్రబంధ సూర్యావలిని ఈ కల్పనము ప్రకాశమానమగు మణిదీపమువలె భాసించుచున్నది.

## (iii) కీచక విరహము రెండు నూత్న కల్పనలు

విరాట పర్వమునందు కీచకుని మోహావేశాలను స్వాభావికముగ తిక్కన విస్తరించి రచించిన ఘట్టములు రెండు కలవు. ఒకటి :— సుదేష్ణ సైరంధ్రిని తనయింటికంపుట కంగీకరించుటతో కీచకుని యభిమత కేళికి నొక యవకాశము కల్పించుటయైనది. అందని పండును తనంతట తాను తన పాదములచెంత పడనున్నట్లు కీచకుఁ డట్టి సమయమును భావించెను. అసాధ్యము సాధ్యమగుచున్నదని తెలిసిన మానవుని చిత్తవృత్తి హర్షమున నుప్పొంగుట సహజము. దీనిని శృంగార పరముగ సమన్వయించినచో అపూర్వసౌందర్యవతియైన నాయిక ఉపాయాంతరముచే సాధ్యయగుచున్నదని తెలిసిన నాయకుఁడుగాని, ప్రేమికుఁడుగాని, విటుఁడుగాని, రతిభావావేశముతో తన్నాయికా సమాగమమును చిత్తమున భావించుకొని, దర్శించుకొని భ్రాంతికాను భూతికొరకు విరాళిని పొందుచుండును. ఇట్టిది లోకసహజము. భావుకుఁడైన నాయకుఁడు రసావేశహృదయమును వ్యక్తము చేయుచుండును. నాయికా సమాగమమును నూహించెడి వానిచిత్త మున్మత్తమగుట, చిత్తమున నూహించు చిత్తరువులను కనులముందు దర్శించుచున్నట్లు తాదాత్మ్యము వహించుట, ప్రలపించుట ఉన్మత్తతకు ప్రధానలక్షణములు. తిక్కన చేసిన రెండవ కల్పనమందు ఇట్టి యున్మత్తవికారము కానఁబడుచున్నది. ఈ రెండును శృంగారినాయకుని కలంకారములైన మానసికావస్థలే.

కీచకుఁడు సైరంధ్రిపై ఇట్టి విరాళిని విశేషముగ ప్రకటించిన యీ ఘట్టముల కల్పనలోని యౌచిత్యమును గూర్చి సూటిగావిచారించిన ఆధునికవిమర్శకులు తక్కువ. ఈ ఘట్టమును గూర్చి విమర్శకుల భావము లీ క్రింది విధముగ నున్నవి.

"కీచకుని భావరతవముల వర్ణనము కొంచెము శ్రుతిమీఱినట్లేయున్నది; కాని, తిక్కనార్యుఁడీసందర్భము నతిజాగరూకతతోడనే నిర్వహించెను." 28

"ద్రౌపదిని కీచకుఁడు కామించెను. ఆమెకు వానియం దసలు బుద్ధియేలేదు. కనుక కేవలము కీచక ముఖముగనే శృంగార భావ పరంపర కొనసాగింపఁబడవలెను. తిక్కనగారు రెండంతస్థులుగ నీ కీచకుని శృంగారము వర్ణించిరి. భీముఁడు కీచక సంహార మనివార్యమన్న నిశ్చయమునకు రాలాగిన కీచకుని కాముక చిత్తవృత్త్యభివర్ణనము మొదటిది. తదనంతరపు కీచకుని యొక్క మోహపరితాప వర్ణనము రెండవది. భారతకథకు మొదటి వర్ణన మవసరము. రెండవ దానితో నంత ప్రయోజనము లేదు. అది కేవలము ద్రౌపదియందు వాని కెంతటి మోహభావ మున్నదో వ్యక్తము చేయునది. మోహభావముతో వాఁడు చేసిన చేతలు భారతమునకు కావలెనుగాని, వాని కేవల మోహభావ మక్కఱలేదు. కీచకుఁడు ద్రౌపదిని కామించు మాత్రమున భీమునిచేత చంపఁబడలేదు. కామించి యనుచితముగ ప్రవర్తించుట వలన చంపఁబడినాఁడు. తదనుచిత ప్రవర్తన మంతయు మొదటి ఘట్టమున తిక్కనగారు వర్ణించిరి. కనుక నది భారతమున కవసరమైనది. రెండవ దట్టిది కాదు. కాకపోయినను తిక్కనగారు వర్ణించిరి. అది వేఱు విషయము."29

పై విమర్శకుల యభిప్రాయములను క్రోడీకరించినచో కీచక విరహతాప కల్పనమును గూర్చి వారు భావించిన విధము నిట్లూహింపవచ్చును.

1. కీచకవిరహము రెండు ఘట్టములుగా రచింపఁబడినది. అందు మొదటిది కథాప్రయోజనము సాధింపఁగల సార్థకమైన కల్పనము. రెండవ దానియం దంత సార్థక్యము కానరాదు.

2. కీచకుని విరహవర్ణనము రెండవ ఘట్టమున కొంచెము శ్రుతిమించినదని యొకవైపు భావించినను అది యాస్వాదనీయముగ నున్నదనియే మఱియొకవైపు తలంచుట యైనది.

భారత కథ కవసరము కాకపోయినను కీచకుని విరహ పరితాప వర్ణనము ప్రబంధోచిత వర్ణనా వైశిష్ట్యమును సంతరించుట కనువుగ నున్నది

కావున తిక్కన కావ్యకళాశిల్పమునకు వన్నె పెట్టుచు భావిప్రబంధ రచనా ప్రక్రియకు మార్గదర్శక మగుచున్నదని భావించుటయైనది.

పై విమర్శకుల తాత్పర్యమును సూక్ష్మముగా పరిశీలించినచో కావ్య కథకు ఈ సన్నివేశకల్పనము వలన నేర్పడుచున్న ప్రయోజనముల గూర్చి చెప్పుటకు కొంత ప్రయత్నించినవారు డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు. "మోహావేశముతో వాడు చేసిన చేతలు భారతమునకు కావలెనుగాని కేవలమోహభావన ముఖ్యముకాదు. కీచకుడు ద్రౌపదిని కామించు మాత్రమున భీమునిచేత చంపబడలేదు. కామించి అనుచితముగ ప్రవర్తించుటచేత చంపబడినాడు"- అను వాక్యములందు వారి సమర్థనము సందిగ్ధముగను, స్పష్టాస్పష్టముగను కనబడుచున్నది. నిజమునకు కీచకుని యనుచిత ప్రవర్తనమునందు తెలుగున సంస్కృతమున లేని నూత్నకల్పనయే లేదు. కాని మన్మథ భావావస్థల యభివ్యక్తికి తోడ్పడు విరహతాప వర్ణనము మాత్రమే మూలమున కంటె మిన్నగ కల్పింపబడినది. శాస్త్రిగారన్నట్లు అతని "మోహావేశము" వ్యక్తముచేయుఘట్టమే తిక్కన కల్పించినది. అది కథ కెట్లు తోడ్పడునో శాస్త్రిగారు గాఢముగ భావింపరైరి. నిజమునకు కథలో కీచకుడు విరహతాపమును ఏకాంతస్థలమునందు పొందినట్లున్నది. ఈ ఘట్టములు ప్రేక్షకునకు తెలియునవే కాని భీమాదులకు తెలిసెడివికావు. అట్లగుచో శాస్త్రిగారి వాదము నాశ్రయించినచో విరహమునందలి మొదటి ఘట్టమును నిరర్థకమే. తిక్కన నిరర్థకమైన కల్పనల నెచ్చుటను చేసినవాడు కాడు. కావున తత్కల్పనమునందలి యౌచిత్యమును గూర్చి కొంత గాఢముగ పరిశీలింపవలసియున్నది.

కీచకుడు ద్రౌపదిని కామించెననియు మోహించెననియు విమర్శకులు పేర్కొనుట కలదు. అతనివి శృంగార చేష్టలనియు వివరించుట కలదు. అధర్మరతిని ప్రకటించుట-కామించుట యని సాధారణముగ తలంచుట యైనది. ద్రౌపది రూపాతిశయమునకు వశుడై వివేకమును కోల్పోవుట మోహించుటయని తలంచుటయే. కొంత లోతుగ నాలోచించినచో కాముకునియందు మోహావిభ్రాంతియు రతిదీప్తియు భాసింపవు. పాశవిక విషయ సుఖవాంఛా పర్యంతమైన ప్రవృత్తి మాత్రమే యతనియందు స్పష్టముగ

భావించును. చేష్టలకు హేతువులైన చిత్తవృత్తుల అభివ్యక్తి మానవులయందు కానబడును. చేష్టలకు మాత్రమే ప్రాధాన్యము కలుగుట పశు ప్రవృత్తుల యందు కానవచ్చును. కీచకుడు పశు ప్రవృత్తితో లేక కామైకవృత్తితో సైరంధ్రిని కోరినవాడుకాడు. కీచకుడు కాంతాలోలుడైనట్లు తెలుగు భారతమున చెప్పబడలేదు. అతడు గాఢముగ వలచినది సైరంధ్రినే. అతడు తన సర్వస్వమును ఆమె కొఱకే పణము పెట్టుటకు సిద్ధమైనాడు. అతడాడిన మాటలు కల్లబొల్లి కపటములు కావు. అతడు సైరంధ్రిని వరించుట ధర్మవిరుద్ధము కావచ్చును. కాని అతడామెయందు ప్రచరించు రతిభావమునందు కామైకదృష్టికంటె చిత్తశుద్ధియే అధికముగ కానబడు చున్నది. తిక్కన అతనిని కాముకునిగ పశుతుల్యునిగ చిత్రింపదలపలేదు. ఒక రసికునివలె శృంగారనాయకునివలె భావించి చిత్రింపదలచినాడు. రూపాభిమానియైన కీచకుడు తాను వలచిన రూపము నభిమానించి పొందగోరుటలో నాశ్చర్యములేదు. బలగర్వితుడైన ఆతడు గంధర్వుల మాట విని భయపడకపోవుటలో వింతలేదు. ఇటు అభిమానము – అటు నిర్భయము. ఇక అతని రతిభావ ప్రవాహమునకు అడ్డెక్కడయున్నది? తిక్కన సన్నివేశ గతమైన కీచకపాత్ర చిత్తవృత్తిలో రసభావ పరిపోషణ కనువైన ఈ మార్గమును గుర్తించినాడు. దానిని పెంపుదల చేసినాడు. మొదటి ఘట్టమున సంగ్రహముగను రెండవ ఘట్టమున విపులముగను దానిని ఔచిత్య మెఱిగి పెంపొందించినాడు. మొదటి ఘట్టమునకు ద్రౌపది తన కనుకూలవతిగా వర్తించుననెడి భ్రాంతియే మూలము. రెండవ ఘట్టమునకు ద్రౌపతి యంగీకారమే యాలంబనము. మొదటిది ప్రత్యాశ, రెండవది ప్రత్యయము. మొదటిదగు ఆశ అడియాసయైన పిదప నా సైరంధ్రి యనుసరించుట నంగీకరించుట వలన రెండవ ఘట్టమున కీచకుని రతిభావ ముద్దీప్తమగుట కవకాశ మేర్పడినది. కథాగతి తెలిసిన పాఠకునకు ఆరిపోయెడి దీపము గప్పున మండినట్లుండును. కావున మొదటి ఘట్టము సంగ్రహముగను, రెండవ ఘట్టము విస్తృతముగను వర్ణించుట సార్థకమే యగుచున్నది.

తిక్కన పాత్రచిత్రణము గాని, సన్నివేశ నిర్వహణము గాని, ప్రకృతి వర్ణనలు కాని రసపోషణ కనుకూలముగా సంపాదించుట యతని శిల్పరహస్యము.

తిక్కన కావ్యాగస శిల్పము నుపలక్షించి యీకల్పనలు చేసినాఁడన్నది తాత్పర్యము.

తిక్కన పాత్ర చిత్రణమునందు మానసికభావపరిణామ వర్ణనమునకు అగ్రతాంబూల మిచ్చునన్న యంశము విమర్శకులందరు గుర్తించినదే: కీచకుని పాత్రచిత్రణములో తిక్కన కల్పించిన ప్రాధాన్యము అతని చిత్త వృత్తి క్రమదశావికాసము. మూలమునందు అట్టి వికాసశిల్పము సమ గ్రముగ చిత్రింపఁబడలేదు. కీచకఘట్టమునందు మైలురాళ్ళవలె మూఁడు సన్నివేశములున్నవి. ఒకటి :— సుధేష్ణమందిరమునందు సైరంధ్రిని చూచి వలచి సోదరిపాదములకు మ్రొక్కి యామెను తనయింటికంపుటకై ప్రార్థేయ పడుట. రెండు :— సైరంధ్రి తన యింటికి వచ్చినపుడు అననుకూల యని తెలిసి యామెను బాధించుటయే కాక యున్మత్తుఁడై యామె వెంటనంటి పరుగెత్తి లజ్జారహితుఁడై రాజసభవఱకు నేతెంచుట. మూఁడు :— అననుకూల యని తెలిసినను ఆమెపై ననురాగమును వీడక అనునయింప ప్రయత్నించుట. ఆమె పన్నిన వలలో రాగాంధుఁడై చిక్కువడుట. ఈ మూఁడు ఘట్టములలో మొదటిది ఆరంభదశ, రెండవది వికాసదశ, మూఁడవది ఫలదశ. ఆరంభదశ తరువాత నేర్పడిన రెండు దశలకును మధ్య కీచకుని చిత్తవృత్తి పరిణామ వికాసములను తిక్కన తీర్చిదిద్దినాఁడు.

ధర్మదృష్టితో చూచినచో అధర్మరతి కాలవాలమైన కీచక చిత్తవృత్తి విస్తరణీయముకాదు. మనోధర్మదృష్టితో చూచినచో రసలోకమున తద్వి స్తృతి సమాదరణీయము. 'తిక్కనది ప్రధానముగ రసదృష్టి' అని యీ కల్పనవలన స్పష్టమగుచున్నది.

కీచక వృత్తాంతమునందు పోషింపఁబడినది శృంగారరసాభాస మని విమర్శకుల తీర్పు.

"అనౌచిత్యప్రవృత్తత్వే ఆభాసో రసభావయోః"

అని సాహిత్య దర్పణము. అనౌచిత్యమున ప్రవర్తిల్లినచో రసభావములు క్రమముగ నాభాసములగునని భావము.

"అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వమ్"

అని రసగంగాధరము.

"ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా ।
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధామతః ॥"

అని ప్రతాప రుద్రీయము.

"ఉపనాయక సంస్థాయాం ముని గురు పత్ని గతాయాంచ ।
బహునాయక విషయాయాం రతౌ తథాఽనుభయ నిష్ఠాయామ్ ।
ప్రతినాయక నిష్ఠాయాం తద్వ దధమపాత్ర తిర్యగాదిగతే ।
శృంగారేఽనౌచిత్యం............."

అని సాహిత్యదర్పణము చెప్పుచున్నది. సాహిత్య దర్పణము అనౌచిత్యమున ప్రవర్తిల్లిన రసభావములు రసాభాసమగునని పేర్కొనుచు, అనౌచిత్యము లనగా నేవియని నిరూపించునది. ఇందు 'అనుభయనిష్ఠమగు రతి'యు, 'ప్రతినాయక నిష్ఠమగు రతి'యు, 'ఉపపతి విషయకమగు రతి'యు, ఇత్యాదులు అనౌచిత్యములని పేర్కొనుట యైనది.

ఇందు అనుభయనిష్ఠ మనగా నాయికా నాయకులయందు నిష్ఠము కాని రతి. దీనిని రెండు విధములుగ పేర్కొనవచ్చును. ఒకటి 'ఏకత్రైవానురాగము' రెండు ఉభయులయందును గాఢమగు అనురాగము లేకుండుట. ఈ రెండు విషయములను కథయుండుట శృంగారానౌచిత్యహేతువు. మిగిలినవి నాయికకు సంబంధించినవి. కీచక ఘట్టమున ద్రౌపది కెట్టును రతిభావము లేదు. కీచకునకును రతిభావముకాక కామభావమే యున్నదో రతిభావ దీప్తి లేదు. దీప్తిలేని రసభావములవలన కలుగు అనౌచిత్యము రసభంగ హేతువు. అందువలన తిక్కన కీచకునియందు రసభావహేతువును పోషింపఁ దలచినాఁడు. దాని కీరెండు ఘట్టములును తోడ్పడినవి.

'ఏకత్రైవానురాగము' అనునది శృంగార రసాభాస కావ్యములలో విస్తారముగా కానవచ్చు లక్షణము. ఇందు గమనింపవలసిన యంశ మొకటి

గలదు. సాహిత్యదర్పణానుసారముగ నాయిక ప్రతినాయకనిష్ఠ మగు రతిని ప్రకటించినచో అనౌచిత్య మేర్పడి రసభంగ హేతువగును. మఱి ప్రతినాయకుఁడు నాయికాగతమైన రతిని ప్రకటించినచో అనౌచిత్యము భాసించి రసాభాసమగును. ఇందు గమనింపఁదగిన భేదము గలదు. ధర్మ దృష్టితో సమీక్షించినచో ప్రతినాయకుఁడు ప్రచరించు రతి పరకాంతాలంబనమై ధర్మ వైరుధ్యమును ద్యోతమానముచేయును. అట్లని ఆతఁడు రతిభావప్రకృష్ట ప్రకటనము చేయునట్లు చిత్రించినచో తిర్యఙ్మ్లేచ్ఛగతరతి భావములకంటె భిన్నముకాదు. 'ఏకతైవ్రానురాగ' ఘట్టములలో నాయకుఁడొకనాఁటి కావ్యనాయకుఁడే కావచ్చును. మఱియొకసారి కావ్యనాయకేతరుఁడు లేక ప్రతినాయకుఁడు కావచ్చును. మనుచరిత్రయందు నాయికా నాయకేతర పాత్రలను ప్రవేశపెట్టి చిత్రముగ కథ సంపుటమైనది. అచట నాయిక అనురక్త. భారతమున కీచకుఁడు విరాటపర్వమున ప్రతినాయకతుల్యుఁడు. అతఁడు ద్రౌపదిని కామించినట్లు చిత్రించినచో రతి భావదీప్తికి అవకాశము లేదు. అతఁడు ద్రౌపదిని ప్రేమించినట్లు చిత్రించినచో రతి భావదీప్తికి అవకాశము కలుగును. అతని యనురాగము నందలి ధర్మాధర్మవిచార మతనికి లేదు. అది యతని దుర్విదగ్ధత్వమునకు తార్కాణము. అతఁడు తాను వలచిన వనితను తన రూపబలగర్వముతో పొందఁదలచినాఁడు. పొందఁగలనను ధైర్యముతో ప్రణయమును ప్రచరించినాఁడు. 'ఏకతైవ్రానురాగము' నందు ఒక వైపున అనురాగముండవలయును గదా! అనురాగము వాంఛారూపము భావాంకుర మాత్రమునైన చాలదు. స్థాయిభావముగ పరిణతి చెందగల పోషణ దానికుండవలెను. స్త్రీ పురుషుల పరస్పర ప్రేమ రూపమై చిత్తవృత్తియున్నచో రతి రసత్వమును తాల్చును. ఏకత్ర పెంపుదలగాంచి రెండవ వైపు దానికానుకూల్యము లేనిచో అది రసమువలెనే కనిపించును గాని రసస్థితిని చెందఁజాలదు. రసాభాసము మృగతృష్ణవంటిది. ఎండమావులను జూచి మృగము దప్పిక తీరునను ఆసక్తిని ప్రకటించి పరుగులెత్తును. నిజమునకు జలముండదు, దప్పిక తీరదు. దప్పిక తీరునన్న ఆసక్తియే దానికి జీవము. రసాభాసములోకూడ ప్రతినాయకాదులు ప్రకటించు రతిభావము సమంజసము కాదనియు సఫలముగాదనియు పాఠకునకు తెలియును. అయినను అట్టిపాత్ర

ములు ప్రదర్శించెడి రతిభావము ఆసక్తి జనకముగానుండి ఆహ్లాదముకలిగించును. ఒక్కొక్కసారి హాసమును కూడ కలిగించును. ఏమైనను 'ఏకపత్నీవాను రాగము'నందు ఏ యొకపాత్రమును నాశ్రయించి యైనను రతిని ఉత్కటముగ వర్ణింప వలెనన్నది రసాభాసలక్షణములోని యంతర్యము. దానిని తెలిసి రచించినవాఁడు తిక్కన. కీచకునియందు రతి స్థాయి భావమువలె సమృద్ధిగ పోషింపఁబడవలెను. శృంగార దశావస్థలు సుస్పష్టముగ చిత్రింపఁబడవలెను. అట్లు చిత్రించుటకు భావశబలత ఉపహాసన్నివేశములు పోషకములు కాఁగలవు. అననుకూలయైన నాయిక రతిభావమున కాలంబనము కాదు కాబట్టి అనుకూలవతిగ నూహించుకొని మరులుకొనినాఁడు మొదటి ఘట్టమున కీచకుఁడు. రెండవ ఘట్టమున నామె యానుకూల్యము కపటనాటకమని మనకు తెలిసియున్నను ఆతని కది సత్యముగనే భాసించినది. కీచకునకు రసదీప్తి సహృదయునకు హాస దీప్తి కలుగునట్లు చిత్రముగ సృష్టింపఁ బడినది రెండవ ఘట్టము. ప్రతినాయకుఁడు మోసగింపఁ బడనున్నాఁడు. అతఁడు మృగతృష్ణను జూచి దప్పిక తీఱునను భ్రాంతితో పరుగిడు చున్నాఁడు. ఆ యవివేకములోనే రసభావ శిల్లాసము వ్యక్తపఱచినాఁడు. ఆ పాత్రమునందు రసభావదీప్తి లేనిచో నీ ఘట్టమునందు శృంగార రసాభాస మేర్పడుటకు వీలులేదు. మూలమున నున్నది భావాభాసము కాఁగా తెలుఁగున తిక్కన తీర్చిదిద్దినది రసాభాసము. ఇచట ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి వాక్యములు పేర్కొనఁదగినవి.

"ఏకపత్నీవానురాగమున స్త్రీ పురుషులనెడి ఉభయాలంబనములలో, ఒక ఆలంబనమునందే ప్రీతియు రెండవ ఆలంబనమునందు వానియెడ వైముఖ్యము గల విరోధభావమును ఉండును. సాధారణముగా ఉభయనిష్ఠమైన ప్రీతిగాని సామాజికునకు 'రతి' యనెడి స్థాయిని కలిగించి చరమదశలో శృంగారముగా ఆనందము నీయఁజాలదు. మరి యేకనిష్ఠమైన ప్రీతి శృంగారముగా పర్యవసించి యానందము నీయలేకపోయినను, స్థాయిని అంకురింపఁజేయుటకు సమర్థమే యగును. కవి యిట్టి యసంపూర్ణాలంబనమును చేపట్టి, దానివలన కలుగుస్థాయికి సహజముగానున్న శక్తికంటె అధికశక్తిని ఆపాదించి ప్రదీప్తము చేయుటవలన సామాజికుఁడు ఇది యాభాసమా? యథార్థమా? అనెడి పరీక్షకు పూనుకొనకయే ఆనందము ననుభవించును. ఈ యాభాసను

రసముగానే ప్రకాశింపఁజేయుటకు కవి అసాధారణ ప్రజ్ఞాశాలియై యుండ వలెను. భారతమున కీచకవధ ఘట్టమును, మను చరిత్రమున వరూథినీ ప్రవర ఘట్టమును ఇట్టి 'యేక త్రైవానురాగమున'కు ఉత్తమ దృష్టాంతములు కాగల తెలుఁగు కావ్యములు. సారంగధర చరిత్రయు నిట్టిదే.

సిద్ధి పొందుటకు అవకాశము లేని రసమును కావ్యమున అంగిరసముగా ప్రతిపాదించుట భావ్యము కాదనెడి తలంపుతో, మహాకవులు ఇట్టి 'ఏకత్రైవాను రాగము' గల కథలను రచింపవలసి వచ్చినపుడు, ఈ యాభాస రసమును అంగముగా నొనర్చి, రెండవ యాలంబనములోని భావమును అంగి రసమునకు స్థాయినిచేసి దాని జయమును ప్రదర్శింతురు. ప్రబలమైన యా విరోధి భావమును ప్రతిఘటించుటలో రసాభాసమునకు కారణమైన మొదటిభావము అత్యు త్కటమైన విజృంభణమును పొంది సామాజికులకు అతిమాత్రమైన హృదయా హ్లాదమును కలిగించును. అదియే రసముగా నాస్వాదింపఁబడును. కీచకవధ ఘట్టములో కీచకుని కామము అంత ఉత్కటముగా వర్ణింపఁబడుటకు కారణ మదియే. అట్లుగాక ఆ కామవర్ణన నీరసముగా, దుర్బలముగా చేయఁబడునేని ఆ కథకు రక్తియే యుండదు. ఈ యాభాసము వలని ఆనందము ఇట్లుండగా యథార్థమైన రసానందము అంగిరసమువలన కలుగును. కీచకవధలో భీమా శ్రయమైన క్రోధము రౌద్రముగా పరిణమించి కార్యసిద్ధిని, రససిద్ధిని కలిగించుచున్నది. ఇట్లే వరూథిని యనురాగము ప్రవరుని నిర్వికారధీరత్వ ముచే ప్రతిఘటింపఁబడి దానిని జయించుటకు అసాధారణ శక్తిని జూపి తుదకు పరాజితమైనది. ప్రతిఘటనము లేనిచోట ఉత్కట విజృంభణమే ఉండదు. ఆ విజృంభణమే పరాకాష్ఠపొందిన రస పరిపోషణము. ఆ పరి పోషణమే ఆభాసరూపమున మనకు ఆనందము గొలిపెడి కావ్యాంశము. రసాభాసమనగా 'చెడిపోయినది' అనెడి లోకవ్యవహారార్థ మిచటలేదు. కావ్యమువలన కలిగెడి రసానంద మెట్టిదో రసాభాసానందమును అట్టిదే".30

రసాభాసము కూడ రసమువలె ఆస్వాదయోగ్యమే. అధర్మమైన కీచకుని రతిభావముపై సహృదయుని సానుభూతి ప్రసరించినప్పుడు మాత్రమే అతని రతిభావమునకు రసత్వస్థాయి ఏర్పడును. తిక్కన తీర్చిన కీచక విరహఘట్టము ఆంధ్రావళి మోదము ననుసంధించుచున్నదనుటలో విప్రతి

శక్తి లేదు. దానికి హేతువు చిత్తశుద్ధితో కూడిన ప్రతిభావాభివ్యక్తి కీచకుని యందు సమగ్రస్ఫూర్తి బొందునటుల తిక్కన వర్ణించి చూపుటయే. అనను కూలయైన నాయికను బలాత్కరించుచు ప్రాణములు కోల్పోయినచో అతని పట్ల జుగుప్స కలిగెడిది. కాని వంచన ననుసరించి యతనిని నాయిక వధింపఁ జేసెడి కథాసూత్రమునందు కీచకుని పాత్రను నిపుణముగ పోషింపఁబడినచో పతితలు సానుభూతిని ప్రకటించెడి యవకాశము కలదు. ప్రతినాయకుని యందు విషాదనాయకుని విశేషలక్షణములను పొందుపరచుటయే తిక్కన కావించిన శిల్పవిశేషము.[31] ప్రతినాయకుఁ డగుటచే అతనివధ పరితాప కారణము కాకపోవచ్చును. కాని యతని విషాదనాయక స్ఫూర్తి సహృదయులచేత 'అయ్యో!' అనిపించును. కీచకుని విరహాతాప ఘట్టములు రెండును ఆ పాత్రను రచించు ప్రతిభావము సాశ్రయించిన అభివ్యక్తి వలన సానుభూతిని చూరగొనుచున్నవి. అందువలననే విమర్శకులు సైతము ఆ ఘట్టములను జూచి మెచ్చుకొనుచుండిరే కాని దాని కుడిని విప్పి లో విషయమును గమనించరైరి.

## (iv) దుర్యోధనుని నీత్యుపాయములు : రెండుకల్పనలు

దుర్యోధనుని రాజనీతిపాండిత్యోపాయములను రాణింపఁజేయు పన్ని వేశములను రెండింటిని తిక్కన విరాటపర్వమున సమూలకముగ కల్పించెను. ఒకటి :- కీచకుని వధించినవాఁడు భీముఁడని గ్రహించి పాండవులు విరాట నగరమున నజ్ఞాతముగ నున్నారని యనుమానించి భీష్ముఁ డుపదేశించిన లక్షణము లాదేశమున కలిగియుండుటను నిరూపించి దుర్యోధనుఁడు మత్స్య దేశముపై దండెత్తుట కార్యమని నిశ్చయించుట. రెండు :- అర్జునుఁడు బయలుపెడలిన నాటికి నజ్ఞాతవాస కాలము ముగియలేదనెడి అనుమానము తనను బాధించుచుండఁగా, భీష్ముఁ డొసరించిన కాలనిర్ణయము తనకు సంతృప్తిని కలిగింపమిచే నిజ మెఱుంగుటకై సత్యవాక్యపాలకుఁడైన ధర్మ జుని యొద్దకు దూతను బంపుట.

ఇందు మొదటిది ఉపజ్ఞకును, రెండవది ఉపాయమునకును సంబంధించినది.

దుర్యోధనుఁడు భారతమున ప్రతినాయకుఁడు. అతని కన్నింట నాసట వాసటగ నిల్చు కర్ణుఁడు అతని ఉపనాయకుఁడు అన్నకు నీడవలె వర్తించు దుశ్శాసనుఁ డనునాయకుఁడు. కుటిల మంత్రములచే నాతని కార్యములందుఁ దోడ్పడు శకుని సచివతుల్యుఁడు. భారతమున నాయకుఁడైన ధర్మజుఁడు ఉభయరాయత్తసిద్ధి. ప్రతి నాయకుఁడైన దుర్యోధనుఁడు సచివాయత్తసిద్ధి. ఇట్టి వివేచనము స్థూలముగ భారతకథయందు కాననగును.

సుశర్మ దక్షిణ గోగ్రహణ ప్రతిపాదనము చేయుటకు మూలమున కీచక వధవృత్తాంత శ్రవణము కారణ మైనట్లు చిత్రింపఁబడినది. లతఁ డొకసారి కీచకునిచే భంగ పడినాఁడు. కీచకునిపై ప్రతీకారము చేయుట కతనికి శక్తిచాలదు. ప్రతీకార వాంఛమాత్ర మతని యందు ప్రబలముగ నున్నది. కీచకుని మరణవృత్తాంత మతని గూఢమైన ప్రతీకారవాంఛకు నీరు పోసినది. కీచకుఁడు లేని మత్స్యదేశముపై దండువెడలి తన పూర్వ వైరమును విరటుని నోడించి యతని సంపదను కొల్లగొట్టి తీర్చుకొనఁ దలఁచినాఁడు. నిజమునకు మూలభారతమున దక్షిణ గోగ్రహణమునకు సుశర్మకోర్కెయే కారణమగుచున్నది, కాని దుర్యోధనుని సంకల్పము కాదు. కార్యకారణ సంబద్ధమైన ఇతివృత్తసంవిధానమునందు ఇదియొక బలహీన మైన పట్టు. తిక్కన ఈసుట్టును కనిపెట్టినాఁడు.

అజ్ఞాతవాసము గడుపుచున్న పాండవుల నిజరూపముల నెఱింగి మరల అరణ్యాజ్ఞాతవాసములకు పంపుటకై దుర్యోధనుఁడు వేయువిధముల యత్నించెను. వేగులవారిచే వెదకించెను. వారి జాడ తెలియలేదు. వేగులవారు వెల్లమొగములు వైచినారు. వేగులవారు చెప్పిన వింతలు విశేషములలో కీచకవధవృత్తాంత మొకటి. అది యాదృచ్ఛికమే కాని పాండవుల యునికి నెఱుంగుట కిది మార్గమగునని వారు భావింపలేదు.

మూలమునందు దుర్యోధనుఁడును తలంపలేదు. చుట్టునున్న కర్ణాదుల కును స్ఫురింపలేదు. కర్ణాదులకు స్ఫురింపకుండుటను గూర్చి మనము కొంత సమాధానపడవచ్చును. కీచకవధ వృత్తాంతము విన్న దుర్యోధనుని మనమున కీచకుని వధించిన భీముఁడు స్ఫురింపకున్నచో దుర్యోధనుఁడు అవివేకియు మూర్ఖుఁడు గావలసియుండును. అది యతని మృత్యువుతో ముడిపడియున్న

రహస్యము. జరాసంధ, కీచక, భీమ, దుర్యోధనులలో నెవఁడు మొదట నెవనిని చంపునో ఆతఁడే మిగిలినవారిని చంపఁగలఁడను రహస్యమందుకలదు. ఇట్టి రహస్యము నెఱింగిన దుర్యోధనుఁడు సైతము దాని నూహింపఁజాలక పోయినచో నాతఁడసమర్థుఁడని తెలియుట అటుండగా, అసహజముగ నా ఘట్టము భాసింపవచ్చును. దుర్యోధనుఁడు "చింతాక్రాంతుఁడయ్యె"నని చెప్పుటలో తిక్కన దుర్యోధనుని ఆలోచనావ్యగ్రతను సూచించి పై యంశమును ధ్వనింపఁజేసినాఁడు.

పై రహస్యమును వాచ్యముగ చెప్పినచో దుర్యోధనుని గాంభీర్యము, గూఢ వర్తన ప్రవృత్తి బయటపడిపోవును. ఎదుటివారు చెప్పినచో అదివేఱు విషయము. అందువలన దుర్యోధనుఁడు మంత్రాలోచచ మందు గడుసరిగ వ్యవహరించినాఁడు. ముందు మంత్రులయభిప్రాయమును సేకరించినాఁడు. మంత్రులనఁగా నిక్కడ మంత్రాంగమునకు సంబంధించిన యాలోచన చెప్పు వారని యర్థము. కర్ణ దుశ్శాసన ద్రోణ భీష్మాదు లావమావేశమునందున్న మంత్రకోవిదులు. రాధేయుని యాలోచన వేగులవారిచేత వేఱువిధముల వెదకించుట యందే ప్రసరించినది. దుశ్శాస నుఁడు పాండవులు చనిపోయియుందు రనియే భావించినాఁడు. ఒకని సూచన వలన లక్ష్యము సాధింపఁబడదు. మఱియొకని సూచనవలన మిగిలెడిది అలక్ష్యమే. కుంభసంభవుఁడు పాండవులను తేజోమూర్తులని కీర్తించి నేర్పుమీర వెదకించినచో వారి సహజోజ్జ్వలగుణములే వారిని బయటపెట్టఁగలవని సూచించెను. ద్రోణుఁడు వారి బహిఃస్వరూపములను గీర్తింపఁగా భీష్ముఁడు వారి గుణప్రాభవప్రభావములను బేర్కొని వారున్న దేశమున కానవచ్చు సంకేతములను తెలియఁజెప్పెను. ద్రోణాచార్యుని సూచనము వివేకులైన వేగులవారికి మార్గదర్శి. భీష్ముని సూచనము వివేకము లేకపోయినను సమాచార మాగ్రగ్రహణ పారీణులకు గూడ అందు పాటులో నుండెడిది. కృపాచార్యుఁడు చేసినది సంధి సూచనము. అది దుర్యోధనుని మంతనమున కంత తోడ్పడునది కాదు. మొత్తముమీఁద వీరి యుపాయములు సత్వర కార్యనిశ్చయమున కుపయోగపడునవి కావు. అజ్ఞాత వాసము ముగియనున్న యాతరుణమున కావలసినది సత్వర కార్యా చరణము.

నిశ్చయించువాఁడెవఁడు ? నిశ్చితార్థమేది ? అను రెండు ప్రశ్నలిచట నుదయించుచున్నవి. సుశర్మ స్వీయప్రయోజనము నుద్దేశించి రారాజునకు రాజ్యలోభము కలిగించి మత్స్యదేశముపై దండెత్తు ప్రతిపాదనము చేసినాఁడు, కర్ణాదులు అతని మాటను బలపరిచినారు. దుర్యోధనుఁడు దాని కంగీకరించి తన సగము బలమును సుశర్మవెంటఁ బంపుటకును, మిగిలిన సగముతో తాను ఉత్తరగోగ్రహణము చేయుటకును నిశ్చయించినాఁడు. ఇట్లగుటచే నిశ్చయించినవాఁడు దుర్యోధనుఁడు, నిశ్చితార్థము మత్స్యదేశాక్రమణము. ఈ కార్యమునకు కారణమేది-సుశర్మ సంకల్పము. అనఁగా కీచకవధ వృత్తాంత శ్రవణము సుశర్మకు యుద్ధ సంకల్పమును కల్గింపఁగా దానిని కర్ణుఁడు బలపఱచెను, దుర్యోధనుఁ డంగీకరించెను. ఈ కార్యము వలన లాభము పొందునది ప్రధానముగా సుశర్మ, అనుబంధ ఫల భోక్త దుర్యోధనుఁడు.

- మఱి కొంత లోతుగా నాలోచించినచో పాండవుల యునికి కొఱకై మొదలైన మంత్రాలోచనము మధ్యలో మార్గాంతరము పట్టి మత్స్యదేశముపై ప్రసరించినది. మత్స్యదేశమున పాండవు లుండవచ్చునన్న యూహ ఈ తంత్రమున మృగ్యము. పాండవుల కొఱకై కాక అన్య ప్రయోజనము నుద్దేశించి యన్యకార్యారంభ మొనర్చుట కథానిర్మాణమునకు తోడుపడు శిల్పము కాదు. అట్లగుటచే మూలకథయందు కార్యకారణ సంబద్ధమైన సంవిధానము సడలిపోయినది.

తిక్కన దీనిని ఔచిత్య సహితముగా నిర్వహింపఁదలచినాఁడు. తత్ఫలితమే పై మొదటి కల్పనము! ఇక్కడ మఱియొక అంశము పరిశీలింపఁ దగియున్నది. దుర్యోధనుని నిశ్చయమునకు ప్రేరణ కలిగించినది. సుశర్మ, దుశ్శాసన కర్ణాదులచే పాండవులు మృతినొందియుందురని తలంఁబడిన యూహ. అది నిర్లక్ష్యముతో కూడుకొనిన నిర్ణయము.(సుశర్మతనపనికై రాజు కార్యమును పెడత్రోవ పట్టించిన విధము)-పాండవులు మడిసిరన్న వర్తమానమును దుర్యోధనుఁడంగీకరించినచో నంతకంటె వెఱ్ఱివాఁడు మరొకఁడుండ బోఁడు. మూలమున దుర్యోధనుఁ డట్లే నిర్ణయించినాఁడు. తిక్కన దుర్యోధనుని మట్టిబొమ్మగ చేయుటకంటె తగినంత మతిమంతునిగ తీర్చి

దిద్దుట యుచితమని భావించినాఁడు. అందువలన ఈ కల్పనము చేసినాఁడు.

ఇచట మఱియొకటి యోచింపవచ్చును. భారత కథయందు నిచ్చట జరుగవలసిన కార్యము దక్షిణోత్తర గోగ్రహణము. అది జరుగుచున్నది కదా. ఇది కథాసంధానమందు లోపమేర్పడుచున్నదని కొందఱాక్షేపింపవచ్చును. మూలమున గోగ్రహణఘట్టము పాండవులను వెలికి తీసినను అది ప్రతినాయకాదులు తెలిసి ప్రయోగించిన తంత్రము కాదు. దుర్యోధనుని యదృష్టమువలన అజ్ఞాత ప్రవర్తితమైన యుద్ధతంత్రము. తెలిసి చేసిన పనికిని తెలియక చేసిన పనికి హస్తిమశకాంతరము కలదు. తెలియక చేసిన పనిని సార్థక ప్రయోగముగా తలంచుట యుచితము కాదు. దుర్యోధనుని తెలివిలేమిని మూలము తెల్లము చేయుచున్నది. గ్రుడ్డివాఁడు వేసిన రాయి యాదృచ్ఛికముగా గురికి తగిలినట్లే యున్నది కాని కార్య కారణ సంబద్ధమైన శిల్పము మూలకథయందు చిత్రింపఁబడలేదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

తిక్కన ప్రతినాయకుఁడైన దుర్యోధనుని ఈ ఘట్టమున ప్రయోజకునిగా తీర్చిదిద్దినాఁడు. రారాజు జెట్టివాఁడైనను రాజకీయ మంత్రాలోచనము గావించుచున్న ఘట్టమది. శాంతిపర్వమునందు-

ఆ. వె. "సకల వర్ణ ధర్మ సంకర రక్షయు
సంధి విగ్రహాది షడ్గుణములు
సలుపు కరయుటయును నర్థ సమ్యగుపార్జ
నమును నృపతి యెపుడు నడపవలయు."  (2-185)

అని రాజధర్మము నిర్దేశింపఁబడియున్నది. అమాత్యులెన్ని చెప్పినను వానిని విన్నను నాలోచించి రాజు నిర్ణయము గైకొనవలెను. ఈ నియతి ననుసరించి తిక్కనగారీ ఘట్టమును తీర్చినారు. దుర్యోధనుఁడు తాను నొకనిర్ణయమునకు వచ్చులోపల పూర్వము మంత్రుల సూచనను కోరినాఁడు. అప్పటి దతనికి కార్యనిశ్చయజ్ఞానము కుదురలేదు. కాని చాలినిపూర్ చ ఆలోచించుచునే యున్నాఁడు. తన యాలోచనలకు తోడుపడుదురేమోయని మంత్రులతో ప్రస్తావించినాఁడు.

క. ఎఱుఁగుట దుర్ఘట మెవ్విధి
నెఱుఁగంగా వచ్చు మీర లెల్లను మీమీ
యెఱిఁగిన చందంబున నా
కెఱిఁగింపుఁడు వారి వెదకి యెఱుఁగు తెఱంగుల్."

(4-3-92)

ఎఱుఁగను నను మాటతో ప్రారంభించి యీ కంద పద్యమున నైదుసార్లు దానిని పునరావృత్తి చేసినాఁడు. అజ్ఞాతవాసులైన పంచపాండవులను తెలిసికొనుట యందలి యసమర్థతాతిశయము దానివలన వ్యంగ్యము. ఎదుట నున్నది ఐదుగురు మంత్రులు. ఎఱుఁగ వలసినది ఐదుగురు శత్రువులు. ఐదుసార్లు పునరావృత్తిలోని సార్థక్యమిది. పాండవుల నెఱుఁగుటను గూర్చి కొంతవఱకు ఎఱుక చెప్పినవాఁడు భీష్ముఁడు. అది నిజమైన ఎఱుకకు తోడుపడు కారణము మాత్రమే. నిశ్చయ జ్ఞానము దుర్యోధనునికే స్ఫురించినట్లు తిక్కన చిత్రించుట సహజము, ఉచితము.

దుర్యోధనుఁడు మంత్రులతో చెప్పిన విధమిట్టిదని తిక్కన రచన.

తే. ఇవ్విధంబునఁ దమ తమ యెఱుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురునందనుండు
తగ విచారించి కార్యంబు తెగువ గాంచి
యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె.

ఆ.వె. సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు
హాలధరుఁడు సమానబలము వార
లొండొరులను గెలుచు నుత్సాహమునఁ గల
రుద్ధతులును బాహుయుద్ధపరులు.

క. ఈ నలువురి భుజశక్తుల
తో నెనయఁగ జాలునట్టి దోర్బల మెందుం

లించిన సవగత మగును. 'భీమసేన, కీచక, శల్య, బలరాములు సమాన బలము వారలు. వారి నితరులు చంపజాలరు. శల్య బలరాములు కీచకునికి చాల దూరమున నున్నవారు గనుక కీచకునిఁజంపినవాఁ డనిలసుతుఁడే కావల యును. అయినచో నాతఁడు జంపిన కారణమేమైయుండును. ఆసైరంధ్రియే ద్రౌపదియై యుండవలయును. భీష్ముఁడు జెప్పిన లక్షణములు మత్స్య దేశమునకు వర్తించుట కూడ ఈయనుమానమును బలపరచుచున్నది. మత్స్య దేశముపై దండెత్తి వారలను బయటపెట్టిన, వారిని తిరిగి ఉరణ్యాజ్ఞాత వాసముల కంపవచ్చును. వారందు లేకున్నను మత్స్యదేశమునందలి సిరి సంపదలు లభ్యమగును' అని యింత నిర్దుష్టముగా రారాజు ఆలోచించె ననఁగా నాఁతనిసూక్ష్మబుద్ధి చక్కగా నేర్పడుచున్నది.

ఇంతటితో నాగలేదు తిక్కనార్యుని పాత్రపోషణాసక్తి. ఉత్తర గోగ్రహణమున నర్జునుఁడు బయలు వెుఱసినాఁడు. భీష్ముఁడు తొలుత నేమియు బలుకక ఇంతదూరము సైన్యసన్నాహముతో వచ్చి, పార్థుఁడు ప్రత్యక్షమైనపుడు అజ్ఞాతవాసకాలపరిసమాప్తిని బలికినాఁడు. ఇది ఇట్టిదైనచో నాడు సభలో తన యాలోచనలను వెలిబలికినపుడే భీష్ముఁడేల మిన్నకుండెను అని దుర్యోధనునకు శంకవొడమినది. అట్లగుటయు సహజము. ఏల యన భీష్ముఁడు పాండవపక్షపాతియని దుర్యోధనుని దృఢవిశ్వాసము. ఆతఁ డర్జు నుని గాంచిన పిదప పాండవులను తిరిగి కానలపాలు చేయనిచ్చగింపక అట్లాడియుండవచ్చును. ఇంత యోచించుటకు సమయము లేక యుద్ధము జేసి యోడినాఁడు రారాజు. అయినను ఆతని నాశంక బాధించుచునేయున్నది. ఆతనికి ధర్మరాజుతో రాజ్యకారణముగా వివాదము గలదు గాని ధర్మరాజు సత్యవ్రతముపై కొండంత విశ్వాసమును గలదు. ఇది దుర్యోధనుని దొడ్డ బుద్ధి యనవలె. ఎంతటి యుత్తమగుణసంజాతుఁ డైనను శత్రువును నమ్ముట అరిది. అదియును శత్రువులకు ప్రాణాంతకమగు కట్టుబాటును గూర్చి నిష్కర్ష చేయు సందర్భమున. అయినను దుర్యోధనుఁడు ధర్మజుని పాలికి దూత నంపి ఆతని సందేహనివృత్తి జేసికొనెను. ధర్మజుఁ డంత సత్యశీలుఁడు, ధర్మవ్రతుఁడు గానిచో బూదము ముగిసిన పిమ్మట భీమసేనుని విజృంభణమును నిలువరించెడి వాఁడు కాఁడు. నాఁడే ఆతనికి రాజ్యము లభించెడిది. ఆతరువాత ఘోషయాత్రలో గంధర్వులచే పట్టుబడినప్పుడు

తానై తమ్ములను బంపి కౌరవులను మృత్యుముఖము నుండి తీసికొని వచ్చి రాజ్యమును వారిచేతులలో నుంచెడివాఁడు గాఁడు. ధర్మజుని ఈగుణములను, ప్రవర్తనను పర్యాలోచించినవాఁడు దుర్యోధనుఁడు. అందువలననే భీష్ముని కాలనిర్ణయము కంటె ధర్మజుని మాటనే లెస్సగ నమ్మినాఁడు. దుర్యోధన ధర్మజు లిరువురశీల చిత్రణమునకు అత్యంతము తోడ్పడుచున్నది ఈ సార్థక కల్పన.

## (V) పాండవుల ఏకాంత మందిర సమావేశము

విరాటపర్వ పంచమాశ్వాసమున ధర్మతనయుని వాసమునందలి ఏకాంత స్థలమునందు పాండవులును, పాంచాలియుఁ గలసి బయలు వెఱయు విధానము నాలోచించు కొనిన ఘట్టమునందలి కథార్థము లమూలకములు. ఈ ఘట్టమున విరాటుఁడు సారెతో ధర్మరాజుని మొగమున గావించిన గాయమును గూర్చి పాండవులు చర్చించుకొను సంశము కలదు. ఇది తిక్కన చేసిన ప్రతిభావంతమైన సన్నివేశ కల్పనము.

ఉత్తరగోగ్రహణ ఘట్టమున విజయము సాధించుకొని ఉత్తరుఁడును బృహన్నలయు నగరమునకుఁ దిరిగి వచ్చిరని విరటుఁడు తెలిసికొని తన పుత్రుని పరాక్రమాదికముల కుప్పొంగిపోయెను. కాని కంకుభట్టు తద్విజయమునకు బృహన్నల పరాక్రమము కారణమైయుండు నని యుగ్గడించెను.

ఉ॥ "ఆహవకేళి వేడుక బృహన్నల చిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని సారథిగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీ పసుల నొక్కఁడుఁ దక్కకయుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁగావలయుఁ దప్పదు నాపలు కట్లు చూడుమీ."

క॥ అని యంతట నిలువక య
మ్మనుజేశ్వరు మొగముఁ జూచి మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం
బనుపు బృహన్నల జయంబు భవ్యవిచారా !" (4-5-257-258)

'కంకుభట్టుని మాట లాల విరాటునికి కోపోద్రేకము కల్పించినవి. అతఁడా రౌద్రావేశమున పాచికఁ గొని యీ కంకుభట్టు మొగమున వ్రేటుపడునట్లు కొట్టెను. ఆ గాయమునుండి నెత్తురు కారి నేలపైఁ బడకుండ సైరంధ్రి తడిగుడ్డతో తుడుచుచు నుండెను. ఇంకను నెత్తురు కారుట తగ్గలేదు. అంతలో రాజునెదుట ప్రత్యక్షుఁడుగ, బృహన్నలయు వచ్చుచున్నాఁడనిన వార్త వినవచ్చెను. ధర్మజుఁడు ప్రతిహారితోఁ జెప్పి బృహన్నలా ప్రవేశము కొంత విలంబము నగునట్లు గావించెను.

దానికి కారణములను మూల భారతమున ధర్మజుఁ డిట్లు నిర్దేశించినాఁడు—

"ఉత్తరః ప్రవిశత్వేకో న ప్రవేశ్యా బృహన్నలా।
ఏతస్య హి మహాబాహో వ్రతమేతత్సమాహితమ్॥
యో మమాంగే వ్రణం కుర్యాచ్ఛోణితం వాపి దర్శయేత్।
అన్యత్ర సంగ్రామగతా న్న స జీవే దసంశయమ్॥
నమృష్యాద్భృశ సంక్రుద్ధో మాం దృష్ట్వైవ సశోణితమ్।
విరాట మిహ సామాత్యం హన్యాత్సబలవాహనమ్॥32"

తిక్కన యీ వాక్యముల నీ క్రింది విధముగా మార్చెను.

క॥ ఇన్నెత్తురు గనఁ గొనిన బృ
హన్నల గోపించు నన్ను నతిశక్తి మెయిన్
మన్నించుఁ గాన రాజుం
దన్ను విచారింప కేమి దప్పఁ దలఁచునో." (4-5-268)

మూలమునందలి రచనలో తీవ్రత కొంత అధికముగా నున్నది. అట్లుండుట వలన సందేహాస్పద మగు నవకాశమును ఏర్పడుచున్నది. కంకుని గాయమును గాంచినంతనే బృహన్నల విరాటుని సామాత్యబాంధవముగాఁ జంపునని యెంచి ప్రతిహారి గాని, ఆ సమీపముననే యున్న విరటుఁడు గాని, యనుమానించుట కాస్కార మేర్పడినట్లగును. అనువాదమున నట్లు లేదు.

తనపట్ల భక్తిగల బృహన్నల రాజును తప్ప దలచునేమో యని కొంత సామాన్య ధోరణిలో చెప్పినట్లున్నది.

ఇందు ప్రధానముగా గమనింపఁదగిన మార్పు మఱియొకటి కానవచ్చుచున్నది. అది మూలకర్త అర్జున వ్రతముగా పేర్కొనిన దానిని తిక్కన వదిలివేయుట. ధర్మరాజును గాయపఱచిన వానిని సంహరించుట అర్జునుని వ్రతము. వ్రతము ప్రతిజ్ఞ వంటిది. దానిని దప్పినచో వ్రతభంగ దోషమును అసత్య దోషమును ఆ పాత్రమునకు వాటిల్లును. అర్జునుని ప్రతిజ్ఞ వమ్మైనట్లు చిత్రించుటకూడ ఆ పాత్రకు పోషకముగాదు. ఒకవేళ నీ వ్రతమును యథాతథముగా గ్రహించినచో నర్జునుఁడు విరటుని సంహరింపవలెను. ఉపకారికి నపకారముచేయుట పాపహేతువు. ఇట్లగుటచే నీ రెండు ధర్మములకు సంఘర్షణ మేర్పడును. దీనిని మఱియొక ధర్మసూక్ష్మము చే నివారింపవలసిన యవసరమేర్పడును. కర్ణపర్వమున ధర్మజార్జునుల మధ్య నేర్పడిన యొకసన్నివేశములో నిట్టి ధర్మ సంఘర్షణ వచ్చుటయు దానిని ధర్మసూక్ష్మముతో నివారించుటయు నైనది.33 ఇచ్చట వ్రతనియతిని ప్రవేశ పెట్టినచో ధర్మసంఘర్షణాత్మకమైన సన్నివేశకల్పనము తప్పనిసరియగును. విరటుని నిందించినచో నతనిని చంపినట్లగునను ధర్మసూక్ష్మమును ప్రవేశ పెట్టినను ఉపకారిని నిందించుట యధర్మమై ప్రవర్తిల్లును. ఇట్టి కథామర్మమును తిక్కన లెస్సగా భావించి యర్జునుని వ్రతవిషయమును నిపుణముగా వదలివైచెను. ధర్మజుని నెత్తురు చూచినచో బృహన్నలకు కోపము వచ్చుననియు, దానికి కారణము అతఁడు ధర్మజుని భక్తితో గౌరవించుటయనియు, కోపించినచో నొసలు మఱచి రాజునకు కీడు తలంపవచ్చుననియు కంకుభట్టు పలికిన మాటలలో లోకమర్యాదయు, అర్జునుని భ్రాతృభక్తియు విపరించుట యయినది.

మూలమునను ధర్మజుని గాయమును అర్జునుఁడు చూచినట్లుగాని, దానిని గుఱించి విచారించినట్లు గాని పేర్కొనఁబడలేదు. సభలో నాతఁడు ప్రవేశించునప్పటికే ధర్మజుఁడు తుడుచుకొని కూర్చుండెనని భావించినను అర్జునునకు తరువాత నా విషయము తెలియకుండుటకాని, అప్పుడాతఁడు తన వ్రతమును నిలుపబెట్టుకొనుటకు యత్నింపకుండుటకు గాని యవకాశము

లేదు. అందువలన తిక్కన ప్రతినాయకునకు బదులు అర్జునునియందు భక్తిని స్థాపించినాడు. భక్తిగల యర్జునుఁడు విరటుని చర్యకు కోపించి భ్రాతృభక్తి నొకవైపు ప్రకటించుటకును మఱియొకవైపు అన్నగారి యానతిని జవదాట కుండ వర్తించుటకును ఈ భక్తిభావము తోడ్పడఁగలదు. [illegible]సంగతి యర్జున ప్రతి ప్రశంసకు స్థానముండుట అనౌచిత్యమును పరిహరించుట, పాత్రౌచిత్యమును పోషించుట, సన్నివేశౌచిత్యమును సాధించుట యని పేర్కొనవచ్చును.

తిక్కన ధర్మజుని గాయమును నాలంబనముగాఁ జేసికొని కథార్థ పోషకమైన యొక చక్కని సన్నివేశమును నిర్మించి తన సన్నివేశ కల్పనా సామర్థ్యమును ప్రదర్శించినాడు. ఇది విరాటపర్వ పంచమాశ్వాసము నందు 305వ వచనము నుండి 314వ వచనము వఱకు వ్యాపించి యున్నది. ఈ పది గద్యపద్యముల ఘట్టము చిన్నదయ్యును కథ కెన్నియో విధముల తోడ్పడు చున్నది. పాండవులు బయలుమెఱయుట కుచితమైన విధము నాలోచించుట కేర్పడిన సమావేశమది. ఇట్టి సమావేశ కల్పనము మూలమున లేదు. పాండవుల సమైక్య సంకల్ప శక్తికి ఈ సమావేశ మొక సూచనము. అజ్ఞాతవాస సమయము తీరినదని వారికి తెలియును. బయలుపడుటలో నొక పద్ధతి పాటింప వలెనని వారు భావించుట సహజము. దాని కుచితముగా నీ సన్నివేశమును కల్పించుట తిక్కన లోకజ్ఞతకు నిదర్శనము.

ఆసమావేశములో మొదట చర్చకు వచ్చిన విషయము ధర్మజుఁ డర్జునుని వైపు మొగము త్రిప్పి మాట్లాడకుండుటకు కారణమేమై యుండు నని అర్జునుఁడు భీమునితో పల్కుట. విరటుఁడు సారెచే గొట్టుటకుఁగల కారణమును ఆగాయము కనఁబడకుండ మొగము త్రిప్పుకొని కూర్చుండుట యును ధర్మజుఁడు వివరించి చెప్పెను. విరటుని యవినయమునకు భీమార్జునులు కోపించిరి. విరటుని సంహరించి మత్స్యదేశము నాక్రమించెదమని యుత్సహించిరి. కాని ధర్మజుఁడు వారిని వారించి కలరూపెఱుంగక వర్తించిన విరటుని చర్యకు ప్రతీకార మొనర్చుట యుచితము గాదనియు, బయలుమెఱసిన తరువాత కూడ పాండవులపట్ల అవినయముగా వర్తించినచో నాతనిని దండింపవచ్చుననియు చెప్పి ధర్మజుఁడు తమ్ముల నుపశమింపఁజేసెను.

ఈసన్నివేశకల్పనము వలన స్థూలముగా సాధింపఁబడుచున్న ప్రయోజనముల నీక్రింది విధముగా క్రోడీకరింపవచ్చును.

1. పాండవులు బయలుమెఱయుటకు పూర్వము ఏద్విధమును గూర్చి మంత్రాలోచనము గావించుటకు సమావేశమగుట సందర్భశుద్ధి నెఱిఁగించు సన్నివేశకల్పనము.

2. అజ్ఞాతవాసవ్రతారంభమునకు పూర్వము పాండవులిట్లే సమావేశమై భావిధర్మనిర్వహణాంశములను చర్చించి నిర్ణయించుకొనుట విరాటపర్వారంభమున కలదు. అట్టి సమావేశమును అజ్ఞాతవాసపరిసమాప్తి సమయమున గూడ పాండవులు నిర్వహించిరనుట సన్నివేశసంవాదశిల్పము

3. ధర్మజునిగాయము పాండవులలో భీమార్జునులయందు రౌద్రోద్రేకమును కల్పింపకమానదు. దానిని ధర్మజుఁడు శాసింపవలెను. విరటుని కొలువు కూటమున ఉత్తరుఁడును బృహన్నలయు ప్రవేశించిరేకాని భీముఁడు ప్రవేశించి యుండలేదు. ఉత్తరుఁడు గాయమును జూచి క్షమాభిక్ష వేఁడుకొనెను. తండ్రిని మందలించెను. అర్జునుఁడు వచ్చునప్పటికి ధర్మజుఁడు గాయమును ఉత్తరీయముతోఁగప్పుకొనెను. అప్పు డర్జునున కది గాయ మని తెలియుటకు వీలులేదు. అందువలన ఆసన్నివేశమున నర్జునుని రౌద్రోద్రేకము ప్రకటింపఁబడలేదు కాని యతని మనమున మాత్రము అట్టి ధర్మజుని వర్తనమునకు హేతువును తెలిసికొనవలెనను ఉత్కంఠ మిగిలినది. దానిని నలుగురు తమ్ముల యెదుట ధర్మజుఁడు చెప్పుకొనుట కీసన్నివేశము తోడ్పడుచున్నది.

4. భీమార్జున రౌద్రోద్రేకము ధర్మజుని గాయముచే జాగృతమొనర్పఁబడినది; ధర్మజుని యాజ్ఞచే శాసింపఁబడినది. విరటుఁడు పాండవులు బయలుమెఱసిన తరువాత వినయమును ప్రకటింపనిచో పాండవపరాక్రమమును ఆతనిపై ప్రయోగించుటకు ధర్మజుఁడు నిర్దేశించినాఁడు. ఇట్లు పాండవశక్తిని వలయునప్పుడు ప్రయోగించుట కనువైన పద్ధతియందు ధర్మజుఁడు నియోగించుటకు ఈసన్నివేశము తోడ్పడుచున్నది.

5. అజ్ఞాతవాసము పరిసమాప్తియై బయలుమెఱయనున్న పాండవులలో ధర్మజుని నాయకత్వము, భీమాదుల అనునాయకత్వము ఈసన్నివేశ

మున వ్యంగ్యభూతమై, ఉద్యోగపర్వ నిర్వహణమునకు పూర్వరంగ ప్రవర్తననుగా భాసించుచున్నది.

6. తిక్కన ఈ సంగ్రహ సన్నివేశమునందు ప్రదర్శించిన సంభాషణ శిల్పము సహజ నాటకీయతను ఈ రంగమునకు సంతరింపఁజేయుచున్నది.

ఇట్టి సన్నివేశ కల్పనలవలన కల్పనాప్రయోజనములని చెప్పఁబడు ఆకృతి, అలంకృతి వ్యాకృతి, నిర్మితి అను చతుర్విధ లక్షణములను విరాటపర్వ కథార్థములయందు తిక్కన నిపుణముగా సంపాదించినాఁడు.

మూలకథార్థములకు సముచిత నాపాదించుటయే సన్నివేశ కల్పనముల పరమ సార్థక్యము. సర్వ కథాంశములను ఔచిత్య దృష్టితో సూక్ష్మముగా పరిశీలించి సార్థక్యమును భావింపఁగలిగిన కవిబ్రహ్మ ప్రతిభ ప్రతి సన్నివేశ కల్పనమునందును తన నిర్వహణ సామర్థ్యమును ప్రకటించుచు, ఆంధ్ర మహాభారత కథార్థములకు నిండుదనమును సంతరింపఁజేయుచు, ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగా నవతరించినది.



## సూచికలు :-

1. వసుచరిత్రము-రామరాజభూషణుఁడు. ఆ.1. ప.19.
2. కల్పిత కథ, కల్పితగాథ, కల్పితేతివృత్తము ఇత్యాదిగా లోకమున వినవచ్చునే కాని కల్పిత వర్ణనము, కల్పితాలంకారము ఇట్లు లోక వ్యవహారము లేదు. 'కల్పిత పాత్రము' అని వ్యవహారము కొంత కలదు. అది కల్పిత కథాంగమే యగుటచేత వస్తు సంబంధి యనియే గ్రహింపవచ్చును.
3. దశరూపకము -1-15-ధనంజయుఁడు.
4. "పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః"— మత్స్యపురాణము-53-63.

5. "ఇతిహాసః-ఇతిహ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్. ఆస ఆధారే ఘఞ్. ధర్మార్థకామ మోక్షాణాం ఉపదేశసమన్వితమ్, పూర్వవృత్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥ ఇత్యుక్త లక్షణే పురావృత్త ప్రకాశకే భారతాది గ్రంథే"- శబ్దకల్పద్రుమము

6. "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" మహాభారతము-ఆదిపర్వము 1-267

7. "రసేనైవ సర్వం జీవతి కావ్యం; న హి అరసస్య కావ్యం కించిదస్తి. రస ఏవ వస్తుతః ఆత్మా; వస్త్వలంకార ధ్వనీతు సర్వథా రసం ప్రతి పర్యవస్యేతే"-అభినవగుప్తుడు. (కావ్యాలంకార సంగ్రహము-సవ్యాఖ్యానము-శ్రీసన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి, పుట 99)

8. 'వైశాలిని' నాటకము-(శ్రీ)వానమామలై వరదాచార్యులు-పీఠిక. వైజయంతి-డా. జి. వి. సుబ్రహ్మణ్యం-పు.33.

9. న్యాసమంజరి-డా. కట్టమంచి రామలింగారెడ్డి-వ్యా. కళాపూర్ణోదయము-పుట. 44,45. (1947- ఆంధ్ర విశ్వకళాపరిషద్గ్రంథమాల - 21 వ ప్రచురణము)

10. కల్పనా సజ్జనా సమే-అమరకోశము-ద్వి.కాం. క్షత్ర వర్గము శ్లో. 42.

11. KALPANA, am, n - forming, fashioning, making performing, L.; 'forming in the imagination, inventing, composition of a poem, prab.; Cutting, Clipping, Working writh edge - tools, Var Brs; N of a religious ceremony; anything put on for ornaments, MBh. xiii, 2784; (a), f. making, manufacturing, preparing, SuSr, Bhp; practice, car, fixing, settling, arranging Mh. ix, 116; yajh.; Creating in the mind, feigning, assuming to be real, fiction, Kaps & e; hypothesis, Nyayam.; caparisoning an elephant, Das; form, shape, image;

a deed work, act, Mricch, (i) f. a pair of scissors or sheers, L. -Vidhi, m. a particular method of preparing (food), Bh Pr. Kalpana-sakti, f. the power of forming ideas, MW.

12. "ప్రతిభా అపూర్వవస్తు నిర్మాణక్షమా ప్రజ్ఞా"- అభినవగుప్తుడు

13. "ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా"-భట్టతౌతుడు.

14. నన్నయ భారతము - డా॥ దివాకర్ల వేంకటావధాని - పుట-522. కొందరు విమర్శకులు అనువాద విధానమును స్వతంత్ర, అస్వతంత్ర, స్వతంత్రాస్వతంత్ర భేదములచే మూడు విధములుగా విభజించిరి.

15. విజ్ఞాన సర్వస్వము-సంపుటి-3-పుట 613, 614. (ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి వ్యాసము)-తెలుగు భాషాసమితి ప్రచురణము.

16. మహాభారతేఽపి శాస్త్రరూపకావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవ విరసావసాన వైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్య జననతాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతోరసశ్చ ముఖ్యతయా వివక్షా విషయత్వేన సూచితః-ధ్వన్యాలోకము4-ఉద్యోతము శ్లో 5-6 నడుమ నున్న వచనము.

17. ఆంధ్ర మహాభారతము - విరాటపర్వము - ఆ.1.ప 8,31.

18. "వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా, భ్యుచితబంధమున నొక్కొక్కమాట"-శ్రీనాథుడు-కాశీఖండము పీఠిక ప.13.

19. "వాణి నొత్త"ను పాఠమునకు 'వాణినత్తను', "వాణిభర్తను" అను పాఠాంతరములు కానవచ్చుచున్నవి.

20. హరివంశము-ఎఱ్ఱాప్రెగ్గడ-అవతారిక.

21. ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము-ఆ.1. ప.240 నుండి 255 వరకు.

22. ఆంధ్ర మహాభారతము విరాటపర్వము ఆ2 ప. 83 నుండి ప 87 వఱకు. ప: 292 నుండి వ. 317 వఱకు.

23. ఆంధ్ర మహాభారతము-విరాటపర్వము ఆ.3. ప.113 నుండి వ 118 వఱకు.

24. ఆం. మ. భా. - వి.ప. ఆ. 5. వ. 305 నుండి వ. 314 వఱకు.

25. సంస్కృత మహాభారతము - విరాటపర్వము (B.O.R.I. Poona) వారి ప్రతి-

26. "గురుఁడును దల్లియుఁదండ్రియు
పురుషుఁడు విద్యయును దైవమును దాతయు నాఁ
బురి నేడుగడయుఁ దానై
హరి నను రక్షించు గాత ననవరతంబున్"
(వాసిష్ఠరామాయణము - మడికి సింగనార్యుఁడు - ఆ. 1)

27. "అర్జునుఁడు ముందుత్తరకు మామ కానున్నాఁడు గాన దైవయోగమున నిపుడే విరాటుఁ డతనికి దనకూతు నప్పగించుచున్నాఁడను నట్లు తిక్కన యిచ్చోట రచన సాగించుచున్నాఁడు. గురువున కప్పగించుట, మామకప్పగించుట రెంటిని సమర్థించుచు రచన సాగించుచున్నాఁడు."
తిక్కన కళాసామ్రాజ్యము - శ్రీ కాళూరి వ్యాసమూర్తి - అజ్ఞాతవాసము - కీచకవధ - పు.28.

28. ఆంధ్రభారతకవితా విమర్శనము - శ్రీ కోరాడ రామకృష్ణయ్య పుట. 342.

29. తిక్కన కావ్యశిల్పము - డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి - పుట 483

30. సాహిత్య శిల్పసమీక్ష - ఆచార్య పింగళి లక్ష్మీకాంతం - పుటలు 168 నుండి 170 వఱకు.

31. "తిక్కన కీచకుఁడు ఉత్తమ నాగరకుఁడు, సరసుఁడు, కాని భావోద్రేక పూరితుఁడై, వలరాచ హాని యురులలోఁ జిక్కువడి, తన నేర్పును రసజ్ఞతయుఁ బెడత్రోవఁబట్టుడుఁ గడకటికి సమూల నాశనముం గాంచును. ఇట్టి దోషములదయ్యెనను శోచ్యపాత్రము (Tragic character) గ మార్చిన తిక్కన మానవ ప్రకృతి పాండితిని 'హేమవిద్యం' బోని దానిని ఎంతని కొనియాడనగును!"- కవిత్రయ కవితా విమర్శనము- శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్య - పుటలు 110, 111

32. సంస్కృత మహాభారతము- విరాట పర్వము.
అ- 63- శ్లో. 52, 53, 54.

33. ఆం. మ. భా. - కర్ణ పర్వము. ఆ. 3. 71 నుండి 96 వఱకు.



# అమరాలంకారాంశములు - ఔచిత్యవిచారము

## 1. ఔచిత్యము — కావ్యజీవితము

"అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్।
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా॥"[1]

అనౌచిత్యము రసభంగహేతువనియు, ఔచిత్యమండితమైన కావ్యము రమణీయమైన రసోపనిషత్తనియు ఆనందవర్ధనాచార్యులు పేర్కొనినారు. రసభంగకారణము అనౌచిత్యమైనచో రసపోషకము ఔచిత్యమని ఆనందవర్ధనుని యభిప్రాయము. రసౌచిత్యములకు పోష్యపోషక సంబంధమును భావించినాఁ డాయన. క్షేమేంద్రుఁడు ఔచిత్యమును నిర్వచించుచు—

"ఉచితం ప్రాహు రాచార్యాః సదృశం కిల యస్య యత్।
ఉచితస్య చ యో భావ స్తదౌచిత్యం ప్రచక్ష్యతే॥"[2]

దేని కేది తగియుండునో అది 'ఉచిత' మనియు, తద్భావ మౌచిత్యమనియు పేర్కొనెను. ఔచిత్యము రసమునకు జీవభూతమని క్షేమేంద్రుని మతము.

"ఔచిత్యస్య చమత్కారకారిణ శ్చారుచర్వణే।
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా॥
కావ్యస్యాల మలంకారైః కిం మిథ్యా గణితై ర్గుణైః।
యస్య జీవిత మౌచిత్యం విచింత్యాపి న దృశ్యతే॥
అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణాస్సదా।
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్।"[3]

అని క్షేమేంద్రుఁడే పేర్కొనియుండెను. అతని యభిప్రాయమున కావ్య జీవితమనినను రసజీవితమనినను భేదములేదు. కావ్యమునకు ఆత్మయైన

రసము కావ్యమున కభేద ప్రతిపత్తిగ చెప్పఁబడినది. "కావ్యస్య జీవితమ్" అనునపుడు కావ్యాత్మ అనియర్థము కాదు. కావ్యాత్మ రసధ్వని అను వాదమును కితఁడు భిన్నుఁడు కాఁడు. ఆత్మాల శరీరము జీవితమునకు యోగ్యమైనది. లోకములో జీవించుట అనుభవము కొఱకు. ఆనుభవమనఁగా ఆనందము. అట్టి ఆనందానుభూతి పొందిన అమూల్యక్షణములనే బ్రతుకులో జీవించిన కాలముగా మానవుఁడు భావించుట లోకసహజము. ఒకానొక అవస్థయందు ఒక అనుభూతిని పొందుటకు యోగ్యమైన హేతువుండవలెను. ఆ హేతువు యొక్క యోగ్యత ఔచిత్యము. అనఁగా సాధ్యమైన రసము సాధించుట కనువైన ఉపకరణములయొక్క యోగ్యతా విశేషము ఔచిత్యమని తెలియుచున్నది. అట్టి ఔచిత్యములేనిచో ఉపకరణమునకు రససాధన శక్తి లేదు. దానివలన రససిద్ధి యేర్పడబోదు. 'అనౌచిత్యాన్ను రసభంగ హేతు' వనుటలో ఇదియే తాత్పర్యము.

కావ్యరచనాంగములైన శబ్దార్థ వాక్యాదులన్నింటియందు ను ఔచిత్య మొక యోగ్యతగా వ్యాపించియుండును. యోగ్యత ఆస్వాదన కానుకూల్యమును కలిగించును. ఇట్టి ఆనుకూల్యము రసానుభూతికి వాహికగా పనికివచ్చును. ఆనందవర్ధనుని ధ్వని మలయపవనమునందలి పరిమళము వంటిది. క్షేమేంద్రుని ఔచిత్యము పరిమళము యొక్క యోగ్యత వంటిది. లేక పరిమళముయొక్క ఆస్వాదనానుకూల్యము వంటిది. యోగ్యత పరిమళము యొక్క జీవితమును నిర్ణయించును. రసికుఁడు పరిమళము నాస్వాదింటయే అనులయపవనముని జీవితము. అట్టి జీవితమును కలిగించునట్టి యోగ్యతను గుణముకంటె విశిష్టమైన భావముగా గణించి దానిని జీవిత మనినాఁడు క్షేమేంద్రుఁడు.

"అలంకారాస్త్వలంకారా గుణా ఏవ గుణాస్సదా।
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్॥"

ఇందు "రససిద్ధస్య కావ్యస్య స్థిరం జీవితం ఔచిత్యమ్" అని చెప్పిన వాక్యములో రససిద్ధమైన కావ్యము మొదట ఉండఁగా దాని స్థిరజీవితము ఔచిత్యమని పేర్కొనఁబడినది. రసము ప్రాణమనియు, అనుభూతియనియు

మనము గ్రహింపవచ్చును. జీవము కలిగినవాఁడు జీవియైనచో, ఆట్టిజీవితాత్పర్యమయిన అనుభూతిని నడించు ప్రవృత్తి జీవితము. అట్టిజీవితము స్థిరముగా నుండవలయునన్నచో జీవితమును తీర్చిదిద్దుసర్వాంగములును ఉచితభావశోభితములై యుండవలెను. ఇట్టి ఔచిత్యమనెడి యోగ్యత శబ్దార్థరూపమైన శరీరమునకే కాదు, శోభాహేతువులైన అలంకారములకే కాదు, రసానుకూలములైన గుణములకే గాదు, సర్వకావ్యరచనా వ్యాపార సామగ్రికి సంబంధించినది. అందువలననే క్షేమేంద్రుఁడు తన ఔచిత్య విచారచర్చయందు ఇరువదియేడు విధములైన ఔచిత్యములను పేర్కొనినాఁడు.

"అధునా సకలకావ్యశరీర జీవితభూతస్యౌచిత్యస్య ప్రాధాన్యేనోపలక్ష్యాంస్థితిం దర్శయితు మాహ—
'పదే వాక్యే ప్రబంధార్థే గుణే ఽలంకరణే రసే।
క్రియాయాం కారకే లింగే వచనే చ విశేషణే॥
ఉపసర్గే నిపాతే చ కాలే దేశే కులే వ్రతే।
తత్త్వే సత్త్వే ఽప్యభిప్రాయే స్వభావే సారసంగ్రహే॥
ప్రతిభాయాం అవస్థాయాం విచారే నామ్న్యథాశిషి।
కావ్యస్యాంగేషు చ ప్రాహు రౌచిత్యం వ్యాపి జీవితమ్॥"
"ఏతేషు పద ప్రభృతిషు స్థానేషు మర్మస్వివ కావ్యస్య సకల శరీర వ్యాపి జీవితమౌచిత్యం స్ఫుటత్వేన స్ఫురదవభాసతే।"4

ఇందు పేర్కొనఁబడిన కావ్యాంగములయందు యోగ్యతారూపమైన ఔచిత్యము సర్వత్రవ్యాపించియుండినచో కావ్యజీవితము సర్వాంగసుందరమై ఆస్వాదయోగ్యమై ఒప్పారునని క్షేమేంద్రుని మతము.

## 2. ఔచిత్య విభాగము-వర్గీకరణము

ఔచిత్యము నిట్లు విశ్లేషణాత్మక దృష్టితో వివేచించి వివరించిన వారిలో ప్రముఖుఁడు క్షేమేంద్రుఁడు. ఇతని ఇరువదియేడు ఔచిత్య భేదములను ఈ క్రింది విధముగా వర్గీకరింప వచ్చును.

i వాక్యసంబంధులు 12. (1) పదము (2) వాక్యము (3) క్రియ (4) కారకము (5) లింగము (6) వచనము (7) కాలము (8) నిపాతము (9) నామము (10) ఆశీస్సు (11) ఉపసర్గము (12) విశేషణము.

ii వస్తుసంబంధులు రెండు- (1) ప్రబంధార్థము (2) దేశము.

iii పాత్ర సంబంధులు ఐదు- (1) కులము (2) వ్రతము (3) సత్త్వము (4) స్వభావము (5) అవస్థ.

iv రససంబంధులు మూడు :- (1) గుణము (2) అలంకారము (3) రసము.

v రచనా సంబంధులు ఐదు :- (1) తత్త్వము (2) అభిప్రాయము (3) సారసంగ్రహము (4) ప్రతిభ (5) విచారము.

ఈ పై విభాగము సమగ్రమని చెప్పుటకు వీలులేదు. ఇవి కాక మఱికొన్ని విభాగములు చేర్చినను కావ్యసర్వాంగవ్యాప్తియైన ఔచిత్యమును బహుముఖములుగా వింగడించి వివేచించుటకు వీలున్నది. [5] ఈ సత్యమును గుర్తించిన క్షేమేంద్రుఁడే ఔచిత్యములను అనంతములుగా విభజింపవచ్చునని పేర్కొని యున్నాఁడు.

"అన్యేషు కావ్యాంగేష్వనయైవ దిశా స్వయ మౌచిత్యము త్ప్రేక్షణీయమ్. తదుదాహరణా న్యానంత్యాన్న ప్రదర్శితానీ త్యల మతి ప్రసంగేన."[6]

విశ్లేషణ విస్తారమైనచో అధికప్రసంగ మగునని అతఁ డింతటితో విభాగమును ముగించినాఁడు. కాని కావ్యచర్చ గావించునెడ తత్తత్సందర్భములను బట్టి సహృదయులు సాధింపవచ్చునని అతని యభిప్రాయముగాఁ దెలియుచున్నది. అతఁడే తన సువృత్తతిలకమునందు వృత్తౌచిత్యమును పేర్కొని యున్నాఁడు. ఆధునిక విమర్శకులు కావ్యవిమర్శనము చేయునెడ పాత్రౌచిత్యము, సన్నివేశౌచిత్యము, సంభాషణౌచిత్యము, జాతీయా

చిత్యము, లోకోక్త్యౌచిత్యము, భాషౌచిత్యము, వర్ణనౌచిత్యము మొదలగు వానిని గమనించి, గుర్తించి యుండుట సాధారణముగా కానవచ్చుచున్నది. ఔచిత్యము గీటురాయి. దానియందు మెఱుగు దాల్చిన కావ్యాంగము బంగారము.

ఔచిత్యవిచారచర్చయందు కల్పనకున్న స్థానమును గమనించుట ఇచ్చట ప్రస్తుతము. కల్పన మౌలికముగ వస్తుసంబంధి యని భావించి యుంటిమి కదా! వస్తువునందు పాత్రలు, సన్నివేశములు, సంభాషణలు, వాక్యవిన్యాసములు, అభినయవిశేషములు – ఇట్టివి కల్పనల కాలంబనములై భాసించుచుండును. కల్పనయొక్క ఔచిత్యము 'కల్పనౌచిత్యము' అనుటకు వీలున్నది. కల్పనయు సన్నివేశాది కావ్యాంగములయందు వ్యాపించి యుండుటచే దీనిని శబ్దౌచిత్యాదులవలె నియతముగా పేర్కొనుటకు వీలులేదు. కాబట్టి కల్పనల యొక్క ఔచిత్యము వివిధాంశములపై నాధారపడి యుండును. కాబట్టి కల్పనౌచిత్యమను వ్యవహారము రూఢికెక్కలేదు.

తిక్కన కల్పనలలోని ఔచిత్యము పేర్కొనుట న్యాయముగాని తిక్కన కల్పనౌచిత్యము అని పేర్కొనుట ఉచితముగాదు.

తిక్కన విరాటోద్యోగ పర్వములందలి కల్పనలను, ఔచిత్యమును విచారించునెడ ప్రధానముగా రెండు మార్గముల నాశ్రయించి పరిశీలన సాగింపవలసి యుండును. ఈ పర్వము లనువాదములగుటచే మూలమునందలి భావములను ఎంత రమణీయములుగా ననువదించె నని పరిశీలించుట యొకటి. దీనిని అనువాదౌచిత్యమని అనవచ్చును. ఇది యొక పద్ధతి.

అమూలకములైన వాక్యాదులను అనువాదమున కల్పించియు, మూల వాక్యముల కంటె రమణీయార్థస్ఫోరకములైన వాక్యసముదాయములను నిర్మించియు రచన సాగించునెడ అనువాదమనుటకు వీలులేదు. మూలమునకు మెఱుగుపెట్టిన రచనాసంబంధులైన కల్పనలనుటకు వీలున్నది! పైన పేర్కొనిన వర్గీకరణమునందు వాక్యరచనాసంబంధులైన అంశములన్నియు ఇట్టి కల్పనా విభాగమునందు చర్చనీయాంశములగుచున్నవి. మిగిలిన కల్పనలు రస, పాత్ర, వస్తుసంబంధులు. వీనియందు అమూలక కల్పనలు భాసించునెడ

తదౌచిత్యవిచారచర్చ యుగావించుటకు వీలున్నది. తిక్కన రచనలోని ఔచిత్యములు పరిశీలించెడి ఈ అధ్యాయమునందు క్షేమేంద్రుని విభాగము నాశ్రయించి అమూలాదిపదవాక్యాదుల యొక్క ఔచిత్యమునే పరామర్శించుట యైనది. విషయవివరణమునందు పైవర్గీకరణము నాశ్రయించి వివేచనము చేయుటయైనది. తిక్కన భారతమునందలి స్వేచ్ఛానువాద పద్ధతి, కథానువాదపద్ధతి, సంగ్రహీకరణ పద్ధతి, రసాభ్యుచితబంధసంవిధాన శేముషి ఇట్టి పర్యాలోచనకు చక్కని యవకాశమును కలిగించుచున్నవి. అమూలకమైన ప్రతిశబ్దము యొక్కకాని వాక్యము యొక్కకాని, కారకము యొక్కకాని ఔచిత్యమును చర్చింపఁబూనినచో సముద్రమథన కేతము పట్టినట్లగును. స్థాలీపులాకన్యాయమున సమీక్షించుటకైనను శక్తియుక్తులెంతైన కావలయును. ప్రతివిభాగమునకును ప్రసిద్ధములైన ఒండు రెండుదాహరణముల నిచ్చుచు, వాని ఔచిత్యమును ప్రసంగించుచు, తిక్కన ప్రతిభను దిఙ్మాత్రముగా దర్శించుట కిందు ప్రయత్నము చేయుటయైనది.

"వాచ్యానాం వాచకానాంచ య దౌచిత్యేన యోజనమ్।
రసాది విషయేణై తత్కర్మ ముఖ్యం మహాకవేః॥"[7]

అన్న ఆనందవర్ధనుని వాక్యము ననుసరించి మహాకవియైన తిక్కన వాచ్య వాచక రసాది విషయములయందు ప్రదర్శించిన ఔచిత్యదృష్టిని సమీక్షించుట ఆతని కవితామూర్తికి ఎత్తిన కరదీపిక కాఁగలదు.

## 3. వాక్య సంబంధములైన ఔచిత్యములు

సమగ్రభావాభివ్యక్తి సాధనము వాక్యము. వాక్యమునకు ప్రమాణము నిడివి కాదు, కర్త, కర్మ, క్రియల భౌతిక విభాగము కాదు. అభిప్రేతమైన భావము యొక్క సమగ్రాభివ్యక్తియే వాక్యము. అట్టి వాక్యము ఉండవలసిన విధముగా నుండుట వాక్యౌచిత్యము. ఉండవలసిన విధము పాత్రమునుబట్టి, భావమునుబట్టి, అవస్థనుబట్టి, సన్నివేశమునుబట్టి మారుచుండును. కావ్యమున నిది ఉచితమైన వాక్యమని చెప్పుట యెట్లు? దానికి ప్రమాణము లోకము కావలయును. కావ్యము కళయగుటచే లోకధర్మముతో

పాటు కళాధర్మమును గూడ తనయందు సంతరించుకొనును. అట్లగుటచే పాత్రములు వృత్తములలో మాట్లాడినను, సాలంకారములగు సంభాషణలను సాగించినను కావ్యమున సహజముగనే కనిపించును. కావ్య కళాస్వభావము వాక్యమునందు, పదరచనా శిల్పమునందు ప్రకటితమగుచుండును. వాక్యమునకు పదములు అస్థిపంజరము వంటివి వాని కూర్పులో వ్యక్తమగు భావము దాని దేహమువంటిది. ఆ భావము సామాజికునకు అందించు అనుభూతి ప్రాణమువంటిది. శిల్పియైన తిక్కన వాక్యము యొక్క ప్రాణము వ్యంగ్యమగునట్లు పదముల యొక్క కూర్పును కళాత్మకముగా ననుసంధించును. ఈ కూర్పునకును "విశిష్టపదరచనా రీతిః"8 అను రీతి నిర్వచనమునకును భేదము కలదు. రీతియందు అర్థ సమర్పకమగు శబ్దము తనరూప గౌరవమును ప్రదర్శించును. శ్రీనాథాదుల కవిత కట్టి లక్షణము వర్తించును. తిక్కన పదముల పొందిక అర్థసమర్పణము చేయుటయే ప్రధానధర్మముగా కలది.. తిక్కనపదములలో ఆకృతికంటె శక్తిమంతమైన ప్రకృతి భాసించును. వానికూర్పు వాక్యమునకుజీవితమును ప్రసాదించును. కావ్యజీవితమువలెనే వాక్యజీవితము కూడ ఔచిత్యము.

'ఆస్వాదయోగ్యమైన భావవ్యంజకత్వము వాక్యధర్మము, ఆ ధర్మము దేశకాలపాత్రముల కుచితముగా వర్తిల్లుట వాక్యౌచిత్యము. వాక్యమునం దుద్దిష్టమైన భావముయొక్క అభివ్యక్తికి అనువుగా పదములను కూర్చుట పదౌచిత్యము. పదౌచిత్యమునందు వాక్యమునందలి పదములన్నియు వాక్యతాత్పర్యస్ఫోరకములుగా నిలిచియుండును. వానిలో నేయొక్కపదమునకుగాని పదాంగమునకు గాని వైశిష్ట్యము నాపాదించుటకు వీలుండదు. కాని, వ్యవహారమున వాక్యములన్నియు నిట్లుండవు. వాక్యములలో ఒక్కొక్క పదము ఒక్కొకసారి సాభిప్రాయముగా ప్రయోగింపబడినచో వాక్యతాత్పర్యశక్తి దానివలన ప్రస్ఫుటమగును. అట్టి పదము ఒకపరి నామము కావచ్చును. ఒకపరి విశేషణము కావచ్చును. మఱియొకపరి క్రియ కావచ్చును. నామమైనచో నామౌచిత్యము, విశేషణమైనచో విశేషణౌచిత్యము, క్రియయైనచో క్రియౌచిత్యము అని క్షేమేంద్రుడు పేర్కొనినాడు. వాక్యార్థమును దీపింపజేయు సార్థకశబ్దప్రయోగమును పదౌచిత్యమని పేర్కొనియున్నాడు.9 ఈ పదము నామక్రియా విశేషణములకంటె భిన్నమైనచో క్షేమేంద్రుని విభాగము

సరిపడును. కాని, అతఁడు పేర్కొనిన ఉదాహరణములనుబట్టి చూడ నట్టి ప్రత్యేకత కానవచ్చుటలేదు. ఇచ్చట సార్థక శబ్దప్రయోగమే దీని లక్షణ మైనచో ఇందు నామ విశేషణ క్రియాదులు గతార్థములగుచున్నవి. అట్లగుటచే సార్థక శబ్దప్రయోగము సార్థకశబ్దసంవిధానము అనువానిని రెండింటిని గ్రహింపవలసి వాక్యౌచిత్య విచారమునందు సౌలభ్య మేర్పడునని భావించుటకు వీలున్నది.

పదముల నాశ్రయించి యుండునవి కారకము, లింగము, వచనము, కాలము, ఉపసర్గము మొదలగునవి. వీని వలన అర్థచమత్కారము కలిగినచో తత్తద్భేదములచేత ఔచిత్యముగ్గడింపబడినది. నిపాతము, ఆశీస్సు అనునవి కొంతవఱకు వాక్యస్వభావమునకు సంబంధించినవి. ఇట్లగుటచే వాక్య సంబంధులైన ఔచిత్యములన్నియు వాక్యౌచిత్యవిచారమున కంగభూతములే యని విశదమగుచున్నది. మొత్తమునకు వాక్య సంబంధులైన ఔచిత్యము లన్నింటిని వాక్యౌచిత్యమునందు అంతర్భవింపఁజేసినచో వాని విభాగ మిట్లుండునని భావించుటకు వీలున్నది—— [చూడుడు : 54వ పుట]

పదౌచిత్యమునందు సార్థక శబ్దప్రయోగౌచిత్యమును క్షేమేంద్రుఁడు భావించెను. దానికి సాభిప్రాయశబ్దసంయోజనమును కూడ కలిపి ఇందు భావించుటయైనది. పదము వాక్యమునందు వ్యష్టిగాను, సమష్టిగాను నిర్వహించు పాత్రమును వివేచించిన పదౌచిత్యమునందు పైరెండుశాఖలు పేర్కొనఁ బడినవి. వ్యష్టిగా పదౌచిత్యమును భావించునెడ పద, పదాంశముల ప్రయోగౌచిత్య విచారము సంభావ్యమగును. సాభిప్రాయశబ్దసంయోజనమునందు రసానుగుణమైన గుణరీత్యాదులను గుర్తించుటకు వీలున్నది.

శబ్దార్థోభయమైనది వాక్యము. "శబ్దార్థౌసహితౌ కావ్యమ్" [10] అని పేర్కొనిన లాక్షణికుల అభిప్రాయము కావ్యమున కెంత వర్తించునో వాక్యమునకు కూడ అంత వర్తించును. అర్థదీప్తికంటె శబ్దరచనకు ప్రాముఖ్య మున్నవాక్యము శబ్ద ప్రధాన మనవచ్చును. అర్థవ్యక్తికున్న ప్రాధాన్యము శబ్దసంయోజనమునకు లేని వాక్యము అర్థప్రధానము. ఒకటి ఆకృతి ప్రధానమైనది. మఱి యొకటి ఆత్మ ప్రధానమైనది. స్వరూపమునుబట్టి

## వాక్యౌచిత్యము


పదము
వాక్యము
శబ్దప్రధానము
అర్థప్రధానము
సామాన్యము
సంయుక్తము
సంశ్లిష్టము
దేశము
పాత్రము
కాలము
సామాన్యము
సంయుక్తము
సంశ్లిష్టము
దేశము
పాత్రము
కాలము
సార్థకశబ్దప్రయోగము
సాభిప్రాయశబ్ద సంయోజనము
రీతి
గుణము
పదము
పదాంశము
నామము
విశేషణము
క్రియ
వచనము
లింగము
కాలము
ఉపసర్గము
కారకము
నిపాతము
ఆశీరర్థకము

పర్వుడు ఈ భేదముల రెండింటి యందును నిర్మాణమును బట్టి వివేచింపఁ దగు సామాన్య, సంయుక్త, సంశ్లిష్ట వాక్యవిభాగము[11] వర్తించును. వాని ఔచిత్యము దేశ కాల పాత్రములచే నిర్దేశింపఁబడును. వాక్యౌచిత్య విచారచర్చయందు తిక్కనగారి అమూలక వాక్యములను సంభావించి తద్భేదముల సార్థక్యమును సమీక్షించి, తదంతర్భూతములైన సదౌచిత్యాదులను పరామర్శించుట ఇచటి సమీక్షాంశము.

"క. - మమ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు
పొమ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. (5.3 34)

రాయబారము నిర్వహించుటకు శ్రీకృష్ణుఁడు సమర్థుఁడని ధర్మజుఁడు ప్రశంసించిన పద్యమిది. రాయబారము నీతివాక్యచాతుర్యము వలన ఫలించునది. అర్థసిద్ధి యగుటకు రాయబారి ప్రదర్శించెడి వాక్చాతుర్యమే ప్రధాన హేతువు. కాఁగలదు, చతురుఁడైన వక్త అర్థసిద్ధి నుపలక్షించి వాక్యనిర్మాణపద్ధతిని ప్రదర్శించును. శిల్పియైన తిక్కన ధర్మజుని ముఖమున ఈ లక్షణమును వ్యంగ్యముగా పేర్కొనినాఁడు, "అర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు; వాక్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు" అనునది తిక్కన చెప్పిన దైనచో ఉత్తమపురుషయగును. ధర్మజుఁడు చెప్పినచో మధ్యమ పురుష యగును. తిక్కన తన వాక్యనిర్మాణపద్ధతిని తెలిసి చేసినాఁడనుటకు ఈ పద్యము తార్కాణము. దీనికి మూలమును గలదు—

"అస్మాన్ వేత్థ పరాన్ వేత్థ వేత్థార్థాన్ వేత్థ భాషితమ్।
యద్యదస్మద్ధితం కృష్ణ తత్తద్వాచ్యః సుయోధనః॥"[12]

కాని ఇంతవిపులముగా లేదు. ఈవాక్యనిర్మాణము తిక్కన శిల్పము. ఈ చిన్న కందపద్యమునందు ఆఱు వాక్యములు కలవు. ఇవి ఆకృతియందు చిన్నవయ్యు అర్థగాంభీర్యమునందు మిన్నలుగా భాసించుచున్నవి. ఇందు ఐదువాక్యములయందు కృష్ణుని ప్రశంస

కలదు.[1] ఒక వాక్యమునందు ధర్మజుని ప్రశంస కలదు. మొదటి ఐదు వాక్యములలోను నిర్మాణసూత్రము సమానము. ఒక శబ్దముగాని సమాసముగాని ముందుండుట ఆపై క్రియయుండుట అనునది ఇందలి నిర్మాణము. ఐదు వాక్యముల యందును క్రియ సమానము. కాని అది ఐదుసార్లు పునరుక్తమైనది. ప్రశంసయందును అనునయమునందును ఆగ్రహమునందును, దూషణమునందును, విలాపమునందును క్రియాపదము పునరావృత్తమైనచో అవస్థాపోషకమై సన్నివేశసంభాషణౌచిత్యమును పోషించును. అట్లు పోషింపనిచో అది వమనాఖ్య కావ్యదోషము కాఁగలదు. ధర్మజుని వాక్యములందు అట్టి దోషములేదు. శ్రీకృష్ణునియందు దౌత్యాధికారస్ఫూర్తిని ప్రబోధించువానివలె ధర్మజుఁ డావాక్యములను బలికినాఁడు. వాని కాళక్తి క్రియాప్రయోగమువలన ఏర్పడుటచే క్రియాపదౌచిత్య[13] మిందు కలదనియు చెప్పఁగవచ్చును. ఈవాక్యములందు చెప్పఁబడిన లక్షణములన్నియు రాయబారికుండవలసిన లక్షణములే: లక్షణములను చెప్పుట ధర్మజుని లక్ష్యము కాదు. శ్రీకృష్ణుని దౌత్యకార్యమున కున్ముఖీకరణ మొనర్చుట అతని అభిప్రాయము. దీనికితోడు ధర్మరాజు తనసంభాషణ కుచితమైన ముగింపును సూచించుటయు ఇందు కాననగును. ప్రసిద్ధమైన శ్రీకృష్ణుని రాయబారపు ఘట్టమంతయు అతని వివిధ వాక్యపద్ధతులకు విహారరంగమై భాసించుచున్నది. అర్థసిద్ధి వాక్యఫలము, వాక్యనిర్మాణము దానికి సాధనము, రచనాశిల్పము కవి యొక్కనిపుణకర్మ. వీనియందలి ఉచితభావము ఔచిత్యము.

౨ అర్థప్రధానమైన వాక్యములకు వైవిధ్యము చక్కని యుదాహరణము. ఇట్టి వాక్యములందు వాచ్యమగు నర్థముకంటె వ్యంగ్యమగు నర్థమే విశేషముగ నుండును. 'మమ్ము' అను శబ్దము పాండవ పక్షపరమైనది. పాండవులని వాచ్యార్థము, కాని ఈ పదము ఆవాచ్యార్థముతో నాగుటలేదు. పాండవుల స్వభావములను, అభిప్రాయములను అప్పటివారిస్థితిని చెప్పుటయే ఆశబ్దతాత్పర్యము. 'ఎదిరిన్' అనుటలో కౌరవులనుకూడ నెఱుఁగుదువు అనిభావము. అచ్చటకూడ వారిస్వభావాభిప్రాయ స్థితిగతులను తెలిసినవాఁడ వనియే వ్యంగ్యము. వైరవృత్తులైన వీరిరువురి నడుమ సంధి కూర్చుటకు తగిన నెమ్మియు అతఁ డెఱుగుననియు, ఒప్పిదమైన అర్థసిద్ధి ఏదియో

ఆదియు ఆతఁడెఱుగుననియు ధర్మజుఁడు పేర్కొనెను. నెమ్మి, నెఱి అను మాటలలో వ్యంగ్యమయ్యెడి అర్థ మనంతముగా గోచరించుచున్నది. చివరి పాదము (వాక్యము) ధర్మజుని వినయమునకును, నీతికిని, చాతుర్యమునకును తార్కాణము. ధర్మజుని వివేకము మొదటి మూఁడుపాదములయందును వినయము నాల్గవ పాదమునందును కంఠోక్తముగా తిక్కన ధ్వనింపఁజేసినాఁడు. అల్పాక్షరములలో ననల్పార్థ రచన మిది.

"క. హితుఁడవు మతిమంతుండవు
చతురవచనకోవిదుఁడవు సమయజ్ఞుఁడ వు
న్నతవంశవర్ధనుఁడ విం
గితవేదివి నెచ్చెలివి సుకృతి వట్లగుటన్." 5-1-53

ఈ కందమునందు క్రియాపదము లేదు. కాని హితుఁడవు అనఁగా 'నీవు హితుఁడైన వాఁడవు' అను వాక్యము సంపూర్ణార్థబోధకమై యున్నది. పై పద్యమునందు ఒకె క్రియాపదమైదుసార్లు ప్రయోగింపఁబడగా ఇందు ఒక్క క్రియాపదము గూడ లేదు. అచట చెప్పెడివాఁడు ధర్మజుఁడు, వినుచున్నది కృష్ణుఁడు. ఇరువురును సమర్థులైనవారే. 'ఎఱుక' గలిగినవారే. అందుచే 'ఎఱుంగుదు' వను పదము పునరుక్తమై ఎఱింగెడి విషయము వ్యంగ్యమైనది. ఇచట ద్రుపదుఁడు తనపురోహితుని కార్యార్థమై పొగడుచుండుట వలన పురోహితుని ఎఱుకకన్నను మిన్నగ గుణగణములు పేర్కొనఁబడినవి. ఇచట రచనలో వ్యంగ్యము అవసరములేదు. 'మమ్ము ఎఱుఁగుదు' అనుచో రెండు పదములలో వాక్యము చెప్పఁబడగా ఇచట 'హితుఁడవు' అను ఒక్క పదములో కర్త, క్రియ గమ్యమానమై విశేషణము ప్రత్యేకముగా కనిపించుచున్నది. ఈ విశేషణములన్నియు దూతకుండవలసిన లక్షణములను తెలుపుచున్నవేకాని అర్థశూన్యములు కావు. సార్థకవిశేషణపద ప్రయోగమువలన ఇచట విశేషణౌచిత్యము పాటింపఁబడినది. చతురవచనకోవిదుఁడ వనునెడ చతురవచననిర్మాణము, సమయజ్ఞుఁడ వనునెడ సమయబుద్ధి, ఇంగితవేది వనునపుడు ఔచిత్యము వ్యంగ్యమగు గుణములు. ఈ చతురవచన రచన, సమయసందర్భోచిత నిబంధనము, ఔచిత్యపోషణము తిక్కన రచనలో

ప్రధానగుణములు.[1] చతురవచనము లన. శబ్దప్రధానములైనవి కావనియు, చమత్కార, అర్థ బోధకనులైన వనియు గ్రహింపఁదగును. ద్రుపదుని పలుకులతో సమయోచిత శబ్ద ప్రయోగముతో కూడిన ప్రయోజనము కానవచ్చుచున్నది. ధర్మజుని మాటలలో సమయోచిత అర్థప్రయోగముతో కూడిన వాక్యయోజనము కానవచ్చుచున్నది. అధికారములను బట్టి వాక్యములను రచించుట తిక్కన రచనా శిల్పము.

"క. ఆపార్థుఁడు భరతాన్వయ
దీపకుఁ డమరేంద్రు సుతుఁడు తేజోనిధి వి
ద్యాపారగుండు వినుత
వ్యాపారుం డాపదలకు నగ్గంబయ్యెన్. 4-2-205

ఈ కందములో ఒకే వాక్యమున్నది. క్రియాపదము చివర ప్రయోగింపబడినది. ఇందు ద్రౌపదికి అర్జునునిపైగల ఆదరాభిమానములు ఆపదు ఆపదల కగ్గంబగుటచే కలిగిన పరితాపము ఒకే ఊపిరితో చెప్పఁబడినవి. శిథిల బంధమువలన వేదనాస్ఫోరకముగా నున్నది. ప్రసాదగుణము వలన రచన ధారాళముగ నొప్పుచున్నది. ప్రసాదము స్త్రైణమైన ఆర్ద్ర ప్రవృత్తిని పట్టి యిచ్చుచున్నది. ఆపదల ననుభవించుచున్న అర్జునుఁ డెట్టిడాఁ డనునది చెప్పుట ప్రధానాంశము. అందువలననే అర్జునుని గుణ, లక్షణములు ప్రముఖముగా నెంచఁబడినవి. సార్థక విశేషణములవలన విశేషణౌచిత్యమును పోషించుటయైనది.[14] పార్థుఁడు కురుక్షేత్ర మహాసంగ్రామమున ప్రముఖపాత్ర వహించి విజయమునకు కారణుఁడైనవాఁడు. అతని మనుమఁడే భావికురు వంశస్థాపకుఁడు. అట్లగుటచే అతనిని భరతాన్వయదీపకుఁ డనుట తగియున్నది. విద్యాపారగుం డనుటలో అర్జునుని అస్త్రవిద్యాపాండిత్యమును, నృత్యగీతాది కళలలో గల ప్రతిభయు వ్యంగ్యముగా చెప్పఁబడినవి. తక్కిన ఆయా విశేషణము లన్నియు నిక్లే అన్వర్థములై ఔచిత్యమండితములై ఆ సందర్భమునకు తగియున్నవి. ఒక్క కందపద్యములో ఐదాఱువాక్యము లిమిడియుండుట పైన గలదు. కందమంతయు ఒకేఒక వాక్యముగా నిచట కలదు. వాక్యనిర్మాణము కర్త, కర్మ, క్రియ అను వరుసలో చేయఁబడినది. విశేషణ పద ప్రయోగము వలన అర్థదీప్తి కలుగుచున్నది.

"క. విచ్చెం దిమిరము కాఁపులు
వచ్చె మధుపకులము లబ్జవనముల కురులం
జొచ్చె విరులు తరులతికల
నిచ్చె రథాంగములు వంత యెల్లం దొలఁగన్." 4-2 237

"క. మాసె నభోమణి నక్కలు
కూసెం గలయంగ దెసలకుం బలుచాయల్
చేసెం బఱిమొయిళు లదరి
మ్రోసెం దమయంతఁ దూర్యములపధ్వనులై." 4-4 86

ఇవి వర్ణనల కొఱకు రచించఁబడిన కందములు. క్రియాపదములతో మొదలగుట ఇందలి ప్రత్యేకత. మొదటి కందము నందు తిమిరము విచ్చుట ప్రధానముగా జెప్పవలసిన అంశము. ప్రభాతకాలవర్ణనలో తిమిరము విచ్చుట ప్రథమ కార్యము గదా! అందుచే విచ్చెందిమిరము అని క్రియతో ప్రారంభించెను. తరువాతివాక్యములో 'కాఁపులు వచ్చె మధుపకులము లబ్జవనములకు' అని కర్తతో ప్రారంభించి క్రియను తరువాత నిలుపుటవలన ఆకార్య మంత ప్రధానము గాదని తోచును. క్రియాప్రధానమైన ఈవర్ణనలో క్రియతో కందమును ప్రారంభించుట ఉచితముగా నున్నది. 'మాసె నభోమణి' అనునెడ సైతము సూర్యుడు కాంతివిహీనుఁడగుటయే తొలుదొల్త చెప్పఁదగిన విషయముగాన 'మాసెనభోమణి' అని ఊఁది పలికెను. 'మాసె' అనునీక్రియాపదము ఆపై చెప్పఁబోవు అపశకునములకు సరిపోవుచున్నపదము నభోమణిని పేర్కొనుట కంటె నభోమణి మాసెనని చెప్పుట ముఖ్యము గనుక మాసె నభోమణి అని చెప్పఁబడినది. ఆతరువాత నున్న వాక్యములలో క్రియలు ముందు వెనుకలుగా నుండుట జరిగినది. ఆయాక్రియాపదములన్నియు పద్యపాదారంభములలోఁ గూర్పఁబడి శబ్దసౌందర్యమును కలిగించుచున్నవి. రెండుకందములు ప్రారంభమున క్రియాపదములతో నుండి వర్ణనలకొఱకే రచింపఁబడుట గమనింపఁదగియున్నది.

"క. ఎదురున్న రూపు పలుకఁగఁ
దుదిఁ గటకటఁబడవు నీవు దుర్ణయమును బె
ట్టిదమును రెండును నగు పలు
కొదవదు నీ నాలుకకు నయోన్నత యెపుడున్." 5-1-363

ఇచటకూడ దూతను ప్రశంసించుటయే జరిగినది. కాని, ఇందు అనునయము గాని, గుణాపహరణ ప్రకటనముగాని జరుగలేదు. సంజయుని లోని ఒకే ఒక గుణమును ధర్మరాజు ఇట ప్రశంసించినాఁడు. అది 'నయము' దానిని ఒక గుణముగాఁ గాక సంజయునిలో అంతర్భాగమైన లక్షణముగా నెంచి 'నయోన్నత' అని సంబోధించినాఁడు. ఇందు రెండు వాక్యములు ఉన్నవి. ఒకదానికి కర్త 'నీవు' అనునది. కాని అది అప్రధానము. అతని గుణము తొలుత చెప్పఁబడినది. అట్టి నిస్సంశయ ప్రవృత్తి గలవాఁడ వీవు అని చివర కర్తృపదము చేర్పఁబడినది. ఇట్టి వాక్యమునందలి ద్వితీయార్ధము ఆ ప్రశంసకు వన్నెచేర్చుటయైనది. ఎట్టిన సూటిగాఁ బలుకుట ఒక గుణము కాగా, కఠినముగాగాని, వ్యర్థముగాగాని పలుకకపోవుట గుణములలో గుణము. 'పలుకు ప్రగల్భదనము' సప్త వ్యసనములలో నొకటి కాగా అట్టిది నీనాలుకకు ఒదవదు అనుట ఎంత ఘనతరము! 'ఎపుడున్' అను పదము వాక్యాంతమున నుండి ఆ గుణము సంజయునిలో జీర్ణించిపోయిన దని తెలుపుచున్నది. నయోన్నతునికి ఉండఁగూడని లక్షణముల నిట పేర్కొనినాఁడు తిక్కన. వచనములో దొరలిని నిర్వచనము ఇది.

రెండు వాక్యము లున్న ఈ కందములో జరిగినది దూతప్రశంసయే కాని, ఆ వాక్యముల నిర్మాణము పూర్తిగా భిన్నము. ఒక దానిలో కర్తృపదము వాక్యాంతమున నుండ రెండవదానిలో ప్రారంభమున నున్నది. మొదటి వాక్యము కొంత ప్రశంస చేయుటతో పూర్తియైన పిమ్మట రెండవ వాక్యము మఱింత ప్రముఖముగా ప్రశంసకు వన్నెగూర్చినది. కందములో రెండు భిన్న వాక్యము లుండి ఒకదానిని మించునట్లు మఱియొక దానిని గూర్చుట ఇచట జరిగినది.

తిక్కన సహజముగా సర్వప్రధానములగు వాక్యముల నిర్మించును. విరాటోద్యోగపర్వములలో ప్రసంగానుకూలమైన సర్వసిద్ధి నొసంగాల్చు వాక్యములను నిర్మించుటలో నమితమైన శ్రద్ధను తిక్కయజ్వ ప్రకటించినాఁడు. అందును నాయకుఁడైన ధర్మరాజుని ముఖమున నట్టివాక్యములు ఉత్తమస్థాయి నందుకొనినవి. సంజయు రాయబారపుఘట్టము ధర్మరాజుని నీతి వాక్యకౌశల్యమునకు పెట్టినది పేరు. ఆ పేరుకు తగినసొబగును ఈకందపద్యమునఁ గానవచ్చును. ఇట్లే మఱియొక పద్యము.

"క. నీవొండె విదురుఁ డొండెను
గావలయుంగాక యిట్టి కార్యంబులకున్
రా వేఱ కలరె తగువా
రీవినయము నేర్పుగలదె యితరుల కెందున్." (5 1-164)

సంజయుని ప్రశంస ఇంకను సాగుచున్నది. ఈకందమున మూఁడు వాక్యములు గలవు. ఒకదానిలో సంజయుని ఆతనికంటె అధికునితోఁ బోల్చినాఁడు. రెండవదానిలో అట్టివారు వేఱెవరు లేరనినాఁడు. చిట్టచివరి వాక్యములో వారి ప్రత్యేక గుణములైన వినయము, నేర్పు పేర్కొనఁబడినవి. ఒక వాక్యమునకు మఱియొక వాక్యమునకు నిర్మాణములో నెట్టి సంబంధమును లేదు. కాని అర్థపుష్టికి ఒక దానిపై మఱియొకటి ఆధారపడినవి. రెండవవాక్యములో 'వేఱ కలరె' అనుచో మొదటివాక్యములో నున్న విదురసంజయులు తక్క అనునర్థమును గ్రహింపవలెను. రెండవ వాక్యములోని 'ఇట్టి కార్యంబులకున్' అను మాటకు రాయబారమునకు, సుహృద్భావ పరిపోషణమునకు అనునర్థమును గ్రహించిననేగాని వినయము నేర్పు అను తగువారి వాక్యమునందలి గుణముల అవసరము సమగ్రముగా భావింపఁబడదు. ఈచివఱి వాక్యము ముగింపఁబడిన పిమ్మటగాని నీవొండె విదురుఁడొండె అను ప్రథమపాదము సంపూర్ణావగాహనకు రాదు. ఒక కందమునందలి మూఁడు వాక్యము లిట్లు అన్యోన్యాశ్రితములై యున్నటవలన ఇచట వాక్యౌచిత్యము భూషింపఁబడినది.

ఈపద్యమందలి మొదటివాక్యము నిశ్చయార్థకము; రెండవది మూడవది ప్రశ్నార్థకములు. నిశ్చయార్థకము కంటె ప్రశ్నార్థకము శ్రోతపై ప్రభావమధికముగా నేయును. ప్రశ్న వెనుక నున్న సమాధానము నూహించుటలో సుతర్కంరసము, వ్యంగ్యార్థము భాసించుటకు వీలున్నది. ఈ పద్యమందలి మొదటి వాక్యమున విదురసంజయుల నీతికుశలత్వము వాచ్యము చేయఁబడినది; రెండవవాక్యమున అలంకృతము చేయఁబడినది, ప్రశ్నార్థవములచే వక్రము చేయ బడినది. మొదటిదానియందు స్వభావోక్తి కలదు; రెండవదానియం దతిశయోక్తి కలదు. మొదటిది ప్రసక్తి; రెండవది ప్రశస్తి. రెండు విలక్షణములైన వాక్యముల నొకచోట సంయోజనము చేయుటచే ఒకే భావమునకు తరతమస్ఫూర్తి కలిగి, ఆర్థికమైన సౌందర్యమిందు ఔచిత్యశోభితమై యొప్పారు చున్నది.

"క. ఆరాజు సేయు నెయ్యము
గారామును జెప్పి దీవు గడుఁదీపులుగా
వీరు దమపాలు వడయన్
నేరిమి మాటలన తీరనేర్తురె చెప్పుమా" 5-1-340

పాత్రము ననుసరించి సంభాషణము ప్రవర్తిల్లుననుటకీ కందము నిదర్శనము. సంజయుని నయౌన్నత్యమును, వినయమును, నేర్పును ధర్మజుఁడు రెండు కందములలో విశేషముగా ప్రశంసింప వానిని శ్రీకృష్ణుఁ డతిస్వల్పములుగా తీసివైచుచున్నాఁడు. ఇట్టి మార్పు ఆయాపాత్రములను, వారివారి ఆంతర్యమును బట్టి ఏర్పడుట సహజము, అవసరముగూడ. ధర్మజుఁడు లౌక్యమును పాటింపవలసినవాఁడు. రాజమర్యాద ననుసరించి దూతను సంభావించినాఁడు. శ్రీకృష్ణుఁడు లౌక్యము నెన్నవలసినవాఁడుకాఁడు. ఆ భేదమును బట్టి రచనయు మారినది. 'వినయవచనములను కడుఁదీపులుగా' అని ఎత్తిపొడచినాఁడు. 'తమపాలు వడయక నేరిమి మాటలన తీరనేర్తురె చెపుమా' అని సంజయునినే ఎదురుప్రశ్నముతో ఎదుర్కొనినాఁడు నేరిమిమాటలతో పనిలేదనియే ధర్మజుని దీర్ఘసంభాషణకును తాత్పర్యము. అద్దానిని శ్రీకృష్ణుఁడొక్కకందములో సంగ్రహించినాఁడు. సంజయుని దౌత్యమంతయు ఈ ఒక పద్యమున నిష్ఫలమగుట తెలియుచున్నది.

ఈ పద్యమున వాక్యద్వయము కలదు. అందు పూర్వవాక్యము ఉత్తరవాక్యమున కనుబంధముగా భావించుట విశేషము. ఇది సంయుక్త వాక్యవిశేషము. 'చెప్పు' అనుక్రియ రెండింటను కలదు. ధృతరాష్ట్రుని నెయ్యమును, గారాబమును కడు తియ్యనగా చెప్పుట సంజయు రాయబార తాత్పర్యము. మాటల నేర్పులు రాజ్యభాగము నీయఁజాలవు; పాండవులకు తృప్తి నీయఁజాలవు. ఎదుటివాని నేర్పులోని గుట్టును బైటపెట్టుచు నొక వాక్యము; తమ కానేర్పెట్లు అర్థసిద్ధికి తోడుపడదో తెల్పెడి దొక వాక్యము. తాత్పర్యమున రెండింటికిని సజాతీయత్వమున్నను, స్వభావమున నొకటి ఆశ్చర్యార్థకము రెండవది అధిక్షేపాత్మక ప్రశ్నార్థకము. సంజయు రాయబారపుతత్త్వము నొకటి చెప్పినది; దాని వైఫల్యమును మఱియొకటి సూచించినది. వక్తయైన కృష్ణుని వివేచనాత్మకమైన వాక్యరచనము నీ చిన్నికందము నందు తిక్కన నిబంధించి, దాని చివర అధిక్షేపార్థక స్ఫూర్తిని ప్రశ్నార్థకములో ప్రపంచించినాఁడు. సందర్భోచిత, పాత్రోచిత వాక్యౌచిత్యమున కిది యొక చక్కని యుదాహరణము.

''క. లలనా యుఁడుగుము నీయే
డ్పుల కొలదియె కురునృపాలపుత్రకళత్రం
బుల యేడ్పు లింక వానిం
గలకల నవ్వుచు వినంగఁ గాలంబయ్యెన్.'' 5-3-121

ఇది అనునయవాక్యములు మూఁడుగల కందము. 'లలనా' అను సంబుద్ధియందు వాత్సల్యము మూటకట్టినాఁడు శ్రీకృష్ణుఁడు. ఆసంబుద్ధి తోడనే ద్రౌపది కొంత యూరట నొందుచున్నది. అదియొక ఔచిత్యము. 'ఉడుగుము' అను క్రియలో అనునయ మెంత కలదో అభయదాన మంత కలదు. ఆ క్రియ ద్రౌపదికి స్వాస్థ్యము చేకూర్చును. ఇది క్రియాపదౌచిత్యము. ఇక రెండవ వాక్యమున శ్రీ కృష్ణుఁడు చక్కని తూకమును నిల్పినాఁడు.— 'నీ యేడ్పుల కొలదియె కురునృపాలపుత్ర కళత్రంబుల యేడ్పులు'—అను వాక్యమున కేంద్రశక్తి యంతయు 'కొలదియె' అనుపదమున నున్నది. ద్రౌపది శోకము కంటె మిన్నయైన శోక మావనితలకు గలుగనున్న దని

తాత్పర్యము. ద్రౌపది శోకమునకు అవధి యున్నది; వారి శోకమునకు మేరలు లేవని వ్యంగ్యము. అవమాన, వనవాస, రాజ్యభోగలోపాదుల వలననైన ద్రౌపదిశోకము కలకాలము నిలుచునదికాదు. కౌరవకళత్రముల శోకము భర్తృవియోగ జనితమై దుర్భరమని అతని భావము. ఇట్టి తులనాత్మక పరిశీలనమునకు తావుకల్పించినది 'కౌలదియె' అనుపదము. కావున నిందు పదౌచిత్యము కలదు. కందపద్యచతుర్థ పాదమున 'కలకల నవ్వుచు వినంగ గాలంబయ్యెన్' అను సూచనము, సమీప భవిష్యత్తులో సుఖము లభింపగలదనియు, పాండవ విజయము, కౌరవనాశనము తథ్యములనియు భావికథార్థధ్వని కలదు. ఇందు ప్రబంధార్థౌచిత్యము ను భాసించుచున్నది. ముచ్చటైన మూడు వాక్యములు సార్థకములై శ్రీకృష్ణుని వాక్యములకు ఔచిత్యమును సంతరించి పెట్టుచున్నవి.

ద్రౌపది మనస్సు ప్రతీకారమును కోరుచున్నది. ప్రతీకారము ఫలింపనిచో ఆమె పరితాపమునకు ఉపశమనము లేదు. ఒక వాక్యములో అభయమిచ్చి, రెండవ వాక్యములో శత్రువనితల శోకముయొక్క మేరలేనితనమును జెప్పి; మూడవ వాక్యములో ద్రౌపదికి కలుగబోవు మానసిక సంతృప్తిని సూచించి యామెచిత్తమునకూరట కలిగించినాడు శ్రీకృష్ణుడు. పాత్రచిత్తవృత్తి ననుసరించి పచరించెడి సంభాషణ శిల్ప మిచ్చట నౌచిత్య శోభితమై భాసించినది. తిక్కన రచనలో వాసికెక్కిన కందములలో నిది యొక్కటి. దానికి కారణ మీపద్యమున నున్న సర్వతోముఖమైన ఔచిత్య మనుటలో విప్రతిపత్తి యుండబోదు.

"క. ఇవి దుస్ససేను ప్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవుల కడఁ దీఱు మాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత వీనిన్" 5-3-116

ద్రౌపది తన ఉద్దేశ్యము నంతటిని తన శిరోజములను తలపవలయును ననుటలోనే తెలిపినట్లైనది. ద్రౌపది కోపమునకు ప్రధానహేతువు తనయవమానము. అవమానమునకు ప్రతిరూపములుగా సగముతెగి మిగిలియున్న తన

వెండ్రుకలను కృష్ణునిముందు బెట్టి వానిని తలచిన చాలు ననుచున్నది. అనగా కృష్ణుఁడొకవేళ సంధికే ప్రయత్నించినను ద్రౌపదివెండ్రుకలు గుర్తు వచ్చినచో నా పని చేయలేఁడని ఆమె ఆశ, ఒక భావమునకు ఒక వస్తువును లక్ష్యముగాఁజేసి ఆ వస్తువును తలంచిన తనభావ మవగాహన మగునని పలికినది (Symbolic). ద్రౌపది తనకసినిగాని, తనపరాభవదుఃఖమునుగాని, క్రోధానలమునుగాని ఇందు పేర్కొనలేదు. కాని ఆ వెండ్రుకలు అన్నింటిని గుర్తు తెచ్చునని ఆమె ఉద్దేశించినది. ఈ పద్యమున నున్న రెండు వాక్యములలోను శిరోజములకే ప్రాధాన్యమివ్వబడినది. కాని అది వాచ్యముగా పేర్కొనబడలేదు. వానిని చేతబట్టి చూపుచు 'ఇవి' అనినది, నామమును కంటె ఇచట 'సర్వనామప్రయోగమే ఆమె ప్రత్యక్షముగా చూపుటను తెలుపుచున్నది. ఇవి' అని ప్రారంభించిన పద్యమును 'వీనిన్' అని ముగించుట వలన ఏకసూత్రముగా నున్న వాని ప్రాముఖ్యము తెలియనగును. 'అచ్యుత' అని సంబోధించి 'కౌరవుల కసిఁ దీయుమాటల యవసరమున' తన బాధ్యతనుండి చ్యుతుఁడవు గావలదని హెచ్చరించినది ద్రౌపది. ఇట నామౌచిత్యము కలదు. 'దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టితోఁబుట్టువు' ను సున్నితముగా హెచ్చరించినట్లైనది. ఈసంబోధనవలన 'తలఁపవలయు' అను విధిపూర్వక క్రియాపదప్రయోగము కూడ సముచితముగా నున్నది.

తిక్కన అభినయాత్మకవాక్యరచన కిది చక్కని యుదాహరణము. సన్నివేశోచితపాత్రవాచికాభినయము ఆంగికాభినయముతో కలిసి శోభిల్లును. ఇందు ఆంగికాభినయము ననుసరించి వాక్యరచన కలదు. సోమయాజి నాటకీయరచనా విధానమున కీవాక్యములు నిధానములు.

"క. సమరమునకుఁ బురికొల్పుచు
మముఁ దలఁచిన నుల్లికుట్టుమాటలఁ దచ్చి
త్తము లుడికించుచుఁ బాండవ
సమితిం గడఁగించువా రచట నెవ్వరొకో." (5-2-242)

ధృతరాష్ట్రుని చిత్తమంతయు ఈ పద్యమునందలి ఒక్కపదములో చెప్పబడినది. 'ఉల్లికుట్టుమాటలు' అనఁగా పాండవుల క్రోధాగ్నిని ప్రజ్వ

లింపఁజేయు మాటలని ధృతరాష్ట్రుని ఉద్దేశ్యము. కాని ఆపదము ఆతని ఆక్రోశమును ప్రతిబింబించుచున్నది. అర్థము ఆపై బోధపడుచున్నది. వక్తృమనోగత భావమునకు ప్రతిరూప మీపదము. సాత్యకి, ధృష్టద్యుమ్నాది వీరుల వీరాలాపములనే ధృతరాష్ట్రుఁ డిచట 'ఉలికిపాటుమాటలు'గా నెంచినాఁడు. ఈ ఒక్కపదము ఆపద్యమున కంతకును జీవమునఁ దగియున్నది. తక్కిన వాక్యాంగములలో లేని ధృతరాష్ట్రుని అంతరంగమథన మిందు రాశి కట్టినది. నిజమునకు ధృతరాష్ట్రుఁ డెఱుంగవలసిన దింక ఏమియును మిగిలి లేదు. అందుకే 'ఏన్వరకో' అని ప్రశ్నార్థకమును, అభిలాషార్థకముగా 'ఒకో' పదముతో మిళితముచేసి సంజయుని అడిగినాఁడు. ఈ కందమంతయు ఒకే వాక్యము. 'పురికొల్పుచు', 'ఉడికించుచు'. 'కడఁగించు' అను అసమాపక క్రియలతో నున్న సంశ్లిష్టవాక్య మిందున్నది. ఒక్క బిగువులో పూర్తియై ఆతని ఉద్వేగమును తెలుపుచున్నది.అర్థప్రధానమైన వాక్య మిది. ఇందొక్క పదము మిక్కిలి ప్రస్ఫుటముగా భాసించుటవలన

'తిలకం బిభ్రతీసూక్తిః భాత్యేక ముచితం పదమ్।
చంద్రాననేవ కస్తూరీకృతం శ్యామేవ చందనమ్॥ 15

అను క్షేమేంద్రుని పదౌచిత్యనిర్వచనము అన్వయించును సరిపోవుచున్న దిచట

## అధిక్షేప వాక్యములు

"ఉ. చిక్కనిపోటుమానిసి విసీ విసువారలు నవ్వ నేమిగా
నెక్కుడు మాటలాడెద వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న నేఁ
డిక్కడఁ బల్కులన్ గెలిచె దీ వతనిన్ మనరాజుకొల్వునన్"
(5-1-253)

భీష్ముఁడు కర్ణునియధిక్షేపించుచు మందలించెడి వాక్యము లివి. రణరంగమునందు విఫలుఁడై కొలువుకూటమునందు వాక్శూరత్వమును ప్రకటించు కర్ణుని బీరమును సభలో ఔచిత్యమును వీడకుండ అధిక్షేపించి

నాఁడు గాంగేయుఁడు. అతని అధిక్షేపమంతయు ద్విత్వకకారప్రాస యందు తిక్కన నిబంధించినాఁడు. పళ్లను బిగఁబట్టి తన్నుఁదాను నిగ్రహించు కొనుచు ప్రతిసమాధానము నిచ్చెడి కురుపితామహుని సంభాషణము ప్రాసాతురవిన్యాసమున గానవచ్చుచున్నది. అతని అధిక్షేపమంతయు మొదటి వాక్యమున ప్రోవుపడినది. 'చిక్కని పోటుమానిసివి' అను వాక్యము వ్యతిరేకార్థవ్యంగ్య ప్రధానమైనది. అధిక్షేపమునందు ఇట్టివ్యంగ్యరచనయే ఔచిత్యమును సంతరించుకొనును. 'చిక్కని' అను విశేషణము శ్లిష్టము. సారవంతమైన అనునది వాచ్యార్థము. పలుచఁబారిన అని వ్యంగ్యార్థము. శత్రువుల చేజిక్కని అని వాచ్యార్థము, శత్రువులచేజిక్కిన అని వ్యంగ్యార్థము. 'పోటుమానిసి' – పరాక్రమవంతుఁడని వాచ్యార్థము, ప్రగల్భము లాడు వాఁడని వ్యంగ్యార్థము. 'ఇసీ' అనునది ఏహ్యావాచకము, అవహేళనార్థకము. ఇవి ముందువాక్యములోని వ్యతిరేకవ్యంగ్యములను [illegible] పట్టి యిచ్చుచున్నవి. వ్యంగ్యమునుండి వాచ్యమునకు వాక్యరచన సాగుచున్నదని ఈ అధిక్షేపార్థము సూచించుచున్నది. మిగిలిన వాక్యములన్నియు యథార్థకథనములు. ఇందలి వాక్యములన్నియు అర్థప్రధానములు. ఎడనెడ కొన్నిపదములపై భీష్మపాత్రమిచ్చెడి ఊనిక నాశ్రయించు పదవిశేషణౌచిత్యములు భాసించుచున్నవి. 'ఏమి కాన్' అనుపదములలో శ్లిష్ట చమత్కారగర్భితమైన అవహేళన మున్నది. 'ఎక్కుడు', 'అహీన', 'ఇక్కడ', 'ఆర్వురన్', 'మనల'. 'ఉగ్రరణంబునన్'. 'నిన్న', 'నేడు', 'ఇక్కడ', 'పల్కులన్', 'కొల్వునన్' అను మాటల యందలి ఊనికవలన భీష్మోద్దిష్టమైన అధిక్షేపము అర్థవంతమగుచున్నది, వాక్యౌచిత్యముతో పాటు పదౌచిత్యము ఇందు పాటింపఁబడుచున్నది. కర్ణార్జునుల పరాక్రమ తారతమ్య నిరూపణము ఈ పద్యవాక్యతాత్పర్యము. దీనిని నిరూపించుటలో తిక్కన రెండు చమత్కారములను చేసెను. ఒకటి వాక్యసంఖ్యకు సంబంధించినది. అర్జునుని గూర్చిన వాక్యమిం దొకటి గలదు. అది యథార్థప్రతిపాదకమైన వాక్యము. ఇక కర్ణుని గురించి మూడు వాక్యములు గలవు. అవియన్నియు విపరీతార్థవ్యంజకములే. ఇక రెండవలక్షణము సమాసరచనకు సంబంధించినది. అర్జునప్రశంసగలవాక్యములో "అహీనపరాక్రమశాలి", "ఉగ్రరణంబున" అనుసంస్కృతసమాసములు వికృతి పొందని విజయుని విక్రమమును

వ్యంజింపఁ జేయుచున్నవి. మఱి కర్ణుని అధిక్షేపించుచు నుడివిన వాక్యము లలో సంస్కృతసమాసము లుండుటకు వీ లున్నచోట గూడ తెలుగు సమాస ములను వాడి పాత్రగతమైన వికృతి భాసించునట్లు తిక్కన రచనము గావించెను. 'చిక్కని పోటుమానికివి', 'ఎక్కుడుమాటలు', 'మనరాజు కొల్వునన్' అనునవి ఇందుల కుదాహరణములు. వక్తయైన భీష్మునియొక్క అభిప్రాయము సంస్కృతాంధ్రసమాసరచనావిధానము నాశ్రయించి పద్య వాక్యములందు ప్రతీయమాన మగుచుండుట ఇందలి సంభాషణ శిల్పము. అర్జునుఁడు ఉత్తరగోగ్రహణంబున ప్రత్యక్షముగా ఆర్వురను గెలిచె ననియు, కర్ణుఁడు కొలువుకూటమునందు పరోక్షముగా మాటలతో మాత్రము అర్జునునొక్కని గెల్చెననియు చెప్పెడి వాక్యములు తారతమ్యపరిశీలనకు వీలైన వాక్యముల జంట. తిక్కన సార్థకోక్తిప్రయోగినై పుణ్యమునకు ఇవి ఉదాహరణములు.

భీష్ముఁడు కర్ణు నధిక్షేపించుచు పల్కినపద్యము ఉద్యోగపర్వచతుర్థా శ్వాసమున మఱియొక్కటి గలదు. కాని అందు పరాక్రమ తారతమ్య నిర్దేశము కాక భీష్ముని పరాక్రమమునునుగుణించిన వ్యంగ్యనిర్దేశము కలదు. అతఁ డామాట లనుటకు హేతువులైన కర్ణుని వాక్యములందు వరవయ భేద నిరూపణము గలదు.

"తే. చాలఁగాలంబు పోవక చతురులైన
వృద్ధజనముల బుద్ధులు విండ్రుగాక
ముదియ మతిదప్పి నోరికి నోదవినట్లు
పలుకు వెడఁగుల మాటలు పాడియగునె." 5-4-243

ఇందు పూర్వార్ధమున "చతురులైన వృద్ధజనముల బుద్ధులు" అను సాధ్యసమాస సంవిధానముతో పోల్చినచో ఉత్తరార్ధమునందలి తెలుఁగు మాటల సాధ్యసమాసముల కూర్పు ఔదాత్త్యమునందు కొరనడి యున్నట్లు పరిగ్రహింపగలఁడు. కర్ణుఁడు భీష్ముని 'ముదిమతిదప్పిన వెడఁగు' వలె చిత్రించెడి వాక్యసంయోజనశిల్ప మిది. భీష్మునకు కర్ణుఁడు ప్రతిసమాధాన మిచ్చెనని చెప్పుట అట్లుంచి తిక్కన వాక్యములలో వాడెడి తత్సమ, దేశ్య పదసమాసాదులను ఆధారముగా గొని పాత్రల వ్యక్తిత్వ, స్వభావ తార

సమ్య నిరూపణము గావించుటలో అనురూపమైన శిల్పమును తనరచనయందు పాటించెనని గ్రహించుటకు వీలుకలుగు చున్నవి. "చ. మదుకడనైన" (5-4-246) అను పద్యమున భీష్ముడు స్వీయ పరాక్రమమును సాభిమానముగా, సామర్షముగా చెప్పుకొనినాడు. 'మదుకడనైన నాదుబలమున్ చలమున్' అనుటయందు అమర్షయును, 'దివిధాస్త్ర శస్త్రసంపదయును' అనుటయందు అభిమానమును, 'సొంపడుభార్గవుచే విరుగు' అని అనుటయందు అధిక్షేపగర్భమైన ఉపహాసము, 'ఏబుగున్ బనంబు' అనుటలో అభిమానాత్మకమైన స్వీయప్రశంసయు, 'నాపదిమిత్తంబు నీకుమారులననున్ వరుసన్ విజయుం డెటింపడున్' అనుటయందు విపరీతార్థవ్యంజకమైన అధిక్షేపమును భావికథార్థసూచనయును కానవచ్చుచున్నవి.

## తార్కిక వాక్యములు

తర్కసహమైన మీమాంసయందు తిక్కన ప్రయోగించెడి వాక్యములు సంగ్రహములయ్యు, సారవంతములై ఆలోచనను రేకెత్తింపజేయునవై యుండును. మహాభారత-ఉద్యోగపర్వమున ధర్మజుని నోట పలికించిన పద్యములు ఆంధ్రావళి ప్రశంస నందుకొనినవి వానియందు వాసికెక్కినవి ఈ క్రింది పద్యములు.

చ. "పగ యడగించు టెంతయు శుభం బది లెస్స యడంగు నే పగం
బగ వగగొన్న మార్కొనక పల్కక యుండగవచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవ బగ దీర్పగ వచ్చిన గ్రౌర్య మొందు నే
మిగతి దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా
(5 3.21)

ఉ. కావున శాంతి బొందుటయు కర్జము దానది యట్టులంతె శ్రీ
గావలెనంచు బోరితము గామియు గోరెద మెల్ల సొమ్ములుం
బోవుటయుం గులక్షయము పుట్టుటగాన్ వెలిగా గనొందుమై
నేవిధినైన జక్కబడు టెంతయు నొప్పుం జుమీ జనార్దనా!"
5.3.22)

ఈ రెండు పద్యములును నిర్మాణము నందును, విషయ ప్రతిపాదనము నందును సజాతీయములు, తన నిశ్చయమును ఎదుటివాఁడు ఒప్పుకొనునట్లు చెప్పెడి పద్ధతికి ఈ పద్యము లందలి వాక్యసంవిధానము చక్కని దృష్టాంతము. పై పద్ధతిలో కానవచ్చు అంశములివి. ఒకటి అభిప్రాయప్రతిపాదనము. రెండు :- స్థిరీకరణము (లేక ధ్రువీకరణము). మూడు :- పూర్వపక్షప్రతి సమాధానము (ఖండనము). నాలుగు :- నిశ్చితార్థస్పష్టీకరణము.

“పగ యడఁగించు టెంతయు శుభంబు' అని తన అభిప్రాయమును ధర్మజుఁడు తొలుదొల్త ప్రకటించెను. పిదప ఆ అభిప్రాయమునే 'అది లెస్స' అని తానే బలపఱచెను. ఎట్లు అను ప్రశ్న ఇందు లేదు. కాని ఆ ప్రశ్న నూహించుకొని ధర్మజుఁడే సమాధానము నొసంగినాఁడు. 'అడంగునే పగన్ పగ'-పగతో పగ తీరదు, కనుక అసలు పగలేకుండుటయే ఉత్తమ మార్గము అను ఉద్దేశము నిట వ్యంగ్యము గావించి, 'పగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే' అని పూర్వము ప్రతిపాదించిన 'అడంగునే పగం బగ' అనుదాని నిపుడు ఖండించెను. ఎదుటివారు ఎదిరించి వచ్చినపుడు వారిని అణచినను క్రౌర్య మొందును గనుక ఏమి గతిఁ దలంచినను పగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!' అని తాను ఒక ఫలితార్థమునకు వచ్చి తన ఆలోచనాక్రమములో వాక్యములను గూర్చి ఆ నిశితార్థమునకే ఎదుటివారు సైతము వచ్చునట్లుచేసెను. ఇందు 'అడంగునే పగంబగ' 'పగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే' అను ప్రశ్నార్థరూపక' వాక్యములు వక్తయొక్క ఆలోచనా వ్యగ్రతను సూచించుచు, వినుచున్న వారు తదనుకూల సమాధానములనే అంగీకరించునట్లు చేయుచున్నవి! 'అడంగునే పగంపగ' అన్నప్పుడు 'అడంగదు' అను ప్రత్యుత్తరమునే ధర్మజుఁ డాశించినాఁడు అనుట స్పష్టము. “కావున శాంతి పొందుటయ కర్జము” అని తన అభిప్రాయమును ప్రతిపాదించి 'తా నది యట్టులుండె' అని దానిని ధ్రువీకరించి వదిలివేసెను. యుద్ధము లేకపోవుటనే కోరుకుకొంచము అని తన అభిలాషను వెల్లడించి 'ఎల్ల సొమ్ములుం బోవుటయుం గులక్షయము పుట్టుటయున్ వెలిగాఁగ నొండుమైనేవిధినైనఁ జక్కబడు టెంతయు ఒప్పుజుమీ జనార్దనా' అని తన అభిలాషను శ్రీకృష్ణుఁ డంగీకరించునట్లు వాక్యమును సంతరించెను. నెయ్యము అనిన సరిపోదు గనుక 'ఒండుమై

సేవిధినైన' అని సంధిని వాచ్యముగా గాక వ్యంగ్యముగాఁ దెలిపెను. యుద్ధము వలని నష్టములు ముఖ్యముగా రెండు: అని ఎల్లసొమ్ములుం బోవుటయును, కులక్షయము పుట్టుటయును. అందువలననే వానిని ప్రముఖ ముగా పేర్కొని అవి గాకుండగా వేఱు విధమున ఒక్కఁ జెట్టుమని పలికినాఁడు. ఒప్పు జుమీ జనార్దనా' అనుటలో జనార్దనుని తన అభిప్రాయము సంగీక రింపు మను అభ్యర్థనము గన్పట్టును.

పై రెండు పద్యములు ఒకటి యుద్ధమును గుఱించి, రెండవది శాంతిని గుఱించి చెప్పినవి. ఇందు వాక్యనిర్మాణము కొంత సజాతీయము. రెండవ దానిలో ఒకేక్షన్ని వాక్యములో నిశ్చయార్థము చెప్పఁబడినది. నన్ను అంగీకరించు చుంటయు శుభంబు - కావున శాంతిఁ బొందుటయ కర్జము అను నిశ్చయ మున కీ పద్యములందలి వాక్యములన్నియు దోహదము చేయుచున్నవి. ఇవి అర్థప్రధానములైన వాక్యములు. ధర్మజుని మనోగత మగు మీమాంసను ఈ వాక్యములు స్పష్టముగా ప్రతిబింబించుచున్నవి. అట్లగుటచే నిచట వాక్యౌచిత్యము నిర్వహింపఁ బడినదని చెప్పవచ్చును.

ధర్మజుఁ డిచట ఆలోచించుచు, మాటలాడుచుండుట ఆ వాక్యముల విరుపులలో తెలియుచున్నది. ఒక వాక్యమును నుడివి కొంతసేపాగి రెండవ వాక్యమును పలికినట్లు నిపించును - మొదటిపద్య మిందుకు సాక్ష్యము. ఒక నిశ్చయమునకు వచ్చి, తన ఆలోచననే జనార్దనుఁడు సైతము అంగీక రించునను అభిలాషలో పలికినది రెండవ పద్యము. కనుకనే ఈ రెండును తిక్కన వాక్యనిర్మాణవైభవమునకు ప్రతీకలైనవి.

ఎదుటివారు చెప్పినదానిని వాచ్యముగా త్రోసివేయక ప్రక్క బెట్టి తన అభిప్రాయమునే ప్రముఖముగా జెప్పుట వాక్యకోవిదుల పద్ధతి. ధర్మజుఁడు వాక్యములపద్ధతి ఎఱిఁగినవాఁడు. సంజయుఁడు ఎన్నియోవిధ ముల సంధికొడంబఱుప యత్నించినాఁడు. కౌరవుల బలపరాక్రమములను సైతము ముగ్గడించి 'వశంబె జయింప వారి నేరికిన్' అనినాఁడు. అన్నిటికన్నను ఈ వాక్యము ధర్మజుని మనమున నాటినది. దానికి ప్రత్యుత్తరము నిచ్చుచు ఎంత నిరసనను ఎట్లు వ్యంగ్యమొనర్చెనో ఈ క్రిందిపద్యమునందలి వాక్యముల కూర్పువలన తెలియుచున్నది

"చ. రణములవారలన్ గెలువరాదను పల్కు లటుండ నిమ్మ సద్గుణుఁడవు నీవు వచ్చితి ప్రకోపశమంబుగఁ బల్కితింక సై
రణ దగఁ జేయువారము పరాభవ మొందియు మున్నవారిదు
ర్గుణము లుసైచు టీవునొక కొంత యెఱుంగుదు వింతయేటికిన్"
5-1-325

"రణముల వారలన్ గెలువరాదను పల్కు లటుండనిమ్ము" 'అటుండ నిమ్ము' అనుటలోనే ధర్మజునకు సంజయుని పల్కులందేర్పడిన వైముఖ్యము వ్యక్తమగుచున్నది. కౌరవులను పాండవులు జయింపఁగలరను విశ్వాసము ధర్మజునకు పూర్తిగా కలదు. అందువలననే బలాబలములప్రసక్తినటుండ నిమ్మని త్రోసిపుచ్చి సంజయుని తమవైపు త్రిప్పుకొను ప్రయత్నమును ప్రారంభించినాఁడు. ఎదిరిదూతను మాటలతో జయించునేర్పు ధర్మజునికి కలదని ఆవాక్యవిధానమే తెలుపుచున్నది. 'సద్గుణుఁడవు నీవు వచ్చితి' - వచ్చుటయేగాదు - ప్రకోపశమంబుగఁబల్కితి' - కనుక - 'సైరణదగఁజేయు వారము' - అంతేగాదు - (ఇతఃపూర్వమును) 'పరాభవ మొందియు మున్నవారి దుర్గుణములు సైఁచు టీవు నొకకొంత యెఱుంగుదువు' - అట్లగుచో - 'ఇంతయేటికిన్', వాక్యము లొకదానితో నొకటి ఎట్లుక లుపఁబడినవో పైన చూపఁబడినది. ఆ విధమగు మాటలు శాబ్దికముగ లేకపోయినను భావములో ఊహింపవచ్చును. 'ఇంతయేటికిన్' అనుమాటతో ముగించుట వలన - నీవు ఇంతదీర్ఘముగా ప్రసంగించుటవలన ప్రయోజనములేదు. రాజ్య భాగము లేక సంధి కెట్లు అంగీకరింపఁగలము అను వ్యంగ్యార్థము బోధపడుచున్నది. సంజయుని వ్యక్తిగతముగా మెచ్చుకొని, అతని దౌత్యోద్దేశమును నిరసించినట్లు స్పష్టము. సంజయుని పల్కులనుగూర్చి ఆద్యంతములలో రెండు వాక్యములు, అతని ఉపశమనవాక్యములనుగూర్చి రెండువాక్యములు, ఆ పిమ్మట వారు చేసిన పరాభవములకు తాము 'సైరణ' చేయుటను గూర్చి మఱి రెండువాక్యములు గలవిందు. అవియన్నియును ఒకేవిధమైనసూత్రముతో బంధింపఁబడియున్నవి. ఆ ఏకసూత్రము సంధికాదను ధర్మరాజు ఉద్దేశ్యమే, కాని అది వాచ్యము గావింపబడక ఈ ఆరువాక్యముల సంయోగమువలన వ్యంగ్యము గావింపఁబడినది.

ఇట్టిదే మఱియొకటి కలదు-

"ఉ. నెయ్యము దప్ప నెనొండొకటి నీచెవి సోఁకె వె గాదు కల్గ్యాలం
దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి నెక్కదు పూని వారితో
గయ్యము దక్కి మన్కి తగు కార్యము గాదొకొ పోరితంబు లే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొండు సేయునే."

5-1-304

ఇచట గూడ ధర్మజుని అభిప్రాయము 'పోరితంబు లేకయ్యెడు నర్థసిద్ధి " గోరుటయే, కాని అది సాధ్యముగాదు. అట్లని తామై యుద్ధమునకు పూనుకొని నట్లుండుటయు ధర్మజునభిమతము గాదు. అందువలననే కయ్యమును వ్యంగ్యముగా నిరూపించినాఁడు. సంజయుఁ డది గ్రహించి పోరునష్టమని హెచ్చరించుటతో తాను వాచ్యముగా కయ్యము నుద్దేశించ లేదని గుర్తు చేసినాఁడు. 'నెయ్యము దప్పనొండొకటి' అనుటవలన కయ్యమునే కాదు, సంధి అగువిధానమును గూడ ధర్మజుఁడు పలుకలేదని విదితము. తాను మాట్లాడిన దంతయు 'నెయ్యపు' భావ మని ధర్మజుఁడు నొక్కి పలుకుట 'నెయ్యము దప్ప నొండొకటి' యనుటలో స్పష్టము. తామై కోరినట్లుకాక 'పోరితంబు లేకయ్యెడు సర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొండుసేయునే' అని ఇచట తన ఆధిక్యమును వ్యజ్యమానము చేసెను. 'ఒండు సేయునే' అనినప్పుడు గూడ కయ్య మనియే అర్థము. వ్యంగ్యముగా అర్థసిద్ధి లేనిచో పోరుతప్ప దని నిర్ధారించినాఁడు. వ్యంగ్యవాక్యరచన ధర్మజుపాత్రమునకు తిక్కన కల్పించిన మెఱుఁగు. అర్థసిద్ధిలేక నెయ్యము సిద్ధించ దని వ్యంగ్యముగాఁ బలుకుటయే గాక 'అనికి నిమ్మెయి నుక్కెదు' అని సంజయునే ఎత్తిపొడిచినాఁడు ధర్మసుతుఁడు. తమకు యుద్ధమును గూర్చిన 'ఉలుకు' లేదని ధర్మజుని విసురు కాబోలు :

"మ. పలుకం డెక్కడఁ జూచె నొండెడ నసేవ్యజ్ఞ్మజనుల్ పుట్టవే
ఫలితంబై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్

విలసచ్ఛాయను పాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యాభూజము వంటకట్టెయలకై ఖండింపఁగా నేటికిన్"
4-2-186

భీమసేనుఁడు 'కీచకసంబంధబద్ధుండును నాజ్ఞాపాలకుండును గావున మత్స్యాధిపుఁ దనయలుకలోని వాఁడు కాఁ దలంచెను. సమీపముననే యున్న ఒక వృక్షమును పెకలింపఁబూనెను. భీముని ప్రయత్నమును వెంటనే నివారింపవలెను, లేకున్న సమయభంగ మగునని తలంచిన ధర్మజుఁడు త్వరితముగా, ఉద్వేగముగాఁ బలికెను. ఈ సంగతిని ఈ దీర్ఘవాక్య నిర్మాణము సూచించుచున్నది. మత్తేభప్రయోగము గూడ భీమసేనుని ధర్మజుని ఈ పలుకులు అంకుశములై సోఁకినవి-ఇట మత్తేభమును ప్రయోగించుటలో వృత్తౌచిత్యమున్నది. సాధారణముగా ధర్మజుపాత్ర సరళముగా తిక్కన చిన్నచిన్న వాక్యములను, ఆలోచించి పలుకఁదగిన విరుపులతో కూర్చుచుండును. కాని, ఇచట తద్భిన్నమగు వాక్యవిన్యాసము కలదు. ఈ మార్పు ప్రకరణము ననుసరించి చేయఁబడుటచే నిట ప్రకరణౌచిత్యము కలదని గుర్తింపవచ్చును.

'వలలుం డెక్కడ జూచె' అనుటతోడనే భీముఁడు తన యత్నమును తాత్కాలికముగా విరమింపవలసివచ్చినది. 'ఒండెడఁ నేవ్యాత్మజముల్ పుట్టవే' అనఁగా దీనిని వదలివేయుము అనునర్థము సాభిప్రాయముగా 'పుట్టవే' అను క్రియను కాకుస్వరవిలసితముగాఁ బలుకుటలోనే వ్యజ్యమానమగును' ఆపై తాను ఆ సూచన చేయుటకుఁ గల కారణములను పేర్కొని తన సూచనను తానే సమర్థించుకొనెను. ఈ సమర్థనలో గూడ ద్వంద్వార్థములు గలవు. వాచ్యార్థము వృక్షపరమైనది కాగా వ్యంగ్యార్థము విరటుని పరముగా అన్వయింపఁబడునది, బంధుమిత్ర జనములతో కూడి మనుచు, వారికి అనల్ప ప్రీతిని కల్గించుచు తన ఆశ్రయములో తమకు కూడ రక్షణ కల్పించిన విరటుని ఒక అల్పకార్యమునకై వధింపఁబూనుట వ్యర్థము, అనుచితము అని ధర్మజుఁడు భీమునకు తెలుపఁ దలచిన వ్యంగ్యార్థము. ఇచ్చట వర్ణించిన భూజము 'విరటుఁడే!' ఆ నేవ్యాత్మజము అనగానికాట కీచకుని పరముగాఁ జూచినచో లోకమునకు గాని స్వజనులకుగాని, హితకారికాని

వాఁడు అని భావింప వచ్చును. అతనిని బండెడ చంపుట ఉచితమని ఇందు నిగూఢముగా చెప్పబడినది. ఇది 'నిగూఢభాషణము'లని తిక్కనయే తదనంతరగద్యమున బలికియుండుటయు సమన్వర్థము.

ధర్మరాజు వాక్యములు అన్యాపదేశములు. వృతమని పలుకుఁడని అనుట లోకుల కొఱకు [illegible] భీముఁ డద్దానిని గ్రహించుట జరిగినది. [illegible] స్పష్టమైన అర్థమును [illegible] భీమసేను [illegible] ధర్మజుని వాక్యచాతుర్యము ధ్వనిప్రధానమైన [illegible] ఈ సన్నివేశము శిఖరప్రాయమైన యుదాహరణము.

ఇచ్చట విరటు నుద్దేశించి [illegible] టన్నే ఆ వృక్షమును '[illegible]' అని ఏకవచనములోను, కీచక, ఉపకీచకుల నుద్దేశించి 'అనేకశస్త్రాస్త్రములు'లని బహువచనములోను [illegible] వచనౌచిత్యము. వచనౌచిత్యమునకు మరొక చక్కని యుదాహరణము–

క. నాకొడుకు పోటుమాటలు
నీ కేటికిఁ బొసఁగ నాడనేరవు మౌర్ఖ్యో
ద్రేకమునఁ బలుకుచుండుట
మాకు సహింపంగ గాదు మానుము విప్రా! (4 5 255)

ఇచట విరటుఁడు తనను 'మాకు' అని బహువచనమునందును, పూజింపఁదగిన కంకుని 'నీకు' అని ఏకవచనమునందును వ్యవహరించినాడు. సాధారణముగానైనచో ఇది అనుచితముగా నెంచవలసివచ్చును. కాని ఈ సందర్భమున విరటుం డిట్లు పలుకుట పరమౌచిత్యము. రాజుల కోపము యుక్తాయుక్త విచక్షణను కోల్పోవఁజేయునట్టిది. కుమారునియందు [illegible] విశ్వాసముగల రాజునకు కంకుని పలుకులు ములుకులై నాటినవి. అతని కోపము నిగ్రహింపఁబడలేదు, అనగా ఇట మౌర్ఖ్యోద్రేకమునఁ బలుకుచున్నది విరటుఁడే అని విదిత మగుచు చమత్కారమును కలిగించుచున్నది. పాత్ర మనస్తత్త్వమును ఆ సందర్భమును పరికించిన తిక్కన విరటునిచే ఏక, బహు వచన భేదములతో వ్యవహరింపఁజేసి వచనౌచిత్యమును పాటించెను. 'మాకు' అను బహువచన వ్యవహారము విరటుని అహంభావమును పట్టి ఇచ్చుచున్నది

అర్థగంభీరములైన వాక్యములను ధర్మజుని తరువాత ద్రౌపది పాత్రోచితముగా తిక్కన రచించినాఁడు. స్త్రీ సహజమగు నిష్ఠుర వాక్య విధానము ద్రౌపదికి తగియున్నది. రాచపుట్టువు వలన ఠీవి, అవమాన పరంపరల వలన ఆవేదన, పతుల సైరణవల్ల చులకన ద్రౌపది పలుకులకు శోభించు చుండును.

"ఉ. అంతలు సేసి పోనడిచి యిక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టి యీయట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు దా
నంతన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంత కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్"
5 ఉ.101

వ్యంగ్య మిందు వేయిముఖముల విస్తరిల్లినది. నాలుగు పాదములలో నాలుగు వాక్యములు గలవు. వారి చేతలకు దుఃఖించినది తొలుత. పిదప ధర్మజుఁ డద్దానికి ప్రియమందె నని నిష్ఠుర మాడినది. సుయోధనుఁ డైదూళ్లు 'ఇచ్చునొక్కొ' అని సంశయమును వెలిబుచ్చినది. చివఱగా 'ఈ కంతకృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్' – అని ముగించినది. ఈ చివరి వాక్యములో భాగమియక కృపావిహీనమతితో అంతగా అన్నదమ్ములను నొప్పించునా అను వాచ్యార్థముకంటె కృపావిహీనమతియైన సుయోధనుఁడు అన్నదమ్ములను సుహృద్భావముతో వీరిని నొప్పింపక ఊళులేవురు ఇచ్చుటయా–అది అసంభవము అను వ్యంగ్యార్థము ప్రకృష్టముగా బోధపడుచున్నది. 'పుత్తెంతురె' 'ప్రియమందె' 'ఇచ్చునొక్కొ' 'నొంచునె' అను క్రియాపద ప్రయోగములోనే ద్రౌపది అనిష్టత, నిరసన, సంశయము, వ్యంగ్యము వరుసగా అవగత మగుచున్నవి. ఇట్టిది 'క్రియా పదౌచిత్యము' అని ఎన్నదగియున్నది. ఈ వాక్యవిధానము 'అంతలు' సేసి పోనడిచి అను మాట 'ఇంతలు పుట్టించోటను' అను ధర్మజుని పలుకును బోలియుండుట గమనింపఁదగియున్నది. అవ్యయ పదమును ఇంత విస్తృతార్థ గర్భితముగా ప్రయోగింపఁజాలిన ప్రతిభ ఈ వాక్యములందు కనఁబడుచున్నది.

పాండవ పౌరుషము నుద్దీప్త మొనర్చుటకు ద్రౌపది పల్కిన అధిక్షేప వాక్యములు భారతమున వాడిని, వేడిని సంతరించికొనిన పాత్ర సంభాషణ ములకు ఉదాహరణములుగా రాజిల్లుచున్నవి. మచ్చునకు కొన్ని-

1. వారు బ్రాహ్మణులె యేకిడైన సైరింతురే!
2. పిఱికిడైన మానికికి వెండి వివేకము గల్గనేర్చునే'

"ఉ. ఓట యొకింతయేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనగాక యి
చ్చోటన సంగరంబు లగు చొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానల నుండ నచ్యుతా!"

1 3 104

ద్రౌపదివాక్యముల తీరునకు ప్రతీక అనదగియున్నది ఈ పద్యము. కౌరవుల స్వభావమును పాండవులకంటె మిన్నగా అర్థము చేసికొనిన ప్రౌఢ రాజ్ఞి ఇచ్చిన తీర్పు ప్రథమార్ధమునందును, ఇతుల సంధిపలుకుల కిచ్చగింపని కులసతి చందము ద్వితీయార్థభాగము నందును ప్రతిఫలించినవి. 'ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందులేదు' 'ఒకింతయేని' అను పద మీ వాక్యమునకు ప్రాణభూతము. ఇది 'పదౌచిత్యము' నకుదాహరణముగా నెంచదగిన సార్థకపదము. ఓట యొకింతయేని లేని సుయోధనునకు నీమా టల వలన దురభిమానము పోవదు సరిగదా ఎక్కుడుపూనుగాక'. పోవునే దురభిమానము ఎక్కుడు పూనుగాక' అనుచో దురభిమానము కర్తృపదము పోవునే, ఎక్కుడు పూనుగాక అను రెండు క్రియాపదములతోడను అన్వయింపఁ దగి రెండు వాక్యములతోను సంబంధించి యున్నది. 'అచ్చోటన సంగరంబు లగుచొప్పులు పుట్టిననైన' అని వాక్యముసాగి నిలిచినది. 'ఐన' అను పదము ఒక వాక్యాంతమును, మఱియొక వాక్యారంభమును సూచించుచున్నది. ఇచట ద్రౌపది 'అచ్చోటన' అన్నప్పుడు 'అచటనే' సంగరంబులగు చొప్పులు పుట్టు నని నిర్ధారణకు వచ్చి 'ఐనను' అని కొంత తడవాగి 'పాండవుల్ పోటున కిచ్చగింతురొకో పోదురో కానల నుండ నచ్యుతా' అని శంకనాత్మకముగా సంశయములను వెలిబుచ్చినది. 'ఇచ్చగింతురొకో' అనుటలో పోటునకిచ్చ

గించుట ఆమె అభిమతమని 'పోదురా కానలనుండన్' అనుటవలన ఇకార్యము అనిష్టమని కాకువువలన బోధపడును. పాత్రోచితమగు నీవాక్యవిధానము వాక్యౌచిత్యమే. మొదట పాండవుల సుద్దేశించి అట్లుపలికిన పాంచాలి పిదప శ్రీకృష్ణునితో తనమనసును సూటిగా విప్పిచెప్పినది. అట వాక్యవిధానమున కాకువు నాశ్రయించి అర్థదీప్తి కలిగినది. ఇట వాక్యములు ఒక దానివెంట ఒకటి కూర్పబడి వేగముగా సాగి ఆమె ఆవేగమును ధ్వనింపజేయుచున్నవి. ఈ ఘట్టమున క్షత్రియకాంతయగు ద్రౌపది పలుకులు క్షత్రియోచితమగు స్వాభిమానముతో, కించిత్ గర్వముతో కూడియుండుట జరిగినది – ఇట్టిది కులౌచిత్యము.

"చ. వరమున బుట్టితిన్ భరతవంశము జొచ్చితి నందు బొందు భూ
వరునకు గోడలైతి జనవంద్యుల బొందితి, నీతి విక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపుగాంచితిన్
సరసిజనాభ యిన్నిట బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్."
5-3-108

"ఉ. నీవు సుభద్రకంటె గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టినను పంకజనాభ యొకండు రాకసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణివట్టి యీ
యేవురుజూడగా సభకు నీడ్చె గులాంగన నిట్లొనర్తురే."
5-3-110

పై రెండు పద్యములు ఎచ్చటనైనను జంటగానే పేర్కొనబడు చుండును. అవి రెండును విడదీయరాని అర్థబాంధవ్యమును కలిగినట్టివి. కాని, వానియందలి వాక్యములు నిర్మాణమునందును, గమనమునందును అత్యంత భిన్నములు. అట్లయ్యును, అవి అర్థసంబంధమున ఒక్కచో ఉదాహరింప దగియున్నవి. ఒకటి ద్రౌపదిప్రశస్తిని దెలుపునది. రెండవది ఆమె అనుభవించిన ఘోరపరాభవమును వివరించునట్టిది. ఒక్కచోట పేర్కొనబడుటచే అంతటి ఉత్తమురాలి కెంతటికష్టము కలిగినదను భావము సహృద

యూంచరంగమున నట్టిల్ల తనవలె మెఱయును. కథలో శ్రీకృష్ణునకును అట్టి భావము, తద్దీప్తి ఆమెపై సానుభూతి, ఆమె కట్టియవమానమున కగ్గము చేసిన కౌరవాదులపై ఆగ్రహమును కలిగి సంధికై గాక యుద్ధమునకే ప్రయత్నము చేయును. ద్రౌపది ఈ రమార్థము నుద్దేశించియే తొలుత తన ప్రాభవమును విపులముగాఁ దెలియఁబలికి పిమ్మట అత్యంతోద్వేగముగా తన అవమానమును గుర్తుచేసినది. మొదటి పద్యమున ఇతరులవలన, అనఁగా నామ స్వజన భర్తృ, సంతానముల యోగ్యతలవలన ఏర్పడిన ప్రాశస్త్యము ప్రదింపఁబడగా రెండవదానియందు తనవ్యక్తిత్వగుణములవలన సంపాదించుకొనిన శ్రీకృష్ణుని వాత్సల్యము చెప్పబడినది. ఇది తొలి పద్యమున పేర్కొనఁబడిన ప్రశస్తికంటె శ్రేష్ఠతమమైనది. 'నీవు సుభద్రకంటెఁ గడునెయ్యమునాదవ ముందఱ సంభావన సేయుదు'—ఇంతటితో ఆవాక్యము ముగియవలసియున్నది. కాని ద్రౌపది ఉద్వేగము పెరిగినది క్రమక్రమముగా. తొలుత నిష్ఠురోక్తులతో ప్రారంభించి, పిదప స్వీయప్రశస్తిని దెలుపుకొనునంతవఱకు నిదానముగా పలికినది. తన అవమానము గుర్తువచ్చునికి ఆనిగ్రహము సడలి, ఆక్రోశము పెరిగినది. అందువలననే 'సేయుదు దిట్టి నను ఎంకి జనాధముండు' అని వదుసటివాక్యముతో దీనిని మేళవించి త్వరితముగా పలుకఁ దొడగినది. 'చేయుదు' అను క్రియాపదము ముగిసి ముగియుటతోడనే ఇట్టి నను అని పేర్కొనుటచే నీప్రాపుగాంచినవారికికూడ అవమానము తప్పలేదు అను సూచన గలదు. శ్రీకృష్ణుఁడు గౌరవముసేయు చెల్లెలని యొకఁడు అవమానము చేసినాఁడు—అనునది ఆ రెండువాక్యముల సారాంశము. రెండువాక్యముల సంవిధానము వలన అవమానము కృష్ణునిదే అన్నట్లు స్ఫురించుచున్నది. అట్లు చెప్పుటయే ద్రౌపది ఉద్దేశ్యము. 'చేయుదుదిట్టినను' అనువిధముగా నా రెండువాక్యములను మేళవించి పలుకుటలో ఆమె ఉద్దేశించిన ప్రయోజనము నెరవేరినట్లైనది. రాజసూయయాగమున పూజింపఁబడినది శ్రీకృష్ణుడు. అది వైష్ణవయాగము. అట్టియాగమున అవభృథస్నానముచేఁ బవిత్రములైన ఆమె శిరోజములను బట్టిలాగుట ఆదైవమునకే ధిక్కారము. శ్రీకృష్ణుని నమ్మిన వారికైనను తీరనిఅవమానము అనునది ఆమె యోగముము పేర్కొనుటలోఁగల ధ్వని. శ్రీకృష్ణుని వాత్సల్యమునకు ద్రౌపది అర్హురాలను అంశము మొదటి పద్యములో ప్రతిపాదింపఁబడగా, ఆమె అవమానము ఆ అన్నకుకూడ అవ

మానమని రెండవ పద్యమున స్థాపింపఁబడినది. అన్నచెల్లెండ్రకేగాక ఆమె పరాభవము లోకధర్మమునకే విరుద్ధమైనదని 'కులాంగన నిట్లొనర్తురే' అను నర్థాంతరన్యాసము సమర్థించుచున్నది. దుశ్శాసనుని నామముచ్చరింపబడక పోవుట కూడ ఇట నామౌచిత్యమే అనవచ్చును. తొలిపద్యమునందలి చిఱు వాక్యములు ద్రౌపది అంతరంగమున ఎగసిన అలుకకాగా మలిపద్యమునందలి వాక్యసంవిధాన మామె అంతరంగమున ఏర్పడిన కల్లోలము వంటిది. 'రాజసూయావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణి' అను దీర్ఘపాదము వేణిదైర్ఘ్యమును కనులకు కట్టునట్లు చేయుచున్నది.

'ఈరేవురుఁ జూడఁగా సభకు నీడ్చె' అనునది ఈపద్యమునకే మకుటము. ఏలన పతులులేని సమయమున సతి అవమానింపఁబడుట అంత విచిత్రముకాదు. అది లోకమున సామాన్యముగా జరుగునట్టిదే. కాని ఇచట లోకోత్తర పరాక్రమవంతులగు ఏవురుపతులు చూచుచుండఁగా వారి సతి బలములో వారికి సరితూగని ఒక అల్పునిచే ఈడ్వఁబడినది—అనగా ఇది ఒక విస్మయకర విషయము. ద్రౌపదిబాధకు అసలుకారణ మిదియే. అందుచే నిట తన అలుకను బయటపెట్టినది. 'ఈరేవురు' అనుటలోనే ఆమెకు వారిపైఁగలిగిన అలుకయొక్క తీవ్రస్వరూపము బోధపడుచున్నది. వీరిని నమ్ముకొనియుండుట ఫలములేని వ్రతమైనది ఆనాడు. 'గోవింద' కావుమంచు నాడే నిన్నాశ్రయించితిని గదా అని శ్రీకృష్ణుని శరణుజొచ్చినది ద్రౌపది. ఇట 'ఈడ్చె' అను క్రియాపదము ఆమెకు ఆజరిగినకార్యమువలని కలిగిన బాధను, ఆర్తిభావమును తెలుపు సార్థక పదము. వాక్యసంయోజన, సంవిధానములు వక్తృప్రయోజన సాధన సమర్థములుగా నుండుటయే ఇచట ఔచిత్యము.

"చ అరయమిఁ జేసి కోడలన కప్పుడు బాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు దోవఁగ వీరలతోన యేను దె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడిమై
వరవుడ మోపి చేయదునొ వారికి మాధవ నిశ్చయింపుమా"
5.3.112

చ్చెరఁజుని కోటరంబు దగఁ జేయుదునో యటుగాక పాడిమై
వరవుడ మోపిచేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమా."

5.3.112

‘అరయమిఁ జేసి’ — ఆలోచనలేమి వలన అనుటకు మారుగా ‘అరయమిఁ జేసి’ అని ప్రయోగించుటవలన ఆలోచింపఁగల శక్తి, అవసరము కలిగియు ఆలోచింపనివాఁడై అను నర్థము స్ఫురించుచున్నది. ‘అమ్మహా పురుషుని’ అనుటలో వాచ్యార్థము గౌణము, వ్యంగ్యార్థమే ప్రధానము. ‘ఆ పెద్దమనిషి’ అని హేళనగాఁ బలుకుట తెలుఁగుభాషలో సామాన్యము. ప్రజలకు సన్నిహితమగు ఇట్టి వాక్యవిధానము, పదప్రయోగము తిక్కనభాషకు జీవగఱ్ఱలు.

పద్యమునందలి రెండవ, మూడవ వాక్యములు ‘అటుగాక’ అను పదముతోఁ గలుపఁబడినవి. రెండు వాక్యములలోను క్రియాపదము ఒక్కటే— అది ‘చేయుదునో’ అను క్రియార్థక రూపమున నున్నది. కాఁగా ద్రౌపదికి ఆరెండు కార్యములును అనిష్టములై యుండుట గమనింపఁదగియున్నది. కోటరంబు నగ చేయను, వరపుడమోపి చేయను—అని ఆమె అంతరంగమున నున్న అసలు భావము. ‘నిశ్చయింపు’ మని మాధవుని అడిగినది. అనఁగా అతఁడా రెండు కార్యములను జేయ నియోగింపఁడని ఆమెకు తెలిసి పలికిన దన్నమాట. రెండు వాక్యములిట్లు ‘అటుఁగాక’ పదముతో సంధింపఁబడుటచే నది సంయుక్తవాక్యమనఁదగియున్నది. ఇదేరీతిలో నున్న మఱియొక పద్యము (5.3. 254) (‘అటుఁగాక’ పదప్రయోగము)

"ఉ. నెట్టిన యట్టియల్క మది నిల్పితి రక్కెసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి నాఁటువెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవు తేజమునఁ బోల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా.

5.3.118.

ఈ పద్యమున రెండు దీర్ఘ వాక్యములు గలవు. తన అల్కను గూర్చి ద్రౌపది పలికిన సందర్భమిది. ‘రక్కెసతాల్మిఁ జిచ్చొడిం గట్టిన యట్లు పెద్ద

యును గాలము నెట్టన యిట్టి యల్కమది నిల్పితి' — ఉపమాన పురస్సరముగా మదిలోని అల్కను ఒడిసిపట్టిన జిచ్చుతో పోల్చి చెప్పుట సహజముగా నున్నది. ప్రసిద్ధోపమ వలన వాక్యము దీర్ఘమయ్యును సుబోధకమై ఒప్పినది. 'దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోడబుట్టువు' అని కృష్ణుని ఉద్దేశించి పలుకుట ఇచట అత్యంత యుక్తము. కౌరవులను శిక్షించి మమ్ము గావుమను అభ్యర్థన గూఢముగా, అది కృష్ణుని కర్తవ్యముగా చెప్పబడినది. సార్థక విశేషణప్రయోగౌచిత్య మిది. 'దీనికి ఆఱు వెన్నడుం బుట్టదు' — అరదు అనిన పూర్తి నిరాశతో పలికినట్లగును. పుట్టదు అనిన ఇకముందు అఱుట పుట్ట వచ్చునను ఆశ ద్యోతకమగును. తిక్కన నిశితపరిశీలనావ్యగ్రతవలన ఇచటి వాక్య విధాన మత్యంతము అర్థస్ఫోరకముగా ఒప్పుచున్నది.

ద్రౌపది వలెనే సహదేవుడు సైతము సంధిని నిరసించి యుద్ధమే జరుగవలెనని భావించి పలికినాడు. కాని, వీరోచితమగు నాతని పలుకులు ద్రౌపది మాటల వలె నిష్ఠుర నిర్భీతములుగా గాక సూటిగా శత్రువును కవ్వించువిగా నున్నవి. ఇట్టిదే సదా వాక్యౌచిత్యము.

"ఉ. రక్కెసమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటియైనఁ గాదనక యూఁకొనుచుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేఁడికొన నైనను బోయెద వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా".
(5 3.94)

రక్కెస మాటలాడెదరు రాజును దమ్ములు — వారట్లు మాటలాడుటయే కాని పని కాదగా — వానిలోన నీ వొక్కటియైన గాదనక యూకొనుచుండుట యంతకంటె మేలు — అనఁగా అంతకంటెను తగని పని. 'అక్కట యిట్లు వేడికొన నైనను బోయెదవో' — అనఁగా నీ యంతటివాఁడు ఐదూళ్లిమ్మని వేడుకొనఁబోయెదవా — అను నిరసన ద్యోతకమగుచున్నది. ఇందులో ఐదు వాక్యములు గలవు. ప్రతివాక్యమునం దొక పదము తలమానిక మనఁదగి యున్నది. తొలివాక్యములో తన అగ్రజులను 'రాజును దమ్ములు' అనుపదములో నిరసనగా పేర్కొనెను. మలి వాక్యములో కృష్ణుని 'ఊకొనుచుండుటను'

ఎత్తిపొడిచినాఁడు అకుటిలుఁడైన సహదేవుఁడు. 'అకట — వేశుకొనసైనను బోయెదవో' అని కృష్ణుని ఆశ్చర్యార్థకముగా ప్రశ్నించినాఁడు. 'సుయోధనుం డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా' అను చివరి వాక్యములో 'ఎక్కడ' పదపునరావృత్తి వలన ఆచర్యయొక్క అసంభవత్వమును నొక్కి చెప్పినట్లైనది. 'సుయోధనుఁడు భూమిలోన సగ మిచ్చుట ఎక్కడ' అనిన అతీవ్రత కనరాదు. 'సుయోధనుం డెక్కడ, అని నిలిపి 'భూమిలోన సగమిచ్చుట యెక్కడ' అని పలుకుటవలన ఆకర్త, కర్మల బొసగని తనము వాక్యనిర్మాణములోనే తెలియనగును. 'సహదేవుఁ డింత యొప్పనాడునే' అని ప్రశంసింపఁ జేసినాడు తిక్కన.

సహదేవుఁ డిట్టివాఁడు గనుకనే అతనిని గూర్చి ధర్మరాజు పలికిన పలుకు లత్యంతౌచిత్యమండితములై ఒప్పినవి.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతి నిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు శాంతుఁడు గొంతిముద్దుసే
యుకొడుకు మేను లేఁత దనయుల్లము మెత్తన యట్టి యీ తఁడె
ట్లొకొ యొరునాశ్రయించు విధియొప్పదె యెవ్వరినెట్లు సేయఁగన్"
4-1-98

ఇందు వాక్య నిర్మాణము వలన గాక సార్థక విశేషణముల వలన అర్థస్ఫూర్తి కలుగుచున్న దగుటచే ఇట విశేషణౌచిత్యము కలదు. మూడు పాదములయందు సహదేవుని గుణములు చెప్పఁ బడి అట్టివాఁ డితరుల నెట్లు సేవింపఁ గలఁడనుట వలన ధర్మజుని వేదన ప్రస్ఫుటమగును. 'విధి యొప్పదె యెవ్వరినెట్లు సేయఁగన్' అను నపుడు ప్రశ్నకా దిందు ప్రధానము- ఆర్ద్ర స్వరము.

విశేషణముల వలన ఒకపాత్ర యొక్క సమగ్రవ్యక్తిత్వమును చిత్రింపవచ్చును. అట్లే ఒకే పద్యమునందు విరుద్ధవ్యక్తిత్వములు గల రెండు పాత్రలను గైకొని రెండు పాదములందు వర్ణించి తద్వైపరీత్యమును ప్రస్ఫుటము చేయవచ్చును.

చ. అశుచియుఁ గష్టుఁడున్ లఘువు నైన నిజాగ్రజు మేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు ననాఁ జనునింతి. . 4-3-18.

కీచకునకు ద్రౌపదికి గల అంతరమును విశేషణముల ద్వారా సూచించినాఁడు తిక్కన. ఇందు విశేషణౌచిత్యము పాటింపఁబడినది.

ఇట్టి వాక్యములందు సార్థక విశేషణముల కూర్పు వలన ప్రస్తుతార్థము ప్రకృష్టము గావింపఁబడు నని తిక్కన భావించి విశేషణములను వృత్తములందు లెస్సఁగాఁ పొందుపఱచి యుండెను. వర్ణన అవసరము లేని విధముగా ఈ విశేషణములు ఉండుట వలన వాని సార్థకత ఇంత యని చెప్పనలవి కాదు.

"ఉ. క్షాత్రసమగ్రు లార్యనుత గౌరవదీప్తులు వర్ణనీయసౌ
భ్రాత్రు లుదాత్తదైవబలభవ్యులు దివ్యసమాను లాపృథా
పుత్రులు వారి నాపదలు పొందునె యోపిన నింకనైన నీ
ధాత్రిఁ గడంగి యారయు విధంబులు సెప్పుడు నేర్పు లేర్పడన్"
4-3 98

పాండవులనుగూర్చి ఇంత సమగ్రముగా రెండు పాదములందు చెప్పినాఁడు తిక్కన. ఇట్టివే మఱి రెండు పద్యములు గలవు-

"శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమ బాహువీర్యుఁడు కురుక్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మీశ్రధా మాత్ముఁడు జామదగ్న్య కలిత శ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుఁ డొక చీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్"
4.5.11

"ఉ. ఉగ్రుఁ డనూనమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస ననార్యుఁడు కార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసినప్పుడు పండుపు నాకు నుత్తరా."
4.5.15

"ఉ. సారపుధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షులె
వ్వార లుపేక్ష చేసి రది వారలచే టగుఁగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముఁ డెడున్"

5 3.273

భగవంతుఁడు దక్షు లనఁదగువారికి చేసిన ఉపదేశము—ఇది సార్వకాలిక సత్యము. 'సంభవామి యుగేయుగే' అను భావ మిందు ధ్వని. ఇట్టి ఉన్నత లక్ష్యము గలవగుటచే ఈ పలుకులు గంభీరములు. పద్యప్రవచనము మృదు గంభీరముగా సాగినది. పాత్రను, ప్రకరణమును అనుసరించి రచన సాగుట తిక్కన సాధించిన ఔచిత్యము.

దక్షు లుపేక్ష చేసినచో వారికే చేటు కలుగును. అనునది సామాన్య వాక్య నిర్మాణము. అట్టి విశేషార్థమును గలుగ కవి నిర్మాణమును మార్చినది. 'దక్షులెవ్వా రుపేక్ష చేసిరి ని వారల చేటగు' ఎవ్వారలు అని ప్రారంభించుటతోడనే వారలు అను దానికి పదానుబంధముగా వచ్చునని ఆశింపవచ్చును. ఒకే సామాన్య వాక్యముగా (Simple Sentence) చెప్పఁదగిన దానిని విశేషార్థమును ప్రకటముగా నుండుటకొఱకు సంయుక్త ( Compound sentence ) వాక్యముగా నిర్మించినాఁడు తిక్కన—పదాల భావమునే గ్రహించినను తనదైన వాక్యనిర్మాణ శిల్పముతో ఆ భావమును మంచి లక్ష్యముతో ముద్ర వైచినాఁడిట. ధర్మమునకు 'సారపు' అను విశేషణ మత్యంతసముచితము. అట్లే విమలసత్యమును నెడకారాదు సత్యమునే విమలము చేసి చెప్పినాఁడు భగవంతుఁడు అనిపించును. ఈ వాక్యము పిదప నున్న 'కాని' అను సముచ్చయము కృష్ణుఁడు చెప్పఁబోవు తరువాతి వాక్యమును సూచించునదై యుండి ఒక వాక్యము తరువాత మఱియొక వాక్యమును తెలుపుచున్నది. ముందు వాక్యమునకు, తరువాత నున్న వాక్యము భిన్నమైనపుడు 'కాని' సముచ్చయ పదప్రయోగము జరుగును. సత్యధర్మములు దక్షులచే ఉపేక్షింపఁబడుట తొలివాక్యములో చెప్పఁబడగా అది దైవముచే రక్షింపఁబడుట మలివాక్యములోని సారాంశము.

ఇచట వాక్యములు దీర్ఘములు, అర్థము గంభీరమగుటచే ఆ గంభీర సందేశమున కనువుగా వాక్యములు దీర్ఘములుగా సాగినవి. శ్రీ కృష్ణుని వాక్యములు సాధారణముగా నిట్టివిగానే తిక్కన కూర్చినాఁడు అతని పలుకు లాగమములుగా తిక్కన భావించి యుండుటచే వాక్యములు మధ్యలో విరుగక సాగినవి. నిష్ఠురము, ఆక్రోశము, చింత, వంత ఇత్యాది భావములు వాక్యమును సాగకుండ నిలుపుచుండును. కాని, శ్రీకృష్ణుఁడు అట్టి భావముల కతీతుఁడు. ఇట్టిదే మఱి యొక పద్యము :—

"ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూనియు
న్నా రటుఁగాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండుఁదెఱంగులందు నీ
కారయఁ బథ్య మేదియగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా."

5.3.284

ఇచట చివఱి వాక్యములో ఏది, అది అనుపదప్రయోగము కలదు.

'శాంత శూరులు' అనుసమాసపదము ఈ పద్యమున కాధారభూతము ఎట్లనగా వారు శాంతులు కనుక నిను గొల్వపూనియున్నారు. అది నీ కిష్టము గానిచో పోరికి సిద్ధమైయుండి వచ్చుచున్నారు. ఈ రెండింటిలో, అనఁగా వారి శాంతత్వశూరత్వములలో పదనుగుణచర్యలలో నీ కేది ప్రియమో చెప్పుము. పద్యమంతయును 'శాంతశూరు'లను పదము నను సరించియే నడచిన దగుట పదౌచిత్యమును గలదని చెప్పవచ్చును.

"ఆ. పాండవులకుఁ దగిన పాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్దిగలదు
ధర్మ మెద్ది సముచితంబగు విధమెద్ది
శక్యమెద్ది చెప్పఁడ వాక్యవిదులు"

5.3.275

ఇందీ 'వాక్యవిదులు'లను పదము సార్థకము. 'న్యాయవేత్త' లని ఇచట భావము. శ్రీకృష్ణుఁడట్లు డుగుటలో ఆతనికంటె వాక్యవిదుఁడు లేఁడను

విశేషము స్ఫురించును. ఇందు నాలుగు ప్రశ్నార్థకవాక్యము లున్నవి. సమాధానము రాని ప్రశ్నలే అవి అన్నియును. ఇంతకంటె కార్యము లేదు, ధర్మము లేదు, సముచితతరమగు విధము లేదు, శక్యము లేదు అను అర్థాంతరము వాచ్యము గావింపఁబడకయే ప్రస్ఫుటమగుచు సహృదయాంతరంగములను. కృష్ణుని పాత్రకు ఇట్టి గంభీరవాక్యనిర్మాణమువలన నొబగు సమకూడినది. పాత్రోచిత భాషణము వాక్యౌచిత్యమునకు పరమావధి.

"చ. అనయము పుట్టెఁ జూదమున యప్పుడె యెంతయు నొచ్చి చిచ్చు పెట్టికా
ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకున్
వినఁడును గానఁ డుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే."

5.2.14

ధర్మజునిఁ గని వచ్చిన సంజయుఁడు తన రాయబారపు ఫలితమును ధృతరాష్ట్రునకుఁ దెలిపినాఁడు. రాయబారి రాజునకు విన్నవించెడి సంగ్రహసారాంశ మెట్లుండవలెనో తెలుపు పద్దె మిది. "హితం మనోహారి చ దుర్లభం వచః" అను భారవి పలుకు లెంతయు సత్య మనిపించును. ఇందు సత్యనివేదనము ముఖ్యము; సంగ్రహసూత్రమువంటి వాక్యరచనము కర్తవ్యము. కార్యకారణ సంబద్ధమైన వార్తను నివేదించుట ఇందలి నిష్ఠ. ఇది సంజయురాయబారపు సారాంశమే కాదు; భారతకథా సారాంశము.

జూదమున పుట్టినది 'అనయము'. ఇది సార్థక శబ్దము. అశుభము. ఆపద, దుర్గృష్టము, అవినీతి మొదలైన అర్థములు దీనికున్నవి. ఏ యర్థమైనను అది అనర్థమే. దానితో నెత్తుకొనినాఁడు వాక్యము. రాయబారము విఫలమైనదని ధ్వని; కీడు మూడనున్నదను సూచన అందుఁ గలదు. ధర్మసూతికి ద్యూతమువలన అధర్మము జరిగినదని ధ్వని; ఆపై ధృతరాష్ట్రుని యుపేక్ష ధర్మజుని చిత్తమును చిచ్చుపెట్టి కాల్చినదని భావము. జూదము నిమిత్తము, ఉపేక్ష ఉద్దీపనము, దానివలన ధర్మజుఁడు మండిపడియుండవలసినది. కాని, అతఁడు వశీకృతచిత్తుఁడు. బడబాగ్నిని దాచుకొనఁ గలిగిన ధీర సముద్రుడు. వశీకృతచిత్తుఁడైన ధర్మజుఁడు సంయమి కాడు; అతఁడు మెత్తని

పులి. మెత్తఁదనము సహనమును తెలుపును; పులి యను మాట పౌరుషమును వ్యంజింపఁ జేయును. అదనుకొఱకు వేచియుండు పౌరుషవంతుని 'మెత్తని పులి' యను జాతీయముతో వ్యక్తపఱచినాఁడు. ధర్మజపాత్రప్రవృత్తిని రెండు మాటల సమాసములో వ్యక్తపఱచిన నిర్వచనమున భూతోనభవిష్యతి. ధర్మజుని సహనము ఎల్లవారలు నధర్మము ధృతరాష్ట్రునిపై నుంచువఱకు మాత్రమే. లోకులు కౌరవులను నిందించినచో ధర్మజుని ధర్మము ప్రకాశమగును. అంత వఱకు అతఁ డెన్ని చెప్పినను వినఁడు; కానఁడు. వినఁడును, కానఁడును-అను క్రియల కనుబంధముగా నున్న సముచ్చయములు అత్యంతసార్థకములు—వినినైన వినఁడు, కానినైన కానఁడు—అని వాని తాత్పర్యము. ఈక్రియల జంట తెలుఁగునుడికారము నాశ్రయించి తిక్కనచే ప్రయోగింపఁబడినది. మన్నింపఁడు, లక్ష్యపెట్టఁడు అని తాత్పర్యము. నీ నెయ్యపుమాటలు వినఁడు, నీ బంధుత్వమును చూడఁడు అని సందర్భమున కన్వయించు అర్థము. అందరు కౌరవులను నిందించిన తరువాత అతని నాపుటకు 'నీకును నాకును' సాధ్యము కాదని చివరి వాక్యము 'ధర్మజుడు యుద్ధోన్ముఖుఁడై సాగుచున్నాఁడు దానికి కారణము ధృతరాష్ట్రుఁడుగా లోకమున గుర్తించునంతవఱకు బైట పడఁడు; 'ఆ తరువాత మరల్చుటకు మరెవరికిని సాధ్యముకాదు' అనిఫలితార్థము. దీనిని సమర్థించునట్టిదే "సాదు రేగెనేని న్వాసు పలపౌలము నగాని నిలువదు సుమ్మి" అను తరువరి వాక్యముకూడ. ఈ వాక్యమునందలి 'విను' 'సుమ్మి' అను పదములు ధృతరాష్ట్రునకు సంజయుఁడు పులివలె సాధింప నున్నాఁడు, అతని ప్రయత్నము నిరాఘాటముగా సాగుననియు, నిందమాత్రము దుర్యోధనునకు మిగులుననియు నిపుణముగాఁ బలికించినాఁడు తిక్కన. సంజయ పాత్రను నాధారముగా తిక్కన చేసిన నాటకీయవ్యాఖ్య నిర్మాణమున కసదృశ పరాకాష్ఠ. సంజయ పాత్రముకూడ పోషింపఁబడినట్లైనది.

అందును 'ధర్మమూర్తి మెత్తని పులి' అన్న నిర్వచనము తిక్కయజ్వ వాక్యాపాకమున కబ్బిన కమనీయ రుచి. ధర్మజుని మెత్తదనము మాటున క్రౌర్యము దాగినదని సంజయుఁడనఁగా, శాంతము వెనుక శౌర్యము దాగి యున్నదని కృష్ణుఁడు 'శాంతశూరుఁ' అని పేర్కొనినాఁడు. భావము ఒక్కటే అయినను చెప్పఁబడినవిధము భిన్నము. ఇచట సంజయుఁడు కొంత చనువుగా

ఇం దీశ్వరగుణములు వర్ణించుట ఉద్దేశము. కాని, అతని గుణములు పరంపరగా చెప్పినచో సంబంధబోధక సర్వనామము ప్రయోగించుపట్ల కలిగెడి యుత్కంఠ యుండదు. ఉత్కంఠాపరిపోషకమైన నీవాక్యపద్ధతి. దీనిని సంపూర్ణముగా పద్యమంతయు పరచివాడినపట్టు లుండవచ్చును; ఏ పద్యమునం దొకవాక్యమున నిర్మింపవచ్చును. కవి యెంతవఱకు దానిని కథాంగముల కుపయోగించుకొనఁదలచెనో దానిని బట్టి సంబంధబోధక సర్వ నామ ప్రయోగము, దాని యౌచిత్యము ఆధారపడియుండును. తిక్కన రచనలో నట్టిపట్టుల నొండు రెండు పరిశీలింప నగును.

'ఎవ్వని వాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజి నడఁగు' 4.2.191

అను సీసపద్యమునందలి నాలుగు పాదములు 'ఎవ్వని' అను పదముతో ప్రారంభమైనవి. ఆ ఎవరు అనునది గీతపద్యాంతమునఁ గాని బోధపడదు. గీతపద్యమునందైనను చివరగా ధర్మసుతుఁడు అని పేర్కొనఁబడెను. ధర్మ సుతుని ప్రాభవము సీసపద్యపాదములందు అతనిగూర్చిన విశేషణ పరంపర గీత పద్యభాగమునను పేర్కొనఁబడి ఉత్కంఠ అంతకంతకు పెరుగుచు వచ్చి ధర్మసుతుఁడు అను పద్యముయొక్క చివరి పదమున తీరును.

'నడచివియలు చేసె నగరికి మాణిక్య
మకుటములఁ బూనిన మనుజపతులఁ' 4.5.320

అను పద్యమునందును రచనాశిల్పము పరమరమణీయముగా నమ రినది. చిట్టచివరివరకు అర్జునుఁ డెవ్వరినిగూర్చి చెప్పుచున్నాఁడో, అతఁడెచ్చట నున్నవాఁడో బోధపడదు. 'ఇతఁడు' అని చూపి చెప్పుటతో గాని అట విర టునకు సందర్భము బోధపడదు.

సీస పద్య ప్రయోగమునందును తిక్కన సిద్ధహస్తుఁ డను విషయము వృత్తౌచిత్యవిచారమున నిరూపింపఁ బడును.

తిక్కన పాటించిన నామౌచిత్యము ప్రత్యేకముగా పేర్కొనఁ దగిన అంశము. ఆయాసందర్భములలో వక్త యొక్క, శ్రోత యొక్క సంబంధ

బాంధవ్యములచే నిర్ణయింపఁ బడిన సంబోధనలనే తిక్కన ప్రయోగించెను. దీనికి భారతమునందలి సంబుద్ధులన్నియు ఉదాహరణప్రాయములే, అయినను ఇట కొన్నింటిని పేర్కొనుట యుక్తము.

ఉ. "అక్కట యేను వేడ్కపడి యానెడునాసవ మర్థిఁ దేరఁగా
నొక్క నికృష్టఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో
సెక్కఁగఁజేసి నిన్ను నతిహీనవిధాననియుక్తఁ జేతగా
నిక్కము యమ్మలించి తిది నెయ్యము తియ్యము కల్మియే సఖీ"
4.2,98

దుష్టచింతనతో ఆసవము తెమ్మని పలికిన సుధేష్ణతన వాక్చాతుర్యము తో ద్రౌపది నింకను ఒత్తిడి చేయఁదలచినది. 'తాను వేడ్కపడి ఆనెడు నాసవ మర్థి దేర నొండొక్క నికృష్టఁ బంచుటకు నోపక' చెప్పినదఁట. 'కల్లు దేర బోవుట' నీచకార్యము కాదని ఆసవ మర్థిదేరబొమ్మనినది. కల్లు అని ద్రౌపది అనుట నైచ్యము నాపాదించునదిగా నుండ అర్థానినే సుధేష్ణ 'మది రా రసము', 'వాచవి యగు బహువిధంపు వారుణి', 'వేడ్కపడి ఆనెడు ఆసవము' అని పలికినది. 'అక్కట' అను పదమును సుధేష్ణ చేయు ప్రయత్న మునకు దోహదమగు నిపాతము. ఇట నామౌచిత్యమును నిపాతౌచిత్యమును గలవు. 'నెయ్యము తియ్యము కల్మియే సఖి' అను వాక్యమంతమున చేర్చుట సుధేష్ణ సైరంధ్రియెడ స్నేహభావమునే కలిగియున్న దని నమ్మించుట కై యుండును. ఇచట రాజ్ఞి, పరిచారికను 'సఖి'అనుటలో అదియే ఔచిత్యము, తన అవసరముకొరకు పాంచాలి ననునయించినదని బోధపడునట్లు తిక్కన వాక్య నిర్మాణమును గావించెను. 'సఖి' అను సంబుద్ధి సార్థక మగుటచే నిట నామౌ చిత్యము. పాంచాలి మనోరథము నీడేర్చుటకు నర్తనశాల కేగు భీమసేనుని 'ద్రౌపదీరమణుఁ' డనుట, అజ్ఞాతవాస వ్రతభంగ మొనరింప నెంచిన దుర్యో ధనుని 'పాతకియైన సుయోధనుఁ' డని పేర్కొనుటయు నామౌచిత్యమునకు చక్కని యుదాహరణములు. అలసియున్న పాంచాలిని 'పుష్పకోమలి' అనుట, చూచుటతోడనే కంకుని 'యతీంద్రుఁ' డనుట, కామోన్మత్తుడైన కీచకుఁడు నిజసోదరి హితము బలుకుటను సహింపక 'వనితా' అనిపిలుచుట,

ద్రౌపది కీచకుని తొలుత 'ఓయన్న' అని, పిదప 'కీచకా' యని, అటుపిమ్మట 'వివేకహీనా' అనుట, కల్లుదేరఁబొమ్మని రాజ్ఞి పలికినపుడు 'అమ్మానిని' అని సైరంధ్రి నుద్దేశించి పలుకుట, రూపాభిమానియైన కీచకుఁడు లెక్కకు మిక్కిలి పర్యాయపదములు సంబోధించినపుడును ద్రౌపదిని రూపలావణ్యాదుల నుద్దేశించి సంబోధించుట, ద్రౌపది ఒకపరి సభలో, విరటుఁడటుపిమ్మట ఆగ్రహావేశ పరులై ధర్మజుని 'కంకుభట్టు' అని, 'విప్రా' అని నిరసనగా బిలుచుట, కీచకునిఁ జంపుమని భీముని ప్రార్థించునెడ ఆతనిని 'పావనీ' అని ద్రౌపది పిలుచుట (బలవంతుఁడు, పవిత్రుఁడు), సంధిసేయుమన్న భీముని ఉత్తేజపరచుటకై కృష్ణుఁడు 'కీచకాంతకా' అని, ఆతఁడు తనప్రత్యుత్తరములో 'భుజంగభంజనా' అని పలుకుట, కృష్ణుని 'కమలోదర', 'సుజనవత్సల', 'కారుణికోత్తమ' అని అర్జునుఁడు, 'అచ్యుత' అని ద్రౌపది పిలుచుట, సుయోధను నుద్దేశించి 'పాతకి' అని 'నాగేంద్రకేతున్' అని రచించుట, కర్ణుని 'కానీనుఁ' డని భీష్ముని 'గాంగేయుఁ' డనుట, కౌరవులకు వారి అనుయాయుల నుద్దేశించి 'మొఱకు' లని అర్జునుఁడనుట – ఇవియన్నియును తిక్కన పాటించిన నామౌచిత్యమునకు[18] ఒకకొన్ని ఉదాహరణలు మాత్రమే.

## 4. వస్తుసంబంధములైన ఔచిత్యములు

### ప్రబంధార్థౌచిత్యము

'ఉచితార్థ విశేషేణ ప్రబంధార్థః ప్రకాశతే,
గుణప్రభావభవ్యేన విభవేనేవ సజ్జనః'[19]

గుణప్రభావభవ్యమైన విభవముచేత సజ్జనుఁడు ప్రకాశించినట్లు ఉచితార్థ విశేషముచేత ప్రబంధార్థము ప్రకాశించుననియు, దానిని ప్రబంధార్థౌచిత్యమని వచ్చుననియు క్షేమేంద్రుఁడు పేర్కొనియున్నాఁడు. అమ్లాన ప్రతిభాప్రకర్షోద్భావితమై సకల ప్రబంధార్థమునకు ఆప్యాయన నొనరించుచు అమృత వర్షము వలె భాసించు సముచితార్థ విశేషము మహాకావ్యమునకు చమత్కారకారి కాగలదని ఆతఁడు వివరించెను. దానికి ఉదాహరణముగా కాళిదాసుని మేఘసందేశము నందలి 'జాతం వంశే' అనుశ్లోకమును పేర్కొని

"అత్రాచేతనస్య చేతనాధ్యారోపణేన మేఘస్య దౌత్య యోగ్యతాధానాయ ప్రథితపుష్కలావర్తక పర్జన్యవంశత్వ మమాత్య ప్రకృతి పురుషత్వంచ యదు పన్యస్తం తేన సమస్త ప్రబంధస్యాభిధాన తో త్రైతీ తేతివృత్తరుచిరతరస్య నిరతిశయ మౌచిత్య ముద్ద్యోతితమ్" అని ప్రబంధార్థౌచిత్యమును సమన్వయించెను.

మఱియొక ఉదాహరణము భవభూతి ఉత్తర రామచరితమునుండి గ్రహించి అందలి లవకుమారుని వీర వాక్యములయందు భాసించు ప్రబంధరస బంధురము 'ప్రబంధార్థౌచిత్యము' అని పేర్కొనెను.

పై ఉదాహరణముల రెండింటిని సమీక్షించినచో ప్రబంధార్థౌచిత్య నిరూపణమునందు క్షేమేంద్రుని అభిప్రాయము నీక్రింది విధముగా నిరూపింపవచ్చును.

1. ఒక కావ్యార్థమును సమన్వయించుకొనుటకు అనువైన సూత్రమును అలంకారములవలనగాని, సముచిత విశేషణముల వలనగాని, వ్యంగ్య మర్యాద వలనగాని సూచించినచో దాని నాధారముగాఁగొని పాఠకుఁడు ప్రబంధార్థములను ఆప్యాయతతో అన్వయించుకొని ఆస్వాదించుచు ఆలోచనామృతమును అనుభవింపఁగలఁడు. అట్టి ఉచితార్థ విశేషనిబంధనమే ప్రబంధార్థౌచిత్యము.

2. ప్రబంధమునందు ఆయాకథాఘట్టములలో రసభావాదులను పరిపోషించి ప్రబంధమును రసబంధురముగా నొనరించుటయు ప్రబంధార్థౌచిత్యమనఁబడును.

ఈ దృష్టితో తిక్కన విరాటోద్యోగ పర్వములలో ప్రబంధార్థౌచిత్యమును పరిశీలింపవచ్చును. తిక్కన ఆంధ్రమహాభారతమును ప్రబంధమండలిగా పేర్కొనెను. ఎడనెడ కావ్య వస్తుసాయక రసభావ రచనా సంబంధులైన కావ్యాంశములకు సంబంధించిన సమన్వయ సూత్రములను తిక్కన నిపుణముగా తన రచనలో నిబంధించి ప్రబంధార్థౌచిత్యమును ప్రకటించెను. విరాటోద్యోగాది పర్వస్వభావ సూచకమైన ఈ పద్యము ప్రప్రథమముగా నుదాహరింపఁదగినది.

'మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథోపేతంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుంగూడఁగాఁ
బదియేనింటఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం
దుదముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్
(4.1.7)'

'హృదయాహ్లాది' అను విశేషణము విరాటపర్వమునకు సార్థకమైనది. ఆహ్లాదమున కుత్కంఠ జీవము. ఉత్కంఠ సంఘర్షణవలన ఉద్దీపితమగును. అజ్ఞాతవాసముచేయు పాండవుల వృత్తము గూఢము. గూఢవర్తనము బహిర్గతమైనచో కార్యభంగ మగును. కార్యభంగ మగుటకు తగిన బలవత్తర కారణములు కథలో కలిగినచో వానిని నిపుణముగాఁ బాండవు లధిగమించు నైపుణ్యము నెఱుఁగుటకు పఠిత యుత్కంఠ తాల్చును. విరాటపర్వమున కీచకోదంతము, దక్షిణోత్తర గోగ్రహణములు పాండవాజ్ఞాతవాసమున కేర్పడిన అగ్నిపరీక్షలు. వానిని వా రెట్లు అధిగమించి రను అంశమే అందు హృదయాహ్లాదమును కలిగించు నంశము. శక్తిమంతములైన కథాసంఘర్షణల వలన ఆ కథ వినువారిమనముల నానందమగ్నము నొనర్చును.

ఈ పర్వము హృదయాహ్లాది యగుటకు మఱియొక కారణము కలదు. అది రసమునకు సంబంధించినది. భరతుఁడు పేర్కొనినట్లు శృంగారము సర్వజన హృదయాహ్లాది. ఆరస మీపర్వమున నున్నట్లు మఱి యేపర్వమున లేదు. అట్లగుటకు కీచకాశ్రితమైన మోహాశృంగారము, ఉత్తరాభిమన్యుల ప్రణయ భావముల ప్రవర్తనము కారణము లగుచున్నవి. కీచకపరమైన శృంగార మాభాసమైనను సహృదయహృదయోల్లాసజనకమై యిందు రాణించినది. అభిమన్యు వివాహఘట్టము సర్వశృంగారోదాత్తమైనది. అట్లగుటచే విరాట పర్వము హృదయాహ్లాది యనుట సమంజసము.

విరాటపర్వమున పాండవులు నిజరూపములతో వర్తింపలేదు. వారి యం దన్యపాత్రారోపణము జరిగినది. వారు నటులవలె ఈరంగమున వర్తిల్లినారు. వేషములు వేరు; స్వభావములు వేరు; మొదటివి ఆరోపింప బడినవి, రెండవవి స్వభావసిద్ధములు. ఇట్లగుటచే అది నాటకము కాదు. వాస్త

వము కాదు. నాటకములో అంతర్నాటకము. ఇట్టిఘట్టములను చదువు పతి తకు నాటకము చూచిన రక్తియు నాయక చరిత్రము నెఱిఁగిన తృప్తియు కలుగును. నాటకధర్మ లోకధర్మములకు విచిత్రసమాహారము కలిగిన పాండవ కథ హృదయమునకు చమత్కారముతో కూడిన ఆహ్లాదము కలిగింపఁగలదు. కథలో సహజముగా నున్న ఈ మిశ్రప్రవృత్తి భారతమునం దెచ్చటను కాన రాదు. అందుచే నీ పర్వ మన్ని పర్వముల కథకంటె కళాదృష్టితో విలక్షణము. వికృతిప్రకృతుల కబ్బిన ఈ విశిష్ట సమ్మేళనము ఆహ్లాదజనకమనుట తిక్కనైన ధ్వనింపఁజేసిన కావ్యరసానుభవ నిర్దేశము. ప్రబంధకథార్థ చర్వణ కుపకరించు నీసూత్రము ప్రబంధార్థౌచిత్యమున కొక చక్కని యుదాహరణము.

విరాటపర్వము భారతపర్వములలో చతుర్థము. దీనిని తిక్కన ప్రత్యే కముగా పేర్కొనుట యెందుల కనిన హృదయరంజకత్వమున నిది ప్రథమ స్థానము నలంకరింపఁదగినది, వరుసనుబట్టి మాత్రమే చతుర్థమైన దని తిక్కన ఈ మాటతో ధ్వనింపఁజేసెను. అర్హత ననుసరించి ప్రథమ మనఁదగినది విరాట పర్వము అని హృదయాహ్లాది, ఊర్జితకథోపేతంబు నానారససాభ్యుదయో ల్లాసి అను విశేషణములవలన కూడ తెలియఁజేసినాఁడు తిక్కన, భారత పఠనాసక్తులైనవారు, వ్యాఖ్యాన రచనమునకుఁబూను కొనిన వారు, పురాణ శ్రవణమును జేయువారు విరాట పర్వముతో భారతమును ప్రారం భించుట జగత్ప్రసిద్ధము. ఊర్జిత మను పదమునకు దృఢము, గట్టి, చిక్కఁదన ము, సడలని, బిగువుకల యను అర్థములు గలవు. కథాపరముగా నిట ఊర్జితమని తిక్కన ప్రయోగించినాఁడు. విరాట పర్వమునందలి కథాను గుణముగా నిది అత్యంతము సార్థకమై ఒప్పినది. ఇందలి కథ అటునిటు సడలక అత్యంతము బిగువుగా కేవలము పాండవేతివృత్తముగా సాగినది. ఉపాఖ్యా నములు, ఉపదేశపరంపరలు ఇందు లేవు. కథలో నున్న అన్నిసంఘటనలు ఒకి దాని ననుసరించి మఱియొకటి ప్రవర్తిల్లుటచే చక్కని జిగి, బిగి ఏర్పడినవి. కీచక మోహపరితాప వర్ణనముతో కథలో వేగము పుంజుకొనినది. అపై జరి గిన సంఘటన లన్నియు దానివలన పుట్టిన విశేషములే అనవచ్చును. కీచక మరణముతో ఉపకీచకుల మరణము, వారి మరణములతో దుర్యోధనునకు సం శయము కలుగుట, పాండవుల నెఱుంగవలెనను ఉద్దేశముతోనే గోగ్రహణముల జరిపించుట, దక్షిణమున పాండవులు యుద్ధమునందు పాల్గొనియు ఎఱుంగఁ బడకపోవుట, ఉత్తరదిశ కేగిన విజయుఁడు గుర్తింపఁబడుట, ఎచ్చటి కచ్చట

ఉత్కంఠను రేకెత్తించు ఇతివృత్తములు. విజయుఁ డెఱుంగఁబడునప్పటికి అజ్ఞాతవాస వత్సరము ముగిసినది. వ్రతభంగమై యుండినచో నీ పర్వము విషాదాంతమై మఱియొక 'అజ్ఞాత' పర్వమై యుండెడిది. నాయకాభ్యుదయము హృదయాహ్లాద కారణము. ఈ పర్వములోనే పాండవుల అభ్యుదయము, కౌరవుల వినాశము ప్రారంభమైనవి. గోగ్రహణములం దోడుట వారి పరాజయమునకు నాంది. ఉత్తరాభిమన్యుల వివాహము పాండవాభ్యుదయ సూచకము. ఇట్టిదగుట వలననే దీనిని ఊర్జితకథోపేత మనినాఁడు కవిబ్రహ్మ. పలు సంఘటనలతో, మలుపులతో ఒక సన్నివేశము ముగియుచు మఱియొక సన్నివేశమున కాస్కారము కల్పించుచు, వివిధ రంగములలో నడచిన ఈ పర్వేతివృత్తము గాఢబంధమును కలిగినట్టిది. ఇన్ని చిత్రవిచిత్ర సంఘటనలు మఱియే పర్వమున లేవు.

యుద్ధపంచకమున యుద్ధము, శాంతిత్రయమున ధర్మబోధము, ఆశ్రమవాస చతుష్టయమున పాండవులనుగూర్చిన కొన్ని సంఘటన లున్నను, ఉపాఖ్యానాదులు ఎక్కువ చోటుచేసి కొనినవి. ఉద్యోగమునందు రాయబారము లెక్కువ గలవు. అవియును తిక్కనరచనానైపుణ్యమువలన వాసికెక్కినవి. కాని, విరాటపర్వమునందున్న వైవిధ్య మందు లేదు.

రసభావనము సైతము విరాట పర్వములో లెక్కకు మిక్కిలి గలవు. నానారసభరితమై యుండుట వలన ఉల్లాసము కలిగించుచున్నది ఈ పర్వము. ఇందు శృంగార, వీర, రౌద్ర, బీభత్స, భయానక, హాస్యరసములు పోషింపఁబడినవి. ముఖ్యముగా తిక్కన ఇందలి కీచకవృత్తాంతమును పెంచి అతని వ్యక్తిత్వమును కడునేర్పుతో చిత్రించి, ఆ ఘట్టమునందు శృంగారరసాభాసమును పోషించెను. శృంగారరసమునకు ఆస్కారము లేని భారతేతిహాసమునందు, ఇచ్చట నున్న ఒకే ఒక చిన్ని యవకాశమును గమనించి తిక్కన మహోద్భుతముగా పెంచి ఒక్క కీచకవృత్తాంతమునే ఒక సముగ్ర కావ్యము వలె రసభరితముగా రచించెను. శృంగారముకంటె శృంగార రసాభాసమును పోషించి మెప్పించుట కష్టము. తిక్కన, ఆ తరువాత పెద్దన ఈ కార్యమును ఫలప్రదముగా సాధించిరి. అత్యంత ప్రతిభా శాలియైన కవిమాత్రమే రసాభాసమును ఆస్వాద యోగ్యముగా నిర్వహింపఁగలఁడు.

శృంగారము భారతమున లేదు, కాని విరాటపర్వము నందది అంగ రసస్థాయి నందినది. వీరము భారతమునందు వలెనే విరాటమునందును అంగి రసను. రెండు గోగ్రహణము లందును అది రమణీయముగా పోషింపఁబడి భావికుల క్షేత్రమును దలపించుచు సాగినది. ఉత్తరుని ప్రగల్భములందును, కీచకునితో నిగూఢముగా భాషించు వనితా వేషధారియైన భీముని పలుకులం దును, భీమునిఁగాంచి గంధర్వుఁడని భయపడి పరువెత్తు ఉపకీచకుల చర్యల యందును హాస్యము అతిసున్నితముగా పోషింపఁబడినది. కీచకుని విచిత్ర ముగాఁజంపు భీమునికోపము నందు, సభలో ఆగ్రహావేశభరితుఁ డైనపుడును రౌద్రము భాసించినది. దక్షిణగోగ్రహణానంతరము జరిగిన యుద్ధములో బీభత్సము, కౌరవసేనఁజూచి వెఱగందిన ఉత్తరునియందు భయానకము తగు మాత్రముగా వర్ణింపఁబడినవి. కీచకుని వింతచావును దలచి పౌరులు మహా శ్చర్యమును పొందిరి. అల్లే మహోన్నతాకారులైన పాండవులను, అద్భుత సౌందర్యవతియైన ద్రౌపదిని గాంచి విరాటుఁడు, సుధేష్ణ, కీచకుఁడు అచ్చెరు వొందిరి. ఉత్తర ముగ్ధత్వము, ద్రౌపది దైన్యము, పరాభవము నందినప్పటి దుఃఖావేశము, తమ్ముల మరణమును గాంచిన సుధేష్ణ దుఃఖము, భీముని క్రోధము, దుర్యోధనాదుల పగ, తనయుని విజయవార్త వినినప్పటి విరాటుని మోదము, ఉత్తరాభిమన్యుల ప్రణయ భావములు—ఇత్యాదులు రసస్థాయి నందని వివిధభావములు. ఇన్నింటిని భావించియే తిక్కన ఈ పర్వమును "నానారసాభ్యుదయోల్లాసి" అని సంభావించెను.

"రసాభ్యుదయోల్లాసము" రసపోషణమునందు క్రమవికాసపోషణము యొక్క ఉన్మీలన సంవిధాన శిల్పమునకు సంబంధించినది. విరాటపర్వమున తిక్కన సర్వరసభావ పరిపోషణ విధానమునం దట్టి క్రమవికాస శిల్పమును ప్రకటించినాఁడు. ఈ అంశమును రసపోషణాధ్యాయమున వివరముగా చర్చింపనైనది. అట్లగుటచే నిచ్చట ప్రస్తావన మాత్రముగా పేర్కొనబడు చున్నది.

విరాటపర్వముయొక్క సమగ్రస్వరూపము నీ పద్యములో సూచించుట జరిగినది దీనినిబట్టి ఆ పర్వమును ఎన్నదగును. ఆ పర్వపఠనానంతరము ఈ పదముల సార్థక్యము బోధపడును. ఇట్టిది ప్రబంధార్థౌచిత్య మనదగిన అంశము. ప్రబంధకథార్థవ్యంజకమైన ఈ పద్యము తిక్కన అమూలకముగా రచించినది. ప్రబంధౌచిత్యమునకు ప్రకృష్టమైన ఉదాహరణ మనదగియున్నది. కావ్యారంభ పద్యమునందలి కథార్థసూచన మను లక్షణమును కమనీయముగా సంతరించుకొనినది:

''సీ. కొలువులోపల నిన్న కోపమగ్గలిక్తిన౯
దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేఁడిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులు కప్పిన గౌరవంబు
మనవారిలోన నొక్కని నైనఁ బిల్వకు
త్సాహము చేసిన సాహసంబు
లోకదుర్జయుఁ డగు నీ కీచకుని బ్రవే
ల్మిడి రూపుమాపిన కడిమిసొంపు.

తే. చూడఁ దలపోయ మెచ్చసంస్తుతి యొనర్ప
నాతలంబె నీ యుత్తమ నాయకత్వ
మెఱిఁగి నిను గొనియాడ నేనెంతదాన
మహిత విస్మయానంద నిర్మగ్ననైతి." 4 2.360.

కీచకవధానంతరము ద్రౌపది భీముని కీర్తించిన పద్యమిది. దీనిని ఆకథాఘట్టమున నిబంధించుట వలన తిక్కన కావ్యకథకు సంబంధించిన ఔచిత్యములను పెక్కింటిని పోషించెను, వానిని స్థూలముగా నిట్లు పేర్కొనవచ్చును.

1. ఒక మహాకార్యమును సాధించిన కథానాయకుని గుణ కీర్తనము ఆ ఘట్టము ముగించునెడ గావించి తత్కథార్థ చర్వణమునకు పరిత కవకాశము కలిగించుట.

2. ప్రతినాయక వధ వలన ప్రత్యక్షముగా ఫలము ననుభవించు నాయిక తన కొనరించిన మేలును స్మరించి నాయకుని కీర్తించుటచే సందర్భౌచిత్యమును పాటించుట.

3. తత్కాలమున రంగమునందున్న రెండు పాత్రలలో నొక పాత్రచే నాయకపాత్రను గీర్తింపఁజేసి నాటకీయతను పాటించుట.

4. అద్భుతాంతమైన కథార్థమును వర్ణన ద్వారా ధ్వనింపఁజేయుట

5. ద్రౌపదిని సహృదయ స్థానీయగా సంభావించి సంభాషణ మను సంధించుట

పై పద్యమున భీముని ఉత్తమనాయకత్వము కొనియాడఁబడినది; భీముఁడు భారతకథకు నాయకుఁడు కాఁడు. ధర్మజుఁడు నాయకుఁడు. భీముఁ డనునాయకుఁడు. నాయకుఁడంగి; అనునాయకోపనాయకాదు లంగ ప్రాయులు. అనునాయక యత్నము నాయక కార్యఫలసిద్ధి కుపకారక మగును. ఇది సామాన్య విభాగము. మఱి కొంతలోతుగా నాలోచించినచో అనునాయకుని కార్యసాధనము, నాయక కార్యసాధనమే యగును. అను నాయకునకును, నాయకునకును కార్యసాధనము నందిట్టి అవినాభావ సంబంధ మును భావించుట సాహిత్యశాస్త్ర మర్యాద. ఇచట విజయము సాధించినది భీముఁడు. అతఁడు ప్రత్యక్షహేతువు. తప్పుల మతనికెంత కలదో ధర్మజున కంత కలదు. ధర్మజదత్తమైన ఫలమే ఫలము. అనునాయక సహాయము వలన కార్యసిద్ధి బొందెడి నాయకుఁడు పరోక్షముగా ఫలముననుభవించును. అనునాయక ముఖముగా కార్యమును సాధించును. అట్లగుటచే ప్రధాన కథలో అనునాయకులు కార్యసాధనము చేసిన ఘట్టములు వారి నాయకత్వ స్ఫూర్తిని ప్రకటించు రసవత్కథాఘట్టములై యొప్పుచుండును. విరాట పర్వ పూర్వభాగము నందు కీచకవధాఘట్టము ప్రధానము; ఉత్తరభాగమున ఉత్తర గోగ్రహణ ఘట్టము తలమానికము. అనునాయకులైన భీమార్జునుల పరాక్రమములు కారణములుగా బొందెడి ఫలములా ఘట్టములందు ప్రాధాన్యము వహించును. ఆ ఘట్టములను పరిచ్ఛిన్నములుగాఁజూచినచో వారే నాయకులవలె కానఁబడెదరు కీచకవధా ఘట్టమొక స్వతంత్ర సన్నివేశమైనచో భీముఁడందు నాయకుఁడు.

ఇచ్చట మఱియొక విశేషమును గలదు. భీముఁడనునాయకుఁడయ్యు స్వభావనుచే ధీరోద్ధతుఁడు. ఉద్ధతుఁడు ఉత్తమనాయకుఁడు కాజాలఁడు. అతఁడు మాయోపాయమున కీచకుని వధించినాఁడు. కాని అధర్మముగాఁ జంపలేదు. ఉపాయము సందర్భమున కుచితమగుటచేతను, ధర్మరక్షణార్థమగుటచేతను, నింద్యమగుటలేదు. ప్రతినాయకుఁడైన కీచకుఁడు దర్పోద్ధతుఁడు; అతనికార్యము ధర్మబద్ధము కాదు. అందువలన నతని వధ ధర్మబద్ధమైనది. భీముఁడుద్ధతుఁడయ్యు ఉద్ధతుని యధర్మము నణచుటకుఁబూనుకొనుటచే నతనియందౌదాత్త్యము భాసించుచున్నది. కార్యమునందలి ఔదాత్త్యముతోఁ బాటు కార్యసాధనము నందును సందర్భమును బట్టి ఉదాత్తలక్షణముల నాతఁడు ప్రదర్శించెను. ఆ పద్ధతి ఎంత ఉచితమో అంత అద్భుతము కూడ. దానినే ద్రౌపది కీర్తించినది.

కొలువు కూటమునందు భీముఁడు రౌద్రమూర్తి; కోపావేశమతని నావరించి ఆ సమయమున కుచితము గాని యుగ్రకర్మకుద్యుక్తుని చేసినది. అప్పుడు ధర్మాంకుశ మామదగజమును శాసించినది; అనఁగా నతని యౌద్ధత్యమును నియమించినది. అట్టి నియమము వలన ఆతఁడు ఉద్ధతత్వమును వీడి ధీరుఁడైనాడు. ఔద్ధత్యమును మాన్పినది ధర్మరాజు కాగా, అతనిలోని ఉత్సాహమును పోషించినది ద్రౌపది. ధీరుఁడుత్సాహవంతుఁడైనాఁడు; వ్రతము చెడకుండ ధర్మమును నిర్వహించినాఁడు. పాండవ గార్హస్థ్య ధర్మమును, అజ్ఞాతవాసవ్రతమును రక్షించినాఁడు.

ఉద్ధతుఁడు ధాయఁడైన మార్పును తిక్కన నిపుణముగా పై సీసపద్య ప్రథమ పాదము నందు సూచించినాఁడు.

రెండవ చరణమునందు భీముని నిర్వికారతను, గూఢముగా కార్యము నిర్వహించి గౌరవము కాపాడిన విధమును ద్రౌపది ప్రశంసించినది. ఉద్ధతుఁడు చపలుఁడు; ఉదాత్తుఁడైన ధీరుఁడు స్థిరుఁడు. ఉద్ధతుఁడు ప్రకటితస్వాభిమానుఁడు; ఉదాత్తుఁడు గూఢాభిమాని. కీచకవధ ఘట్టమున భీముఁడు తగినంత ప్రబోధము లేనివాఁడైనచో గుట్టుగా ఆపని జరిగియుండెడిది కాదు.

అతని జ్ఞానమనశ్శీతుణమును మహానసమున ద్రౌపది సంతరించినది. ధర్మజుని మహిమను కీర్తించుట యందును, అజ్ఞాతవాస సమయనిర్వహణము నందలి సంశ్లిష్ట వర్తనమును ప్రబోధించుట యందును ద్రౌపది భీముని గూఢపరా క్రమ ప్రదర్శనమునకు పూర్వరంగము సిద్ధము చేసినది. అట్లయ్యు ఆవేశ పరుఁడైన భీముఁడు నిజపౌరుషవిస్ఫూర్తిని ప్రకటించుచట్ల సందర్భశుద్ధిని పాటింపకపోయెడి ప్రమాదము కలదు. కాని భీముఁడు కార్యనిర్వహణమున తన ప్రవృత్తిని దేశకాల పాత్రముల నెఱింగి నియమించుకొని గూఢముగా కార్యనిర్వహణము చేసి యౌచిత్యమును పాటించెను. ద్రౌపదితో బాటు పరితయు నతని వర్తనమున కబ్బురపాటు చెందకమానఁడు. దాని నామె కీర్తించినది, అది సహజము.

మూఁడవ చరణమున నతని అసహాయశూరత్వ ముగ్గడింపఁబడినది. అది ఉత్తమవీరుని ఉత్తమవీరలతుణము. నాల్గవ చరణమున సింహాబలుని రూపుమెడునట్లు చంపిన విధము ప్రస్తావింపఁబడినది. ఆవిధము అద్భుతావహ మనుటలో విప్రతిపత్తిలేదు. పై అంశములను క్రమాలంకారము ననుసరించి చూడ, తలపోయ, మెచ్చ, సంస్తుతియొనర్ప భావుకునకు ద్రౌపదికి వలెనే విస్మయానందములు కలుగుట నిస్సంశయము.

పర్యాలోచన చేయగా భీముఁడీ ఘట్టమున నుత్తమనాయకత్వగుణ ములను సాధించినాఁడు. తదనుగుణముగా కార్యనిర్వహణము చేసినాఁడు. కథానిర్వహణము నందు అద్భుతమును భాసింపఁజేసినాఁడు. కీచకవధఘట్టము కార్యారంభ, వ్యాప్తి, సమాప్తులతో కూడిన సమగ్రకథా ఘట్టము, తద్ఘట్టము నొక ప్రబంధముగా భావించినచో తన్నాయక వృత్తమును సమీ క్షించు సమన్వయ సూత్రమును సహృదముల కందించు పద్యమిది కావున నిందు ప్రబంధార్థౌచిత్య మొప్పుచున్న దనుట నిర్వివాదము. తిక్కన అమూలకముగా నిర్మించిన ఈ పద్య మా మహాకవి కావ్యకళాశిల్పమున కొక కీర్తిపతాక.

ఉత్తర పాత్రమును ప్రవేశపెట్టుట, దుర్యోధనుని మంత్రాలోచనము, ఉద్యోగపర్వమున అమూలకములుగా రచింపఁబడిన సంభాషణలు సమగ్ర కావ్యము నుద్దేశించినట్టివే గనుక అందంతట ప్రబంధార్థౌచిత్యమున్న దన

వలెను. సనత్సుజాతీయమును వదలివేయుటలో కూడ తిక్కన దృష్టి ప్రబంధార్థౌచిత్యము నుద్దేశించి పరగియుండెను. అందలి సారమంతయు యుద్ధానంతర పర్వములలో చెప్పబడియుండుటచే నిట వదలివేయుటయే కావ్యశిల్ప దృష్టితో ఔచిత్యమనక తప్పదు.

దేశౌచిత్యము

సీ. బ్రాహ్మణ భక్తియుఁ బరహితశక్తియు
నిర్మల మతియును నీతిరతియు
సత్యభాషణమును సాధుపోషణమును
జిరవితరణమును సేవ్యగుణము
సన్మార్గరతియు నున్మత్తశీతియు
నంచితోదయముఁ గృపాతిశయము
బంధు సంప్రీతియు భవ్యవిభూతియు
శాస్త్రవిగమము నస్ఖలితదమము

తే. సజ్జన స్తవనీయ సౌజన్యములును
ధర్మసంచిత బహుధనధాన్యములును
గలుగు నక్షీణ పుణ్యదోహలుఁడు ధర్మ
సూనుఁ డున్న దేశంబున మానవులకు. 4.3.103.

విరాటదేశమని పైపద్యమున వాచ్యముగా పేర్కొనబడలేదు. ధర్మసూనుఁ డున్న దేశమునందు మానవులకు కలుగు గుణవిశేషములును, భోగభాగ్యములును పేర్కొనఁబడినవి. భీష్ముఁ డీవిషయముల నెఱింగించి నంత నే దుర్యోధనునకు విరాటనగరమే స్ఫురణకు వచ్చినది. అనగా ఆయా లక్షణములా దేశమున కంత యొప్పి యున్నవని భావము. దేశమనగా మట్టికాదనియు, అందలి ప్రజలనియు, దేశప్రజల గుణగణములను బట్టి దేశమును ఎంచవచ్చునను చమత్కారమిందు గలదు. ఇట్టిది దేశౌచిత్యమున మాధుర్యగుణము20. ఈ పద్యమున మాధుర్యగుణమును కలదు. ధర్మజుని పాత్రమున కిది యొక

ప్రశంసాపత్రము వంటి దగుటచే నిట పాత్రపోషణయు జరిగినదని చెప్ప వచ్చును. దేశప్రజల లక్షణములను పేర్కొని దేశమును స్ఫురింపజేయుట ఇచటి విశేషము.

## 5. పాత్రసంబంధులైన ఔచిత్యములు

### కులౌచిత్యము 21

"కులమునుబట్టి గుణములను నిర్ణయించెడి కాలములో ఒక్కొక్క కులమువారలకు ఒక్కొక్క వర్తనము విధింపబడి యుండెడిది. ప్రధాన ముగా చాతుర్వర్ణ్యవ్యవస్థ ఆకాలమున నుండిన కట్టుబాటు. క్షత్రియులు పాలకులు; తక్కిన కులములవారు వారి నాశ్రయించి యుండెడివారు. తమ అధీనములో నున్నను బ్రాహ్మణులకు అగ్రాసనమిచ్చి గౌరవించెడివారు పాల కులు. ఆయా కులముల కుచితమైన స్వభావమును తిక్కన తన పాత్రముల ముఖముగా వెలిబుచ్చెను." క్షత్రియులలోను కొన్ని వంశములకు గౌరవ మధికముగాను, కొన్ని వంశములకు కొంత తక్కువగాను ఉండెడిది. కౌరవ వంశము ప్రసిద్ధమైన దగుటచే తిక్కన ఆ వంశమును రెండు మూడు పర్యాయములు ప్రత్యేకముగాఁ బేర్కొనెను,

'గీ. కౌరవాన్వయజాతులై గారవమునఁ
బెరిఁగినట్టి మీరొండొక నరునిఁ గొలిచి
మసలి వర్తిల్లి మానావమానములకు
నోర్చి యడఁకువతోడుత నునికి యరిది. (4.1.118).

అజ్ఞాతవాసారంభమున పాండవులతో ధౌమ్యుఁడు పలికిన పలుకులవి. క్షత్రియులలో ఒకరు ఒకరిని మించి యుండుటయే సహింపలేరు. అసలు కౌరవ పాండవవైరమునకు ముఖ్యకారణము దుర్యోధనుని అసహనమే గదా! అట్టిచో 'ఒక రాజును కొలిచి, మసలి, వర్తిల్లి మానావమానములకు నోర్చి యడకువతోడుత నునికి' మఱింత దుష్కరము క్షత్రియులకు. అందులోను పాండవులు అవక్రవిక్రమోన్నత శీలురు. వారి కులము, వంశము, గౌరవ

మున జెరగుట అను లక్షణములు సేవాధర్మమునకు అననుకూలములు. అందు వలననే ధౌమ్యుఁడు వారికి సేవాధర్మము తెలియింపఁ దలచుట యుచితమే.

"క. వాలి వివిధాస్త్రశస్త్ర
జ్వాలల వెలుఁగొందు పాండవజ్వలనం బా
భీలత మండందొడరిన
గ్రాలు విరోధంబు నుచితకార్యముఁ దప్పున్" 4.1.119

- 'పాండవ జ్వలనము' అని వారిని వారి తండ్రినామముతో సాముహికముగా పేర్కొనుటలో కూడ ఔచిత్యము గలదు. కౌరవులు సైతము కురువంశజులే, అయినను వారు వీరివలె పరాక్రమవంతులు కారు. ఆ యుద్దేశముతోనే ధౌమ్యుఁడు 'కౌరవాన్వయ జాతులై గారవమునఁ బెరిగినట్టి మీరు' అని తొలుత కురువంశపరముగా పేర్కొని అంతతో నిలువక 'పాండవజ్వలన'మని వారి శౌర్యమును రూపించి, ఆ శౌర్యానలము మండినచో కార్యము దప్పునని హెచ్చరించినాఁడు. పురోహితుఁ డగు ధౌమ్యుఁడు హితుఁడై హితను పలుకుట సమంజసముగా కులోచితముగా భాసించుచున్నది. క్షత్రియకులోచితమగు వర్తనము కలిగిన ధర్మజాదులకు రాజసేవాధర్మమును ఎఱింగిన పురోహితుఁడు తెలియఁబలుకుట ఔచిత్యము.

## వ్రతౌచిత్యము[22]

విరటుఁడు కంకవేషధారియైన ధర్మరాజును చూచి అత్యంత గౌరవముతో ఆదరించి 'మత్స్యరాజ్య పదవీపరిపాలన వెలయఁ జేయఁగా మది దలంచుట యెంతయుం బ్రియ'మని పలికినపుడు ధర్మరాజు అచ్చపు సన్యాసివలె బ్రాహ్మణకులోచితముగా బలికెను.

"క. ఏను హావిష్యమ కుడుతును
భూనాయక నాకు శయ్య భూమియ యిమ్మెఁ
బూని వ్రతంబులు సలిపెడు
వానికి నిన్నియును నిట్లు వలయును చెపుమా". 4.1.205.

అజ్ఞాతవాస నియమము నుపాండవులొక వ్రతముగా భావించి, కడుం గడు దీక్షతో ఆ వ్రతము నాచరించుటచే నిట ధర్మరాజు 'వ్రత'మని పేర్కొనుట వ్రతౌచిత్యమనదగియున్నది. 'రుచిరోన్నతాసనములు, వాహనములు, భోజనములు, వస్త్రములు, వలయు భోగములును' నడపుదునని విరాటుడని నపుడు ధర్మరాజిట్లు బలుకుట ద్విజకులోచితముగా నున్నది.

అజ్ఞాతవాస కాలమునందు భీమాదులు వారువారు గైకొనిన వృత్తులను వ్రతదీక్షతో నిర్వహింపబూనియుండిరి. ఆయా వృత్తుల కనుగుణమగు వేషములను, భాషణములను, వృత్తి వివరములను తిక్కన యథోచితముగా వర్ణించి ఔచిత్యమును పోషించుటను వస్తువర్ణన అను విభాగమునందును చూడగలము.

అర్జునుడు తన నపుంసకత్వమును తెలియబలికిన పిమ్మట తాను నేర్చిన విద్యలను పేర్కొనెను.

"గీ. ఒండు పనులకు సెలవులేక సికిం జేసి
అభ్యసించితి శైశవ మాదిగాంగ
దండలాసక విధమును గుండలియును
బ్రేంఖణంబు తెలంగను జేరణియును." (4.1.270)

మూలమున లేకున్నను తిక్కన వైవిధమగు నృత్యభేదములను పేర్కొనుట బృహన్నల పాత్రమును నిర్వహింపబోవు అర్జునున కుచితముగా నున్నది. ఇట్లుండుటయే వ్రతౌచిత్యము.

నకులుడును తనకు అశ్వపాలనము మాత్రము తెలియునని, అట్లు తన్ను నియోగింప నొల్లనిచో వెడలెదనని పలుకుట చక్కని కల్పన.

"క. చనుదెంచి కాంచి నానే
ర్చిన తెఱంగున విన్నపంబు సేసితి నన్నుం
బనిగొనం దలంచిన నిలిచెద
ననుమానము గలిగెనేని నరిగెద నధిపా". (4.1 270)

భీముఁడు మోటుకు చందంబున మోమడ్డము గిదల్చెనట – ఇదియు ఆతని వ్రతోచిత వర్తనమే యగును. కూడుగూరల గూర్చి, మద్దుచుల గూర్చి భీముఁడు పలువిధముల బలుకుటయు ఆతని అజ్ఞాతవాసవ్రత దీక్షను తెలుపుచున్నది.

క్షత్రియులలో స్త్రీలకు ప్రత్యేక స్థానముండిన కాలమది. పురుషుల వలె వారును మంత్రాలోచనలోను, కార్యాకార్య నిర్ణయములోను పాల్గొనెడి వారు. ద్రౌపది పలుమార్లు సభలలో అవమానమునంది క్రోధానల పరితప్తయై తీవ్రముగాఁబలుకుట జరిగినది. అది ఆమె క్షత్రియోచిత మగు వర్తనముగా గణింపవలెను. అందువలననే కీచకుఁడు కాలఁ దన్నినపుడు విరటుని కొల్వులో సభాసదులను, రాజును సైతము ధిక్కరించి మాటలాడినది. ధర్మజునే గూఢముగా ఎత్తిపొడిచినది. ఈ తిరస్కారపు సంభాషణమును తిక్కన మఱికొంత పెంచి ఆమె కోపతీవ్రతను వ్యక్తపఱచెను. ద్రౌపది ఈ స్వభావమును ఆమె పాత్రపోషణ యందును చూచెదను. కౌరవులను గూర్చి 'వారు బ్రాహ్మణులె యే కీడైన సైరింపగన్' అని ద్రౌపది పలుకుటలో కులౌచిత్యము గలదు. బ్రాహ్మణులపకారము చేసినచో క్షమింపదగునని అతని ఉద్దేశ్యము. క్షత్రియులు గనుక వారిని శిక్షింపవచ్చుగదా యని ద్రౌపది భావము.

ఇట్లే కుంతీదేవికూడ క్షత్రియకాంత ఏ ఉద్దేశ్యముతో పుత్రులను బడయునో ఆ ఉద్దేశ్యమును నెరవేర్పుమని కృష్ణునితోఁ జెప్పిపంపుట కూడ ఆమె రాచపుట్టువుకు తగియున్నది. (౫.౩.౧౧౯)

భరతకులమును గూర్చి శ్రీకృష్ణుఁడు కౌరవసభలో ప్రశంసించుట కులౌచిత్యము. అట్లు ప్రశంసించుటవలననైనను కౌరవులు కొంత మార వచ్చునను ఉద్దేశ్యముతో కృష్ణుఁడట్లు పలికెను. (౫.౩.౨౫౭).

## సత్త్వౌచిత్యము[23]

సత్త్వమనగా మనోబలము. పాండవులలోనే కాక భారతమున వర్తిల్లు పాత్రలన్నింటిలోను సత్త్వము నధికముగా గలవాఁడు ధర్మజుఁడు అట్టి వాఁడు గనుకనే మహాపరాక్రమవంతులగు తమ్ములను తన ఆజ్ఞాను వర్తులుగా

నేలినాఁడు. ఎడనెడ ధర్మజుని నిష్ఠుర మాడునట్లు కనుపించు ద్రౌపదికి సైతము ఆతని సత్త్వముపై అమిత విశ్వాసము కలదు. విరాటపర్వారంభములోనే ఆతని మనోబలమును గూర్చి ధౌమ్యుఁడు ప్రశంసించినాఁడు. తదాదిగా సందర్భము వచ్చినపుడెల్లను అర్జునుఁడు, భీముఁడుఁ, ద్రౌపది, విరటుఁడు, సంజయుఁడు, విదురుఁడు, భీష్మద్రోణులు, కృష్ణుఁడు ధర్మజుని సత్త్వమును పేర్కొనినారు. భీముఁడు ధర్మజుని, 'ధైర్యహేమాచలుఁడైన ధర్మసుతుఁడ'ని (4.2.179) పేర్కొనెను. ధర్మజుని సత్త్వమునకు ప్రశంసాపత్రమువంటి యీ యొక్కమాట చాలును.

"క. ధర్మతనూజు వు సంతత
ధర్మనిరతి మనము బ్రతుకఁ దలఁచుట యరుదే
నిర్మలుఁడగు నాతని స
త్కర్మంబునఁగాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్." (4.2.188)

ద్రౌపది సర్వజగత్‌స్థితికిని ఆతని సత్కర్మమే కారణమని పలికినది అర్జునుఁడు విరాటపర్వారంభమున అతని గుణములను వర్ణింపగా, భీష్ముఁడు అదే పర్వమున ధర్మజుఁడున్న దేశప్రజలకు కలుగు లక్షణముల నుటంకించెను. ధర్మజుని అంతస్సత్త్వము ఈ రెండు వర్ణనలయందును ప్రతిఫలించినది.

కృష్ణుఁడాతని ఈ అంతస్సత్త్వమును ఉద్దేశించియే 'అజాతశత్రుఁ డలుగుట నీళుల నగ్నిపుట్టినట్టిదయ్యో' అనెను. సత్త్వశీలుర ఆగ్రహము బడబానల మని శ్రీకృష్ణుని అభిప్రాయమని తోచుచు. ఆతనిని గూర్చియే శాంతశూరులను విశేషపదమును తిక్కన ప్రయోగించెననిపించును. 'తగు చేవ' కలుగుట ఎఱుగవె యధిపా అని కృష్ణుఁడు ధృతరాష్ట్రునితో బలికెను. ఇచట 'తగుచేవ' అనుపదమునకు బాహుబలము అను నర్థము రాదు. సత్త్వమనియే అర్థము గ్రహింపవలెను. ఎందుకనగా ధర్మజుని బలము బాహువులపై నాధారపడినది కాదు; ఆతనిది బుద్ధిపై ఆధారపడిన ఆత్మబలము. ధర్మజుని యందీ సత్త్వమును పోషించుటయే సత్త్వౌచిత్యము.

విదురుని గూర్చి కుంతి పలికిన ప్రశంసలో గూడ విదురుని సత్త్వము విదితము (5.3.190). అతని గూర్చి కృష్ణుని సంబోధనలు, ధృతరాష్ట్రుని అభిప్రాయము గూడ అతని సత్త్వమును తెలియఁజేయునవిగా నున్నవి. ధర్మజునివలె సత్త్వసంపన్నుఁడు విదురుఁడు.

## స్వభావౌచిత్యము

"స్వభావౌచిత్య మాభాతి సూక్తీనాం చారు భూషణమ్ ।
అకృత్రిమ మసామాన్యం లావణ్య మివ యోషితామ్"[24]॥

సహజము, అసాధారణమునైన లావణ్యము లలనకు వలె కవిసూక్తులకు స్వభావౌచిత్యము భూషణమువలె భాసించునని క్షేమేంద్రుని మతము.

స్వభావ మనగా పాత్రల, వర్ణ్యవస్తువుల సహజప్రవృత్తి. ఈ సహజ ప్రవృత్తిని ఒకానొక ఉచిత సందర్భములో కవి ప్రతిభావంతముగా ప్రదర్శించినపుడు మనోహరముగఁ దోచును. పాత్రలను ఆయా పరిస్థితులలో వారివారి చిత్తవృత్తు లెట్లు మారుచుండునో ఊహించి సహజత్వ ముట్టిపడునట్లు తిక్కన తీర్చును. పాత్ర రూప స్వభావాదులను ఔచిత్యవంతముగా వర్ణించినచో అవి కథయందు పాత్రములవలె గాక ప్రత్యక్షమూర్తులవలె ప్రకాశించును. తిక్కన భారత పాత్రములిందుకు సాక్షులు.

ప్రధాన పాత్రములను ప్రతిభావంతముగాఁ బోషించి అప్రధాన పాత్రములను నిర్లక్ష్యము చేయుట తిక్కన యెఱుఁగఁడు. విరాటపర్వము నందు ద్రౌపదిని ఎంత సమగ్రముగ తీర్చెనో, సుధేష్ణను గూడ అంతె నైపుణ్యముగ తీర్చి దిద్దినాఁడు. అట్లే విరటుని, ఉత్తరుని గూడ సందర్భోచితముగ పోషించినాఁడు. వారి స్వభావము లిట్టివని మూలమున రేఖా ప్రాయముగ నుండ తిక్కన స్పష్టపఱచెను. ఇఁక కీచకుని స్వరూప స్వభావాదులను తిక్కన వర్ణించిన తీరు అనన్యసాధ్యము

ఉద్యోగ పర్వమునందు మూడు రాయబారములు ప్రధానమైనవి కాఁగా తిక్కన కృష్ణునితో సమాన ప్రాధాన్యమునిచ్చి సంజయుని తీర్చి దిద్ది

నాఁడు. ద్రుపదపురోహితుని సైతము సహజముగా వర్ణించినాఁడు. తన పాత్రము లెంత సామాన్యములైనను కవికి అలక్ష్యము కూడదని కవిబ్రహ్మ ప్రతిపాదించినాఁ డనవచ్చును. సృష్టికర్తకు సృష్టిలో అత్యల్ప ప్రాణిసైతము అభిమాన పాత్రమే గదా!

'కవి తానుగా ఆయా పాత్రముల స్వరూప స్వభావములను వర్ణించుట ఒక ఎత్తు; ఆయా పాత్రల అభినయములను సూచించుట ద్వారా, సంభాషణ లలోని తీరుతెన్నుల ద్వారా నిర్దేశించుట మఱి యొక పద్ధతి. తిక్కనకు రెండవ పద్ధతి ప్రీతికరమని తోచును. సామాన్యముగా ఏ పాత్రమును గూర్చి కాని తిక్కన వ్యాఖ్యానింపఁడు. ఆ పాత్రముచేతనే స్వభావోచితముగా మాటలాడించును. ఒక్కొక్కప్పుడు ఎదుట నుండు ఇతర పాత్రములచేఁ బలికించును, ఇది లోకమును ఎంత లోతుగానో పరిశీలించిన కవికే సాధ్యము. ఎట్లన—భారతము అనువాదము. అందలి పాత్రములు వ్యాసుని సృష్టి, వానికి పరిధులు అతనిచే నిర్ణయింపఁబడినవి. అట్టిచో తిక్కనకుగాని మఱియే కవికి గాని స్వాతంత్ర్యము తక్కువ. ఇక స్వభావ నిరూపణములో ప్రత్యేకత ఏముండును? సామాన్యుల కుదయించు సందేహమిది. ఏ యితర మహాకవి భారతము ననువదించినను వ్యాసభారతము తెలుగులో దర్శన మొసగి యుండెడిదే. కాని తిక్కన మహాకవియే కాదు కవిబ్రహ్మ—ఇచట 'బ్రహ్మ' బిరుద వాచకము గాదు. సృష్టికర్త అను సంపూర్ణ అర్థముతోనను మాట. అతని భారతము ఒక సృష్టి. కథ వ్యాసునిదే కావచ్చును. విశ్వమొక్కటియే యైనను సృష్టి యుగములలో మారుచువచ్చినట్లు కథ వ్యాసునిదే యైనను పాత్రలు తిక్కనవి! తిక్కన భారత పాత్రములు లోక స్త్రీభావమున కత్యంత సన్నిహితములు. మన మధ్య తిరుగాడు కొందఱే పాండవులు, మఱికొందఱు కౌరవులు అనిపించునట్లు తిక్కన పాత్రములను మలచినాఁడు.

స్వభావౌచిత్యమును తిక్కన యందు చూపింపఁబూనుట అతని భారతమునకు వ్యాఖ్యానము వ్రాయఁబూనుట. తిక్కన మలచిన ప్రతి పాత్రమున ఔచిత్యము భాసించును. సహజ స్వభావమును మఱచి మాటలాడవు తిక్కన పాత్రములు ధర్మజుని మొదలు ద్రుపద పురోహితుని వఱకు (విరాటోద్యోగ పర్వము లందు) తమ తమ ప్రవృత్తి కనుగుణముగ ప్రవర్తింతురు.

తిక్కన ధర్మజుఁడు ధర్మానుసారియే కాని శుద్ధలౌకికుఁడు. వ్యాసుని ధర్మజుఁడు ఇంత లౌక్యము నెఱుఁగఁడు. అట్లే ద్రౌపది 'తోఁక త్రొక్కిన త్రాఁచు' వంటి దను భావన కల్పించిన వాఁడు తిక్కన. జుట్టుపట్టి లాగిన దుస్ససేనుని కాటువేసిన శక్తి యామె. వ్యాసుఁడు ద్రౌపదిని ఇట్లే భావించి నాఁడు, కాని పోషింపలేదు. తిక్కన ఆ భావమునకు ప్రాణముఁబోసినాఁడు. పాత్రమును సృష్టించుట యనగా కేవలము కల్పించుటతో సరిగాదు. ఆ పాత్రము సజీవమూర్తివలె అంతరంగమున నిలిచిపోవునట్లు పోషింపవల యును. తిక్కన చేసినదిదియే. తిక్కన భారతము నామూలాగ్రముగ చదివిన పిమ్మట ఆ భారతమూర్తులు మనకు సుపరిచితులను గాఢముద్ర పడును. ఇట్లు కూర్చుటయె స్వభావౌచిత్యము. ఇట్లుగాక ఒకే పాత్రమును సమగ్రావగాహన లేక పలుతావులందు పలువిధముల వర్ణించినచో అస్పష్టత యేర్పడి పాత్రము మరుగున పడిపోవును. భారతమును తిక్కన 'వినిర్మించె' నను ప్రయోగములో నిదియే అంతరార్థము అస్పష్టముగ నున్న భావములను. పాత్రములను తిక్కన తీర్చిదిద్ది క్రొత్త సృష్టి అనునంత సుందరముగా రచన చేసినాఁడు. తిక్కన ధర్మజుఁడు, ద్రౌపది మానవనైజమును ప్రతిఫలించు సజీవులు, చైతన్యమూర్తులేగాని పాత్రములు గారు.

ధర్మరాజు మిక్కిలి ఆలోచనాపరుఁడు. విధివశమున రాజ్యమును కోల్పోయినాడే గాని తెలివిమాలి కాదు. అతని ఆలోచనల లోతు ఇట్టిదని తిక్కన మనకు కొంత చూపినాఁడు. ఆయుధములను శమీవృక్షముపై నుంచిన పిదప వానిని భీమునకు వశము గావలదని, 'ఏ మెయినైన వంచన వహించి తొలంగుట మత్సమీహితంబ'ని పలికినాఁడు. ఇది ఎట్టి దూరదృష్టి! తమ్మునైనను స్వప్రయోజనమునకు భంగము కలుగునట్లు ప్రవర్తింపనీయఁడు ధర్మరాజు. కీచకునిపై ఆవేశాగ్రహములను సభలో ప్రదర్శింపఁబోవు భీముని మదపుటేనుగును అంకుశమువలె నిలిపినాఁడు. అచటి నర్మోక్తులు ధర్మజుని స్వభావమున కుచితములైనవే.

విరాటుని సభ కరుదెంచిన సందర్భములో సైతము అతని స్వభావమున కనుగుణముగఁ బలికించినాఁడు తిక్కన. మూలములో సూటిగ తాను కంకుఁ

డని పలికినట్లు గలదు. అది ధర్మజుని స్వభావముకాదు. అట్లు పలుకుట అసత్య దోషమను శంక ధర్మజుని కుండితీరును. అందుకే తిక్కన అచట సంభాషణ వైఖరిని మార్చి ధర్మరాజు తన చరిత్రనే నర్మగర్భముగఁబలికినట్లు రచన గావించినాఁడు. అతఁడు ధర్మరాజని గుర్తింపబడును గదా! అని మనకు సందేహము కలుగుట సహజము. కాని సత్యమును చతురోక్తులతో మరుగు పఱచి మాటలాడిన ఆ మృదు భాషణము ఏ సందేహమును కలుగ నీయనట్లున్నది.

"ఆ. ఉన్నరూప పలుకు నన్నరు లెక్కుడఁ
గలరు తోఁచినట్లు పలుకు పలుక
నైన చందమయ్యె నంతియ కాకంత
పట్టిచూడఁ గలరె యెట్టివారు.'' 4.1.191.

ఇది తత్త్వముతో సత్యమును మరుగు పరచిన ధర్మజుని స్వభావమునకు తగిన రచన. ఇచట ఆతని స్వభావమును స్పష్టము, రాయబారపు సందర్భము లలో ధర్మరాజు ఆలోచనా సరళి, అతని స్వభావము స్పష్టపడునట్లు తిక్కన రచించినాఁడు. ప్రతిపదమును తూచితూచి వాడినాఁడు కవిబ్రహ్మ. తిక్కన వాక్యరచనా నైపుణ్యము, ప్రతిభ ధర్మజుని పాత్రమూలమున వెలువడినవి.

ఉద్యోగ పర్వమున ధర్మజుని ద్వైధీభావము భీముని ఔద్ధత్యము, అర్జునుని ప్రాజ్ఞత, నకులుని సౌమ్యత, సహదేవుని అకుటిలత, ద్రౌపది పగ తిక్కన స్వభావోచితముగ కూర్చినాఁడు. ఇంత స్పష్టముగ సంభాషణల ద్వారా పాత్రములను చిత్రించుట తిక్కన శిల్పము. తరువాతి కాలములో శ్రీనాథుఁడు, పెద్దన, తిమ్మన ఈ మార్గములో ఒక పాత్రమును ఒక ఘట్ట ములో వర్ణించిరేకాని తిక్కన వలె ఆమూలాగ్రము అట్లు చిత్రింపరైరి.

పాండవులు, ద్రౌపది మారువేషములలో విరాటనగరమున ప్రవే శించిరి. అచట వారిని తిక్కన వర్ణించిన విధము వారు చేయఁబోవు పనులకు సరిపోవునట్లు చక్కగనున్నది. భీముఁడు మహోన్నతాకారుఁడు. సుల భముగ గుర్తింపదగినవాఁడు. అందువలననే తిక్కన ప్రత్యేక శ్రద్ధ

వహించినాఁడు. భీముని వంటలవాని వేషమును విపులముగ వర్ణించి ఆతనిని అచ్చపు వంటలవానివలె చేసినాఁడు. ఇది స్వభావోచితమగు రచన (4.1.211). ఆతని వర్తనమును రూపమునకు దగినట్లు రచించుట మఱియు గమనింపదగిన అంశము. విరాటుఁ డాతనిని సమాదరింపగా—

॥క. అనుటయు మోఁటకు చందం
బున మోమడ్డము గదల్చి......... 4.1.221

నాడట. ఇచట సిరిరా మోకాలడ్డుచున్న భీముఁడు మూర్ఖుఁడని విరాటుఁడు, తత్సభాజనులు భావించునట్లు తిక్కన రచించెను.

ఇట్లే ద్రౌపదియొక్క సైరంధ్రీవేషమును విపులముగ పేర్కొని నాఁడు తిక్కన. సుధేష్ణతో తనను నీచపుబనులకు పంపవలదని ద్రౌపది అనుటను తిక్కన రెండు పద్యములలో పేర్కొని తదౌచిత్యము భావికథతో సంబంధము కలిగియుండుటను గమనించినాఁడు. కీచకు నింటికి సంపునపుడు మరల పలికినది సైరంధ్రి. అయినను పంపినది సుధేష్ణ; ఆమె భ్రాతృ వాత్సల్యము, పరిచారిక పట్ల నిర్లక్ష్యము అట్టివి.

ధర్మరాజు వారించగానే ఆగిపోయినవాడు భీముఁడు. ఉద్ధతుఁడే అయినను అగ్రజుని మాట జవదాటని అనుజుఁడు భీమసేనుఁడు. ఇక ద్రౌపది యన్ననో పరిభవింపబడిన మానవతి. 'నాథుల్ నేరముల్ సేయ పేరలుకం జెందిన యట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే' అన్నట్లు ధర్మజుని జూద ప్రియత్వమును సభలో ఎత్తి పొడిచినది ద్రౌపది. అచట తిక్కన రచన సూటిగ, పదునుగ వాడిబాణము వలె నున్నది. అట్లుండుట వలన ద్రౌపదీ కాంత పరిభవదుఃఖము తెలియుటయే కాక ఆమెస్వభావ మంత తీవ్రమనియు, ఆ తీవ్రానలము వలననే కౌరవాన్వయము దగ్ధమైనదనియు తేట మగు చున్నది.

"ఆ. నాదు వల్లభుండు నటుఁడింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారుఁ
గానఁ బతుల విధమకాక యేశైలూషి
గా ననంగరాదు కంకభట్ట. 4.2.152.

వ. అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్ప్రతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గఱువతనం బెక్కడిది.... యనుచు" (4.2.153)

ఇది తిక్కన అమూలకముగ పోషించిన పాత్రౌచిత్యము. మూలమునందు ద్రౌపది ఇంత తీవ్రముగ పలుకదు. ఒక్క శ్లోకములో ఆమె నిర్వేదము తెలియుచున్నది. కాని ఆవేశముకాదు. భారతమున ద్రౌపది ధీరవనిత. ఆమె అభిమానము గూఢాహంకారముతో కలిసియుండును. 'వరమున బుట్టితిన్' అని కంఠోక్తిగ చెప్పుకొనుటలో ఈ అభిమానమే కనిపించును. ఇచట తన పరిభవమును చూచియు మిన్నకుండిన ధర్మజుని ఉద్దేశించి ఆగ్రహావేశములతో ద్రౌపది మాటకుమాట బదులుపలుకుట ఆమె స్వాభిమాన స్వభావమునకు, క్షత్రియాంగన సహజనైజమునకు తగియున్నది. కేవల ముగ్ధపాత్రలకంటె స్వాభిమానము కలిగిన ప్రౌఢపాత్రలే జనసామాన్యమున (లోకమునందు) నిలిచిపోవును. ద్రౌపది, సత్యభామ తిక్కన తిమ్మనల పోషణలో ధీరవనితలుగా వాసికెక్కిరి.

ఈ తీవ్రతను కొనితెచ్చుటకు ఒక భూమికను తిక్కన ఎన్నుకొనెను. మూలమున ధర్మజుఁడు కోరుటతోడనే ద్రౌపది వారి అసమర్థతను పేర్కొని వెడలిపోయినది. ఇది చాలదు పాత్రపోషణకు. అటుపై మరల ధర్మరాజు కొంచెము తీవ్రముగ పలికినట్లు దానితో ద్రౌపది మఱియు ఖేదమొంది సాక్షిప్రాయముగాఁ బలికినట్లు తిక్కన కల్పించెను.

"క. పలుపోకలఁ బోవుచు వి
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గులసతుల గఱువచందము
తొలగఁగ నిట్లునికి తగునె తోయజవదనా." 4.2.150.

ఇట్లు తీవ్రత, తోడ్తో అనునయమును గలవు. "తగునె" అని పలుకుట ద్రౌపది సమాధానము నాశించుచున్నమాట. తగదు అనిన ఇక ద్రౌపది

పలుకుటకు అవకాశమే లేదు. తిక్కన ఇచట కూర్పదలచినవే ముఖ్యముగ ద్రౌపది పలుకులు. అందువలననే ధర్మజునిచే 'నాట్యంబు సూపు చాడ్పున' తగునె అనిపించెను. ఇది ద్రౌపది భంగపడిన అభిమానమునకు మఱియొక్క సమ్మెటపోటు. ఆతని మాటలనే ఆతనికి త్రిప్పికొట్టినది ద్రౌపది.

'నాట్యంబు సూపు చాడ్పున' అన్నందుకు "నాదు వల్లభుండు నటుఁడు ....' యేశైలూషిఁ గాననంగరాదు....అనియు, 'కులసతుల గఱువచందము తొలఁగఁగ' అనుమాటకు 'మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుంగావున జూదరి యాలికి గఱువతనంబెక్కడిది" అనియు బదులు పలికినది. ధర్మజుని ఒకమాటకు రెండుమాటలు బదులు పలికినది ద్రౌపది. ఇది ప్రౌఢాంగనయు క్షత్రియ కాంతయు నైన ద్రౌపది స్వభావమునకు తగినపెంపు. తిక్కన ద్రౌపది పాత్రమును ప్రతిసంఘటనలోను ఇదే విధముగ పోషించి స్వభావౌచితిని పాటించెను. ఉద్యోగ పర్వమున సైతము ద్రౌపది పలుకులలో ఇట్టితీవ్రతయే కల్పింపబడినది ఆంధ్రమున.

దుర్యోధనుఁడు పాండవ ద్వేషియేయైనను ఆలోచనాపరుఁడని తిక్కన ఉద్దేశ్యము. ఈ స్వభావమును దుర్యోధనుని యందారోపించుటకే తిక్కన పెంపు గావించినాఁడు. కీచక వధానంతరము ఆవార్తను విని దుర్యోధనుఁడు •తగ నాలోచించి కార్యంబు తెగువ కాంచి, పాండవులు విరాటునగరము నందు కలరని యూహించెను. దుర్యోధనుఁ డెట్టివాఁడైనను ఆతడు ధర్మజుని సత్యవ్రతము నెడల నమ్మకము కలిగినవాఁడే, దుర్యోధనుఁడే కాదు, ఆకాల మున అందఱకు ధర్మజుని మాట శిరోధార్యముగ నుండెడిది. ఆ నమ్మకము వలననే ద్రోణుఁడు 'అశ్వత్థామా హతః' అను ధర్మజుని మాటలను నమ్మి అస్త్రసన్న్యాసము చేసినట్లు, దుర్యోధనుఁడు అజ్ఞాతవాసవత్సర పరిసమాప్తిని ధర్మజుని నుండి వినగోరినట్లు తిక్కన కల్పించినాఁడు. భీష్ముఁడు లెక్కగట్టి కాలసమాప్తిని నిర్ణయించిన పిమ్మట గూడ దుర్యోధనునకు నమ్మకము కలుగక ధర్మరాజు వద్దకు దూతను పంపుటలో తిక్కన స్వభావౌచిత్యమును చక్కగ పాటించెననవచ్చును. ఇచట దుర్యోధనునకు భీష్ముని యందు సంపూర్ణ విశ్వాసము లేకుండుట తాలుతగ సూచింపబడినది. మున్ముందు ఉద్యోగ భీష్మ

పర్వములందిట్టి అవిశ్వాసమునే దుర్యోధనుఁడు ప్రకటించుచుండును. అమూలకమగు ఈ పెంపు సుయోధనుని అంతఃకరణమును బయటపెట్టునదిగ నున్నది. ఇక ధర్మరాజిచ్చిన సమాధాన మన్నచో ఆతని స్థిర సంకల్పమునకు తగినట్లే కూర్పబడినది.

"వాలి యజ్ఞాతవాస సంవత్సరంబు
నిండకుండంగ మున్న పార్థుండు బయలు
మెఱసి సమయంబు దప్పె నీ వెఱిఁగి దీని
కేది తగునది చేయుము మేదినీశ" 4-5-368

దుర్యోధనుఁదు 'నిండకుండంగ' అని తెలిసినట్లే చెప్పి పంపినాఁడు దూతకు.

"వ. అని పునర్వనవాస కరణంబు దోపనాడిన నవ్వి యధిష్ఠిత సత్య
వ్రతుండయిన యుధిష్ఠిరుండతని కిట్లనియె." 4-5-369

ఇచట నధిష్ఠిత సత్యవ్రతుండను మాట విశేషణౌచిత్యమును పాటించు నట్టిదిగ వేయబడినది. అజ్ఞునిచూచి ఒకానొక ప్రాజ్ఞుఁడు నవ్వినట్లు ఇచట ధర్మరాజు దుర్యోధనుని అజ్ఞానమును తలచి నవ్వెనను స్ఫురణ మనకు కలుగు నట్లు తిక్కన 'నవ్వి' అను క్రియా పదమును ప్రయోగించెను. ఇంత చిన్న పద ములో ఎంత లోతుభావము గలదో తఱచి చూడనగును. దుర్యోధనుని సందేశమునకు భీముఁడే అయిన ఆగ్రహావేశములతో బదులు పలికెడివాఁడు. లేక ఆ దూతనే శిక్షించెడివాఁడు. అదే సందేశమునకు ధర్మరాజు నవ్వి తగు రీతిగ బదులు పలికినాఁడు. తిక్కన ఇచట యుధిష్ఠిరుఁడనుటలో ఆతని స్థైర్య మును గుర్తు చేసినాఁడు.

"క. నిండె సమయాబ్దములు నిం
కొండనలేదెపుడ చని సుయోధనుతో భీ
ష్ముండు గురుఁడును వినఁగా
నిండె నిండె నను నిండె నిక్కంబునకున్" 4-5-370

ఇక ధర్మరాజు వాక్చాతుర్యమును తిక్కన ప్రతిపలుకునందు ఇమిడ్చి నాఁడు. 'నిండె సమయాబ్దము లు' అనునది అసలు సమాధానము. సుయోధనుతో భీష్మద్రోణులతో బలుకు మనుటలో ధర్మజుని చతురత మెఱయు చున్నది. దూతను భీష్మద్రోణులకు తెలియకుండగ పంపినాఁడు సుయోధనుఁడు అని ధర్మజుఁడు గ్రహించి అతనికి గురుజనముల పట్లనున్న అవిశ్వాసమును వారి కెఱింగింపదలచి మాతతో వారు కూడ వినునట్లు తన సమాధానమును చెప్పుమనినాఁడు. ఇది రాజకీయము. భీష్మద్రోణులకు దుర్యోధనుని యెడ అనిష్టత కలుగవలెనన్న ఇది యొక అవకాశము. ధర్మరాజు నవ్వులోని మఱియొక భావమిది: 'నిండె నిండె ననుము' అని ఆపినచో అది సత్యము గాదు, కేవలము పై పై మాట అనుకొందురని 'నిండెనిక్కంబునకున్' అని అనుట తన సత్యవ్రతమును తెలుపుటకే. నిండె నిక్కంబునకున్'–కేవలము నేననుటయే గాదు నిజమునకు నిండినవి–అని వచించెను. ధర్మరాజు స్వభావమును పరిపోషించునట్టిది ఇచటి సంభాషణక్రమము.

## అవస్థౌచిత్యము

బాల్య యౌవన కౌమార వార్ధక్యాదులు అవస్థలు. ఈ వయోనురూపావస్థల ను చితముగ వర్ణించుటయే అవస్థౌచిత్యము.[25]

తిక్కన విరాటపర్వ ప్రథమాశ్వాసము ఉత్తరను యౌవనారంభములో నున్న ముగ్ధగా వర్ణించెను (4.1.244). యౌవన ప్రాదుర్భావము నిచట వర్ణంచి, పరిపూర్ణ యౌవనమును చతుర్థాశ్వాసము నందును, వధూజన లావణ్యమును పంచమాశ్వాసము నందును వర్ణించెను. ఒక్క సంవత్సర కాలము నందు బాల యౌవనవతిగా నెట్లు పరిణతిఁజెందినదో తిక్కన చక్కగా వర్ణించుట అవస్థౌచిత్యమునకు పరమావధిగా నున్నది. ఆ మూఁడు వర్ణనలందును నిదర్శనములు. తొలుత 'ప్రౌఢ వనిత కైవడి ముద్దియ ముద్దువుట్టన దండ్రికి మ్రొక్కినది, తండ్రిచే నుపలాలింపఁబడినది. ఇచట ఉత్తర విచ్చలవిడి మెలఁగు కన్నియ, బాలకేళి మీఁది భరము వీడని చేడియ, కళలయందు వేడ్కలేని ముగ్ధ, సుశిక్షిత కాని నెలత. చతుర్థాశ్వాసము నందలి ఉత్తర పరిపూర్ణ యౌవనవతి (4.4.26). రాయంచనడక నేర్చిన లావణ్యవతి.

'ప్రార్థనా విషయ సంభ్రమములు పెనగొనంగ' బలుకు ప్రౌఢ వనిత. పంచమాశ్వాసమున పరిణతి చెందిన వధువు. వరుని సందర్శనాభిలాషను కనఁబరచిన ప్రౌఢ.

అవస్థలలో వయోరూపములను బట్టినవి కొన్నికాగా మనోభావముల ననుసరించునవి కొన్ని. ఆయా భావములను భావస్ఫోరకములుగా రసనిష్యందములుగా తిక్కన పరిపోషించెను. అది రసచర్చ. అటుగాక కీచకుని దశవిధ మన్మథావస్థలను పరమ రమణీయముగా వర్ణించెను. ఆ కల్పన యొక్క ఔచిత్యమును, ప్రయోజనమును మున్నే భావించి యుండుటచే నిట పేర్కొనమి ఔచిత్య మగును. అదికూడ అవస్థౌచిత్య పరిధిలో నొదుగు విషయ మగుటచే నిట ప్రస్తావింపఁ బడినది.

## 6. రససంబంధమైన ఔచిత్యములు

### అలంకారౌచిత్యము

అర్థౌచిత్యవతా సూక్తి రలంకారేణ శోభతే!
పీనస్తనస్థితేనేవ హారేణ హరిణేక్షణా॥" 26

కవి సూక్తి అర్థౌచిత్యము గల అలంకారముచే శోభించు నని క్షేమేంద్రుఁడు పేర్కొనెను. లక్షణ వాక్యము నందే ఉపమాలంకారమును నిబంధించుచు అలంకారముచే శోభించు సూక్తి పీనస్తనము లందున్న హారముచే శోభించు హరిణేక్షణ వంటి దని రమణీయముగాఁ బలికెను.

అలంకారశాస్త్రమున అలంకార ప్రాధాన్యమును దెలుపు ఒక సాహిత్య ప్రస్థానమే కలదు. భామహుఁ డా మార్గమునకు ప్రథమాచార్యుఁడు, 'నకాంతమపి నిర్భూషం విభాతి వనితాముఖమ్'27అని పేర్కొనుచు 'రూపకాద్యలంకార రహితమైన కావ్యము ఆస్వాద యోగ్యము కా' దని భావించెను. 'అలంకరోతి ఇత్యలంకారః,' "అలంక్రియతే అనేన ఇత్యలంకారః" అని రెండు విధములుగా అలంకారపదమును నిర్వచింతురు. గుణప్రాధాన్య వాదియైన దండి కావ్య బహిరంత సౌందర్యములను దర్శించి "కావ్యశోభాకరాన్

ధర్మానలంకారాన్ ప్రచక్షతే" అని పేర్కొనెను. వామనుఁడు గుణతత్త్వమును వివరించుచు కావ్యశోభాకరములు, గుణములనియు తదతిశయహేతువు అలంకారములనియు, గుణములు నిత్యములనియు, అలంకారము లనిత్యము లనియు సముచితముగా పేర్కొనెను.

ఆలంకారికులలో ఈ వామనోక్తి సర్వజనాంగీకార పాత్రముగా నున్నది,

"యువతేరివ రూప మాంగ కావ్యం స్వదతే శుద్ధగుణం
తదప్యతీవ,
విహితప్రణయం నిరంతరాభిస్స్యదలంకార వికల్ప కల్పనాభిః,
యది భవతి వచశ్చ్యుతం గుణేభ్యోవ్యదపురివ యౌవన వంధ్య
మంగనాయాః,
అపి జనదాయితాని దుర్భగత్వం నియతమలంకరణాని
సంశ్రయంతే"[28]

అను శ్లోకమున గుణహీనమైన కావ్యము, యౌవనహీనమైన యువతి యొక్క శరీరము వలెనే అలంకారములున్నను దుర్భగముగానే యుండునని వామనుఁడు పేర్కొనెను. క్షేమేంద్రుడు 'పీనస్తనస్థితేనేవ హారేణ హారిణేక్షణా' అనుటలో హారిణేక్షణకు సహజశోభను చేకూర్చినది తద్యౌవన చిహ్నమైన పీనస్తనమనియు తదతిశయమును కల్గించునది భూషణరూపమైన హారమనియు పేర్కొనుటలోని ఔచిత్యమది. సూక్తికి అర్థౌచిత్యము సహజ శోభను కలిగించునది. అలంకారము అతిశయ సౌందర్య హేతువైనది. "ప్రస్తుతార్థౌచిత్యేనోపమోత్ప్రేక్షారూపకాదినాలంకారేణ సూక్తిశ్చకాస్తి కామినీవోచ్చకుచచుంబినా రుచిర ముక్తాకలాపేన"[29] అను వివరణము కూడ ఈ తాత్పర్యమునే సమర్థించుచున్నది.

ధ్వన్యాచార్యుఁడగు ఆనందవర్ధనుఁడు రసాభివ్యక్తి కనుకూలమైన అలంకార నిబంధనము సమీక్షించుచు—

"వివక్షా తత్పరత్వేన నాంగిత్వేన కదాచన।
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా॥
నిర్వ్యూఢావపి చాంగత్వే యత్నేన ప్రత్యవేక్షణమ్ "[30]

అని నిరూపించి యున్నాఁడు. ఇందు అలంకారమంగమే కాని అంగి కాదనియు, దానిని సముచిత సమయమున మాత్రమే పరిగ్రహింపవలె ననియు చెప్పెడి ప్రధానాంశములు గమనింపదగినవి. అలంకారముల నట్లు గ్రహించుటయే ఔచిత్యము. కావున తిక్కనరచనలో కావ్యశోభాతిశయ హేతువులగు నలంకారములు ఎట్టి పట్టులందు ఎట్లు రసాభివ్యక్తి కనుకూల ముగా నిబంధింపబడినవో సమీక్షించి వాని సార్థక్యమును, ఔచిత్యమును సందర్శించుట అలంకారౌచిత్య విచార మన బడును. దీనిని మఱికొంత విస్తృతముగా ఐదవ అధ్యాయమున పరిశీలించుటయైనది. ఇందు స్థాలీపులాక న్యాయముగా ఒండు రెండుదాహరణములను స్పృశించుట జరుగుచున్నది.

తిక్కన విరాటోద్యోగ పర్వములందు ప్రయోగించిన అలంకారము లలో శబ్దాలంకారములు లేవనియే చెప్పవచ్చును. అర్థాలంకారములలో గూడ ఉపమ, రూపకములను విరివిగా ప్రయోగించెను. వర్ణనల యందు ఉత్ప్రేక్ష నెక్కువగా వాడెను. యుద్ధఘట్టములం దతిశయోక్తియు, రాయ బారములందు వక్రోక్త్యాద్యలంకారములను ఎక్కువగా గూర్చెను. ఎడనెడ నిదర్శన, దృష్టాంతాద్యలంకారములను నిబంధించెను.

''శా. సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జిత యూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేన పై వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్."
4-4-95

ఒక పద్య మంతటను వ్యాపించియున్న సమగ్రమైన ఉపమాలంకార మిచట గలదు. తిక్కన ఉపమలు సాధారణముగా ఒక్క వాక్యమునకు మించవు. ఇచట ఒక వృత్తమందంతటను అలంకారమునే నిబంధించి నాఁడ నఁగ ఆ అలంకార ఔచిత్యమును ప్రప్రథమముగ చూడవలెను.

అజ్ఞాత వాసము గడిచినదను స్పృహతో అర్జునుఁడు ఇనుమడించిన ఉత్సాహముతో, కౌరవుల పట్ల క్రోధముతో వచ్చుచున్నాఁడు. కాని కౌరవుల ఉద్దేశ్యములో ఇంకను అజ్ఞాతవాసము పూర్తికాలేదు. అందువలన ఆ వచ్చుచున్నది అర్జునుఁడేయని భావించియు పైకనలేక "వెరవరి కాక వీఁడు కురువీరులకుం బొడసూపు వాఁడె" అని భీష్ముని దెసఁజూచి పలికినాఁడు ద్రోణాచార్యుడు. అతని సందేహము బాపదలచి భీష్ముఁడు "తలపగ....దటి యయ్యెను" అని అజ్ఞాతవాస వత్సర సమాప్తిని గూఢముగ దెలిపినాఁడు.

ద్రోణుఁడు అర్జునుని దెస నత్యంత వాత్సల్యము గలిగినవాఁడు. తరచు అతనిని పొగడుచుండును. పదమూఁడు వత్సరముల అనంతరము కనుపింపఁ బోవు ప్రియశిష్యుని దలచి యాతని యెద యుప్పొంగినది. భీష్ముని పలుకులతో వ్రతభంగము అగునను శంకయుఁ దొలగినది, అందుచే కంఠోక్తిగ అర్జునుని పరాక్రమమును అలంకారయుక్తముగ బలికినాఁడు. అర్జునుని సింహముతో, తమను మాతంగ యూథముతోఁ బోల్చుకొనినాఁడు. కాంతార వాస ఖిన్నమతియైన అర్జునుఁడు ఆఁకలితో. కీడును పొందియున్న సింహము వలె క్రుద్ధుడై వచ్చుచున్నాఁడని వర్ణించినాఁడు. అరణ్యవాస క్లేశము, అవమానము, ఆకలి, చేడ్పాటులతో పోల్పదగిన ధర్మములే. సింహమువలె వచ్చుచున్నాఁడనుటతో సరిపోదుగదా. అతనిని వర్ణింపవలెనను కుతూహలము గురునకు దీరలేదు. 'సమరస్థేమాభిరామాకృతిన్' అని మనోహర రూపకల్పన చేసినాఁడు. అర్జునుఁ డొక్కరుఁడు, తాముపలువురు – ఇచట సింహము– మాతంగయూథము వచనౌచిత్యమునకు సరిపోయిన ఉపమానములు. అర్జునుఁడు సింహముతో, కురుసైన్యము మాతంగ సమూహముతో పోల్పఁబడెను. సింహము సముద్యత్క్రోధముతో రాగా అర్జునుఁడు సమరస్థేమాభిరామాకృతితో వచ్చినాఁడనుట చక్కని వర్ణన. సింహమువలె అర్జునుఁడే తెంచినాఁ డనిన కథార్థమునకు చాలును. కాని, అచట పలికినది ద్రోణుఁడు– చెప్పఁబడుచున్నవాఁ డాతని ప్రియశిష్యుడు అర్జునుఁడు. సింహమువలె ఒక్కరి మీద దుముకుట ప్రత్యేకత కాదు. అచట నిలచినది అంతు కనబడని కౌరవ సైన్యము–ముందున్న వారు మత్తగజముల వంటి మహావీరులు. అర్జునుని రాక సామాన్యముగ లేదు. అరణ్యవాసక్లేశము, అజ్ఞాతవాసభారము

అతనిని ఉద్యత్క్రోధునిగఁ జేయుచున్నవి. ఆ వచ్చుట అంత తీవ్రత కలిగి యుండియు ద్రోణునకు అభిరామముగ కన్పట్టుట ఆ గురుశిష్యుల అనుబంధమునే చెప్పక చెప్పుచున్నది. ఇన్ని యంశములు వాచ్యముగఁ బలికినచో సారస్యము చెడును. అంతేకాదు, సింహము గజసమూహముపై దుముకు చిత్రమును కమలముందు తిక్కన ఉపమాలంకారాధారముగ కూర్చినాఁడు. అది ఇంకేమార్గమునను సాధ్యముకాదు, ఇచట ఉపమా వాచకము 'ఓజన్' అనుమాట. ఇది పూర్ణోపమ.

అర్జునుని సింహముతో, మత్తశుండాలంబుతో, పర్జన్యునితో, సూర్యునితో బోల్చుట గోగ్రహణఘట్టమున పెక్కుతావుల గలదు — కాని ఇంత సమగ్రముగా పోల్చిన పట్టులొండు రెండు మాత్రమే కలవు. అతఁడు విరటు కొలువు చేరవచ్చినపుడు అతని యాకారమును ఒక సీసములో వర్ణించి, అది చాలదని కాబోలు మూడు ప్రసిద్ధోపమానముల నిచ్చినాఁడు. సాదృశ్యము సరియైనది ఎన్నుకొనగలిగినచో కవికి తానుగ వర్ణింపవలసిన పరిధి తగ్గును. అందుకే తిక్కన సీసము తరువాతి గీతములో ఉపమానములనిచ్చి ఊరకుండెను.

ఆ. వె. మంచు మఱుఁగు వడిన మార్తాండుఁడును బోలె
నీఱు కవిసియున్న నిప్పుఁ బోలె
వేషధారియైన విష్ణుండుఁ బోలె న
వ్విరటు కొలువు చేర నరుఁడు వచ్చె." 4-1-228

ఇచట నున్న మూడు ఉపమానములలో నుత్తరోత్తరములు మనోహరములు. "మంచు మఱుఁగువడిన మార్తాండుఁడు" అనుచోట మంచు విడిపోయి సూర్యుఁడు కనఁబడు అవకాశమున్నది వెనువెంటనే. నివురు కప్పిన నిప్పు — అన్నచో ప్రయత్నమున నివురుమాది నిప్పును కనుగొనవచ్చును. కాని వేషధారియైన విష్ణుని సాక్షాత్పరమేశ్వరుఁడే కనుగొన లేదుగదా! కంటికి నిత్యము గానబడునది మొదటి యుపమానము. సాధారణముగా నప్పుడప్పుడు చూచునట్టిది రెండవది. ఇక మూడవది సహృదయుని ఊహా

కున్న శక్తినిబట్టి భావింపఁదగినది. అర్జునుఁడు ఎఱుంగబడని విధముగ నున్నా డనుటకు ఆయాస్థాయిని బట్టి తిక్కన మూఁడు విధములుగఁ బోల్చినాఁడు.

"మ. విలసద్గాండివ చాలనోద్ధతి కనద్విద్యుల్లతా లీలగా
నలఘుస్ఫార కపిధ్వజధ్వని సముద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు పర్జన్యాకృతిఁ బోల్చె దో
ర్బల తీవ్రాంబునిదాఘ దుర్విషహగర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్"
4-4-251

ఇచట గాండీవ చాలనము విద్యుల్లతతో, కపిధ్వజధ్వని మేఘగర్జనముతో, రథము మేఘముతో, అర్జునుఁడు పర్జన్యునితో పోల్చఁబడుట ఉజ్జ్వలతను దోపించుచున్నది. తటిల్లతతో గూడి, ఉరుములతో నేతెంచు వర్షాకాలమేఘము స్ఫురణకు వచ్చుచు, అప్పటి అర్జునుని యుత్సాహమును వెలార్చుచున్న ఈ రూపకాలంకారము సార్థకము. అర్జునుని మేఘముతో, అతని సమస్త పరికరములను మేఘగర్జన, మెఱపుతీగ, ఇత్యాదులతో పోల్చుట వలన ఇది సమస్తవస్తు విషయ సావయవ రూపకాలంకారము. దీనికి అనుగుణముగానే మరల మరల వర్ణించెను.

"సీ. రోషంబు భీషణ రూపమై చెలువొంద
నతులకేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పటు జ్వాలలై నిగుడ న
ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్ల
నుద్ధతి నెసఁపక యుజ్జ్వల దివ్య ప
తాక మెఱుంగుగా దళితధరణి
రథనేమి రవము గర్జనముగ శరపరం
పరలు ధారలు గాఁగఁ బరగి యడరె

ఆ. నర్జునాంబుదం బనన్య సామాన్య స
ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి దఱిగి యపుడు కౌరవసేనా స
రోవరంబు దీన భావ మొంద." (4 5.105)

ఇరువురు మహావీరులు యుద్ధముచేయు సందర్భమును తిక్కన చక్కని యలంకార సాహాయ్యముతో వర్ణించును. ఒకరిని మించి ఒకరు వీరులైనచో ఇరువురికి తగిన ఉపమానములనే ఎన్నుకొనవలెను. కీచక, భీములను మత్త గజ, సింహములతో బోల్చి భీముని అధిక్యతను సూచనా మాత్రముగా తెల్పి యున్నాఁడు.

ఇచట అర్జున, కర్ణులను వర్ణించిన తీరు ముచ్చట గొలుపుచున్నది. నీరసములగు యుద్ధములను సరసములుగ చేయు నేర్పు తిక్కనసొత్తు! అర్జునాంబుదము వర్షించిన బాణధారల వలన కౌరవ సైన్యము కప్పబడగ తీవ్ర మారుతము మేఘసముదాయమును వలె కర్ణుఁడు చెల్లాచెదరుగ చేసినాఁడట! మేఘమండలి – తీవ్రమారుతము ప్రసిద్ధోపమానము లగుటచే ఇచట అర్థ వ్యక్తి ప్రస్ఫుట మగుచున్నది. అర్జునుని మరల మరల అంబుదముతో పోల్చుట గమనింప దగియున్నది.

"ప్రళయాంభోధరము క్తసాంద్రవిసరత్పాషాణ వర్షంబు మి"
(4. 5. 84)

సీ. ..................................................

ఆ. అర్జునాంబుదం బనన్య సామాన్య స
ముద్యమమున ముఖ పయోరుహముల
కాంతి తఱిఁగి యపుడు కౌరవ సేనా స
రోవరంబు దీనభావ మొంద." (4. 5. 105).

వర్షాకాలమున వర్షధారల వలన నీరు కలియపరుపబడి సరోవరములు బురదతో గూడి నిర్మలత్వము రూపఱి యుండుట సహజముగ గానబడు

విషయము. దీనితో అర్జునునిచే కలచబడిన కౌరవరాజ సైన్యంబును బోల్చుట తిక్కన ప్రకృతి పరిశీలనను దెలుపుచున్న చక్కని యలంకారము. ఇచటను సమ స్తవస్తు విషయ సావయవ రూపక మనవచ్చును. కర్ణుని కేతువు శిఖగా, శరపరంపరలు అగ్నిజ్వాలలుగా, అర్జునుని పతాక మెఱుపుగా, రథనేమి రవము గర్జనముగా శరపరంపరలు ధారలుగా, కర్ణుఁడగ్నిగా, అర్జునుఁ డంబుదంబుగా పోల్పఁబడియున్నవి. గీతపద్యములో రూపకము కలదు. కౌరవ సేనాసరోవరంబు అనుట వలన కాంతి తఱిఁగిన సరోవరంపు తత్వము, దీనభావ మొందిన కౌరవసేనయం దారోపింపఁబడినది. అర్జునుని అవక్ర విక్రమము, కౌరవ రాజ సైన్యము యొక్క దీనత చక్కగా నిరూపింపఁబడిన విచట.

ఒక చలనదృశ్యమును వర్ణించునెడ కొన్ని పోలికల నిచ్చి వాటి సాహాయ్యమున ప్రస్తుత దృశ్యము సహృదయ హృదయ ఫలకముపై చిత్రీకరింపబడునట్లు తిక్కన రచన సేయును. ఇచట అలంకార రచన వర్ణనీయ దృశ్యము అభిరామ మగుటకు తోడ్పడును.

"సీ. సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్టజను విధమునఁ
గ్రూరదానవుఁడు భూచారి నిర్జరకాంతఁ
బొదువ రయమ్మున బోవుభంగి
ఘోర గృధ్రము సుకుమార నాగాంగనఁ
బటుగతి నొడియంగ బాఱుకరణిఁ
బ్రబలి బిడాలంబు బాలశారిక మీఁద
నడరి సత్వరము నరుగు మాడ్కి

తే. సింహబలుఁ డత్యుదగ్రతఁ జిగురుఁబోడి
వజ్జఁ గదువడిఁ దగిలి కోపంబు కదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు కొసరించుకయు లేక కూలఁదాచె," (4. 2. 128)

ఇచట నున్న ఉపమాలంకారముల వరుస వలన కీచక ద్రౌపదుల ప్రస్తుత పరిస్థితి వారివారి భావాదులు ఊహింప వీలగుచున్నవి. కీచకుని ఉగ్రత, సైరంధ్రి నిస్సహాయత వాచ్యముగ వర్ణింపఁబడక అలంకారము ద్వారమున వ్యంగ్యము చేయఁబడినవి. వ్యంగ్యము అలంకారము ద్వారా పోషింపఁబడిన దిచట. అలంకారము ఒక ప్రయోజనము కొఱకు కూర్పఁ బడినది. సింహబలుఁడు సైరంధ్రిని బట్టుట అను క్రియ పలు ఉపమానములతో బోల్పఁబడినది. ఒక ఉపమేయము వరుసగా కొన్ని ఉపమానములతోఁ బోల్పఁ బడుట వలన నిది మాలోపమ.

మనోహరములగు ప్రకృతి దృశ్యములయం దిచ్చగలు మక్కువజూపగ సామాన్యముగా నీరసములని భావింపబడు యుద్ధములను, సైన్యములనుసైతము అలంకార భూషితములఁ జేసి మనచే నాస్వాదింపఁ జేయును. ఉత్తర గోగ్రహణ మునకై ఏతెంచిన కౌరవసైన్యమును గాంచిన ఉత్తరుఁడు భయకంపితుఁడా యెను.ఆసైన్యమింత పెద్దది అనుటకు, దాని ఉదగ్రతను వర్ణించుటకు తిక్కన ఒకసీసమును, ఒక శార్దూలమును తీసికొని అలంకారములతో నిబంధించి మఱల మఱల భావింపఁదగు రీతిలో రచన చేసెను. ఆ కురురాజు సైన్యముచే ఎగసిన ధరాధూళి లలితవనము దివికి నలిఁగాఁవుపోయెడు తెఱఁగు దాల్చినదట. లలిత వనముతో సైన్యములచే ఎగసిన ధూళి పోల్పఁబడుట తిక్కన ప్రత్యేకత, అతఁడు భావుకుఁడైన కవి. కవికి ప్రపంచమున మనోహరముగ కనబడని వస్తువు లేదేమో! గ్రహించిన ఏ అంశమునైనను అభినివేశముతో వర్ణించు నేర్పు తిక్కన కున్నదనుటకు ఈ ధూళివర్ణనము నిదర్శనము. ఉద్యాన వనమును, పర్వత శ్రేణిని, సరోవరములను వర్ణించినంత మనోహరముగ ధూళిని తిక్కన వర్ణించినాఁడు. అదియు సైన్యము నడచుటచే ఎగసిన ధూళి! కాదేది కవిత కనర్హము అని తిక్కన భావించెను ఆనాడే.

.సీ. అభినవ జలధర శ్యామంబు లగునెడ
లాకు జొంపంబుల ననుకరింప
సాంధ్య రాగోపమ చ్ఛాయంబులగు పట్లు
కిసలయోత్కరముఁ బ్రోదిసేయ

రాజమరాళ గౌరపులగు చోటులు
తఱచుఁ బూఁబోదల చందంబు నొంద
హరిద్రరుచి సమానాకృతులగు తావు
లడరెడు పుప్పొడు లట్లు మెఱయఁ

తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిఁగాఁపువోయెడు తెఱఁగు దాల్ప
గోగణము మ్రుఁగలిగ నేల గోడి వడఁగ
నడుచు కౌరవరాజ సైన్యంబుఁ గనియె" (4. 4. 50)

ఇక దానిని చూచిన ఉత్తరునకు మాత్రమది తిక్కనకు వలె మనోహర ముగ కనుపింపలేదు, పాపము. ఏ విషయమైనను పాత్రస్వభావమును బట్టి మారుచుండునుగదా! ఇచట ఉత్తరునకు ఆ సైన్యము తీవ్రముగ కనుపించి నది. ఇందొక చక్కని రూపకము కూర్పఁబడినది.

"శా. భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్ర ధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్యమిది యేఁ జేరంగ శక్తుండనే."
4. 4. 52

వక్తృ చిత్తవృత్తి వ్యంజకమగు ఓజోగుణమిందు అలంకారముతో కూడి రసాభివ్యక్తిని కలిగించుచున్నది. అకృతాస్త్రుఁడగు ఉత్తరుని భయోద్వేగ మిందు రూపు కట్టినది. ఆతని దృష్టిలో కౌరవరాజ సైన్యంబు ఎట్లున్నదో ఇచటి అలంకారము వలన తెలియనగును. మొదటి రూపకమున కురుసైన్య ము లలిత వనముతో పోల్పబడినది. అట ఉపమానము మనోహర మగుట వలన ఆస్వాదనీయ మగుచున్నది. ఇట ఉత్తరు చిత్తవృత్తి సాలంకారముగా వ్యక్తము చేయబడుటవలన అలంకారౌచితి యేర్పడి సహృదయుల నాకట్టు కొనును.

అజ్ఞాత వాసమున కేతెంచునప్పటికి ద్రౌపది అరణ్యాతాప క్లేశమువలన కృశించి వన్నెదఱిగి యున్నది. సైరంధ్రీజాతి వేషమును దాల్చియున్నది. అందుచే నామె వన్నె తఱిగిన విధమునే ప్రకటించినాఁడు. కొంత వడలినను కాంతి వీడని ద్రౌపదిని వర్ణించుట ఈ అలంకార సార్థక్యము.

"సీ. పఱ మొయిల్ గప్పినఁ బాడఱి సుగాంతి
గడలిన యమృతాంశుకలయుఁ బోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి
చెలువు గుందిన సరోజిని విధమున
ధూమంబు వొదవిసఁ దుఱఁగలి మెఱుగులు
నలఁగి మాసిన దీపకళిక పగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని
లావణ్య మెడలిన లతికభంగి

తే. గంధకారికా వేషంబు కతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱువడి యుండఁ బాండు
తనయ మహిషి యంచితగతిఁ జనఁగ రాజ
వీథిఁ బౌరజనంబు లవ్వేలఁదిఁ జూచి." 4-1-294.

ఇచట పేర్కొనబడిన వస్తువులన్నియు కళదప్పిన సైరంధ్రిని స్ఫురింప జేయుచున్నవి. ఝటిత్యర్థస్ఫూర్తికై కూడ తిక్కన యలంకారము నుపయోగించుచుండును. ఇట్టిచోట్ల విపుల వర్ణన కంటె సంగ్రహపద ప్రయోగమే చేయును.

"ధర్మసూతి మెత్తని పులి" (5-2-14)
ధర్మజుఁ డిట్టి వాఁడను సమగ్రావగాహనము కలుగుచున్నది.

"అజాత శత్రుఁడలుగుట స్త్రీల నగ్ని పుట్టినట్టిదయ్యో మీకు" (5-2-125)

ఇట్టి యలంకారములు లెక్కకు మిక్కిలి గలవు. పులి క్రూరతకు పేర్కొనదగిన జంతువు. కాని ధర్మజుని క్రోధము పైకి కనుపించునట్టిది కాదు-కాని తీవ్రమైనదే. అందువలననే తిక్కన 'మెత్తని పులి' యని రూపించెను. అట్లే కృష్ణుడు ఆతని అలకను అగ్నితో పోల్పదలచి అది సాధారణమగు నిప్పు అయినచో నీళ్ళతో నార్పవచ్చును అని ఆర్ప వెరవులేని బడబానలమని ఉత్ప్రేక్షించెను.

సహదేవుడకుటిలుడు. ఆర్యసమ్మతుడు. 'రక్కసమాటలాడెదరు రాజును, దమ్ములు' అని ధర్మరాజునే ఒక విసురు విసర కలిగిన తీవ్ర స్వభావుడు. అందువలననే నీఱు గవిసిన నిప్పు అని, ధూమంబు పొదవిన దీపకళిక అని అర్జునుని, ద్రౌపదిని వర్ణించిన తిక్కన ఆతనిని మాత్రము తద్వ్యతిరేకముగ 'శిఖి శరీరియయ్యెనో యనఁగన్' అని వర్ణించెను. ఇది స్వభావానుగుణముగ నుపయోగించిన తిక్కన అలంకార రచనము.

చంద్రోదయాస్తమయములకు హేతువుల నూహించి చక్కని యుత్ప్రేక్షలను తిక్కన కూర్చినాఁడు. రెండుచోట్లయందును కౌరవ, పాండవులు చంద్రవంశ రాజులను స్ఫృహతో ఉత్ప్రేక్షించినాఁడు. హేతూత్ప్రేక్షకివి చక్కని యుదాహరణములు.

"క. తన మనుములు పాండు తనయు
లనిచేఁతకు వేడ్కసేయు టాత్మఁగని తమిం
బున వారు మెఱయ రని వ
చ్చిన క్రియ శశి పూర్వశైల శిఖరం బెక్కెన్" (4-3-198)

"తే. తనకులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు
లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు
కంది యెంతయుఁ జెలు వేఁదె జందురుండు." (5-2-107)

ఎచటనైనను ప్రకృతి వర్ణన చేయునపుడును తిక్కన అంతస్సూత్రముగ కథను స్పృశించుచుండును. చంద్రుని అట్లు వర్ణించిన తిక్కన సూర్యోదయ కాలమును సూచించవలసిన అవసరమున నైతము కథకు సంబంధించిన విధము గానే వర్ణించినాఁడు.

"తే. ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచునున్న సరసి
వేడినిట్టూర్పులో యన వెడలె గ్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మివిరుల." 4-2-236

ఇచట పద్మినీజాతిస్త్రీ ఊర్పులు సువాసనలతో గలిసియుండునను ప్రసిద్ధి ఊతగా తిక్కన చక్కని యుత్ప్రేక్షను కూర్చెను. కవి ప్రతిభకు ఇతరాలంకారముల కంటె ఉత్ప్రేక్ష యెక్కువగ పట్టిచ్చును.

## గుణౌచిత్యము

ప్రస్తుతార్థోచితః కావ్యే భవ్యః సౌభాగ్యవాన్ గుణః"[31]

అను క్షేమేంద్రుని వాక్యము ననుసరించి ఓజఃప్రసాద మాధుర్యాది గుణములను ప్రస్తుతార్థోచితముగా కావ్యమునందు నిబంధించుటయే గుణౌచిత్యమనబడుచున్నది. కావ్యశోభాకరములైన నిత్య ధర్మములు గుణములని వామనోక్తి. వామనుఁడు దశవిధగుణములను శబ్దార్థ భేదములచే ద్విధా కరించెను. తద్విభాగము సూక్ష్మ విశ్లేషణాత్మకమైనది. అందుచే మాధుర్యోజః ప్రసాదములనే తరువాత ఆలంకారికులు స్థిరీకరించుకొని కావ్య విమర్శనము కావించిరి.

"మాధుర్యోజః ప్రసాదాఖ్యా స్త్రయస్తేన పునర్దశ ।"
కేచి దంతర్భవంత్యేషు దోషత్యాగా త్పరే శ్రితాః॥"
అన్యే భజంతి దోషత్వం కుత్ర చిన్న తతో దశ ।"
(కావ్యప్రకాశము-పుట 290-295)

అను మమ్మటుని వాక్యములు ఈ మార్గమునకు ప్రమాణములు. జగన్నాథ పండితరాయలు ఆ గుణములతో కూడిన రసమును చర్వణము చేయునెడ సహృదయుల చిత్తవృత్తులందు భాసించు అవస్థా విశేషములను విశ్లేషించి ఇట్లు పేర్కొనెను-"గుణానాం చైషాం ద్రుతిదీప్తి వికాసాఖ్యాస్తిస్రః చిత్తవృత్తయః క్రమేణ ప్రయోజ్యాః తత్తద్గుణ విశిష్టరస చర్వణా జన్యా ఇతి యావత్."32

మాధుర్యమువలన చిత్తద్రుతియు, ఓజస్సువలన చిత్తదీప్తియు, ప్రసాదమువలన చిత్తవికాసమును కలుగునని జగన్నాథుని వివేచనము. దీనిని రసముల కన్వయించినచో కరుణాది రసములవలన చిత్తద్రుతియు, శృంగార హాస్యాదులవలన చిత్తవికాసము కలుగుననుట సహృదయ సమ్మతము. ఇందు ప్రసాదము సర్వరస సామాన్యమనియు, మాధుర్యౌజస్సులు లలిత పరుష రసపోషణమునందు ప్రసాదగుణముతో కలియుననియు లాక్షణికులు వివేచించెదరు. ఇట్టి సంయోజనము కూడ వక్తృవాచ్య ప్రబంధ సన్నివేశాదుల నాశ్రయించి వర్తిల్లుచుండుననియు వివేచింపదగియున్నది. గుణత్రయముచేత రీతిత్రయము స్ఫురించుచుండును. ఓజః ప్రసాదాది సకలగుణానుకూలమై విపంచీస్వర సౌభాగ్య సంపన్నమైనది వైదర్భీ రీతి. ఓజఃకాంతి గుణోపేతమై గాఢసమాస బంధయుతమైన రచన గౌడీరీతి. మాధుర్య సౌకుమార్య గుణ సంయుతమై అల్పసమాసమైన రచన పాంచాలీ రీతి. గుణములు రీతులను రూపు కట్టించును. వృత్తులను రసవ్యంజకము లొనరించును. అందువలననే రసధర్మములలో గుణములు అగ్రపరిగణనార్హములు.

తిక్కన రచన గుణ సమంచితమైనది. ఆంధ్ర సాహిత్యమున నన్నయ తిక్కనల మార్గములు రెండు విలక్షణములైన రచనా పద్ధతులు. గుణముచేత శోభిల్లెడి రీతిని రసవ్యంజకముగా రాణింపఁజేసెడి మార్గము నావిష్కరించిన వాఁడు నన్నయ. వాక్యరచనా విన్యాసములచే వ్యక్తీకరింపఁబడు గుణములను రసపోషకములుగా సంపదించెడి మార్గము నారంభించిన వాఁడు తిక్కన. నన్నయ మార్గము శబ్దార్థోభయాత్మకమైన కావ్యశరీరమును మధురముగా స్ఫురింపఁజేయునది. తిక్కన మార్గము రసాత్మక వాక్యమైన కావ్యస్వరూప

మును సార్థకముగా స్ఫురింపఁజేయునది. గుణములు వక్తృచిత్తవృత్తి వ్యంజకములు. కావ్యమునందు వక్తృవాక్యములు గూడ గుణవంతములైనచో పాత్ర చిత్తవృత్తివ్యంజకములగును. తిక్కన పాత్ర సంభాషణలను తత్తత్ప్రసోచిత గుణవిశిష్టములుగా వినిర్మించి, నాటకీయతను పాటించుటతో పాటు నానావిధ రసపోషణ శిల్పమును వెలార్చుచుండును. నన్నయ మార్గము నుండి శ్రీనాథుని రీతిమార్గము మోసులెత్తినది. తరువాతి కవులకు అది ధారాళమైన త్రోవ చూపినది. తిక్కన మార్గము నలుగురు నడువగలిగిన మార్గము కాదు. అందువలననే తిక్కన ననుసరించి మెప్పువడసిన కవుల సంఖ్య తెలుఁగునందు తక్కువ.

గుణప్రధానమైన తిక్కన రచనలో గుణౌచిత్యము సహజ స్వభావముగా భాసించును. అయినను లక్ష్య నిరూపణార్థము రెండు మూఁడుదాహరణములను గ్రహించి ఈ యంశమును సమర్థించుట యగుచున్నది.

"చ. ఇది కడు ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేరదెంతయున్
మృదు వొక కీడుపాటునకు మేకొనఁజాలదుదాత్తచిత్త యొం
టి దిరుగు దానికోర్వ దొకటిందనుఁ దా సవరించు చొప్పెఱుం
గదు తగ నొడ్లనుం గొలువఁగా వెర వెమ్మెయిఁగల్గు నక్కటా.
(4-10-108)

"శ్లైథిల్యం ప్రసాదః" అని వామనోక్తి. శ్లైథిల్యము బంధమునకు సంబంధించినది. ఇది ఓజో గుణమునకు విపర్యయరూపమైనది. "పృథక్పదత్వం మాధుర్యం" అని మాధుర్య లక్షణమును వామనుఁడు పేర్కొనెను. సరసములగు పదములు కూర్పఁబడినచో మాధుర్యగుణము సిద్ధించును. పై పద్యమున శిథిల బంధమును కలదు. పృథక్పదత్వమును కలదు. ఇట్టి మిశ్ర స్వభావము కల్గిన పద్యమునందు ప్రసాద మాధుర్యముల మిశ్రరూపము గలదని పేర్కొనవచ్చును. గుణవివేచనమునకు బాహిరమైన లక్షణముల కంటె ఆంతరమైన అనుభూతి ప్రధానముగా తోడుపడుచుండును. పై పద్యము ధర్మజుఁడు ఖిన్నాంతఃకరణుఁడై పాంచాలి నాలోకించి పలికినది. అతఁడు ఖిన్నుఁడగుటకు

కారణ మాతని కామెపైగల యనురాగము. అతని యనురాగమునకు పాత్రురాలైన పాంచాలి అజ్ఞాతవాస వ్రత విషయకమైన క్లేశమును పొందనున్నది అబల ఎట్లోనర్చుకొనునోయని ధర్మజుని పరితాపము. ధర్మజుని యనురాగము చిత్తవికాసరూపమైనది. ధర్మజోక్తికి మూలధర్మమది. ధర్మజుని ఖేదము చిత్తద్రుతిని కలిగించునది. అట్లగుటచే అతని వాక్కులయందు జగన్నాథుని వివేచనను ననుసరించి ప్రసాద మాధుర్యములు స్ఫురించుచున్నవి.

తిక్కన శిథిలబంధత్వము నీ పద్యమున సంగ్రహ వాక్యరచనా శిల్పమున వెలార్చెను. నాల్గు చరణములలో నెనిమిది వాక్యములను నిబంధించి నాఁడు తిక్కన. వాడిన చిన్న వాక్యములయందును పృథక్పదత్వము స్ఫురింపఁ జేసినవాఁడు తిక్కన. సంగ్రహ వాక్యబాహుళ్యము ధర్మజుని ఖిన్నాంతః. కరణత్వమును వ్యక్తము చేయుచున్నది. 'కడు ముద్దరాలు', 'ఎంతయున్ మృదువు', 'ఉదాత్త చిత్త', 'అక్కటా' మొదలగు సరసములైన పదములను వాడుటచేత చిత్తద్రుతిరూపమైన ధర్మజుని విచారము వ్యక్తమగుచున్నది. ద్రౌపది స్వభావ వర్ణనాత్మకమైన ఈ పద్యము సహజముగా మధురము ధర్మజుని వాక్కు ప్రతిబింబితమగుటచే నది ప్రసన్నము. ఇందు ప్రసాదము భిత్తిక; మాధుర్యము చిత్రము.

శా. దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా." 4. 2. 55

కీచకుఁడు నీచుఁడని తెలిసి జంకించిన గాని మెత్తబడఁడని మనమున తలంచి ద్రౌపది యాతనితో నిట్లనినది. ఈ పద్యము ఆంధ్ర సాహిత్యమున ఓజోగుణమునకు ఉజ్జ్వలోదాహరణముగా విమర్శకులు పేర్కొనుచుందురు. గాఢ బంధత్వము ఓజస్సని వామనుఁడు. ఈ పద్యమునందు పాటింపబడిన నిర్మాణ శిల్పము పూర్వోత్తరార్థముల యందు భిన్నరూపములుగా భాసించు

చున్నది. ఓజస్సు నిజమున కట్లు రెండు విధములుగా నిర్వహింప వచ్చును. తిక్కన లక్షణము చెప్పక సమగ్ర లక్ష్యమును వ్రాసినాఁడీ పద్యమున

ఈ పద్యము నందలి గాఢ బంధత్వమునకును, ఓజోగుణమునకును కారణము ద్రౌపది క్రుద్ధమై కీచకుని జంకింప యత్నించుట. క్రోధమే సహజముగా పరుషమైన భావము. పదములందు పారుష్యము, ప్రవృత్తియందు దీప్తియు కుపితయైన ద్రౌపది చిత్తవృత్తికి సహజ లక్షణములు. ఎదుటివానిని భయపెట్ట వలయునన్న ప్రయత్నము కూడ నీ వాక్కుల యందు గలదు. పద్య పూర్వార్ధము నందు దీర్ఘ సమాస సంఘటితమైన బంధము కలదు. పాండవ పరాక్రమస్ఫూర్తి గలకు భయంకరముగా స్ఫురించునట్లు చెప్పెడి వాగ్వైఖరి యది. ద్వితరార్ధమునందు గంధర్వులొనర్పఁబోవు చర్యలు వర్ణింపఁబడినవి. రకార వకారములతో కూడిన ద్విత్వాక్షర ప్రాసము అంతఃస్థమైన ఆగ్రహమును వ్యక్తము చేయుచున్నది. పూర్వార్ధము ఆకృతివర్ణనము; తఉరార్ధము చేష్టా వర్ణనము. ఆకృతి వర్ణనము అవిచ్ఛిన్న సమాసము నందుండుట ఔచిత్యము. చేష్టా వర్ణనము సార్థకములైన పృథక్ శబ్దములపై ఊనిక పడునట్టి వాక్యములందు రచించుట ఔచిత్యము. క్రోధభావమును సమాస భూయిష్ఠమైన రచన యందును, సాధిక్షేపపద ప్రధానమైన విశ్లథ రచన యందును వ్యక్తీకరింప వచ్చును. ఒకటి కోపభావ తీవ్రతకును, మఱి యొకటి కోపభావ దీప్తికిని వ్యంజకమగును. తిక్కన తీవ్రతను, దీప్తిని క్రమముగా పూర్వోత్తర భాగములందు నిబంధించి పైపద్యమును నిర్మించెను. అట్లగుటచే ఓజస్సున కపరావతారముగా ఈ పద్యమును సహృదయుఁడు భావించును. ఇందలి పరుషాక్షర సంయోజనము దాని గుణమునకు పరువమును కల్పించుచున్నది. ఔచిత్యమునకు అవధిని చూపించుచున్నది.

గుణౌచిత్యమున గమనింప దగిన యంశము మఱియొకటి కలదు. కవి కావ్యమున ఒక పాత్ర యొక్క ఆకృతి వర్ణనము చేయవచ్చును; అనుభావ వర్ణనము కావింపవచ్చును; ఆ పాత్రము యొక్క భావాభివ్యక్తిని భావ నామయ మొనర్చుచు వర్ణింప వచ్చును. ఇందు మొదటి పద్ధతి యందును, రెండవ విధము నందును రూపచేష్టాదులు పఠిత మనమున రూపు కట్టునట్లు

చేయుటకు కవి శబ్దసహాయమును విస్తారముగా గ్రహించును. మూడవ విధము నందు అర్థాలంకారమును ప్రజ్ఞా సమున్మేషముగా ప్రయోగించును. ఇందు శాబ్దిక సంవిధానమున కంటె, ఆర్థికమైన భావనమునకే అగ్రతాంబూలము. తిక్కన యిట్టి మెలకువల నెన్నింటినో తన రచనమున నౌచిత్యమెఱిఁగి ప్రయోగించినాఁడు. మచ్చునకు—

భీముని కోపవర్ణనము—

"చ. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
లనలఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంత దంత పీ
డన రటదాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకార భయదస్ఫురణాపరిణద్ధ మూర్తియై."
4. 2. 133

"సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి
యేపున రేఁగి వాయించి యాడ
కులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ
నేడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచని రొంపి మై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ

తే. మిగిలి బ్రహ్మాండ భాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయ కాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతి భయంకరాకారత నతిశయిల్లె." 4. 2. 134.

కీచక కృత ద్రౌపదీ పరాభవమునకు భీముఁడు పొందిన కోపతీవ్రత పరిణామ సుందరముగా మొదటి పద్యమున వర్ణింపఁబడినది. క్రుద్ధమూర్తి భయంకరమూర్తియైనాఁడు. అతని వర్ణనము సాత్త్వికభావములతో మొదలై అనుభావములతో ముగియుచున్నది. పూర్వార్ధమున సమాసఘటనము క్రమముగా ఓజస్సును అందుకొని, ఉత్తరార్ధమున ఉజ్జ్వలముగా రూపుకట్టినది. అది భీముని కోపము భయంకరాకృతిని దాల్చిన విధమును పరితకు శాబ్దిక ఘటనారీతి వలన ప్రత్యక్షీకరింపఁ జేయుచున్నది. మఱి సీసపద్యము నందు ఆతని భయంకరాకారత భావనామయ మొనర్పఁబడినది. అందు భీముఁడు ప్రళయకాలానలమున గండరించిన రూపంబు కరణి నతిశయించినాఁడు దంతపీడనాది కాయిక చేష్టలచే భయంకరాకారము దాల్చుట భౌతికము; ప్రళయానలోపమానము కవిభావనలో రూపొందిన విభావనము. మొదటి పద్యము భౌతికాకార ప్రత్యక్షీకరణ శిల్పరమణీయమైన పరుషాక్షర సంయోజన శబ్దశిల్పముపై సాగినది. రెండవ పద్యమున భావనాబలమున రూపుకట్టిన భీమ భయంకరాకారత భాసించినది. అప్పటిభీమరౌద్రము కార్య రూపము చెందనిది. కాలాంతరమున కీచకప్రళయరూపమైనది. అప్పటి భయంకరాకారము ప్రత్యక్షమయ్యు ప్రత్యేకప్రయోజనము సాధింపమిచే భావనారామణీయకత్వమునకే అది పరిమిత మగుచున్నది. అందువలన సీస పద్యమున సమాసరచనను తిక్కన చేపట్టలేదు. "ఇట సమాసభూయిష్ఠమగు రచన ముండవలెను. కాని లేదు. ఇట్లు లేకుండుట దోషమే." అని శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారనుట గుణౌచిత్యమును గుర్తించి పలుకుట కాదు. రూప భావప్రధానములైన రచనములందు కవి శాబ్దికమైనఘటన నొకవైపునను, ఆర్థికమైన అలంకార రచనమును మఱియొక వైపునను గ్రహించి రసము నొప్పించు శిల్ప రహస్యమును గుర్తించినచో పై సీసపద్యమున గుణమే గోచరము కాగలదు. వామనుఁడు శబ్దగుణమైన ఓజస్సును గాఢబంధమనియు, అర్థగుణమైన ఓజస్సును అర్థగాంభీర్యమనియు పేర్కొనెను. ఓజోగుణము రౌద్రభయానక రసభావ పోషకమని అంగీకరింతురు కదా! అయినచో శబ్దార్థగుణ విశిష్టమై భాసించు నిఱుతెఱఁగులకీ రెండు పద్యములు చక్కని దృష్టాంతములగు ననుటలో విప్రపత్తి లేదు.

భావముల కుచితమైన గుణములను గుప్పించు తావులు తిక్కన రచనలో కుప్పలు తిప్పలు. మచ్చునకు రెండు.—

"మ. భవదాజ్ఞా దృఢబంధ సంయమిత శుంభద్వేగమై కాక నాఁ
డవలీలన్ మన యర్జునద్విపము క్రోధావేశ దుర్దాంత ద
ర్ప విలాసోద్భట భంగి నే పడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కు వడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్క సం
ధిల్లఁగన్". 4. 1. 56.

ఇందలి "భవదాజ్ఞా దృఢబంధ సంయమిత శుంభద్వేగమై" అను సమాసము ధర్మజుని ఆజ్ఞ కున్న గౌరవమును ధ్వనింపఁ జేయునట్టిది. "క్రోధావేశ దుర్దాంత దర్ప విలాసోద్భట భంగి" అను సమాసము అర్జున ద్విపము యొక్క క్రోధావేశ దర్పములను మనసుల కందించునది. మిగిలిన సమాసపము లాయా రూపకములను రూపుకట్టించునవి. ఇందర్థాలంకార మున్నది. సార్థక సమాస సంవిధానమున్నది. అగుటచే తిక్కన్న సవ్యసాచిత్వము తేటపడుచున్నది.

"చ. కడుఁ బసిబిడ్డ వీడొకటి గాదవునా నెఱుఁగండు ముందరె
య్యెడ నొక పాటెఱుంగఁడెద యెంతయుఁగోమల మెప్పు
డైన నేఁ
గుడువఁగఁబిల్తుగాని తనకుంగల యాఁకటి ప్రొద్దెఱుంగఁ డీ
కొకుకిటు పోకకున్ మనము గుందెడు నిన్గని యూఱ
డిల్లెడున్." (4. 2. 213)

ఈ మాటలు కుంతి ద్రౌపదితో సహదేవుని గూర్చి అనినవి. ఆమె వాత్సల్యమంతయు ఆమె మాటలలో జాలు వారినది అరణ్యావాస క్లేశమునకు సహదేవుఁడు తగఁడని యాతల్లి వగపు. కాని తల్లివలె ఆదరింపగల ద్రౌపది యున్నదని ధైర్యము.అట్లగుట ప్రసాదగుణమిందు ఆమూలాగ్రము రాణించుట ఔచిత్యము.

"ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం
దక్కటి మిత్త్ర బాంధవహితప్రియ మంత్రి వయస్యకోటికిన్
మ్రొక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ
యిక్కరుణాకరున్ శరణమేనిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్."
(5-1-302)

సంజయుఁడు సభాముఖమున ధర్మజునకుఁ జెప్పిన విన్నప మీ పద్యము. భక్తికిని, నీతికిని ఇది చక్కని సంయోజనము. నీతివలన వాక్కు మధుర మైనది. ప్రతి పాద మొక భావముతో ప్రత్యేకత నందగించుకొనినది. వాసుదేవ సవ్యసాచులకు నమస్కరించునప్పుడు ప్రథమ పాదము సమవిభక్తిక మైనది మిగిలిన సభ నంతటిని సంబోధించునప్పుడు అచ్చటి జనగణ దైర్ఘ్య మును దెలుపు దీర్ఘ సమాసము సాగినది. మ్రొక్కుచు, అనుజ్ఞ సేయుఁడీ, ఇక్కరుణాకరున్, క్రోధ శాంతికిన్ అనుమాటలు ఎంత అర్థబంధురములో అంత మధురములు.

"మ. వికట భ్రూకుటి ఘోరఫాలకలిత స్వేదోద్భటుండుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రవర్ధన దశావిర్భావ సంభావితాం
గకుఁడుం జిత్త విదాహదోహల సమగ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తి
తోన్.'' (4-3-25)

పై పద్యమున ఉపకీచకుల సంహరింపఁ బోవుచున్న భీముని వర్ణనము గావింపఁబడినది. ఇందు ఓజోగుణము పరుషాక్షర సమాసభూయిష్ఠమగు రచనవలన పోషింపఁబడినది. తొలి మూఁడు పాదములందును భీముని క్రోధ రూపము సమాసములపై పరచి వర్ణించినాఁడు తిక్కన; చతుర్థపాదమున 'బక విధ్వంసకుఁ'డని భీముని పేర్కొని ఉపకీచక విధ్వంసకుఁడు కాబోవుటను సూచించెను. ఓజోగుణ స్ఫురణ సమర్థములైన సమాసముల కూర్పుచే విభావ విస్ఫూర్తిని ప్రకటించుటకీ పద్యము చక్కని యుదాహరణము.

"శా. భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు శస్త్రాస్త్ర జా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబుదగ్ర ధ్వజో
ర్చిష్మ త్తాకలితంబు సైన్యమిది యేఁ జేరంగ శక్యుండనే.''
(4-4-52)

కౌరవ సేనఁ గాంచిన ఉత్తరుఁడు మదితోడ మేనువడకుచుండగా బలికిన పలుకులివి. ఆ సైన్యము యొక్క ఉదగ్రతను ఓజోగుణభూషితమైన రచనలో నిరూపించినాఁడు తిక్కన. 'ష్మ' కారప్రాసము, 'దుర్వారోద్యమ' పద్యములోవలె రకారావృత్తి ఓజోగుణమున కంగములుగా కూర్పఁబడినవి. ఇచట వర్ణ్య వస్తువు సైన్యము. దానియొక్క తీవ్రరూపము,సంఖ్యాధిక్యము, బారులు తీరి నిలబడిన చతురంగబలములు దీర్ఘ సమాసములవలన, పరుషాక్షర విన్యాసమువలన మనోజ్ఞ తికపై చిత్రీకరింపఁబడుచున్నవి. సమాసములు 'ఆభీలంబు, ఆకీర్ణంబు, అత్యుగ్రంబు,ఆకలితంబు'అను పదములచే నంతమగుట వలన సైన్యము అతివిస్తారమై భీష్మ, ద్రోణ, కృప, కర్ణ, దుర్యోధనాది ప్రముఖులచే పరిరక్షింపఁబడుచున్నదను ధ్వని ఇందేర్పడుచున్నది. పటు, ప్రతాప, శస్త్రాస్త్ర. ఉజ్జ్వల. ఉగ్రంబు. ఉదగ్ర, అర్చిష్మాది పదములు తీవ్రస్వరముతో పూని పలుకఁదగియున్నవి.

సైన్యముయొక్క సమగ్రరూపమునే కాక అద్దానిని గాంచిన ఉత్తరుని భయోద్వేగములను సైతము పైపద్యమున తిక్కన నిబంధించెను. చిత్త దీప్తిని కలిగించు అచ్చమైన ఓజోగుణమిందు పుష్టిగా నున్నదనుట నిర్వివాదాంశము, పండితైక వేద్యము. గుణప్రధానములగు నిట్టి పద్యము లింకను పెక్కులు గలవు. అవి యన్నియును ఔచిత్యముచే శాసింపబడుచుండుటవలన తిక్కన ఔచిత్యానుశీలమును తెలియజేయుచున్నవి.

తిక్కన శబ్దార్థ గుణస్వభావములను చక్కగా నెఱిఁగినవాఁడు. తిక్కన స్వభావముచే నర్థవాది. అర్థమును సాధించుటకు శబ్దమతనికి సాధనము. సామాన్యముగా శబ్దము నర్థమును మించి సంఘటింపఁజేయఁడు. చేసెనా.

అచ్చట విభావస్ఫూర్త సగుణ సాక్షాత్కారమైనట్లే. అర్థము నలంకరించెనా, విభావము భావనా వీథులలో వెలుగు నింపినట్లే. సగుణ నిర్గుణోపాసనమువలె తిక్కన శబ్దార్థ గుణపోషణమును ఆంధ్ర భారతమున నిర్వహించెను.

### రసౌచిత్యము

"కుర్వన్ సర్వాశయే వ్యాప్తి మౌచిత్య రుచిరో రసః
మధుమాస ఇవాశోకం కరోత్యంకురితం మనః ॥"[33]

"ఔచిత్య రుచిరమైన రసము సర్వాశయ వ్యాపనము నొనరించునదై అశోక వృక్షమును మధుమాసమువలె మనమును అంకురిత మొనరించును" అని రసౌచిత్యమును క్షేమేంద్రుడు పేర్కొనెను.

కథార్థముల కుచితమైన రసపోషణ విధానమే రసౌచిత్యమని స్థూలముగా పేర్కొనవచ్చును. తిక్కన రసదృష్టికల మహాకవి. 'కావ్యరసమునుం గొనియాడుచుండుదు ఎప్పుడున్' అని హరిహరనాథుఁడే ఆతనికి యోగ్యతా పత్రము నిచ్చినాఁడు.

విరాటోద్యోగ పర్వము లందలి రసపోషణమును గూర్చి ప్రత్యేకాధ్యాయమున వివరింపనైనది. రసౌచిత్య విచారము అందు గతార్థమగును. కావున దాని నిచ్చట వివరింపక వదలుటయైనది.

## 7. రచనా సంబంధులగు ఔచిత్యములు

### తత్త్వౌచిత్యము[34]

తత్త్వమనగా వస్తుతత్త్వమని ఒక అర్థము, వేదాంతశాస్త్రమని మఱి యొక అర్థమును గలవు. వస్తుతత్త్వము చక్కగా నిరూపింపఁబడినచో సది వర్ణన యగును. అట్లే పాత్రతత్త్వమును గ్రహించిన అట్టిది శీలచిత్రణ మనఁదగి యుండును వీనికంటె భిన్నమైనది తత్త్వశాస్త్రము. అట్టిది సందర్భోచితముగాఁ జెప్పబడుటయే తత్త్వౌచిత్యమని మనము గ్రహింపవచ్చును.

భారతమున పెక్కు తత్త్వవిషయములు గలవు. అవి దీర్ఘములో, అర్థ గంభీరములో అగుటచే తిక్కన ఎడనెడ ఆ తాత్త్విక విషయముల నత్యంత సుందరముగా సులభగ్రాహ్యములుగాఁ జెప్పియున్నాఁడు. అవి తత్త్వవి చిత్యమునకు నిదర్శనములే.

"క. ఒక తల సమస్తజగములు
నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొక తలనైనన్
సకలము నసార మాత్రం
బొకరుని సారంబ చాల నుత్కృష్టముగున్." (5-2-315)

"క. తలఁపునన వాసుదేవుఁడు
కలిగింపను నిలుప నడఁపగా నోపు జగం
బుల మఱియుఁ గ్రీడార్థము
పలుపోకలఁ బుచ్చుచుండుఁ బౌరవనాథా." (5-2-316)

"క. ఎక్కడ నడచును సత్యం
బెక్కడ ధర్మంబు వరగు నెక్కడఁ గలుగుం
జక్కటి నిలుచుం గృష్ణుం
డక్కడ నతఁడున్న కడనయగు జయ మధిపా."(5-2-317)

ఇచట వాసుదేవతత్త్వము ప్రతిపాదింపబడినది. అత్యంత విశదముగా నున్నది ఇందలి యర్థము. భావమవగతమైనది ధృతరాష్ట్రునకు గూడ. కాని ఆతని కొక సందేహ ముదయించినది. తానెఱుఁగని యీవాసుదేవ తత్త్వమును నీవెట్లు గ్రహించితివని సంజయుని ప్రశ్నించినాఁడు. లోకసామాన్యదృష్టిలో ధృతరాష్ట్రుఁడు రాజు. సంజయుఁడు సూతపుత్రుఁడు. విద్య గ్రహించుటలో నా తారతమ్యము లేదు. విద్యవలన కృష్ణు నెఱింగితినని సంజయుఁడనఁగా విద్య యనఁగా నెట్టిదని మఱల ప్రశ్నించినాఁడు రాజు. అనగా నాతనికి సామాన్య లోకజ్ఞానముండవచ్చును గాని పారమార్థిక జ్ఞానములేదని విదితము. అట్టి వానికి తెలియునట్లు జ్ఞానముపదేశించుట మిగుల దుష్కరము. అయినను

తిక్కన సంజయునిచే 'విద్య' అనగా నేమియో చెప్పించినాఁడు. "సాత్త్విక రాజస తామస వికారంబుల త్రిప్పులంబడక ధర్మం బాచరించుచు భావశుద్ధి కలిగియుండుటయే" విద్యయని సంజయుఁ డనినాఁడు. ఇట్లు వాసుదేవ తత్త్వమును, ఆతని నెఱుంగ గలిగినవిద్య యొక్క తత్త్వమును తిక్కన సందర్భోచితముగా దెలిపెను. ఇట సంభాషణా రూపముగా తత్త్వము ఉపదేశింపబడుటవలన సులభముగా బోధపడుచున్నది. కావ్యప్రయోజనమును ఒందు గలదు. పుత్రవ్యామోహ తమోమూఢితుఁడైన ధృతరాష్ట్రుఁ డింత తెలిసికొని కూడ 'సాత్త్విక రాజస తామసములగు త్రిప్పులంబడి', ధర్మము నుండి చ్యుతుఁడై, భావశుద్ధిని కోల్పోయినాఁడు. ఫలితముగా పరమాత్మ స్వరూపుఁడైన శ్రీకృష్ణుని తత్త్వమును పూర్తిగా తెలిసికొనలేకపోయినాఁడు. కథ కనుగుణముగా నిట తత్త్వ ముపదేశింపఁబడుట వలన ఇది తత్త్వౌచిత్యము నకు పరమోత్కృష్టమైన లక్ష్యము.

## అభిప్రాయౌచిత్యము

"అకదర్థనయా సూక్త మభిప్రాయ సమర్పకమ్।
చిత్తమావర్జయత్యేవ సతాం స్వస్థ మివార్జవమ్॥"
అక్లేశేనాభిప్రాయ సమర్పకం కావ్యం హృదయ మా
వర్జయతి" 35

అక్లేశముగా నొక అభిప్రాయము సమర్పింపఁబడినచో నది హృదయా వర్జకమగుననియు నది అభిప్రాయౌచిత్యమనఁబడు ననియు భావము.

కీచకుఁడు తనను చూచిన చూపుల వలననే వాని మనోగతాభిప్రా యమును గ్రహించినది ద్రౌపది. దానితో నామె భయపడినది. చెమట వోడ మినది, నివ్వెఱపాటు తోచినది, కంపము పుట్టినది, వెల్లఁదనంబు గదిరినది. వాని అభిప్రాయము నామె గ్రహింపఁగలిగినది. కాని వాఁడామె భయమును గాని తదనంతరము ఆమె చూసిన పహ్యాభావమునుగాని గ్రహింపలేకపోయి నాఁడు. ఇట చెప్పకయే వాని చేష్టలను బట్టి ద్రౌపది వాని మనోభిప్రాయ మును గ్రహించుట ఆమె విషయపరిశీలనకు వన్నె తెచ్చుచుండుటచే నుచిత మై యున్నది.

పాండవ ప్రవేశములందు విరటుఁడు కొంతవరకు సముచితాభిప్రాయం ముగా ప్రవర్తించినాఁడు. కాని ఉత్తరగోగ్రహణ ఘట్టమున కురువీరులను ఉత్తరుఁడే జయింపగలిగెనను అభిప్రాయమును కలిగియుండుట అతనివివేచనాశక్తి లోని లోపమును తెలియజేయుచున్నది. అర్జునుని షండరూపమున గాంచియు నాతనిని చులకనగా నెంచలేదు ద్రోణ, భీష్మాదులు. తెలియలేని వారాతనిని గని రిమాసించిరి. ఇట్టిది వారివారి అభిప్రాయముల యందలి అంతరము. దీనిని తిక్కన చక్కఁగా తెలియఁజెప్పెను. (4.4.74).

అభిప్రాయౌచిత్యమునకీ పద్యము పరమోదాహరణము.

"ఉ అజ్ఞులు కొందరప్పు డపహాసము సేయుచు గూఢరూప రే
ఖాజ్ఞత లేమిఁ దద్వికృత కాయము మీఁదను దృష్టి నిల్పఁగాఁ
బ్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు బాహుల దీర్ఘతయుంభటత్వత
త్వజ్ఞతయున్ గతిస్ఫురదువాత్తతయుం గని సంశయంబు
తోన్."

అజ్ఞులు అపహాసము చేయుట, ప్రాజ్ఞులు సంశయాత్ములై పర్యాలోచించుట లోక సహజము. దీనిని సందర్భోచితముగ తిక్కన తెలిపియుండుట గమనింపగలము. కొంతదూరముననున్న అర్జునుని స్పష్టముగా గుర్తించుట కష్టము. మూర్తిమత్త్వము, బాహుల దీర్ఘత, భటత్వతత్త్వజ్ఞత, గతియందు దాత్తత, మాత్రను గమనింపగల అంశములు వీనిసాధారముగా వారు అభిప్రాయము నేర్పరచుకొనుట ఉచితమై యొప్పుచున్నది. అప్పుడైనను వారాతనిని పూర్తిగ గుర్తించినట్లుండినచో అది అసహజమగు కల్పనయే యగును. అందుచే తిక్కన వారి సంశయాలోచనమును వివరించి అభిప్రాయమునందౌచిత్యమును బాటించెను.

"తే ఆఁడుచందంబుఁ బురుషసమాకృతియును
గలిగియున్నది యొప్పు నూష్మలత సొంపు
వికృత వేషాకృతంబులై వెలయకితఁడు
నివురు కవిసిన మెఱయని నిప్పువోలె."                (4.4.75)

ఇచట వీరికిట్టి అభిప్రాయము కలిగినదని చెప్పుటలో తిక్కన ఔపమ్య సామ్యమును గూడ పాటించెను. సరిగా నిట్టి అభిప్రాయమే అజ్ఞాతవాసారంభమున గూడ చెప్పఁబడినది. సీసమునందు అర్జునుని యాకృతిని వర్ణించి యాపైని గీతమునందిట్లు పోల్చిచూపినాఁడు—

"ఆ. మంచు మఱుఁగువడిన మార్తాండుఁడును బోలె
నీఱు కవిసియున్న నిప్పుఁబోలె
వేషధారియైన విష్ణుఁడుఁబోలె న
వ్విరటు కొలువు చేర నరుఁడు వచ్చె." (4.1.228)

ఇట్టి సామ్యమును పాటించుట ఇట నభిప్రాయౌచిత్యమునందలి చమత్కారము.

'నివురు కప్పిన నిప్పువలె' అని తేజము మఱుగువడిన వ్యక్తిని గాని, వస్తువును గాని పోల్చిచెప్పుట లోకసాధారణము. దీనినే లోకోక్తియు నందురు. ఇచట లోకోక్త్యౌచిత్యమును గలదు. దీనిని క్షేమేంద్రుఁడు పేర్కొనలేదు గాని ఆధునిక విమర్శకులు పేర్కొని యున్నారు.36 (శ్రీ.సా.ప్ర. p.521.522.)

## సారసంగ్రహౌచిత్యము

"సారసంగ్రహ వాక్యేన కావ్యార్థః ఫలనిశ్చితః।
అదీర్ఘ సూత్ర వ్యాపార ఇవ కస్య న సమ్మతః॥"37

సారసంగ్రహ మనగా చెప్పదలచిన విషయముయొక్క సారాంశము నంతయు సంగ్రహముగా చెప్పుటయే.

కీచకుఁడు తన మోహాభావమును వెల్లడించినపుడు ద్రౌపది తొలుత 'అన్న' యని సంబోధించి అనునయపూర్వకముగా ఆతని బుద్ధిని మఱలింప యత్నించినది. పిదప తన పతుల పరాక్రమమును దెలిపి జంకించినది. అయినను కీచకుని బుద్ధి మారలేదు. అప్పుడు వానికి చివఱగా నొకమాట చెప్పినది.

"క. చనుఁ జనదని చూడక యం
దని ద్రాక్షల పండ్లు కోయఁ దఱచుట హితమే
మును చెడిన రావణాదుల
విని యెఱుఁగవె యెన్నఁడుగు వివేకవిహీనా." (4.2.58)

ఇందు ద్రౌపది వాచ్యముగా నేమియును చెప్పలేదు. కాని సంగ్రహముగా, గూఢముగా 'సీతను కామించిన రావణుఁడు అనుజ, సుత, పరివారసహితముగా నాశము బొందినట్లు నీవును నాశన మగుదువు' అను హెచ్చరిక చేసినది. నీవు చెడుదువు అనలేదు. రావణుని గూర్చి వినలేదా అని మాత్రమే పలికినది. అనగా వానికి పట్టిన గతియే నీకును నిశ్చయము అని అర్థాంతరమిందు గలదు. రావణాదులు అని రావణుని మొదలు నిన్న మొన్నటి సైంధవుని వఱకును ఉద్దేశించి పలికినది ద్రౌపది.

ఇక తనకును, వానికిని గల అంతరమును గూడ సంగ్రహముగానే నుడివినది. వాఁడు జంబుకము, తాను అందని ద్రాక్షపండు. శక్తికి మించిన దానిని చేయ యత్నించినవానికి భంగపడుటయే మిగులును. తన్ను గోరిన కీచకునకు ఆశాభంగము, అవమానము లభించునని ద్రౌపది పలికినది. అది గ్రహింపక పోయినాఁడు కామాతురుఁడైన కీచకుఁడు.

ధృతరాష్ట్రుఁడు పనుపగా సంజయుఁడు పాండవుల యొద్దకేగి తిరిగి వచ్చినాఁడు. ధర్మజుని అభిప్రాయము నంతటిని చక్కగా గ్రహించినాఁడు. ధృతరాష్ట్రుఁడు దౌత్య విశేషము లడిగినాఁడు. మఱునాటి సభలో వివరములు చెప్పెదనని అప్పుడు సంగ్రహముగా తన ఉద్దేశమును దెలిపినాఁడు. 'సాదు రేగెనేని న్వాను తలపోలమునన కాని నిలువదు సుమ్మి.' ఇందు వివరణ మేమియును లేదు. కాని, అజాతశత్రుఁడలిగినాఁడు—— సాగరము లేకమగునను హెచ్చరిక గలదు. ఇంకను ధర్మజుని ఉద్దేశించి 'వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మెత్తని పులి' యనినాఁడు ధర్మరాజులో నున్న ఒక ప్రత్యేకతను సంజయుఁడు ఒక్క మాటలో బలికినాఁడు. ఇట్టి ప్రయోగ మపూర్వము. ధర్మజుని కత్యంతము దగిన ఈ మాట నాటికి నేటికి నిలిచిపోయినది. పులి క్రౌర్యమునకు మారుగా చెప్పదగు జంతువు. దానిలో మెత్తఁదనము అసలు ఉండదు. అట్టిచో

చో ఇట మెత్తనిపులి అనుట పొసగుటెట్లు అని భావించినచో —ధర్మరాజు స్వయముగా ధర్మదృష్టి, పాపభీతి కలవాఁడే అయ్యును అతని యందు రాచరికపు క్రౌర్యమును కలదు కాన ధర్మవర్తనము ననువర్తించు ధర్మజుని లో క్రౌర్యము మఱుగు వడినది. అందుచే మెత్తనిపులి అనుట ఉచితమే అని తెలియును.

ఈ గుణము యుద్ధారంభమైన పిదప భీష్ముని మరణరహస్యము నడిగి నపుడును, ద్రోణుని వధకై అబద్ధ మాడినపుడును, అభిమన్యుని ప్రోత్సహించి పద్మవ్యూహమున ప్రవేశింప జేసినపుడును, కర్ణునింకను జయింప లేదని అనుంగు తమ్ముఁడైన అర్జునుని నిందించినపుడును బయటపడును. భావికథార్థము నెఱిఁ గిన తిక్కన ధర్మజునిట 'మెత్తనిపులి' అని సంగ్రహముగా చిత్రించుట పర మౌచిత్యవంతముగా నున్నది.

కృష్ణుఁడు ధర్మజుని నెఱియును, ధర్మనిష్ఠయును 'తగు చేవ' కలుగు టను ఎఱుగవే అని ధృతరాష్ట్రుని అడిగినట్లు తిక్కన రచించి యున్నాఁడు (5.3.278). ఇట తగు చేవ అనునది ప్రధానోద్దేశ్యము, 'చేవ' కలుగుట ఒక విషయము. కాగా 'తగు చేవ' యనగానేమి? 'తగు' అనినపుడు దేనికి తగు అని ఆలోచించినచో 'దేనికైనను తగు' అనునర్థము స్ఫురించును. అనఁగా ధర్మజుఁడు మిమ్ము అనువర్తించుటకే గాదు, మిమ్ము నిర్జించుటకును తగిన మనోబలము కలిగినవాఁడని భావము. కురుక్షేత్రమున అర్జునుఁడే విచలిత మనస్కుఁడైనాఁడు. కాని ఒకపరియుద్ధము నిశ్చయమైన పిమ్మట ధర్మజుఁడు వెనుకాడలేదు. ద్రోణవధకు, అభిమన్యుని మరణమునకు అర్జునుఁడొందినంత పరితాపమును ధర్మజుఁడెన్నఁడును పొందలేదు. యుద్ధపరిసమాప్తి అయిన వెనుక బాధపడినాఁడు. కాని యుద్ధము జరిగినంత కాలము నిశ్చలముగా యుద్ధజయమునే కోరి ప్రయత్నించి యుధిష్ఠిరుఁడనిపించుకొనినాఁడు. ఎడ నెడ విజయసాధనకు తను నమ్మిన ధర్మమును గూడ పణముగా నొడ్డినాఁడు. ఈ నిగ్రహానుగ్రహ సమర్థతనే కృష్ణుఁడు 'తగు చేవ' అని ఒక్కమాటలో ధృతరాష్ట్రునకు తెలియఁజేసినాఁడు.

'చేవ' అనగా సత్తువ. దార్ఢ్యము అనుఅర్థములు లోకమున సామాన్యముగా భావింపఁబడును. ఇట 'చేవ' అనునది మనోబలమని గ్రహింపవలెను. వలన ధర్మజునికి గల చేవ శరీరగతమైనది కాదు. కేవలము మనోబలము. ఆ బలము చేతనే అతఁడు అరివీరభయంకరులైన పరాక్రమోపేతులైన నల్వురు తమ్ములను తన కనుసన్నలలో మెలఁగఁజేసికొనినాఁడు.

ఇట్లు చిన్నచిన్న పదములలో అనంతార్థములను నిక్షిప్తము చేసి ప్రయోగించుటయే సారసంగ్రహౌచిత్యము.

## ప్రతిభౌచిత్యము

"ప్రతిభాభరణం కావ్యముచితం శోభతే కవేః।
నిర్మలం సుగుణస్యేవ కులం భూతివిభూషితమ్॥"38

గుణవంతుని విమలకులము లక్ష్మీప్రకాశితమై శోభించునట్లు కవికావ్యము ప్రతిభ యనెడి ఆభరణముతో కూడి శోభించునని క్షేమేంద్రుఁడు పేర్కొనెను. కవి అసాధారణ ప్రతిభ కనబరచినపుడే కావ్యము ఆస్వాదయోగ్యమై అపూర్వముగ శోభిల్లును. అట్టి ప్రతిభ లోపించినచో కావ్యము నిస్సారమై ఆస్వాదనీయము కాకపోవునని పిండితార్థము.

వాక్చాతుర్యము, విశేషణపదప్రయోగము, వక్రోక్తి మొదలగునవి యన్నియు కవిప్రతిభను పట్టియిచ్చుచుండును. ఇవిగాక సన్నివేశకల్పనములు, నిస్సారమగు అంశములను సరసముగ చెప్పగల్గుట కూడ ప్రతిభామూలకములే. అనువాదము మూలానుసారియైనచో కవి యొక్క స్వయంప్రతిభ కవకాశము లేకయే పోవును. తిక్కన ఆంధ్రమహాభారత మట్లు శుద్ధానువాదము కాదు. ఇదియొక పునర్నిర్మాణము (Reconstruction). ఇందు కవి తన ప్రతిభానుగుణముగ కథను భిన్నరీతులలో మలచుకొని, నిస్సారములగు అంశములను వదలివేసి, తగ్గించి, ప్రతిభాస్ఫోరకములగు ఘట్టములను బాగుగా పోషించి, కావ్యశోభను భారతమునకు కలిగించెను. ఇదియే తిక్కన ప్రతిభను ప్రకాశింపఁజేసిన అనువాదవిధానము. తిక్కన రచనలో చేసిన ప్రతి యొక్క మార్పు ఆతని ప్రతిభనే వెల్లడించుచుండును.

ధర్మరాజు విరాటుని పాలి కరుదెంచినపుడు నిజరూపము అర్థము కాకుండునట్లు మొదట పలికి పిదప తాను ఓర్వని జనులచే ద్యూతమునందు ఓడిపోయిన సత్యమును బలికెను. ఇది ప్రతిభకు ఒక చిన్న తార్కాణము. ప్రశ్నకు సూటిగ బదులిచ్చుట సాధారణము. కాగా అడిగిన వారి ప్రశ్నను తొలుత తప్పించి వేరగు అభిప్రాయము కలుగునట్లు భిన్న విషయములు పలికి యథాలాపముగ ప్రశ్నకు బదులిచ్చుట చమత్కారమే గదా!

"ఆ. ఉన్నరూపు పలుకు నన్నరులెక్కడ
గలరు తోఁచినట్లు పలుకు పలుక
నైన చందమయ్యె నంతియ కాకంత
పట్టి చూడగలరె యెట్టివారు." 4.1.191

ఇవి ధర్మజుని సన్న్యాసి వేషమునకు తగిన మాటలు. తాత్త్విక ధోరణిలో లోకోక్తిని జతచేసి తన ఉనికి నప్రధానముగా దలచి పలికినాఁడు. ఇంకను మందహాసము చేయుచు నిట్లనెను.

"క. నానా విధ భూతమయము
మే నతిచంచలము మనము మెయిఁకొని నిక్కం
బెనరుగునకుఁ జెల్లింపం
గానగు సత్యంబు నడపు క్రమమట్లుండెన్." 4.1.193.

ఇది సన్న్యాసుల కుచితమగు భాషణము. మే నతిచంచల మనుట తానొక నిర్లిప్తయతి నను భ్రమను కలిగించుటకే గదా! ఇంత మాటలాడిన పిదప తాను జూదమున ఓడిపోయిన నిక్కమును పలికినాఁడు ధర్మజుఁడు. తాను సత్యవ్రతమును పాటించునట్లుగా, నిజమును మరుగుపరచి గూఢముగ బలికిన ఈప్రతిభోక్తులు తిక్కన సొంతమే.

తిక్కన ధర్మరాజు నాధారముగా గైకొని ప్రతిభావంతములగు సంభాషణలను పెక్కుచోట్ల రచించినాఁడు. కీచకుఁడు ద్రౌపదిని వెన్నంటి విరటుని సభకు రాఁగా భీముఁడది గాఁచి ఆవేశముతో వృక్షమును పెకలింప బూనగా

గాంచిన ధర్మజుఁడతనిని గూఢ భాషణముతో నివారించెను. ధ్వనిమూలక మగు ఈరచన ప్రతిభోత్కర్ష ప్రదర్శనమే గదా!

"మ. వలలుం డెక్కడఁజూచె నొండెడ నసేవ్యాణ్మాజముల్ పుట్టవే
ఫలితంబై వరశాఖ లొప్పగ ననల్ప ప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా
నేటికిన్." 4.2.136

ఇచట ప్రాణమంతయు 'ఒండెడ' అను పదములో కేంద్రీకృతమగు చున్నది. ఇప్పు డూరకుండి పిమ్మట మరియొక చోట కీచకుని వధింపగా జనునను భావము ఈపదము వలన కలుగుచున్నది. సభలో నుండు ఇతరులకు సాధారణార్థమే స్ఫురించును. ధ్వనిగ వేరొక చోట జంపుట యుక్తమను అర్థము భీమునకు స్ఫురించునట్లు తిక్కన ప్రతిభోచితముగ రచన గావించెను.

ఉత్తరుఁడును బృహన్నలయును ఉత్తర గోగ్రహణసంఘర్షణమున విజయమును సాధించి మరలివచ్చుచున్నారను వార్త వినినపుడు తండ్రి ఆ విజయము తనయుని వీరకృత్యముగా దలచి పొంగిపోవును. తమ్ముని విజయము నెంచి ధర్మరాజు బృహన్నలనే ఆ విజయమునకు కారణముగా నెంచి మాటలాడును. 'బృహన్నల సారథి కాన గెల్చు' అను ఈ పలుకు విరటునకు ములుకై గ్రుచ్చుకొనినది. ఇచట అసలు విషయము నాతఁ డెఱుంగమి కటకటబడుట సహజము, ఇది ధర్మరాజుకు అర్జునుని పరా క్రమముపై గల విశ్వాసము వలన పలికిన పలుకు. అజ్ఞాతవాస పరిసమాప్తి అయినది అప్పటికే అయినను బృహన్నలయే అర్జునుఁడను నిక్కమును వచింపఁడు ధర్మజుఁడు. అందరును ఒక్కసారిగ విరాటునకు తెలియబరచు కొను అవకాశము కొఱకు ఇట్లు పలికెను. కథలో ఉత్సుకతను పెంచు విధమిద్దియే. అపుడు రాజు కంకుని గాయపఱచుట, ద్రౌపది పరుగున వచ్చి రక్తము కాఱకుండ తన వస్త్రముతో నద్దుట-దానికి విరటుఁడాశ్చర్య పడి కారణమడుగుట పరంపరాగతములైన అంశములు. ధర్మజుని ఆ ఒక్క

పట్టుదల నిండిన పలుకువలన ఇంత కథ జరిగినది. ఇది ప్రతిభోచితమైన రచన. ఫలితముగా ధర్మజుని పవిత్రత వెల్లడగుచున్నది.

తే. "విమల వంశంబునను బుణ్య వృత్తమునను
వఱలు నీతని రక్తంబు వసుమతీశ
ధరణిపై నెన్ని బిందువుల్ దొరఁగెనన్ని
వర్షములు గల్గు నిం దనావర్ష భయము." 4-5-261

ఇక ఉద్యోగపర్వమునందు ఆ యా పాత్రములు ప్రతిభోచితముగ బలికిన పలుకులు కవితిక్కన కావ్యాంబరము నందు మెఱయు తారకలే అనవచ్చును. సంజయ, ధర్మజుల వాద ప్రతివాదములు ప్రతిభాస్ఫోరకము లగుట తిక్కన కూర్పునందే ప్రస్ఫుటము.

కీచకుఁడు కామాంధుఁడై ద్రౌపది నిర్దేశించిన విధముగా నర్తనశాల కరుగుదెంచి నాఁడు. అట పర్యంకముననున్న భీమసేనుని గాంచి ద్రౌపదిగాఁ దలచి సల్లాపము లాడబూనినాఁడు. భీముఁడు హాస్యప్రియుఁడే. తన భార్యకు వినిపించి నవ్వింపఁదలచి కాబోలు నిగూఢ భాషణములతో తాను జేయబోవు కార్యమువలన కీచకుఁడందబోవు ఫలమును పేర్కొనినాఁడు. కాని అప్పటికే వివేకశూన్యుఁడైన కీచకుఁ డా నర్మోక్తులను గమనింపఁడాయెను. భీముని ఈ భాషణము చమత్కారజనకముగ, హాస్యగర్భితముగ నుండుట తిక్కన ప్రతిభకు మచ్చుతునక.

"తే. ఇట్టివాఁడవు కావున నీవు నన్నుఁ
బొగడి కొనఁదగు నకట నా పోల్కి యాఁడు
దాని వెదకియు నెయ్యెడ నైన నీకు
బడయ వచ్చునె యెఱుఁగక పలికి తిట్లు" 4-2-331

"క. నా యొడలు చేర్చి నప్పుడ
నీయొడ లెట్లగునొ దాని నీ వెఱిఁగెదు న
న్నే యబలల తోడిది గాఁ
జేయఁ దలంచితివి తప్పుసేసితి కంటే" 4-2-338

"క. నను ముట్టి నీవు వెండియు
వనితల సంగతికిఁ బోవు వాఁడవె యైనం
దనువేఁ బడసిన ఫలమే
కని యెద విదె చిత్తభవ వికారము లెల్లన్" 4-2-339

ఇచట అన్ని వాక్యములు ద్రౌపదీపరముగ వేరు అర్థముల నిచ్చుచున్నవి. మోహాయత్తచిత్తుఁడైన కీచకునను. కాని భావికథ నెఱింగిన సహృదయుల కివి హాసమును పుట్టించి చమత్కారమును కలుగఁజేయుచున్నవి. ఇది కవిప్రతిభ వలన కలిగిన భావ వైరుద్ధ్యము. 'నాపోల్కియాఁడు దాని.... నీకు బడయ వచ్చునె' అని ద్రౌపదికూడ అని యుండవచ్చును. తాను అసాధారణ కాంతయని సైరంధ్రి మున్నే పలికియుండుట వలన ఆ మాటలాడునది సైరంధ్రియే యని కీచకుఁడు భావించు టుచితమే. అట్లే తన్నుఁదాకిన పిదప వేరు వనితల చెంతకుపోవనగ సైరంధ్రి అంతటి సుఖమును ప్రసాదించునని కీచకుఁ డాశించినాఁడు. ఇక వనితలను జేరుటకు ప్రాణములే ఉండవు లెమ్మని భీముని ఉద్దేశ్యము. ఇట్లే భీముఁడాడిన మాటల కన్నింటికి ద్రౌపది పలికినట్లు కీచకుఁడు భావించు అర్థాంతరము లేర్పడుచున్నవి. ఇట్టి గూఢార్థ గర్భితములైన వాక్యములను విరచించుట తిక్కన ప్రతిభనేకాక పాత్ర ప్రతిభనుగూడ ప్రకటించుచున్నది.

కృష్ణుఁడు రాయబారమున కేగు సందర్భమున పాండవులు తమ తమ అభిప్రాయములను వెల్లడించిరి. ధర్మరాజు తన స్వభావమునకు తగినట్లు నయవినయముగా బలికినాఁడు. ద్రౌపది అన్నియును వినినది. తన ఉద్దేశ్యమును జెప్పదలచి మున్ముందుగ పాండవుల నిర్లిప్తతకు వగచి నిష్ఠురము లాడినది. ఇది స్త్రీజన సహజమగు పద్ధతి. అచట ఆమెచే తిక్కన పలికించిన విధము అనన్య సామాన్యము. ఇది కవిబ్రహ్మ కవనమునకు గల పదునును ప్రకటించుచున్నది. "ఈకంత కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్" అని సుయోధనుఁడే ఇచ్చిన ఊళ్ళు లేవురు చాలని వీరు పుచ్చుకొనకుందురా అను దుగ్ధను ఆతడీయఁడను ఆశాభావమును వెల్లడించినది. 'వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్' అని ప్రశ్నించినది. ఇది తిరుగు లేని ప్రశ్న కదా. 'అచ్చోటనె సంగరంబులగు చొప్పులు పుట్టిననైన పాండ

వుల్ పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానల నుండ నచ్యుతా'— ఇందు వీరి అరణ్యవాసమును గుర్తు తెచ్చు ఉద్దేశము, మరల పోదురా అను వ్యంగ్యము గర్భితములైనవి. వక్రభాషణముతో పనులు సాధించు ప్రతిభ ద్రౌపదిలో ఆవిష్కరింపఁ జేసినాఁడు తిక్కన! 'ఈ యేవురు జూడగా సభకు నీడ్చె కులాంగన నిట్లొనర్తురే'— వీరు లేనపుడు ఎట్టి అవమానము జరిగి యుండినను అది యొక బాధ. వీరు జూచియు చేతులు ముడుచుకొని కూరుచుండగా అవమానింపఁబడుట అధిక బాధాకరమని ద్రౌపది యభిప్రాయము. 'చెచ్చెర జని కోటరంబు దగ జేయుదునో యటుఁగాక పాడిమై వరవుడ మోపి చేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా!' తన విషయమున నిర్ణయమును కూడ మాధవునికే వదలి వేసిన ద్రౌపది ఒక చైతన్యమూర్తి. ప్రతిభాశక్తి— ఇది తిక్కన తీర్పు!

ఇన్ని పలికిన పిమ్మట సూటిగ తన మనోరథమును వెల్లడించి కృష్ణునికి తన శిరోజములమ జూపి వాటిని కౌరవసభలో మరువవలదని కోరినది. ఎంత వచోనైపుణ్యము! ఇదియే ప్రతిభ అని చెప్పక తగినట్టు

సంజయుఁడు సైతము చాకచక్యముగ మాటలాడ వలెనని తిక్కన ప్రతిభ ఆతనిని ఆవరించెను కాబోలు. తన రాజు కోరికను వెల్లడించినాఁడు తన మాటలలో–

"క. పాలిక కౌరవులు దు
శ్శీలతఁ జెడ దలచిరేనిఁ జూప్పెద రుధిరా
భీలాన్నంబున కంటెను
మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్" 5.1.329.

ఈ మాటలు సాధుజన ప్రియుఁడగు ధర్మజుని మీద కంటెను, అరివీర భయంకరాస్త్ర కోవిదుఁడగు అర్జునుని మీఁద ఎక్కుడు ప్రభావమును కలిగించెననిపించును. భావికథలో అర్జున విషాదమును తలచినచో అంత సూటిగ. ప్రకృష్టముగ నున్నవి ఈ పలుకులు. 'రుధిరాభీలాన్నంబు' అనుట ప్రతిభోచితమగు పద ప్రయోగము. ఇది తిక్కన చేర్పు!

## విచారౌచిత్యము

"ఉచితేన విచారేణ చారుతాంయాంతి సూక్తయః ।
వేద్య తత్త్వావబోధేన విద్యా ఇవ మనీషిణామ్"39

తెలిసికొన వలసిన విషయమును తెలిసికొన గలుగుటయే విచారము.

పాండవులు అజ్ఞాతవాసారంభమున వేషధారులై వచ్చినను వారిని గాంచి మహానుభావులని గ్రహించినాఁడు విరటుఁడు. ఇది ఆతని వివేచనము. అట్లే ద్రౌపది మాసిన చీరగట్టి దయనీయ స్థితిలో నున్నను ఆమె సాధారణ స్త్రీ కాదని పౌరులు భావించిరి. ఆ పిమ్మట కీచకుఁడు సభాసదులుకూడ ఆమెను దేవకాంతయా యని భ్రమించినారు. ఇది వారి వారి ఆలోచనా శీలము.

ద్రౌపది కీచకునిచే పరిభవింపబడి వచ్చినపుడు సుధేష్ణ ఆసంగతి గ్రహించినది; వెంటనే.

"సీ. ధరణీ పరాగంబు పొరసి ధూసరితమై
చేడియ నీమేను చెన్ను తఱిఁగెఁ
జిత్తంబు తలపోఁతచే వాడు పొదవిన
చెలువ నీ నెమ్మోము చిన్నఁబోయెఁ
బ్రస్వేదమునఁదోఁగి ఫాలంబుతోనంటి
యుగ్మలి నీ కురులొప్పు కుందెఁ
గన్నీరు వఱ్ఱోడి కాంతి యెంతయుఁ గొన్న
వెలఁది నీ కనుఁగవ విన్న నయ్యె

ఆ. నేది కారణమున నెవ్వరెవ్వోట నీ
కేమి కీడొనర్చి రెట్టిపాటి
సాహసికులొ వారిఁ జంపుదు నొంపుదు
భంగపఱుతు నిడుమపఱుతుఁ జెఱుతు." (4.2.159)

ద్రౌపది ఎవరిచే నెందుకు ఎప్పుట ఎట్టి కీడును పొందినదో సుధేష్ణ గ్రహించినది. కాని గ్రహింపని యట్లే పలికినది. తానై పంపినది కనుక ఓదార్పుగా వారిని చంపుదు నొంపుదు భంగపఱుతు నిడుమపఱుతుఁ జెఱుతు ననినది గాని నిజముగా కీచకుని దండింపవలెనను ఉద్దేశ్యముతోగాని, దండింపగల శక్తియుండిగాని కాదు. ద్రౌపదిని చూచి జరిగిన సంగతిని ఊహింపగలుగుట సుధేష్ణ వివేచనా శక్తి కాగా సుధేష్ణ ఇంతగా బీరములు పలికినను ఆమె ఏమియును చేయజాలదని ద్రౌపదియు గ్రహించినది. అందుకే 'కీచకు దండితుఁజేసి నీకు నాహ్లాద మొనర్తునే' నని అనునయించిన సుధేష్ణను అపత్య సంవాదినిగా నెంచి ఆమె పూనికను నిరాకరించి పలికినది.

"క. నీవింత యలుగ నేటికి
నావంతయుఁ బౌరజనమనఃఖేదము నో
క్కావంత త్రిక్కకుండఁగ
లావంతులు మత్పతులు కలరు పగఁదీర్పన్" (4.2.161.)

ఒకరినొకరు తెలిసికొని అత్యంత నిపుణముగా భావించి పలికిన సందర్భమిది.

నిండు సభలో క్రోధావేశపరుఁడైన భీముని వ్యంగ్య సంభాషణముచే ధర్మజుఁడు వారించుటలో ఉచితానుచిత విచారము వ్యక్తమగును. అట్లే వృక్షము పెకలించి సుశర్మాదులపై నెత్తిపోవ బ్రయత్నించిన భీముని మరల ధర్మజుఁడు నివారించును. ధర్మజుని కార్యాకార్య విచారశీలము నీ రెండు సన్నివేశములు సువ్యక్తములు చేయుచున్నవి.

అజ్ఞాతవాస వత్సరకాల సమాప్తిని భీష్ముఁడు తెలిపినను దుర్యోధనుఁడు నమ్మజాలక ఒక దూతను ధర్మజుని కడకు బంపినాఁడు. సమయ నిష్కర్షలేని దుర్యోధనుని కుతంత్రాలోచన మట్టిది కాగా నిండె నిండెనని చెప్పి పంపిన ధర్మజుని ఆలోచన విచారౌచిత్యమున కెల్లలుతీర్చుచున్నది.

## వృత్తౌచిత్యము

రససంశ్రయమైన ఛందఃప్రయోగౌచిత్యముమ గూర్చి తొలుత

పేర్కొనినవాఁడు భరత మహర్షి. లఘ్వక్షర ప్రాయమైన ఛందమును వీర రౌద్రాద్భుత రసములందు, గుర్వక్షర ప్రాయమైన ఛందమును బీభత్సకరుణ రసములందు, వీర రౌద్రములందు గూడ ధర్షణము ప్రధానమైన పట్ల గుర్వక్షర ప్రాయమైన ఛందమును, శృంగార రసమున మృదు వృత్తములను వినియోగింపఁదగునని మహర్షి భావించి యుండెను.40 ఈ నియమములను తిక్కన చాల వఱకు పాటించెను. భరతుఁడు ఇచ్చట శార్దూలాది వృత్తనామ ములను పేర్కొనలేదు. అనగా ప్రతిభాశాలియైన మహాకవి ఏ సందర్భములో నైనను ఏ ఛందము నైనను ప్రయోగించి యచ్చట నా ఛందము సము చితముగా నున్నదని భావింపఁజేయగలఁడు.

ఛందఃప్రయోగౌచిత్యమును గూర్చి మరింత విపులముగా చర్చించి తన సువృత్తతిలకము నందు వివేచించినవాఁడు క్షేమేంద్రుఁడు. ఆధునికు లలో డా. పాటిబండ మాధవశర్మగారు "ఆంధ్ర మహా భారతము-ఛందః శిల్పము" అను గ్రంథమునందు కవిత్రయమువారి ఛందఃప్రయోగౌ చిత్యమును గూర్చి మిక్కిలి వివరణాత్మకముగా చర్చించిరి. వారు మహా భారతము నంతటిని లక్ష్యముగా గ్రహించుటవలన విరాటోద్యోగ పర్వము లలో కొన్ని పద్యములను మాత్రమే గ్రహించి యుండిరి. వారు చర్చింపక వదలిన ఒండు రెండు ఉదాహరణముల నిట ప్రస్తావించుకొనుట భావ్యము.

## స్రగ్ధర

విరాటోద్యోగ పర్వములలో తిక్కన సామాన్య ఛందములనే గ్రహిం చినను రెండు స్రగ్ధరలను మాత్రము రచించినాఁడు. అందొకటి సభామధ్య మున నున్న దుర్యోధనుని కవి వర్ణించు సందర్భములో విరాట పర్వమునందు న్నది. తదౌచిత్యమును మాధవశర్మగారు చక్కగా నిరూపించి యున్నారు.41

మఱియొకటి సంజయుని 'రణమున వారలన్ గెలువరాదను' పలుకు లకు కినుక వహించిన ధర్మజుఁడు భీమార్జున నకుల సహదేవుల పరాక్రమ విస్ఫూర్తిని కన్నులకు గట్టినట్లు వర్ణించిన సందర్భమున నున్నది. ఒకటి దుర్యో ధనుని వర్ణించుటకు, ఒకటి ధర్మజుని పలుకుల తీవ్రత నుగ్గడించుటకు రచింపఁ

బడినవి. పరస్పర భిన్నములైన ఈ ఇగవురి ప్రవృత్తులకు తగిన విధముగా తిక్కన ఆ రెండు స్రగ్ధరలను భిన్నములుగా మలచెను. అట పద్యము మొత్తము సమాస ఘటితము. ఇట సమాసముల విరివులు కలవు. అట పద్యమంతటను రూపకాలంకార మొక్కటి గలదు. ఇచట ఒక ఉపమాలంకారము కలదు; అదియును సాంతము నిర్వహింపబడినది కాదు. దుర్యోధనుని ఉద్ధతికి తగినట్లు చట రచన చేయబడగా, ధర్మజుండు పొంగిన కోపోద్రేకమును అణచుకొనుచు బలికిన యత్నమిందు సూచింపబడినది. సమాస విచ్ఛిన్నము ధర్మజుని అట్టి యత్నము వలన ఏర్పడిన రచనయే. (6.1.328)

> "స్రగ్ధర గాండీవ జ్యారవం బుత్కటమయి పెలుచం గ్రమ్మినన్ భీముబాహా
> దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగా దోచినన్ వే
> దండద్వంద్వం బు మాడ్కి౦ దరిమి కవలు మాద్యద్గతిం దాకి౦ జా
> కుండం బోకుండ గౌరవ్యులకు వశమె బిట్టులిక్క మూర్ఛిల్లకుండన్."

ధర్మజుండెంత తీవ్రముగా బెదిరింపదలంచినను ఆతని సహజ గుణమగు మెత్తదనము ఇందు కనుపించుచునే యున్నది. బిందు యుక్తాక్షరములు మార్దవమును దెచ్చిన వీరచనలో. స్రగ్ధరా వృత్తమున తన దమ్ముల నల్వుర అవక్ర విక్రమమును విస్తరించి పలికినాడు ధర్మరాజు. 'వీరస్యభుజ దండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్'42 అను కాత్యాయనోక్తి ననుసరించి సందర్భోచితముగా నెన్నుకొనబడినది ఈ స్రగ్ధరా వృత్తము. విశాలమైన ధర్మజుని ఉద్దేశ్యమునిది నిర్వహించుచున్నది. భయమున గాని, నయమున గాని తమ కార్యమును, తమ రాజ్యమును బడయవలెనను ధర్మరాజు ఆకాంక్ష ఆతరువాత పలికిన చంపకము నందు వ్యక్తమగుచున్నది. స్రగ్ధరలో భయపెట్టిన ధర్మరాజు చంపకమున సంజయుని అనునయింపబూనినాడు. ఈరెంటి మధ్య 'కావున' అను పదము ఆతని చిత్తవృత్తిలో కలుగుచున్న మార్పును, రచనలో మార్పును సూచించుచున్నట్లున్నది. ఇట్లు ఒకే వృత్తమును పలువిధముల ప్రయోగింపగల్గిన నేర్పరి తిక్కన.

## శార్దూలము

"శౌర్యస్తవే నృపాదీనాం శార్దూల క్రీడితం మతమ్"[43] అని క్షేమేంద్రుఁడు నృప, సచివ, సామంతాదుల నానారూపములయిన శౌర్యముల వర్ణనమున కవి శార్దూలవృత్తము నుపయోగింపవలె ననెను. శౌర్యము వీర రౌద్రాదుల కుపలక్షకముగా గ్రహించి ఆ రసము లందలి నానావిధ భావములయు, అనుభావములయు వర్ణనమున శార్దూల వృత్తము యొక్క యౌచిత్యమును భావింపవలసి యున్నది. (విరాట పర్వమున 23, ఉద్యోగ పర్వమున 13 శార్దూల వృత్త ప్రయోగములు కలవు).

అర్జునుని వర్ణించుచు ద్రోణుఁడు పలికిన 'సింగం బాకటితో' అను శార్దూలము యొక్క ప్రయోగౌచిత్యమును మాధవశర్మగారు లెస్సగా పరికించిరి. అట్లే అర్జునుఁడు తన ప్రతిద్వంద్వియగు కర్ణుని గాంచి, ఆతని జయింపవలెనను ఉత్సాహముతో కర్ణుని వర్ణించిన సందర్భములో గూడ శార్దూల వృత్తము సముచితముగా ప్రయోగింపబడినది. శౌర్యవర్ణనకు శార్దూలమనుకూలమను క్షేమేంద్రుని మతము ఇట స్మరణీయము.

"శా. యోధాగ్రేసరుఁడిద్ధ తేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధ ప్రక్రమ బాహువీర్యుఁడు కురుక్ష్మాపాల వాల్లభ్య ల
క్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలిత శ్రేష్ఠాస్త్ర విద్యాఢ్యు డీ
రాధేయుఁడొక చీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్."
4.5 11

ఇచట అర్జునుని, కర్ణుని ప్రతిభటత్వ మేకరూపమై పెనుపొందినట్లు ఓజోగుణ మత్యంతము నిర్వహింపఁబడి శార్దూలవృత్త ప్రయోగము నౌచిత్యవంతముగా చేయుచున్నది. 'ధ కారము ప్రాసస్థానము నందుండి అర్జునుని రణోద్ధతిని ప్రకటించుచున్నట్లున్నది. మూడు పాదములును సమాసఘటితముగా సాగి కర్ణుని పరాక్రమ ప్రకటనమునకు తోడ్పడగా, చివరి పాదము విరిగి ఆతని యా పరాక్రమము అర్జునునకొక లెక్కలోనిది కాదని సూచించుచున్నది. పరవళ్ళు త్రొక్కుచు సాగిన ప్రవాహము

పర్వతమును దాకి విరిగి పడునట్లు లోక ప్రశస్తమైన కర్ణుని యోధత్వము అర్జునుని నుండు విఫలమగునని ఈ శార్దూలవృత్తము యొక్క వడక సూచించుచున్నది. మసృణ త్యాగమిట గుణమే అయినది. ఇట్లే విరటుఁడు దమ్ములతో దక్షిణ గోగ్రహణమును నివారించుటకై యుద్ధమునకు సన్నద్ధుడైన సందర్భము నందు విరటుని పలుకులను, శతానీకాదుల యుద్ధ సన్నాహములను తిక్కన శార్దూలములందే నిబంధించెను.

విజయానంతరము ఒక వీరుని యుత్సాహ మపరిమితమై యుండును, ధీరోద్ధతుఁడైన భీముని అట్టి విజయోత్సాహమును సైతము తిక్కన శార్దూలములందే పాకమునందు కొంత మార్పు చేసి వర్ణించెను. ఒకటి కీచకుఁడు నర్తనశాలకా రాత్రి రాగలఁడను విషయమును విని ఉత్సాహముతో బలికిన సందర్భములో నున్నది (4.2.275). ఓజో గుణమును పరిమితము గావించి క్రియాపద వైరళ్యముతో సారళ్యమును సాధించెను. మహాకవి ఏ వృత్తము ఏ సందర్భము నందైనను రచించి మెప్పించ గలఁడను మాట ఇట సార్థకము. కీచకమత్తేభము యొక్క మదమడంచిన సింహబలుఁడగు భీమునకు ఈ శార్దూలవృత్త ప్రయోగమే తగియున్నది.

"శా. చింతాశల్యము పాసెనే భుజబలోత్సేకంబు నీకెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం జూచితే
సంతోషించితె యిట్లుగాక బ్రదుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరిన యట్టి వీరులకు నాచేతం బయోజాననా".
4.2 358.

బిందుపూర్వక తకార ప్రాసము లాలిత్య సమర్పకమై భీముఁడు తన సతిని అనునయించుచున్నట్లున్నది. శార్దూలమును మచ్చిక చేసిన మహాకవి తిక్కన సోమయాజి.

శమీవృక్ష వర్ణనకు, నర్తనశాల వర్ణనకు గూడ తిక్కన శార్దూలవృత్తములనే గ్రహించెను. దుర్గమము, దుష్కరములు ఆ శమీవృక్షము, నర్తనశాలయు. గుర్వక్షర బహుళమైన శార్దూలము పై వస్తువర్ణనలకు

మిక్కిలి ఆనుకూలము. ఆ పద్యములు వస్తువర్ణనలో వేర్కొనబడినపుడు వృత్తౌచిత్యమును చూడవచ్చును.

శ్రీ మాధవశర్మగారు 'సింగం బాకటితో' అను పద్య నిర్మాణము నందలి ఔచిత్యమును గూర్చి బహుధా చర్చించి యుండిరి.[44] అట్టిదే మరి యొకటి భీముని గూర్చి విరాటపర్వ ద్వితీయాశ్వాసమున గలదు.

(4.2.330)

"శా. సింగంబున్న గుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మా
తంగంబుం బురుడించుచుం బవనపుత్ర స్వీకృతం బైన యా
రంగాగారము చేరవచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం
తిం గామ్కుండిటఁ దేడె యింతకని యుద్వృత్తాంగ
జోన్మాదుఁడై."

'సింగం బాకటితో' అను పద్యమునకు, దీనికి సామ్యము చాల కలదు. సింగం బను ఎత్తుగడ సమానమగుటచే బిందు పూర్వక గకార సామ్యము సిద్ధించినది. 'సమర స్థేమాభిరామాకృతిన్' అని అచట అర్జునుని వర్ణించినట్లే ఇట కీచకుని 'ఉద్వృత్తాంగజోన్మాదుఁడై' అని పద్యాంతమున సూచించి భావి కథానుకూల్యమును సాధించెను.

## మత్తేభము

మత్తేభము నందు గురు లఘువులు సమాన సంఖ్యలో నుండుట వలన దీని నడక శార్దూలము వలె అమిత వేగముగా గాక ఉత్పల, చంపకాదులవలె లలితముగా గాక సమాన స్థాయిలో నడచినట్లుండును. తిక్కన శార్దూలమున కంటె మత్తేభము నెక్కువగా ప్రయోగించుట కిదియే ముఖ్య కారణముగా భావింపవచ్చును, తక్కిన మూడు సామాన్యవృత్తములకు దీనికి ఒక ప్రధాన భేదము కలదు. ఉత్పలమున భగణము, చంపకమున జగణము, శార్దూలమున సగణ, తగణములు రెండు, రెండుకంటె ఎక్కువ పర్యాయములు ఒకే పాదమున ఆవృత్తము లగును. ఇందు ఏ ఒక్క గణము కూడ రెండవ మారు రాదు. 'స భ ర న మ య వ' అను గణములు ఒక్కొక్కసారి

మాత్రమే ఒక పాదములో నుండును. అందువలననే మత్తేభ వృత్తము మత్తేభగమనమున సాగును. ఒక్కొక్కప్పుడు వృత్తనామము సందర్భమునకు తగియుండి 'ముద్రాలంకారము' భాసించును.

"మ. భవదాజ్ఞా దృఢ బంధ సంయమిత శుంభద్వేగమై కాక నా
డవలీలన్మన యర్జున ద్విపము క్రోధావేశ దుర్ధాంత ద
ర్పవిలాసోద్భట భంగి నేపడరి కౌరవ్యాంబుజశ్రేణి జ
క్కుడవడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకు న్వేడ్క
సంధిల్లఁగన్." 4 1.56

ఇందు ప్రథమ, తృతీయ పాదములు సమాస ఘటితములుగా, ద్వితీయ చతుర్థ పాదములు చిన్న చిన్న పదముల కూర్పుతో నున్నవి. అర్జున ద్విపము యొక్క శుంభద్వేగము ధర్మజుని ఆజ్ఞా దృఢ బంధ సంయమితమై అడగినట్లు పాదము యొక్క నడక కూడ, సమాస వేగము విడివిడి పదములతో నిలువరింపబడుచు సాగినది. భీముని మత్తేభముతో పోల్చుట ఇలుమగు గమనింపవచ్చును. ఇచట పై పద్యము నుడువుచున్న భీముఁడు, ఉద్దేశింపబడిన అర్జునుఁడు గూడ ఇభముతో పోలిక గలవారే యగుటచే ఇచట ముద్రాలంకారము గలదు. అర్జునద్విపము గూర్చి మత్తేభమున చెప్పుట వృత్తౌచిత్యము. ('వలలుండెక్కడఁజూచె' అను పద్యములో సైతము ఇదేవిధముగా రోషావేశోన్మత్తుడైన భీముని అంకుశముక్రియ ధర్మజుఁడు నిలువరించుట వలన మత్తేభము ఒప్పిదమై యుండుటను గమనింపవచ్చును.)

అర్జునుని షండరూపమున గాంచిన విరటుఁడాతనిని వర్ణించుచుఁ బలికిన సందర్భములో గూడ తిక్కన మత్తేభ వృత్తమును గొనుట 'అర్జున ద్విపము'నకు తగిన ఎన్నిక. అట్లే ఉత్తర పిలువగా సారథిగా నేతెంచు అర్జునుని 'మత్త శుండాలంబు'తోఁబోల్చుట స్మరణీయము.

"మ. వనితావేషము గల్గియున్నయది చెల్వం బాడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వమున్ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁడే నొక జగత్పూజ్యుండు క్రీడార్థమి
ట్లోనరం దాల్చిన రూపు గావలయును మీరూహింపుఁడా
యట్లగున్." 4.1.281

మదోన్మత్తుఁడైన కీచకుఁడు తన బాహుబలమును గూర్చి అక్కకు అతిశయముగా చెప్పుకొనునెడ తిక్కన మత్తేభమునే గైకొనినాఁడు. కీచకుని చిత్తవృత్తి మత్తేభచిత్తవృత్తిని పోలియున్న ఆ సందర్భమునలో మత్తేభరచన ఉచితముగానున్నది. పొంగి పొరలు కీచకుని ఆత్మ విశ్వాసము, ఉన్మత్తత కలిసిసాగినట్లున్నది ఈ రచన.

"మ. వనితా యేనొక పల్కు పల్కెదఁ జతుర్వారాశి మధ్యంబునన్
ఘన బాహాబల మొప్ప నన్ను నెదురంగా నొక్కఁడున్
లేమి యె
వ్వనికిం దెల్లముగాదె దాని మగలన్ వజ్రాహతిం గూలు శై
లనికాయంబన మద్భుజాసమదలీలన్ గీటడంగించెదన్"
4.2.75

"సమదలీల" అను పదము ఇచ్చట అత్యంత ఉచిత స్థానీయము. కీచకుని సమదలీలన్, కీటడగించు భీముఁడు స్ఫురణకు వచ్చుట ఈ పదము యొక్క పరమ ప్రయోజనము. భీమ కీచకుల ద్వంద్వ యుద్ధమును వర్ణించు నెడ తిక్కన రెండు మత్తేభములను గైకొని యుండుట ఇట గమనార్హము.

ఉపకీచకుల నెదిరించు భీముని తిక్కన మత్తేభమునందే ఓజోగుణ భరితముగా వర్ణించెను.

"మ. వికటభ్రూకుటి ఘోరఫాల కలిత స్వేదోద్భటుఁడుం జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం బ్రమర్దన దశావిర్భావ సంభావితాం
గకుఁడుం జిత్తవిదాహ దోహల సమగ్ర క్రోధ వేగుఁడునై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తి
తోన్ 4.3.25

ఇందు మూఁడు పాదములు సమాసఘటితములై చివరి పాదము శిథిలబంధమై యుండుటవలన భీముని శౌర్యము స్ఫూర్తిమంతముగా మూర్తి శుభాకారముగా దోచుచున్నది.

ఈ మత్తేభము సభాంతరమున భీముని వర్ణించిన చంపకమును పోలి యున్నది. కాని అచట క్రోధ మడగించుకొను ప్రయత్న ముండుటవలన

ఎత్తుగడ భిన్నమైన చంపకము గ్రహింపబడినది. ఇచట తన ఆగ్రహావేశముల నణచుకొను అవసరములేమిచే భీముడు విజృంభించి యుండును. అట్టి విజృంభణ మును వర్ణించుటకు మత్తేభము అనుకూలము.

దక్షిణ గోగ్రహణమున విరాటుని బలముల సంరంభమును, మది రాజుని ఉదగ్రగర్వమును, సేనయొక్క ఇనుమడించిన ఉత్సాహమును, సుశర్మ విరటుల యుద్ధమును, ఉత్తరగోగ్రహణమున అర్జునుని, భీష్ముని, దుర్యోధనుని వ్యూహములను మత్తేభములలో తిక్కన వర్ణించియున్నాడు.

చిరకాలమునకు ప్రియశిష్యుని దర్శించిన ఆచార్యుని మది ఉప్పొంగి నది. 'సింగం బాకటితో' వచ్చునోజం కుంతీసుత మధ్యముఁడు సమరస్థేమాభి రామాకృతితో వచ్చినాఁడని ఒకపరి పొగడినాఁడు. అది శార్దూలము. అర్జునుని ఎంత వర్ణించినను తనివి నొందఁడు ఆచార్యుడు. తనకు శరాభివాదముల్ జేసిన ప్రియశిష్యుని పర్జన్యునితో బోల్చి ప్రశంసించినాఁడు. ఇట వృత్తము మత్తేభము. మత్తశుండాలమని మునుపు వర్ణించిన అర్జునుని ఇట మత్తేభమున వర్ణించుట సమంజసము. నాతికఠినముగా, మధుర గంభీరముగా మబ్బులతో మెఱపు తీవలతో అర్జునుని రథ, ధనువులను పోల్చుచు, కపిధ్వజధ్వనిని మేఘ గర్జనగా రూపించి ఉదాత్తముగా చేసినాఁడు ఇందలి రచనను తిక్కనార్యుడు.

"మ. విలసద్గాండివచాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీలగా
నలఘుస్ఫార కపిధ్వజధ్వని సముద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బల తీవ్రారి నిదాఘదుర్విషహ గర్వస్ఫూర్తినిర్మూర్తిగాన్"
(4-4-251)

విలసత్ గాండివ చాలనమును, విద్యుల్లతా లీలగానున్నది అనునెడ విలసత్, లీల పదములు ఆ గాండివచాలన విలాసమును తెలుపుచున్నవి. రెండవ పాదమునందలి 'కపిధ్వజధ్వని' అను పదములోని 'ధ్వ'కార పునరా వృతి, 'సముద్యద్గర్జ' అను పదమునందలి 'ద్యద్గ' వర్ణములు గంభీర మేఘ

స్వరమును గుర్తుదెచ్చుచున్నవి. ఇట ఆ అక్షరములు సందర్భానుసందలి వర్ణనకు తగిన వృత్తగతి నిర్ణయమును సాధించినవి. మూడవ పాదము కొంత విలంబితము. వేగముగా సాగెడి నడక ఇచట కొంత నిలువరింపబడి, తిరిగి నాల్గవ పాదమునందు గురుని ఉత్సాహామునకు, అర్జునుని అవక్ర విక్రమము నకు తగినట్లు విజృంభించినది. అలలవలె ఎగయుచు, విరిగి పడుచు, తిరిగి ఉత్థానము గావింపబడుచు సాగిన వీ పద్యపాదములు.

భీమ కీచకాదులతో ఉజ్జీ అయినవాఁడే దుర్యోధనుడు కూడ. ఆతని స్వోత్కర్ష ను గూడ తిక్కన మత్తేభము నందే నిబంధించి యుండుట గమ నార్హము. మహాకవి పాటించిన ఛందఃసామ్యమిట్టిది.

“మ. గద నాతో సరిమూఁడులోకముల నేఁ గానం జలంబెత్తి యు
న్నదు! డాభీముఁడు నన్ననిం దొడరిన న్వజ్రప్రహారంబు బె
ట్టిదమై తాఁకినఁగూలు పర్వతము మాడ్కింగుంభినిం గూలఁద్రే
సెద నా కోర్కి గదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్”
5-2-218.

## చంపకము

శార్దూలముకంటె మత్తేభము, ఉత్పలముకంటె చంపకము ఆంధ్ర భాషయందు ఎక్కువ ప్రయోగింపబడినవి. శార్దూల, ఉత్పలముల తొలి గురువును మార్చి రెండు లఘువులుంచిన మత్తేభ, చంపకము లవతరించును. గుర్వక్షర బహుళములైన శార్దూలోత్పలముల కన్నను తెలుగువారికి గురు, లఘువులు సమానములుగానుండు వృత్తములు ప్రీతికరములని తోచును. అందును చంపకము తక్కిన మూడు సామాన్య వృత్తములకంటె చాలా ఎక్కువగా ప్రయోగింపబడినది. దీనికి కారణము నూహించుచు శ్రీ శర్మ గారిట్లు వచించిరి. “విచ్ఛేదవశమున పాదఖండములు తుల్యప్రమాణములగుట చేతను, పాదమునందలి గురులఘువుల విన్యాస సామంజస్యమువల్లను చంపక మాలా వృత్తపాదము మిక్కిలి సుఖముగాఁ బ్రయోగింపదగి యున్నది.” (ఆ.మ.భా.ఛం.శి. పుట 419.)

ఇందువలననే కవిత్రయమువారు దీని నధికముగా నాదరించిరి. వారి మాటలలోనే "రతి, ఉత్సాహము, క్రోధము, శోకము, హర్షము, ఆవేగము, సంభ్రమము, ఔత్సుక్యము, భయము, ఉగ్రత మున్నగు భావములు ఉత్కటావస్థయందు చిత్తద్రుతిహేతువులగును. కవిత్రయ మిట్టి భావముతోడనే చిత్తస్పందత్వరను వ్యంజింపవలసిన పట్ల తరచు చంపకమాలా వృత్తమును ప్రయోగించిరి. (ఆ.మ.భా.ఛం.శి.పు 420.)

"కనుగొని కోపవేగమున" అను చంపకమునందు జగణములు పూర్వార్థమున భగణములై అవరోహణను తద్ద్వారా ఉప్పొంగుచున్న ఆవేశమును అణచి శాంతము తెచ్చుకొను భీముని యత్నమును సూచించుచున్నవి. ఉత్తరార్థమున 'నితాంత' 'ప్రవృత్త' 'ప్రకారాది' పదముల వలన సగణావభాసము భాసించి అణచబడిన క్రోధముయొక్క విజృంభణను పోషించుచున్నవి. "అణచరాని కోపముయొక్క వేగము భీముని క్రమవర్ధమాన భయంకరాకారమున పర్యవసించుట పద్యమందలి క్రమ వర్ధమాన వాక్య ప్రమాణమునను గుర్తింప వచ్చు"నని శ్రీ శర్మగారు చక్కగ వివరించిరి.[45]

శోకావస్థయందు తిక్కన తీర్చిన చంపకము దీనికి పూర్తిగా భిన్నముగా నున్నది (4.1.98).

"చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతి నిర్మలా
త్మకుఁ డనవద్యశీలుఁడు సధర్ముఁడు దాంతుఁడు గొంతిముద్దు సే
యుకొడుకు మేనులేత తనయుల్లము మెత్తన యిట్టియాతఁడె
ట్లొకొ యొరు నాశ్రయించు విధి యోపదె యెవ్వరి నెట్లు
సేయఁగన్."

ఇందు పదములు గణములుగా విభజింపరానట్లు ఒక పదము వెంట మఱియొక పదము గూర్పఁబడి ధర్మజుని శోకముయొక్క ఆవేగమును తెలుపుచున్నవి. ధర్మజుని ఉల్లము తల్లడిల్లుట అను అవస్థ పరాకాష్ఠ నందినది తృతీయ పాదమునందు. 'ఇట్టి యాతఁడెట్లొకొ ఒరు నాశ్రయించు' అని

అనగా శృంగార, హాస్య, కరుణరస సంబంధులైన భావములలో నిది ఎక్కువ అనుకూలమని తిక్కన అభిప్రాయముగా గుర్తింపవచ్చును. విరాటో ద్యోగముల పిమ్మట వచ్చిన యుద్ధ పర్వములలో, శాంత్యాది పర్వము లన్నిటిలో ఉత్పలమాలకంటె చంపకము ఎక్కువ ప్రయోగింపఁబడినది. విరా టోద్యోగముల తరువాతి కొన్ని పర్వములలో చంపకముల సంఖ్య ఉత్పల ములకు రెట్టింపుగా కూడ నున్నది.

విరాటోద్యోగములలో మృదువుగా కథ సాగిన సందర్భము లెక్కువ. స్త్రీపాత్రల ననుసరించి నడచిన కథాభాగము లెక్కువ సాగినవి. రాయ బారిగా కృష్ణుఁడేతెంచునెడ ద్రౌపది పలికిన పలుకులలో 15 పద్యములలో 8 ఉత్పలములే.

ద్రౌపది మనోభావములను వర్ణించుటకై తిక్కన పెక్కుసార్లు ఉత్పలమాలను ఎన్నుకొనెను. రసభావస్ఫూర్తికిది మిక్కిలి అనుకూలము.

"ఉ. చప్పి జనించె వ్రేళుల పుటంబులు పొక్కఁదొడంగె గోళ్ళలో
జిప్పిలఁజొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గడున్ వశంబుగా
దప్పర మిచ్చటచ్చటను నాసల వచ్చితి నెంత దవ్వొకో
యిప్పటి భంగి నొక్కడుగు నేఁగెడుదానికి నోర్వ నెమ్మె
యిన్. 4.1.148

కోమల శరీరముగల ఒక స్త్రీ యొక్క అలసతను ఇందు తిక్కన పలుకులలో వర్ణింపజేసెను. తానై చెప్పక పాత్రతోనే చెప్పించుట నాటకీ యత. కరుణయు, ఖేదమును ముప్పిరిగొనునట్లు సాగినది ఈ వృత్తము యొక్క నడక. ద్విత్వపకార ప్రాసము ద్రౌపది నడువ చేతకానితనమును నొక్కిపలుకుచున్నట్లున్నది. 'అప్పరమిచ్చటచ్చటను' అనునెడ ద్విత్వ చకార మును ఆమె అలసతయొక్క గరిష్ఠ స్థాయినిఁ దెలుపుచున్నది. చిప్పిల, అప్పర, ఇప్పటి, చిత్తము, ఆసల, వచ్చితి, ఏఁగెడు, దానికి అను పదముల మూాల ముగా అవరోహణార్థకమైన భగణము స్పష్టముగా వినిపించుట వలన శ్రవణ సుభగత్వమేర్పడినది. ఇట్టిదే మఱియొకటి రసభావ స్ఫోరకముగా నిర్మింపఁ బడిన ఉత్పలమాల కలదు. (4.2.91)

"ఉ. నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావన చేయుదిట్టిననుఁ బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణివట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకునీడ్చె గులాంగన నిట్లొనర్తురే."
5 3.110.

ఇందు ద్రౌపది ఉత్కటమైన దుఃఖము, ఆవేగము, ఉత్ప్లుతమైన జగణావభాసము వలన ప్రకటింపఁబడుచున్నది. "సుభద్ర", "ఒకండు", "కులాంగన" – ఇత్యాది పదములు జగణమును దాల్చినవి. కొన్ని పదములలో భగణము రూపు చెదరక నిలచినది. భగణ జగణ అవరోహణారోహణములలో ఎగసిపడు ద్రౌపది అంతరంగము ప్రతిఫలించు రచన ఇది. నాటి అవమానము స్ఫురణకు వచ్చుటచే కలిగిన దుస్సహవేదన ఇందు సూచ్యముకాగా దాని విజృంభణము ఆ తరువాత పద్యములలో స్పష్టమైనది.
(5.3.111, 114, 118.)

''ఉ ఆ సభకేకవస్త్ర యగునట్టి ననుం గొనివచ్చి వొంచు దు
శ్శాసను జూచుచుం బతు లసంభ్రములై తగు చేష్టలేక నా
యాసలు మాని చిత్రముల యాకృతి నున్నయెడన్
ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనంబదియుం దలంపవే''
5.3.111

"ఉ ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి వెంట్రుకల్
దా వలచేతఁబూని యసితచ్ఛవిఁబోల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁబొంగు విషాద రోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గనలేచి యార్తయై''
(5.3.114)

"ఉ. నెట్టన యట్టి యల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును గాలము దీనికి నాఱు వెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు తీవ్రతేజమునఁ బొల్చిన భర్తలుఁగల్గ నచ్యుతా."
(5 3.118)

ద్రౌపది పాత్రకు వలెనే సంయమనశీలి, ఉదాత్తుఁడు అయిన విజ యుని పాత్ర సంబంధముగా కూడ తిక్కన ఉత్పలముల నెక్కుడుపయోగిం చెను. తన సందేశమును కృష్ణునికి తెలుపునపుడు మూడు ఉత్పలములు వరు సగా ప్రయోగింపబడినవి. విజయుని సత్త్వగుణాధిక్యతకీ వృత్తము తగినదని తిక్కన అభిప్రాయముగా గ్రహింపవచ్చును (5.3. 73, 74, 75). వీర, క్రోధ, రౌద్ర రసాదుల కనుగుణముగా కూడ తిక్కన ఉత్పలములను తీర్చి దిద్దెను. ఉదా :— 4.3. 169, 172, 176, 177; 4-5-82, 57, 61; 5-3-55; 4.4.186, 181.

దక్షిణోత్తర గోగ్రహణ ఘట్టములందు, అర్జునాదులు సంజయ శ్రీకృష్ణులకు తమ అభిప్రాయములను తెలుపునపుడు ఓజోగుణ భాసుర ముగా నవి ఒప్పియున్నవి. ఇట్లు చంపకోత్పలములను వీర రౌద్రాదులందు ప్రయోగించుట "లఘ్వక్షర బహుళమైన వృత్తమును వీర రౌద్రాదులందు పయోగింపవలె"నను భరతముని అభిప్రాయమునకు అనుగుణముగా నున్నది. భీముడు తన యుద్ధము మీఁది వేడ్కను దెలుపుకొను పద్యము ఉత్పల మాలయే. అది :— 5.3.67.

"ఉ కయ్యము గల్గినట్లయిన గంధగజ ప్రకరంబు కుంభముల్
వ్రయ్యఁ దురంగపంక్తులు ధరం బడఁ దేరిగముల్ బయల్పడన్
డయ్యమికీవు వెక్కసపడన్ గదపండువు సేయఁగోరు నా
ధయ్యము నెత్తికోలు దుది దాఁకుటగాదె భుజంగభంజనా."
5-3-67.

కరుణ, శోకాదుల యందు, వీర రౌద్రములందుగాక ప్రబోధము లకు, సందేశములకు తిక్కన ఉత్పలములను మిక్కిలి నిపుణముగా తీర్చినాడు. ఉత్తర గోగ్రహణ ఘట్టమున వచ్చినవాఁడు ఫల్గునుఁడని ఎఱింగిన భీష్ముడు సంధిచేయుమని ఒప్పిదముగా పలికినాఁడు.

"ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁడవశ్యము గెల్తుమనంగ రాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే
హెచ్చుగుఁ గుందగుం దొడరుటెల్లవిధంబుల కోర్చుటట్లుగా
కిచ్చఁదలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగు చేతయుం
దగున్." (4 4 234)

ఇందు నిర్వికారముగా హితోక్తిని బలుకు భీష్మాచార్యుని వర్తనము నకు దగిన వృత్తగమనము కలదు. ప్రతి పాదమున కాపాదము సంపూర్ణ వాక్య ముగా నున్నది. అన్నియును కలిసి సమాహారముగా భీష్ముని అభిమతమును దెలుపుచున్నవి. ఇచట వాక్యౌచిత్యము వృత్తౌచిత్యము నాశ్రయించి ఏర్పడుచున్నది. భగణములు ఆవరోహణమును సూచించుచు ఉత్సాహము కొరవడిన ఆచార్యునికి తగియుండుటచే నిట పాత్రౌచితి కూడ కలదు.

శ్రీకృష్ణుని జలదస్వనగంభీరములగు మాటలను కూడ తిక్కన ఎక్కు వగా ఉత్పలమాలలందే నిబంధించి మృదుమధురముగా నుండు శైలిని, రీతిని ఆ వృత్తములందు గ్రహించెను.

"ఉ॥ సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారము బొందలేక చెడఁబాఱిన నైన యవస్థ దక్కు లె
వ్వారలు పేక్ష చేసిరది వారలచేటగుఁగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండెడున్
[5-3-273]

ఉత్పలమాలలో అత్యధిక సంఖ్యలో నుండు భగణములిందు చెక్కు చెదరక నిలిచియుండుట ఈ రచనయందలి ప్రత్యేకత. 'సారపు', 'సత్యము'

'పాపము', 'పారము', 'పాఱిన', 'వారలు', 'వారల', 'చేటగు', 'నిస్తారక' 'దాయక', 'మయ్యును' ఇత్యాదిగా భగణములు యథాస్థానముతో నిలిచినవి. ఒడుదుడుకులులేని ఈ వృత్తము నడక చిత్త వికారములు లేని శ్రీకృష్ణుని నోటివెంట వచ్చుటచే చిరస్మరణీయముగా తెలుగునాట నిలిచిపోయినది. ఇట్టివే మఱికొన్ని – 5 3–268, 281, 335, 368.

"ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నారటుగాక మీకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదుగు భూవర రెండు తెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా"
5-3-284.

ఇందును పై పద్యమునందు వలె రచన ఒక్క రీతిగాసాగి 'నిశ్చయింపుమా' అను కృష్ణుని ఆజ్ఞా పూర్వక సందేశముతో నిలిచినది. ఉత్పలమాల భగణముల స్వస్వరూపములతో రచించిన ఇట్లు ఉదాత్తములుగా నుండగలవని తిక్కన పై రెండు పద్యముల ద్వారా నిరూపించినాఁడని తెలియుచున్నది.

## సీసము

సీసమునుగూర్చి ప్రస్తావించుచు శ్రీ మాధవశర్మగారు "సీస పద్య నిర్మాణమున అతి విచిత్రములైన మర్మములు తిక్కనకు కరతలామలకములు. సోమన, శ్రీనాథుఁడు మొదలగు అనంతర మహాకవు లెల్లరును తిక్కన సీస నిర్మాతృకృతులను ఉపజీవించినవారే"47 అని పేర్కొనిరి. ఇందుకు వారి సీసములన్నియు నిదర్శనములే. తిక్కన అత్యంత నిపుణముగా నిర్వహించిన రసవద్ఘట్టము 'కీచకోదంతము'. విరాటోద్యోగములలోనున్న మొత్తము సీసపద్యములలో నాలుగవ వంతు ఈ ఘట్టమునందే కలవు. అనగా కావ్య రచనకు సీసములెంతో ఉపయోగకరములని తిక్కన భావించి యుండెనన వచ్చును. కందపద్య రచనము నందు తిక్కన సిద్ధహస్తుఁడని లోకమున ప్రశస్తి కలదు. వర్ణన చేయవలసి వచ్చినపుడు మిగిలిన ఛందములన్నింటి కంటెను సీసము కవికి ఎక్కువ అనుకూలమని గ్రహించిన తిక్కన వర్ణనలకు

సీసముల నెక్కువ ప్రయోగించెను. విరాటపర్వములోనున్న సీసములలో వర్ణనల కొఱకు రచింపబడినవి 85, కాగా కథనము నడుపుట కొఱకు రచింప బడినవి 57 మాత్రమే. మూలమును మించి రచించిన కీచక మోహ పరితాప వృత్తాంతమునందే 35 కలవనగా వర్ణనకు సీసమునెంత నేర్పుగా తిక్కన మలచుకొనెనో తెలియును. ప్రకృతి, పాత్ర, వస్తు, స్వభావ, యుద్ధ వర్ణన లను తిక్కన సీసములందు నిబంధించెను. ఆ పద్యము లాయా సందర్భము లందు పేర్కొనబడును.

"సీ. పఱమొయిల్ గప్పిన బాడఱి నునుఁ గాంతి
గదలిన యమృతాంశుకలయుఁ బోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము తప్పి
చెలువు కుందిన సరోజిని విధమున
ధూమంబు పొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగి పూసిన దీపకళిక పగిది
ధూళిపైఁ బొరసిన దొంగలించుట మాని
లావణ్యమెడలిన లతిక భంగి

తే. గంధకారి వేషంబుకతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱువడి యుండఁ బాండు
తనయమహిషి యంచితగతిఁ జనఁగ రాజ
వీథిఁ బౌరజనంబులవ్వేఁది జూచి." (4-1-294.)

పై సీసపద్యమున నాలుగు పాదములందు ద్రౌపది కాంతి తఱిగిన శశికళతో, వికాసము కోల్పోయిన పద్మినితో, మెఱుఁగులు కొఱవడిన దీప కళికతో, లావణ్యమెడలిన లతికతో పోల్చబడినది. ఆమె సౌందర్యము ఇందు వాచ్యము గావింపబడలేదు. కాని ఆ ఉపమానముల వలన ఆమె లావణ్యము వ్యంజ్యమాన మగుచున్నది. నాలుగుపాదముల నాలుగు ప్రసిద్ధో పమానములతోఁ బోల్చి గీతమునందు అసలు విషయమును "గంధకారి వేషంబుకతన మూర్తి యుజ్జ్వలత్వంబు మఱువడి యుండ" ద్రౌపది

ప్రశంసించిరని పేర్కొని ప్రకాన్వయమును సాధించినాఁడు కవి. తొలుత ఆ ఉపమానములను పేర్కొని ఉపమేయమును దాచి యుండుటలో నొక చమత్కారము కలదు. ఆ ఉపమానములను హృదయమునందు భావింపఁజేసిన పిమ్మటనే ఉపమేయమగు ద్రౌపదిని పేర్కొనుట ఉచితము. ఇచట ఈ వర్ణనకు సీస మత్యంతము దగియుండుట సహృదయ హృదయైకవేద్యము.

"సీ. ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల
పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె
చ్చించిన యా జగజెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ
బట్టంబుఁ గట్టిన ప్రభు వితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల
కోర్కె దీర్చిన రసికుం డితండె

"తే వెన్నలును గోపికా చిత్త వృత్తములును
నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతి శిరోభాగములఁ దన సుభగచరణ
సరసిజామోదమును గూర్చు చతురుఁడితఁడె. (5.3.175)

ఈ సీసమునందు సీస పద్యపాదములకు గీత పద్యపాదములకు రచనయందు భేదములేదు. మొత్తమాఱుపాదములును 'ఇతఁడె' అనుపదముతో అంతమగుచో ఆ పౌరజనుల విస్మయానందములను వ్యక్తము చేయుచున్నది. శ్రీకృష్ణుని పూర్వప్రవర్తితములైన కార్యములు, అందుకు తగిన నామములు ఇచట ప్రయోగింపఁబడినవి. ఈ సీసము శ్రీకృష్ణుని బహుముఖ వ్యక్తిత్వ ప్రతిపాదనమునకు తగియున్నది.

పాత్రలను వర్ణించుటకు సైతము సీసము లనుకూలములు. కీచకుని పలువిధ అవస్థలు ద్రౌపది భయావస్థలు, ఉత్తరాభిమన్యుల స్వాత్త్విక భావ

పరంపరలు, భీమార్జునుల పరాక్రమాదులును సీసములందే వర్ణింపబడినవి. ఒకానొక క్రియను వర్ణించుటకు సీసమునెట్లుపయోగింపదగునో తిక్కన నిరూపించి యున్నాడు. కీచకుఁడు ద్రౌపదిని వెన్నంటి వచ్చి సభామధ్యమునఁ బట్టిన కార్యము త్రుటిలో ముగిసినది. అద్దానిని తిక్కన వర్ణించిన విధమత్యద్భుతము.

"సీ. సమదవారణము జంగమలత వెనుకొని
సరభసంబునఁ బట్టఁజను విధమునఁ
గ్రూరదానవుఁడు భూచార నిర్జరకాంతఁ
బొదువ రయమ్మునఁ బోవు భంగి
ఘోర గృధ్రము సుకుమార నాగాంగనఁ
బటుగతి నొడయంగఁ బాఱు కరణిఁ
బ్రబల బిడాలంబు బాలశారిక మీఁద
నడరి సత్వరముగ నరుగు మాడ్కి

"తే. సింహబలుఁ డత్యుదగ్రతఁ జిగురుఁబోఁడి
పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు కదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్ర వృత్తిఁ
గొంకు కొసరించుకయు లేక కూలఁదాచె." 4-2-128.

ఇందు గీతపద్యమున ప్రస్తుత విషయము చెప్పఁబడినది. ఇది యంతకు పూర్వము వర్ణింపఁబడిన విధమున అత్యంతము ప్రకటితమగుచున్నది. ఇట్టిది తిక్కన సీసపద్య నిర్మాణ సౌలభ్యము.

## తేటగీతి

తిక్కన తేటగీతిని తేట గీతిగా రచించెను. "సంస్కృతము నందలి శ్లోకమువలెఁ బ్రసన్నార్థములను బ్రతిపాదించుటకు తేటగీతి సమర్థమైన ఛందమని భావింపవచ్చును". (ఆ.మ.భా.ఛం.శి.పు. 516.) అను శ్రీ శర్మగారి

యభిప్రాయమత్యంత యుక్తియుక్తము. విదురనీతులలో తిక్కన సంస్కృత శ్లోకములను పెక్కింటిని యథాతథముగా ననువదించెను. మూలమునందలి భావము చెడకుండ, ప్రసన్నముగా, తేట తెనుఁగునఁ జెప్పినాఁడు తిక్కన. ఇది అత్యంత ప్రతిభావహమైన విషయము. ఇట్టి పట్టులందు తిక్కన ఎక్కువగా కందములను, తేటగీతులను, కొన్ని ఆటవెలదులను నిర్మించెను. ఈ సందర్భమున రచింపఁబడిన తేటగీతులు ప్రసాదగుణమునకు నిలయములై తేట తేటతెనుగుసందున్నవి. ఇవి యన్నియును పేర్కొనఁదగినవే. (5.2.37, 42, 44, 45, 47, 57, 67, 85)

"తే. చెల్లియుండియు సైరణ చేయునతఁడుఁ
బేదవడియును నర్థికిఁ బ్రియము తోడఁ
దనకుఁగలకంగి నిచ్చునతండుఁ బుణ్య
బురుషులని చెప్పి రార్యులు కురువరేణ్య." (5 2.42.)

"తే వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల."(5.2 44.)

లఘ్వక్షర బహుళములైన ఈ తేటగీతులు ద్రుతవృత్తిని గలిగి శ్రోతయైన ధృతరాష్ట్రునకు, పరోక్షముగా పఠితకు చిత్త ద్రుతిని కలిగింప సమర్థములై యున్నవి. ఉచ్చారణ సౌలభ్యము వలన శ్రవణ సుభగత్వమును ఏర్పడును.

"తే. తగిన వేషంబు తనుఁదాన పొగడుకొనమి
నొచ్చియును గీడు పలుకమి యిచ్చి వగవ
కనికి తనకెంత నడవక యున్నఁ బథము
దప్పకుండుట నడవడి కొప్పుచేయు." (5.2 45.)

"తే. కొంచెమైనను దగఁబంచి కుడువ మేలు
పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము శత్రువనకునైన
నిచ్చుటయ లెస్స యడిగినయెడ నృపాల." (5 2.47)

ఇవి యన్నియు నొకయెత్తు తేటగీతిలో మాధుర్య గుణము చిప్పిల్లునట్లు నిర్మించిన క్రింది తేటగీతి ఒక యెత్తు. దీనిలో శబ్దమోహనత్వము, అర్థ సౌకుమార్యము జతగూడి యున్నవి. ఇందుగల పబది యేడక్షరములలో పదునాలుగు మాత్రమే గురువులుండుటవలన దీనిగతి మిక్కిలి ద్రుతము.

"తే. మాలకరి పుష్పములు కోయుమాడ్కిఁ దేటి
పువ్వుదేనియఁ గొనియెడు పోల్కి నెదురు
కందకుండఁగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంట బొడువఁ జనదు. (5.2 57.)

ఉత్సాహమును కలిగించుటకు కూడ తేటగీతి నుపయోగింపఁ దగునని తిక్కన భావించియుండవచ్చును. భీముని బాహుబలమును ద్రౌపది ప్రశంసించి, ఆతనిచే కీచకుని సమయింపఁ జేయ నిశ్చయించిన సందర్భములో నున్న తేటగీతి వీరమున కనుకూలము.

"తే. బక హిడింబ కిమ్మీరుల బాహుబలము
నా జరాసంధు నదగ్రదర్పాతిశయము
లోకభీకరములు విజయాకరములు
నైన నీ కరములకు లోనయ్యెఁగాదె." (4.2 194.)

ఈ విధముగా తన పతుల పరాక్రమమును పొగడిన ద్రౌపది తన నిర్ణయమును తేటమాటలలోనే తెలిపినది. (కాని ఆ నిర్ణయము తీపిలో పొందు పరుపఁబడిన మందువలె నున్నది.) అర్థము అంతనిష్కర్షయైనది – కీచకుని సంహార కారకమైనది.

"తే. వానిఁ దెగఁజూడవై తేని వాయుపుత్ర
నీవు కనుఁగొన నురనైన నురనైన
నగ్నినైన విషంబుననైన నేను
మేను దొఱఁగుదు నెట్టు నీయానసుమ్ము." 4.2.229.

నీవు కనుగొనగా చేతును అనుట ఒక చమత్కారము కాగా మేను తొఱఁగుదును అనుటతో అర్థము ముగిసినది సామాన్యముగా. కాని "నీయానసుమ్ము" అను వాక్యము అసలా పద్యమునకే ప్రాణము. సతి పతిమీద ఒట్టుపెట్టి పలుకుటయన్న అది ప్రాణాంతక విషయమే యైయుండును. ఈ తేటగీతి రచనమున తేటగీతి, అర్థమున గంభీరవృత్తి కలది.

సానునయముగా సుధేష్ణ ద్రౌపదిని వెడలనంపఁ దలచి తేటమాటల తేటగీతిలో ఎంత నయోన్నతముగాఁ బలికినదో ఈ పద్యమున తెలియు చున్నది.

"తే. నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ
దలఁచి భయమంది నిన్ను నీవలచు నెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపుమనియె" (4.3 59)

"నీవు వెళ్లుము" అను రెండు మాటలను ఒక పద్యమంతటను విస్తరించి చెప్పినాఁడిచట కవి. కారణము సుధేష్ణ, విరటులకు కలిగిన భయము. నీవు చక్కని దానవు నెలఁత అని తొలుత పొగడి, ధైర్యరహితచిత్తులని మగవారిని తెగడి, రాజు ఈ రెంటిని సమన్వయించి భయపడుచున్నాఁడని నెపము రాజుపైవైచి. ద్రౌపది ఇచ్చవచ్చినచోటికి అరుగునట్లుగా ప్రార్థించి సగౌరవముగా పంపించుమనెను అని రాణి పలికినది. ఎంత నిగూఢ భాషణము! తానై చెప్పినట్లు గాదు. రాజైనను ఊరక పంపుమనలేదు, "ప్రార్థించి అనుపుమనియె" అని రెండు మాటలను ఒక పద్యముగా పెంచుట వలన కలుగు ప్రయోజనమును తిక్కన సాధించెను. అంతకు పూర్వమున వచనము (4.3.58) లోనే "ద్రౌపదిని వెడలుమని ప్రార్థించి" అనిన కథకు సరి

పోవునుగాని కావ్యార్థము భంగమగును. (ఈ చమత్కారజన్య ఆస్వాద నము మాయమగును.)

శ్రీకృష్ణుడు కౌరవుల పేరోలగమున భాషించునెడ పాండవులపై సానుభూతిని కలిగించుటకొక తేటగీతిని తిక్కన ప్రయోగించెను.

"తే. పాండవులు తండ్రి చచ్చిన ప్రజలు వారి
నరసి ప్రోచితి శైశవ మాదిగాఁగ
నడుమ నిష్కారణము దిగవిడువఁ దగునె
పారమొందంగ రక్షింపు గారవమున." (5.3.271)

ఇందు ఏ పాదమునకాపాదము సంపూర్ణార్థ బోధకము. 4 చిన్న చిన్న వాక్యముల కూర్పు ఒక తేటగీతిగా రూపొందినది. తిక్కన భారతము నాళువుగా వాడుకలోనున్న పదబంధములతో, వాక్య నిర్మాణముతో అను వులవలె పద్యములను రచించెనని మాత్రము నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఏ ఛందమునైనను అప్రయత్న సులభరముగా, ఔచిత్య మండితముగా నిర్మించు ప్రతిభ ఆ మహాకవిది.

శ్రీకృష్ణుడు ఆర్తయైన ద్రౌపదికి అభయమిచ్చిన తెఱఁగు ఆతని హృద యాంతరాళములలోనున్న ఉద్దేశ్యమును తేటతెల్లము చేయుచున్నది. భావిని దర్శించిన ద్రష్ట పలుకులివి :—

"తే. పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ
జేసి యుజ్జ్వల పుణ్యలక్ష్మి సమేతు
లైన పాండుకుమారుల యధిక విభవ
మీవు సూచెదు తడవులేదిది నిజంబు." (5.3.124)

ఇచ్చట ద్రౌపది నూరడించు సందర్భమునకు దీర్ఘములగు వృత్తముల కన్నను, నియతములగు ఛందములకంటెను తేటగీతి ప్రయోజనకరమని తిక్కన భావించి, భవితవ్యమును భగవంతునిచేఁ బలికించెను.

ఇవి యన్నియు సమాస రహితములైన తేటగీతులు. దీనికన్న భిన్నమైనదీక్రింది పద్యము.

"తే. ద్రోణ గాంగేయ భానుమత్సూను కృప సు
శర్మ దుశ్శాసనులు సర్వసైన్యపతులు
నార్యజనములుఁ గొలువ మహోర్వ్యకాంచ
నోన్నతాసనమునఁ జెలువున్నవాని". 4.3.77

ఇది కొంత సమాస ఘటితము. మధ్యమధ్య విడిపదములు కలిగిన తేటగీతి. ఇతఃపూర్వము వానివలె కాక ఇది కొంత పరుషమగు వర్తనము కలది యని చెప్పవచ్చును.

## ఆటవెలది

ఆటవెలది యందు విషమ పాదములొక రీతిగా, సమపాదము లొక రీతిగా నుండును. ఇట్లుండుటచే దీనిని విషమ గీతిగా నెంచుటయే యుక్తము. కాని లాక్షణికులు దీనిని సమగీతి భేదముగా పేర్కొనిరి. ప్రథమ పాదమున రెండింద్ర గణము లుండుటచే నది ద్వితీయ పాదముకన్న కొంత దీర్ఘముగా నుండును. వివిధ గతులలో నడచు ఛంద మగుటచే దీనికి ఆటవెలది యను నామము కుదిరినదని యూహింపవచ్చును. తిక్కన ఆటవెలదులను నన్నయాదులకంటె కొంత పరిమితముగా ప్రయోగించెనవి భావింప వచ్చును. తేటగీతి తరువాతనే దీనిని తిక్కన (సంఖ్యనుబట్టి) గ్రహించెను. ఉత్తరను బృహన్నల కప్పగించు సందర్భమున నున్న ఐదు ఆటవెలదులు సందర్భోచితములై యున్నవి. బృహన్నలను, ఉత్తరను ఈ సందర్భమునందు సీస పద్యములందే వర్ణించినను, సాధారణముగా సీసములపై తేటగీతులను రచించు తిక్కన ఇట మాత్రము రెండు సీసములపై రెండు ఆటవెలదులనే గ్రహించెను. ఇట నాట్యమునకు తగిన వర్తనముగల ఆటవెలదిని ప్రయోగించుటయే తిక్కన ఛందఃశిల్పము.

"ఆ. మంచు మఱుఁగువడిన మార్తాండుఁడును బోలె
నీఱు కప్పి యున్న నిప్పుఁబోలె

వేషధారియైన విష్ణుండు బోలె న

వ్విరటు కొలువు చేర నరుఁడు వచ్చె." [4.1.228]

ఇట నరుని వేషధారియైన విష్ణునితో అనగా మోహినితో బోల్చుట అత్యంత ఉచితము. పలువోకలు వోవు నరునికి ఆటవెలది తగియున్నది. ఇట్లే నాట్యము నేర్పబోవు ఉత్తరనుగూడ తిక్కన ఆటవెలదిలోనే వర్ణించెను. (4.1.245) ఆ తరువాత అర్జునుని సారథిగా పిలువబోవు సందర్భమున కూడ ఉత్తరను ఆటవెలదిలో వర్ణించుట తిక్కన పాటించిన ఛందఃసామ్యమునకు నిదర్శనము.

"ఆ.వె. మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱగున నాట్య మం

దిరము చొచ్చి తనదు గురువుకడకు

నరిగి నెమ్మి నిట్టులను నింతి ప్రార్థనా

వినయ సంభ్రమములు పెనఁగొనంగ." 4.4.27

'బాలకేళి మీది భరము' వీడునట్లు శిక్ష గఱపుమనినచో కేళికి, ఆటవెలదికి, కళలకు గల సంబంధము నుద్దేశించి చూచిన ఇచట ఆటవెలదుల ప్రయోగౌచిత్యము తెలియును. (4.1.245, 246, 249, 251, 253)

విరాటుని సభలో తన మొఱను విన్నవించుకొను ద్రౌపదిని ధర్మరాజు 'పలువోకలఁ బోవుచు విచ్చలవిడి నాట్యంబు సూపుచాడ్పున' ఇట్లుండుట తగదని హెచ్చరించినాఁడు.

"ఆ.వె. నాదు వల్లభుండు నటుఁడింత నిక్కంబు

పెద్దవారి యట్ల పిన్నవారుఁ

గాన బతుల విధమకాక యే శైలూషిఁ

గాననంగరాదు కంకభట్ట!" [4.2 52]

'నాట్యంబు సూపు చాడ్పున' అని ధర్మరాజు పలుకుటకు గినిసిన ద్రౌపది ప్రతివచనముగా 'ఏ శైలూషి గాననంగరాదు' అని ఆటవెలదిలో ప్రత్యుత్తర మిచ్చుట చక్కగా నున్నది. తన శైలూషిత్వముతోపాటు తన భర్తల జూదమును, నట్టువతనమునుగూడ ప్రకటించి తన క్రోధమును వెలిబుచ్చి, గూఢముగా ధర్మజాదులకు తన నిరసనను తెలిపినది.

భీముఁడు కీచకుని సంహరించిన విధమును తిక్కన ఒక్క ఆటవెలదిలో సుస్పష్టము గావించెను. మత్తగజములు క్రీడార్థము మహావృక్షములను గూల ద్రోచును. ఇట భీముఁడును క్రీడవలె కీచకాంతమును నెఱపినాఁడు. ఇట ఈ ఆటవెలది సందర్భోచితమై, రమణీయార్థ బోధకమై, అలంకృతమై యొప్పు చున్నది. (4.2.352)

"ఆ. పల్లవ ప్రసూన ఫల భరితం బగు
ద్రుమానుఁ గూలఁద్రోచు మత్తగజము
పోల్కి వివిధ రత్న భూషణ భూషితుం
డైన సూతుఁ గూల్చె ననిలసుతుఁడు".

ఆటగాడు ఆటలలో ప్రతిపక్షపు ఆటగానిని కూలఁద్రోచునట్లు సుకర ముగాఁ జంపెనని సూచించుటకే తిక్కన ఇట ఆటవెలదిని గ్రహించెను.

ఇంతకు పూర్వమే మల్లుని భీముఁడు ఓడించిన సందర్భములో గూడ ఆటవెలదినే (4.2.17) గ్రహించి యుండుటచే తిక్కన ఛందమున పాటించు ఏకాగ్రత బోధపడును.

వాసుదేవుని తత్త్వమును గూర్చి వృద్ధరాజునకు సంజయుఁడు విన్న వించినాఁడు.

"ఆ.వె. అధిక దుష్కరంబులైన కార్యంబులు
క్రీడవోలెఁ జేయుఁ గేశవుండు
విను మతండు పార్థు నెనసి యేకార్థుఁడై
యుండుఁ బూర్వభవ సఖుండు కాన." [5.2.311]

అధిక దుష్కరంబులైన కార్యములను కేశవుండు క్రీడవోలె జేయునని చెప్పుట ఛందౌచిత్యమున కలిగిన చమత్కారమునకు నిదర్శనము.

అర్జునుని రణకేళిని వర్ణించు సందర్భమునందు సైతము తిక్కన ఒక ఆటవెలదిని చామరము లాడుచున్నట్లు చెప్పుటకు ప్రయోగించెను. (4.5.54)

"ఆ.వె. అర్జునాస్త్ర ఖండితాతపత్ర ధ్వజ
చామరములు గాలిఁ జదలఁ దూలఁ
జిహ్నముల విభూతిఁ జెందంగఁ గని యొప్పె
నప్పు డాడుచున్న యట్టు లచట."

ఇట్లు క్రీడనార్థమున గాక ప్రసన్నార్థ బోధకత్వమునకై కూడ తిక్కన ఆటవెలదులను ప్రయోగించుట విదురనీతిలో జూడవచ్చును.
(5-2-43, 56, 64, 66, 72, 79)

"ఆవె. పాడి తప్పకుండఁ బడయు సొమ్ములకు న
పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్టకునికి యనఁగ నెట్టన రెండు వి
ధముల:గీడు తొడరు ధరణినాథ" (5-2-43)

"ఆవె. తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి
చేెకాదు విత్తు చేటుఁ గలుగుఁ
బక్వమైనఁ గొనిన ఫలమించుఁ జెడదు బీ
జంబు కార్యసిద్ధి చందమిట్లు" (5-2-56)

"ఆవె. సకల పుణ్యకర్మ చయమును నొకదెస
వినుము పాడి తప్పకునికి యొక్క
దిక్కు దీని శ్రుతులు తెలిపెడు నెడఁ బాడి
కలిమి యొందుఁ బెద్దగా నుతించె" (5-2-66)

శ్రుత్యర్థములనిట్లు దేశీయచ్ఛందము లనదగిన ఆటవెలదులలో తిక్కన నిబంధించెను. పరుషములుకాని హితములే చెవికింపుగాఁ దోచి బుద్ధిని వశవర్తులు గావింపగలవు.

మూలమును వలసిన చోట్ల యథాతథముగా అనువదించినాఁడు తిక్కన. అట్టిచో కందము, తేటగీతి, ఆటవెలదులను గ్రహించుట జరిగినది.

"క. తల్లియుఁ దండ్రియు దైవము
నెల్ల సుహృజ్జనము మీర యట్లు కొలిచి వ
ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ
దెల్లము చేసితిరి బ్రదికితిమి మీ కరుణన్" (4.1.142)

పాండవులు సేవాధర్మమును ధౌమ్యుఁ డెఱిఁగించిన విని ప్రసన్న చిత్తులై పలికిన పద్యమిది. ఇందు ద్విత్వ లకార ప్రాస వారి సంతోషాతిశయమును తెలుపుచు, కృతజ్ఞతను నొక్కి పలుకుచున్నట్లున్నది. ఇది భగణ కందకమనదగి యున్నది. ఇందు 9 భగణములు, 7 ఇతర గణములు గలవు. సమవర్తనముగల దీని నడక ఉత్పలమాల నడకను పోలియుండి పాండవుల వర్తనమును ప్రతిబింబించుచున్నది. మానవుని మాటతీరును బట్టి వాని స్వభావము నెఱుగ వచ్చునను ప్రతీతి కిది యొక నిదర్శనము. ఇట్టిదే మఱియొకటి — 4.1.156.

"క. చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన కాన పొసఁగఁ బలుకఁగ వలయున్" (5.2.60)

పలుకుబడి వలననే పై కార్యము లాసన్నము లగునని తిక్కన పలికించుచు, తన ఈ పలుకుబడిని అతినిపుణముగాఁ బలికించెను. పలుకుప్రల్లదనము సప్త వ్యసనములలో నొకటి యగుచో మెత్తనిపలుకు గుణమే యగును. ఇట తిక్కన ఈ 'నల' కందమును నిర్మించుటలోని గుణము ఇదియే. ఇందు 9 నలములు. 7 ఇతర గణములు గలవు. ఇది చంపకమాలను బోలి యుండుటను గమనింపనగును. ఇది దీర్ఘ కందము (55 అక్షరములున్నవి.) మఱియొక ఉదాహరణము 5.1.63

"క. నెమ్మిగల వారి నొల్లరు
తమ్మొల్లని వారి వెనుకఁ దగులుదు రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు
రిమ్మెఱుగని యట్టివార లిభపురనాథా." (5.2.34)

ఇచట ద్విత్వ మకార ప్రాసము ఆ హితముయొక్క ఆవశ్యకతను తెలుపుచున్నది. ఎఱిఁగి యెఱిఁగి తప్పు చేయువారికి హితము నొక్కియే చెప్పవలెను. ఇట ధృతరాష్ట్రుఁడు తెలిసియు తెలియని తనమును ప్రదర్శించువాఁడు. ఆతనికి నెమ్మిని విదురుఁడు బోధించుచు సందర్భమిది. అందుచే ప్రాసస్థానములో ద్విత్వాక్షరమును ఉంచుట తగియున్నది.

"క కదియుచుఁ బాయుచుఁ బట్టుచు
నదలుచుచుం బడుచు లేచు చడఁగుచు వడిగాం
చొదవెడు కినకం గడు బె
ట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్" (4.2.348)

భీమ కీచకుల యుద్ధవేగము నిందలి 'చు' వర్ణము సూచించుచున్నది. పద్య ప్రథమార్ధమున 9 చకారములు గలవు. వారు ఒక భంగిలో నుండక క్షణక్షణము మారుచుండుటను చవర్ణము (స్థాన భేదములను వహించి) నిర్వహించుచున్నది. ద్వితీయార్ధమున సమాహారార్థము చెప్పబడినది.

"క. మీయయ్య మీరు వనవా
సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్మం
డై యుట పుత్తెంచె నన్ను ననుమీ మొదలన్" (5 1 260)

ఇట 'య'కార ప్రాసము అనునయమును సూచించుచున్నది. కనుకనే తిక్కన ధృతరాష్ట్రుని చివఱి పద్యమునందు కూడ 'య్య'కార ప్రాసము నుపయోగించెను.

"క. నెయ్యము పాటించి కడుం
దియ్యమెసఁగ నలుక లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్యమను తలఁపులోసుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగుగాన్." (5 1.271)

యమనందనుఁడనుటలో నామౌచిత్యము గలదు. యమనందనుని యలుక సామాన్యమైనది కాదని తెలిసి పలికినవాఁడు ధృతరాష్ట్రుఁడు నెయ్యము.

తియ్యము, కయ్యము అను మాటలన్నియు నీ పద్యము నందు సార్థకములే. ఇవి ఇవి ప్రాస స్థానమునందుండుట వలన ఆ పదప్రయోజనము మఱికొంత ప్రస్ఫుట మగుచున్నది.

ఔచిత్యము కావ్య జీవితము. జీవిత సర్వావస్థల యందును ఔచిత్య మనివార్యము. అట్లే కావ్యజీవిత సర్వాంగములయందును ఔచిత్య పరిపోష ణము రసపోషకము. క్షేమేంద్రుని మార్గము ననుసరించి ఆంధ్ర మహా భారత విరాటోద్యోగ పర్వములలో ఔచిత్యము నిర్వహింపఁబడిన విధమును స్థాలీపులాక న్యాయముగా ఈ యధ్యాయమున సమీక్షించుటయైనది ఇవి గాక నవ్యులు సన్నివేశ, పాత్ర, వర్ణనాద్యౌచిత్యములను సంభావించుటయుఁ గలదు. వీని ప్రసక్తి ఆయా అధ్యాయములందు ప్రస్తావింపఁబడుచుండుటచే వానిని వేరుగా నిందు పేర్కొనలేదు.

గుణానురక్తియు, రసాభివ్యక్తియు, తిక్కన రచనకు సహజ లక్షణ ములు. వాని జీవితమంతయు ఆ మహాకవి ఔచిత్యపాలనమునందు అమ రమై ఆంధ్రావళి మోదామోదముల నందుకొనినది



సూచికలు :

1. ధ్వన్యాలోకః – తృతీయోద్యోతః – 24, 25 శ్లోకముల మధ్య పాఠము నందుగల శ్లోకము (పుట. 180)
2 ఔచిత్య విచార చర్చ – పడవ కారిక.
3. ,, ,, 3. 4, 5 కారికలు.
4. ,, ,, 8, 9, 10 శ్లోకములు, వచనము.
5. జమ్మలమడక మాధవరామశర్మగారు రొనరించిన వర్గీకరణము—
   ౧. పద, వాక్య, ప్రబంధార్థములు మీమాంసా శాస్త్ర సంకేత మున నున్నవి.
   ౨. గుణాలంకార రసములు సాహిత్య శాస్త్ర సంబద్ధములు.
   ౩. క్రియా కారక లింగ వచన విశేషణోపసర్గ నిపాత కాలములు వ్యాకరణ శాస్త్ర నియత సంబంధమున నున్నవి.

ఆ. దేశ కుల వ్రతములు లోక శాస్త్ర నియతితో నున్నవి.

ఇ. తత్త్వ, సత్త్వాభిప్రాయ, స్వభావ, సారసంగ్రహ ప్రతిభావస్థా విచార నామాశీః ప్రక్రియ లంతరంగ సమీక్షాయణ మున నున్నవి. - ఔచిత్య విచార చర్చ - సానువాదము - జమ్మలమడక మాధవరామశర్మగారు. పుట 16.

6. ఔ. వి. చ. 39 వ కారిక తరువాత తుట్టతుది వచనము పుట - 183.

7. ధ్వన్యాలోకః - తృతీయోద్ద్యోతః - 32వ శ్లోకము.

8. వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తి-"రీతిరాత్మా కావ్యస్య విశిష్ట పదరచనా రీతిః విశేషోగుణాత్మా-1 2.

9. ఔచిత్య విచార చర్చ - శ్లోకము-11.

10. భామహుని కావ్యాలంకారము.

11. Simple, compound and complex sentences.

12. సంస్కృత మహాభారతము 5.70.92.

13. "సగుణత్వం సువృత్తత్వం సాధుతా చ విరాజతే ।
కావ్యస్య సుజనస్యేవ యద్యౌచిత్యవతీ క్రియా॥"
ఔ. వి. చ. _ శ్లోకము 19.

14. "ఉచితార్థ విశేషేణ ప్రబంధార్థః ప్రకాశతే ।
గుణప్రభావ భవ్యేన విభవేనేవ సజ్జనః ॥"
ఔ. వి. చ. – శ్లోకము 13

15. "తిలకం బిభ్రతీ సూక్తిః భాత్యేక ముచితం పదమ్ ।
చంద్రాననేవ కస్తూరీ కృతం శ్యామేవ చందనమ్ ॥
ఔ. వి. చ. శ్లోకము-11.

16. "ఉచితైరేవ వచనైః కావ్యమాయాతి చారుతామ్ ।
అదైన్య ధన్య మనసాం వదనం విదుషామివ ॥"
ఔ. వి. చ. శ్లోకము-22.

17. ఆంధ్ర మహాభాగవతము - బమ్మెర పోతన.

18. "నామ్నా కర్మానురూపేణ జ్ఞాయతే గుణదోషయోః।
కావ్యస్య పురుషస్యేవ వ్యక్తిః సంవాదపాతినీ ॥"
ఔ. వి. చ. శ్లోకము-48.

19. "ఉచితార్థ విశేషేణ ప్రబంధార్థః ప్రకాశతే।
గుణ ప్రభావ భవ్యేన విభవేనేవ సజ్జనః ॥"
ఔ. వి. చ. శ్లోకము-13.

20. దేశౌచిత్యేన కావ్యార్థః ససంవాదేన శోభతే।
పరం పరిచయాశంసీ వ్యవహారః సతామివ ॥"
ఔ. వి. చ. శ్లోకము-27.

21. "కులోపచిత మౌచిత్యం విశేషోత్కర్ష కారణమ్।
కావ్యస్య పురుషస్యేవ ప్రియం ప్రాయః సచేతసామ్ ॥"
ఔ. వి. చ. శ్లోకము-28.

22. "కావ్యార్థః సాధువాదార్హః సద్వ్రతౌచిత్య గౌరవాత్।
సంతోష నిర్భరం భక్త్యా కరోతి జనమానసమ్ ॥"
ఔ. వి. చ. శ్లోకము-29.

23. "చమత్కారం కరోత్యేవ వచః సత్వోచితం కవేః।
విచారరుచిరోదార చరితం సుమతేరివ ॥"
ఔ. వి. చ. శ్లోకము-31

24. "స్వభావౌచిత్య మాభాతి సూక్తీనాం చారు భూషణమ్।
అకృత్రిమ మసామాన్యం లావణ్యమివ యోషితామ్ ॥"
ఔ. వి. చ. శ్లోకము-33

25. "అవస్థౌచిత్య మాధత్తే కావ్యం జగతి పూజ్యతామ్।
విచార్యమాణరుచిరం కర్తవ్యమివ ధీమతామ్ ॥"
ఔ. వి. చ. శ్లోకము-36.

26. "అర్థౌచిత్యవతా సూక్తిరలంకారేణ శోభతే।
పీన స్తన స్థితేనేప హారేణ హారిణేక్షణా ॥"
ఔ. వి చ. శ్లోకము-15.

27. భామహుని కావ్యాలంకారము-1.13.

28. వామనుని కావ్యాలంకర సూత్రవృత్తి.

29. ,, ,,

30. ధ్వన్యాలోకము-ఆనందవర్ధనాచార్యుడు.

31. "ప్రస్తుతార్థోచితః కావ్యే భవ్యః సౌభాగ్యవాన్ గుణః ।
స్పందతీన్దురివానందం సంభోగావసరోదితః ॥"
ఔ. వి. చ. శ్లోకము-14.

32. రసగంగాధరము-జగన్నాథ పండితరాయలు.

33. "సర్వాన్ సర్వాశయే వ్యాప్తి మౌచిత్యరుచిరో రసః ।
మధుమాస ఇవాశోకం కరోత్యంకురితం మనః ॥"
ఔ. వి. చ. శ్లోకము-16.

34. "కావ్యం హృదయ సంవాది సత్య ప్రత్యయనిశ్చయాత్ ।
తత్త్వోచితాభిధానేన యాత్యుపాదేయతాం కవేః॥"
ఔ. వి. చ. శ్లోకము-30.

35. "అకదర్థన యాసూక్తమభిప్రాయ సమర్పకమ్।
చిత్త మావర్జయత్యేవ సతాం స్వస్థ మివార్జవమ్॥"
ఔ. వి. చ. శ్లోకము-32.

36. శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము — డా. జంధ్యాల జయకృష్ణ బాపు జీ. పుటలు — 521, 522.

37. "సార సంగ్రహ వాక్యేన కావ్యార్థః ఫల నిశ్చితః ।
అదీర్ఘ సూత్రవ్యాపారా ఇవ కస్య న సమ్మతః॥"
ఔ. వి. చ. శ్లోకము-34.

38. "ప్రతిభాభరణం కావ్యముచితం శోభతే కవేః।
నిర్మలం సుగుణస్యేవ కులం భూతివిభూషితమ్॥"
ఔ. వి. చ. శ్లోకము-35.

39. "ఉచితేన విచారేణ చారుతాం యాంతి సూక్తయః ।
వేద్యతత్త్వావబోధేన విద్యా ఇవ మనీషిణామ్॥ "
ఔ. వి. చ. శ్లోకము_37.

40. "లఘ్వక్షర ప్రాయకృతం ఉపమా రూపకాశ్రయమ్।
కావ్యం కావ్యంతు నాట్యజ్ఞై ర్వీర రౌద్రాద్భుతాశ్రయమ్॥"
"గుర్వక్షర ప్రాయకృతం బీభత్సే కరుణే తథా।
కదాచిద్వీర రౌద్రాభ్యా యదా ధర్షణజం భవేత్॥"
— భరతుని నాట్యశాస్త్రము XVI. 114. 115.

41. ఛందఃశిల్పము — డా. పాటిబండ మాధవశర్మ – పుట 337.

42. నాట్యశాస్త్రము. XIV. పుట. 246.

43. సువృత్త తిలకం – క్షేమేంద్రుఁడు

44. ఛందఃశిల్పము – డా. పాటిబండ మాధవశర్మ. పుటలు. 396,397

45. " " పుట – 422.

46.

| | చంపకము | ఉత్పలము |
|---|---|---|
| విరాట | 133 | 150 |
| ఉద్యోగ | 97 | 114 |

47. ఛందఃశిల్పము – డా. పాటిబండ మాధవశర్మ. పుట 505.

48. "సుయోధనో మన్యుమయో మహాద్రుమః
స్కంధః కర్ణః శకుని స్తస్య శాఖాః ।
దుశ్శాసన॥ పుష్పఫలే సమృద్ధే
మూలం రాజా ధృతరాష్ట్రో మనీషీ ॥ " 5.29.45
"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కంధో ఽ ర్జునో భీమసేనో ఽ స్య శాఖాః ।
మాద్రీపుత్రౌ పుష్పఫలే సమృద్ధే
మూలంత్వహం బ్రహ్మాచ బ్రాహ్మణాశ్చ॥ " 5.29.46

# వర్ణనలు-వైశిష్ట్యము

## 1. వర్ణనము

కవియనఁగా వర్ణించువాఁడు. 'కవృ' ధాతువునకు 'వర్ణించుట' అని యర్థము. "కవయతి చాతుర్యేణ వర్ణయతీతి కవిః" (చాతుర్యముచేత వర్ణించువాఁడు కవి) అని 'కవి' శబ్ద వ్యుత్పత్తి. "కవతే చాతుర్యేణ కవిః, కవృ వర్ణే" అనియు కలదు. వర్ణన శబ్దమునకు స్తుతియను నర్థము ప్రసిద్ధము. వర్ణనమనగా వర్ణించుట, స్తుతించుట, వివరించుట, రంగు వేయుట ఇత్యాద్యర్థములు వ్యవహారమున గలవు. వర్ణించుట స్తుతించుట యైనచో కవి స్తుతించు వాఁడగును. వేదములయందు కవులు దేవతలను ప్రసన్నులఁ గావించుకొనుటకు వారి రూప, గుణ, మాహాత్మ్యాదులను వర్ణించి యున్నారు. స్తుతికి ఫలము స్తుతవస్తు సాక్షాత్కారము. అట్లే వర్ణన ఫలము వర్ణ్య వస్తు సాక్షాత్కారము. వాల్మీక్యాది లౌకిక ఋషులు ద్రష్టలే కాక స్రష్టలుగా కూడ ప్రసిద్ధికెక్కిరి. వస్తుసందర్శనము ద్రష్ట చేయు పని. తాను దర్శించిన దానిని సహృదయ హృదయముల యందు సాక్షాత్కరించు నట్లును, రసానుభూతి కల్గునట్లును వస్తువును సృజించుట (వర్ణించుట) స్రష్టచేయు పని. ఇట్టి లక్షణమునే చాతుర్యమని నైఘంటికులు చెప్పి యున్నారు. చతురముగా వర్ణించుటయే వర్ణనము. కవిచాతుర్య మంతయు వర్ణ్య వస్తువును సహృదయునకు ఆస్వాద యోగ్యముగాఁ జేయుటయందే కలదు. ఆస్వాదనము సౌందర్యాపాదనము వలన కలుగును. సౌందర్యము వస్తువు నుదాత్తీకరించుట వలన, ఆస్వాద మధురముగా చిత్రించుట వలన, రమణీయముగా రచించుటవలన కలుగును. ఇట్టి వర్ణనమును కవి కావ్యము నందంతటను ప్రతిభాసామర్థ్యముతో నిర్వహించుచుండును వర్ణనము లేనిచో కావ్యము లేదని ఫలితార్థము.

కాని వర్ణన మనునది లక్షణ శాస్త్రమునందును, లోకవ్యవహారము నందును, పరిమితార్థమున రూఢికెక్కినది. కథాకథనమునందు కవి విశేషించి దేనినైన వివరించినచో దానిని వర్ణనమని పేర్కొనిరి. ఈ దృష్టితోఁ జూచిన వివరణను పైతము వర్ణనము కాగలదు. కాని వివరణము విషయ విశ్లేషణ ప్రధానమైనది. వస్తువస్త్వంగ వివేచనాత్మకమైనది. వర్ణనము తావన్మాత్రమే కాదు. రసానుగుణమైన కావ్యసౌందర్యావిష్కారమున కది వాహిక వంటిది. అనఁగా వివరణమైనను రసోదంచితముగా చిత్రింపఁబడినచో వర్ణన మగును.

నటుఁడు వర్ణము ధరించి రామాదిరూపముల ననుకరించును. అతని వేషము అభినయమున కావశ్యకము. అట్లే కవి వర్ణ్యవస్తువునకు తన భావనచే ప్రకరణోచితములైన రూప స్వభావాదుల నారోపించును. ఇట్టి ఆరోపణమే వర్ణనము. వర్ణనమునకును, అలంకరణమునకును అవినాభావ సంబంధము కలదు. కవి శబ్దమును, భావమును అలంకరించి వస్తువునకు నవ్యరూపము నిచ్చును. అందువలన కావ్యము నలంకరించుటయు వర్ణనమే యగును.

కావ్యమున వర్ణ్య మగునవి యేవి? వస్తువు, పాత్రములు. వస్తువనగా ఇతివృత్తము. వస్తువు అవిచ్ఛిన్న సన్నివేశ సంవిధాన స్వరూపము కలది. పాత్రలను ఆలంబన విభావము లనియు, వారి చేష్టలను, వారి చుట్టునున్న ప్రకృతిని ఉద్దీపన విభావములనియు, లాక్షణికులు పేర్కొనినారు. ప్రధాన పాత్రల రూప, గుణ, స్వభావాదులు, తదభినయములు పాత్రచిత్రణగా నెంచఁబడును. కాగా, వారి చుట్టునున్న ప్రకృతి రంగము, సన్నివేశములు వర్ణనలని సామాన్యముగా నెంచఁబడును. అనఁగా ఉద్దీపన విభావములే వర్ణనములని వ్యవహారమున చెప్పబడుచున్నవి. ఇవి అష్టాదశ సంఖ్యలో గలవని ప్రసిద్ధము[1]. ఇరువది రెండు వర్ణనములను చెప్పినవారును కలరు[2]. దండి మొదలుగాగల ఆలంకారికులు వీనిని పేర్కొనుచున్నారు.

ప్రకృతియందు చేతనములు, చేతనాచేతనములు, అచేతనములు కలవు. పశు, పక్ష్యాదులు చేతనములు. సూర్య చంద్రాదులు చేతనాచేతనములు. ఉద్యానవనములకు వసంతాది ఋతువుల ప్రభావమువలన

పరిణామములు కలుగును. అచేతనములైన పర్వతాదులయందు పరిణామము లేదు. అయినను ప్రతిభావంతుఁడైన కవి అచేతనములందు సైతము చేతనత్వ మారోపించుచుండును.

ఇట్లగుటచే కావ్యములందు విభావ వర్ణనములు మూఁడు విభాగముల క్రింద వర్గీకరింపవచ్చును. ఆలంబన విభావములు, చేతనములైన ఉద్దీపన విభావములు, ఉద్దీపకములైన జడద్రవ్య విభావములు. ఈ మూఁడవవానినే తటస్థ విభావములనియు లాక్షణికులందురు. స్వభావతః తటస్థములయ్యునవి కవివర్ణనముచే రసభావోద్దీపకము లగును. ఇపుడు ఉద్దీపన, తటస్థ విభావము లైన అష్టాదశ వర్ణనాదులు, వానిని తిక్కన ప్రయోగించిన తీరు తెన్నులు, తదౌచిత్యము చర్చింపఁబడును.

తిక్కనకు స్థిర విభావముల వర్ణనమునందుకంటె చలద్విభావ చేష్టాది వర్ణనలయందే మక్కువ ఎక్కువ.3 కనుకనే తిక్కన భారతమునందు పాత్ర ముల మనోభావ ప్రవర్తనాభినయముల వర్ణనలే ప్రముఖముగా కనఁబడును. అయినను సందర్భోచితముగా పరిమితముగా తిక్కన అష్టాదశ వర్ణనలలో ఆవశ్యకములైనవానిని వర్ణించినాఁడు. ఇవి ఉద్దీపన విభావము లనఁదగినవి కనుకనే రసశిల్పియగు తిక్కన ఔచిత్యవంతముగా నిర్వహించినాఁడు.

## 2. అష్టాదశ వర్ణనలు

అష్టాదశ వర్ణనలు స్థూలముగ ప్రకృతి వర్ణనలు, వస్తు వర్ణన, సన్నివేశ వర్ణనలు అని త్రివిధములు. సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ, చంద్రాస్తమయ, ప్రాతఃకాలాదుల వర్ణనలు ప్రకృతి వర్ణనలు. నగర, శైల, సాగర, వృక్షాదుల వర్ణన వస్తు వర్ణన. విరహ, వివాహ, యుద్ధ వర్ణనలు సన్నివేశ వర్ణనలు అని భావింపవచ్చును. తిక్కన ప్రకృతివర్ణనలను చేసిన సందర్భములు, వర్ణనానైపుణ్యము. తదావశ్యకత తొలుదొల్త చర్చింపఁ దగును. విరాటోద్యోగ పర్వములలో నున్న ప్రముఖ ప్రాతఃకాల, సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణనలు తిక్కన స్వకపోల కల్పితములే. ఈ కల్పనల

ఆవశ్యకము నరయుటకు ముందు కావ్యమునందు ప్రకృతి వర్ణనల అవసరము కలదా, ఉన్నచో ఎంతవఱకు ? అను అవగాహన ఏర్పడవలయును. కావ్యమున కథ కంటె రసనిష్పత్తి ప్రధానాంశము. రసోత్పత్తికి గుణాలంకారములు, భావ (స్థాయీ, సంచారి) వర్ణన, పాత్ర పోషణ ఇత్యాదు లంగములు. అట్లే రమ్యమైన ప్రకృతివర్ణనలు సహృదయ హృదయ రంజకములై రసనిష్పత్తి కనువుగ మనస్సును అలరించును. ఈ వర్ణనలు కథలో కలియకున్నచో కవి కవితాశక్తి కాలవాలములై పఠితలకు అబ్బురపాటును కలిగించును. కథలో లీనమైన వర్ణనలు కవియొక్క ప్రతిభను వెలార్చుచు రస భావ పోషకములై హృదయమును రంజింపఁ జేయును. కవియొక్క కవితాశక్తి రసోత్పత్తికి దోహదకారి కావలయునేకాని కేవలము పాండిత్యమునే వెల్లడించునదిగ నుండకూడదు.[4] తిక్కన సామాన్యముగా తన కవితాశక్తిని మఱుగుపఱుచు ఔచిత్యమునందు దృష్టిని నిలిపి రసపోషణయందే శ్రద్ధ వహించును. ఇది తిక్కన పద్ధతి. ప్రకృతివర్ణనలను కేవలము కథ కవసరము లేనట్లు తిక్కన వర్ణింపలేదు. ఆ యా సందర్భానుగుణముగా తన కవితాశక్తియు వెల్లడియగునట్లు చక్కగ వర్ణించినాఁడు. ఇందు కొన్ని మూలమునందే యుండగా మరి కొన్నింటిని తిక్కన (అమూలకములు) కల్పించి వర్ణించినాఁడు. విరాటోద్యోగము లందున్న వర్ణనలు సూర్యోదయము, సూర్యాస్తమయము, చంద్రోదయము, విరహము, ఉద్యానవన విహారము, యుద్ధము, వివాహము, దూత్యము, నాయకాభ్యుదయము కలవు. ఇవి గాక అప్పకవి పేర్కొనిన 'కన్యాంగ సౌందర్య వర్ణనము'ను కలదు.[5] పైవానిలో యుద్ధము, దూత్యము, నాయకాభ్యుదయము మూలమునందును కలవు. వానినే తిక్కన కావ్యోచితముగ వర్ణించెను. వివాహము, సూర్యోదయాస్తమయాదులు సూచన మాత్రముగ నున్నవి. వీనిని తిక్కన రసభరితములుగ వర్ణించినాఁడు. ఉద్యానవన విహారము, కన్యాంగ సౌందర్య వర్ణన, విరహము, ప్రాతఃకాల వర్ణనములు మాత్రము కేవలము తిక్కన కల్పితములు. ఇవియే "తిక్కన భారతము ఇతిహాసము కాదు, మహాకావ్యము" అను వాదమునకు బలమును చేకూర్చిన లక్షణములు. ఈ కావ్యలక్షణములు, కొన్ని నాటకలక్షణములు కలిసి తిక్కన విరాటోద్యోగములు ప్రబంధరచనకు మార్గదర్శకము లయినవి.

## 3. ప్రకృతి వర్ణనలు

### ప్రభాతకాల వర్ణనలు

విరాటపర్వ ద్వితీయాశ్వాసమునందు తిక్కన గావించిన ప్రభాత కాల వర్ణనము అమోఘమైనది. ఇందు ఐదు పద్యములు, ఒక దీర్ఘ వచనము (236ప-240 వ) కలవు. ప్రభాతవర్ణనము ప్రబంధోచిత వర్ణనముగ కనుపడుచుండు నని తిక్కన నాతిదీర్ఘమైన దీనిని ప్రవేశపెట్టి యుండును. తిక్కన చేసిన ఈ వర్ణనయొక్క సార్థక్యమునుగూర్చి, ఔచిత్యమునుగూర్చి విచారించిన విమర్శకులున్నారు. సార్థక్యమునుగూర్చి విచారించిన వారిలో చాలమంది భావ రచనా రామణీయకత్వములను ప్రశంసించినారు. ఔచిత్యమునుగూర్చి పరామర్శించిన వారు ఇందు మొదటిపద్యము మాత్రము కథానుకూల వర్ణనమనియు మిగిలిన పద్యములు కథాప్రవృత్తి కంత అనుకూలములు కావనియు తలంచి యుండిరి.[6] కాని ఈ వర్ణనముయొక్క సార్థక్యౌచిత్యములను గూర్చి మఱియు నీ క్రింది విధముగా భావించుటకు వీలున్నది.

1. ప్రభాత సూర్యోదయ సూర్యాస్తమయాది వర్ణనలు ప్రధానముగా కాలసూచకములు. కాలమును సూచించుట మాత్రమే వాని ప్రయోజనమైనచో కవి వానిని సూచించి వదిలిపెట్టుట ఔచిత్యము. కాని కథార్థ ప్రవృత్తికి అనుగుణమైన ప్రకృతిస్వభావమును వర్ణింపఁదలచినచో కవి దానిని ప్రతిభావంతముగా తీర్చిదిద్దవలెను. తిక్కన ఈ ప్రభాత కాల వర్ణనము కథలో నొక ఘట్టము ముగిసి మఱియొక ఘట్టము మొదలగు సంధి కాలమున నిబంధించెను. ఇది ఆశ్వాస మధ్యమున నుండుటచే కథాకథనమునకు నడుమ వర్ణనము పఠితకు మనోవిశ్రాంతి కలిగించుటకు తోడుపడఁగలదు. ఇది భౌతికమైన ప్రాథమిక ప్రయోజనము. ఇందును సంవిధాన శిల్పము వ్యక్తమగుచున్నది.

2. తిక్కన ఈ ఘట్టమున కథను చెప్పుటయే గాక పాత్రముల మనోభావ పరిణామ దశావిశేషములను అత్యంత సూక్ష్మముగా వివేచించుచు, వర్ణించుచు రసోచిత బంధ నైపుణ్యమును ప్రకటించుచు వచ్చినాఁడు. మానవ

ప్రకృతి నింత మనోజ్ఞముగా చిత్రించు తిక్కన ప్రకృతివర్ణనమునకు కడంగి నచో తద్విధానమునకు విరుద్ధముగా సంగ్రహ రచనమునకు కడంగుట విడ్డూరమనిపించును. రచనలో తూకము చెడును. అట్లని తిక్కన ఇచ్చవచ్చినట్లు వర్ణనను పెంచి రచింపలేదు. పరిమితమైన ఆ వర్ణనమునందు ప్రభాతకాల ప్రకృతి దశావిశేషమును సూక్ష్మేక్షికతో వీక్షించి వర్ణించినాఁడు. తిక్కన రచనా స్వభావమును దృష్టియందుంచుకొని ఈ వర్ణనమును పరిశీలించినచో అట్టి వర్ణన మచ్చట నుండుట యుచితమనిపించక మానదు.

3. తిక్కన వర్ణించిన ప్రభాతకాల ప్రకృతి ఎట్టిది ? అను ప్రశ్నము ఇచ్చట కలుగుచున్నది. ఈ వర్ణనమునకు పూర్వము ద్రుపదనందన పరిభవ దుఃఖము ననుభవించుచు ప్రతీకార మార్గమును నిశ్చయించుకొని కీచకుని మాయోపాయముచే వంచింప తలపెట్టియున్నది. తెల్లవారిన తరువాత ఆమె తీరునందు కీచకునిపై ననురక్తి యున్నట్లు నటించు విధము కాననగును. మనో నిష్ఠము కాకపోయినను కృతకమైన రతిభావము సైరంధ్రియందు భావి కథార్థమున ప్రవర్తిల్ల నున్నది. అది కీచకుని రతిభావోద్దీపకమై రాణింప నున్నది. ఇంతయున్నను ఆ ఘట్టమున రసాభాసమే పఠితకు స్ఫురించునది. ఇది ద్రౌపది కథ. ప్రభాత వర్ణనము ముగియగనే కీచకునితో రంగము ప్రారంభము కానున్నది. అతని మనః ప్రవృత్తి యంతయు సైరంధ్రీగత రతి భావ పరిమళ బంధురమై రాత్రినెట్లో వేగించినది. ఇట్టి రెండు ఘట్టములమధ్య వంతెనవలె నిలిచినది ప్రభాతకాలవర్ణన. వంతెనవలె చిత్రించుటయే తిక్కన ప్రతిభ.

ఈ వర్ణనము నందలి మొదటి పద్యము విలక్షణమైనది. ద్రుపదనందన పరిభవ దుఃఖమునకు మనమున దురపిల్లుచున్న సరోవరము నిగుడ్చుచున్న వేడినిట్టూర్పులో యన అరవిచ్చిన నెత్తమ్మివిరుల నుండి క్రొత్తతావి వెడలిన దఁట ! తిక్కన ఇందు హేతూత్ప్రేక్షను నిబంధించినాఁడు. హేతువు కాని దానిని హేతువుగా భావించుట హేతూత్ప్రేక్ష. ఇది కవి ప్రౌఢోక్తి మూల ముగా సిద్ధించినది. నాయికా మనఃప్రవృత్తిని ప్రతిస్పందించు ప్రకృతి యొక్క స్వభావమును ఇందులో తిక్కన ప్రదర్శించినాఁడు. అది కవి యారో పించినది మాత్రమే. ప్రకృతిసిద్ధమైనది కాదు. ప్రకృతికిని మానవప్రకృతి

కిని కవి యెంత సాన్నిహిత్యమును, సమన్వయమును భావించి ప్రదర్శింపఁ గలఁడో అతని కావ్యకళ అంత ఉదాత్తముగా భాసించును. ద్రౌపది పాత్ర మనశ్చిత్రణముతో ముగియు ఘట్టము నుండి ప్రారంభించు ఈ ప్రకృతివర్ణ నము తత్పాత్ర మనోగత భావములకు ప్రతిస్పందిగ నున్నట్లు రచించుట యిందలి శిల్పము. దీనినే కొందఱు విమర్శకులు కథ కొఱకు చేయఁబడిన వర్ణనమిదియని ప్రస్తుతించినారు.

పై పద్యమున ప్రకృతిపై కవి ఆరోపించిన ప్రకృతి భాసించినది. ఆ తరువాత తిక్కన ప్రకృతి యొక్క నిజ ప్రకృతిని మూడు పద్యములతోను, ఒక దీర్ఘ వచనమునందును వివరించి, వర్ణించినాఁడు. వీనియందు తత్కాలో చితముగా తిర్యగ్జడ మానవ ప్రకృతుల యందు భాసించెడి రతిభావోద్దీపక వర్ణనము కావించినాఁడు. వర్ణనము వర్ణనము కొఱకే చేయుట కావ్యమున సార్థకము కాదనియు, అట్లగుటచే ఈ వర్ణనము నిరర్థకమనియు కొందఱి మతము[7]. తిక్కన ఈ వర్ణనమును వర్ణనము కొఱకే చేసినవాఁడు కాఁడు. తన భావనాశక్తినిగాని, ఊహా ప్రాభవములనుగాని, పాండిత్యప్రకర్షనుగాని ప్రకటించుటకు చేసిన వర్ణన కాదిది.

సర్వసాధారణముగా తత్కాల జీవ ప్రకృతుల యందు భాసించెడి రతిభావ మంతస్సూత్రముగా కావించిన వర్ణన మిది. బహుళముగా తిర్యగ్జడ గతమగుటచే ఈ రతిభావ స్ఫోరకమగు వర్ణనము రసాభాసమగుచున్నది.

ఇచట గమనింపవలసిన విషయములు రెండు గలవు. ప్రకృతి వర్ణ నము నందు ప్రకృతిపై మానవప్రకృతి ప్రభావము పడినట్లుగను, మానవ స్వభావముపై ప్రకృతిప్రభావము పడినట్లుగను చిత్రించెడి విధములు రెండు గలవు. ప్రకృతిపై తన ప్రభావము వైచెడి మానవప్రకృతి శక్తివంతమైనది. అన్యమశక్తమైనది. మొదటి పద్యమున ద్రౌపది ప్రభావము ప్రకృతిపైఁ బడి నట్లు చిత్రింపఁబడినది. అందు పరిభవ దుఃఖభరము ప్రతీయమానమగుచున్నది. ఆ పద్యము పూర్వరంగము నుండి ఉత్తరరంగమునకు సాగు కథా ప్రవృ త్తికిని ద్రౌపది యందు భాసించు స్థాయికిని సూచకమగుచున్నది మిగిలిన భాగమంతయు ప్రకృతి ప్రభావమునకు స్పందించు కీచకుని ప్రకృతికి సంబం

ధించినది. భావి కథలో ఇంద్రియవశుఁడైన కీచకుని మోహవృత్తాంతము అతని విషాదాంతము విపులముగా చిత్రింపఁబడ నున్నవి. అతఁడు వస్తుతః ప్రకృతికి దాసుఁడు. విస్తృతమైన తత్ప్రకృతిప్రభావము పురుషునిపైఁబడ నున్న కథాప్రవృత్తిని ప్రవృత్తిప్రధానమైన ప్రకృతివర్ణనము వలన సూచించుట తిక్కన కళాశిల్పము. దీనియందున్న వ్యంగ్యమర్యాద తెలిసి నచో దాని లోతులు గమనించుట సులభమగును. ప్రకృతిని పరిమళ భరిత ముగా వర్ణించుట మఱియొక విశేషము. పరిమళమును వ్యంగ్య భావమునకు ప్రతీకగా తిక్కన 'నిర్వచనోత్తర రామాయణము'నందు పేర్కొనియుండుట ప్రసిద్ధము 8.

ద్రౌపది కీచకునిపై విజయము సాధింప నున్నదనియు, కీచకుఁడు ఆమె కృతక నాటకమునకు వశుఁడు కానున్నాఁడనియు తెలిపెడి భావ ధ్వనియు ఈ ప్రకృతి వర్ణన వలన ప్రతీయమానమగుచున్నది. చివఱి సీసము నందు భానుబింబవర్ణనము ఉత్ప్రేక్షాలంకారమునందు నిబంధింపఁబడినది. ఉత్ప్రే క్షతో మొదలై ఉత్ప్రేక్షతో ముగించుట ఒక శిల్పము. ఇది రెండవ రంగము నకు నాందిగా లేక మంగళాశాసనముగా నిబంధింపఁబడిన పద్యమువలె భాసించుచున్నది.

మొదటి పద్యము పూర్వరంగమునకు భరతవాక్యమైనచో చివఱి పద్యము ఉత్తరరంగమునకు నాందీవాక్యమే. నడిమి వర్ణనము ప్రకృతి స్వభావ వ్యంజకమై భావి కథార్థ సూచకమై ప్రబంధౌచిత్యమును సంత రించుకొనినది. చేసిన ప్రతి వర్ణనలోను సార్థక్యము, ఔచిత్యము సాధించుట తిక్కన కళాశిల్పములోని ప్రథమ సూత్రము.

తిక్కన సోమయాజి ఉద్యోగపర్వ ద్వితీయాశ్వాసము నందు మఱియొక ప్రాతఃకాల వర్ణనము నమూలకముగా వర్ణించెను. స్వరూప నిర్మాణము లందీ వర్ణనములు రెండును సామ్యమును భజించుచున్నను స్వభావమున భేదించుచున్నవి. విరాటపర్వమునందలి ప్రాతఃకాల వర్ణనము ప్రకృతి పురుషుల మనఃప్రవృత్తిని పరస్పర ప్రభావమును వ్యంజింపఁజేయునదిగా నుండ, ఉద్యోగపర్వము నందలి ప్రాతఃకాల వర్ణనము ప్రకృతిసహజముగా

నున్నది. ఇందు కథాగత పాత్రముల చిత్తవృత్తులయొక్క బింబప్రతిబింబభావము గాని ప్రభావ సంబంధముగాని లేవు. కాని ఎత్తుగడ, ముగింపులలో పూర్వ వర్ణనా ఘట్టనిర్మాణ శిల్పసామ్యము కానవచ్చుచున్నది.

నిర్మాణసామ్యము - ప్రభాత కాలమున చంద్రుఁడు వైవర్ణ్యమును పొందెనని చెప్పఁబడిన మొదటి పద్యమిట్లు కలదు.

"తే. తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు
లన్న దమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లుఁ
గంది యొంతయుఁ జెలువేదెఁ జందురుండు." (5.2.107)

ధార్తరాష్ట్రు లన్నదమ్ములతో విగ్రహము గొనుటకు ఉమ్మలించి తన కులమువారిలో జ్ఞాతివైరము సంభవిల్లెనని కుంది చంద్రుఁడు వెలవెలపోయె నని తిక్కన ఉత్ప్రేక్షించినాఁడు. ఇందలి హేతువు భారత కథార్థమునకు సంబంధించినదే గాని తత్కాల ధృతరాష్ట్రు చిత్తవృత్తికి సంబంధించినది కాదు. పాత్ర చిత్తవృత్తికి సహానుభూతి పొందినట్లు ప్రకృతిని వర్ణించి పూర్వ ఘట్టమున మొదటి పద్యమున ఒక వర్ణనారంభ శిల్ప మర్యాదకు శ్రీకారము చుట్టిన తిక్కనయే అదే వస్తువును గైకొని సాధారణ కథార్థము లనే హేతువులుగా కొని వర్ణ్య వస్తువునకు నిబంధించు మఱియొక శిల్పము నిందు ప్రపంచించెను. ఆరంభమునందే ఉభయకావ్య వర్ణనా శిల్ప ప్రౌఢిమను తిక్కన ప్రదర్శించినాఁడు. స్వభావమున పద్యభావములు భిన్నములయ్యును ఎత్తుగడలో కథకును, వర్ణనకును అవినాభావ సంబంధము నిబంధించుట యనెడి నిర్మాణము మాత్రను రెండింట సమముగా భాసించినది.

ప్రాతఃకాలము నుండి సూర్యోదయము వఱకు కాంచనగు కాల పరిణామ దశావిశేషములను తత్కాల తిర్యగ్జడ మానవ చిత్తవృత్తులను వ్యంజింపఁజేయునట్లు గద్యపద్యాత్మకమైన రచన సేయుట విరాటపర్వము నందలి ప్రాతఃకాల వర్ణనమునందు కాంచనగు మఱియొక లక్షణము. తిక్కన ఈ ఘట్టమున తత్కాల పాత్ర చిత్తవృత్తులను వ్యంజింపఁజేయుటకు

వర్ణనము తలపెట్టమిచే తత్కాల ప్రకృతి చిత్రణమునకు మాత్రమే వర్ణనను పరిమితము చేసెను.

ఇందు తారకలు విరియుట, జక్కవదోయి విలసిల్లుట, అంభోజములు పొల్పుచెందుట, శుకకోకిల భృంగ తతులు చెలంగుట వర్ణింపఁబడినవి. చంద్రాస్తమయము మొదలు సూర్యోదయము వఱకు వ్యాపించియున్న కాలము నందు పరిణామములు ప్రవర్తిల్లిన విధములు ఈ నాల్గు పద్యములందు రమణీయముగా వ్యక్తీకరింపఁబడినవి. తారకాస్తమయము, దిశలు తెలివొందుట, అరుణోదయస్ఫూర్తి, పక్షుల కలకలారవము లనునవి క్రమముగా కాలదశా సూచకములుగా ఇందు తిక్కన నిరూపించినాఁడు. వీని నన్నింటిని సమన్వయ పఱచుచు (112 వ) సీస పద్యమును నిపుణముగా నను సంధించినాఁడు. ఇట్లయిదు పద్యములలో వర్ణనచేయుట అవసరమా అనునది ఒక ప్రశ్నము. అవసరము లేదని భాసించు విమర్శకులు కొందఱున్నారు. ఈ వర్ణనము కథార్థములకు సంబంధించినది కాదు అని వారి వాదము.[9] ఈ వాదమున ఒక విడ్డూరము కలదు. విమర్శకులేమి తలచినను తత్కథా ఘట్టమున ప్రభాతమైనది, సూర్యోదయమైనది. ఒక రంగము ముగిసినది. మఱియొక రంగము ప్రారంభము కానున్నది. మధ్య ఈ ప్రకృతివర్ణనమునకు తావున్నది, ప్రభాతాది వర్ణముల నెట్లు చేయవలెనో లక్షణము కూడ నున్నది దానికి మించి లోకస్వభావమున్నది. వీని నన్నింటిని దర్శించి రచించు కవిప్రతిభయు నున్నది. అట్లగుటచే నిచ్చట తిక్కన ఈ వర్ణనము చేయుట అనుచితము కాదు. వర్ణనము చేయుచు కాలదశావస్థలను సూచించు చుండుటచే తద్దశా పరిణామ వర్ణనము అనవసరమును గాదు. వర్ణన దీర్ఘమై వర్ణ్య కథార్థములను మరపించినచో కావ్యదోషమగును. కాని, సంగ్రహమై సార్థకమై ఒప్పెడి ప్రకృతివర్ణనము త్యాజ్యము కాదు.

ప్రకృతి వర్ణనము చేయునెడ కవి దానిని సహజముగా వర్ణింప వచ్చును లేక అన్య ప్రకృతిని దానియందారోపింప వచ్చును. మొదటిది సహజ రమణీయముగా నుండు పద్ధతి. రెండవది చమత్కారజనకమైన పద్ధతి. రసదృష్టిగల కవి సహజ ప్రకృతిని స్వభావ సుందరముగ వర్ణించి దానియందు వ్యంగ్యముగా కథాప్రవృత్తిని సూచింప

వచ్చును. అది ఉత్తమమైన పద్ధతి. విరాటపర్వమున తిక్కన ఆ పద్ధతి నాశ్రయించి వర్ణించెను. ఉద్యోగపర్వమున ప్రకృతి సహజ లక్షణములనే రమణీయముగా వర్ణించెను. సంజయుఁడు నిర్వహించిన రాయబారము, తత్ఫలితము పఠిత కప్పటికే తెలియును. ధృతరాష్ట్రి సభలో సంజయుఁడు పూర్వప్రవర్తిత కథార్థనివేదనము చేయనున్నాఁడు. దానివలన కథార్థములు మఱికొంత తేటపడనున్నవి. పాండవ ధార్తరాష్ట్ర స్వభావము లిదివఱకే తెల్లనులైనవి. కురుపాండవుల తత్కాల సహజ స్వభావముల నమీక్షించు సన్నివేశముల నడుమ వచ్చిన ప్రాతఃకాల వర్ణనమిది. అందువలన ఈ ప్రకృతి వర్ణనము సహజసుందరముగా నుండుటయే ఉచితమని తిక్కన నిష్కర్షగా భావించుటకు వీలున్నది.

ఇచట మఱియొక ప్రశ్న ముదయింప వచ్చును. చంద్రుఁడు వెలవెలఁబోయెనని చేసెడి వర్ణనమునకు కథార్థముతో ముడిపెట్టినాఁడు గదా తిక్కన. మిగిలిన వర్ణన మంతయు నట్లే చేసినచో నొప్పారియుండును గదా యని అడుగ వచ్చును. వర్ణనమునందు కృత్రిమముగా నారోపింపఁబడిన హేతువు రుచిభేదము కొఱకు గ్రహించెడి తీపి పిండివంట వంటిది. ఉత్ప్రేక్షాదులతో కూడిన వర్ణన మటువంటిది. అది కథార్థముతో కూడుకొని యున్నను ఆ రెండింటికి కవి సాధించెడి సమన్వయము నందలి చమత్కారమే అందు ప్రధానము. తిక్కన ఇట్టి చమత్కారమును విరివిగా వాడఁడు. అదనెఱిఁగి, పదనెఱిఁగి వలయుచోట ఒండు రెండు పద్యములకంటె మించకుండ ప్రయోగించును. అందువలననే పై ప్రభాతవర్ణన ద్వయమునందు ప్రథమ పద్యద్వయము నా పద్ధతిలో నిర్మించెను. అతని పద్ధతిలో నెంత ఔచిత్యమున్నదో పరిమాణములో కూడ నంత ఔచిత్యము గలదు సహజ సుందరములైన ప్రకృతివర్ణనలను పైతము ప్రకృతిసహజత్వమును ప్రతిభారామణీయకత్వమును జోడించి సంగ్రహముగా ప్రపంచించును. చక్రవాక పద్మ వర్ణనములందు విభావ స్వభావములను వివరించు పద్ధతిని, శుకకోకిల భృంగతతులను వర్ణించునెడ సహజసుందరమైన ఉత్ప్రేక్షను తిక్కన నిబంధించినాఁడు. కవితా దృక్పథముతో చూచినను, కాలావస్థ నిరూపణ దృష్టితో చూచినను. పరిమాణ దృష్టితో చూచినను ఈ వర్ణనము ఔచిత్య మర్యాదను వీడి ఆవంత అవలకు పోయినది లేదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

సూర్యోదయ వర్ణనము ఉభయ ప్రభాతకాల వర్ణనములందును సామాన్యము. (సూర్యోదయముతో కథ నారంభించెడి ఘట్టములా తరువాత నుండుటచే అది తప్పని సరియైనది.) చివటి పద్యము సీసమగుటయు సమానము. చివటి పాదములుకూడ బింబ ప్రతిబింబ రూపములుగా నుండుట గమనార్హము.

"భాను బింబంబు పూర్వాద్రిపై వెలింగె" (4.2.241)

"పూర్వశిఖరిమీఁద పొడిచె నినుఁడు" (5.2 114)

ఉద్యోగపర్వమునందలి వర్ణనము విరాటపర్వము నందలి దానికంటె విస్తృతము, విశేషము. ఇందు సూర్యోదయ వర్ణనమునకు రెండు పద్యములు వెచ్చింపఁబడినవి. ఆకృతితోపాటు కాంతివైభవముకూడ వర్ణింపఁబడినది. భావి కథార్థమునందు కౌరవసభలో పాండవ నీతి వర్తనాదులపై విదురుని వ్యాఖ్యానములు బహుకథార్థములకు వెలుగును ప్రసరింపనున్నవి. వివేచనాత్మకమైన భావి కథా ప్రవృత్తికి నాందిగా నిబంధించెడి సూర్యోదయ వర్ణనము భానుబింబ రోచిర్వర్ణన మగుట విశేషము, ఔచిత్యము.

తిక్కన నిర్మాణమునందు చూపిన సామ్యము అతని కావ్యకళానిష్ఠను వ్యక్తము చేయుచున్నది. నిర్వహణము నందలి వైవిధ్యము అతని సందర్భౌచిత్యమును చాటుచున్నది.

## సూర్యాస్తమయ వర్ణనము

విరాటపర్వములో ద్వితీయాశ్వాసమునందే సూర్యాస్తమయమును అమూలకముగా తిక్కన వర్ణించినాఁడు. కీచకుని నర్తనశాలాగమనమునకు నాందిగా తిక్కన పై వర్ణన చేసినాఁడు. ఇచట ఈ వర్ణన అత్యంతావశ్యకము. ద్రౌపది ప్రభాతకాలమున కెదురుచూచినది కనుక దానిని విపులముగా వర్ణించెను తిక్కన. ఇచట కీచకుఁడు, భీమసేనుఁడు, ద్రౌపది మువ్వురును ఆ రాత్రి యగుటకు మిక్కిలి ఎదురు చూచిరి. కనుక సాయంసమయమును వర్ణింపఁబడినది. ప్రభాతవేళలో ప్రకృతి క్రమపరిణామము చెందినట్లు సంధ్యాసమయమున జరుగు పరిణామములను వర్ణించెనే గాని సూర్యోదయ

కాలమున పశుపక్షి మానుష చర్యలను విపులీకరించినట్లు అస్తమయమునందు జరుగు చర్యలను వర్ణింపలేదు. ఇచట సంక్షిప్తత మిక్కిలి అవసరము. పలన దివసాంతమునకై పాత్రములు ఉత్కంఠతతో ఎదురు చూచుచున్నట్లు స్ఫురింపజేయుట ఒక అవసరము కాగా ఆ రాత్రి జరుగఁబోవు నన్ని వేళ వర్ణనముకై పఠితలు ఆసక్తితో చదువఁబూనుట ఇంకను ప్రముఖమైన ప్రయోజనము.

ఆ పగలు కీచకుఁడు విరహాతాపముతో పరితపించుచు ఆ రాత్రియగుటకు ఎంతగానో ఎదురు చూచినట్లు తిక్కన వర్ణించియుండుట ఈ సూర్యాస్తమయ వర్ణనకు ప్రాతిపదిక యగుచున్నది. ఇట్టిది రచనా శిల్పము: ఒక వర్ణన చేయుటకు ముందు ఒక ప్రాతిపదిక నేర్పరచుకొని కథను, పాత్రములను, తదావశ్యకతను గురుతుగా నుంచుకొని సంక్షిప్తముగాఁజేయుట ముచ్చట గొలుపును. కథా సందర్భమును, పాత్రములను మఱచి వర్ణన కొఱకే వర్ణించిన నది నేల విడిచి చేసిన సాము అనిపించుకొని సహృదయుల మనమున నిలువక పతన మగును. తిక్కన సాయంసమయ వర్ణనకై కీచకునితో పలికించిన ప్రాతిపదిక యనఁదగిన పలుకులు పరికింపఁదగినవి.

"క. మాయరవి యేల క్రుంకఁడొ
కో యను నిట్టేల తడసెనో యనుఁ గ్రుంకం
బోయెడుఁ జూ యిప్పుడ యను
దాయవఱిచెనను మనోజతాపము పేర్మిన్." (4 2.312)

కీచకుఁ డిట్లు ఆశించిన సూర్యాస్తమయమును వర్ణింపక విడుచు టెట్లు? కీచకుని ఆత్రము ఎందులకా అను సందేహమునకు సమాధానమా యన్నట్లు 'మనోజతాపము పేర్మిన్' అని చేర్చుట ముక్తాయింపుగా నొప్పినది.

ప్రభాత కాలమును వర్ణించిన దివసముననే అస్తమయమును గూడ తిక్కన వర్ణించినాఁడు. ఆ దినమంతయు కీచకుఁడు సాయంసమయ మగుటకు వేచియున్నాఁడు. క్రుంకలేదే యని రవిని ఉపాలంభించినాఁడు. లోకములో పగలే గాని రాత్రి లేనట్లున్నదని భావించినాఁడు. తనకుగా నాడు దివము

సాగినిలిచినదని దురపిల్లినాఁడు. అంతగా వేచిచూచిన రాత్రి యగుటను తిక్కన వర్ణించుట పరమోచితముగా నున్నది.

"ఆ దివమకాని యింక భువనంబునం దిట
వట్టి రాత్రి లేనియట్టుగాఁగఁ
జేసె నొక్కొ విధి విశేషించి నాకకా
నేఁడ దివము సాఁగి నిలిచె నొక్కొ." (4.2.313)

కీచకుఁడు కోరినవిధముగానే సూర్యాస్తమయము తోడ్తో నిశాగమనము జరిగినవి. తిక్కన అదే క్రమములో అంతే క్లుప్తముగా వర్ణించుట సన్నివేశోచిత వర్ణనౌచిత్యమును బ్రకటించుచున్నది.

"క ఇనుఁడు దనకడకు నేతెం
చిన రాగముఁబొందు టిది యుచితమనఁగాఁగెం
పున మెఱసి పశ్చిమాశాం
గన జనసంభావనముల గౌరవ మందెన్." (4 2.318.)

ఇచట కీచకుని మన్మథతాపము వర్ణింపఁబడిన పిమ్మట సూర్యాస్తమయము కూడ శృంగారరసోన్ముఖముగా వర్ణింపఁబడినది.

ప్రభాతకాలము నందు దురపిల్లుచున్న సరసి ద్రౌపది అంతరంగమును ప్రతిఫలింపఁగా ఇచట పశ్చిమాశాంగనను జేరు ఇనుఁడు కీచకుని అంతఃకరణమును దోపించుచున్నాఁడు. ప్రకృతి పాత్రల మనోభావముల కనుగుణముగా కాన్పించినట్లు తిక్కన వర్ణించెను. ఇట్లుండుట వర్ణనౌచిత్యము. లోకమున సహజముగా ఆయా వ్యక్తుల ఆంతరంగిక ఆలోచనల కనుగుణముగా ప్రకృతి కనిపించును. మున్ముందు వర్ణించినట్లు రాత్రి జారచోరులకు హృదయంగమమైనది. ఇచట కీచకుఁడు గూడ జారుఁడే, కనుకనే ఆ ఉత్కంఠత. కీచకుని భావవేగమున కనువుగా తిక్కన సూర్యాస్తమయ, చంద్రోదయ, చంద్రాస్తమయములను చకచక వర్ణించి వైచెను. అంతేకాదు, చీకటిని పైతము వర్ణించి, అంత గాఢాంధకారము వ్యాపించినదిగనుకనే కీచకాగమనముగాని,

భీమసేనుని వీరకృత్యము గాని సమనించఁబడ లేదను స్ఫురణము కలిగించెను. తిక్కన వర్ణనచేయునెడనైనను సన్నివేశమును, పాత్రములను నిర్లక్ష్యము చేయఁడనుట కిది యొకమచ్చుతునక మాత్రమే. ఏకాగ్రతతో మలచిన శిల్పాంగములను బోలినవి తిక్కన ప్రకృతివర్ణనలు. ఇందు కవితావేశమునకంటె ఏకాగ్రత అధికముగాఁ గోచును. ఇట్టి వర్ణనావైశిష్ట్యము వలననే తిక్కన రచనాశిల్పము అను మాట సార్థకమైనది. తిక్కన దృష్టి యిచట కథమీదనే నిలిచియున్నది. వర్ణన సంక్షిప్తమై గతౌచిత్యమునకు తగువుగా నడచినది. పఠితల ఉత్కంఠ అడ్డగింపబడక శిఖరారోహణముఁ జేసినది. ఆ వర్ణనావిధ మెంత వేగముగా సాగినదో చూచిన తిక్కన సందర్భశుద్ధి తెలియును.

"ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మహోత్సవుండు వి
ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁజొచ్చె నేలకెం
పెక్కుచు వచ్చె దీవియల యేడ్తెఱ సొయగమందె సందడుల్
దక్కెఁ బురంబువీథుల మదం బొలసెన్ విటచిత్తవృత్తులన్."
(4 2 329)

చుక్కలు ఒక్కటొక్కటిగా వచ్చుట, చంద్రుఁడు కానవచ్చుట, సూర్యాస్తమయకాంతులు తరగిపోవుట, వీథులందు జనసంచారము, సందడి తగ్గుట క్రమక్రమముగా వర్ణింపఁబడినవి ఒక్కపద్యమునందు. 'మదంబొలసెవిటచిత్తవృత్తులన్' అను ముగింపు తిక్కన కావ్యవ్యూహమును, శిల్పనైపుణ్యమును తెలుపుచున్నది. పై పరిణామములు కథకు పరోక్షసంబంధమును కలిగియున్నవి. కాగా విటచిత్తవృత్తులందు మదంబొలయుట కీచకప్రవృత్తిని సూచించునట్టిది. ఈసూచన నింకను పటిష్ఠము చేయుటకే చంద్రాస్తమయము జారచోర జనంబుల మనంబులలరగా నైనదని చేర్చెను. ఇది పాత్రముల స్వభావానుగుణముగాఁ జేసిన వర్ణన. ఇక చేయవలసినది ప్రకరణౌచిత్యమునకు దోడ్పడు వర్ణన. ఆ గాఢతమమును వర్ణించిన దిందులకే:

"క. పెనుమిట్టిది పల్లంబిది
యనకుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ

గను విచ్చుటయును మోడ్చుట
యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్." (4.2.321)

ఇట్టిది గాకున్న కీచకుఁడు భీముని ద్రౌపదిగా భావించి సల్లాపము లాడునా !

ఈ సందర్భమున గమనింపవలసినది - తిక్కన సంయమనశక్తి. కవికి ఆవేశము సహజగుణము. కాని తిక్కన సవనవోన్మేషశాలినియైన ప్రతిభ కేవల ఆవేశమునకు పరిధి నేర్పరచి సమగ్ర కావ్యశిల్పమునందు వర్ణనయొక్క పరిమితి ఇంత యని నిరూపించునట్టిది. ఈ నాలుగు పద్యములలో నాలుగు ప్రయోజనములను తిక్కన ఉద్దేశించి యుండుటను గమనించితిమి. ఈ యవగాహన లేని కావ్యమునందు వర్ణనలు ఎత్తిచూపినట్లగపడి కావ్యాంగములకు అతకని భూషణములై హృదయంగమ రచన కల్గినవయ్యు రసస్ఫూర్తికి తోడ్పడక వ్యర్థము లగును.

## చంద్రోదయాది వర్ణనము

విరాటపర్వమున తృతీయాశ్వాసమునందు సూర్యాస్తమయ, చంద్రోదయములు రేఖామాత్రముగా వర్ణింపఁబడినవి. అది దక్షిణ గోగ్రహాణ ఘట్టము. ఈ సందర్భమున మూలమునందును చీకటి ముసురుట, సైన్యము ముహూర్తమాత్రము యుద్ధమాపి నిలుచుట, అపుడు చంద్రోదయ మగుట సూచింపఁబడినది.

" తమసాభిప్లుతే లోకే రజసాచైవ భారత ।
వ్యతిష్ఠన్వై ముహూర్తంతు వ్యూఢానీకాః ప్రహారిణః ॥
తతో ఽన్ధకారం ప్రణుదన్నుదతిష్ఠత చంద్రమాః ।
కుర్వాణో విమలాం రాత్రిం నందయన్ క్షత్రియాన్ యుధి॥"
(అధ్యా. 32. శ్లో. 1, 2.)

తిక్కన ఈ సూచన కనుగుణముగానే క్లుప్తముగా వర్ణించెను. ఇది తిక్కన కావ్యదృష్టి. ఇచట తిక్కన చేసిన వర్ణన క్లుప్తముగా, కథాగతికి పోషకముగా నున్నది. సంధ్యారుణ కాంతులతో భానుఁడు చిగురించిన

మావి ట్రోకోయను నట్లున్నాఁడనుట పరమ రామణీయకముగా నున్నది. ప్రకృతిని ప్రకృతిలోని మఱియొక సుందరరూపముతో బోల్చుట యిందలి ప్రత్యేకత. ప్రకృతి రామణీయకత్వము మఱింత స్పష్టపడుచున్నది ఈ యుపమానము వలన. ఇట్టి వర్ణన సహృదయ హృదయరంజక మగుట స్వాభావికమే.

"భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన మావి ట్రోకనన్"

"క. సమరంబున భటులు కడు
ద్భ్రమ మొందిరి తమము గవిసినంగాని సము
ద్యమ సంరంభ ముడుగ రిది
సమయంబని తొలఁగినట్లు సవిత్రుఁడు గ్రుంకెన్."

(4 3 194)

సవిత్రుఁడు గ్రుంకుట ప్రకృతిసహజమగు కార్యము. ఆకార్యము కథ కనుసంధించుట కవి చేసిన కార్యము. సవిత్రుఁడు గ్రుంకుటకు కవి యొక చక్కని వ్యాజము నిచటఁ జూపెను. కారణము కథలోనిది, కార్యము ప్రకృతిలో జరిగినది. ఇట్లు ప్రకృతికి కథకు కార్యకారణ సంబంధములు గల్పించి వర్ణించుటవలన కథ అవ్యవధానముగా సాగును. దివసావసానమునకు యుద్ధము ముగించుటకూడ యుద్ధధర్మమే. కాని భటులు కడు శ్రమ మొందిరని చీఁకటిని కల్పించుటకుగా సవిత్రుఁడు గ్రుంకెనని కవి యుత్ప్రేక్షించుట ఉదాత్తముగా నున్నది. ఇట్టి వర్ణన ఆస్వాదయోగ్యమైనది.

మూలమున చీఁకటి వ్యాపించుటచేత భటులు యుద్ధముడిగి నిలిచిరి అని చెప్పఁబడి యున్నది. దానినే తిక్కన తన యూహాశక్తిచేత నింత రమణీయముగా వర్ణించెను. అచట లేని భానుబింబము యొక్క వర్ణనను కల్పించెను. తమము వ్యాపించుటను గూడ సూర్యుని యుద్దేశపూర్వక చర్యగా వర్ణించెను. మూలము నందలి సూచననే కావ్యశోభకై పెంచి వర్ణించెను.

"క. ముఱిముఱి చీఁకటి యప్పుడు
నఱిముఱి భటులుడుగ కడరి యని సేయంగా
నలసి తమమెల్ల యెడఁ గ్రి
క్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను నంతన్" (4.3.196)

ముసురుచున్న చీఁకటుల నుద్దేశించి శకట రేఫమును పునరావృత్తము జేయుట చక్కఁగా నున్నది. 'తమసాభిప్లుతే లోకే' అను మూలమున కిది వర్ణనారూపమగు వ్యాఖ్యానము. ఇట్టిది వర్ణనకు కావ్యమున గల స్థానము. అచట సూర్యోదయాస్తమయాదులు సమయ నిర్దేశ మాత్రములే కాని కావ్యము నందవి ప్రకృతిశోభ నినుమడింపఁజేయు వర్ణనలు. ఈ హృదయావర్జకమగు వర్ణనలు పరోక్షముగా రసపోషకములు. అనఁగా హృదయమున రసోదయ మగుటకు వలసిన ఆర్ద్రిత నీ వర్ణనలు కలిగించును.

"క. తన మనుమలు పాండుతనయు
లని సేతకు వేడ్కసేయు టాత్మఁగని తమం
బున వారు మెఱయ రని వ
చ్చిన క్రియ శశి పూర్వశైల శిఖరం బెక్కెన్." (4.3.198)

'నందయన్ క్షత్రియాన్ యుధి' అని మూలమున నున్నది. అలసిన భటులందఱికిని చంద్రోదయము ఆనందమును గూర్చుటరిది. యుద్ధ విముఖత్వమే అట్టియెడ సహజము. ఇట్లు భావించిన తిక్కన దానిని కొంత మార్చి వర్ణించెను. 'పాండవులు యుద్ధోత్సాహముతో వచ్చియున్నారు. వారు చంద్రవంశజులు. ఈ కారణములనుబట్టి వారి వేడ్కను గని వారి పరాక్రమ ప్రకటనమునకు వెలుగు కావలెనను ఉద్దేశ్యముతో చంద్రుఁడుదయించెనని ఉత్ప్రేక్షించెను ఇచట కూడ కార్యము ప్రకృతిసహజమైనది. కారణము కథాపరముగా కవి యూహించినట్టిది. 'తమంబున తన మనుమలు మెఱయరని శశి పూర్వశైల శిఖరం బెక్కె'నట! ఎంత ప్రతిభాజనితమైన యూహ ఇది! చమత్కారమును కలిగించు ఈ వర్ణన కథాంతర్భూతమై యుండుటచేత మఱింత ఔచిత్యవంతము.

పాండవులు విజయము నొందెదరను భావికభావార్థమున కనుగుణముగా తిక్కన చంద్రోదయమును వర్ణించెను. వారి విజయమునకే శశి ఉదయించె నని ప్రకృతార్థమునకు ప్రకృతిని గూడ సాధనము చేసికొనెను. అందులకు పాండవులు చంద్రవంశజులను సిద్ధవిషయమును ఆలంబనము చేసికొనెను. ఇట్టిది ప్రతిభావంతుఁడైన కవికి ప్రకృతి ప్రసిద్ధవిషయములు ఉపకరణములు, వశములగు ననుట కుదాహరణప్రాయము. సూర్యాస్తమయ చంద్రోదయములు రెంటికిని తిక్కన హేతువులను జూపెను. ఆ హేతువులు మాత్రము కథలో సిద్ధముగా నున్నట్టివే కాని కల్పితములు కావు. ఇచట కవి చేసినదంతయు ఆ సిద్ధవిషయములకు, తత్కాల ప్రకృతి పరిణామము లకు కార్యకారణ సంబంధము నూహించుటయే. ఆర్థికముగా కావ్యార్థముల నలంకరించుటలో సార్థకమైన పద్ధతి అది :

## 4. వస్తు వర్ణనలు

రమణీయములైన సూర్య చంద్రోదయాది ప్రకృతి దృశ్యములును, పాత్రములు వర్తించు రంగస్థలాది సన్నివేశములును వస్తువర్ణన లగును. అలంకార శాస్త్రమున ఈ వర్గమున కుద్దీపన విభావమని పేరు. కొందఱిట్లు వర్గీకరించినను ప్రకృతిదృశ్యములు ప్రకృతివర్ణనలను విభాగముతో రూఢి కెక్కినవి. ఇక వస్తువర్ణన లనఁగా అష్టాదశ వర్ణనలలోని పుర, నగ, నదీ, జలకేళి ఇత్యాదులు మాత్రమే యని యిచట పరిధి నేర్పరచుకొనవలెను. యుద్ధవర్ణనము అష్టాదశ వర్ణనలలో నొక్కటియైనను భారతమునందు యుద్ధవర్ణన పరిమాణమును, ప్రాముఖ్యమును బట్టి ప్రత్యేకముగ నెన్నఁ దగియున్నది.

కథాగమనమునందాయా సన్నివేశములలో వివిధములగు వస్తువులను వర్ణింపవచ్చును. కాని, రసదృష్టిగల కవి వస్తువర్ణనకు ఎక్కుడు ప్రాధాన్యమునివ్వఁడు. భావుకుఁడగు కవిగాని, పరిశీలనాశీలుఁడగు పండితుఁడు గాని వస్తువర్ణనను సమగ్రముగాఁ జేయఁగలఁడు. వస్తువర్ణనలో శ్రీకృష్ణ దేవరాయలు, భట్టుమూర్తి ఎన్నఁదగిన వారు. తిక్కనది రసదృష్టి యనుట

ద్రూఢికెక్కిన మాట. ఈ నిష్కర్షకు ఆయన చేసిన పరిమిత వస్తువర్ణనము ఒక ఉదాహరణ మాత్రమే.

## విరటుని కొలువున పాండవులు మెలంగు విధము

పాండవులు విరాటనగరమున తాము చేయఁబోవు కార్యముల తెఱఁగు ఇట్టిదని చెప్పికొందురు. ఈ సందర్భమున వారు చేయు పనుల వివరణమును తిక్కన కొంత మూలమునుండి గ్రహించియు, మఱికొంత అమూలముగా పెంచియు వర్ణించెను. ఈ వర్ణనలు పాత్రపోషణకు ప్రత్యక్షముగా తోడ్పడవు. కాని ఆ వివరములు చెప్పఁబడకున్న అసమగ్రత యేర్పడును. ఆ చేయబోవు కార్యముల తీరుతెన్నులు పాండవులకు సంపూర్ణముగా తెలియును అను నమ్మకమును కలిగించుటకే తిక్కన ఈ విపులీకరణము చేసెననిపించును.

*ధర్మరాజు :-*

"క. 'సన్న్యాసివేషమున రా
జన్యునిఁ గని యెపుడుఁగొలిచి సభ్యత్వమునన్
మాన్యుఁడనై పుణ్య కథా
విన్యాస మొనర్తు నతని వేడుకకుఁ దగన్", (4.1.69)

ద్విజశబ్దము సంస్కృతమునందుండగా తిక్కన సన్న్యాసి అని పేర్కొనుటలో నొక ఔచిత్యమున్నది. ద్విజుఁడు సామాన్యుఁడు కావచ్చును, రాగద్వేష రహితుఁడు కావచ్చును. కాని సన్న్యాసి అనుటవలన వీతరాగి, జ్ఞానమార్గానుయాయి అను భావము కలుగును. విరటుని మెప్పించుటెట్లు అనుదానికి తిక్కన సమాధానము సిద్ధము చేసెను, 'అతని వేడుకకుఁ దగన్ పుణ్యకథా విన్యాస మొనర్తు' నని పలికించెను. ఈ పుణ్యకథా విన్యాస ప్రసక్తి అమూలకము. ఇచట పేర్కొనఁబడుట అత్యంతావశ్యకము. కాని కథను ఆటంకపరచు రీతిలో పుణ్యకథా విన్యాసమును గాని, శ్రౌతస్మార్త నిమిత్తజ్యోతిర్విద్యలను గాని తిక్కన విపులీకరింపకపోవుట అనౌచిత్య పరిహారణమే యగుచున్నది. వస్తువర్ణన కిచట అవకాశమున్నను తిక్కన నాతిదీర్ఘముగా సూచించి వదలివేయుట గమనార్హము.

"క. శ్రౌతస్మార్త నిమిత్త
జ్యోతిర్విద్యలు వహించి యోగ్యసమయ సం
జ్ఞాత ప్రాగల్భ్యుఁడనై
చాతుర్యము మెఱసి మానసం బలరింతున్." (4.1.70)

ధర్మరాజు విరాటరాజునొద్ద కేవలము ద్యూతక్రీడలో పాల్గొను చుండెడివాఁడు అను అభిప్రాయము కలుగకుండ తిక్కన ఈ కల్పన చేసెను. ద్యూతక్రీడను తొలుత పేర్కొనక పుణ్యకథా వ్యాసమును శ్రౌతస్మార్త నిమిత్తజ్యోతిర్విద్యల నుటంకించుట ఔచిత్యశోభితము. యోగ్యసమయ సంజ్ఞాత ప్రాగల్భ్యుఁడై చాతుర్యము మెఱసి మానసం బలరించినవాఁడగుట వలననే ధర్మజుఁడు వాసికెక్కినాఁడు గాని కేవల ద్యూతక్రీడ వలన గాదని విదితము చేసెను తిక్కన. తొలుత తన విద్యాపాటవమును పేర్కొని పిమ్మట క్రీడాసక్తతను తెలుపుకొనుట సరియైన పద్ధతి. ఇచట తిక్కన దానిని పాటింపఁజేసెను.

'అతనితో నొక్కొక్కమఱి' అని ద్వితీయాంశముగా ద్యూత ప్రసక్తిని చెప్పించెను. అచటకూడ 'అతఃశిక్షాప్రౌఢిన్' అని యుండుట గమనార్హము. మూలమున స్మార్త నిమిత్త జ్యోతిర్విద్యల ప్రసక్తి లేదు. ప్రారంభముననే ద్యూతక్రీడ కనువగు పాచికలు, పరికరములు పేర్కొనఁ బడినవి. తిక్కన వానిని కొంత పిమ్మట వర్ణించెను.

"తే. మణిమయమ్ములుఁ గలధౌతమయములును సు
వర్ణమయములు నాదిగా వలయునట్టి
యడ్డసాళులు గలవు నా కభిమతముగ
వానిఁ గొనిపోయి చూపుదు వరుసతోడ." (4.1.72)

మూలమున నున్న వర్ణన కిది కొంత భిన్నము. అచట రంగులు పేర్కొనఁబడినవి– ఇచట మణిమయమ్ములు, సువర్ణమయమ్ములు అని విలువను వ్యంజింపఁజేసినాఁడు కవి. 'ఆదిగా' అనుమాట 'వరుసతోడ' అనుమాట ముఖ్యములు. అనగా పేర్కొనినవి గాక మఱెన్నియో కలవను ధ్వని ఈ

మాటలలో గర్భితను. 'మఱియు నవరసోచితంబులగు వినోదంబులం బ్రమోదంబు పుట్టించుచు' అని పేర్కొనుట చెప్పక వదలిన వివరముల నన్నింటిని సూచించుచున్నది.

మూలమున లేని వివరములను పేర్కొనుట వలన ధర్మజుని కార్యము తెలఁగు, ఆతనికి విరాటుని సభలో నేర్పడబోవు స్థానము విశదమగుచున్నవి. ఇచట తిక్కన ధర్మజుని యుద్దేశమును వర్ణించెను. 'మాన్యుఁడనై' అని యతఁడు పేర్కొనుట స్వాభిమానమునకు తగియున్నది.

*భీముఁడు* :—భీముఁడు మత్స్యదేశాధీశునొద్ద వంటలవాఁడుగా తాను చేయఁబోవు వంటకములను వర్ణించినట్లు తిక్కన రచించెను. ఈ వర్ణన వలన భీమునకు వంటచేయుట యందలి అభినివేశము, అభిరుచి తెలియుచున్నవి. అభిరుచి లేకున్న శ్రద్ధగ చేయఁజాలఁడు. అభినివేశము కొరవడిన రాజును మెప్పించలేఁడు. అట్లుగాక భీముఁడు రాజును మెప్పించఁగలఁడని సూచించుటకే తిక్కన ఈ క్రింది విధముగా వర్ణించెను—

"ఉ. ఆఱు రసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట నిచ్చలున్
వేఱొక భంగిఁ బాకములు విన్ననువొప్పఁగ జేసి చేసి నన్
మీఱఁగ వానసీని నొకనిం బురిఁ గాననియట్లుగాఁగ మేన్
గాఱియవెట్టియైన నొడికంబుగ వండుదు గూడు గూరలన్".
(4.1.77)

'కూడు కూరలు' అని పేర్కొనుటయే ఈ వర్ణనలో ప్రముఖము. భీముని పలుకులను ఒక వంటలవాని స్థాయికి తగినట్లుగానే తిక్కన కూర్చెను. కావ్యములు నవరసభరితములై ఆస్వాదయోగ్యము లైనట్లు భోజ్యపానీయములు సైతము షడ్రుచులతో కూడి ఆస్వాదనీయములగును. తిక్కన 'ఆఱు రసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట నిచ్చలున్' అని ప్రారంభించుట ఆ రసస్ఫురణను కూడ కలిగించుచున్నది. ఇచట భాషకూడ తగినట్లుగానే కూర్పఁబడినది. పాకములను భిన్నభిన్న రుచులతో చేసెదనని భీముఁడు పలుకుట శ్రద్ధాసక్తులను వ్యక్తపరచుచున్నది. 'మేన్ గాఱియవెట్టియైన' ఆ పని చేయుదుననుట యుక్తము. ఈ కూర్పు ఇచట ఆవశ్యకమే గదా!

ఈ కూడుగూరల వర్ణనయే కాక భీమసేనుఁడు చేయనెంచిన తక్కుం గల కార్యములను గూడ తిక్కన మూలమునందున్నవానినే మఱింత స్పష్టపడునట్లు పెంచి వర్ణించెను. (4.1.78,80,81,82)

నకులుఁడు :— నకులునకు అశ్వశిక్షణయందు తగు పరిజ్ఞానము కలదను అభిప్రాయము నేర్పరచుటకే ఈ వర్ణన చేయఁబడినది. తాఁజేయఁబోవు కార్యమును విపులముగా వర్ణింపకున్న అతఁడా పనిని చక్కగా నిర్వహింపఁ గలడా లేఁడా యను శంక యితరులకు కలుగునుగదా: ఇట్టి అనుమానమును నివారించుటకే తిక్కన ఆయా పాత్రములచే తాము చేయబోవు కార్యముల లోని వివిధాంశములను వర్ణింపఁజేసెను. అర్జునుని విషయమున మాత్ర మట్టి వివరణములను పేర్కొన లేదు. అర్జునుఁడు విరాటరాజు సముఖముననే ఇట్టి విపులీకరణ చేసినట్లు తిక్కన వర్ణించెను. ఊర్వశీశాప గ్రహణముచేత అర్జునుఁడు నపుంసకుఁ డగునను కారణాంతరము నృత్యగీతాది వర్ణనలేమిని సమర్థింపఁజాలుచున్నది. అదియునుంగాక అర్జునుఁడు తన నృత్యపాండిత్యమును విరాటునకుఁ దెలుపుటయే ఎక్కుడు ముఖ్యము. రాజాంతఃపుర ప్రవేశము ఒక నపుంసకునకు లభింపవలెనన్న విషయపరిజ్ఞాన నిరూపణ మేర్పడవలెగదా: అర్జునునిచే నృత్యభేదములను తరువాత వర్ణింపఁజేయుటయే ఎక్కువ ప్రయోజనకారిగనుక ఇచట వర్ణింపలేదు.

నకులుఁడు తన ఉద్దేశ్యమును, తాను చేయఁబోవు కార్యమును ధర్మజాదులకు తెలుపు సందర్భములో మూలమునందు అశ్వములను గూర్చి విపులముగా పేర్కొనఁబడలేదు. అట్లు లేకపోవుట ఒక కొఱత. పలన తక్కుం గల అన్నివిషయముల వివరణము కొంతైనను గలదు. అశ్వవర్ణన మాత్రము పూర్తిగా విడువఁబడుట ఎందులకు. ఆ తరువాత సహదేవుని సమాధానములో గోవర్ణన కలదుకూడ. అందువలననే తిక్కన అనూలకమైన అశ్వనిరూపణ మును జేసెను. ఇది ప్రముఖముగా కావ్యార్థమును సాధించుచు తోడ్తో కవికి గల విషయపరిజ్ఞానమును, పరిశీలనాత్మకరచనా ప్రణాళికను తెలియఁ జేయుచున్నది.

"సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల నేర్చి
మావుల హత్తించు మార్దవంబుఁ

ద్రాళ్లఁ బట్టింపంగఁ దఱిరైన కొరదముల
సంచంబు లెఱిఁగి శిక్షించు నేర్పుఁ
గళ్యాలఁ బదిలంబు గాని గుఱ్ఱంబుల
ద్రొక్కుట్టున కియ్యకొలుపు వెరవుఁ
బెనఁగు తూలకముల బిరుదుతనంబులఁ
జలము డింపక తీర్పఁజాలుటయును

"తే. వలవరించినవాఁడ లాయమున నున్న
యపుడు దొసఁగించుకయు లేనియట్ల గాఁగ
మాటిమాటికిఁ బలికించి మందడీల
కెల్లనూఁటట యగుచు వర్తిల్లనేర్తు." (4 1 95)

ఈ విపులవర్ణన సందర్భోచితమును, అత్యంతావశ్యకమునై యొప్పుచున్నది. అశ్వములను దీర్పవలసిన తీరుఁ ప్రయోజనకరములుగా చేయవలసిన పరిపోషణాది పనులు ఇందు వర్ణింపబడెను.

సహదేవుఁడు :— సహదేవునితో సైతము ఇదేవిధముగా తిక్కన గోవుల వర్ణనమును గోపరిపోషణమందు చేయవలసిన కార్యములను పేర్కొనఁ జేసెను.

"సీ. వంజలనైనను వలనేర్పడఁగ నొక
భంగిఁ జేపఁగఁ జేసి పాలుగొనఁగ
బడుగులనైనను బాటించి పరికించి
గోమున మైఁగండ క్రొవ్వుదేలఁ
దెవులుగొంటులనైనఁ దీర్చి సంకటమున
కోపి మందటియట్ల రూపుసేయ
నట్టిలనైనను నలువైన వెరవున
ముట్టె యంటఁగఁగట్టి కట్టివిడువ

"ఆ. బిదుకఁ గదుపు నేర్ప బెదరువాపఁగ నీరు
మేపు గలుగు నెడకు మెలఁగ వెలువ
మెకము నరయ ముచ్చు మెలఁగిన వెలకొట్ట
నేర్తుఁ బసికిఁ జాలఁ గూర్తు నేను." (4.1·101)

పశువుల గూర్చిన ఈ వర్ణన అత్యంత సమగ్రముగా నున్నది. విషయ వివరణమునందు తిక్కన కడు శ్రద్ధ వహించు ననుటకు ఈ వర్ణన చాలును. ముఖ్యముగా గోపాలనలో నుండు సమస్యలను బేర్కొని తత్పరిజ్ఞానము సహదేవునకుఁ గలదని పరిష్కరించెను. వంజలు, బడుగులు తెవులుగొంటులు, నట్టులు గోవులలో ప్రత్యేకశ్రద్ధ గూర్పవలసినవి కాఁగా పసులను జంపు క్రూరమృగములను జంపుట గోపాలకుల కుండఁదగిన ముఖ్యలక్షణము. ఈ వర్ణనము సహదేవుని కార్యశీలతను దెలుపఁజాలినదై యున్నది. అశ్వ. గోవర్ణనములందు సీసముల ఎన్నిక చక్కగా అమరినది. దేశీయ ఛందస్సులో సామాన్యుల భాషలో ఈ పశుగణముల వర్ణన స్వాభావికముగా, సందర్భోచితముగా ఒప్పినది. ఇట్టి సహజ వర్ణనలు కావ్యమునకు సహృదయులకు అంతరమును ఛేదించి ఆత్మీయతా భావమును (పాత్రముల యందు) కలుఁగ జేయును.

ద్రౌపది :— ద్రౌపది తాను చేయఁబోవు కార్యములను పేర్కొనుట మూలములో వర్ణింపఁబడలేదు. సైరంధ్రీజాతి స్త్రీ చేయఁదగిన కార్యములను తిక్కన ఒక సీసపద్యమునందు వర్ణించెను. ఈ వివరణము సైరంధ్రి విరాటు నగరమున అజ్ఞాతవాసము నెట్లు గడిపినదో తెలుపుచున్నది. ఈ పనులన్నియు అలంకరణలకు సంబంధించినవేగాని సామాన్య దాసీజన కృత్యములు గావు ఈ వర్ణన ఇచటనే ద్రౌపది ఏర్పరచుకొనిన పరిధిని సూచించుచున్నది. కను కనే ఆమె మున్ముందు కీచకుని యింటికిఁ బోనొల్లనన్నది.

ఇచట నిక్కార్యవర్ణన రమణీయముగా, ప్రయోజనకారిగా భాసించు చున్నది. (మృదువుగా సాగినది రచనకూడ). సున్నిత మనస్తత్వముగల స్త్రీకిఁ దగిన వృత్తి సైరంధ్రీ వృత్తి, కాగా తిక్కన వర్ణించిన శైలికూడా ఇందుకు తగియున్నది. కొన్ని పనులను బేర్కొని చివరగా 'మఱియు వలయు

పనుల వెంట మెలఁగ నేర్తు' అని చెప్పించుట వర్ణనకొక సమగ్రతను చేకూర్చు చున్నది.

"సీ. కలపంబు లభినవ గంధంబులుగఁ గూర్చి
తగ పూఁత నలఁదుదుఁ దనువుగాఁగ
మృగమద పంకంబు మృదువుగా సారించి
తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగులఁ
బువ్వులు బహువిధంబులఁ గట్టి ముడికొక్క
భంగిగా నెత్తులు వట్టి యిత్తు
హారముల్ మెఱయ నొయ్యారంబుగా గ్రుచ్చి
యందంబు వింతగా నలవరింతు

ఆ. వివిధ శిల్పములఁ బ్రవీణనై మఱియును
వలయు పనుల వెంట మెలఁగ నేర్తు
మత్స్యరాజ మహిషి మనమున మక్కువ
నెలకొనంగ నిట్లు గొలువనేర్తు." (4.1.107)

అర్జునుఁడు :— అర్జునుని విషయమున మాత్రము తిక్కన తొలుత ఎట్టి వర్ణనను అమూలముగా చేయలేదు. విరటుని సభాంతరమున తన నాట్య విద్యా పాటవమును చెప్పికొను అవసరము కలిగినది అర్జునునకు. అతని గంభీరాకారము నృత్తవిద్యకు తగియుండలేదు అని విరాటుఁడు సంశయింపఁగా అర్జునుఁడు తానేర్చిన నృత్య విశేషములను పేర్కొనును. నృత్యగాన భేదముల నెన్నికొని విపులవర్ణన జేయలేదు తిక్కన. ఇచట దేశీయ నృత్య రీతులను తిక్కన పేర్కొనియుండుట గమనార్హము. ఈ దేశీభేదములను తొలుత గ్రంథస్థము జేసినవాఁడు కాకతీయ సామ్రాజ్యములోని 'జాయప సేనాని'. ఇతఁడు తాను రచించిన 'నృత్త రత్నావళి' అను నాట్యగ్రంథమునందు దేశీభేదములను, తల్లక్షణములను పేర్కొనెను10. ఆ కాలమువాఁడేయైన తిక్కన ఆ భేదములను పేర్కొనుట అతని దేశీయాభిమానమును, సమకాలీనతను తేటపఱచుచున్నది.

"తే. ఒండు పసులకు సెలవు లేకునికిఁ జేసి
యభ్యసించితి శైశవ మాదిగాఁగ
దండలాసక విధమును గుండలియును
బ్రేక్కణంబు తెలుంగును బేరణంబు

క. వి(శుత వాద్యంబులు మం
జు(శుతి సంభావ్యగీత సుగతులు సద్భా
వా(శయములుఁ దజ్జన్య ర
సా(శయములునైన యభినయంబు లెఱుఁగుదున్."
(4.1:240,241)

ఇచ్చట తిక్కన పేర్కొనిన దండలాసక విధమును, కుండలియును బ్రేక్కణంబు, పేరణి అను నృత్తభేదములు నాలుగు దేశీయములే. రచనలోనే కాక నృత్యాది కళలయందు సైతము తిక్కన దేశీయ పద్ధతులపై మక్కువఁ జూపెను. ఇట్టివి కవి ఆత్మీయతను పట్టియిచ్చు కొన్ని విశేషములు. తిక్కన లోకజ్ఞుఁడు. పైగా కాకతీయ ప్రభువగు గణపతిదేవుని సందర్శించి యుండుట చరిత్రప్రసిద్ధము. ఓరుగల్లున కేగినపుడు తిక్కన పై నృత్యభేదము లను గూర్చి తెలిసికొని యుండునని తోచును. అయోలకముగా పై భేదము లను తిక్కన పేర్కొనుటలో పై సమకాలీన ప్రభావము కానవచ్చును.

వాద్యగీతముల విషయములలో ప్రత్యేకముగా ఎట్టి భేదములను పేర్కొనలేదు. 'వి(శుతవాద్యములు' అనుటవలన నాటికి ప్రఖ్యాతములైన వాద్యములన్నియునని భావింపవలెను. 'మంజు(శుతి సంభావ్య గీతసుగతులు' అని పేర్కొని గీతములలో గతులేకాక సద్భావా(శయములుసైతము ప్రముఖ మని గుర్తించెను. (శవణసుభగత్వము, భావగాంభీర్యము సైదోడుగా సాగ వలెనని కవి సంభావించెను. వీని యన్నింటికన్నను ప్రాముఖ్యమైనది రసో దయము. ఆది తిక్కన ప్రత్యేకదృష్టినిలిపిన అంశము. గీతాది విషయము లందుగూడ రసప్రాధాన్యము మరువరానిది. తిక్కన 'తజ్జన్యరసా(శయములు నైన అభినయంబులు' అనెను. తన రచనలోసైతము రసా(శయములైన

అభినయములను తిక్కన పేర్కొనియుండుటను గమనింపవచ్చును. అభినయమును రసాశ్రయముగా వర్ణింపవలెనని భరతముని సైతము నొక్కి వక్కాణించియుండెను.

## ఉత్తరాభిమన్యుల వివాహము

తిక్కన అనూలకముగా వర్ణించిన అంశములు మఱికొన్ని గలవు. అభిమన్యుని వివాహఘట్టము పూర్తిగ తిక్కన వర్ణించినదే. ఉత్తరాభిమన్యుల వివాహము పాండవులకు శుభసూచకము కాగా కౌరవుల దుఃఖమున కది ప్రారంభము. అప్పటివఱకు పాండవుల ఇడుములు, కౌరవుల సుఖభోగములు సాగినవి. ఆ వివాహము ఒక సంధికాలమున జరిగినది. అదిగాక ఉత్తరాభిమన్యులు భావి కురువంశబీజమునకు ఆధారభూతులు. అట్టివారి వివాహము వర్ణింపఁబడుట సమంజసము. కాగా మూలమునందిది వర్ణింపఁబడలేదు అట్టి యుత్సుకతాభరితమగు శుభకార్యమును వర్ణంపక విడుచుట మహాకావ్యమునందొక లోపమే యగును. తిక్కన దీనిని వర్ణించుటత్యంత స్వాభావికముగానున్నదే గాని అనవసరమగు వర్ణన అను భావమే పొడచూపదు. తిక్కన వర్ణించిన వివాహము తెలుగువారి యిండ్లలో జరుగు వివాహపద్ధతిలోనే యున్నది.

ఇట్లుండుటవలననే భారతము తెలుగువారికి సహజముగా కనిపించినది. ముఖ్యముగా తిక్కన మలచిన పాత్రలు, వర్ణించిన వివాహాది కార్యములు, రచించిన సంభాషణలు ప్రజలకు అత్యంత సన్నిహితములై యొప్పినవి.

ఉత్తరాభిమన్యుల వివాహము జరిగిన సందర్భమును తిక్కన వర్ణించెను. వర్ణనలో సంయమనమును కనపఱచెను. ఉత్తర సౌందర్యప్రశంసను, పరస్పరావలోకనములను, పులకాంకురములను పరిమితముగ వర్ణించి వారి పరస్పరానురాగమును వ్యంగ్యము చేసెను.

“ఉ. వీనులఁ దియ్యమెక్క మును విన్కిఁ బరస్పరరాగవృత్తిలో
నూనినఁ జూచువేడుకల నవ్విభులూరెడు నెమ్మనంబు ల
చ్చోనొక యింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండనున్నయ
మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపగన్.”

(4.5.398)

ఈ సందర్భమున వర్ణింపఁదలఁచిన ఎన్నియో చిత్రవిచిత్ర రచనా రీతులలో మన్మథవికారములను వర్ణింపవచ్చును. కాని తిక్కన 'మారవికారము లంకురింపగన్' అని సూచించి పులకాంకురాదులను, చిత్తవిభ్రమములను, నిశ్చేష్టతాదులను, సహృదయుల భావనకు వదలివేసెను. అతర్వాత వారి అన్యోన్యావలోకనంబులను వర్ణించుచు ముచ్చటగొలుపునట్లు సున్నిత భావములను ఎదనాటునట్లు మనోహరముగా వర్ణించెను.

"సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపైఁ బాఱి
తివుటమై నునుఁగాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోరమ
నడుగుల యొప్పపై నల్లనడగఁ
బతివిలోకనములు పడఁతుకమైఁ దీవఁ
గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు
వెలఁది కటాక్షముల్ విభుమోముపైఁ గ్రమ్ము
నెగసి మోమునఁ సోకి మగుడవచ్చు

తే. నొండొరువుల లేఁజెమటల నూని క్రేఁగు
పడిన చాడ్పున నవయవభంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱి పిశాల
నయనదీప్తులు నెఱుకువ బయలుపడఁగ." (4 5 896)

ఇచట వారి చూపులను చూడముచ్చటగా తిక్కన వర్ణించెను. అంగాంగ వర్ణన చేయలేదు. ముద్దియ వదనముపై బాఱిన వరుని చూపులు తివుటమై నునుఁగాంతితీపి గ్రోలినవట. ముద్దియ వదనము ఎట్లున్నదో వాచ్యముగా వర్ణింపఁబడలేదు, కాని ఆ వదనమున నునుఁగాంతి తళుకులీనుచున్నదని, ఆ కాంతి తీపిగ్రోలినట్లు ఉత్తరుని చూపులకు తృప్తినిచ్చినదని వర్ణించెను. వదనమున సౌందర్యముకంటె కాంతి (కళ) యుండుట అవసరము. అది ఇచట వ్యంజ్యమాన మైనది.

ఇక సుందరీరత్నము చూపులన్నియో లజ్జాభారముతో వాలియున్న కళ్ళలోనుండి మనోహరుని అడుగులపైఁ బడినవి. ఉత్తర ముగ్ధ. సఖాంగణము నకు తండ్రిచే తొల్తఁ బిలువఁబడినప్పటి బాల యౌవనోదయమున ముగ్ధవధు వుగా మారినది. బొమ్మపొత్తికలపై కురువీరుల శిరోవస్త్రముల నడిగిన బాల, వధువుగా మారినది. కనుకనే లజ్జాభారముతో చూపులు వాలినవి. ఉత్తర మౌగ్ధ్యమును విరాటపర్వమాదిగా పోషించుచునే వచ్చినాఁడు. ఇచటకూడ అభిమన్యుని అడుగులపై చూపులు వ్రాలినవనుచున్నాఁడు.

అభిమన్యుఁడు పురుషసహజమగు దర్పముతో ఆమె మైదీవను పలు మార్లు కలయఁజూడఁగా, ఆమె చూపులు మాత్రము - సిగ్గు దొంతరలు క్రమ్మఁగ, ఫాలభాగముల నుండి పైకెగసినను మోహమున సోకినంతనే మరలివచ్చు చున్నవి. వధువు అల్లనల్లన వరునిజూచి తడబాటుతో చూపులు మరల్చు కొను సహజదృశ్యమును తిక్కన ఇంపుగా వర్ణించినాఁడు.

ఇచట లజ్జను సూచించు స్వేదము, కంపము అను కొన్ని సాత్త్విక భావములు పరిమితముగా సున్నితముగా వర్ణింపఁబడినవి. తిక్కన వర్ణించిన వధూవరులు పిన్నవారు. ఆభిజాత్యము గలవారు. మదనావస్థలను, తాపము లను బొందు ప్రౌఢ నాయికా నాయకులు గారు. వీరి యన్యోన్యావలోకనా వర్ణనమే అందుకు నిదర్శనము.

ఇఁక తలఁబ్రాలు పోసికొనుట, పాణిగ్రహణము, వికాసనగతులగుట ఇవి యన్నియు చక్కగా వర్ణింపఁబడినవి. వారు తలఁబ్రాలు బోసికొనుట మందార కల్పలతలు విరులనొండొంటిపై గురిసినట్లున్నదట. ఇట చక్కని భావనను, వివాహమున తలఁబ్రాలు బోసికొను ఘట్టము వధూవరులకు, చూపరులకు అత్యంతాసక్తికరమగు నంశము. తెలుగువారి ఈ ఆసక్తిని మహాభారత రచనాదీక్షా బద్ధుఁడైనను కవిబ్రహ్మ మరువలేదు. మన ఆచా రములకు భిన్నములైన వాని నసలే పేర్కొనలేదు. పాణిగ్రహణము చేయు నెడ మత్తేభము పల్లవమును గొనునట్లు అభిమన్యుఁ డుత్తరపాణిపల్లవమును విలాసముగా గ్రహించెను. ఉత్తర సుకుమారత. అభిమన్యుని దర్పము ఈ ఉపమానమునందే గర్భితములైనవి.

వారిరువురు పీఠాసనమును అలంకరించినపుడు 'నూత్న సౌభాగ్య మున' నున్నారని తిక్కన వర్ణించెను. వారి భావానుభావ సంచారిభావము

లను ఎంత వ్యంజింపఁజేయఁదగునో తిక్కన అంతగా వ్యంగ్యము గావించెను. వర్ణనకొలఁకు ఔచిత్యమును విడువనివాఁడు కవిబ్రహ్మ యొక్కఁడే.

సీ. కోర్కులు గెడఁగూడుకొని పారమేదినఁ
జిత్తంబు లూఁటఁ జిగురులొత్తఁ
బులకాంకురములకుఁ దలఁతాకుడై యిరు
మేనను మవ్వంబు మిగిలి పొదలఁ
దలివేచి చనఁబోయి తడఁబడి మార్గతి
వడి చూపు లాదట బయలు పఱుపఁ
జెమటలతావులు తమలోనఁగలసి వే
ఱొక్క సౌరభమయి చొక్కుసేయ

తే. గాఢ సంస్పర్శ భంగులు గలుగునట్టి
హోమ సమయ కృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్ట పొరిఁబొరి గ్రమ్ముదేర
సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు." (4.5 402)

ఒకరినొకరు తాకియుండునపుడు పులకాంకురములను, చెమటల తావులు గలిసి అదియును వేఱొక్క సౌరభముగా వారికింపు గూర్చుటను నవ వధూవరుల మనసులలో ప్రవేశించి చూచినంత చక్కగా వర్ణించెను. తిక్కనయొక్క సహజభావుకత ఈ సందర్భములో తేటతెల్లమగుచున్నది. వివాహమునందు పాణిగ్రహణము, ఏకాసనము, హోమము, ఇత్యాదులు వారికి పరస్పర సంస్పర్శ సౌఖ్యమును గూర్చుటకే నిర్దేశింపఁబడినవని వధూ వరులు భావించుట సహజము. వివాహసమయమున అట్టి కుతూహలము సర్వసాధారణము. వివాహమునంతయు వర్ణించిన పిమ్మట చివరలో 'సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు' అని వర్ణనను ముగించెను. హోమాది క్రతువులన్నియు ముగిసిన పిమ్మటనే వారిని సతియు బతియు అని పేర్కొనుట సదాచారము. అంతవఱకు వారు వధూవరులుగానే వ్యవహ రింపఁబడిరి. లోకముననున్న వ్యవహారమును అనుసరించుటలో తిక్కన ఏమర లేదు.

# శమీవృక్ష వర్ణనము

తిక్కన చేసిన అమూలక వస్తువర్ణనలలో శమీవృక్ష వర్ణనము, నర్తన శాల ముఖభాగ వర్ణనను పరిమాణములో పరిమితమైనవి. కథాగమనమున అత్యంత ప్రధానమైనవి. వర్ణనౌచిత్యమన నెట్టిదో ఈ రెండు వర్ణనలు నిరూపింపఁగలవు.

పాండవుల ఆయుధములు అతిలోక భీకరములు. అట్టివి సంవత్సర పర్యంతము. ఒక వృక్షాగ్రమున దాపఁబడి యుండినవి. కౌరవుల వలనగాని ఇతరుల వలనగాని అవి గుర్తింపఁబడలేదు. అనఁగా ఆ వృక్షమెంత దుర్గమ ప్రాంతములో నుండియుండెనో, అది యెట్లధిరోహింపఁబడ నలవిగానిదో వర్ణించుట యుక్తము. బట్టబయలు ప్రాంతమున సామాన్యమగు చెట్టుపై బెట్టబడి కూడ గుర్తింపఁబడలేదనుట హేతువిరుద్ధముగా నుండును. మూలమున 'భీమశాఖో దురారోహః' అని సూచన కలదు. ఆ సూచన నందిపుచ్చుకొని తిక్కన గంభీరవర్ణన గావించి ఒక మహావృక్షమును సాక్షాత్కరింపఁజేసి పాండవుల ఘనములగు ఆయుధములను చూడనలవిగానివిగా భద్రపఱచెను. ఒక కావ్యరచన యందు ఇట్టి చిన్నవిషయములను సైతము శ్రద్ధవహించి కారణనిరూపణ చేసినచో అది సమగ్రముగా నుండును. సమగ్రత శిల్పములో నొక ప్రధానాంశము గదా !

ఇచట శమీవృక్ష వర్ణనము ఒక సీసములో చేయఁబడి వృత్తౌచిత్యము నందినది. దాని వైశాల్యమునకు సీసము అనువుగా సాగినది. శమీవృక్షమును శమీతరు చక్రవర్తి యని సంభావించుట ఆ వృక్షరాజము యొక్క గాంభీర్యమును, ఘనతను వ్యంజింపఁజేయుచున్నది. ఆంగ్లమునం దిట్టిదానినే **'Personification'** అందురు. మన సంప్రదాయమునందును నగ, నదీ, నదములకు వ్యక్తిత్వమారోపించుట సాధారణము

తొలుత వృక్షమును వర్ణించి అట్టిదైనను కుతూహలుగగు ఇతరులవలన గాని, శత్రువుల వలనగాని అధిరోహింపఁబడవచ్చును గదా ! అను సందేహము కలుగకుండ ఆ ప్రాంతమును గూడ తిక్కన వర్ణించెను. ఇచట భయానక, బీభత్స భావములను పోషించుటకు శార్దూలము గైకొనఁబడినది. 'చూడ జిత్తక్షోభం బొనరించు'నదిగా శమీవృక్షము వర్ణింపఁబడినది. జుగుప్సావహా

మగు ప్రాంతములో పవలునే చీఁకటి చేయఁజాలిన ఆకుజొంపములతో, కాక ఘూకవములకు నిలయమై, అఖిల భుజగ చండమూర్తియైన శమీవృక్షము ఆయుధనిక్షేపణకు జాలినట్టిది.

"సీ. నెగసిన కొనలేచి నింగినంతంతకు
నవులఁ ద్రోచుచుఁ దనరారుదానిఁ
జాగిన శాఖ లాశాచక్రమున కొలం
దులు ఖారవెట్టంగఁ బోలుచుదానిఁ
గవట లొండొంటితోఁగడయుచు నెడములు
ద్రిమ్మి బ్రబ్బఁగ సొంపు మిగులుదాని
లోని జొంపము పవలును బెనుఁజీఁకటి
నొదవించి పొదలంగ నొప్పుదానిఁ

"తే. గనియెఁ బవమాన వివిధ నర్తనకళాను
వర్తిఁ గాక ఘూకారవస్ఫూర్తి జాత
భీతిపరిసరవర్తి నాభీలభుజగ
చండమూర్తి శమీతరు చక్రవర్తి." (4.1.162)

ఇది సంస్కృతమునందు 'భీమశాఖో' అనునొక్క పదమునకు వర్ణనాత్మకమైన, వ్యాఖ్యానమనఁదగియున్నది. 'భీమశాఖో'యన శమీవృక్షశాఖల గరువతనము తెలియును గాని తద్వ్యాప్తిగాదు. 'నెగసిన కొనలేచి నిగిడి'అను ప్రారంభమే తద్విస్తరణను వ్యంజింపఁజేయగా, శాఖలు ఆశాచక్రములదాకుటనగా, ఆ శాఖల దైర్ఘ్యమును వ్యక్తపరుపగా, జొంపములు పవలును బెనుజీఁకటిగా జేయుచున్నవని చెప్పుటలో ఆ యాకుజొంపముల మధ్యమున్న ఆయుధములు చీఁకటివలన కానరావను స్ఫురణ కలుగుచున్నది.' 'పవమాన వివిధనర్తనకళా నువర్తి' 'కాకఘూకారవ స్ఫూర్తిజాత భీతి' ఇత్యాది వర్ణన ప్రచండవాయు వులకు ఊగుచున్న కొమ్మలతో కాకఘూకారవములతో ఘూర్ణిల్లు భయం కరవృక్షరాజము భయానక మగుచున్నదని విశదమై ఒక ప్రత్యేకవృక్ష రాజరూపము కళ్ళకుఁగట్టును ఇట్టి భయానకవర్ణనలో గూడ దానిని 'సొం పుమిగులు దాని' నిగా భావించుట కవియొక్క కళాదృష్టివలన సాధ్య

మైనది వృక్షశాఖల కదలికను నృత్త విన్యాసములుగా భావించి 'వివిధ నర్తన కళానువర్తి' అని సంభావించినాఁడు కవిబ్రహ్మ. ఇది తిక్కన ప్రత్యేక శిల్పము. భయానక. బీభత్స దృశ్యములను వర్ణించునపుడు మధ్యమధ్య ఆ దృశ్యములను రమణీయములుగా కూడ నున్నవని సంభావించుచుండును. యుద్ధవర్ణనలలో నిట్లు పలుమరు వర్ణించుచుండును.

"శా. పక్షివ్యాకులమై బరేతనిలయోపాంతోత్థమున్ డాకినీ
రక్షోభూత పిశాచగోచరము దుర్గంధంబునై చూడఁ జి
త్తక్షోభం బొనరించు నట్లగుటఁ జెంతం జేరరాదీ శమీ
వృక్షం బెవ్వరి కిందు బెట్టుదమె పృథ్వీనాథ శస్త్రాస్త్రముల్.
(4.1.164)

ఇది చేరరానిదిగానున్నది గనుక శస్త్రాస్త్రముల నిందుఁ బెట్టుదమని బలికి తిరిగి దానివలన ఎవ్వరికిని ఎట్టి ప్రయోజనమును లేదని నొక్కివక్కాణించెను. ఒక్కొక్కరు ఒక్కొక్క ప్రయోజనము నాశింపవచ్చును వృక్షములనుండి గాని ఇది మాత్రము చేరంజనఁ జూడఁగ నరయ నెక్కసమకట్టంగా ప్రయోజన మొకఁడు లేనిదట.

"క. పెనుఁబోదువుఁ బలుపుజొంప
ము్మను గలయది దీన నెల్లపురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు జేరం
జనఁ జూడఁగ నరయ నెక్క సమకట్టంగన్."(4 1.165)

అనఁగా వృక్షముల సాధారణప్రయోజనమగు వంటకట్టెయలకును ఇది ఖండింపనలవిగానిది అని నిర్ధారణ చేయఁబడినది. ప్రయోజనార్థముగా నిట్టి వర్ణనలు చేయఁబడిన కావ్యము నిర్దుష్టముగా సహేతుకముగా రూపొందును: 'తిక్కన శిల్పంపుఁ దెనుగుతోట11' యను కీర్తి కిట్టి శిల్పరచనయే ఆధారము.

## నర్తనశాలా ముఖమంటప వర్ణనము

తిక్కన నర్తనాగారంబు ముఖభాగస్థలంబును అమూలకముగా వర్ణించెను నర్తనశాలయొక్కనిర్మాణవ్యత్యాసమును, దుర్గమత్వమును వర్ణింపఁబడుట

ఇచట అత్యంతావశ్యకము. భీమకీచకుల యుద్ధము ఎవరిచేతను గమనింపఁబడ లేదనుటను సమర్థించుటకు ఈ వర్ణన తోడ్పడుచున్నది. మూలములో నిట్టి ప్రత్యేక వర్ణనలేదు. నర్తనశాల అట్టి గాఢాంధకారమున మునిఁగియుండుట వలననే భీమకీచకుల ఉదగ్రయుద్ధము కనఁబడలేదు, వినఁబడలేదు. వర్ణన ఉపమాలంకార సాహాయ్యమున చేయఁబడినది. ఇందు తిక్కన లోకజ్ఞత నిగూఢముగా వెల్లడియగుచున్నది. 'వివేకరహితు హృదయంబునుంబోలెఁ దమోదూషితంబును'— ఈ పోలికలో ప్రధానాంశము నర్తనశాల గాఢతమములో మునిఁగియున్నదని చెప్పుట. అది సాధింపఁబడినది. తోడ్తో వివేకరహితుని హృదయము తమోదూషిత మనుటలో కీచకుఁడు వివేకరహితుఁడు గనుక అతని హృదయము అజ్ఞానాంధకారబంధురము అను వ్యంగ్యార్థము సాధింపఁబడుచున్నది. ఇట్టి రచన ధ్వనిమంతము. కీచకుఁడు మూర్ఖుఁడు అని వాచ్యముగాఁ బలుకక వివేకరహితుని హృదయము తమోదూషితము అని చెప్పుట వలన అదియును నర్తనశాలను వర్ణించు సందర్భములో ననుటవలన ప్రత్యేకార్థము వ్యంగ్యమగుచున్నది. 'విదగ్ధ వనితా ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబు'— ఇచట నర్తనశాల దుర్నిరూపమనుట వాచ్యార్థము. ద్రౌపది ప్రేమ 'విదగ్ధవనితాప్రేమ'. అట్టిది కీచకునకు దుర్నిరూపమగుచున్నది, ఇది ధ్వని.

తిక్కన గైకొనిన ఉపమలు అత్యంత స్పష్టములు, సుందరములు. 'ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మానుష్యంబు'— ఇది సూటిగ నర్తనశాలకే అన్వయించు పోలిక. నర్తనశాల ఘోరాటవి. నిర్మానుష్యంబు. అందు సింహబలులు పోరినపుడు గమనింపఁబడు నవకాశములేదు. ఆ తరువాతగూడ భీమకీచకులను సింహగజములతో బోల్చుట ఈ యటవీ సామ్యమున కనువుగా నున్నది. 'సింగంబున్న గుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మాతంగంబుం బురుడించుచుం' వచ్చినాఁడట సింహబలుడు. 'రాగంబు ఘూర్ణిల్ల' అనుట జంతుధ్వనిని ఉద్దేశించి అనినట్లేయున్నది, ఇట్లు అరణ్యమును బోలిన నర్తనశాలలో సింహగజములను బోలిన భీమకీచకుల యుద్ధము తగినట్లు వర్ణింపఁబడినది (శార్దూలము—పద్యము 330). మరియొకచోట కీచక భీమసేను

లను పల్లవప్రసూన భరితంబగు ద్రుమానుతో మత్తగజముతోఁ బోల్చినాఁడు తిక్కన. ఈ యుపమానమును నర్తనశాల ఘోరాటవి యనుటకు అనుగుణము గానే గ్రైకొనఁబడినది. ఇచట గమనింపవలసిన అంశము కవియొక్క జాగరూకత. ఒకచో నొక పోలిక గొనివచ్చినప్పుడు తదనంతరము దానికి భిన్నముగాని విధముగానే యుపమానముల నుపయోగించుట ప్రత్యేక శ్రద్ధవహించిన కవికే సాధ్యము. తిక్కన కృతి ఇట్టి యవధానము వలననే శిల్పముగా నెన్నఁబడుచున్నది.

'కాపురుష లక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబు'– కాపురుషుల యొద్దనుండు ధనము ప్రయోజనశూన్య మగునను రూఢి ననుసరించి తిక్కన ఈ యుపమను గ్రైకొనెను. ఇచట నర్తనశాలగూడ రాత్రులందు అనుపయోగ్యము. కాపురుషుల నాశ్రయించిన లక్ష్మి మాత్రము ఎల్లప్పుడు అనుపయోగ్యము. ఇది ఈనాడు అభ్యుదయకవు లనఁబడువారు చెప్పుమాట, తిక్కన నాడే సందర్భవశమున చెప్పియున్నాఁడు. **'Wealth accumulated in an evil hand is of no use'**. అనభ్యస్త శాస్త్రంబునుంబోలె దుర్గమంబు'– సకలశాస్త్ర పాండిత్యము గలిగిన తిక్కనార్యుఁడు ఈ పోలికను చక్కగా నుపయోగించెను. శాస్త్రము సుగమము – అభ్యసించినపుడు. అట్లే నర్తనశాలయు పగలంతయు అంతఃపుర కాంతల ఆటపాటలతో కళకళలాడుచుండును. కాగా రాత్రియందు మాత్రము గాఢాంధకారమున మునిఁగి దుర్గమమై నిశ్శబ్దముగా దరిజేరరానిదిగా, అనఁగా అనభ్యస్త శాస్త్రముపలె నుండునని కవిభావము. శాస్త్రమే కాదు, కావ్యమైనను అనుభూతిని పొందు అభ్యాసము, రసజ్ఞత, కొరవడినచో నిస్సారముగాఁ దోఁచును.

'స్వప్నలబ్ధ పదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబు' – ఇచట కీచకునకు ద్రౌపది స్వప్నలబ్ధయే. ఆమె మాయవుటురులఁ జిక్కిన కీచకుఁడు ఆరాత్రి సైరంధ్రితో తనపొందునూహించుకొని, భావించుకొని ఒక పగలంతయు ఆ యనుభూతిలోనే గడిపినాఁడు. చివరకు అతనికి లభించినదియు ఆ యూహా జనితానందము మాత్రమే. ఆ ధ్వని యిందు గర్భితము. స్వప్నమున లభించినట్లనిపించిన వస్తువు లౌకికదృష్టి కగోచరమగును. ఇచట నర్తనశాల కంటికి కనఁబడుటలేదనుట వాచ్యార్థము. ద్రౌపది కీచకునకు స్వప్నలబ్ధ పదార్థంబును

బోలినది. ఆమె బాహ్యసౌందర్యము కీచకుని దృష్టికి అందినదేకాని ఆమె అంతరవము, తేజము అతని దృష్టికి అందలేదు. ద్రౌపది అతిలోకసౌందర్యవతి. అట్టి కాంత దేవగంధర్వలోకములందెక్కడను ఉండఁబోదని పలికిన కీచకుఁడు ఆమె రహస్యవృత్తాంతమును గూర్చి యాలోచింపలేదు. అతనిది కామాంధ్యము. అంధునకు దృష్టిగోచరము కానట్లే ద్రౌపది కీచకునకు తేజోరూప సమన్వితగా కాన్పింపలేదు. అతనికి మిగిలినది అతని కాంతమాత్రమే. ఇచట ఉపమానము సాధారణమైనది. కాని తదంతర్గతమైన ధ్వనివలన పుష్టిమంత మగుచున్నది.

'విషమ కావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబు'— తిక్కన కవిగా తన అభిప్రాయములను కావ్యాదిలో ప్రకటితము గావింపలేదు. ఇచట సందర్భ వశమున అతని ఉద్దేశము బయల్పడినది. ఇది కవి ఆత్మీయతను ప్రతిఫలించు ఉపమానము. కావ్యమున అలంకారములు అర్థవ్యక్తికి తోడ్పడునట్టివి. అర్థము స్పష్టపడుటకు అలంకారము నుపయోగింపఁగా ఆయలంకారమే అస్పష్టముగా నున్నచో తదర్థస్ఫూర్తి కలుగదు సరిగదా మఱింత అస్పష్టత యేర్పడును. అలంకారౌచిత్యము అని క్షేమేంద్రుఁడు ప్రకటించినదానినే తిక్కన ఇచట వ్యాఖ్యానించినాఁడు. అలంకారములు లేకున్నను కావ్యత్వమునకెట్టి లోటు కలుగదు, కాని అస్పష్టాలంకారములుండినచో నది అప్రౌఢ కావ్యమగును. ఇట చెప్పినదానిని తిక్కన సర్వదాగుర్తుంచుకొని ఎచటను అనవసర మగు అలంకారములను గూర్చలేదు. కూర్చినయెడ సుస్పష్టముగానే యున్నవి. ఇఁక ప్రకృతార్థమునకు వచ్చినచో కారుచీఁకటిలో నర్తనశాల ముఖభాగస్థలంబున నున్న అలంకారములు అస్పష్టముగానున్నవి అని భావము. ఇచట అలంకారమునకు అలంకరణ అనునది ప్రకృతార్థము కాగా ఉపమాద్యలంకార మనునది కావ్యపరమగు నర్థము. వ్యంగ్య మాధారముగా నిట తిక్కన కావ్యలక్షణమును నిర్దేశించెను.

'బాలిశు రాజ్యంబునుం బోలె జారచోర హృద్యంబు'— మూఢుని రాజ్యంబునందు జారచోరాదులు విజృంభించుట ప్రసిద్ధ విషయము. కాగా ఇచట నర్తనశాల దుర్గమము, దుర్నిరీక్ష్యము నగుటచే జారచోరులకు అనువై యున్నదని ప్రకటితము. ఇందొక చమత్కారమును గలదు. విరటుఁడు

అసమర్థుఁడగుట వలననే కీచకుఁడు ద్రౌపదిని సభాముఖమున అవమానింపఁ గలిగెను. జారుఁడైన కీచకునకు విరటుని రాజ్యమువలెనే ఈ నర్తనశాలయు ఇంపైనది. వాని ప్రాణములను రహస్యముగా కపటోపాయముతో నపహరింపఁబూనిన భీముఁడు గూడ శృంగారసముఁడు. అతఁడే ఈ నర్తనశాలను సంకేతస్థలముగా నిర్దేశించినవాఁడు. ఇట్లు కీచక భీమసేను లిరువురకును అది హృద్యమైన స్థలముగా నమరినది. నిర్మానుష్యంబు అనునది ఝటితిస్ఫూర్తి ముకాగా వారిరువురకు తగినదనునది వ్యంగ్యార్థము. ఇట్లు కీచకవధ జరిగిన నర్తనశాల తిక్కన ప్రతిభామూలక వర్ణనచే పలు అర్థములచే దుర్గమమని యెంచబడినది. సింహబలుల మల్లయుద్ధము అనభిజ్ఞముగా సాగుటకు ఇట్టిదైన నర్తనశాల ఆవశ్యకము గనుక తిక్కన చక్కగా వర్ణించి, భావించు కొలఁది క్రొత్త యర్థములు స్ఫురించునట్లు అలంకార ధ్వనిని ఆశ్రయించెను. ఇది సార్థకమైన వర్ణన.

## 5. యుద్ధ వర్ణనలు

అష్టాదశ వర్ణనీయాంశములలో యుద్ధ మొకటి. ఈ విషయమై ఆలంకారికులలో నెట్టి యభిప్రాయ భేదమును లేదు. 'అష్టాదశ వర్ణనాత్మకమైనది కావ్యమను లక్షణమును దృష్టియందుంచుకొని ఆంధ్ర కవులందఱును (ఇంచుమించు) యుద్ధమును ప్రసక్తాప్రసక్తముగా తమ గ్రంథములందు వర్ణించిరి. కొన్ని ప్రబంధములందు యుద్ధవర్ణన వర్ణన కొఱకే వర్ణింపఁబడినది. కాని మహాభారతము నందు కురుక్షేత్ర యుద్ధము ఆధారభూతము. ఆ యుద్ధము లేకున్న భారతమే లేదు. కథలో సైతము గర్భసంధి యనఁదగినట్లు ఈ యుద్ధము 5 పర్వముల యనంతరము ప్రారంభింపఁబడి ఐదు పర్వముల పర్యంతము సాగినది. యుద్ధపంచకము తిక్కన రచనలో మిక్కిలి ఉత్సాహభరితముగా సాగినది. ఎచ్చటను విసువు అనునది జనింపకుండ కుతూహలమును రేకెత్తించుచు రచన సాగినది. ఇది అనన్య సులభమైన విషయము. తిక్కనవలె యుద్ధమును దీర్ఘముగా దీప్తిమంతముగ వర్ణించి మెప్పించిన కవి మఱియొకఁడు తెలుఁగున లేఁడు.

ఇచట ప్రస్తుతాంశము విరాటోద్యోగములకే పరిమితముగాన తిక్కన యుద్ధవర్ణనానైపుణ్యమును సమగ్రముగా చర్చింప వలను గాదు. అయినను

ఆ మహాకవి విరాటపర్వమునం దెడనెడ తన యుద్ధవర్ణనాచాతురిని బీజప్రాయముగా నిక్షేపించి యుండుటవలన తిక్కన యుద్ధవర్ణనా విధానమును ఛాయామాత్రముగా దర్శింపఁ నగును.

విరాటపర్వమున నాలుగు సందర్భములందు యుద్ధవర్ణన చేయఁబడి యున్నది. ఉద్యోగపర్వమునందు యుద్ధోద్యోగమే కాని యుద్ధము వర్ణింపఁ బడలేదు.

## భీమ మల్లయుద్ధము

విరాటపర్వము ద్వితీయాశ్వాసారంభమున భీముఁడొక మల్లునితో మల్లయుద్ధముఁజేసి వాని నోడించి రాజుయొక్క ప్రశంసలకు పాత్రుఁడగును. ద్వితీయాశ్వాసాంతమున భీమకీచకుల ద్వంద్వయుద్ధము గలదు. తృతీయాశ్వాసమునందు సుశర్మ దక్షిణ గోగ్రహణము చేయఁగా విరాటుఁడు ధర్మజ భీమ నకుల సహదేవుల సాహాయ్యమున వానిని ఓడించి పశుల గ్రమ్మరించును. అంట విరాట సుశర్మల ద్వంద్వయుద్ధము, ఇరుసైన్యసమూహముల మధ్య పోరాటము వర్ణింపఁబడినవి. వీని యన్నిటికంటె విపులముగా అర్జునునకు, కురువీరులకు మధ్య జరిగిన యుద్ధము ఉత్తరగోగ్రహణ ఘట్టమునందు వర్ణింపఁ బడినది. విరాటపర్వమునందున్న ఈ నాలుగు సందర్భములలో ఉత్తరోత్తరము విపులముగా వర్ణింపఁబడియున్నది.

తిక్కనకు యుద్ధవర్ణనయందు ప్రీతిమెండు. కథలోని యితర సన్నివేశములకంటె మించిన వేడ్కతో యుద్ధమును వర్ణించునను వాడుక కలదు. కాని, ఇది సత్యదూరము. అట్లు అనిపించుటకు భారతకథయే కారణము గాని కేవలము తిక్కన ఆసక్తి కాదు. తిక్కన కథావసరమునుబట్టి యుద్ధమును దాటవేయక, సాధ్యమైనంత సమగ్ర సుందరముగా వర్ణించెను. తిక్కన స్వయముగా యుద్ధములలో పాల్గొనియుండును అను నమ్మకమును కలిగించునట్లు ఆ వర్ణనలు సాగినవి. ఇది సంభవమై యుండవచ్చును. అందుకు కొన్ని చరిత్రాధారములును గలవు. కాకపోయినను అనుభవశాలియైన కవి తన ప్రతిభాచక్షువుచే చూడలేనిది యుండదుగదా! ఏది యెట్లున్నను తిక్కన యుద్ధవర్ణనము ప్రత్యక్షకథనము. తాను చూచినట్లేకాదు మనోనేత్రముతో

చూడఁగలిగినట్లును అనుభూతి కలిగించినాఁడు తిక్కన. ఒక విషయ మును వర్ణించునపుడందలి సూక్ష్మాతిసూక్ష్మవిశేషములను పైలము పరిశీలించి, మేధతో మథించి ఒక సాక్షాత్కారమునంది రచియించుట జరిగినచో అది తిక్కన యుద్ధవర్ణనవలె సమగ్రముగా సంతుష్టిని కలిగించును. ఉత్సాహాభంజ కముగా వర్ణన చేసినచో అట్టిది రసాస్వాదనమున కాటంకమగును. కావ్యము యొక్క అవ్యవధానతను విచ్ఛిన్నముజేసి సమగ్రతను బోగొట్టును. తిక్కన దుస్సాధమైన యుద్ధమును 'రమణీయ భయానకముగా', 'భీషణ భూషణ ముగా' వర్ణించి ఆంధ్రావళిని మోదపఱచెను.

ద్వితీయాశ్వాసారంభమున భీముఁడు మల్లునితో యుద్ధమొనర్చి జయిం చుట కలదు. ఇచట దక్షిణదేశ ప్రతులలో మల్లుని, భీముని ద్వంద్వయుద్ధము విపులముగా వర్ణింపఁబడినట్లున్నది. కాని, భండార్కర్ వారి ప్రతియందు మల్లయుద్ధవిధానము అసలే వర్ణింపబడియుండలేదు.

"తా వుభౌ సుమహోత్సాహౌ వుభౌ తీవ్ర పరాక్రమౌ ।
మత్తావివ మహాకాయౌ వారణౌ షష్టిహాయనౌ ॥ 4.12.20
"చకర్ష దోర్భ్యాముత్పాట్య భీమో మల్లమమిత్రహా ।
వినదంత మభిక్రోశన్ శార్దూల ఇవ వారణమ్ ॥" 4.12.21

ఈ రెండు శ్లోకములలో అరువదేండ్ల వయసుగల మదగజములవలె వారిరువురు పోరిరనియు, తరువాత భీముఁడు మల్లుని శార్దూలము ఏనుగును పట్టి యీడ్చినభంగి యీడ్చెననియు మాత్రమే వర్ణింపఁబడినది. ఉపమానముల సాహాయ్యమున చెప్పుటగాక యథావిధిగా యుద్ధవర్ణన చేయుట మూలమున లేదు. అదియునుంగాక మల్లుఁడు భీమునితో సమానబలము కలిగినవాఁడని చెప్పుట దోషము. ఇచ్చట తిక్కన అమూలకముగా మల్లయుద్ధమున మల్లులు చేయువిధముగా వారి రాకను, భుజాస్ఫాలనముజేసి రంగమునకు మ్రొక్కు టను, 'యుద్ధరంగంబు మన్ను ఫాలప్రదేశంబున ధరియించి శరీరంబులపై జల్లుకొని రెండుచేతుల మునివ్రేళ్ళను గొండొక వుచ్చికొని యొండొరుల దెసకు వైచుటను'. 'ఉన్నతంబులగు నపసవ్యకరంబుల నాకుంచిత సవ్యబాహు తలంబుల నప్పళించు చప్పుళ్ళు గలసి యొక్కరుండ మల్లసఱచిన చందంబున

వీతేర వింత తానకంబుల నిలిచి కదియుటయును (4.2-14) క్రమము దప్పక పేర్కొనెను. ఆ తరువాత మల్లయుద్ధము జరుగునపుడు మల్లులు చూపు వింత మెలకువలను, తత్ఫలితములను ఒక సీసపద్యమునందు వివరముగా వర్ణించెను-

"సీ. ఉపతాలులోఁ దన కోదవిన తోరహ
స్తము సూపి గ్రైవేయక సమదవృత్తిఁ
బాసి క్రమ్మఱఁ జేరు బలువిడి వాఁడు పై
నదరిన జరగక యవనిఁ గ్రుంగి
నిలుచు నొత్తరువున వలచిన యప్పుడు
గొనిపోవు నవలీలఁ గూలవైచు
జళికి పట్టిసమను సన్నపు విన్నాణ
ములు దొరకొన్నను ముట్టఁ గొనఁడు

"తే. కాలదెసఁ జొరవచ్చుట గానిపించి
యడుగు సీసానఁ బట్టియు నుప్పళించుఁ
బోవనిచ్చు మగుడ నేచి పోరఁ జేరు
నెడల సరిసేయనగు తడవీక హత్తు." [4.2.15]

కొంతసేపు భీముఁడు తన మల్లయుద్ధ పాండిత్యమును ప్రదర్శించుచు, వానిని వెంటనే ఓడింపక, కొన్ని మల్లయుద్ధబంధవిశేషములను జూపుచు వానిని అవలీలగా నెత్తిపడవేయుచు, వాని పట్టుదలను దప్పించుకొనుచు యుద్ధము సాగించెనని వర్ణనకలదు. భీముని వంటి సింహబలునకు ఆ మల్లుఁడొక లెక్కలోనివాఁడు గాఁడు-అను వ్యంగ్యము ఇందుగలదు. అట్లని తిక్కన వాచ్యముగాఁ జెప్పలేదు. కాని, ఆ యుద్ధబంధము లన్నింటినిఁజూపి వాని నోడింపక నిలుపుటలోనే వ్యంగ్యము పోషింపఁబడినది. సమానబలముగల వారలైన అట్లు అవకాశము లున్నను ఎదుటివానిని పడవేయక ఊరకొను ప్రసక్తి యుండదు. 'మఱియు ననేకగతుల యోజలు మెఱయుచు కొండొక సేపు విరాటునకు వినోదంబు సలిపి' అనుటలో గూడ ధ్వని యేర్పడుచున్నది.

భీమునకు ఆ మల్లునితో యుద్ధమొక ఆటవంటిది అను భావమిచట పోషింపఁబడి ముందటి పద్యవర్ణనలోఁ గల ధ్వని సంపూర్ణార్థము నొందుచున్నది. ఇచట వేడుకకొఱకే భీముఁడు 'తోరహత్తము', 'సీస'మాదిగాగల మల్లబంధ విశేషములను ప్రదర్శించెననుట ఔచిత్యవంతముగా నున్నది. వలనన ద్వితీయాశ్వాసాంతమున సమానబలముకలవారలగు కీచక భీమసేనుల ద్వంద్వ యుద్ధము విపులతరముగా వర్ణింపఁబడవలసి యుండఁగా ఇచ్చటనే తీవ్ర యుద్ధమును వర్ణించుట సరికాదు. దక్షిణదేశ ప్రతులందు వర్ణింపఁబడిన వారి యుద్ధము తీవ్రమైనదిగానే ఊహింపఁబడినది. తిక్కన చేసిన వర్ణనవలె అందు మల్లయుద్ధ రీతులు వర్ణింపఁబడలేదు. వర్ణన ఎంత క్లుప్తముగాఁ జేసినను అందు ప్రారంభము. వర్ణనము, ముగింపు అను క్రమములోఁ జేయుట తిక్కన పద్ధతి. ఇచట వారి రంగప్రవేశము, పిమ్మట యుద్ధవర్ణనము, 'అనేక గతుల యోజలు మెఱయుచు' అని సమీక్ష, చిట్టచివర వానినెత్తి పడద్రోచి విఱచుట వర్ణింపఁబడినది. ఇది సమగ్రముగా నున్నది.

"ఆ. కచ్చ యమరఁ బట్టి కాళ్లును జేతులు
ప్రేల మత్తగజములీల మెఱయ
ముష్టి బలువు నెఱయ ముక్కున వాతను
నెత్తురొలుక మల్లు నెత్తివైచె." [4.2.17]

వ. ఇవ్విధంబున విసరి నేలతోఁ ద్రోసి వీపున మండివెట్టిన. (4.2.18)

క. వెలుకుటి తాళం బీమదిఁ
దలఁచి యనువుగాక ధరణితలము గరతలం
బుల నప్పళించె వాఁడ
క్కొలువార్వఁగ విఱిచి మెఱసెఁ గుంతీసుతుఁడున్" [4.2.13]

ఇచట తాళము అను మల్లబంధ విశేషమును తిక్కన మఱలఁ బేర్కొనెను ఇట్లు పేర్కొనుటవలన ఆ వర్ణనయందు సహజత్వము దోచుచున్నది.

మూలమునందు మల్లుని వధించినట్లుండ తిక్కన వానిని విడిచి వుచ్చెనని మార్చెను. ఇది భీముని ఉదాత్తతను, ఔచిత్యమును పోషించుటకుగా చేసిన మార్పు. ఓడినవాఁడు మన్ను ముట్టుట, గడ్డి కొఱుకుట మొదలగు చర్యలతో తన యోటమిని ఒప్పుకొనుట నాటి పద్ధతి. ఇచట అది పేర్కొనఁబడినది. తన ఓటమిని అంగీకరించిన శత్రువునైనను క్షమించి విడిచిపుచ్చుట యుత్తమవీరుని ప్రధాన లక్షణము. ఇచట మల్లుఁడు భీమునకు శత్రువుకూడ కాఁడు. రాజును మెప్పించుటకు చేసిన యుద్ధము మాత్రమే అది. ఇట్లు వానిని క్షమించుటను తిక్కన పేర్కొనుటలో నొక ప్రయోజనము గలదు. ద్వితీయాశ్వాసము నందు భీముఁడు నాయకుఁడు. కీచకుఁడు ప్రతినాయకుఁడు. మల్లుని జయించుట భావికథాసూచన యగుచున్నది. కీచకుని జంపిన పిమ్మట ద్రౌపది భీముని యుత్తమ నాయకత్వమును గొనియాడును. ఉత్తమ నాయకుని ప్రధాన లక్షణములలో ఔదార్యము ముఖ్యమైనది. కనుకనే ఈ సందర్భములో తిక్కన భీముని యందుత్తమ నాయకత్వ లక్షణమగు క్షమను పోషించెను. అమూలకమగు నీ మార్పు తిక్కన రసదృష్టిని, పరిశీలనా పాటవమును పట్టిచూపుచున్నది.

## భీమ కీచక ద్వంద్వయుద్ధము

మల్లునితో భీమసేనుని యుద్ధము ఒక క్రీడవంటిది. కాఁగా భీమ కీచకుల యుద్ధము సమానస్కంధులగు సింహబలుల మధ్య జరిగిన పోరు. మల్లునిపై భీమునకు శత్రుభావమే లేదు. అల్పునిపై తన పరాక్రమమునంతటిని ప్రదర్శించు నవసరము భీమునకు కలుగలేదు. కాని, ఇచట వారిరువురి మధ్య పరమ శత్రుత్వము గలదు. తన సతినిఁ గామించిన కీచకుని, కాలదన్నిన సింహబలుని, సల్లాపములాడిన దుర్విదగ్ధునిపై భీమునకు అమిత ద్వేషభావమేర్పడినది. భీముఁడు గంధర్వుఁడను భావమువలని భయము, తాను పైరంధ్రిచే మోసగింపఁబడెనను క్రోధము కీచకునిఁగూడ క్రోధావిష్టునిగాఁ జేసినది. అది ప్రాణాంతకమైన పోరు బల పరాక్రమ సంపన్నులగు వారి మధ్య జరిగిన యుద్ధము తీవ్రతరమైనది. కథలో నద్దాని ప్రాధాన్యమును తక్కువ గాదు. అటుపిమ్మట రారాజు ఉద్దేశించిన దక్షిణ, ఉత్తర గోగ్రహణములకీ కీచకుని మరణమే కారణభూతము. కనుకనే ఇద్దానిని తిక్కన మల్లునితోఁ

జేసిన యుద్ధమునకంటె తీవ్రతరముగా, విపులముగా వర్ణించెను. ఇందు సింహబలునిచే భీముఁడు సమానముగా బాధింపఁబడినట్లు వర్ణించెను. యుద్ధమును గూడ కీచకుని తోడనే ప్రారంభింపఁజేసినాఁడు తిక్కన.

"చ. పవనతనూజు బాహువులు పాణియుగంబునఁబట్టి పీకమై
నవని పయింబడం దిగిచి యంగము జానుల నూఁదినం గడున్
జవమున దండతాడిత భుజంగము భంగి సముత్థితాంగుడై
యవయవముల్ ప్రకోప రభసాతిశయంబునఁ బొంగ నుద్ధతిన్."
[1.2.342]

ప్రతినాయకునిచే ప్రేరేపింపఁబడిన నాయకుని వర్ణన ఇందుఁ జేయఁబడినది. భీముని 'కోపాటోపదీప్తాంగుఁడై' అని మున్నే వర్ణించెను. అయినను అప్పటి భీముని రూపము స్పష్టముగా భావింపఁబడుటకు వీలులేదు. ఇచట అలంకారయుక్తముగాఁ జెప్పఁదలఁచి 'కడున్ జవమున దండతాడిత భుజంగము భంగి సముత్థితాంగుఁడై' అని వర్ణించెను, ఈ ఉపమానము చక్కగా నతికినది. పగఁబూనిన పావని పగతుని భంజింపక విడువఁడు. సాధారణముగా నొకవీరుని సింహ, వ్యాఘ్ర, మత్తేభములతో పోల్చుట జరుగుచుండును. ఇచట తిక్కన భుజంగముతోఁ బోల్చుట ప్రత్యేకము. 'పగఁబూనుట' అను సమానధర్మము ఇచట నుండుటచే నీ పోలిక ఇతరములకంటె మేల్తరము. తొలుత కోపాటోపదీప్తాంగుఁడైన భీముఁడు కీచకునిచే క్రిందఁ బడుటవలన మఱింత రోషావేశమునంది 'ప్రకోపరభసాతిశయంబున అవయవముల్ బొంగ నుద్ధతిన్' పోరుసలిపినాఁడని తిక్కన వర్ణించెను. భీమసేనుని 'పవనతనూజుఁ' డనుట సార్థకమగు నామప్రయోగము. భుజంగముకూడ వాయువుపై నాధారపడి జీవించునట్టిది. సామ్యమునకిది చక్కని కారణము.

తరువాతి పద్యమున కీచకుఁడు 'బలోన్మాదంబున'ను, భీముఁడు 'బాహుగర్వగరిష్ఠుండు'గాను పోరు సలిపిరనియు 'ఇద్దఱున్ భుజబలాటోపంబుమై నొండొరున్ మిగులంజాలక కొంతసేపు వడి మేమేఁబోరి రుగ్రాకృతిన్' అనియు వర్ణించి, భీముని 'హిడింబరిపు'నిగాఁ బేర్కొనుట సార్థకము. శత్రునిబర్హణ సామర్థ్య మందు వ్యంగ్యము. తదుపరి 'కీచకాంతకా'

అని శ్రీకృష్ణునిచే (ఉద్యోగపర్వమున) సంబోధింపఁబడుట సాభిప్రాయము. హిడింబునివలె కీచకుఁడు తామస ప్రకృతి గలవాఁడు - అట్టి వారికి భీముఁడు అంతకుఁడైనాఁడు అను స్ఫురణ పాఠకులకు వెంటనే కలుగును. ఒండొరున్ 'మిగులం జాలక' పోవుట ఇచట పేర్కొనఁబడినది. ఇది ప్రముఖమైన అంశము. భీముఁడు మల్లునివలె కీచకుని జయించెనని చెప్పినచో అసహజత్వ మేర్పడును. అట్లుగాక కొంతసేపు ఒకరి నొకరు మించఁజాలక పోయిరని వర్ణించుట సహజత్వమునకు దగ్గఱలో నున్నది. ఇది తిక్కన శిల్పములో నగు పడు ప్రత్యేకాంశము. కీచక భీమసేనుల ద్వంద్వయుద్ధము కథలో ప్రముఖ మైనది. ఇద్దానిని తిక్కన కడుంగడు సమర్థవంతముగా రచించెను. మూలము నందు వారిరువురు విజృంభించి నరసింహములవలె, మత్త గజములనుఁబోలె యుద్ధముచేసిరని కలదు[12]. సింహబలుల ఈ యుద్ధము మఱింత ప్రముఖముగా వర్ణింపఁబడుట యుక్తము. తిక్కన మల్లయుద్ధరీతులు తెలిసినవాఁడై తద్భేద ములను పట్టులను వర్ణించినాఁడు. మల్లుని విషయమునందువలె ఇచటను యుద్ధ గతులను సీసమునందే పేర్కొనెను. ఇట్టి వర్ణనకు సీసము అనుకూలమైనదని తిక్కన సీసపద్యములనే వర్ణనలకు గైకొనెను. సీస నామౌచిత్యము, దాని వైపుల్యము యుద్ధ వర్ణనలకు తిక్కనను ప్రేరేపించి యుండును.

"సీ. తిగిచిన నడుగులు తెరలక యొండొరుఁ
  గ్రమ్మఱఁ దిగుచుచుఁ గడిమి మెఱసి
బొడిచిన వెస బీఱువోవక యొండొరు
  నందంద పొడుచుచు నవనిఁ బెట్టి
యెత్తిన బెగ్గలం బొందక యొండొరు
  బలువిడి నొత్తుచు నలవు మిగిలి
యడఁగంగఁబొదివిన నడిచిపాటించుక
  యును లేక వీఁక నొండొరుల నడరి

తే. యడఁగ బొదువుచు నలుక యంతంత కగ్గ
లించి యాయముల్ నొంచి దోర్లీల నెఱపి
యుల్లసిల్లిన స్రుక్కకొండొరుల రౌద్ర
వృత్తి నొంచు చొండొరులకు వెక్కసముగ." (4.2 347)

పై సీసపద్యమునందు కీచక భీమసేనులు సమానబలము గలవారుగా తిక్కన వర్ణించెను. ఇందు రచనయు సమాసభరితముకాక ఎచటికచట విరిగి, వారి యడుగుల త్రిప్పటను సూచించుచున్నట్లున్నది. అటునిటు తిరిగి ఒకరి నొకరు పట్టి త్రోచికొని ఒకరినొకరు నొప్పించుకొని పలురకముల పదవిన్యాసములతో పోరుసలిపిరని అవగతము జేయుటకు ఈ తునియలగు పదముల కూర్పు తోడ్పడుచున్నది. తెలుఁగుబాస శృంగార, వీర, యుద్ధముల వర్ణనల కనుకూలమైనదను భావమును తొలుత స్థాపించినవాడు తిక్కన. ఇందు వారి యుద్ధమువలన రౌద్రరసస్ఫూర్తి కగుచున్నది. ఒక్క పద్యమునందు సమగ్రముగా నొప్పుచున్నదీ మల్లయుద్ధవర్ణనము. మూలమున అచ్చటచ్చటగానున్న వర్ణనచ్ఛాయలను తిక్కన ఒక్కచోజేర్చి విపులముగా రచించెను. మల్లయుద్ధ పద్ధతులను మూలమునకంటె తిక్కన మిన్నగా రచించి సహజత్వమును సాధించెను ఒక సీసము, మూడు వృత్తములు, రెండు కందములు యుద్ధవర్ణనకై వెచ్చింపఁబడినవి.

"క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు
నదలుచుచుం బడుచు లేచు చడఁగుచు వడిగోం
చొదవెడు కినుకం గడు బె
ట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్." (4.2 348)

ఈ కందమునందు అటునిటు నులుకుచు యుద్ధముచేయు మల్లురు సహజరీతిలో వర్ణింపఁబడిరి. చూచినట్లు వర్ణించునేర్పు తిక్కన సొమ్ము.

కీచక భీమసేనులు యుద్దముచేయునపుడు వారి సింహనాదములతో నర్తనశాల కంపించినదని మూలమున కలదు.

"తత స్తద్భవనశ్రేష్ఠం ప్రాకంపత ముహుర్ముహుః।
బలవచ్చాపి సంక్రుద్ధావన్యోన్యం తావగర్జతామ్॥" (4.21.53)

కొన్ని దక్షిణదేశ ప్రతులలో వారిరువురి గర్జనలుకూడ వర్ణింపఁబడినవి. ఈ మూలప్రతులను బట్టియే పలువురు విమర్శకులు అట్లు గర్జనలు వర్ణింపఁబడుట సరికాదనియు, తిక్కన వారు నిశ్శబ్దముగా పోరిరని చెప్పుట ఔచిత్యశోభిత మనియు భావించిరి. మూలమును నిర్ధారింపలేనపుడు ఏ ఒక్కప్రతినో

ఆధారముగాఁ జేసికొని సంస్కృత భారతమునకు అనౌచిత్యదోషము నాపా దింపరాదు. భండార్కర్ వారి ప్రతిలో పై ఒక్క శ్లోకమే వారి గర్జనలకు నర్తనశాల ప్రకంపించినదను నర్థములోఁగలదు. దక్షిణదేశ ప్రతులలో వారి సింహనాదములుగాక పరస్పరము బాహువుల నొఱచుకొనుటవలన వెదుళ్ళు పగిలినప్పుడు గల్గు చప్పుడువంటి చప్పుడు గలిగెననియు, పగిలిన తప్పెటవలె కీచుగొంతుకతో కీచకుఁడు బిగ్గఱగా నఱచుచుండెననియు రెండు శ్లోకములు గలవు[13]. భండార్కర్ ప్రతిలో నివి లేవు.

"తయోర్భుజ వినిష్పేషా దుభయోర్బలినోస్తదా ।
శబ్దస్సమభవద్ఘోరో వేణుస్ఫోటసమో యుధి॥"
"నదంతంచ మహానాదం భిన్న భేరీసమస్వనమ్ ।
భ్రామయామాస సుచిరం విస్ఫురంతమచేతసమ్॥"

తిక్కన మూలమునందున్నను, లేకున్నను ఆ సింహనాదములనుగూర్చి కాని, నర్తనశాల ప్రకంపములను గూర్చికాని ప్రస్తావింపలేదు సరిగదా, నిశ్శబ్దముగా యుద్ధమొనర్చిరని తెలిపి, అట్లు చేయుటకుఁగల కారణములను వివరించెను. విమర్శకాగ్రేసరుల మన్ననలను బడసినదీపద్యమే. తిక్కన ఔచిత్య దృష్టికిది పరాకాష్ఠగా నెంచఁబడినది.

"క. తన యగవాటొరు లెఱుఁగుదు
రని సూతుఁడు సమయభంగమగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే
యని గూఢ విమర్దన ప్రహారములఁ దగన్" (4-2-345)

ఇటీవల మఱియొక విమర్శ యుందు వినఁబడుచున్నది. అది యేమన నర్తనశాలలో నెయ్యది జరిగినను రాత్రియందు ఎఱుఁగఁబడదను నమ్మకము తోనే భీమసేనుఁ డద్దానిని సంకేతస్థలముగా నిర్ణయించినాఁడు. అట్లుండియు తిక్కన నర్తనశాల ముఖభాగస్థలంబును అలంకారబంధురముగా నొక వచనము నందును (వ. 325) మఱియొక శార్దూల (ప. 327) వృత్తమునందును మఱిమఱి వర్ణించి, అది దుర్గమమని నిర్ధారణ చేసినాఁడు. ఆ వర్ణనయు అమూలకమే. అట్లయ్యును మఱల నిచట నిశ్శబ్దసంగ్రామమని పేర్కొనుట

అనవసరము. ఇందు అనౌచిత్యమును గలదు. అది ఎట్లన - ప్రాణాంతకమగు ముష్టిఘాతములకోర్చియుండుట సింహబలురకైనను సాధ్యమా యను శంక కలిగించుచున్నది తిక్కన పద్యము - ఇది ఈ విమర్శ స్వరూపము.

ముఖ్యముగా నిట గమనింపవలసినది పద్యగతాంతరార్థము. అది తేట పడినచో ఈ విమర్శ పరాస్తమగును. తన యగపాటొరు లెఱుగుదురని సూతుఁడు. ఇచట సూతుఁడు లజ్జావిహీనుఁడు గనుకనే ద్రౌపదిని సభాంగణము దనుక వెన్నంటి కాలితో తన్నినాఁడు. అట్టివానికి బరులగూర్చిన శంకయే యుండదని యనవచ్చును. అది వేరు. సభాంతరమునకు సైరంధ్రిని దఱిమి విరటుని ముందఱ దర్పమును ప్రదర్శించుట కీచకుని సహజగుణము. అతఁడు 'బలగర్వితుఁడు', ఆ సభలో ఒక్కరైనను తనను వారింపలేరని సైరంధ్రికి తెలియఁజేయుటయే ఆతని యభీష్టము. తన కోరికమేరకు ప్రవర్తించినాఁ డచట. ఇది భిన్నసన్నివేశము. సైరంధ్రి కోరగా సాధారణ పురుషునివలె - అర్ధరాత్రమున నర్తనశాలకు పరిచారికామాత్రయైన తన్వికొరకు - సింహబలుఁడైన కీచకుఁడు జారునివలె వచ్చుట ఆతని గర్వోన్నతికి గొడ్డలి పెట్టువంటిది. అతఁడంతకాలము కోరిన స్త్రీని తనకాళ్ళవద్దకు రప్పించుకొనఁ జాలిన దర్పోద్ధతుఁడు. అట్టివాఁడు నేడొక సైరంధ్రి మాటను జవదాటలేక ఆమెపరతుల నంగీకరించి వచ్చుటనఁగా ఆతని గర్వము సర్వము ద్రౌపది సౌందర్యముపట్ల గల కోరికముందు అవనతమైనదన్న మాట. అతఁడొక భీరువువలె వచ్చినట్లు ఇతరులు ఎఱింగినచో కీచకుఁడు భరింపలేడు. దుర్విదగ్ధుఁడైన ఆతఁడు తన ఈ చర్యను రహస్యముగానే ఉంచఁదలఁచుట స్పష్టము. ద్రౌపది కోరిక నంగీకరించుటయే ఇందుకు ప్రమాణము. బలోన్నతితో నామెను జయింపలేని కీచకుఁడు నాఁడే ఓడినవాఁడైనాఁడు. సభలో సైరంధ్రిని కాల దన్నిన కీచకుఁడు బిడియము లేనివాఁడు కాగా నర్తనశాలకేతెంచిన సూతుఁడు కామాతురతతో విచక్షణను కోల్పోయిన మూఢుఁడు. అదియునుంగాక ద్రౌపది వచనములను నమ్మి ముందువెనుకలు చూచుకొనక ఏతెంచినవాఁడు కీచకుఁడు. నర్తనశాల బయట ఎవరైనను ఉండవచ్చునను శంకతో, తన ఈ నగుబాటు బట్టబయలు కాకుండుటకై కీచకుఁడు ముష్టిఘాతమును ఓర్చుకొనెను. ఎట్టివాఁడైనను పోరాటము సలుపునపుడు మొండిధైర్యముతో ఎదుటివాని నెదిరించును గాని తనకు తాకిన దెబ్బలకు బాధపడుచు కూర్చుం

డడు. ఇంక సింహబలుఁడే అయినచో వానికి బలపరాక్రమములతో పాటు ఎదుటి వీరుని చావుదెబ్బలను స్థైర్యముతో నోర్వఁజాలిన ఓర్పుకూడ నుండును. మూలమునందైనను సింహగర్జనలు గలవుగాని బాధతో మూలుగుట యని లేదుగదా!

ఇక భీముని విషయమన్నచో కీచకునికంటె నత్యంతము జాగరూకతతో మెలఁగవలసిన పరిస్థితి యాతనిది. ద్రౌపది తన పరిభవమును భీమునకు విన్నవించుకొనఁగా నాతఁడు కీచకుని చంపుదునని ప్రతినఁబూనెను. అట్టియెడ ఆతని ఆగ్రహావేశములను గాంచిన ద్రౌపది సమయభంగమునకు జంకి ఆతనిని శాంతపఱచుచు 'వంచన బాహిరపోవక యుండంగ మన రిపుం బరిమార్పంగా వచ్చునేని నట్టిద నావల పటుగాక తక్కినను వలదు సుమీ' అని పలుకును. ఆ ద్దానికి భీముండంగీకరించి 'నేదలచి యోపినభంగి నిగూఢవృత్తిమైఁ బదిలము గతిన్నని యుపాయమునం దెగఁజూతు నాతనిన్' అనినాఁడు. ప్రాణాంతకము లగు ప్రహారములకంటె సమయభంగము ఓర్వరానిదగుటచే నాతఁడు గూఢ విమర్దన ప్రహారములందు ప్రవర్తించెను.

కీచక భీమసేనుల అవసరములు వారిచే నిశ్శబ్దయుద్ధమును చేయించినవి. తేలుకుట్టిన దొంగ మిన్నకుండుట లోకవిదితము. యుద్ధములందు క్షతగాత్రులైన సైనికులు ఎదురనున్న శత్రువులను జంపు నుత్సాహములో తమ బాధను మరిచిపోవుదురనుటయు ప్రసిద్ధమే. సింహబలులు ఆరితేరిన మల్ల యుద్ధ నిపుణులు. వారికి అట్టి ప్రహారములు పూర్వానుభవసిద్ధము అగుటచే ఓర్చుకొనఁజాలరనుమాట నిలువఁజాలదు. అదియునుగాక నర్తనశాల రాత్రులందు నిశ్శబ్దముగా నుండుట సాధారణ ధర్మమై యుండును. కావలివారు మాత్రము కొంతదవ్వులో నుండి యుండిరని అనంతరకథద్వారా చెప్పఁబడినది. కాగా ఆ కావలివారు శబ్దమాత్రమున వత్తురను శంక యుండును గదా! తిక్కన అనౌచిత్యమునకు పాల్పడినాఁడను విమర్శ సరికాదని పై చర్చల ఫలితార్థము. ఆ పద్యము ఔచితీప్రపంచమున మణిపూసవంటిది. ప్రకాశమానమగు నద్దానినిఁ గుశంకలతో చూడఁజాలక పోవుట బాధాకరము.

## దక్షిణ గోగ్రహణము

భీమసేన కీచకులమధ్య జరిగినది రహస్యయుద్ధము కాఁగా దక్షిణ గోగ్రహణ సందర్భమున విరాట సుశర్మల యుద్ధము బాహాటముగా జరిగినది.

సైన్యసమేతులగు ఇరువురు రాజులకు జరిగిన యుద్ధమిది. ఇందు సంకుల సమరములు, ద్వంద్వయుద్ధములు కూడ వర్ణింపఁబడినవి. యుద్ధవర్ణనలందు తిక్కన మూలానుసరణముగానే రచన చేసెను గాని యుద్ధభూమిని, ఆయా వీరులను వర్ణించుపట్ల మూలముకంటె భిన్నముగా వర్ణించెను. భావయుక్తములుగా నుండుటవలన తిక్కన యుద్ధవర్ణనలు తెలుఁగు సాహిత్యమునందే ప్రత్యేక స్థానము నందినవి. తిక్కనతరువాతి కవులందఱు ఆతని ననుసరించిరేకాని ఆ స్థాయిని మాత్రము మించరైరి. శృంగారవర్ణనలను తిక్కనకన్న మిన్నగ శ్రీనాథాదులు వర్ణింపఁగలిగిరి కాని యుద్ధవర్ణనలో వీరరసపోషణలో తిక్కనను అందుకొనలేకపోయిరి. యుద్ధరంగము తిక్కనకు రమణీయ భయానకముగా కన్పట్టినది. ఆతని యుద్ధవర్ణన మనకు రమణీయ రూపకల్పనగాఁ దోచును.

విరటుని యుద్ధోద్యోగమును తిక్కన మూలమునందున్న దానికంటె విపులీకరించెను. 'యుద్ధవర్ణనలన్న తిక్కనకు మక్కువ ఎక్కువ' అను ప్రశస్తి కిట్టి విపుల వర్ణనలే కారణములు. గవాధ్యక్షులువచ్చి గోహరణమును విన్నవించినపుడు విరటుని హావభావములను తిక్కన పేర్కొనెను. రాజగువాని కిట్టి సంరంభము సహజము. క్షత్రియుఁ డెవ్వఁడైనను తన ధనమపహరింపఁబడుటను విని నిమ్మకు నీరెత్తి నట్లుండఁడు. అందుచే ఈ వర్ణన ఇచట ఆవశ్యకము. ఇది తిక్కన చేయఁబోవు యుద్ధవర్ణనకు నాంది వంటిది. విరటుఁడు సుశర్మతో మున్ముందు చేయఁబోవు యుద్ధమునకు ఈ యుత్సాహామే హేతుభూతము.

"శా ఏమీ నిక్కమె ముక్కుఱుంగఁడె త్రిగర్తేశుండు మద్గోధన
స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే మేలు మే
లామై తోడనె పోవుఁగాక యని వీరాలాపముల్ వల్కి యు
ద్దామ క్రోధ శిఖా కలాప వికటోద్యద్భ్రూకుటీస్ఫూర్తియై"
(4 3.140)

వీరాలాపములాడుట యుద్ధవర్ణనకు ప్రారంభము. వీరుని మూర్తిని వర్ణించుట ద్వితీయ సోపానము. ఇచట విరటుని "ఉద్దామ క్రోధ శిఖాకలాప వికటోద్యద్భ్రుకుటీస్ఫూర్తియై" అని వర్ణించుట వీరరస పోషణ కనువుగా

నున్నది. క్రోధము మున్నే కలదు. అది ఉద్దామక్రోధమైన దివుడు. అది అగ్నివంటిది. తచ్ఛిఖాకలాపమువలె నున్నది భయంకరమైన ఆతని బొమముడి. ఆతని కోపముయొక్క తీవ్రత భ్రూకుటిలోనే తెలియునట్లు అగ్నిశిఖాకలాపముతో నద్దానిని బోల్చెను.

గవాధ్యక్షులు గోగ్రహణమును గూర్చి విన్నవింపఁగా విరటుని పంచలత మూలమున వర్ణింపఁబడలేదు.

> "తచ్ఛ్రుత్వా నృపతిస్సేనాం మత్స్యానాం సమయోజయత్ ।
> రథనాగాశ్వకలితాం పత్తిధ్వజసమాకులామ్ ॥" (4.30 8)

ఈ శ్లోకమునందలి 'సమయోజయత్' అను నర్థమును విపులీకరించి క్రింది (ప. 141) పద్యమును రచించినాఁడు తిక్కన. అటులనే 'రథనాగాశ్వకలితాం పత్తిధ్వజ సమాకులామ్' అను శ్లోకభాగమునే విపులార్థ బోధకముగా వీరరస పోషకముగా వర్ణించినాఁడు. మఱియొక వృత్తములో —

> "శా. యానప్రక్రమ సూచకంబులగు తూర్యంబుల్ దిశాపాటన
> ధ్వాన స్వైరవిహార కల్పిత సముద్ర క్షోభముల్గా ధరి
> త్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్ర వ
> ర్మౌ నీతిక్రమ దక్షులం బనిచె నయ్యై వారికిం గ్రక్కునన్."
> (4.3.143)

యుద్ధ సన్నాహమును దెలుపునట్టి వాద్యములు దిశలను పగులగొట్టి సముద్రములను కల్లోలపఱచినవి అని వర్ణింపఁబడెను. యుద్ధ సన్నాహమున భేరీనినాదములు ప్రథమముగా చెలరేగును. యుద్ధవర్ణన యందిది తృతీయ ఘట్టము. ఆయా సైనికులకు అస్త్రశస్త్ర కవచాదులను తెప్పించి యిచ్చుట తదనంతరము వర్ణింపఁబడినది. 'గ్రక్కునన్' అను పదమిందు గమనింపఁదగినది. ఈ పనులన్నియు వెంటవెంటనే జరిగినవని సూచన యిది.

సారథిని జూచి ఆయత్తము గమ్మని పలికి అతని 'వీరవచో విలాపములు' విందుమని రాజుచేఁ బలికించుట అమూలకము. మున్ముందు ఉత్తర

గోగ్రహణ ఘట్టమున సారథికై వెదకుట, బృహన్నల రాక, ఉత్తరుఁడే చివ రకు సారథ్యము నెఱపుట జరుగును. ఇచట గూడ సారథికి తగిన ప్రాముఖ్యము నిచ్చుట జరిగినది. సారథి సమర్థుఁడుగాకున్న యోధుఁడు విజృంభింప లేఁడని విరటునిచే కవి పలికించుట భావికథార్థ సూచకము. కురుక్షేత్ర యుద్ధమునందును అర్జున విజయమునకు, కర్ణుని పరాజయమునకు కృష్ణ, శల్య సారథ్యములు హేతుభూతములుగా భావింపఁబడును. సారథియైనవానికి 'వీరవచో విలాసములు' ప్రథమ లక్షణము గావలెనని చెప్పుటకే తిక్కన యిద్దానిని అమూలకముగా కూర్చెను.

విరాటుఁడు 'యోధవీరోచిత ప్రకారంబున సింగారంబు సత్వరం బుగాఁ జేసికొను'ట కూడ తిక్కన కల్పనయే. యుద్ధ సన్నాహము నంతయు క్రమము దప్పక వర్ణించెననుట ఇట ముఖ్యము. విరటుని కవచము 'ఖచిత కాంచన బిందు సందోహము'. 'విరచితాలంకార చక్రంబును, బద్ధపరికరకూబ రాక్ష యుగాద్యవయవంబును, ప్రకల్పిత తురంగంబును, సన్నివేశిత వివిధా యుధంబును, సన్నద్ధ సారథికంబును నైన రథము'ను విరాటుఁ డధిరోహించె చెనని వర్ణింపఁబడుట సముచితముగా నున్నది. యుద్ధ పరికరములు, రథికుఁడు, సారథి, రథము — అన్నియు వర్ణింపఁబడుటచే నీ వర్ణనయందు సమగ్రత సిద్ధించినది.

మూలమునందును విరటుని తమ్ములైన శతానీకుఁడు, మదిరాక్షుఁడు, సూర్యదత్తుఁడు, అగ్రనందనుఁడైన శంఖుఁడు యుద్ధసన్నద్ధులై యేగుదెంచి రని కలదు. అచట ఒక్కొక్క శ్లోకములో నున్నదానిని తిక్కన ఒక్కొక్క వృత్తమునందు వివరించెను. ఈ వివరణలన్నియు ఉత్సాహభరితముగా యుద్ధ సన్నాహము జరిగినదని చెప్పుటకే. వీరి వర్ణనయు సమగ్ర సుందరముగా నున్నది తిక్కన రచన యందు. శతానీకుఁడు 'సువ్యూఢ ప్రౌఢ్యముండై' 'అఖిలానీకంబు లుప్పొంగఁ'గా నేతెంచెను. మదిరాక్షుఁడు 'సముజ్జ్వల హేమ వర్మ నిర్మ్యాత రుచిచ్ఛటాపటల రంజిత హేతిమహోగ్ర సైన్యుండై' అరుదెంచెను. సూర్యదత్తుడు సంరంభముతో 'సమద సైనిక నానా స్త్రశస్త్ర బహుళదీప్తిజాలక ప్రతిహత దినకరాంశురాజియై' నేగుదెంచెను. శంఖుఁడు 'వైరిమదాపహ విక్రమప్రకారోల్లసితుఁడు', అతడు 'వన్యబలము ద్ధతిఁ గొల్వ మృగేంద్రరేఖ శోభిల్లుచునుండ' 'విభీషణ శంఖ నినాద మొప్పగా' జనుదెంచె

నట. ఈ వర్ణనలు దీర్ఘ సమాస యుతములై, ఓజోగుణ భరితములై యుద్ధోత్సాహమునకు తగినరీతిలో సాగినవి. శతానీకుని వర్ణించుచు మూలమునం దొక శ్లోకము గలదు.

"స వజ్రకాయ సగర్భంతు కవచం తప్తకాంచనమ్ ।
విరాటస్య ప్రియోభ్రాతా శతానీకో౽ భ్యహారయత్ ॥"
(4.30.10)

ఈ ఒక్క శ్లోకమునందైనను శతానీకుని విజృంభణోల్లాస మేమియును లేదు. కవచము మాత్రము వర్ణింపఁబడినది. తిక్కన ఈ శ్లోకమునకు బదులు ఒక వృత్తమును గ్రహించి శతానీకుని వీరవైభవోన్నతిని వర్ణించెను.

"శా. లోకస్తుత్య విభూతి నన్యపృతనా లుంటాక బాహాబల
శ్రీకల్మిన్ రథదంతి ఘోటక భటశ్రేణీ సముద్భ్రాంత సే
నా కల్పధ్వజ విభ్రమంబున సుహృద్యప్రోద్యముండై శతా
నీకుండుద్ధతి నేగుదెంచె నఖిలానీకంబు లుప్పొంగఁగన్."
(4.3.146)

'అన్యపృతనా లుంటాక బాహాబల శ్రీకల్మిన్' అను సమాసము మిక్కిలి అర్థవంతమై యుద్ధోత్సాహమును సూచించుచున్నది, 'రథదంతి భటశ్రేణీ సముద్భ్రాంత సేనాకల్పధ్వజ విభ్రమము', 'లోకస్తుత్య విభూతి' అతనిని యుద్ధోన్ముఖుని కావించిన యంశములు. వీనిచే నుప్పొంగిన అంతరంగము గల శతానీకుఁడు ఉద్ధతితో నరుదెంచెను. ఈ వర్ణన ఒక మహావీరుని ప్రత్యక్షపఱచుచున్నది మన యెదుట.

ఇదే విధముగ మూలమునం దాయా వీరుల కవచములు వర్ణింపఁబడగా తిక్కన వారివారి యుద్ధోత్సాహమును వర్ణించెను. యుద్ధమునకు కవచమున కంటె యోధునిఉత్సాహము ముఖ్యము. కవచములు కనకమయములు, రత్న ఖచితములు, చిత్రవిచిత్ర శిల్పవిలసితములు, సౌగంధ కమలశత విచిత్రాలంకృతములు. అభేద్యములు అయినవని మూలమున వర్ణింపఁబడినవి. ఇందు స్వారస్యములేదు. వీరరస పోషకమగు ఓజోగుణ మిందులేదు. వీరరసమునకు స్థాయిభావమగు 'ఉత్సాహ'మసలే పేర్కొనఁబడలేదు. విభావానుభావములగు వారి

యుద్ధతి, శంఖనాదములు, భేరీనినాదములు చెప్పఁబడలేదు. తిక్కన వీరరస పోషణను లక్ష్యముగా నుంచుకొని ఇచట విరాట, శతానీకాదుల యందుత్సాహమును వర్ణించెను.

మూలమున నున్న కథనము నిచట తిక్కన కొంచెము అన్యథాకరించెను. సంస్కృత భారతమున అన్ని ప్రతులయందును విరటుఁడు స్వయముగా పాండవులను యుద్ధ సన్నద్ధులుగాఁజేసి ఆయుధములఁ దెప్పించి యిచ్చినట్లు కలదు.[14] తిక్కన రచనలో ధర్మరాజు విరటుని చెంతఁజేరి తన కొక ఋషివలన ఆయుధప్రయోగము తెలియుననియు, రాజు స్వయముగా యుద్ధమున కేగుచుండ తానూరక ఇంటనుణ్కి పాడిగాదనియు నచ్చజెప్పి తనతోపాటు వలల. దామగ్రంథి, తంత్రీపాలురును యుద్ధనిపుణులని పలికి యుద్ధ పరికరములను దెప్పింపఁ గోరినట్లు కలదు. ఈ భేదమును పర్యాలోచించుచో తిక్కన చేసిన మార్పు సహజముగా నున్నదనిపించును. ఏలన వేషధారులైన ధర్మజాదులు యుద్ధము చేయఁగల వీరులని విరాటుఁడెట్లు తలంపఁగలఁడు? అట్లు తలఁచినాఁడనినచో పాండవుల వేషధారణ సమగ్రముగా లేదను విపర్యయ మేర్పడును. అట్లుగాక అజ్ఞాతవాస పరిసమాప్తి యగుటను భావించుకొని యుద్ధోత్సాహముతో తమను ఆదరించిన రాజును రక్షించు నుద్దేశ్యముతో ధర్మజుఁడే స్వయముగా యుద్ధ సన్నద్ధుఁడాయెననినచో అది అతని యుత్సాహమును పోషించునదిగా నున్నది. పాండవులకు బలవంతపు ప్రాముఖ్యమువలె మూలమున యుద్ధము దాపురింపఁగా తెలుఁగులో వారే యుద్ధమును కోరి, వరించి, జయించినట్లు గలదు. ఈ మార్పు ఉచితము. అంతటి సంరంభములో లెక్కకుమించిన సైన్యసంపత్తిగల విరాటుఁడు గోపాలురను, అశ్వపాలురను, వంటలవారిని, సన్యాసులను గురుతుగా పిలిచి గౌరవించుట పొసఁగదు. ఆకారములనుబట్టి వారు యుద్ధము చేయఁగలవారని విరాటుఁడు గుర్తించినట్లు మూలమున చెప్పఁబడియున్నది. ఇది మఱింత వింత. ఒక్కొక్కప్పుడు ఆకారమునకు, శక్తికి గొప్ప అంతరము ఉండవచ్చును గదా! విరటునిచే పాండవులు గుర్తింపఁబడుట మూలమునఁ గలదు కాని ఇది పాండవులకు అసహజమగు ప్రాముఖ్యము నిచ్చుట యగుచున్నది. రచనలో కథనుబట్టి పాత్రములు మసలవలెనుగాని పాత్రముల ననుసరించి కథను మలచరాదు. తిక్కన రచనలో పాండవులు తమ యునికిని తాముగా నెఱుకపఱచుకొనిరి. అనఁగా వారి యజ్ఞాతవాస వృత్తులలో, వేషములలో వారంతగా లీనమై

గుర్తింపఁబడరాకుండిరి అని చెప్పఁబడినట్లైనది. ధర్మజుఁడు చెప్పిన పిదప విరాటుఁడు 'హర్షనిర్భరాత్మకుఁడై' అపుడు రథములను, యుద్ధపరికరాదులను తెప్పించి యిచ్చినట్లు తిక్కన మార్పు చేసెను. ఆతరువాత కవచములను పేర్కొనుచు తిక్కన 'అశ్లథవర్మము' లని వర్ణించెను. కవచములకు దృఢత్వము ముఖ్యముగాని అలంకారము కాదు. మూలమునందు ఆఱు శ్లోకములలో విరటుని సైన్యము వర్ణింపఁబడినది.[15] మావటివాండ్రతో నధిరోహింపఁబడిన గజములు, ఎనిమిది వేల రథములు, వేయి యేనుఁగులును, అరువది వేల గుఱ్ఱములును మత్స్యనృపాలుని వెంబడించి యుద్ధమునకుఁ బోయినవని చెప్పఁబడినది.

"తద్బలాగ్ర్యం విరాటస్య సంప్రస్థిత మశోభత।
దృఢాయుధ జనాకీర్ణం గజాశ్వరథసంకులమ్॥"

సైన్యమును గూర్చిన ప్రశంస ఇంతమాత్రమే కలదు. సంఖ్య లివ్వఁబడినవి గాని వర్ణన చేయఁబడలేదు మూలమునందు.

"అష్టౌ రథ సహస్రాణి దశ నాగశతాని చ।
షష్టిశ్చాశ్వ సహస్రాణి మత్స్యానా మభినిర్యయుః" (4.30.28)

ఇది తెలుఁగు భారతమునందు విడువఁబడినది. సైన్యముయొక్క సర్వతోముఖ విజృంభణమును తిక్కన చక్కగా వర్ణించెను.

"సి. గంధ దంతావళ కర్ణ మారుతహతిఁ
గాంతారములు చాఁపకట్టు పడఁగ
రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చు నద్రులు
భయమున వాపోవు భంగి నుండఁ
దురగ ఖురోద్ధూత దూళి దన్పేరసిన
వననిధి పిండలివండు గాఁగ
బహుళ పదాతి దుర్భర భారమడరిన
నురగ కూర్మంబు లొండొంటిఁ బొంద

తే. సైన్యముల నడపించె నుత్సాహలీల
యతిశయిల్లంగ సంరంభ మగ్గలింప
బరవసము మిక్కుటంబుగ బసులు సన్న
జాడ గైకొని యమ్మత్స్యజనవిభుండు." (4 3 157)

విరాటరాజు సైన్యమును నడిపించిన విధము పైపద్యమునందు వర్ణింపబడినది. అతిశయోక్త్యలంకార మిం దుపయోగింపబడినది. "మదపుటేనుంగుల చెవుల గాలితాకిడికి అడవియందలి వృక్షములు చాపకట్టువలె పడగా, రథఘోషమునకు కొండలు ప్రతిధ్వనించుట అవి భయముతో వాపోవు భంగి నుండెనట; గుఱ్ఱముల డెక్కలచే రేగిన దుమ్మునిండి సముద్రము బురద కాగా, కాల్బలముల పదముల భారమునకు ఆదిశేషువు, ఆదికూర్మము ఒకరిపైనొకరు పడగా అతిశయించిన ఉత్సాహముతో పసులుపోయిన దెసగా వేగిరపాటు అధికముకాగా మిక్కిలి ధైర్యముతోడ సైన్యముల నడిపించెనని భావము. ఇందు గైకొన్న ఉపమానము లన్నియు అసాధారణమైనవి. సాధ్యముకాని చర్యలిందు సాధ్యములుగా వర్ణింపబడుట వలన అతిశయోక్తులైనవి. కావ్యమునం దతిశయోక్తి సార్థకముగా ప్రయోగింపబడినచో ఆస్వాదయోగ్యముగా నుండును. ఇచట సైన్య సమూహముల అధిక సంఖ్య తద్గత ధూళి ధూసరములు, శబ్దములు, పదఘట్టనములు సూచింపబడినవి. ఆ వేగము, శబ్దము, ధూళి, భారము మిక్కుటములని వాచ్యముగా ననక అలంకార పూర్వకముగా జెప్పుటచే నిచట అలంకారధ్వని ప్రవర్తించుచున్నది. ఈ వర్ణనము మనోహరము.

ఇంతవఱకు వర్ణింపబడినది యుద్ధమునకు పూర్వరంగము. ప్రత్యక్షముగా యుద్ధమును వర్ణించుట ద్వితీయ రంగము. ప్రారంభించుటతోడనే విరాట, త్రిగర్తేశుల బలంబులు ఒండొంటిని దాకుటను చక్కని యుపమానముతో బోల్చి సాక్షాత్కరింపజేసెను తిక్కన.

"క. విరటు బలంబు త్రిగర్తే
శ్వరు బలముం జెలగనార్చి వడి దాకె భయం
కరనాద మేదురములగు
శరనిధు లొండొంటి దాకు చందంబమరన్" (4.3.159)

ఇందు అలంకార ధ్వనికలదు. తిక్కన సైన్యమును శరనిధితోఁబోల్చి భయం కరనాద మేదురత్వమును సమాన ధర్మముగాఁ జెప్పెను. "అదిగాక శరనిధి కిని, సైన్య సమూహమునకును సమాన ధర్మములెన్నియో కలవు. వానిని మన యూహాకే వదలివేయుట తిక్కన గడుసుదనము. సైన్యములోని భట, గజ, తురంగములు వివిధ జలచరములను బోలగా ఆ యా ఆయుధములు సముద్రాంతర్గతములైన వస్తు సముదాయములను గుర్తుకుఁదెచ్చును. వర్ణనా ప్రియుఁడగు కవి ఈ యాధారములతో వర్ణనము నింకను బెంపఁగలఁడు. కాని. తిక్కన వర్ణనలో సౌందర్యము కన్నను ఫలితార్థమును 'మిన్నగా' నెంచును. ఇచట ఆ సైన్యముల బాహుళ్యము, గాంభీర్యము ప్రధానముగా నెంచఁబడినవి. కాన వర్ణన క్లుప్తముగా నున్నది.

"తేషాం సమాగమో ఘోరస్తుములో లోమహర్షణః ।
దేవాసురసమో రాజన్నాసీ త్పూర్వే విలంబతి॥" (4.31.4)

మూలమున దేవాసుర సంగ్రామములతోఁ బోల్పఁబడినది కాని ఒక యుద్ధ మును మఱియొక యుద్ధముతో బోల్చుటకంటె శరనిధులతో సైన్యములను బోల్చుట వలననే రూప సాక్షాత్కారము జరుగును.

ఒండొంటిని దాఁకిన పిమ్మట యుద్ధము వర్ణింపఁబడవలెను. ఆంగ్ల మున ఉపరితలమున నిలిచి స్థూలముగా నొక వస్తువును వర్ణించునెడ 'Bird's view' అని పిలుతురు. ఇచట తిక్కన చేసిన దదియే. గగనభాగమునగాని, ఆ యుద్ధరంగమునకు కొంత దూరమున నిలచిగాని చూచినచో తొలుత సైన్యము లొకదానిలో నొకటి చొచ్చుకొని పోవుట గనిపింపనగును. ప్రవా హము లెదురైనపుడు అందలి నీరు అట్లు కలిసిపోవుట సాధారణానుభవైక వేద్యము. అటుపై వినిపించునది ప్రవాహముల ఘోష. ఇచ్చటను రణరంగము నందు యోధుల సింహనాదములు, ఆర్తనాదములు, గజ, తురంగముల భీకరస్వనములు, రథములనుండి వెలువడు చప్పుళ్ళు కలసి ఒకానొక శబ్దము వినిపించును. అద్దానినే తిక్కన ఇచట వర్ణించినాఁడు.

"మ. గుణరావంబుఁ గృపాణ ఘట్టన రవక్షోభంబునుం గింకిణీ
క్వణన వ్యావృత హేషిత స్వనములున్ ఘంటానినాదాత్త పో

షణ నానాపటు బృంహితధ్వనియు శశ్వద్గాఢమై పేర్చినన్
రణనం బించుక దోఁపలేద బహుతూర్య శ్రేణి నా సేనలన్."
(4 31.40)

రణమున బహుతూర్య శ్రేణి ఇంచుక కూడ తోపలేనంత గాఢముగా గుణరావము, కృపాణ ఘట్టన రవక్షోభము, కింకిణీ క్వణనము, వ్యావృత హేషితస్వనము, ఘంటా నినాదాత్త ఘోషణ నానాపటు బృంహితధ్వనియు వ్యాపించిన వనఁగా ఆ కోలాహలము విన్నంత భ్రాంతి కలుగును. ఇచట మత్తేభవృత్తము, ఓజోగుణరచనము, సందర్భమునకు తగియున్నవి. మూలము నందు చతురంగ బలములలో ఆ యా బలములు వాని ప్రత్యర్థులను తాకిన వని చెప్పఁబడినది (4.31.5,6,7,8). అచట ప్రత్యక్ష చిత్రణముగాని, అలం కార సహితముగా వర్ణించుటకాని లేదు. ఎగసిన ధరాధూళిచే నాకసము గప్పఁబడిన దనియు, పక్షులు కనులఁగానక కిందఁబడిన వనియు, ఆదిత్యుఁడు సైతము బాణములచేఁగప్పఁబడెననియు వర్ణింపఁజడినది. ఈవర్ణనము బాగుగా నున్నను యుద్ధము నందుండవలసిన తీవ్రత, భయము గొల్పు విన్నాణము కొఱవడినట్లనిపించును.

"ఇషుభి ర్వ్యతిసంయద్భి రాదిత్యోఽంతర ధీయత ।
ఖద్యోతై రివ సంయుక్త మంతరిక్షం వ్యరాజత॥" (4.31.6)

మూలము నందున్న ఈ శరవర్ణనము నింకను బెంచి వర్ణించినాఁడు కవి బ్రహ్మ.

"సీ. ఒండొంటితోఁ దాఁకి మండెడునవియును
జిందముల్ పొడి పొడి సేయునవియు
గట్టి మైమఱువులు దట్టముల్ గావించు
నవియును నెఱను నోనాడునవియు
నెట్టుపైఁబడి మేని నెగయించునవియును
దల నేలడొల్లంగఁ దాఁకు నవియు
నిరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱునవియును
నలువుర నేవుర నాఁటునవియు

"తే. సైన శరములు గనుఁగొని యాడియాడి
నారదుఁడు పిచ్చలింపంగ వీరకేళి
సలిపె నుద్ధతిమై ధనుర్బలము లడరి
లావు వెరవును నెఱయఁజలంబు మెఱయ." (4.8.162)

మూలము నందు శరసంఖ్య మాత్రము వర్ణింపఁబడఁగా తెలుఁగున వాని తీవ్రత, లక్షణములు, అవి ఎందఱెందరిని కూల్చునట్టివో చక్కగా వర్ణింపఁబడినవి సీసము నందు. అటుపైనున్న గీతపద్యములో శరతీవ్రతవలన కలిగిన భయోత్పాతము చెప్పఁబడినది. 'నారదుఁడు పిచ్చలింపంగ' అనుటవలన కలహప్రియుఁడైన నారదుఁడు హర్షించెననియు, దేవతలు కూడ వెఱగందిరనియు ననుభావ మేర్పడినది. 'వీరకేళి' అను పదము తిక్కన యుద్ధవర్ణనాభినివేశమునకు సూచన. భయముతోపాటు ఆసక్తిని కలిగించునట్టిది ఇచటి శరవర్ణన—తొలుత కనిపించున దిదియే. శరవర్ణన పిమ్మట వీరుల వర్ణన చేయఁబడినది. 'ఒక్కఁడు పెక్కండ్రతోఁబోరుట, బలువు రొక్కనిపై నెత్తివచ్చుట, పలువురు పలువురతోఁ దాఁకుట, ఒకరినొకరు ముందు వెనుకలుగా నిలువరించుట' పేర్కొనఁబడినవి.

'ఓహరి సాహరి నుయ్యాలచేరుగా
వెనుకొంచుఁదెరలుచుఁ బెనఁగు నెడలు'

ఆ సైన్యముల పెనఁగులాట ఉయ్యాలచేరుగా తిక్కన భావించెను, భావింపఁజేసెను. యుద్ధవర్ణనను సైతము రమణీయముగా ఉత్కంఠ కలుగునట్లు వర్ణించెను. 'ఆశ్వికసేనలు బొమ్మలాడినట్లు పోరుచుండె'. ఇందు ద్వంద్వార్థములు కలవు. చూపరులకు బొమ్మలాట ఎంతటి ఉత్సాహకరముగా నుండునో ఇచట యుద్ధమును అంత ఉత్సాహభరితముగా సాగినదని యొక అర్థము. కాగా యుద్ధమింకను ప్రారంభస్థాయిలో నున్నది కావున ఇంకను తీవ్రతరముగాక తేలికగాసాగుచు బొమ్మలాటవలె నున్నది, అనియు వ్యంగ్యార్థము. మున్ముందు జరుగఁబోవు విరాట సుశర్మల యుద్ధముతోగాని, అర్జున కురువీరుల యుద్ధముతోగాని బోల్చిచూచిన ఈసైన్యసమూహముల యుద్ధము బొమ్మలాటయే కాగలదు. వర్ణన చేయునెడ పూర్వాపరముల నెంచి వర్ణించుట శిల్పము. కవితావేశమున కావ్యశిల్పమును మఱువఁడు తిక్కన.

'అమరగణము సిద్ధ సమితియు వేడుకఁ
జదల నిలిచి చూచి సంస్తుతింప'

దేవగణములు భయపడునట్లు, వెఱగందునట్లు వర్ణింపఁబడు నవసరములు మున్ముందు గలవు. అట్లగుటచే నిచట వేడుక కలుగునట్లున్నదని మాత్రము వర్ణింపఁబడినది.

"ఉదతిష్ఠద్రజో భౌమం న ప్రజ్ఞాయత కించన ।
పతిణశ్చాపతన్ భూమౌ సైన్యేన రజసావృతాః ॥" (4.31.5)

సైనికుల పదఘట్టనముల వలన నెగసిన రజము ఆకసమును గప్పి గన్నుమిన్ను కానరాకుండ జేసినదని మూలమున గలదు. అంతకంటె మిన్నగ యుద్ధరంగమును పీనుంగుపెంటగా వర్ణించినాఁడు తిక్కన. యుద్ధవర్ణనమున క్రోధ, భయానక, జుగుప్సాది భావములు లెస్సగా వర్ణింపఁబడినచో రౌద్ర, భయానక, బీభత్సరసములు పోషింపఁబడును. రౌద్రాది రసములు అంగభూతములుగా నుండుటవలననే వీరము లెస్సగా పరిపుష్టమగును. ప్రతిపక్షమునందు భయాదిభావములు వర్ణింపఁబడుటవలన నాయకపక్షమున ఉత్సాహము వ్యజ్యమానమగును. నాయకవర్గమునందలి ఉత్సాహమునకు ప్రతిపక్షమునందు చెప్పబడు బీభత్సభయానకము లుద్దీపన విభావములుగా తోడ్పడును.

"సీ. కరశీకరంబులుఁ గరటగళద్దాన
తోయంబులును ధరాధూళి గ్రమ్మఁగఁ
బోడవుల నడిసన్న యొడళుల దెంచన
ము.మ్మల పెంపు గగనంబు గోలఁదివెట్ట
బృంహిత ధ్వనులును బృథుల ఘంటావళీ
రవములు దిక్కుల నవులఁ ద్రోవ
రోషారుణాక్షుల రుచులను సిందూర
కాంతియు రవిదీప్తి గ్రమ్మఱింప

తే. జోదులొక్కట వాలంపసోన గురియ
రౌద్రరస మాకృతులఁ దాల్చి రణమొనర్చు

కరణి నత్యుగ్రముగఁ గరిఘటలు గడఁగి
కలను పీనుంగుపెంటగాఁ గలయఁజేసె " (4.3.168)

ఈ విధముగా మూలమును మించి తిక్కన యుద్ధవర్ణనమును గావించెను. కావుననే 'తిక్కనకు కావ్యమునందలి రసదృష్టికంటెయుద్ధవర్ణనమునందు ప్రీతి మెండు' అను అపవాదము కలిగినది. ఇట్లనుట కేవలము ఆక్షేపణీయము. ఏలన వర్ణనసైతము రసపోషణకై చేయఁబడుచున్నచో నది పరిహరింప నవసరములేదు. ఇచట సుశర్మ విరటుని జయింతునను నమ్మకముతో కురురాజును నమ్మఁబలికి దక్షిణగోగ్రహణమును జేసినాఁడు. విరటుఁడు స్వధన రక్షణాభిలాషతో యుద్ధము చేయుచున్నాఁడు. ధర్మము విరటునియందున్నది. తొలుత విరటుఁడోడినను పాండవ సహాయమున అంతిమ విజయము నొందును. అనఁగా ధర్మమే జయించునను ఆర్యోక్తి ఇచట నిరూపింపఁబడుచున్నది. ఇది కురుక్షేత్రమున ఇంకను లెస్సఁగ చెప్పఁబడు నర్థము. ఇచట సూచన గావింపఁబడినది. ఇట్టి దీనిని రసోదయమగునట్లు విపులముగా వర్ణించుట ఆవశ్యకమే. మూలమున చెప్పఁబడిన అంశములనే విపులముగ వర్ణించి రసవద్ఘట్టముగా తిక్కన మలచినాఁడు. 'యుద్ధము జరిగినది, వీఁడు ఇన్ని బాణములను వేసెను. నాఁడు మరణించెను' ఇత్యాదిగా కొంత చెప్పి, పిదప ఒకఁడు జయించెనని చెప్పిన అది నీరసకథన మగును. ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగాఁ జెప్పఁబడిన తెనుఁగు భారతము మహాకావ్యము గాని కేవలేతిహాస మాత్రము గాదు. ఈ భేదమువలననే తిక్కన యుద్ధవర్ణనమును వీరరస పోషణకనువుగా పెంచి రమణీయ రూపచిత్రణము చేయవలసివచ్చెను.

సైన్యసమూహము లొండొంటిని దాకిన విధములను వర్ణించిన పిదప ప్రధానవీరుల యుద్ధము చెప్పఁబడినది. క్రమము ననుసరించి సైన్యము, ధ్వానము, సంకులసమరము పిమ్మట ప్రధానయోధవర్ణనము చేయఁబడుచున్నవి. తక్కిన వీరుల యుద్ధములును తగుమాత్రముగా వర్ణింపఁబడినవి. అన్నింటికంటెను ప్రధానమైనది విరాట సుశర్మల ద్వంద్వయుద్ధము. ఇది విపులతరముగా వర్ణింపఁబడినది.

"విరాటస్తత్ర సంగ్రామే హత్వా పంచశతాన్రథాన్ ।
హయానాంచ శతాన్యత్ర హత్వా పంచ మహారథాన్" (4.31.17)

ఈ సంఖ్యలు రసపోషణకేమాత్రమును తోడ్పడవు. ఇచట ఉత్సాహ పోషణము లేదు. తిక్కన చిత్రించిన విధము వేరు. విరాటుఁడు త్రిగర్తునిజేర నెట్లుత్సహించెనో యిట్లు వర్ణించెను.

"చ. అనుజతనూజ మంత్రి సుభటాప్తజనంబుల పోరుచూచి నె
మ్మనమునఁ బొంగి మైవెనిచి మత్స్యమహీరమణుండు సారథిం
గనుఁగొని యల్లకంటె మొనఁగ్రాలుచునున్న త్రిగర్తనాథు కే
తనమున చక్కటికిన్ మన రథంబు వెసంజననిమ్ము నావుడున్."
(4.3.180)

'నెమ్మనమునఁ బొంగి మైవెనిచిన' మత్స్యమహీరమణుని ఉత్సాహము వీరమునకు స్థాయిభావము. 'వెసం జననిమ్ము' అను నాతని అత్రుత ఉత్సాహమువలన జనించినట్టిదే. నాయకునియందు ఉత్సాహము, ప్రతినాయకుని యందు కోపమును ప్రేరేచును. ప్రతినాయకుని క్రోధావేశము నాయకుని ఉత్సాహము నినుమడింపఁజేయును. ఈ క్రమమును తిక్కన పాటించును. విరటుని విజృంభణము వలన దైన్యమునందిన తనసేనను గాంచిన సుశర్మ 'కోపాటోపంబునం గెంపు గదురు లోచనములతో' (4.3. ప. 183) విరటు నెదుర్కొనెను. సుశర్మ ఎదుర్కొనుట 'చామరకోల నేనుఁగు నొచ్చినట్లు'న్న దట. చిక్కిరి బిక్కిరి చేయఁబడినది అనక అలంకారయుతముగా ఆ భావమును కలిగించెను. ఇది ప్రౌఢోక్తి వలన సాధ్యము. ప్రధానవీరులఁ గాంచి సైన్యము లన్నియు మఱియు నుత్సాహమునందినవి అప్పటి మహోగ్రత వియచ్చర ప్రతతికి వెఱపు గల్పించినది (185). ఇది యుద్ధవర్ణనలో క్రమపరిణామము. అయినను కళాదృష్టిగల సహృదయునకు 'ఆ సమిత్కేళి' గానే తిక్కన చిత్రీకరించెను. సుందరమైన దానిని సుందరముగాఁ జెప్పుటకు ప్రత్యేక ప్రతిభ యక్కరలేదు. కాగా భయంకరమగు యుద్ధమును రమణీయ రసమయ జగత్తుగా భావింపఁజేయుటకు మహాకవి కావలెను. తిక్కన యట్టి మహాకవి.

"మ. పటువేగంబగు శాతభల్లచయ సంపాతంబునన్ మింట మి
క్కుటమైనుండ ధగద్ధగద్ధగ యనం గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించు నట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి రు
త్కట దర్పోద్ధతులై పరస్పర జయాకాంక్షం
ప్రచండంబుగన్." (4.3.188)

ఇచట టకారప్రాసము, మత్తేభవృత్తము, సంయుక్తాక్షర ప్రయోగము భీషణ యుద్ధవర్ణనను చెప్పకయే చెప్పుచున్నవి. అదియు 'చటులక్రీడ'యే. కళాత్మకుఁడగు కవి దృష్టిలో సుందరముగాని దేదియులేదు. 'ధగద్ధగద్ధగ యనన్', 'కోపంబు రూపంబులై'. 'శౌర్యోన్నతిన్', 'ఉత్కటసరోషోద్ధతు' లిత్యాది పదబంధములు యుద్ధతీవ్రతను స్ఫురింపఁజేయుచున్నవి.

మూలమునను్న ధూళివర్ణన కన్న మిన్నగ నిచట వర్ణింపఁబడినది.

"తే. దొరలు తలపడ్డ సాహావదోహాలమున
నుభయ బలములుఁ దమకించి యోర్వలేక
కలయ బెరసి ధూళి కతన గాత్రి
గాక మున్న యొండొరులుఁ గానరైరి." (4 3.191)

పక్షులు కనులు గానక క్రిందబడినవను మూలవర్ణనకంటె ఇది లెస్సగా నున్నది. 'రాత్రి గాకమున్న యొండొరులుఁ గానరైరి' యనుటవలన అది పగలు అను సూచన చేయఁబడినది. పిమ్మట అస్తమించు సూర్యబింబము, చంద్రోదయము వర్ణింపఁబడినవి.

ధూళి విజృంభణమునే కాదు. ధూళి వడగిన విధమును గూడ తిక్కన వర్ణించి మఱింత సొగసు గూర్చినాఁడు.

"క. క్షతములఁ బెల్లు దొరఁగు శో
ణితము రజఃపటల మడఁచి నెఱిపిన నరుణ
ద్యుతిఁ దమము వాపు వేకువ
గతిఁ దత్సమయం బతిప్రకాశత నొప్పెన్." (4 3.192)

తొలుత ధూళి పైకెగయగ, ఒండొరుల గానరైరి. శోణితము రజము నడచివేయగా కాంతి వ్యాపించినది. 'దానికి జిత్తవృత్తులు ముదంబునఁ బొందంగ మేను లుబ్బగా సేనలు' విజృంభించినవి. ఇంతలో నిజముగా నే భానుఁడు పశ్చిమాద్రిని క్రుంగుట, తమము వ్యాపించుట జరిగినది. మఱల సేనలు యుద్ధముడిగినవి. చంద్రోదయముతో తిరిగి యుద్ధము సాగినది. ఈ

మూనుట, విజృంభించుట క్రమముగా చెప్పఁబడినవి— చక్కని ఉపమానములతో, శోణితము ఎఱుపు, రజము నలుపు, ఈ రంగుల సామ్యము ననుసరించి తమము-వాపు వేకువవలె రజమును శోణిత మణచివేసినదని కవి యుత్ప్రేక్షించెను. ఇట్టి యలంకారములు యుద్ధవర్ణనలను ఆసక్తిదాయకములుగా. ఆస్వాదయోగ్యములుగాఁ జేయుటకుఁ దోడ్పడినవి. ఈ వర్ణనయందు కవి కనఁబఱచిన శ్రద్ధాసక్తులు పాత్రలయందు స్థాయియగు ఉత్సాహమును నిక్షేపించి సహృదయునకు రస సాక్షాత్కారమును కలిగించినవి.

ఇకపై వర్ణింపఁబడినది భీమసేనుని విజృంభణము. ఇచట అజ్ఞాతవాసమింకను ముగియని సందర్భము. ఉత్తర గోగ్రహణమున అర్జునునివలె ఇచట పాండవులు విజృంభించినట్లు వర్ణించుచో కథయం దౌచిత్యము కొఱవడును. కావున తిక్కన సమయోచితముగా నిచట క్లుప్తముగా వర్ణన జేసెను.

"క. ఏయుచుఁ బొడుచుచు వ్రేయుచు
డాయుచు నుద్వృత్తిఁ దఱుముటయుఁ బొడిసేసెన్
వాయుసుతుఁడు రథముల నిరు
వేయిటి రథి రథ్య సూత వితథంబులుగన్." (4 3.213)

ఇంతమాత్రమే భీముని వర్ణనము. తదుపరి తక్కిన పాండవుల యుద్ధము అతిక్లిష్టము గావింపఁబడి తిరిగి విరటుని యుత్సాహోన్మీలనము వర్ణింపఁబడినది. పాండుపుత్రులకంటె విరటుని గూర్చి మిన్నగా వర్ణించుట తిక్కన సందర్భోచితికి నిదర్శనము. ప్రధానపాత్రలయ్యు నట విరటుని యాజ్ఞానువర్తులగుట వలన విరటుని యుద్ధమును మించి వర్ణింపకుండుట ఔచిత్యవంతము. ఉత్తరగోగ్రహణమున సందర్భము తద్భిన్నము. ఉత్తరుఁడు రథసారథ్యమును, అర్జునుఁడు రథికత్వమును వహించుట తోడనే అర్జునుఁడు స్వేచ్ఛానువర్తి ఆయెను. అచట అజ్ఞాతవాసకాల పరిసమాప్తియు జరిగినది.

"తే. ఏడునూఱు రథంబుల నేపుమాపె
నకులుఁ డప్పుడు మున్నూటి నామడఁచె
నతవియనుజుండు కుంతీసుతాగ్రజుండు
రథికముఖ్యుల వేవురఁ బృథివిఁగూల్చె." (4.3.214)

ఈ పద్యమునందు సంఖ్యల పట్టిక కలదు, ఇందు ప్రత్యేకత లేదు, వారి విజృంభణము నింతకన్న మిన్నగ వర్ణింపరామి నిట్టి రచన చేసి యుండ నోపును. కాని, పాండవుల యుద్ధమును గాంచిన విరాటుఁడు జనితోత్సాహుఁడై నాఁడు. ఇచట పాండవుల పరాక్రమము విరటుని యుత్సాహము నుద్దీపింపఁ జేసినది.

"ఆ. ఆ సుశర్మ తేరియందున్న ఘనగదా
దండమెత్తికొని యుదగ్రవృత్తి
జరఠ దేహుఁడయ్యు దరుణవయస్కుని
ట్లవని కుఱికిపోయి యతని ద్రవేసె" (4.3 218)

ఈ పద్యమున చివఱి రెండు పాదములు విరటుని యుత్సాహము యొక్క పరాకాష్ఠను సూచించునట్టివి. వార్ధక్యము ఉత్సాహమును భంజించును. కాఁగా జనితోత్సాహుఁడైన విరటుఁడిచట తరుణవయస్కునివలె ఉదగ్ర వృత్తి నవనికుఱికి సుశర్మను దాఁకెను.

ఇట్లు యుద్ధమారంభమైన దాదిగ ఉత్సాహమును ఎడతెగక అంతర్వాహినిగా వర్ణించుచు తిక్కన వీరరసపోషణము కావించెను, ఏ వర్ణనకైనను రసోన్ముఖమగుట కదా పరమప్రయోజనము. ధర్మపక్షమున వీరము పోషింపఁబడినది,

## ఉత్తర గోగ్రహణము

ఉత్తర గోగ్రహణ ఘట్టమున యుద్ధము విపులతరముగ వర్ణింపఁబడినది, ఇది కురుక్షేత్ర యుద్ధమునకు నాందీభూతముగా నెంచఁదగినది. ధర్మజ, భీమ. నకుల, సహదేవులు, పాండుపుత్రపక్షమున కురుక్షేత్రమున పోరిన సాత్యక్యాది వీరులు తక్క కౌరవపక్షపు అతిరథ, మహారథులు పాల్గొనిన యుద్ధమిది. యుద్ధ విజయుఁడగు విజయుని వీరవిహారమును కనులకు కట్టునట్లుగావర్ణించినఘట్టమిది. ఇదిపాండవుల విజయపరంపరలకు, కౌరవులవినాశమునకు ప్రారంభదశ. పరిమాణమునుబట్టియు నిది రెండాశ్వాసములందు వ్యాపించియున్న సన్నివేశము. కథ యథామూలముగ గ్రహింపఁబడినను

నిర్వహణము భిన్నము. ఆయా యుద్ధవీరుల వర్ణనలు, యుద్ధరంగ వర్ణనము, యుద్ధ రీతుల కథనము తిక్కన కవనమున ప్రత్యేకత నొందినవి.

మూలమునందు గవాధ్యక్షులు ఉత్తరుని యుద్ధోన్ముఖునిగాఁ జేయు ప్రయత్నము పది శ్లోకములలో చెప్పఁబడినది (338). దానిని తిక్కన ఒక వృత్తమునందు సంక్షేపించెను. ఇచట ఉత్తరుని ప్రశంసలవలన ప్రయోజనము లేదు. ఉత్తరుఁడు కౌరవులను ఎదిరించి, ఓడించి పసుల గ్రమ్మఱించెద నని పలికిన పలుకులు ముఖ్యములు. వలన అవి ప్రగల్భములే అయ్యు నుత్సాహ భరితములు. ప్రతివానియందు ఉత్సాహము వర్ణింపఁబడినను, లేకపోయినను ఇచట ఉత్తరుఁడు యుద్ధయానము నారంభింప వలసినవాఁడు. ఆతనియం దుత్సాహము లేకున్న కౌరవసేనను ఎదిరించు నవకాశమే లేకపోవును. ఉత్తరుని ఈ వీరాలాపములను తిక్కన చక్కగా పేర్కొనెను (4.4.8). భావములు మూలమునందే యున్నను రచనలో వేగము, పలుకులో వాడి తిక్కన కూర్చిన సొబగులు. గవాధ్యక్షుఁడు కాంతాజనములలో తన నగ్గించుటవలన పొంగి దర్పోద్ధతితో 'ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొనిరేని గోవులం దెత్తు ముహూర్త మాత్రమున' అనియు, 'తగు సారథి దొరకొనినం బగతుర భంజించు టెంతపని' అనియు సంగరకౌతుకంబు ముడివడుచుండ మాటలాడిన ఉత్తరునియందు ఉత్సాహము గమనింపఁదగియున్నది.

"పశ్యేయు రద్య మే వీర్యం కురవ స్తే సమాగతాః
కిం ను పార్థోఽర్జునః సాక్షాదయమస్మా న్ప్రబాధతే," (4.34.9)

మూలమున నున్న యిద్దానిని తిక్కన వివరించిన తీరు స్థాయీభావ స్థాపనకు తగియున్నది.

"చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము చూచి పార్థుఁడను బుద్ధిఁగలంగఁగ బెట్టు గిట్టి సం
గరమున నోర్చి యేఁబసులఁ గ్రమ్మఱఁదేఁక యున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు మెత్తురే."
(4.4.11.)

ఈ పద్యమునందు ప్రథమార్ధభాగము మూలమునందున్న భావమునకు అనువాదమే. కాని ద్వితీయార్ధభాగము తిక్కన కల్పనము. ఇప్పు డిట్లు భూవరుఁడు, సువ్యాజనంబు, పరివారము మెత్తురే అనిన ఉత్తరుఁడే కౌరవ సేనను గాంచిన పిదప 'పసుల దయ్యమెఱుఁగుఁ బడతుల సంతోష మేల నాకు' 'దవ్వుల విఱిగిన బౌరులు నవ్వుదురటె మేలుమేలు నను నాఁగకు నీ క్రొవ్వు ఱుగదేని దలపడు' అని భీతావహుఁడై, పలవరించును. అప్పటి యీ పలుకులకు, ఇప్పటి బీరములకు అంతరము లెస్సగా కూర్పఁబడినది, ఇతరులను గూర్చిన ఆలోచన తీరి కూర్చుండినపుడు. కలుగును గాని ప్రాణభయమ్ము కలిగినపుడు రాదు అను లోకరీతిని తిక్కన పెంపు స్పష్టము చేయుచున్నది.

ఉత్తరుని వీరాలాపముల యనంతరము అతఁడు బృహన్నలకు రణోత్సాహము కలిగించినట్లు తిక్కన సూచించెను,'....రణోత్సాహనం బొనరింపు గ్రక్కునన్' ఉత్సాహము వీరరసమునకు స్థాయి గనుక నద్దానిని పోషించుచున్నాఁడు తిక్కన.

కౌరవరాజసైన్యము వలన రేగిన ధూళిని వర్ణించి ఆ సైన్య విస్తరణమును వ్యంగ్యము జేసినాఁడు కవి. మూలమున రెండు శ్లోకములలో నున్న సైన్యవర్ణనమును తిక్కన సీసమునందు అలంకారయుక్తముగా వర్ణించి తద్రూపమును సాక్షాత్కరింపఁ జేసెను

"తదనీకం మహత్తేషాం విబభౌ సాగరస్వనమ్।
సర్పమాణ మివాకాశే వనం బహులపాదపమ్॥
దదృశే పార్థివో రేణుర్జనితస్తేన సర్పతా।
దృష్టి ప్రణాశో భూతానాం దివస్పృక్కురుసత్తమ॥" (వి.పర్వ.36.8)

సాగరారణ్యములతో కౌరవరాజసైన్యము పోల్పఁబడినది. కాని తద్వర్ణనము కన్నులకు గట్టినట్లు వర్ణింపఁబడలేదు. ధూళాధూళికి సైతము తిక్కన రమణీయరూప కల్పన జేసి ఆస్వాదయోగ్యముగా వర్ణించెను.

సీ॥ అభినవ జలధరశ్యామంబు లగునెడ
లాకుజొంపంబుల ననుకరింప

సాంధ్య రాగోపమచ్ఛాయంబులగు పట్లు
కిసలయోత్కరములఁ గ్రేణిసేయ
రాజమరాళ గౌరములగు చోటులు
తలుచుఁ బూవొదల చందంబు నొంద
వారద్రయుచి సమానాక్ర్వతులగు తావు
లడరెడు పుష్పాదులట్లు మెఱయఁ

తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి నలిఁగాఁపువోయెడు తెఱఁగు దాల్చ
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడుచు కౌరవరాజ సైన్యంబుఁ గనియె" (4 4.50)

ధరాధూళి వివిధ వర్ణంబులఁ దాల్చి లలితవనము దివికి కాపురమేగి నట్లున్నదని తిక్కన వర్ణించినాఁడు. ఇందు కవి ఉత్సాహము పాఠకునియందును ఉత్సాహమును ప్రేరేపింపఁగలదు. యుద్ధము, సైన్యము అనగానే భయంకర భేరీ నినాదములు. బీభత్స దృశ్యములు స్ఫురించును. కాని ఇచట తిక్కన లలితవనమును సహృదయులకు సాక్షాత్కరింపఁజేసెను, ఆకులు, చిగురులు, పూవులు, పుష్పాదులు ధరాధూళి వివిధ వర్ణములు దాల్చునెడ పోల్పఁబడినవి. రమణీయ రూపకల్పన యన నిట్టిదే. రమణీయమగు నొక వస్తువును గాని, దృశ్యమునుగాని సుందరము గా వర్ణించుటలో ప్రత్యేకత లేదు. సుందరముగాని దానిని మనోహరముగా వర్ణించి చూపుటలోనే కవిప్రతిభ వ్యక్త మగును. కావ్యము రసమయ జగత్తు గాదా!

ధూళి తొలుత కనఁబడినది. పిమ్మట సైన్యసమూహము, అటు పిమ్మట కురువీరులు వేరువేరుగ రూపు కట్టినట్లు వర్ణింపఁబడిరి. కౌరవరాజ సైన్యంబును గనిన ఉత్తరుని తొట్రుపాటును తిక్కన చక్కగా వర్ణించెను. ఇట్టి మనోభావ వర్ణనములందును, తదనుగుణ అభినయ వర్ణన లందును. తిక్కన నిశితరచనా రీతి అనన్యసాధ్యము. అది పాత్రచిత్రణగా నెంచఁదగిన యంశము గనుక ఇచట ప్రస్తావనప్రాయ మాత్రముగా (ప.51) చెప్పఁబడినది.

"శా. భీష్మద్రోణ కృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మాస్ఫారచతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబు దగ్రధ్వజా
ర్చిష్మత్తాకలితంబు సైన్యమిది యేఁజేరంగ శక్తుండనే."
(4.4 52)

ఈ వర్ణన యుద్ధవీరుల పటాటోపమును ప్రత్యక్ష దర్శనీయ వస్తువు గాఁజేయుచున్నది. 'ష్మ' కారప్రాసము, సంయుక్తాక్షర ప్రయోగము, శార్దూల వృత్తము, సుదీర్ఘ సమాస యుక్తము, ఓజోగుణభూషితము నైన ఇయ్యది యుద్ధవీరుల వర్ణన కత్యంతము ఉచితమై ఓజోగుణమున కుదాహరణముగా నెంచదగ్గదై యున్నది. రౌద్రరస స్ఫూర్తికీ రీతి, గుణాలంకారములు పోషకములగుచున్నవి. సమాసభరితముగా సాగి చివరకు 'సైన్యమిది యే జేరంగ శక్తుండనే' అనుశైథిల్యము ఉత్తరుని ధైర్యవిలోలనంబును సూచించుచున్నది. నీరసపడిన రాకుమారుని భయకంపితస్వన మిందు చూపఁబడినది. మూలమునందు ఆయా కురువీరులచే నావరింపఁబడినదని మాత్రము చెప్పఁబడినది: తదనుగుణమైన వర్ణనగాని, భీకరత్వముగాని అందులేదు (అ.36).

"తదనీకం మహద్దృష్ట్వా గజాశ్వరథసంకులమ్ ।
కర్ణదుర్యోధన కృపైర్గుప్తం శాంతనవేనచ ॥
ద్రోణేన చ సపుత్రేణ మహేష్వాసేన ధీమతా ।
హృష్టరోమా భయోద్విగ్నాః పార్థం వైరాటి రబ్రవీత్ ॥"
(4.36.7,8)

ఇత్యాదిగా పెక్కుశ్లోకములు (7,8,9,10,11,12,13,14) గలవు. కాని పై శార్దూలవృత్తములో నున్న వేగము, తీవ్రత, గాంభీర్యము ఈ శ్లోకములలో నచ్చుపడలేదు.

యుద్ధమును సూచించు అపశకునములను తిక్కన యథామూలముగ, క్లుప్తముగ పేర్కొనెను. మూలభారతమునంతయు తారుమారు చేసెనను అపవాదు నిది సరాస్తము చేయుచున్నివేశము (అ-37, ఆ4).

సిద్ధము గనుక ఆచార్యునిచే క్రీర్తించఁ జేయుట సందర్భోచితముగ, పాత్రోచిత ముగఁ జెప్పినది. గనుక బంగారమునకు తావి అబ్బినట్లు [illegible] చిక్కినది.

అ 37. శ్లో. 9. ఏష వీరో మహేష్వాసస్సర్వశస్త్రభృతాం వరః।
ఆగతః క్లీబవేషేణ పార్థో నాత్ర సంశయః ॥

శ్లో. 10 సఏష పార్థో విక్రాంతః సవ్యసాచీ పరంతపః।
నాయుద్ధేన నివర్తేత సర్వైరపి సురాసురైః ॥

ఇందు అర్జునుని అస్త్రవిద్యాకౌశలము చెప్పఁబడినది, సురాసురులతో నాతని ఆధిక్యము చెప్పఁబడినది. కాని ఒక వీరుని, యుద్ధరంగ మధ్యమున నిలిచిన తీవ్రరూపుని వర్ణించుటకు వేదము చాలదు. వర్ణింపఁబడువానిని సాక్షాత్కరించుటయే వర్ణన పరమార్థముకాగా 'వీఁడె వచ్చెం గుంతీసుతమధ్యముండు' అని చూపి వర్ణించుట తిక్కనకే చెల్లును.

"శా. సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటు మై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేనపై 'వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్."
(4.4 95)

ఇచట ఉపమాలంకార సాహాయ్యమున అర్జునుని రూపమును చిత్రీకరించుట జరిగినది భీముని సామాన్యముగా మాతంగముతో అర్జునుని సింహముతో బోల్చుట వారివారి ఆకారములకు, పరాక్రమములకు తగియుండును ఇచట అర్జునుఁడు కాంతార నివాస ఖిన్నమతి కనుకనే ఆకటితో గుహాంతరమున చేడ్పాటుమై నుండిన సింహముతోఁ బోల్పఁబడినాఁడు. అట్టి సింహము క్రోధముతో విజృంభించును అర్జునుఁడిప్పు డట్టి ఉద్యత్క్రోధముతో వచ్చుచున్నాఁడని భావము మాతంగ స్ఫూర్జిత యూథముతో కౌరవసేన పోల్పఁబడినది పెక్కు వీరులుండుట వలన మాతంగ సమూహముతో పోల్చుట ఆవశ్యకమే. ఈ పద్యమున కంతటికిని ప్రాణమనఁదగిన యంశము 'వీఁడె వచ్చెం గుంతీసుతమధ్యముం'డను వాక్యము. ఇక్కడున్నవానిని చూపించుచు చెప్పినప్పుడు 'వీఁడె వచ్చెను' అనుట సాధారణ ప్రయోగ విధానము అట్టి

నుని ఆకృతి సమరము నందలి స్థైర్యముతో నొప్పుచున్నదనుట వీరోచితముగా నున్న వర్ణన. అర్జునుని అభిరామాకృతి ఆతనికి యుద్ధమునందు గల యుత్సాహామువలన ఏర్పడినట్టిది. ఉత్సాహాము స్థాయి అగుటచే ఈ ఉత్తరగోగ్రహాణ ఘట్టమునందు వీరరసము పోషింపఁబడినదని విదితము.

దక్షిణ గోగ్రహాణ ఘట్టమునందు వలెనే ఇచటను తొలుత సైన్యము, పిమ్మట యోధులు, తరువాత శంఖనాదాదులు, అటుపై వీరాలాపములు, తదుపరి ప్రత్యక్ష యుద్ధము, యుద్ధానంతరము యుద్ధరంగము క్రమముగా వర్ణింపఁబడినవి. వీరరసపోషణ కనుకూలముగా అర్జునునిచే ఉత్తరునకు యుద్ధోత్సాహాము కలిగింపఁబడినది. అర్జునుని ధైర్యవచనములు, ఆతఁడు చేసిన ఆయుధ వర్ణనము ఉత్సాహామున కుద్దీపకములుగా నున్నవి.

"సీ. దెసలు బీఁటలువాఱ దివురు చిందములకో
లాహాలంబులకు గలంకబడక
యురవడి సేనలు దెరలఁ బైఁ దొలెంచు
ధూళి పెల్లడరినఁ దూలపోక
చతురంగబల మతిసాంద్రత గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్మాంగ
తతి నాటు తఱుచునఁ దల్లడిలక

బహువిధంబులఁ బగతుర బరవసమున
నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్లనోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడు గాక
దవ్వుదవ్వుల విఱిగిన నవ్వరెట్లు."

పై పద్యమునందు యోధుని కుండవలసిన ప్రధానలక్షణములను, ధైర్యస్థైర్యములను చక్కఁగా వర్ణించినాఁడు కవిబ్రహ్మ. ఇది యుద్ధవీరుఁడన నెట్టివాఁడో సిద్ధాంతీకరించిన వర్ణనము—అయ్యు సందర్భోచితము. ఉత్తరుఁ

డట్టివాఁడుకాఁడని ఎఱింగిన అర్జునుఁడు అన్యాపదేశముగా వాని లోటు పాట్ల నెఱింగించి యుద్ధమునకు తన అర్హతను దెలుపుకొన్నవాఁడైనాఁడు. యుద్ధము నెఱింగినవాఁడు కాకున్న అంత నిర్దేశముగా ధైర్యముగాఁ బలుక లేఁడు. ఇది నాయకస్థానమునందున్న అర్జునుని పలుకులు. ప్రతినాయకుడైన దుర్యోధనుఁడు సహితము ఉత్సాహపూరితముగానే మాటలాడు చున్నాఁడు.

"క. ఒరుఁడయ్యోనేని మామక
శరాసనక్షిప్త దీప్తసాయక పంక్తిం
బరిమార్చెద వ్రేల్మిడి న
చ్చెరువుఁ బ్రమోదంబు నొంది సేనలు వొగడన్."

ఈ దుర్యోధనుని పలుకులు 'ఎత్తున గొందు గౌరవులనెల్లను మార్కొని రేని గోవులం దెత్తు ముహూర్త మాత్రమున' అని పలికిన ఉత్తరుని పలుకు లను బోలియున్నవి. వీరిరువురును ఒక్క విధమువారే. ఒకరు సైన్యమును జూచి వెఱగందినవారు. ఒకరు యుద్ధమున ఓడి గర్వమును విడినవారు. ఇచట ఉత్సాహము ప్రధానముగా చెప్పఁదగినది. బృహన్నల నర్జునునిగా నెఱింగిన ఉత్తరుఁడు కోలుపోయిన తన ధైర్యమును తిరిగి పొంది ఉత్సాహముతోఁ బలికినట్లు కలదు. అచ్చట ఉత్తరుని పలుకులు అర్జునుని పరాక్రమమునకు వన్నె గూర్చునట్టివి. 'బాహు సమగ్ర శత్రుమద భంజన శౌర్య సమస్తలోక చేతో హారమూర్తి' అని వర్ణన. అర్జునుని అభిరామాకృతికి తగిన విధముగా రూప కల్పన జరిగినది. అర్జునుని ప్రాపున ఉత్సాహజనితుఁడైన ఉత్తరుఁడు 'నీ ఘన భుజశక్తి ప్రాపున నఖండిత శౌర్య మహోన్నతుండనై యనిమొన సారథి త్వము మహత్త్వము వైరులు మెచ్చఁ జూపెదన్' అని పలికినాఁడు. ఇది నిజమైన ఉత్తరుని ధీరగుణము. వైరులు ఉత్తమవీరుని గాని, సారథినిగాని మెచ్చుట యుద్ధ సంప్రదాయము. అట నట ఆ యా వీరుల ఉత్సాహములను తిక్కన వర్ణించుట రసశిల్పములో నొక మెలకువయే. అర్జునుని దేవదత్త శంఖనాదము విఖ్యాతము.

దానిని తిక్కన వర్ణించిన విధమిద్ది —

"మ. కలగెరా దోలయుదిస్తత్తుకలము గిరివర్గం బెల్లనూటాడె సం
చలితంబోలదె వసుంధర వలయత మాళాశ్చకీ మల్లాడె గ్రో
దలమంచేం ద్రిదళేంద్రదు పట్టణము పాతాళము ఘూర్ణిల్లె నా
కులమయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్
4.4.172

అతిశయోక్త్యలంకారయుతముగా ఈ మత్తేభము అమ్మహానాదంబును వెల్లడించుచున్నది. చిన్న చిన్న వాక్యములతో నొక వృత్తమును రచించుట తిక్కన ప్రత్యేకత. అయినను ఇచట భావములు ఆ శంఖనాదనుయొక్క తీవ్రతను తెలియఁజేయుచున్నవి. ఆర్భాటాన్ని కవి వర్ణించిన విధమట్టిది కాగా పాత్రముచే పలికించిన విధమును తత్సమానముగా నున్నది. సముద్ర, పర్వత, భూమ్యాకాశ, దిశా, స్వర్గ, పాతాళ, గ్రహ, నక్షత్ర, బ్రహ్మలు ఎట్లు సంక్షోభమును చెందిరో కవి తాను వర్ణింపఁగా ఒక నాయకుమారుఁడు ఎట్లు సంభ్రాంతుఁడాయెనో కవి తన పాత్రముఖమున వర్ణించెను.

"చ. చెవులవిసెన్ దిశల్ దిరిగెఁ జిత్తము నీరయిపోయె నాకు నీ
రవమున నిమ్మహోగ్ర కపిరాజపతాకముఁజూడ్కిఁ జీకటుల్
గవియఁగఁ గ్రాలెడున్ భవదఖండిత తేజము పర్వి యాత్మకున్
వివశతఁ జేయుచున్నయది విహ్వలభావము మాన నేర్చవే."
4.4.177

"భవదఖండిత తేజము" అను ప్రశంస అర్జునునకు మఱింత ఉత్సాహమును కలిగించునట్టిది. ఉత్తరుని విహ్వలత వీరుఁడగు విజయునకు విజృంభించుట కొక ప్రోత్సాహమే యగును. ఇది ఉద్దీపన విభావముగా వర్ణింపఁబడినది. అర్జునుని వర్ణనమును క్రమ పరిణామముగా వర్ణించిన వైఖరి తిక్కన వర్ణనాచాతుర్యమునకు కలికితురాయి కాఁదగినది. ఈ ఉత్తరార్జునుల సంభాషణా వర్ణనమును తిక్కన కొంత పెంచెను. దానికొక ప్రబల కారణము: ఇట్టి సంకటమే మున్ముందు అర్జునునకు కురుక్షేత్రారంభమున కలుగగా, అప్పుడా తని సారథియైన శ్రీకృష్ణుఁ డాతని సంకోచము వెల్లఁబాపి తన విశ్వరూపమును ప్రదర్శించెను. ఆ భావికథను సూచించుచున్న ఈ ఘట్టము విపుల వర్ణ

వకు పాత్ర మైనది. ఉత్తర గోగ్రహణము ఇట్లన్ని విధముల కురు పాండవు లకు తదనంతర యుద్ధమగు కురుక్షేత్ర యుద్ధమునకు సూచనాప్రాయము లుగా నున్నది. ఎచ్చటనైనను సంఖ్యాబలము కౌరవులదే అనగా అధర్మ పక్ష ముదే. విజయము చేకూరినది మాత్రము ధర్మపక్షమునకే అనగా పాండవు లకే ఈ సామ్యము లుండుటచే ఉత్తర గోగ్రహణానంతర యుద్ధమును తిక్కన వీరరసమయముగా వర్ణించెను

సింగం బాకటితో అను పద్యమున అర్జునుని తీవ్రక్రోధము మాత్రమే చెప్పఁబడినది ఇచట ఆతని గుణము మ్రోత, శంఖరవము, పడగపటువు, కిరీట కాంతి వర్ణింపఁబడినవి దూరమునుండి రథారూఢుఁడై వచ్చు అర్జునుని గాండీవ జ్యాధ్వని తొలుత వినబడును, పిమ్మట శంఖరవము వినఁబడును. తదుపరి కపికేతనము ఎత్తుగా నున్నది గనుక కనిపించును తదనంతరము కాంతివంతమగు దివ్యకిరీటపు మెఱుపులు ద్యోతకమగును ఈ వర్ణనలోని క్రమము పరిశీలనాసుభగము

"సీ. శ్రవణపుటంబులు వ్రయ్యంగఁ దాకి సం
క్షోభంబు గావించె గుణము మ్రోత
బ్రహ్మాండభాండంబు పగిలించి భూతని
శ్చైతన్య మొనరించె శంఖరవము
గగనభాగంబెల్ల గప్పి క్రాలుచు బెగ
డడరించె మూగంపు పడగపటువు
మిఱుమిట్లుగొని చూడ్కి పఱవోవఁ బెఱికి దె
సల్ గ్రాలించె గిరీటకాంతి

తెల్లమిది గాండివంబును దేవదత్త
మును గపిధ్వజమును వాసవుని వరమునఁ
గన్న మకుటంబునగు వేఱకొన్నియైన
నుజ్జ్వలాద్భుత భంగులై యున్నె యిట్లు." 4.4 180

ఈ పద్యమున తూగు వర్ణనకు నిండుదనమును కలిగించినది సీసమున ఒక్కొక్క పాద మొక్కొక్క దాని విశేషగుణమును, ప్రభావమును చెప్పి

పూర్ణ వాక్యము. గీతమునందు సీసమున వర్ణ్యములైన అన్నింటియొక్క మహా త్త్వము ఉమ్మడిగ చెప్పఁబడి ఆ వాక్యములకు పూర్ణభావమును కలిగించు మేలి పతకమువలె నున్నది. సీసపాదములందు చెప్పఁబడిన వాని స్పష్ట నామము లొక్కచో గీతమునందు కూడినవి. అవియన్నియు ఉజ్జ్వలాద్భుతము లనియు వర్ణింపఁబడినవి. అర్జునుని ఆకార, వేష, భూషణము లన్నియు ఈ పద్యమునుబట్టి ఊహింపవచ్చును. అర్జునుని గుణధ్వని, శంఖనాదము, క్రోధము వర్ణింపఁబడినవేగాని రూపురేఖలుగావు. యుద్ధరంగమున ఒక వీరుని వర్ణింప వలసియుండినపుడు ముఖ్యమైనవి అతని ధైర్య పరాక్రమాయుధములేగాని అన్యములుగావు.

"ఉ. అర్జునుఁడైన నేమి సురలైనను నేమగు విద్విషచ్ఛిరో
పార్జితమైన గోగణముఁ బట్టితి మెవ్వరు వచ్చిరేని వి
స్ఫూర్జిత బాహుసంపదలు సూపుద మొండొరు మీఱి నిర్మలా
త్యూర్జిత కీర్తికారణ రణోద్ధతి వెల్వెలబాఱ నేటికిన్."

4 4.186

దుర్యోధనుని ఈ పలుకులలో రణోత్సాహము, ఆగామికథా సూచనయు గలవు. ఉద్ధతుఁడైన అతనికి తగినట్లుగా నీ పలుకులు కూర్పఁబడినవి. అర్జునుఁడే కాదు; సురలెదురైననేమి అను అతని అహంకారమే కురుక్షేత్రమునకు నాంది పలికినది. విద్విషచ్ఛిరోపార్జితమైన గోగణ మిచట ఆక్రమింపఁబడగా మూలకథలో పాండవ దిగ్విజయములచే నొడఁగూడిన సంపద గైకొనబడినది. అభిమాన ధురంధరుఁడగు సుయోధనుఁడు యుద్ధమునకు జంకఁడు. ముందు చేయఁదలఁచిన పని ఎట్టిదైనను విదప వెనుదీయఁడు అను నిర్ధారణ ఇందు కలదు. అందువలననే 'నిర్మలాత్యూర్జిత కీర్తికారణ రణోద్ధతి వెల్వెలబాఱ నేటికిన్' అని పలికినాఁడు. ఇట్టి రారాజు అభిప్రాయమే ఇప్పటి ఈ యుద్ధమునకు, జరుగబోవు కురుక్షేత్రమునకును మూలమైన అంశము. ఇచట రారాజుచే నిట్లు పలికించుట భావికథార్థ సూచకమై యున్నది. మూలమునందు దుర్యోధనుని పలుకులు విస్తృతములై గతార్థమును తిరిగి చెప్పు ధోరణిలో సాగినవి[16]. తిక్కన ఆ భాగమునంతయు ఒక వచనములో చెప్పివైచి దుర్యోధనుని యుద్ధనిశ్చయమును ప్రముఖముగా జేసెను.

మూలమునందు కర్ణుని బింకములు సుమారిరువది శ్లోకములలో నుం డగా తిక్కన ఆరు పద్యములందు సమగ్రముగా కూర్చెను[17]. అందును కర్ణుని వీరాలాపములలో నెన్నదగినది ఒక పద్యము, 'వెఱచితిరేని నిప్పుడోక వీరున కొక్కఁడ చాలుఁగాక యెందఱు వలయు' అనియు 'కపిధ్వజము దవ్వుల వ్రేల్మిడి ద్రుంచి వై చెదం బఱపెద దత్త్విళాచముల భగ్నముసేసెదఁ దేరుసారథిన్' అనియు బీరము లాడినాఁడు. అర్జునుని తానెట్లు ఓడింపఁగలఁడో పలుకుచు తన భుజాబలము నిట్లు వర్ణించినాఁడు. ఇది స్వోత్కర్ష. ఉత్తమునకు ఆత్మస్తుతి కూడనిది. కాని కర్ణుఁడు అర్జునునిపైఁగల మాత్సర్యమువతో వివేక హీనుఁడై నాఁడు. ఆతని ఉద్ధతిని తిక్కన చక్కగా వర్ణించినాఁడు. అందటి లోను ఉత్సాహమే పోషింపఁబడుచున్నది.

"శా. జ్యాఘోషం బతిభీషణంబయి దిశాచక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండుగా నారద
శ్లాఘాపాత్రమునై యనర్గళభుజాసంరంభతన్ రౌద్రరే
ఖాఘోరాకృతియేన చూపెద నశంకంజూడుఁడీ యేర్పడన్."

"క. క్రోధజ్వాలలు నిగుడ వి
రోధిబలేంధనముఁ బొదువు క్రూరతమై దు
స్సాధమగు నర్జునాగ్నిని
సాధించెద నేన పూని శరవర్షమునన్" 4.4.203

రచనారీతిలో పారుష్యమును సాధించి శార్దూలవృత్తములో కర్ణుని ఉద్ధతిని తిక్కన ప్రకటనము చేసినాఁడు. అటుపై నున్న చిన్ని కందములో నెన్నెన్ని మెలకువలు పొదిగినాఁడో చూతము. అర్జునుని అగ్నితోఁ బోల్చి తానాతని క్రోధజ్వాలలను శరవర్షముతో సమయింతునని కర్ణునిచే పలికించి ఆతని మాటలు తారుమారైన వసుటకు తగినట్లు అటు పిమ్మట అర్జునుని అంబుదముతో, కర్ణుని అగ్నితో, అర్జునుని శరవర్షము కర్ణుని కోపానలజ్వాలలను సమయించెనని పోల్చినాఁడు తిక్కన.

అర్జునుని అటు తరువాత ప్రతిసారి పర్జన్యముతోనే పోల్చి ఆతఁడింద్ర సూనుఁడగుటను స్పష్టము చేసెను. కర్ణునిమాట వమ్మైపోయినది. భావికథాను

గుణముగానే అలంకార రచనయు జరిగినది. ద్రోణుఁడు అర్జున పక్షపాతి యగుటచే ప్రతివీరునిగా నేతెంచిన విజయుని మఱిమఱి పొగడినట్లు తిక్కన వర్ణించినాఁడు.

"మ. విలసద్గాండివ చాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీలగా
నలఘుస్ఫార కపిధ్వజధ్వని సముద్యద్గర్జ చందంబుగా
జలదాకారత నొందెఁ దేరితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలశాలిప్రాలేనిదాఘ దుర్వహమహాగర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్."
4.4.251

ఈ వర్ణన సందర్భోచితముగా సమగ్రముగా అలంకార భూషితముగా రథారూఢుఁడైన గాండీవిని సాక్షాత్కరింపఁ జేయుచున్నది. గాండీవ చాలనము విద్యుల్లత లీలగా, కపిధ్వజధ్వని గర్జనముగా, తేరు జలదముగా, అర్జునుఁడు పర్జన్యునిగా నెంచఁబడి అలంకారము రమ్యముగా కూర్చబడినది. విద్యుల్లతతోఁ బోల్చునెడ లకార పునరావృత్తి, గర్జనముతో రూపించునపుడు దకార పునరావృత్తి, చేయబడుట నాదమాధుర్యము కొఱకే. 'కపి ధ్వజ ధ్వని' అనుటలోనే ఆ లయ, గంభీరగర్జన చందము నాదసాహాయ్యమున స్ఫురించుచున్నవి. తొలుత సౌమ్యముగా సాగిన రచన చివరి వాక్యము వచ్చునప్పటికి వేగ తీవ్రతలను అందినది. అందు కాఠిన్యము, పౌరుష్యము చిప్పిలుచున్నవి. మనోహరాకృతితో నేతెంచు అర్జునుఁడు కురువీరుల గనినంతనే క్రోధోద్దీపిత మానసుఁడైనట్లు సౌమ్యముగా మొదలై పరుషముగా ముగిసినది వర్ణన. ఉత్తర గోగ్రహణమును, తత్పర్యవసానముగా జరిగిన యుద్ధమును తిక్కన చతుర్థ పంచమాశ్వాసములందు నిబంధించెను. చతుర్థాశ్వాసమును అర్జునుఁడు పసుల గ్రమ్మఱించుటతో ముగించి జనమేజయునితో 'పసులు పట్టువడిన పదపడి నరుఁడెద్ది యాచరించెఁ గౌరవాధినాథుఁడేమి సేసె బలములెట్లయ్యె భీష్మాది వీరులెవ్విధంబు వారలైరి' అని అడిగించి పంచమాశ్వాసమునకు యుద్ధమును నెట్టివేచెను. కీచకవధను, వధానంతర విశేషములను కచ్చితముగ వేరుచేసినట్లే ఇచ్చటను గోగ్రహణమును, యుద్ధమును విడదీసెను. కథానిర్వహణమున ఇట్టి చాతుర్యమువలన ప్రతి ఆశ్వాసమునకా ఆశ్వాసము స్వతంత్ర ప్రతిపత్తి కలిగి నాటకములోని అంకవిభజనను

పోయియున్నది; అచట రంగము మార్చబడును. ఇచట వర్ణనచే ఆ వైవిధ్య మును కవి కలిగించును.

యుద్ధమునకు చతుర్థాశ్వాసము పూర్వరంగము కాగా పంచమాశ్వా సము ప్రత్యక్ష రంగము. అందు వీరులు, వీరాలాపములు, శంఖనాదాదులు వర్ణింపబడినవి. ఇప్పుడు ప్రత్యక్షయుద్ధము. తదనంతర యుద్ధరంగము వర్ణింపబడినవి. యుద్ధవర్ణనమునందును తిక్కన ఒక క్రమపద్ధతి ననుసరించెను. మూలమున అర్జునుఁడు ఒక్కొక్క కురువీరునితో రెండుసార్లు పోరాడినట్లుండగా అట్లుండుటవలని ప్రయోజనములేదని అది సమంజసము గాదని భావించిన తిక్కన ఒక ప్రముఖ వీరునితో పోరాటమును వర్ణించి, అతఁడోడి తొలగిపోయిన పిమ్మట మరొకనితో అట్లందరును తొలగిన తరువాత ఒక్కుమ్మడిగ వారర్జునుని ఎదిరించినట్లును మార్చెను. ఒకపరి ఓడినవాఁడు తిరిగి ఒంటరిగ అర్జును నెదిరింప సమకట్టుట భావ్యము కాదు. రెండుసార్లు చేసిఉన్న ఆయా వీరులతో నెరపిన పోరాటముల వర్ణనలను తిక్కన ఒకేసారి సమీకరించి వర్ణించుటవలన సొగసు ఏర్పడినది. ఒక వీరుని గురించి రెండుసార్లు వర్ణన ఉన్నచో విసువు కలుగు నవకాశమున్నది గదా!

అర్జునుఁడు ప్రముఖ వీరుల నోడించిన పిమ్మట సైన్యమునుఱుమాడి నట్లు మూలమును. ప్రముఖులతో అర్జునుఁడు యుద్ధము చేయుచున్నప్పుడే సైన్యమూరకుండినదా అనిపించును. అర్జునుఁడు తొలుత సైన్యసమూహ మును చెల్లాచెదురుగా జేసి, వారిని ఓడించిన పిదప ప్రముఖులను ఒక్కొక్కరిని ఓడించినట్లు తిక్కన మార్చెను. ఇట్లుండుటవలన అర్జునుఁడు, కురు ప్రముఖులతో పోరునపుడు తక్కిన సైనికులు అప్పటికే ఓడి, పరాజితులై యున్నారు - అర్జునుని సమీపింపనేరరైరని తిక్కన కల్పనోద్దేశము. అంతే గాక సైన్యమును ఛిన్నాభిన్నము చేయనిదే అర్జునుఁడు సైన్యసమూహము మధ్యమున, పార్శ్వమునఁనున్న ప్రముఖ వీరులను తాకలేఁడు కూడ.

'ఇదిగాక మూలమునందు అర్జునుఁడు పసులనెట్లు గ్రమ్మఱించెనో, కౌరవ బలములు తిరిగి పసులకేల అడ్డుతగులలేదో చెప్పఁబడలేదు. పశువులవంక పఱచుచున్న అర్జునుని గాంచి ద్రోణుఁడు అతనికి అడ్డుతగులవలయునని సేనలను హెచ్చరించినట్లును, అరుదెంచిన సేనలను గాంచిన అర్జునుఁడు ఆ సేన

లకు గోవర్గమునకు నడిమిగా జొచ్చి నిశితశరపరంపరలచే నాసేనల నచటనే నిలిపి, దేవదత్తమును పూరించి పశువులను దక్షిణదిశకు మరల్చెను: మఱల ఈ సేనలు వానికడ్డుపడకుండ వానిని తాకి గోపాలకులను 'కొనిపొండు పసుల నోడక' అని ఆదేశించి తనకెదురైన కరితురగసమితిని, కురువీరులను 'శరవేగంబున ఉద్ధుర మారుతచండభంగి'గా నెదుర్కొనెను. ఈ సుస్పష్టమగు వివరణము తిక్కన చేసిన కూర్పు. (చతుర్థాశ్వాసము ప. 263 నుండి ప. 271 వఱకు).

మూలమునందలి యుద్ధక్రమము :— అర్జునుఁడు వికర్ణ, చిత్రసేన, సంగ్రామజిత్తు, శత్రుంసహ, జయాదులతో తొలుత తలపడి, పిమ్మట కర్ణునితో, దుర్యోధనాదులందరితో, నొక్కుమ్మడిగా వచ్చిన కురుసైన్యములతో (మొదటిసారి) పోరినట్లును అపుడు ధనంజయ కురువీరుల యుద్ధమును జూచుటకు దేవత లేతెంచినట్లును, పిమ్మట వరుసగా, కృప, ద్రోణాశ్వత్థామలతో, మఱల కర్ణునితో, (రెండవసారి) భీష్మునితో, దుశ్శాసనునితో, తిరిగి వికర్ణునితో తలపడినట్లు కలదు. ఆ పిమ్మట రెండవసారి సంకులయుద్ధము చేసినట్లు వర్ణింపఁబడినది. సంకుల యుద్ధానంతరము భీష్మునితో రెండవసారి యుద్ధము వర్ణింపఁబడినది. చిట్టచివర దుర్యోధనార్జునుల యుద్ధము కలదు. ఇంత సంకులముగానున్న యుద్ధవర్ణనను తిక్కన చిక్కు విడదీసి చక్కఁజేసి క్రమయుద్ధమును వర్ణించెను. చతుర్థాశ్వాసములో గోవులను మఱలించుటఁ జెప్పి ఆ ఆశ్వాసము నంతటితో ముగించిన తిక్కన పంచమాశ్వాసమును కురువీరుల వర్ణనతో ప్రారంభించెను. మూలమునందు కొంత యుద్ధము జరిగిన పిమ్మట దేవతలు వచ్చినట్లుండగా తిక్కన ఆ సన్నివేశమును చతుర్థాశ్వాసమునందు గోవులను గ్రమ్మఱింపక మునుపే వర్ణించెను. మూలమున దీర్ఘముగా ఆ వచ్చిన దేవతల పేర్లు, వివరములు గలవు. కాని పాండురాజు పేరు లేదు. తిక్కన అప్రముఖులగు కొందఱిని వదలి, పాండునృపాలునికి సగౌరవముగా ఆఖండలు చేరువన పెద్దగద్దియను వేసి, అమరమండలి పీఁటపులిప్పించెను. ఇది కుతూహలమును ఆసక్తిని కలిగించు మార్పు. అర్జునుని ఈ యుద్ధమును గాంచుటకు పాండురాజుకు దేవతలను మించిన ఆసక్తి యుండును గదా ! ఆఖండలుఁడు, పాండునృపతి ఇరువురును అర్జునునకు తండ్రులే యగుటచే వారికి సమానస్థాయిని తిక్కన వర్ణించెను.

మూలమునందు భీష్ముఁడు యుద్ధక్రమమును నిర్ణయించినట్లు కలదు. తిక్కన ఆ గౌరవమును ఆచార్యునకిచ్చి, ఆచార్యుఁడు చెప్పిన కార్యగతిని భీష్ముఁడును అనుసరించినట్లు మార్చెను. భీష్మద్రోణు లిరువురు సమాన ప్రతిపత్తి గలవారగుటచే నీ మార్పు ఉచితము. ఆచార్యునకు గౌరవమును కూర్పవలెనను కవియత్నము ఈ మార్పు.

యుద్ధక్రమమెంత నిర్దుష్టముగా నున్నదో చూచిన యుద్ధవర్ణన శోభించును. కౌరవ సైన్యంబుల నుఱుమాడుట, చిత్రాంగద ప్రభృతి కుమారుల నిర్జించుట, కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము, ద్రోణాచార్యులతో యుద్ధము సేయుట, అశ్వత్థామతో యుద్ధముచేయుట, కృపాచార్యునితో యుద్ధము చేయుట, భీష్మునితో యుద్ధము, దుర్యోధనునితో యుద్ధము, ఆతని నుపాలంభించుట అను క్రమము పాటింపఁబడినది. కృపునితో యుద్ధము నారంభించుట కంటె కర్ణునితో ద్వంద్వయుద్ధము వర్ణింపబడుట లెస్సగా నున్నది. అర్జునునకు కర్ణునితో యుద్ధముచేయవలెనను అభిలాష ఎక్కువగలదని పలుమార్లు చెప్పఁబడియున్నది. అట్లే దుర్యోధనునితో యుద్ధము పిమ్మట భీష్మునితో యుద్ధము మూలమున కలదు. భీష్ముని ఓడింపనిదే దుర్యోధనుని తాకలేఁడర్జునుఁడు. మూలమునందున్నట్లైన అర్జునుఁడు రారాజును తునుమాడఁగా, భీష్ముఁడు చూచి యూరకుండెనను అభిప్రాయమేర్పడును. అది భీష్ముని రాజభక్తికి మచ్చయగును. కురువీరులందరు ఓడిన పిమ్మటనే దుర్యోధనుఁడు అర్జునుని ఎదుర్కొనవలసి వచ్చినట్లు అనువాదమునందుండుట చక్కని మార్పు. ఇది తిక్కన నిశితపరిశీలనకు, యుద్ధధర్మమును లెస్సగా నెఱుంగుననుటకు ఒక ఉదాహరణము.

కౌరవులను జూపించి ఉత్తరునకు వేర వేర నిరూపించినట్లు తిక్కన ఒక పద్యము రచించెను. యుద్ధవర్ణన కిది ప్రారంభము. ఏలన ఆయా వీరులను ఎరుంగనిదే సారథి సారథ్యము చేయలేడు. ఉత్తరుఁడు కురువీరులను ప్రప్రథమముగా జూచుచున్నాఁడు గనుక ఈ నిరూపణము అవసరము.

"సీ. కాంచనమయ వేదికా కనత్కేతనో
జ్జ్వల విభ్రమమువాఁడు కలశజుఁడు
సింహలాంగూల భూషిత నభోభాగ కే
తు ప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు

గనక గోవృష సాంద్రకాంతి పరిస్ఫుట
ధ్వజపటములాపంబు వాఁడు కృపుఁడు
లలిత కంబు ప్రభా కలిత పతాక వి
హారంబువాఁడు రా త్మజుఁడు

తే. మణిమయోరగ రుచిజాల మహితమైన
పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖర ఘనతాళ తరువగు సిడమువాఁడు
సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము" 4.5 4

ఇట్లు ఆయా కురువీరుల కేతనముల నర్జునుఁడు ఉత్తరునకు జూపి ఆ పిమ్మట రణమధ్యమున ఆయా వీరుల నెదుర్కొనుటకుఁ బొమ్మని ఆనతిచ్చును ప్రముఖవీరుల స్వభావాదుల గూర్చి కూడ అర్జునుఁడుత్తరునకు వివరించినట్లు తిక్కన కల్పించెను ఆ యుద్ధ మారంభము కాఁబోవుముందు వారిని ఉత్తరున కెరుకపరచుట అత్యంతావశ్యకము భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామల పట్ల అర్జునునకెనలేని గౌరవాభిమానములు గలవు వారిని ఓడింపవలెనను కుతూహల మతని కంతగా లేదు తప్పనిసరియైనపుడే వారిని ఎదుర్కొనెను అర్జునుని దృష్టియంతయు కర్ణ, దుర్యోధనులమీద ఉండుటవలన వారిపై పై రథము నడుపుమని ఉత్తరుని కోరినాఁడు దుర్యోధనుఁడు తమ యిడుము లన్నింటికి మూలకారకుఁడు కర్ణుఁడన్ననో తన పరాక్రమమును లెక్క చేయక తనతో ప్రత్యర్థిత్వము నెరపువాఁడు అట్లయ్యును అర్జునుఁడు సుశిక్షితుడైన వీరుఁడు గనుక ఎదుటనున్న వీరుని సుగుణములను ప్రశంసించి నట్లు తిక్కన కూర్పుచేసి కర్ణార్జునుల పాత్రలకు ఉన్నతస్థాయిని గల్పించెను

"శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధ ప్రక్రమ బాహువిస్ఫురుఁడు కురుక్ష్మాపాలవాల్లభ్య ల
క్ష్మీమధామాత్ముఁడు జామదగ్న్య కలిత శ్రేష్ఠాస్త్ర విద్యాఢ్యుఁడీ
రాధేయుండొక చిరికింగొనఁడు వీరవ్రాతముం బోరులన్"

(4 5 11)

"క. శౌర్యాటోపంబున దో
ర్వీర్యంబున నస్త్రశస్త్ర విత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును
దుర్యోధనుఁ డెపుడుఁ దన్నెదురు సేయంగన్." 4.5.12

శార్దూల వృత్తములో గంభీరముగా కర్ణుని వీరగుణములను, కంద ములో ముక్తసరిగా వాని ప్రతిభటత్వమును తిక్కన వర్ణించెను. దుర్యోధనుని గూర్చి కూడ అర్జునుఁడు కొంత పొగడ్తగాను, అతని నెదుర్కొనుట తనకు పండువనియు పలికినట్లు గలదు. భీష్మ, ద్రోణ కృపాశ్వత్థామల పరాక్రమ ములగూర్చి మిక్కిలి గురుభావముతో అర్జునుఁడు పలికినట్లు గలదు.

యుద్ధారంభముననే తీవ్ర పరిణామములు గలిగినవట. ఆ వీరులు 'కరటి ఘటాఘోటక ఘట్ట రథయూథ పదాతి వితతి సంరంభకుంభత్సేనా సమూహితంబుగాఁ ద్రోచి నడచిన'

"చ. ధరణి వడంకె ధూళి దివిఁదాఁకెను భానుఁడు గానరాఁడు బం
దుర వివిధ ప్రకార పటుతూర్యరవంబులఁ బొంగె దిక్కులా
స్ఫురిత మహాయుధోగ్ర రుచిపుంజ విజృంభణ ఘోర
మయ్యె నం
తరము సహస్ర నేత్ర ముఖదైవత మండల దుర్నిరీక్ష్యమై."
4.5.28

ఇట్లు ఘోరంబుగా పరిణమించినవట ధరణి, భానుఁడు, ఆకాశము, దిక్కులు. ఘనభోమధ్యభాగము ఆయుధచయములచే నిండినదట. ఇచట అతిశయోక్త్యలంకారయుతముగా ఘోరరణమును తిక్కన సూచించెను.

అర్జునుఁడు బాణములనెట్లు ప్రయోగించెనో, తనపైఁ బడకుండగా బాణముల నెట్లు నిరోధించెనో తిక్కన ప్రస్ఫుటముగా వర్ణించెను.

"చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దార క్షీ
పణముగ నుప్పతిల్లి రభసంబున రేగిన మాడ్కిఁ దీవ్ర మా
ర్గణ నికరంబు లొక్కట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీ కుహరకర్పరముం బగిలింప నుగ్రతన్."
4.5 30

బాణములు అల్లె త్రాటినుండి, వింటి నడిమి భాగమునుండి, వింటి కొసలనుండి, చేతులనుండి తమంత తాముగా పుట్టి వేగముగ వెడలుచున్నవా అన్నట్లు శస్త్ర సమూహము లొక్కుమ్మడిగ శత్రు సైన్యముల గప్పినవట. గాండీవధ్వనితో ఆకాశము మీది కర్పరమే పగిలినట్లున్నదట. ఈ వర్ణనలో ప్రతిపాద్యాంశము అర్జునుని బాణవేగము. ఎట్లు బాణమును సంధించి, ప్రయోగించుచున్నాఁడో గమనింపలేనంత వేగముగ నవి బయల్వెడలినవట.

అర్జునుని ఉత్సాహమును తిక్కన విడువక పోషించి యుండుట గమనార్హము. స్థాయి పరిపుష్టముగా పోషింపఁబడనిదే రసోదయము కలుగదు.

"క. తలపడి తలమీఱిన కా
ల్బలములఁ బొడిసేయు మఱియుఁ బై పైఁ బీనుం
గులఁ ద్రొక్కికొనుచు వెస ముం
గలి మొనఁ గవియుటకు వేడ్క కడలుకొనంగన్."
(4.5.31)

'వేడ్క' అను పదమిందు అత్యంత ప్రధానము. యుద్ధమునకు కావలసిన ఉత్సాహ సూచకము.

ఆ భటులుకూడ అంత పిఱికివారు కారని తిక్కన కల్పనము. అర్జునుని తీవ్రనారాచముల తాకిడికి గాయపడుచున్నను, ఉడుగక ఒక్కసారిగా వచ్చి అర్జునుని ఎదుర్కొని ఆతని "పటుబాణ భాస్వదనివార్య సముద్ధతిఁజేసి మంటలో మిడుతలు సొచ్చినట్లయి"న మేటి మగలు. బల్విడి మఱియున్ వడిం బొదువ అర్జునుఁడు వారెని క్షణములో జంపెనని ఆ భటుల సుభటత్వమును గూడ తిక్కన స్థాపించెను.

అర్జునుఁడు వేయు బాణములనేకాక ప్రతియోధుల బాణముల నాతఁడెట్లు తుత్తునియలు చేసెనోకూడ తిక్కన సూక్ష్మాతిసూక్ష్మముగా వివరించి వర్ణించెను. యుద్ధమును, బాణనిపాతములను సాక్షాత్కరింపఁజేయు వర్ణన మిది.

"సీ. గోర బోఁజన మాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ
బాలుగా వ్రయ్యలు వాపివాపి
బాడిస నఱకిన భంగిఁ గొన్నింటిఁ దు
త్తునియలుగా బిట్టు ద్రుంచి ద్రుంచి
వెన అంపమున నిడ్డ వసిగఁ గొన్నిటి నిసు
మంతలుగా నఱుమాడి యాడి
పనివడ ఱోలఁగొట్టిన లీలఁ గొన్నింటిఁ
జిఱునిగ్గుగాఁ బోడి సేసి చేసి

"తే. యడరి పొదివిన బలము నానాయుధముల
బ్రతిహతంబులఁ గావించె నతిరయమున
నక్షత ధ్వజ సూత హయత్వ లసద
ఫల్గు రథవల్గనుండగు ఫల్గునుండు." (4.5.35)

ఎదిరిని నొప్పించుటయే కాదు యుద్ధమునఁ జేయవలసిన పని, స్వజనమును గాచుకొనుట గూడ ముఖ్యమే. ఇఁట అర్జునుఁడెట్లు ఆవలి వీరుల బాణసమూహములను నిష్ఫలముగాఁ జేసెనో వర్ణింపఁబడినది. క్రియాపదముల పునరుక్తి బాణపరంపరలు అర్జునుని ప్రతిక్రియ అవ్యవధానముగా సాగినవని సూచించుచున్నవి. తన ధ్వజ సూత హయముల నాతఁడు అక్షతములుగా రక్షించుకొనెను. అర్జునునిఁట ఫల్గునుఁడు అనుట సార్థక నామ ప్రయోగము. యుద్ధ ప్రారంభమున భీష్మాచార్యుఁడుకూడ ఆతనిని ఫల్గునుఁడనియే పేర్కొనెను (4.4.234),

ఉత్తర ఫల్గునీ నక్షత్రము జయతారకము. ఉత్తర ఫల్గునీ నక్షత్ర సంజాతుఁడగుటంజేసి అర్జునుఁడు ఫల్గునుఁడై సర్వకాలములందు జయమును

పొందుచుండెను. ఆతని ఈ జన్మనక్షత్ర నామము నిట పేర్కొనుట ఆతని విజయమును సూచించుటకే యగుచున్నది.

తిక్కన యుద్ధవర్ణన లందున్న ప్రత్యేకత అలంకారశోభితముగా రమణీయ రూపరంజితముగా ఆతఁడు యుద్ధభూమిని, ప్రచండవీరుల భంగిని వర్ణించుటయందేగలదు.

"శా. శక్తిస్ఫార ధనంజయాయత భుజాసంరంభ గాండీవ ని
ర్ముక్త క్రూర శరావలీ దళిత శత్రు వ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁబొంది సాంద్ర కుసుమ శ్రేణీ వికాసోల్ల స
ద్రక్తాశోక తరువ్రజంబులక్రియన్ రంజిల్లియొప్పెం గడున్."
4 5.88

అర్జునుని బాణములచే గాయపడిన శత్రుసైన్యములు రక్తము గారు చుండుట వలన పూవులతో దట్టముగానున్న రక్తాశోక తరుసమూహముల వలె శోభిల్లినవఁట! గాయపడిన సైనికులను ఎఱ్ఱని అశోక వృక్షములతోఁ బోల్చుట జుగుప్సాకరమగు ఉపమేయమును రమణీయమగు ఉపమానముతోఁ బోల్చుటయైనది. ఇందువలన కొంత జుగుప్స ప్రతిహతమై సహృదయ చిత్త వృత్తికి ఆస్వాదయోగ్యముగా రూపొందును. కాకున్న రౌద్ర బీభత్స భయానకము లంగములుగా గల వీరరసము ఆస్వాదనీయ మగుటెట్లు? మధ్య మధ్య ఇట్టి సౌందర్య గర్భితములగు ఉపమానము లున్నచో నవి కొంత జుగుప్స తీవ్రతను అరికట్టును. పూచిన అశోకద్రుమమువలెనున్న అట్టి వీరులు రంజిల్లి ఒప్పుచున్నారఁట! సౌందర్యోపాసకుఁడైన రసికుఁడు ప్రపంచము నందలి ప్రత్యణువునందును సౌందర్యమునే గ్రహించును. ప్రతిభావంతుఁడైన కవి అట్టి సౌందర్యమును తన కవితాముఖమున సహృదయునకు సైతము దృగ్గోచరము గావించును. తిక్కన యుద్ధవర్ణనలు అత్యంత ఆస్వాదయోగ్యము లగుటకు ఈ సౌందర్య దృష్టికూడ దోహదకారి యగుచుండును. ఈ ఉత్ప్రేక్ష ప్రతిభాచక్షువుతో నూహింపవలసినదేగాని సామాన్యము గాదు. అలంకార మన్నచో నిట్లుండవలెను.

దొరలుదగ్రత చుట్టుముట్టినపుడు అర్జునుని మేను వేల్పువచ్చినయట్లు పొంగినదట. ఉత్తమ వీరుని యందుండవలసిన ఉత్కటమగు ఉత్సాహమునిఁట

తిక్కన పోషించుచున్నాఁడు. ఎదిరి బలములు చుట్టుముట్టినపుడు భయభ్రాంతుఁడై పోరుట సామాన్యవీరుని లక్షణము. వేడ్కతో, మేనుపొంగగా, నలిరేగి పోరు సలుపుట విజయునివంటి వీరుని లక్షణము. అర్జునుని యందు ఈ ఉత్తమనాయక గుణములను విరాటపర్వ చతుర్థ, పంచమాశ్వాసములందు తిక్కన వర్ణించెను.

"క. గర్జద్గుణుఁడై పగతుర
జర్జరితాంగులుగఁ జేసె సాయక జాల
స్ఫూర్జన చూపఱు వొగడఁగ
నిర్జరవర నందనుండు నిమిషార్ధమునన్." (4 5 37)

ఇందలి గర్జద్గుణుఁడై, జర్జరితాంగులు, సాయకజాలస్ఫూర్జన, నిర్జరవర నందనుండను పదములు అర్జునుని ఉజ్జ్వల పరాక్రమమును ధ్వనింపఁజేయుచున్నవి. 'ర్జ' కార ప్రాసము అర్జునుని విజృంభణమును తెలుపుచున్నది. 'నిమిషార్ధమునన్' అని అర్జునుఁడెంత వేగముగా వారిని గాయపఱచెనో తిక్కన కాలమును సూచించుచుఁ బలికెను. గాండీవిని 'సవ్యసాచి' అని పిలుచుట ఎందులకో తిక్కన ఈ సందర్భమున పేర్కొనుట సమయోచితముగా నున్నది. ప్రస్తుతాంశమును సమర్థించుటయు నైనది. కాని ఆ అంశమును వాచ్యముగాఁ బలుకక 'కవదొనతేల పూనునొకో కవ్వడి' అని మఱియొక అంశమును తానై ప్రస్తావించి దానికి సమాధానము నొసంగినాఁడు. 'కవ్వడి' శబ్దము అర్జునుని బాణప్రయోగ వేగమును ధ్వనింపఁజేయు చున్నది. ఈ వర్ణన ఫలితముగా అర్జునుని బాణవేగము, ప్రతాపస్ఫూర్తి వెలయింపఁబడుచున్నవి. అర్జునపాత్ర నాధారముగా నిట వీరరసము పరిపోషింపఁబడు చున్నది.

సమ విషమ వినిమ్నోన్నత సమీప దూర స్థలములు సదృశములుగా అడ్డులేని విధముగా, అప్రతిహతముగా సమరభూమిలో తిరిగినదని చెప్పుచు తిక్కన అర్జునుని రథమును మనసుతో పోల్చెను. ఇది అన్వర్థమగు ఉపమానము. ఈ విశ్వాంతరాళమున ఎచ్చటి కైనను చనఁగలిగినది మానవుని

మనసు ఒక్కటే. అట్టి ఉదాత్తమైన ఉపమానము వలన అర్జునుని రథము సైతము ఉన్నతస్థానము నందినది ఈ వర్ణనలో. ఇంకను ఆ రథమును అంబుధిలోన విహరించు మహామత్స్యంబుతోఁ గూడ తిక్కన పోల్చి చెప్పినాఁడు. అంబుధినే అల్లకల్లోల మొనర్పఁజాలిన గలదానినే మహామత్స్యంబు అనుట పొసగును. అట్లయినప్పుడు అర్జునుని రథగమనము వలన కౌరవరాజ సైన్యంబును అల్లకల్లోల మగుచుండుటను వ్యంగ్యముగా భావింపవచ్చును, వాచ్యముగా వర్ణించుట కంటె వ్యంగ్యసుందరముగాఁ బలుకుట విశిష్టవర్ణన మన వచ్చును. అలంకార సాదృశ్యముతో వర్ణించుట యుద్ధవర్ణనలయందు ఎక్కువ. అర్జునబాణ నిహతములైన రాజుల రత్నకేతనములు రాజిత శేఖరములు, రుచిరఘంటికలు కౌరవుల చేటును దెలుపుటకు పడుచున్న ఉల్కలవలెనున్నవని తిక్కన వర్ణించెను. బాణములచే ఎత్తున కెగరగొట్టబడి నేల బడుచున్న కేతన, కిరీటాదులను ఉల్కలతోఁ బోల్చుటవలన కాంతి. ఎత్తు నుండి వేగముగా బడుట అను సమానధర్మములు గమ్యమానములై 'ఉల్కలు రాలుట చేటుకాలమును సూచించుటకు' అను లోకసామాన్యమగు భావము కూడ నిట ప్రస్తుతార్థసమర్థకముగాఁ జెప్పఁబడినది.

అర్జునుని బాణములచే ముందరి కాళ్లు తెగి ముందరికి బడుచున్న గుఱ్ఱములు తమ రౌతులను రక్షింపుమని వేడుచున్నట్లు ఉన్నవనియు, నేల గూలిన మదగజములచే కప్పఁబడిన భూమి మేఘములచేఁ గప్పఁబడిన ఆకాశమువలెనున్నదనియు తిక్కన వర్ణించెను. ఇవియుద్ధమును ప్రత్యక్షముగా చూచియుండనిచో కవి చెప్పలేని భావములు. వర్ణ్యవస్తువు సాక్షాత్కారము వర్ణనవలని పరమప్రయోజనము అని భావించినచో ఈ గజ తురగ వర్ణనము అత్యంతప్రయోజనవంతముగా చేయఁబడినదని చెప్పవచ్చును.

అర్జునుని మత్తశుండాలముతో కవి ఒకపరి పోల్చియుండఁగా నిచట అర్జునుని బాణసంఘంబును మత్తశుండాలముతోఁ బోల్చి వానికి ప్రాణము బోసెను. మత్తశుండాలత్వంబు నిట అర్జునునియందుఁగాక అతని బాణచయమునం దారోపించుట వానికి ఔదాత్త్యమును కలిగించుటయే యైనది. తిక్కన యుద్ధము నెంత అభినివేశముతో వర్ణింపగలఁడో పైవర్ణనలు నిరూపింపగలవు.

కొంత యుద్ధము జరిగిన వెనుక ఆ యుద్ధభూమి ఎట్లున్నదో తిక్కన వర్ణించినాఁడు. గుఱ్ఱముల గిట్టల తాకిడికి ఎగసిన ఎఱ్ఱని దుమ్మువలన, బాణములు రక్తము పూయఁబడినటు లుండుటవలన, శత్రుసైనికుల రక్తము చిందించుచు వాయువు వీచుటవలన అకాలసంధ్య యైనట్టులుండగా ఏనుగుల కుంభస్థలములనుండి రాలిన ముత్యములు నక్షత్రములవలె నున్నవట. మదజలము నాస్వాదించు తుమ్మెదలు అర్జునబాణముల వలన బెదరి ఎగయుట పొగవలె, అర్జునుని బాణములు శత్రువుల బాణములతోఁ దాకినపుడు కలిగిన మంటలు జ్వాలలవలె, ఆ బాణములచే సైనికుల ఎముకలు పగులుట వలన ఏర్పడు శబ్దంబులు కార్చిచ్చుయొక్క చటచ్చట శబ్దంబుల వలెఁ దోఁపఁగా అర్జునుఁడు కార్చిచ్చువలె కౌరవసైన్యమను అరణ్యమును దహించుచున్నా డని కవి ఉత్ప్రేక్షించెను.

అటు పిమ్మట నెత్తురుమడుగులను నీళ్ళతో, తెల్లగొడుగులను తెల్ల తామరలతో, వింజామరలను హంసలతో యుద్ధరంగము కొలనువలె నుండగా అర్జునునిచే ఖండింపఁబడిన శత్రువుల ఇనుపబాణముల తునకలు తుమ్మెదలవలె ఆ కొలనుకుఁ బోవుచున్నవట. యుద్ధరంగమును తామరలు, హంసలు గల కొలనుతోఁ బోల్చుట బీభత్సరసము నరికట్టి కావ్యరసమును బోషించుటకుగా చేసిన కల్పనయే. అర్జునుని బాణములచే పగులఁగొట్టఁబడిన రిపుకపాలము నుండి వెలువడిన మస్తిష్కపలలము పంకము వలెను, అతనిచే నఱుకఁబడిన సైనికుల కాళ్ళు గనిమల వలెను ఉండుటచే యుద్ధభూమి విత్తుటకు రొంపిచేసి గనిమలమర్చిన వరిమడివలె నున్నదట. అర్జునుని బాణములు దగిలి రాలునట్టి శత్రుకిరీటంబులలోని వజ్రమణులు చతురహాలికుండు సల్లు పరువంబు మొలకలవలె నున్నవఁట! ఈ రమణీయ రూపకల్పన అత్యంత సామాన్యముగా నిత్యజీవితమున చూచునట్టిదే. అయినను దానిని దీనితో పోల్పఁగలుగుట ప్రజ్ఞాశాలియైన కవియూహకే సాధ్యముగాని అన్యులకుగాదు. ఆ సంగ్రామము అభిరామముగా నున్నదఁట, అయ్యును ఘోరప్రకారంబయ్యెనఁట.

తొలుత కొంత ధైర్యముతో అర్జునుని దాకిన సైనికులు అతని విజృంభణమును గాంచి భయపడి పారిపోవుటను తిక్కన వర్ణించెను. కొందఱు దూరముగా తొలగిరి, కొందఱు యుద్ధరంగమును వీడిచనిరి, మఱికొందఱు

అర్జునుఁడు సర్వసైన్యనాశనము గావింపనిదే విరమింపఁడని వెఱఁగందగా కొందఱాతఁడు సూర్యాస్తమయమగుదాక పోరుసాగించునని వెనుదీసిరి. దేవతలుకూడ భయపడునంత తీవ్రముగా అర్జునుఁడా సేనలో వీరవిహారముచేసెను. యుద్ధమునందైనను ఆయావ్యక్తుల చిత్తవృత్తులను మనోభావములను తిక్కన విశ్లేషించి చూపునని పై పై నికుల భావవర్ణనమున గమనింపవచ్చును. అంత రంగమున నున్న మృదుభావములను తట్టిలేపినట్లు తిక్కన వర్ణించును. దానితో సహృదయుఁడు కథయందలి పాత్రలతో సహానుభూతిని బొందును.

బాణముల సంఖ్యనిచ్చుచు తిక్కన ఒండు రెండు పద్యములను (4.5-66) రచించెనే కాని అవి చాల తక్కువ. యుద్ధవర్ణన మనఁగా బాణ సంఖ్యలతో నిండియుండునను భ్రాంతి అవిచారమూలకమగు నొక యపోహ[18] అని కొందఱు విమర్శకులు పేర్కొనియుండుట ఇట స్మరణీయము. సంఖ్యాదికముల నొండు రెండు పర్యాయము లిచ్చినంత మాత్రమున నది దోషము గాదు. కాలసూచనము వలె సంఖ్యాదులును ఎడనెడ సూచింపఁబడుటలో నేగి లేదు,

అర్జునుఁడు కర్ణుఁడు చేసిన యుద్ధమును తిక్కన తీవ్రమైన దానినిగా వర్ణించెను. వారిమధ్య అస్త్రవిద్యాస్పర్ధ యుండుట అందులకు కారణముగా గ్రహింపవచ్చును. భీష్మద్రోణాదులు ఆ యుద్ధమునం దేమాత్రము ఉత్సాహము లేనివారు. అర్జునునకైనను కర్ణ, దుర్యోధనులతో నున్న వైరము తదితరులతో లేదు. తక్కినవారు ఆచార్యస్థానము నందున్నవారు. అందు వలననే పాత్రలనెఱిఁగి తిక్కన యుద్ధవర్ణనమును జేసెను.

అర్జునుఁడు కర్ణుని గ్రమ్ముటను వ్యాసుఁడు గరుత్మంతుఁడు పాముని పట్టు విధముతోఁ బోల్చెను. గరుడ, సర్పములకు ఆజన్మవైరము ప్రసిద్ధము. ఇట అర్జున, అర్కసుతులకు మధ్యనున్న వైరమును అట్టిదే. గరుత్మంతుని వలె అర్జునుఁడే విజయుఁడగు ననునదియు ప్రసిద్ధము, ఈ అలంకారము సార్థకము గాన యథామూలముగా గ్రహింపఁబడినది. ప్రళయాంభోధరము పాషాణ వర్షముతో శైలమును గప్పినట్లు నరుఁ డతీవాస్త్రసంతానను అధికమయి కర్ణుని కప్పివేయఁగా, కర్ణుఁడు పెనుగాలి జీమూతమండలిని వలె ఆ బాణ సమూహములను దొలగించెనట. అప్పుడు కర్ణుఁడు అవష్టంభోజ్జ్వలాకారుఁ

డయి యొప్పెనట (4.5.84). ఇట అర్జునుని జీమూతముతో, కర్ణుని పెను గాలితోఁ బోల్చి కర్ణుని అధికత్వతను ఒక కొంత తిక్కన నిరూపించెనని పించుచున్నది ముందుచెప్పఁబోవు 'విలసద్గాండివచాలనోద్ధతి కనద్విద్యుల్లతా లీలగా'అను పద్యములో (4 5.105)గూడ అర్జునుని అంబుదముతోఁ బోల్చుట వర్ణనసామ్యమని ఎంచవచ్చును.

కర్ణార్జునుల వాదప్రతివాదములు. పేళనాతిరస్కారవా)లు ఇట వర్ణింపఁబడినవి. ఈ సంభాషణలు కొంత భిన్నముగా నుండి యుద్ధవర్ణనలతో ఉద్విగ్నమైన పఠిత మనస్సునకు విశ్రాంతిని కలిగించును. సంభాషణలు నాతి దీర్ఘములై చమత్కారవాక్యములతో కూడియుండుటచే రుచిరములగును. తిక్కన యుద్ధవర్ణనలను ప్రఖ్యాతములు గావించిన వీ రుచిరసంభాషణలు గూడ.

ఇట అర్జునుఁడు అవమానాగ్నితో జ్వలింపఁబడియుండుటచే తీవ్రముగా కర్ణుని యుద్ధమునకుఁ బిలిచినాఁడు. సభలలోఁ బలుకుట కాదు ఇట చూపుము నీబలిమి, తమ్మునిపాటును గన్నారగాంచితివి కనుక పిఱికివాఁడవై పరుగిడక యుద్ధము చేయుము అని అంతటితోనాగక తనమనమున రాజుకొనుచున్న అవ మానాగ్నిని వెలిగ్రక్కెను.

"ఆ. పలుకవచ్చుఁ గాక పలికిన యట్టుల
చేయవచ్చు నెట్లు దాయ యెందుఁ
బోయె దట్లు ద్రుపదపుత్రికఁ బఱువంగఁ
గాంచి నగిన ఫలము గందుగాక." (4 5.90)

ద్రుపదపుత్రికను నాడు చూచి నవ్వినదానికి ఫలమనుభవింపుమని అర్జునుఁడనఁగా నాడు ధర్మహాని యగుననిగాదు కండబలము జాలక భయపడి తివి, ఇప్పుడైనను రాజ్యభాగము లభించునని ఆశతో అరణ్యవాసము నను భవించితివి, మున్ను నీవు చేసిన యుద్ధములను వింటిని, చూచినగదా నమ్మి వాఁడను అని కర్ణుఁడాడెను. ఒకరిమాట లింకొకరి యందలి రోషమును ప్రజ్వలింపఁ జేయునవిగా నున్నవి. ఇంతకన్న విస్తృతములుగా నుండుటయు తగదు. మూలమున పదునారు శ్లోకములుండగా తిక్కన వానిని పదు పద్య ములలో రచించెను19.

శరజాలములు పటుజ్వాలములుగా కేతువు శిఖయై వెలుంగగా అర్క తనూభవాగ్ని ప్రజ్వరిల్లినదట. అర్జునాంబుదము శరపరంపరలు ధారలుగా గురిసి ఆ అగ్నిని చల్లార్పఁగా కాంతి తఱిగిన ముఖాంబుజములతో కౌరవ సేనాసరోవరంబు దీనభావమొంది నట్లున్నదట. ఈ వర్ణన మత్యద్భుతముగా నున్నది. యోధ ప్రతియోధులవలె ఈ ఉపమానము లోకదానిని మించి మఱి యొకటి సావయవములై సంపూర్ణములై యున్నవి. సేనను సరోవరముతో, కర్ణుని అగ్నితో, అర్జునుని పర్జన్యముతోఁ బోల్చుట తిక్కన పాటించిన వర్ణన సామ్యము. యుద్ధవర్ణన నింత సుందరముగా చేయవచ్చునని లక్ష్యమును చూపినాఁడామహాకవి. సమగ్రమగు రూపకాలంకారమిందునిబంధింపఁబడినది. ఈ అలంకారముచే యుద్ధ వర్ణనము భూషితమగుచున్నది.

"సీ. రోషంబు భీషణరూపమై చెలువొందఁ
నతులకేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పటుజ్వాలలై నిగుడ న
ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్ల
నద్ధతి నైఁపక యుజ్జ్వల దివ్య ప
తాక మెఱుంగుగా దళిత ధరణి
రథనేమి రవము గర్జనముగ శరపరం
పరలు ధారలుగాఁగఁ బరగి యడరె

ఆ. నర్జునాంబుదం బనన్య సామాన్య స
ముద్యమమున ముఖపయోరుహముల
కాంతి దఱఁగి యపుడు కౌరవసేనా స
రోవరంబు దీనభావ మొంద" (4.5.105)

'రోషంబు భీషణరూపమై' అను మాట యొక్కటి చాలును అప్పటి కర్ణుని ఉగ్రాకృతి నూహించుటకు. తక్కిన సాదృశ్యము లందుకు పోషకములు. అర్జునాంబుద మను దానికి టెక్కెము మెఱవుగా, రథనేమిరవము గర్జనగా నున్నవనుట అంగములే. అలంకారము నౌచిత్య మెఱిఁగి ప్రయోగించుటచే నది ఇచట వీరరస పోషకముగా నమరినది.

అర్జునుఁడు కర్ణునిపై 'గిరిపైఁ బిడుగులు దొరఁగెడు వరుసన దృఢ దీప్త శాతభల్లము' లేసెనట. అర్జునుని అమ్ములకు వెఱచఱచి కర్ణుఁడు పరుగెత్తఁగా మత్స్యపతిసుతుఁడు అరిచెనఁట. తన రథికుఁడుగెలిచిన తరుణమున సారథి సంతోషమును పట్టలేక నఱచుట స్వాభావికము. ఇట్టి సహజ వర్ణనల వలన ఈ యుద్ధవర్ణన రంజకమై యొప్పుచున్నది.

కర్ణుఁడోడి పాఱిన పిదప అర్జునుఁడే ద్రోణు నెదుర్కొన నిశ్చయించి నట్లు తిక్కన రచించెను. ఆ సమయమున ఉత్తరుని చిత్తవృత్తిని తిక్కన చక్కగా వర్ణించి చూపెను.

"ఉ. వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లు ని
న్నొక్కలియైన శౌర్యమును నిర్భరతేజము నంతకంతకి
ట్లెక్కుడు లావుఁ జూచి మది యెంతయు బెగ్గిలె మేను చేష్టలం
దక్కె నశక్యమింకట రథవ్యవహారము నిర్వహింపఁగన్."
(4.5 112)

ఈ సాత్త్వికభావములను ఉత్తరునియందు పోషించుట, ఆతని భయ విహ్వలతను మాన్పుటకు అర్జునుఁడు ధైర్యమును కలిగించుచు బలుకుట కథలో ఒక కొంత వైవిధ్యమును పాటించుటయైనది.

"నేను గలుగంగ నీకేమి యెలమి వాహ
నముల ఉబ్బుగ సంచోదనంబు సేయు" మని అర్జునుఁడు పలుకుటను ఉత్సాహమును స్థాయిభావముగా పరిపుష్టము చేయుటకుగూడ తిక్కన కల్పించెను.

ద్రోణునితో అర్జునుఁడు తాను ముందు బాణములువేయుటకు వెఱతు నని పలికినపుడు ఆచార్యుఁడే ఇరువది సునిశిత బాణముల నేసినట్లు తిక్కన వర్ణించెను. ఆచార్యుని తాను ముందుగా నొప్పించనని ఉత్తరునితోఁ బలికినట్లు మూలమున గలదు.

"క. గురుశరములు సితపక్ష
స్ఫురణంబున నంచపిండు పొలుపు వహించెన్
నరు బాణతతి ఘనావలి
కరణి మిగుల నొప్పె నల్లగలుల చెలువునన్." (4.5.130)

ద్రోణుని బాణములు సితపక్షస్ఫురణంబున హంసల గుంపువలె నున్నవి. అర్జునుని నల్లని రెక్కలుగల బాణతతి మేఘసమూహమువలె నొప్పుచున్నది- ఇది ఈ పద్యమునందలి వాచ్యార్థము. కాగా మేఘములనుచూచిన హంసలు భయపడును. కావున అర్జునుని బాణములచే ద్రోణుని బాణములు తిరస్కృతము లగుచున్నవను ధ్వని, ఇందు కలదు. అర్జునుని బాణముల ఆధిక్యమును ధ్వనిమూలకముగా తిక్కన తెలిపెను. ఇచట అలంకార ధ్వని కలదు.

"గగనం గగనాకారం సాగరస్సాగరోపమః।
రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ ॥"

అన్నట్లు ద్రోణార్జునుల యుద్ధమునకు కూడ తుల్యసాదృశ్యము లేదని 'సాదృశ్యం బదృశ్యంబుగన్' అని తిక్కన వర్ణించెను.

"శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీర మధుర జ్యానాద ముద్దామ వీ
ర వ్యాపార నిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁబోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్"
(4.5 132)

ఇట్లు వర్ణించుచునే ద్రోణాచార్యునిచే నరుని కొనియాడఁ జేసినాఁడు తిక్కన. 'అర్జునుని నాహవంబున నిర్జింపఁగ నగునె ఫాలనేత్రున కైనన్' అని ప్రశంసించినాఁడట ద్రోణుఁడు. గురుప్రశంస నందిన శిష్యుని ఘనతను చెప్పుటకు వేరుమాట లేల ? పర్జన్యసుతుఁడు శరవర్షోర్జితమూర్తి యగుట ఉచితమనియు శ్లేషమూలకముగా కవి భావింపఁజేసెను.

రుధిర దర్శనముననే భయ, పవ్యాభావము లుదయించును. అట్టిచో రుధిరసాగర వర్ణన మన్న నెంత జుగుప్సావహముగా నుండవలె. కాని తిక్కనకవితాశిల్పమున సకేయూరంబులగు బాహుదండంబులను సకుండలంబులగు కర్ణపాశంబులను సకిరీటంబులగు శిరోభాగంబులను కలిగిన రుధిరసాగరము రత్నాకరత్వమును సార్థకముఁ జేసికొనెను. రమణీయ భయానకమగు నిట్టి రూపకల్పనయే తిక్కన వర్ణనలలోని వైశిష్ట్యము.

అర్జునుఁడు కృపాశ్వత్థామలతో చేసిన యుద్ధములను తిక్కన సంక్షే పించెను. దుర్యోధన, కర్ణ, భీష్మ, ద్రోణాచార్యులతో చేసిన యుద్ధముల ముందు నివి ఎక్కువ తీవ్రములు గానేరవు. అశ్వత్థామ ఎదిరించినపు డర్జునుఁడు 'చిరునగవొప్ప' గాండివమును సారించెనట. వారి బాణములను చిచ్చుఅపిడుగులతో తిక్కన బోల్చెను. మూలమునందు అర్జునుఁడు ద్రోణాశ్వత్థామ లిరువురితోఁ బోరునపుడును 'వృత్రవాసవయోరివ' అని వర్ణింపఁబడినది. ఒకే సాదృశ్యమును ద్రోణాశ్వత్థామ లిరువురకు నుపయోగించుట అంత ఉచితముగాఁ దోపదు

యుద్ధమునందు ఒకరి విజృంభణము ఎదిరి వీరుని రెచ్చగొట్టునను సామాన్య ధర్మము నుద్దేశించి తిక్కన చక్కని రూపకల్పనమును గావించెను.

"క. పటు విశిఖపంక్తి యత్యు
త్కట రయమున నిగుడఁ జేయఁగా నశ్వథ మూ
దుట నైన మండె దీప్తో
ద్భట భంగిఁ గృపానలంబు బలములు వొంగన్."

(4.5.147)

అర్జునుని బాణపాతము కృపానలమును ప్రజ్వలింపఁ జేయుటకు ఊదుట వలె నైనది అని తిక్కన వర్ణించుట సహజ సుందరముగా నున్నది.

అర్జునుఁడు అంతకంతకు విజృంభించుటను బట్టి తిక్కన ఆతనిని 'రౌద్రరసవినోది' యనెను. ఇచట రసపదము వాచ్యమగుట దోషము కాదు. పలన ఈఘట్టమున ప్రధానరసము యుద్ధవీరము. వీరమునకు రౌద్రాదులంగము లగుటచే వానిని రసపర్యంతము పోషింపక భావములుగా మాత్రమే పరిమితము గావింపవలెను. అందుచే అర్జునుని 'రౌద్రరసవినోది' అని రసశబ్ద వాచ్యముగావించి రౌద్రమును నిలువరించెను. ఇది రసశిల్ప రహస్యముల నెఱింగిన తిక్కన ప్రతిభ. 'ధనుశ్చాలన దీప్తమూర్తి' అని వర్ణించుట కూడ ఆ యుత్తమవీరుని వీరమునకు పోషకముగా నున్నది. రసనిర్వహణమున తిక్కన పాటించిన మెలకువలు అనితరసాధ్యములు.

అర్జునుని ఆహవక్రీడ చేతులతీఁటవోఁ జేసినదట. ఆతని కాయుద్ధమెంత

సుకరముగా సాగినదో ఈ జాతీయము తెలుపుచున్నది. ఇట్టిదానినే జాతీయౌచిత్యముగా గ్రహింపవలెను.

పూర్వము ఆ యా వీరుల ఆభరణములచే రక్తసాగరమునకు రత్నాకరత్వమును సాధించిన కవి ఇచట మాంసము పంకముగా, ఆయుధములు మత్స్యములుగా, వింజామరలు నురుఁగుగా, శూరుల శిరస్సులు కమలములుగా నెత్తురుటేఱును వర్ణించినాఁడు (4.5.157). అర్జునునెదుర్కొనఁ నెంచిన వృషసేనుని తిక్కన కొండను దాకు పొట్టేలుగా పేర్కొనెను. వారి అంతరము ఆ అలంకారమునందే గమ్యమానమగుచుండుట చమత్కారము. అట్లందఱిని జర్జరితాంగులఁ జేసిన పార్థుఁడు 'ప్రహాసోల్లాసభాసి' యైనాఁడఁట. అనఁగా యుద్ధమువలన అతఁడు ఆవంతయైన శ్రమమును పొందలేదని ధ్వని. కంటువడని ఉత్సాహము నిరంతరముగా అంతర్వాహిని వలె సాగినది ఈ సన్నివేశమున

భీష్మునితో అర్జునుని యుద్ధమును వర్ణించుచు తిక్కన 'వృషభముల భంగి నక్కురు, వృషభులు" ఒండొరులఁ దాకిరని పోల్చెను. వారిరువురు కురువంశజులగుట ఇఁట ఈ పోలికకు మూలమైన అంశము. వారి శంఖనాదములను వృషభముల అంకెలుగా తిక్కన పేర్కొనెను. వారిరువురి శంఖనాదములను వర్ణించునెడ తిక్కన చూపిన అంతరము గమనింపఁదగినది.

"శా. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవరాజసైన్యముల్
సంతసమంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ దు
ర్దాంతభుజాబలప్రకట దర్పమెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతినికాయ కర్ణపుట దారణవృత్తము దేవదత్తమున్."
[4.5.164]

రచనలో, సమాసఘటనలో పాటించిన భేదము వలన ప్రస్తుతార్థము సమర్థింపఁబడుచున్నది. భీష్ముని శంఖనాదము కౌరవరాజ సైన్యములు సంతసమందుటనే ఫలముగాఁ గలిగినది. అందు తీవ్రత ఎంతమాత్రమును లేదు, అందుకు తగిన రీతిలోనే వృత్తప్రథమార్థము తేలికగా సాగినది. నరుఁడు దన దుర్దాంత భుజాబలప్రకటదర్ప మెలర్ప నూదినాఁడు దేవదత్తమును. ఆ ధ్వని కురుసైన్యమును మాత్రమే భీతావహ మొనరించునదిగాదు, దిగ్దంతినికాయ

కర్ణపుటములనే భేదింపఁజాలినట్టిది. ఈ తీవ్రతను తిక్కన సమాసఘటిత సంయుక్తాక్షర, ఓజోగుణభరిత రచనారీతిచే సాధించెను. రసపోషణ కనువుగా తిక్కన రీత్యలంకారగుణములను సంపదించుటను ఇచట గమనింపఁగలము.

విజయుఁడు విల్లునొకపరి తునుమఁగా నాతఁడు మఱియొక విల్లు నందుకొనెను. రెండవసారి అర్జునుఁడు పితామహుని విల్లు దునుమఁగా నపుడు వేఱొక విల్లునందుకొనక మునుపే యాతని వక్షమునందు క్రూరశరంబుల నాటి మూర్ఛితుఁగావించెను. ఇవ్విధముగా ప్రముఖ యోధులందఱు వోడిన పిదపగాని అర్జునుఁడు రారాజును ఎదుర్కొన లేకపోయెను.

ఉత్తరుని అలసటను ఇచట మఱియొకపరి తిక్కన వర్ణించెను (4.5.186). సారథ్యమునకే ఉత్తరుఁడంత అలసినచో యుద్ధముజేయు పార్థుఁ డెంత అలసిపోవలెనో అనిపించును. కాని, ఆతఁ డెంతమాత్రమును అలసట నొందక "నేను గలుగ నీకు నోహటింపనేల" యని నవ్వుచు పలికెనని వర్ణించి వారిరువురి అంతరమును కవి వ్యంగ్యముగా భావింపఁజేయును. వాచ్యముగా పేర్కొనుటకంటె నిది మేల్తరము గదా !

దుర్యోధనార్జునులు పోరునపుడు ఏనుంగేనుఁగుఁ దాకినట్లున్నదని తిక్కన వర్ణించెను. వికర్ణుఁడెక్కి వచ్చిన హాస్తిపురిఁ బేరుగల మదహస్తి ఫాల కుంభసంధి బగిలి క్రిందఁబడినపుడు "కులిశ చండాహతిఁబడు మహానగంబు భంగి" నుండినదట. ఇంద్రసూతిబాణమును వజ్రాయుధముతోఁ బోల్చుట సముచితముగా నున్నది దీనిని తిక్కన మూలమునుండి యథాతథముగా గ్రహించెను. మూలముననున్న ఉచిత భావాలంకారములను తిక్కన విడిచి పెట్టఁడనుట కిదియొక ఉదాహరణ మాత్రమే. నేలబడిన ఆ ఏనుఁగు పద్మ రాగ మాలికలతో నుండుటచే కార్చిచ్చు గ్రమ్మిన పర్వతమువలె నుండెనని తిక్కన వర్ణన – ఇది అమూలకము.

అర్జునుని సింగముతో కౌరవసైన్యమును మాతంగయూథముతో పోల్చి ద్రోణుఁడు 'సింగం బాఁకటితో' అను పద్యమున పేర్కొనియుండెను. ద్రోణాచార్యుని పోలిక అన్వర్థమైనదనుటకు తిక్కన అర్థానిని ఇచట మఱల ప్రయోగించి వర్ణించెను.

"తే. యూథపతి తోడి దంతి సముత్కరంబు
వెనుకఁ దగిలెడు సింగంబు విధము దోఁప
నార్పు నాదంబుగాఁ నరుఁడంటఁ దాఁకె
రాజుఁ దారును జాతెడు రథికవరులు." (4 5.197)

ఇందు దుర్యోధనుని యూథపతిగా భావించుటయు తగిన విధము.

కురువీరులు దుర్యోధనుని కొఱకు ఆగక చనుచుండ ఆతఁడు 'దీన వృత్తి' పలికెనట. శత్రువుని దీనవృత్తి యుద్ధమునకు చరమాంకము. నాయకుని విజయము నీమాట పరోక్షముగా దెలుపుచున్నది. పారిపోవుచున్న దుర్యోధనుని ఉపాలంభించుట అర్జునుని విజయోత్సాహమునకు ప్రతీక. 'కౌరవరాజ యొకండ; నేఁబృథాపుత్రులలోనఁ బిన్న' అని అర్జునుఁడనుట తనకంటె పెద్దయైన భీమసేనుని గుర్తుచేయుట యగుచున్నది. దుర్యోధనునకు భీమునితో గల స్పర్ధను అర్జునుఁడు వెలిదీయుచున్నాఁడీపలుకులలో. 'ధాత్రి బ్రసిద్ధికెక్కి దర్పసమగ్రుఁడవైన నీవు' అనుట హేళనాపూర్వకమగు వర్ణన తిక్కన అర్జునునిచే నిట్లు పలికించుట సందర్భోచితముగా నొప్పుచున్నది.

"సీ. ఏనుఁగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ
రాఁ బురవీథులఁ గ్రాల గలదె
మణిమయంబైన భూషణజాలములు నొప్పి
యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూర చందన కస్తూరికాదుల
నింపు సొంపార భోగింపఁ గలదె
యతి మనోహరలగు చతురాంగనలతోడి
సంగతి వేడ్కలు సలుపఁగలదె

తే. కయ్యమున నోడిపోయినఁ గౌరవేంద్ర
వినుము నాబుద్ధి మరలి యీ తనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి నూఱుఁగలదె
జూదమిచ్చుట నాడంగరాదు సుమ్ము." (4.5.204)

యుద్ధవర్ణనతో దీర్ఘముగాసాగిన సన్నివేశములో చతుర సంభాషణలు గూర్చుట ఒక ఆహ్లాదకరమగు శిల్పరహస్యము. ఈ పద్యమున అర్జునుని భావములు సరసమగు శైలిలో గూర్పఁబడినవి. 'జూదమిచ్చుట నాడంగ రాదు సుమ్ము' అను చివరి వాక్యములో అనంతమైన అర్థము దాగియున్నది.

"క. నీ యట్టివాఁడు నిన్నీ
పోయెడిదే యిట్లు పోకు పోకు మనుఁడు భూ
నాయఁకుడు మరలి పటుకో
పాయత్తతఁ ద్రొక్కఁబడిన యహిగతిఁ గవిసెన్."

(4.5.206)

మూలమున ఈ సందర్భమున 'మహాగజో మత్త ఇవాంకుశేన' అని యున్నది. అంకుశము యజమాని చేతిదైనచో మత్తేభము ఎదిరించదు. ఆతనికి లొంగి యుండును. ఆ పోలిక ఇచట అంత ఉచితముకాదని తోచును. ధర్మజుని పలుకులకు ఉద్రిక్తత నణచుకొను భీమునకు ఆ పోలిక ప్రయోగింపఁబడుట తగియుండును. 'పటుకోపాయత్తతఁ ద్రొక్కఁబడిన యహిగతిఁ గవిసెన్' అనుచెడ త్రొక్కఁబడిన భుజంగము తప్పక రెచ్చి కాటువేయ యత్నించును. దుర్యోధనుఁడిచట అర్జునునిపై కవియుటవలన ఈ ఉపమానము తగియున్నది– ఇదియొక చిన్నమార్పు అయినను ప్రకృతార్థమును లెస్సగాఁ బోషించుచున్నది.

సమ్మోహనాస్త్రమును ప్రయోగించిన పిమ్మట గాండీవ ధనుష్టంకారముచేసి కురువీరుల హృదయాలను దద్దరిల్లఁ జేసినట్లు మూలమున నున్నది. ఇది ప్రయోజన శూన్యమైన వర్ణనము. సమ్మోహనాస్త్ర ప్రభావముచే మూర్ఛితులైనవారు గాండీవధ్వనినెట్లు వినఁగలిగిరి. వారి మోహమును ఆ ధ్వని చెదరగొట్టునేమోగూడ. తిక్కన ఈ గాండీవధ్వని ప్రసక్తివదలి దానిచే ప్రభావితులైన కురువీరులను వర్ణించెను.

"ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలంగఁ
దలలు మెడలుఁ జక్క నిలువ కొఱగ

నెల్లవాఱు నెఱుక లెడలి చొక్కెక్కి ని
ద్రాతిశయము గూరినట్టులైరి." (4.5.208)

ఉత్తర గోగ్రహణ యుద్ధవర్ణనకిది చరమగీతము. తన్నుగాంచి భయపడి అడవిలోఁ దిరుగాడు సైనికుల కభయమిచ్చుట. తన విజయము నప్పుడే వెలిబుచ్చరాదని కోరుట, ఉత్తర మక్కువపడిన బొమ్మపొత్తికలను - కురువీరుల తలపాగాల-నుత్తరించి తెమ్మనుట తదనంతర విశేషములు. కౌంతేయుని కరుణపెంపును భీష్ముఁడు పొగడుట అర్జునుని పాత్రకొక మేలితొడవు. (4.5. 215, 216)

ఇట్లింత ప్రతిభోపేతముగా, పునరుక్తి దొరలకుండ, విసువు అనునది కలుగకుండ తిక్కన యుద్ధవర్ణనను గావించెను. ఇది తిక్కన ప్రతిభకు ఒక ప్రవేశము మాత్రమే. యుద్ధపంచకముతోఁ బోల్చిన ఇందలి యుద్ధము పరిణామమున, పరిమాణమున గూడ చాల సామాన్యమైనది.

"యుద్ధ వర్ణనమును విమర్శించి చూపుటకుగల యవకాశము చాల తక్కువ. ఊరక విషయము విషయముగా మాత్రమే చెప్పుట యగుచుండును. భారత యుద్ధమున ప్రధానవీరుల విషయముగనుక కొద్దిగా సూచింపఁబడినది. ప్రధానవీరు లితరులతో యుద్ధము చేయుట యనియు, అప్రధానులు ప్రాధాన్యము గలవారితో యుద్ధము చేయుట యనియు, నింకను వింగడించి చూపవచ్చును. అట్లు చేయుట గ్రంథము పెంచుట. ఏమనగా మాటలు భేదమేగాని అసలు విషయమంతయు నొకవిధమైనదియే. వాడు వాని నైదు మార్గణముల గొట్టెను. వీనిని మూడు నిశితసాయకముల నొప్పించెను. ఒకడొక బాణమున నొకని సూతుని గుఱ్ఱములను చంపెను. వేరొకఁడు శరమరివోయు చుండగా వానికరము నెదుటివాఁడు తునిమెను - ఈ విధముగా నెంతసేపైనను యుద్ధమును వర్ణింపవచ్చును. భారతయుద్ధ మంతయు నిట్లే యున్నది."[20] అనుమాట లిచ్చుట పర్యాలోచింపఁదగినవి.

ఒక్క విరాటపర్వము నందలి యుద్ధవర్ణనలే ఇంత చిత్రవిచిత్రములై యుండ యుద్ధపంచకము నందలి కురుక్షేత్ర యుద్ధవర్ణనమెంత అధ్యయన పాత్రమై యుండవలె. తిక్కన - యుద్ధపంచకము అనునంశము ప్రత్యేకా

ధ్యయనమునకు తగినది. ఇంకను వ్యూహములు, ధర్మాధర్మ చర్చలు పెక్కు లందు గలవు. అట్టిచో "యుద్ధవర్ణనమును విమర్శించి చూపుటకుగల యవకాశము చాల తక్కువ" అని శ్రీ శాస్త్రిగారు పలుకుట ఆశ్చర్యకరము. "ఊరక విషయము విషయముగా మాత్రమే చెప్పుట" అనునది మూలకర్త వ్యాసుఁడు గాని, అనుకర్త తిక్కన గాని చేయలేదు. అట్లుచెప్పిన అది వార్త యగునేమోగాని కావ్యము గాదుగదా!

తిక్కన చేసిన యుద్ధవర్ణనలు కావ్యరసపోషణకు లక్ష్యములు. అవి అనితర సాధ్యములు! అత్యంత ఆసక్తిదాయకములు!!

సూచికలు :—

1. "నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః।
ఉద్యాన సలిల క్రీడా మధుపానరతోత్సవైః॥
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః।
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి॥"
— దండి కావ్యాదర్శము

"క. వన జలకేళీ రవిశశి
తనయోదయ మంత్రగతిరత ఋతిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హ నగ విరహదూత్య వర్ణనాష్టాదశమున్"
— నన్నెచోడుని కుమార సంభవము – ఆ. 1. ప. 44.

2. సీ. పురము పు ఋతుషట్కమును ప్రయాణంబును
శైలంబు వేఁటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమ. బును మంత్రంబు
దూత్యంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్యకథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోచితంబు

పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస.

— అప్పకవి

3. "మూర్తి చిత్రణలో స్థిరరూపమును వర్ణించుటకంటె చరరూపమును వర్ణించుట కష్టమైన పని. రూపగతమైన సహజసౌందర్యము దాని చలనావస్థలో ద్విగుణీకృతమై మోహనమగును. ఆ చలనావస్థను వర్ణించు నేర్పు ఎగిరెడి పక్షిని కొట్టెడు విలుకాని నేర్పువంటిది. తిక్కన క్లిష్టతరమైన అట్టి చరరూపమును వర్ణించుటకే కుతూహల పడును." — ఆంధ్ర సాహిత్య చరిత్ర – ఆచార్య పింగళి లక్ష్మీకాంతము, పుట – 235.

4. తిక్కన కావ్యశిల్పము – డా. కేతవరపు రామకోటిశాస్త్రి, పుట– 387

5. తిక్కన ఉత్తర సౌందర్య వర్ణనము సమూలకముగా చేసెను.

4.1. 245; 4.4. 26

6. "ఈ పద్యము తరువాతి రచన యంతయు కేవల కవితాశక్తితో నున్నది." — తిక్కన కావ్యశిల్పము – డా. కేతవరపు రామకోటిశాస్త్రి,

పుట – 400

7. "తిక్కన్నగారు చేసిన ప్రకృతి వర్ణనలు కొన్ని నిర్మాణకుశలుఁడైన మహాకవి చేసినవివలె నున్నవి. మరికొన్ని ముక్తకకవి చేసినట్లున్నవి. ఈ రకము విరాటనునందును మరియు నుద్యోగమునందును గలవు. కవితాశక్తిచేత నవి గొప్పగనే యున్నవి. కావ్యశిల్పము చేత లేవు. లేకపోవుటకు కారణము మనకు తెలియదు." — తిక్కన కావ్యశిల్పము– డా. కేతవరపు రామకోటిశాస్త్రి, పుటలు – 413, 414.

8. నిర్వచనోత్తర రామాయణము – ప్రథమాశ్వాసము.

అవతారిక – 5 — తిక్కన

9. "తత్కాలము నందలి ద్రౌపదీ భీముల మనోలక్షణములకును, అప్పటి వేకువ చక్రవాకముల సంభోగముతో వర్ణింపబడుటకును నేమి సంబంధము?

— పుట 391

"మొట్టమొదట చూపబడిన వేకువజాము నందలి చక్రవాకముల సంభోగ వర్ణనము నందలి యౌచిత్యము నిప్పు డూహింపవలయును. అది వ్యస్తమైన కవితాశక్తి. అది కథాగతికి సంబంధించి తదుత్కర్షాపాదకముగా లేదు" పుట - 395; తిక్కన కావ్యశిల్పము- డా. కేతవరపు రామకోటి శాస్త్రి.

10. నృత్త రత్నావళి-జాయపసేనాని; పదవ అధ్యాయము, పేరణి - శ్లో. 34 నుండి 68 వఱకు, పుటలు : 344 - 348; ప్రేక్కణము - శ్లో 77 నుండి 83 వఱకు, పుటలు 352 - 254; దండరాసకము - శ్లో 101 నుండి 107 వఱక, పుటలు 358 - 360; కుండలి - 164. పుట 372.

(ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ)

11. రామాయణ కల్పవృక్షము - విశ్వనాథ సత్యనారాయణ, అవతారిక పుట - 8.

"ఋషి వంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోఁట"

12. బాహుయుద్ధం తయోరాసీత్క్రుద్ధయో ర్నరసింహయోః।
వసంతే వాసితా హేతోర్బలవద్గజయోరివ॥ 4.21 49

13. పురాణపండ రామమూర్తిగారి వ్యాఖ్యానముతో గల ప్రచురణము నందు శ్లోకముల సంఖ్య లివ్వబడలేదు. సరస్వతి వేంకటసుబ్బరామశాస్త్రి చే వ్రాయఁబడి గట్టుపల్లి శేషాచార్యులచే ముద్రింపఁబడిన గ్రంథములో నీ రెండు శ్లోకములు 22వ అధ్యాయమున 64, 77 శ్లోకసంఖ్యలను గలిగి యున్నవి. వావిళ్ళవారిచే ముద్రింపఁబడిన సంస్కృత భారతమునందును ఇవి 22వ అధ్యాయమున 64వ, 77వ శ్లోకములుగానే యున్నవి.

14. 4. 30. 19, 20, 21.

15. 4. 30. 25 - 30

16. 4. 42. 3 - 18

17. 4. 43. 21 శ్లోకములు 4. 4. 200 - 205 వఱకు గల ఆఱు పద్యములు.

18. 4. 55 – 1 – 16 శ్లో
+ 588 – 95 ప.

19. తిక్కన కావ్యశిల్పము డా. కేతవరపు రామకోటిశాస్త్రి.
పుటలు – 303. 304.

20. యుద్ధము స్వభావముచేతనే వీర రౌద్ర భీభత్సముల కాట పట్టు. అట్టి యుద్ధమును బంచపర్వ విస్తృతముగ విసువు జనింపనియట్లు చిత్రించుట దుష్కర కార్యము. ఈ ఘట్టమును రచించుటలో ఋషితుల్యుఁడగు మహాకవి యవలంబించిన విధాన మద్వితీయము. జాగ్రత్తతోఁ బఠించు వారి కీ వర్ణనలోని వైవిధ్యము సందర్భోచితమగు శైలి, రసపోషణ యందలి యౌచితి ఇత్యాదులు సులభముగ గోచరించి, తిక్కన ప్రతిభను సువ్యక్తముఁ జేయును." — భారతము - తిక్కన రచన — భూపతి లక్ష్మీనారాయణ రావు – పుటలు. 70, 71.

—: o :—

# పాత్ర చిత్రణము - తిక్కన నేర్పు

విరాద్యోగములు భారత కథయందు మిక్కిలి ప్రధానమైనవి. ఉపాఖ్యానములు, ఉపదేశములు నిడివితక్కువైనవి. వానిని సైతము తిక్కన క్లుప్తీకరించెను. విరాటపర్వము భారతము నందొక అంతర్నాటకము వంటిది. పాండవులు వేషధారులై చరించిన విధము ఆసక్తిదాయకము. ఈ పర్వము నందు భీమసేనుఁడు, ద్రౌపది ప్రధానముగా నెన్నదగిన పాత్రలు. అర్జునుని విషయము కూడ కలదు కాని ఆతని పాత్ర విషయమున తిక్కన చేసినమార్పు లెక్కువగా లేవు. యుద్ధవర్ణనలో అర్జునుని ప్రసక్తి గతార్థమగును. ఇఁక ఉద్యోగ పర్వమునందు ప్రధాన పాత్రలు ధర్మరాజు, శ్రీకృష్ణుడు, సంజయుఁడు, ధృతరాష్ట్రుడు, దుర్యోధనుఁడు. వీరి వ్యక్తిత్వములను తిక్కన బహుముఖముగా చిత్రించి వారి వారి విలక్షణతలను ప్రకాశము చేసెను.

ధర్మానురక్తి, క్షాత్రశక్తి రూపుదాల్చిన బుద్ధిజీవిగా ధర్మజుని, విజ్ఞులు మెచ్చు వీరునిగా, అగ్రజానువర్తియైన అనుజునిగా, ఉత్తమ నాయకునిగా భీమసేనుని; క్షత్రియకులోచితమగు రాజసమును, క్రోధ, రోషాదులను పంతరించుకొనిన ధీరవనితగా ద్రౌపదిని; దివ్యాదివ్యునిగా భారతకథకే సూత్రధారిగా శ్రీకృష్ణుని; అలరువిలుతుని పువ్వుటమ్ముపలె సింగారించి ముగ్ధానాయికగా ఉత్తరను; తొలుత భీరువై పిదప ఉచితజ్ఞుడైన రాకుమారునిగా ఉత్తరుని; వలపుపాశములోఁ బగుల్కొని అసువులు బాసిన విషాదనాయకునిగా, దుర్విదగ్ధునిగా కీచకుని; తెలిసియు తెలియని నరునిగా, దురభిమానిగా మహిమోన్నతచిత్తునిగా దుర్యోధనుని; ఆతనిని పెడత్రోవ పట్టించిన దురాశాపరునిగా, తనయుని మించిన దుర్మంత్రంబు నెఱపిన తండ్రిగా ధృతరాష్ట్రుని; నయోన్నతునిగా సంజయుని; నీత్యుపదేశమునే గాక ప్రస్తుత కర్తవ్యమును బోధించిన ధీశాలిగావిదురుని; వినయమును మించిన వ్యక్తిత్వముగల వీరునిగా సహదేవుని; పరిస్థితుల ప్రాబల్యమున పాపకార్యమున కొడంబడిన పడతిగా సుధేష్ణను; నృత్తగీతాది కళలొకవైపు, ధనుర్విద్య మఱియొకవైపు సవ్యసాచిత్వము నెఱపిన సాటిలేని మేటి వీరునిగా అర్జునుని; ధర్మపక్షపాతులుగా భీష్మద్రోణా

దులను తిక్కన పోషించెను! పాత్రము ప్రధానమైనదా కాదా అను భేద మాతనికి లేదు. ఎంత చిన్న పాత్రమునైనను, పరిమితికి లోఁబడి సమగ్రముగా మలచిన శిల్పి తిక్కయజ్వ. అతని దృష్టి ఏ పాత్రమునెట్లు నడపిన రస పోషణకనువుగా నుండునా యనియేగాని ఆ పాత్రము త్తమమా, అధమమా అని గాదు.

ఆయా పాత్రముల నన్నింటిని గూర్చి కూలంకషముగా ఇట చర్చింపఁ పూనుట సాధ్యముకాని పని. కీచక, ఉత్తర, విదుర, భీష్మ, ద్రోణాది పాత్రము లాయా సందర్భములందు ప్రవర్తితము లగుటంజేసి వానిని గూర్చి ఇట విశ్లేషింపఁ బూనుకొనలేదు. తక్కిన పాత్రముల విషయమునందును తిక్కన చేసిన మార్పులు మాత్రమే ఆధారముగా ఆ పాత్రపోషణ ఎట్లు జరిగినదో చర్చించుటయైనది. పాత్రపోషణలో తిక్కన చూపిన మెఱుఁగులు స్థాలీపులాకన్యాయముగా ఉదహరింపఁబడినవి.

కావ్యమునందలి స్త్రీ పురుషుల నందఱను పాత్రములనియే పేర్కొన వలెను. అంగాంగ భేదముచే రసములను విభజించినట్లు ప్రధానాప్రధాన పాత్రములని విభజించి పేర్కొనవచ్చును. కాని "భారతమున పాత్రములు ధృతరాష్ట్రుఁడు, దుర్యోధనుఁడు, ధర్మరాజు ముగ్గురె"[12] అనుట విపరీతము.

ధర్మరాజు : భారతమునందు నాయకుఁడు ధర్మరాజు. ఎవని ఇచ్ఛననుసరించి ఒక కార్యము రూపుదాల్చునో ఆతఁడు ఆ కార్యమునకధిపతి. భారత కథయందు ధర్మరాజు నాయకుఁడు, దుర్యోధనుఁడు ప్రతినాయకుఁడు. ఏలనన రాజ్యము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలవలెననునది ఆ ఇరువురి మనోభిలాష. ధర్మమార్గానుయాయియైన ధర్మరాజు తన ఆ కోరికను వెల్లడింపలేక పెద్దల ఆజ్ఞానువర్తియై చరించును. కాని దుర్యోధనుఁడు అధర్మపరుఁడై ఏ విధముగానైనను పాండవుల నంతమొందించి, నిర్ద్వంద్వముగా రాజ్యమునేల దలఁచినాడు. దుర్యోధనుని ఈ బుద్ధి కథను ముందుకు నడిపినది. ధర్మరాజు అభిలాష కథను తుదిముట్ట నిర్వహింపఁ జేసినది. వీరు ప్రధానపాత్రములు! కాగా వీరి చిత్తవృత్తుల కనుగుణముగా కార్యములను సాధించినవారు అనుజులు. ఇంతకు నిర్వాహకుఁడు శ్రీకృష్ణుఁడు – ధర్మపక్షము నవలంబించి దుష్టశిక్షణను నెఱపిన అవతారపురుషుడు. వీరి రూప, స్వభావ చిత్రణమే భారతకథావగాహనకు సరియగు సాధనము.

ధర్మరాజు మూలమునందొక ఆదర్శపురుషుఁడు; పరమధార్మికుఁడు. ఇంతకు మించి అతని మనసులోని సంఘర్షణగాని, భావపరంపరగాని, ఆలోచనా తీవ్రతగాని చిత్రింపఁబడలేదు. ఆంధ్రమహాభారతమున - విశేషించి విరాటోద్యోగపర్వములందు మానవస్వభావమునకు సన్నిహితముగా తిక్కన ధర్మరాజును తీర్చిదిద్దినాఁడు. అనుబంధముగా అతనియందు క్షాత్ర ధర్మమును గలదు. అతనిలోని ఈ ధర్మమునకు, రాజనీతికి నిరంతర సంఘర్షణ జరిగినది. చివఱకు అతనిలో క్షాత్రము, ధర్మము ఏకోన్ముఖమై, క్షాత్ర ధర్మమగు యుద్ధము జరిగినది. యుద్ధమునకు తొలుత విముఖుఁడైన ధర్మరాజు యుద్ధమునే నిశ్చయింపవలసి వచ్చినది. ఈ క్రమపరిణామమును, అతని సంశ్లిష్ట మానసికోద్వేగమును తిక్కన అమూలకముగా చిత్రించుచు వచ్చెను.

ధర్మజుని సోదరప్రేమ, అజ్ఞాతవాస నిర్వహణమునందుగల పట్టుదల, విరాటునిపట్లగల కృతజ్ఞత, సంభాషణా చాతుర్యము, అవమానమునకు తగిన సమాధానమునిచ్చి తన శక్తిని లోకువగట్టనివ్వని ఉద్వేగము, తనకన్న ఎక్కువగ ధర్మాధర్మ విచక్షణ గలిగిన కృష్ణునిముందు తన మనసులోని సంఘర్షణను వెలిబలుకు వినయము తిక్కన కల్పనలలో నొనగూడిన ప్రయోజనములు. ధర్మజుఁడు వ్యాసునివలె, విదురునివలె సర్వసంగ పరిత్యాగి, ధర్మవేత్తకాఁడు. కాని అతఁడు ధర్మమునందు అమితమైన ఆసక్తిగలవాఁడు. జిజ్ఞాసువు. అందువలననే అతని మనసులో నిరంతరము ఒక మథనము జరుగుచుండెడిది. తమ్ములపట్ల అనురాగము, భార్యయెడల బాధ్యత, క్షాత్రధర్మము ఒకవైపు, కురురాజు పక్షములోని పెద్దలపట్ల గౌరవము, అహింస, కీర్తికాంక్ష ఒకవైపు అతనిని లాగుచుండెడివి. చివరకు కృష్ణుని ఆదేశము, తల్లి సందేశము అతనిని సంశయవిముక్తుని గావించి అహింసకన్నను క్షాత్రధర్మము ననుసరించి హింసచేయుట యుక్తమను నిశ్చయబుద్ధి నాతనికి కలిగించినవి

అట్టి నిశ్చయబుద్ధి కలిగిన పిమ్మట అతఁడు యుద్ధమునందు తక్కినవారి కంటె విజృంభించి అర్జునుని పైతము ప్రోత్సహించినాఁడు. తానై చంపక పోయినను భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనాదుల మరణములకు ధర్మజుని పూనికయే ప్రధానకారణము. ధర్మజుని యందు పైగుణముల నా యా సందర్భములందు తిక్కన యథోచితముగా నాపాదించెను. ధర్మజుని ధార్మిక

ప్రవృత్తియే ఆతనికి ఎనలేని గౌరవమును తెచ్చిపెట్టినది. ఆతనిలోని ఇతర గుణములన్నియు అందు లీనమైనవి.

ధర్మజుని ధర్మనీతివర్తనములో ధర్మమునకు, రాజనీతికి మధ్య జరుగు సంఘర్షణలో అతని అసలు స్వరూపమును తిక్కన భావింపఁజేయును. ధర్మజుఁడు బుద్ధిజీవి. ఆలోచన ఆతని జీవలక్షణము. ఇంతటి నిరంతర ఆలోచనా శీలుఁడు మఱియొకఁడు సాహిత్యమునలేఁడు. ఆలోచన అనగానే వివిధ మార్గములలో నెటు పయనింపవలెనను విచికిత్సయని చెప్పవచ్చును. ధర్మజుని ఆలోచనఫలితము మాత్రమే చెప్పినచో ఆతని స్వభావము పూర్తిగ అవగతము కాదు. తిక్కన ధర్మరాజులోని ఆ విచికిత్సారూపమైన ఆలోచనమును విశేషించి వర్ణించెను. ఇట్లు చేయుటవలన సహజత్వమేర్పడినది. నిజస్వరూపము తేటపడినది. ఏ మానవునికైనను రాగద్వేషములు హృదయసంబంధి లక్షణములు, ఆలోచన బుద్ధిజీవిలక్షణము. ఆతని సంయమనము వెనుక తప్పనిసరిగ ఉద్వేగము, ఉల్లాసము, ఎడనెడ నిస్పృహ ఆలలు అలలుగ ఎగసి పడుచుండును. ఈ హృదయాంతర్గత కల్లోలములను నిపుణముగ తిక్కన వర్ణించి రాగద్వేషముల కతీతముగ నుండుటకు ప్రయత్నించు ధర్మజుని శీలమును పోషించెను. ధర్మజుఁడు వీతరాగుఁడు మాత్రమే కాఁడు. కాని తక్కిన పాత్రములతో పోల్చి చూచినచో సంయమనశీలము కలవాఁడగుటచే అంత సులువుగా బయటపడఁడు.

సంజయుఁడు 'మెత్తనిపులి' యనుటలో అతని క్షాత్రధర్మము, రాజనీతి నివురుగప్పిన నిప్పు వలె నున్నవను ధ్వని కలదు. కృష్ణుఁడు అజాతశత్రుని ధర్మనిష్ఠయే కాక తగుచేవయు కలవానిగాఁ బలికెను.

విరాటోద్యోగ పర్వముల పరిధిలో ధర్మరాజుపాత్ర మెట్లు చిత్రీకరింపఁబడినదో పరిశీలించినచో ఆతని వ్యక్తిత్వ మవగతమగును. తిక్కన సూక్ష్మాతిసూక్ష్మ భావములను సైతము వెల్లడింపజేసెను. విరాటపర్వారంభములో ధర్మరాజు అజ్ఞాతవాస నిర్వహణమును దలంచి భయపడుచు, తన తమ్ములను చూచి దుఃఖించుచుండెను. అప్పటి ధర్మజుని చిత్తవృత్తిని గూర్చి మూలమున లేకున్నను తిక్కన విశ్లేషించి చూపెను. పాండవులందఱును తమ భంగపాటును విప్రులతో విన్నవించుకొనిరి. పిమ్మట ధర్మజుడొక్కడే 'విషణ్ణ హృదయుండై'

"క. ఒకనాఁ డేమును నాపద
లకు విడుమరఁ గాంచి విప్రులం జుట్టల బె
ట్టుకొని సుఖముండఁ బడయుదు
మొకొ యిప్పాటెందుఁ గలదె యొరులెవ్వరికిన్—(4-1-46)

అని డగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుఁడైనాడు, విషణ్ణహృదయుఁడు, దుఃఖపరవశుఁడగు నాయకుఁడు సానుభూతినందుట కర్హుఁడు. కథాంతము నందు ఆతండాపదలకు విడుమర గాంచి విప్రులతో, బంధువులతో సుఖపడుటను కాంక్షించుచున్నాడు. అతని ఈ కాంక్షయే కథను నడిపించు మూల సూత్రము. ఇదియే వారి అజ్ఞాతవాస వ్రతభంగముగాకుండ నిలిపిన హద్దు. 'డగ్గుత్తిక వెట్టి' అని సూచించుట ఆతని దుఃఖవివశతను తెలియఁజేయుటకే. ఆయా పాత్రల మనోభావములను బట్టి వారి ఎలుఁగులను తిక్కన వర్ణించు చుండును. నాయకుని చిత్తవృత్తి కథను నడిపించుచున్నది. ఆతని ఎడల ఇతరులకున్న గౌరవ మేపాటిదో తిక్కన ధౌమ్యుచే చెప్పించినాడు,

"ఉ. ధర్మనిరూపకత్వమున ధైర్య లసన్మహనీయవృత్తి స
త్కర్మవిధిజ్ఞతం జతురతామహిమన్ప్రథ బుద్ధి నెవ్వరున్
ధర్మజుసాటి గారనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టి నీ
పేర్మికినీడె దుర్దశలపెల్లునకున్ దురపిల్లుటారయన్.(4-1-51)

దుఃఖమను తమముచే గప్పఁబడిన నాయకుని 'ఉత్తిష్ఠ' అని ఉత్తేజ పరచినాఁడు హితుఁడు ధౌమ్యుఁడు. విరాటపర్వము నిట్లారంభించుటలోనే తిక్కన కావ్య మిమిడియున్నది. అరణ్యపర్వాంతమునఁ గల ఈ ధౌమ్యుని అనునయమును తిక్కన విరాటపర్వాదికిఁ దెచ్చినాఁడు. నాయకుని చింత ధౌమ్యుని ఓదార్పుతో కలకదేఱుట రసస్పర్శగల అంశము. నాయకునితో తదనుభూతులతో కథను ప్రారంభించుటకే తిక్కన ఇట్టి మార్పు చేసెను. ధర్మజుని గుణగానము ఆతనిలో అణగారిన ధర్మోత్సాహము నుద్దీపింపఁ జేయుటకుపకరించినది. దుర్దశలకు దురపిల్లుట ఉత్తమనాయకుని లక్షణము గాదు. ధర్మజుని వెత ధౌమ్యుని వచనములతో కలఁకదేఱినదట. కార్య కారణ ఫలితములిట్లు సంధానింపఁబడినవి.

"నీవును నాపదకోర్చి భంగపాటు దీర్చుకొనువు"23 అను నిప్పలుకులే ధర్మజుని, ఆతని తమ్ములను నడిపింపఁజాలినవి. ధర్మజుని దుఃఖము భీముని ఉద్వేగపరచినది. — ప.56.

భీముని ఉద్వేగమును గాంచిన ధర్మజునకు పూర్తిగ జ్ఞానోదయమైనది. తాను సంయమనము నేమాత్రము కోలుపోయినను, అనుజులు విజృంభింతురని తెలివొందిన మొగంబుతోడ శిరంకంపనము జేసినాఁడు. భీమ మత్తేభమునకు ధర్మజుని నిగ్రహము అంకుశమువంటిది.

ధర్మరాజు లోకభీతి ఎక్కుడుఁగలవాడు. అప్పుడప్పుడాతఁడు దుఃఖ వివశతతో మాటలు జారవిడుచును గాని ఎవరోయొకరాతనికి ధర్మమార్గమును నిర్దేశించి చూపుచుందురు. ఇచట ఆ పని ధౌమ్యుడు నిర్వర్తించినాఁడు.

ధర్మజుని పట్ల ఆతని అనుజులకుగల ప్రేమ, భక్తిగౌరవములు ఎనలేనివి. ఆతనిని గూర్చి సవ్యసాచి భావించిన తీరు —

"సీ. మహనీయమూర్తియు మానవైభవమును
సౌకుమార్యంబును సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వమహిమయు నవగత
కల్మజషత్వంబును గౌరవంబు
శాంతియు దాంతియుఁ జాగంబు భోగంబుఁ
గారుణ్యమును సత్యసారతయును
ధర్మమయక్రియా తత్పరత్వంబును
గీర్తిధనార్జన క్రీడనంబుఁ

"తే. గలిగి జనుల నేలఁగాని యెన్నండును
నొరులఁగొల్చి తిరుగ వెరవులేని
యట్టి నీవు విరటు నెట్టి చందంబున
ననుసరించువాఁడ వధిప చెపుమ. (విరాట-1వఆ-67వప.)

ధర్మరాజు గుణగణములిందు పేర్కొనఁబడినవి. ఇవియన్నియు ఉత్తమ నాయకుని లక్షణములు. ధర్మరాజును సాత్త్వికుఁడైన అర్జునుఁడింతగా

శ్లాఘించినను వింతలేదు. కాని ఉద్ధతుఁడైన భీముఁడు, ఎడనెడ అన్నగారి అభిప్రాయముల నంగీకరింపని యాతఁడు అతనిని గూర్చి ఏమియును పలుకక పోయినను అక్షరముల ఆతని ఆజ్ఞలను నిర్వర్తించుచుండును. తనకంటె బలవంతులగు తమ్ములను తన కనుసన్నలలో మెలగునట్లు చేసికొనిన ధర్మరాజు వ్యక్తిత్వమట్టిది.

"....ధర్మతనయుం గనుంగొనిన నతండు దన నయనాకారంబున వారించి యిట్లనియె"—(విరాట-2వఆ-136వప.)

ప్రళయకాలమునందలి కాలునిభంగి రౌద్రమూర్తిత్వమును దాల్చిన భీమునిపై తము ధర్మరాజు 'తన నయనాకారంబున' వారింపఁగలిగెను. అంతటి భయదస్ఫురణమును దాల్చిన భీమసేనుఁడు అన్న కనుసన్నలలోని భావమును గ్రహించి కోపానలమును చల్లార్చుకొనినాఁడు. ధర్మజుని మనో బలమట్టిది. అతని మానసికశక్తికి భీమార్జునుల శారీరకబలము లొంగిపోవుట పలుమారులు జరిగినది.

భీముఁడొక్కమాటలో ధర్మజుని గూర్చి తన అభిప్రాయమును దెలిపి నట్లు తిక్కన రచించెను. ద్రౌపదితోనాతఁడు ధర్మరాజును గూర్చి చెప్పుచు- 'ధైర్యహేమాచలుండైన ధర్మసుతుఁడు'అనెను. ఇంతకన్నపొగడ్తఏమికలదు: 'సత్యవ్రతనిష్ఠుఁడగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం దగువాఁడు కాని దూఱు పడ నర్హుండుగాఁ'డని మఱల ద్రౌపదికి నచ్చచెప్పినాఁడు. ఉచితానుచితములను భీమునిచే చెప్పించుట ధర్మజ, భీమసేనుల పాత్రలకు వన్నెబెట్టుటయగు చున్నది.

శమీవృక్షముపై ఆయుధములనుంచి దానిని భీమునకు వశములు గావలదని ప్రార్థించి, తిరిగి అలుకవహింపకుండ తమ్ముని అనునయింపఁజూచిన చాతుర్యము తిక్కన నేర్పినదే. (విరాట-1వఆ-117వ.ప, 178వ.వప.)

ధర్మరాజు ధర్మదేవతను ప్రార్థించినట్లు మూలమున లేదు. ధర్మరాజు పాండుపుత్రుల దుఃఖపరంపరలకు మూలకారకుఁడయ్యు, వారికొఱకు ఇసుమంతేని వగచినట్లు ఎచటను చెప్పబడకుండుట ఆతని వ్యక్తిత్వమునకు మచ్చయగును. అందుచే తిక్కన ధర్మజుఁడు తన అనుజులను రక్షింపుమని ధర్మదేవతను ప్రార్థించినటుల కల్పించెను. ఇది ధర్మజుని సోదరప్రేమను నిరూ

పించుటకై తిక్కనచేసిన పెంపు. తమ్ములయెడ ధర్మజుఁడు బద్ధానురాగుఁడను అభిప్రాయమిచట కుదురుచున్నది.

"ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన
వరము చిత్తగించి వలయు తెఱఁగు
సమయ సముచితముగా సమకట్టుమయ్య యీ
రాకుమారు లవిధిఁ బోకయుండ.
— (విరాట-1వ.ఆ-181వ ప.)

వ. అనుజులదెసకుఁ జూచి వగచి డగ్గుత్తిక వెట్టి మఱియును.

ఉ. అంబరవర్తి వైనఁగని యత్తుత నీ సగపడ్డ వీరి ప్రా
ణంబులు మున్ను నిన్నడిగి నల్వురకున్నయవిక్రమ ప్రభా
వంబులు వేఁడికొన్న నతివత్సల భావముఁ బొంది యాదరా
ర్ద్రంబగు చూడ్కితోఁ బ్రియహితస్థిరభాషల నూఱడింపవే.
(విరాట-1వఆ-182వప. 183వప.)

—అనుజుల స్థితికి వగచిన ధర్మజుఁడు ప్రత్యక్షముగా నున్నాఁడిచట.

వ. 73 : '.... తత్కాల జనితం బయిన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పులడంచి ధైర్యంబవలం బించి యిట్లనియె.'

వ. 84 : '... బీభత్సు వీక్షించి ఘూర్ణమానమానసుండగుచు నిట్లనియె'

వ. 91 : '... నెమ్మనమ్మున నుమ్మలికమ్ము గదుర, నెలుఁగుచందము వేఱుగా నిట్టులనియె.'

వ. 97 : '.... యిట్లను వగలు మిగిలి కొందలపఱుపన్.'

వ. 99 : '.... ఆతనికిఁబుట్టిన యుత్తలపాటు గొంత డిందుపడంగన్.'

వ. 102 : '....పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుండగుచు నిట్లనియె.'

తమ్ములు, సతి అనుభవింపబోవు కష్టమునకు ధర్మజుఁడు వగచి దుర పిల్లుట సహజము. అప్పటి ఆతని చిత్తవృత్తిని, అలజడిని ఖేదమును స్వరకంప

నమును. నిట్టూర్పులను. తిక్కన చక్కగా సూచించి పరిపూర్ణమానవునిగా ధర్మజుని పాత్రమును పరిపోషించెను. రాగద్వేషాతీతుఁడు కాని ధర్మరాజు యందు ఖేదమోదములను చిత్రించుట, అందును ఆ సందర్భములో పరిత పించినట్లు వర్ణించుట అత్యంతావశ్యకము. ఇందు ధర్మజుని ఆర్ద్రిత గమనింప దగిన యంశము.ఆర్ద్రిత ఉత్తమపాత్రయొక్క ముఖ్యలక్షణములలో నొక్కటి గా లాక్షణికుల అభిప్రాయము కలదు.

ధర్మరాజు సన్యాసివేషమున విరాటుని గొల్వరాగా అతనిని గాంచిన విరాటుని మనోగతభావములను తిక్కన వెల్లడించెను. 'జగములెల్లను నేలగఁ జాలు తేజము', 'ఆ మువ్వురతోడ జోడగు సుమూర్తి' అని విరటునిచే బలికించుటలో నొక ప్రయోజనమున్నది. అంత తేజస్వి యగుటచేతనే ధర్మజుఁ డడిగినదే తడవుగ విరటుఁడు యుద్ధమునకు తనతోఁ గొనిపోవుటకంగీకరించెను. బృహన్నలను కీర్తించుచున్నను విరటుఁడు కొంతదనుక ఓర్పు వహించెను. 'సుమూర్తి' యని ఇచట మూర్తిని వర్ణించెను.— (ప.185,186,187.- 1వ ఆశ్వా.)

ఇప్పటికి ధర్మజుని రూపము, తద్గుణములు, తేజము. రాగము' దైన్యము ఇత్యాదిభావములు చెప్పబడినవి. విరటుని కడకేతెంచిన పిమ్మట ఎచటివాఁడవని రాజడిగెను. అందులకు—

ఆ. ఉన్నరూపు పలుకు నన్నరు లెక్కడఁ
గలరు తోఁచినట్లు పలుకు పలుక
నైన చందమయ్యె నంతియ కాకంత
పట్టి చూడగలరె యెట్టివారు (విరాట-1వఆ. 18వప.)

ఇచట ధర్మరాజు గడుసరిదనము వెల్లడింపఁబడినది. తా నసత్యమాడరాదు. సత్యము పలికిన సమయభంగమగును. అందుచేసత్యమును నిర్ధారింపక అటునిటు తేల్చక దాటవేసినాఁడు. ఇట్టి గడుసరితనము మూలమునందు స్పష్టముగా పోషింపబడలేదు. రాజాతనిని గాంచినంతనే వినమ్రుఁడై నాఁడనగా అతని తేజోరూపమెట్టిదో ఊహింపవలయునే గాని వర్ణింపనవసరము లేదు. తన రాజ్యమునే సమర్పింప దలచినాఁడనుట ధర్మజుపాత్రకు వన్నెపెట్టుటయే గదా.

రాజు తనవలె భోగభాగ్యముల ననుభవింపుమనికోరగా వేషధారియైన ధర్మజుండు యతీంద్రుని వలెనే పలికెను.

క. ఏను హవిష్యము కుడుతును
భూనాయక నాకు శయ్య భూమియ యిమ్మైఁ
బూని వ్రతంబులు సలిపెదు
వానికి విన్నియును నిట్లు వలయునె చెపుమా.
(విరాట-1వఆ.-205 వప.)

వేషమునకుఁ దగిన భాషణమును తిక్కన ధర్మరాజునకు గలిపెను. మూలమునందు లేని విధముగా ధర్మజుఁడు తనను గూర్చి సత్యాసత్యము లెరుకపడకుండ పలికినాఁడిచట.

క. ద్విజుఁడఁ గురువిషయజాతుఁడ
సుజనప్రియుఁడైన ధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమ కలితుఁడ మ
నుజవల్లభయోగ్య బహువినోదకరుండన్.
(విరాట-1వఆ.-195వ ప.)

బహువినోదపరత్వము తిక్కన చేసిన పెంపు. రాజస, సాత్త్విక గుణముల సమ్మేళనము ధర్మరాజు. ఈతని రాజస ప్రవృత్తి, చతురవచో నైపుణ్యము తిక్కన కూర్పులో స్పష్టపడినవి.

కీచకునిచే భంగపడిన ద్రౌపది ధర్మరాజు చూచియు చూడనట్లుం డుటకు గినిసి రాజు నుద్దేశించి పరుషములాడినది. ఆ సభలో ఆమెను అడ్డగించుటకు వీలులేదు. అయినను సమయభంగము గాకుండ పరిస్థితిని చక్కదిద్దవలె. అట్టి పరిస్థితిలో తొలుత రోషాయుతచిత్తుడై వృక్షమును పెకలింపనున్న వలలుని తన నర్మగర్భములగు పలుకులచే నివారించినాడు. భీముఁడన్నగారి ఆజ్ఞకు బద్ధుఁడైయూరకొనెను. కాని, ద్రౌపది ఇంకను రెచ్చిపోయినది. ధర్మరాజు అపుడు ప్రవర్తించిన తీరు తిక్కన శ్రద్ధవహించిన విధమునే తెలుపును.

ఉ. అప్పుడు ధర్మసూతి హృదయంబు కలంగ లలాటభాగముం
గప్పఁగ ఘర్మవారి యధికంబగు రోషము నొంది
యుండియుం
దప్పఁగఁద్రోచికొంచుఁ దన ధైర్యము పెంపున నిర్వికారుఁడై
యెప్పుడుఁదాను బల్కు నెలుఁగేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్.
(విరాట-2వ ఆ'-147వ ప.)

ఇందు ప్రతిపదము ధర్మరాజు స్వరూప, మనోభావములను చిత్రీకరించు నట్టిదే. హృదయము కలగినది, రోషము పెరిగినది, నొసట చెమట లొడమినవి. అన్నిటిని తన స్థిరచిత్తముచే నిర్వికారుఁడై తొలగద్రోసికొని ద్రౌపదితోఁ బలుకఁదొడఁగినాఁడు. ఆప్తులతో ఆర్ద్రముగా మాటాడునపుడు స్వరము చలించును. అందును ఇచట ద్రౌపది పరిభవమును కన్నులార గాంచియు, ప్రతీకారమొనర్పలేని ఆతని నిస్సహాయత గొంతులో వినఁబడ వచ్చును. కాని ధర్మజుఁడు 'ఎప్పుడుదాను బలుకు ఎలుగేర్పడ' బలికినాఁడట. అట్టిది ధర్మజుని చిత్తవృత్తి. ఎంత చెప్పినను సభవీడలేదు పాంచాలి. ఇంక 'ఎద్దియేనియుం బలుకఁ దలంచినది'. అపుడు ధర్మజుఁడు అసహాయుఁడై ఆక్రోశముగాఁ బలికినాఁడు. ఏమియు చేయలేని నిస్సహాయత ఏర్పడినపుడు అకారణముగా నెదుటివారిని నిందింపఁజూచుట మానవస్వభావ సైజము. సభలో నిలుచుట కులసతులకు తగదని నెమ్మదిగానే బలికినాఁడు. అయినను సైరంధ్రి ఊరుకొనక మఱింత వాగ్వివాదము చేసినది. అది వేరువిషయము. ధర్మరాజు నిదానమునకు; భీమసేనుని, ద్రౌపదియొక్క ఆవేగమునకు ఇచట అంతరము చెప్పఁబడినది – సందర్భానుగుణముగా (విరాట–2వ అ.; 150 వ ప.) ధర్మరాజును జూదరియని నిండుసభలో నెత్తిపొడిచినది; పాంచాలి – రాజస ప్రవృత్తి రూపుదాల్చిన అంగన.

సభలో ధర్మరాజు నన్యాపదేశముగా నీసడించిన ద్రౌపదికి ధర్మరాజన్న అపరిమితమైన ప్రీతిగౌరవములు గలవు. ధర్మరాజు మహిమాన్వితుఁడని తిక్కన వర్ణించిన పద్ధతి ఆతని పాత్రనుదాత్తీకరించినది. 'ధృతిమాలి బలికితి' నని సైరంధ్రి భీమునితో చెప్పి ధర్మరాజు సమస్తజన స్తపనీయుండని నది.

క. ధర్మతనూజవు సంతత
ధర్మనిరతి మనము బ్రదుకఁ దలఁచుట యరుదే
నిర్మలుఁడగు నాతని స
త్కర్మంబునఁ గాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్. (4 - 2 -188)

కవి తానుగ నొక పాత్రమును వర్ణించి పోషించుట కంటె వివిధ సంబంధములుగల ఆయాపాత్రలతోఁ బలికించుట సహజముగా నుండును. కోపముతో కన్నెఱ్ఱగాఁ బలికిన సతి, సాంత్వనముఁ బొందిన పిమ్మట ఇట్లు పలికిన దనఁగా ఆ పతియందంత అనురక్తియున్నదని అర్థము. తిక్కన ఆ కారణముగానే ధర్మజుని ధర్మనిరతి జగతికెల్లను ఏడుగడయని ద్రౌపది చేతఁబలికించినాఁడు. దిగ్విజయము, అజాతశత్రుత్వము, రాజసూయ నిర్వహణము, ధర్మైకనిరతి, నిత్యసత్యవ్రతము, గాంభీర్యము, ధైర్యము, కీర్తి, సుగుణములు, మహీసుర రక్షణము, ఉపకార పరత్వము పేర్కొనఁబడినవి. ఇవి ఇంచుమించు అర్జునునిచే తొలుత శ్లాఘింపఁబడిన గుణములే. కలిమికితగిన దానము, బలిమికి తగిన బలగము ఆతనికే తగునని ద్రౌపది విశ్వాసము.

".సీ / ఎవ్వని వాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజినడఁగు
నెవ్వని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానిత సంపద లీనుచుండు
నెవ్వని గుణలత లేడు వారాసుల
కడపటి కొండపైఁ గలయఁ బ్రాఁకు

తే. నతఁడు భూరి ప్రతాప మహాప్రదీప
దూర విఘటిత గర్వాంధకార వైరి
వీర కోటీర మణిఘృణి వేష్టితాంఘ్రి
తలుఁడు కేవల మర్త్యుఁడె ధర్మసుతుఁడు." (4 2.191)

ఇది ధర్మరాజు కీర్తికాయమునకు కిరీటతుల్యమగు ప్రశంస. ఇది తిక్కన అతిశయోక్తితో చేసిన పెంపు. అయినను అందు ధర్మజుని కాబోవు చక్రవర్తిత్వము సూచింపఁబడుచున్నది. రాజరికము వర్ణింపఁబడినది.

అవకాశమున్న ఇచ్చోట తిక్కన ధర్మజుని పాత్రను చక్కగా పోషించెను. ధర్మరాజు సాధారణమానవుఁడు కాఁడని, ధర్మదేవతనుండి రూపుదాల్చిన అవతారపురుషుఁడని ఇందు ధ్వనిగలదు. అప్పుడప్పుడు మానవ నైజమునే ప్రదర్శించుచున్నను అతఁడు ధర్మమునకు ప్రతిరూపు. ఈ విషయమును తిక్కన ద్రౌపదిచే భీమునకు చెప్పించుట జరిగినది. అనగా ధర్మజుని తత్వము ఆతని అనుజులకంటెను మిన్నగ ద్రౌపది గ్రహించినది అని ఇచట వ్యంగ్యమగును. తదనంతరము శ్రీకృష్ణుఁడు రాయబారమునకేగునపుడును ద్రౌపది ధర్మజుని నిరసించినట్లు గానే పలికినది. కాని ధర్మరాజు అంతరంగమున యుద్ధమునే కోరుచున్నాడని తెలియుటవలననే ద్రౌపది అట్లు పలుకఁగలిగినది. లేకున్న తన ఒక్కదాని అభిప్రాయమే యైనచో అంత నిక్కచ్చిగా పలుకఁజాలెడిదిగాదు.

ధర్మరాజు కృతజ్ఞతగలిగిన మానవోత్తముఁడని తిక్కన తీర్పు, తొలుత దక్షిణగోగ్రహణను పిమ్మట జరిగిన యుద్ధములో అతని మనసు తెలియును.

తే. ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి
యున్నవారము గావున నుగ్రరిపుల
పాలుపడకుండ విడిపింపఁ బాడి యితని
నెయిదు మెయిదుము రథరయ మెసక మెసఁగ.
(-విరాట-4వఆ-204 వ. ప.)

ఉపకారమునకు ప్రత్యుపకార మొనర్పఁ దలచినట్లు ధర్మజుని పాత్రమును తిక్కన పోషించెను. నాయకునియందిట్టి ఉదాత్తలక్షణములను పోషించుట రసదృష్టిగల కవి కర్తవ్యము.

విరటుఁడు ధర్మజుని సారెగొని వ్రేసెనని కనలిన తమ్ములను అతఁడు నివారించుచు విరాటుని తమ్ముల కోపానలమునుండి కాచెను.

చ. అనవుడు నాతఁడిట్టులను నక్కట యింతకు ముందరేమియున్
మనల నెఱుంగఁడవ్విభుని మాటునఁ బూనిక దీర్చికొంటి మా
తనికొక యెగ్గుసేఁత యుచితంబె యెఱింగెడు నట్లు
గాఁగఁ బో
యినఁగనియున్ దురుద్ధతి వహించినఁ జూతముగాక పిమ్మటన్.
(విరాట-5వఆ-313 వ.ప)

ఉపకారమును బొందిన వానికి అపకారమునెంచుట దుష్కార్యము. తమ్ములను అట్టి దుష్కార్యమునందు ప్రవర్తింపకుండ ఆపిన వాఁడు ధర్మజుఁడు. ఇది ఆతని పాపపుణ్య విచక్షణ. ఈ సన్నివేశము అమూలకము.

ధర్మజుని గూర్చి తిక్కనవారి యభిప్రాయములన్నియు నొక యెత్తు కాగా దుర్యోధనుని అభిప్రాయమొక యెత్తు. ఏలన సంతత విరోధముగల సుయోధనుఁడు ధర్మరాజును నిందించుటయే సాధారణముగా పొసగును. కాని ఆతనిచే ధర్మజుని గుణములు కీర్తింపఁబడిన అది ప్రశస్తమగును. ఉత్తర గోగ్రహణము సందర్భముగా యుద్ధము జరిగినది. విజయుఁడు బయలుపడి సంగ్రామమొనర్చి పశువులను మరలించెను. పార్థుఁడు అజ్ఞాతవాసము ముగియకమునుపే బయల మెలగెనని దుర్యోధనుని నిశ్చితాభిప్రాయము. భీష్ముఁడద్దానిని ఖండించి సమయపరిసమాప్తిని నిరూపించెను. అయినను కుమతియగు దుర్యోధనుఁడు 'గాంగేయుని వచనంబుల నప్రమాణంబులు సేసి ధర్మతనయుఁడసత్యంబున కియ్యకొనమి యెఱింగి' ఆతని పాలికి దూతనుబంపెనట (విరాట-5వఆ.-367 వ.ప.). ఈ కల్పనము తిక్కనచేసినట్టిది ఇది ధర్మజుని సత్యవ్రతమును నిర్ధారించుటకే ఉద్దేశింపఁబడినది. తోడ్తో దుర్యోధనుని దుర్మంత్రమును నిరూపింపఁబడినది. ధర్మజుని సత్యవ్రతముపై దుర్యోధనునకు గూడ నంత విశ్వాసమున్న దనుట చక్కని కల్పన. భీష్మునికంటె ధర్మరాజు ప్రమాణముగా నెంచఁబడుట ధర్మజుని ఆధిక్యతయేగదా! కాగా ఇందొక ప్రయోజనము కథకు సంబంధించినది గలదు. అది ద్రోణుఁడు కురుక్షేత్రమున ధర్మజుని పలుకులువిని అశ్వత్థామ మృతుఁడైనాఁడని నమ్ముట. దుర్యోధనుఁడే ధర్మజుని విశ్వసింపఁగా నిఁక ద్రోణుఁడు విశ్వసించుటలో వింతయేమి?

అచట ద్రోణుని విశ్వాసమును సమర్థించుటకే ఇచట తిక్కన ఈ కల్పన చేసినాఁడని చెప్పవచ్చును.

ఉద్యోగపర్వమున శ్రీకృష్ణరాయబారమున ధర్మరాజు యొక్క స్వభావమును తిక్కన పోషించిన విధ మత్యద్భుతము. సంజయునితో తన ఉద్దేశమును బలికిన ధర్మజునకును, కృష్ణునికడకేగి ప్రార్థించిన ధర్మజునకును బుద్ధిపరిణామము కలదు. సంజయునితోఁ బలుకునపుడు తన ఉద్దేశ్యమును సూటిగాఁబలుకక వ్యంగ్యోక్తులనాడి నాఁడు. తన మాటలలో యుద్ధప్రసక్తి రాకుండ జాగ్రత్తపడి నెపమును కౌరవులమీదనే యుంచుటకు బహుశ్రద్ధవహించినాఁడు కాని కృష్ణుఁడు సర్వాంతర్యామి. ఆతని నుండు తనను తాను తెలిసికొనినాఁడు ధర్మ జుఁడు. దాచినను దాగని తన మనోబుద్ధ్యహంకారములను వెలిగ్రక్కి తాను శాంతుఁడైనాఁడు. ధర్మరాజునందలి ఈ చిత్తవృత్తి భేదములను తిక్కన స్పష్టము చేసినాఁడు. ధర్మరాజుయొక్క గడుసుదనము సంజయు రాయబారము నందును, ధర్మముపట్ల గల భీతి కృష్ణరాయబారము నందును ప్రముఖముగా వర్ణింప బడినవి. ఉద్యోగపర్వమునందు ఆయాపాత్రలు స్పష్ట మగు భావములను వెలువరింపఁజాలినవి. రెండు రాయబారము లందుకు తగిన భూమికలైనవి.

ఉద్యోగపర్వమునందు సంధికై రాయబారములు జరిగినవే కాని ఫలితము మాత్రము యుద్ధముగానే పరిణమించినది. అందుకే ఉద్యోగము రణోద్యోగముగా మిగిలినది. సైన్య సమీకరణము కొఱకు ఇరుపక్షములవారి ప్రయత్నములలో పాండవుల అభీష్టములే సిద్ధించినవి. ఆ సందర్భములో ధర్మ జుని లౌక్యమును తిక్కన లెస్సగా వర్ణించెను. శల్యునితో "....మీకుం గర్ణ సారథ్యంబు గర్తవ్యంబుగాఁగలయది సమరసమయంబున నిరాకరించి పలికి కర్ణచిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యంబని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠింపవలయునని యభ్యర్థించి...." పలికినాఁడు. తెలుగునందు శల్యుఁడు తాను దుర్యోధనున కిచ్చిన వాగ్దానమును తెలిపినపిమ్మట ధర్మజుఁడట్లు పలికినట్లుగలదు. మూలము నందు శల్యుఁడు వచ్చి క్షేమమడిగిన వెంటనే ధర్మజుఁడు 'కర్ణునకు శల్యుఁడు

సారథ్యము వహించునెడ అతనిని నిస్తేజుని గావింపవలెనని' పలికినట్లు కలదు ఇది సమంజసముగా లేదు. శల్యుఁడు తమకు మేనమామ. అగుచో అతఁడు తమ సహాయార్థమే వచ్చెనని ఏల భావింపలేదు ధర్మజుఁడని శంక కలుగును. అట్టి అసమంజసమున కవకాశ మివ్వలేదు తిక్కనార్యుఁడు. పాండవుల కుశల మరసిన పిమ్మట శల్యుఁడు తానై తాను దుర్యోధనుని కోరికను మన్నించిన విధమును (ఉ.1.98 వ.ప.), అందులకు ధర్మజుడిచ్చిన ప్రత్యుత్తరము ధర్మ నియమానుసారిగా నున్నది. తొలుత మాట్లాడిన ధర్మజుఁడు వెనువెంటనే అకృత్యము చేయుమని అర్థించినాఁడు–

తే. మేలు సేసితి రొక్కరి మెచ్చి వారి
కోర్కి దీర్చుట పెద్దల గుణము కాదె
యది మదీయ చిత్తమునకు హర్ష కరము
తివిరి యొక్కటి వేఁడెద నవధరింపు.

(ఉద్యోగ-1వ ఆ. - 109 వ ప.)

ధర్మరాజులోని ఈ ద్వైధీభావమే చివరివరకు సాగినది. యుద్ధనీతి, రాజనీతి ఒకవైపు, ధర్మపథము మఱియొక వైపు ఆతనిని ప్రభావితుని జేసినవి అందువలననే శల్యుఁడు చేసినపనిని 'మదీయ చిత్తమునకు హర్ష కరము' అని పలికి, మఱల 'అకృత్యంబని యనుమానింపక కర్ణుచిత్తంబున కలంక పుట్టింపవలయు' నని చతురముగా నుడివినాఁడు. ఇది తిక్కనపోషించిన ధర్మజపాత్ర యొక్క స్వభావము.

ధర్మజుని చిత్తమున కెక్కునట్లు చతురోక్తులాడినవాఁడు సంజయుఁడు. అట్టివానికి కూడ ఎచటను పట్టుబడలేదు ధర్మరాజు. ఆతఁడు తాడిదన్ను వాఁడైనచో నీతఁడాతని తలదన్నువాఁడు. ఆవులించిన ప్రేవులు లెక్క పెట్టఁగలవాఁడు సూతుఁడైనచో ఆవులింపకే ప్రేవులు గణించువాఁడు ధర్మ తనయుఁడు. 'ఆ రాజు మాదెసంగల కారుణ్యము కతమునను సుఖంబున నిట్లున్నారము'ని ఒక విసురు విసిరెను. 'దయమాలిన ధృతరాష్ట్రుని ఉపేక్ష వలననే ఇన్ని ఇడుములు బడుచున్నాము'ను వ్యతిరేకార్థమవగతమగుచున్నది. ఇట్టి వక్రోక్తులు, ధర్మరాజునకు, ద్రౌపదికి అయాచితములుగా దొర్లు

చుండును. కౌరవుల కుశల మరయుచున్నటుల ప్రారంభించి 'గాండీవి భుజ బలంబు తలఁతురే భీమసేను గదావిహారముగ్గడింతురె' అని ఇత్యాదిగా తన తమ్ముల బలపరాక్రమాదులను గుర్తుచేయుచు 'తస్మాత్ జాగ్రత్త' యని హెచ్చరించినాఁడు. అంతటితోనాగక 'ఘోషయాత్రకు గంధర్వులు వచ్చిన చరిత్ర'ను జ్ఞాపకము చేసినాఁడు. ఇది ధర్మజునకు తిక్కన గఱపిన రాజకీయ చాతుర్యము. కర్ణుఁడన్న ధర్మరాజునకొక భీతి కలదు. అందుచే నాతనిని గూర్చి ప్రత్యేకముగా నడిగినాఁడు. ధర్మరాజు అంతరంగముననున్న కల్లోల మును గ్రహించిన సంజయుఁ డాతనిని పొగడి కార్యమును సానుకూలపరుప యత్నించినాఁడు. పొగడ్తకు లొంగని వారరుదుగదా! ధర్మజుఁడు పొగడ్తకు చిక్కని స్థిరపురుషుఁడు.

తే. ఇట్టి చందంబులెల్లను నీవు పుణ్య
చిత్తవృత్తి మై సైఁచినఁ జెల్లి వచ్చు
నీ యజాతశత్రుత్వంబు నిఖిలలోక
విశ్రుతముగాదె ధర్మప్రవీణ హృదయ.

(ఉద్యోగ-1వ ఆ. - 245 వ ప.)

ఇన్ని ప్రశంసలకును దొరకలేదు ధర్మరాజు. ధర్మరాజు ఎంతకును అంతుచిక్కనివాఁడని గ్రహించిన సంజయుఁడు యుద్ధమువలని ప్రయోజ నము లేమిని తెలియఁబలికి క్రోధశాంతిని గోరెను. కాని యుద్ధమును నిర్ణయించుట ధర్మరాజు అభిమతముగాదు. ఆ క్రౌర్యమును కౌరవులకే ఆపాదింపఁదలచి అటునిటు తేల్చకుండఁ బలికినాఁడు.

ఉ. నెయ్యముదప్ప నొండొకటి నీ చెవి సోఁకెనె నాదు పల్కులం
దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి నల్కెదు నీవు మాకుఁ దాఁ
గయ్యము దక్కి మన్కి తగు కార్యము గాదొకొ పోరితంబులే
కయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొండు సేయునే.

(ఉద్యోగ-1వ ఆ. - 304 వ ప.)

నెయ్యము దప్ప నొండొకటి బలుకలేదనినాడు ధర్మజుఁడు. యుద్ధ మును సంజయుఁడే ఉద్దేశించి పలికినట్లు ధర్మరాజు ఆరోపణ. కాని తన తమ్ముల వీరకృత్యములను దలఁచి అంతటివారు లేరనినది ధర్మజుఁడే. ఆ తరువాతనే సంజయుఁడు కురుపాండవులు సమానబలము వారలని నుడివి నాఁడు. సంధికోరిన సంజయుఁడట్లు పలుకుట సబబే. కాని అందుకు ధర్మజుఁ డంగీకరింపలేదు. తమ ఆధిక్యమును తిరిగి నొక్కి పలికినాఁడు. 'మును మమ్ముఁ బొగడి పదపడి యని వారల గెలువనరిది యని పొత్తుగఁ జెప్పిన మాటకు నే నొడఁబడ'నని తేల్చివేసినాఁడు. సంజయుని పక్షపాత వృత్తి విడువుమని నాఁడు. తమవైపు ధర్మమున్నదను నమ్మకము గలిగినవాఁడు ధర్మతన యుఁడు. అందువలననే ఇట్లు నిష్కర్షగా బలికినాఁడు సంజయునితో. ఎచ్చ టను దైన్యమును దోపనీయలేదు. 'రణమున వారలన్ గెలువరాదను పల్కు లటుండని'మ్మని ఒక్క మాటతో సంజయుని విన్నపము నంతయు తొలగ ద్రోచి 'మున్ను వారి దుర్గుణములు సైచుటీవు నొక కొంత యెఱుంగుదు' వని సంజయుని నిలువరించినాఁడు. ఇంత వాదప్రతివాదము లనంతరము తన ఉద్దేశమును తెలిపినాఁడు.

క. రండని పిలువ బనిచి పా
లిండని కొడుకులకుఁ జెప్పి యింద్రప్రస్థం
బొండెను వేఱొక పట్టణ
మొండెను మాకిచ్చి యనుచు టుచితము కాదే.

(ఉద్యోగ-1వ ఆ. - 327 వ ప.)

ఈ 'కాదే' అను కాకువు ధర్మజుని చిత్తప్రవృత్తిలోని రాజనీతి ప్రభా వము. ఎదుటివాఁడు తన అభిప్రాయమును బలపరుచునట్లు ప్రశ్నించుట యుక్తియుక్తము. ధృతరాష్ట్రుఁడు తను కోరినట్లు ప్రవర్తింపఁడని ధర్మ జునకు తెలియును. తెలిసియు, తనపై నెపము లేకుండుటకుగా ప్రయత్నించి నాడు. (ప. 317, 318)

ధర్మరాజు సంజయునితో బలుకునపుడు తొలుత వ్యంగ్యముగా పిమ్మట స్పష్టముగా, అటుపై 'వెడవెడ యలుక వొడమిన' తీవ్రముగా మాటలాడెను.

క. ఎదిరిం దమయట్టులకా
మదిఁ దలఁచిన బోసఁగుఁగాక "మాకుం గుడు మిం
డివె మీరు వ్రక్కఁగొనుఁ"డని
చదురడచిన మనసుపొందు చక్కంబడునే.

(ఉద్యోగ-1వ ఆ. - 312 వ ప.)

ధృతరాష్ట్రుని అంతరంగిక ప్రలోభమును ధర్మరాజు వెలిబలికి తన నిశితబుద్ధిని ప్రకటించుకొనినాఁడు. తన రాజ్యకాంతను అపహరార్థము కోరు నట్టి అర్ధభాగముగా వలువురు భావింపవలెనని ధర్మరాజు కోరిక. ఇదే అభి ప్రాయమును కృష్ణుని చెంత కూడ వెల్లడించినాఁడు. ఇచట పలికిన తీరు కొంత భిన్నము. తండ్రి తండ్రి యనుచు తన కుమారులనే పట్టుకొని మమ్ము నెట్టివేయుటెందులకని వృద్ధరాజునే ఎక్కుడుగ నీసడించినాఁడు ధర్మజుఁడు.

తే. వస్త్రమాల్యాను లేపనావసరములును
జతుర తూర్యత్రయంబుల సమయములును
నేము వెలిగాఁగ మాతండ్రి కించు నెట్లు
పుత్త్రులనవట్టి మమ్మేల పోవద్రోచు.

(ఉద్యోగ-1వ ఆ. - 309 వ ప.)

'సిరి నాకేలందునే గ్రాసవాసోదైన్యములకను....' భావమిందును కలదు. శ్రీకృష్ణునితో విన్నవించునపుడు వినయము, ఇచట తృణీకారము ఆతనిలో నిండియున్నవి. సంజయుఁడు కీర్తించినంత ఘనముగా ఒరులెవ్వరు ధర్మజుని కీర్తింపలేరనునంతగా తిక్కన సంజయునిచే కీర్తింపఁజేసెను. ఈ సంజయుఁడే ధృతరాష్ట్రునితో 'వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మెత్తనివులి' అని విన్నవించును. అనఁగా ధర్మరాజులో ఈ రెండు తత్త్వములు గలవని తిక్కన నిర్ధారణ చేసెను. ధర్మజుని అహింసాప్రవృత్తి, సత్యవ్రతము, ధర్మ పథమున సాగవలెనను కాంక్ష, నిగ్రహము ఇచట సంజయునిచే పొగడఁబడి నవి. ఆతని పట్టుదల, స్థిరచిత్తత, క్రౌర్యము, ధృతరాష్ట్రునిపట్ల గల అలుక అచట నిర్దుష్టములుగాఁ జెప్పబడినవి.

రుధిరాభిలాన్నము కంటె భిక్షాన్నము మేలని సంజయుఁడు పలికి నాఁడు. 'మీ నడవడికిన్' అని ధర్మరాజు నుద్దేశించి పలికి, ఆతఁడు హింస వైపు మొగ్గు చూపరాదని కోరినాఁడు. ధర్మరాజు కీర్తికాముఁడు. 'నడ డికిక' అను మాటకు లొంగిరావచ్చని సంజయుఁడు భావించినాఁడు. అంతే గాక కోపమును మ్రింగుకొను మని శిష్యునితోఁ బోల్చినాఁడు. అయినను ధర్మరాజు తేరలేదు. 'కోపంబు నివారింపం దగు నహింసయ యుత్తమ ధర్మంబగు నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగు పాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱచుట ధర్మంబని పెద్దలచేత విందు' మని దుర్యోధనుని అంతమొందించుటయే తమ ఉద్దేశమని, 'సంగ్రామంబు రాజులకు ధర్మంబవుం గాదని నీవు చెప్పు' మని సంజయునే తిరిగి ప్రశ్నించినాఁడు ధర్మరాజు. అట్లని తాను నిర్ణయము చేయనొల్లక 'మనల శాసింప వాసుదేవుఁడు గలఁడు' అని భారమునంతయు కృష్ణునిపై నుంచెను. ఇది ధర్మజుని యొక్క విజ్ఞత. తానుగా ఎట్టి నిర్ణయమును చేయక, తన అభిలాషను వ్యంగ్యముగా తెలియఁబలికి, కృష్ణునిచే తన కోరికను వెల్లడింపఁ జేసినాఁడు. ధర్మరాజునకు కృష్ణుని యందుఁగల భక్తి గాఢమైనది. ఆతనికిఁగల ఆ నిశ్చలభక్తియే కృష్ణుని పాండవపక్షపాతిగాఁ జేసినది. కృష్ణుని గూర్చి 'ఇతఁడు ధర్మా ధర్మవిదులకు గురుండు కార్యాకార్య నిరూపకులకు శిక్షకుం డుచితానుచిత జ్ఞులకుఁ బ్రదర్శకుం' డని సర్వధర్మములను పరిత్యజించి కృష్ణుని నమ్మినవాఁడు ధర్మజుఁడు. 'విశేషించి మాకు నితని బుద్ధియ సమస్త పురుషార్థమ్ములకు మూలం బగుట నితని వచనం బవశ్యంబు నలంఘనీయం బని' భేదములేని భక్తి ప్రపత్తులను ప్రదర్శించిన భక్తుఁడీతఁడు (ఉద్యోగ-1వ అ-323వ వచనము). కనుకనే కురుక్షేత్ర మహాసంగ్రామ సాగరమును తరింప గలిగినాఁడు కృష్ణ సాహాయ్యమున. మూలమునందును ధర్మరాజు కృష్ణుని ధర్మ నిర్ణయాధి కారిగా నిశ్చయించి పలికినట్లు కలదు కాని ఆతని సర్వజ్ఞత ఇంతస్పష్టముగా లేదు.

సంజయుని తిరిగి పంపునపుడు ఆతనిని ధర్మరాజు మిక్కిలి గౌర వించెను. ఇది ఉత్తమరాజ ధర్మము. దూతను సగౌరవముగా వెడలనంపుట సుశిక్షితుఁడైన రాజనీతిజ్ఞుని పద్ధతి. ధర్మజుఁడట్టివాఁడగుటచే తన సందేశ మును చెప్పునపుడు పరుషముగా పలికినను తరువాత సంజయుని గౌర

వించెను. 'నీ వొండె విదురుడొండె' యని విదురునితో సమానమగు స్థాయిని కల్పించెను. 'ఒక్కమాటయైన నుచితంబుగానిది గలదె' యని అనువ యించెను.

క. ఎదురున్న రూపు వలుకఁగఁ
దుదిఁ గటకటఁబడవు, నీవు దుర్ణయపు మను బె
ట్టిదము ను బెండును నగు పలు
కొదవదు నీ నాలుకకు నయోన్నత యెపుడున్.
(ఉద్యోగ–1వ ఆ. – 363 వ ప.)

ఇది సంజయుని గుణరాశికి కలికితురాయి కాగా ధర్మజుని సాత్త్వికతకు, సదాచారమునకు చక్కని ఉదాహరణము. దుర్యోధనుఁడు కృష్ణుని, రాయబారిగా నేతెంచినవానిని బంధింపఁగాఁ దలచుట దీనికి విరుద్ధమై అతని కుతంత్రమును, రాజనీతి పరిజ్ఞానములేమిని తెలుపుచున్నది ఆయా కురుప్రముఖులకు ధర్మరాజు తన అభిప్రాయములను చెప్పి పంపుట ఆతని స్వభావానుగుణముగా నున్నది. ధృతరాష్ట్రుని ముందు – 'మాయయ్య పెద్దకొలువున వాయోడక యిట్టనంగవలయుం జుమ్మీ' అని సంజయునితో వినయపూర్వకముగా తమరాజ్యము తమకిచ్చి ప్రోవుమని చెప్పుమనెను. శంతననందనునితో సంధికూర్పుమని పలుకుమనెను. నీవే కురువంశవర్ధకుఁడవని ప్రస్తుతించెను. తిక్కన ధర్మరాజునకు నేర్పిన గడుసుదనము – దుర్యోధనునితో పరుషముగాఁ బలుకుమని చెప్పుట "ఒరుల సొమ్మునకు నాస పడఁదగ దిమ్ము వారిపాలు వారలతోఁగూడి మనుమని" హెచ్చరించుమని నాఁడు, ధర్మజుఁడు సంజయునితో ఇంత తీవ్రముగాఁ బలుకుట మూలమున లేదు. భావమిదియేగాని తీవ్రతలో భేదముకలదు. ధర్మజుని పాత్రను తిక్కన విశిష్టముగా మలచుటకై క్లిష్టముగా, నిశితముగాఁ బలికినట్లు సంక్షిప్తము చేసినాఁడు.

సీ. ఆ సమయంబున నచ్చటి వారెల్ల
వినునట్లుగా సుయోధనుని తోడ
బాహుబలాఢ్యుల బలవిహీనుల క్రియ
వెడలంగ నడిచిన వెట్టితనము

నత్యంత చిరకాల మడవులఁ గొండల
బాధలఁ బెట్టిన పరుసఁదనము
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ
దలవట్టి యీడ్చిన తులువతనము

తే. ధర్మపుత్త్రుండు సైరించెఁ దథ్యమీవు
కురుకుమారుల నని మ్రింగికొనకు మొరుల
సొమ్మునకు నాసపడఁదగ దిమ్ము వారి
పాలు వారలతోఁ గూడి బ్రదుకు మనుము.
(ఉద్యోగ-1వ ఆ. - 376 వ ప.)

సుయోధనుని వెట్టితనము, పరుసఁదనము, తులువతనము తిక్కన పలికించిన పలుకులే గాని మూలమునందవి లేవు. 'కురుకుమారుల నని మ్రింగి కొనకుమను' హెచ్చరిక, 'ఒరులసొమ్మునకు నాసపడఁదగ' దను హితవు, 'ఇమ్ము వారిపాలు వారలతోఁగూడి బ్రదుకు మనుమ'ను సందేశము తిక్కన ధర్మజు పాత్రకు నేర్పిన చతురోక్తులే. తాము సంధిగోరుట ధార్తరాష్ట్రులకే మేలని, కృష్ణుండు తమకు పెనుఁబ్రాపు గావున తమ్ము వారు గెలవలేరని ధర్మజుఁడాడుట అతని వివేకమును దెలుపుచున్నది. ఇది భయమున కార్య సాధనమునకైన యత్నము. "నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట వీరును వారును మదీయ ప్రార్థనాభంగంబు సేయక నాదగుశాంతియుఁ దాంతియుఁ జెల్లించి నన్నలజడిఁబెట్టక పోరితంబుడిగి తమతమధనంబులుగుడిచి సుఖంబుండుట మన పెద్దలకుం దక్కటి బుద్ధిమంతులకును సంతోషంబగు." ఈ పలుకులు ధర్మజుఁడు చేసిన నయోన్నతి. నయమున కార్యసాధన చేయఁదల చుటనఁగా ఇట్టిది కదా! మనము కలిసి యుందమనక భీమసేనాదులు ధార్త రాష్ట్రులు తనకు సమానులే యన్నట్లుగా తానిద్దఱికి పెద్దవాఁడనేయని పలికి నాఁడు. తన్నలజడి పెట్టవద్దనుట తన పెద్దఱికమును చెప్పుకొనుటయే. అంతే గాక తాము కూడి బ్రదుకుట తమ పెద్దలకు తక్కటి బుద్ధిమంతులకు సంతోష మఁట. అనఁగా బుద్ధిహీనులు కొందఱు గలరనియు. వారికి తమ కలయిక ఇష్టము కాదనియు వ్యంగ్యము. ఈమాట కర్ణుడు, శకుని, దుశ్శాసనుఁడు మొదలగు దుర్యోధనుని అనుయాయులఁగూర్చి ధర్మజుఁడు విసిరిన విసురు.

ద్రోణాది గురుతుల్యులు, కృష్ణాది ప్రముఖులు తమ సంధిని మెచ్చుకొనెద రనియు భావము. ఇట్టిది తిక్కన పోషించిన ధర్మరాజు వచోనిధిత్వము. వివిధ భంగుల పలుకనేర్చిన విజ్ఞత.

సంజయునితో నిన్న మాటలాడిన ధర్మజునకు, కృష్ణునితో తన మనో గతాభిప్రాయములను విన్నవించుకొనిన ధర్మరాజునకు అంతరము గలదు. అది ఎట్టిదన రాజు, సేవకునితో – భక్తుఁడు భగవంతునితో ప్రవర్తించుటలో నున్నంత అంతరము. దుష్టులగు కౌరవుల దూతగా వచ్చిన సంజయుఁడు ధర్మరాజునకు లోకువ. భగవత్స్వరూపుఁడైన వాసుదేవుఁడు ధర్మరాజునకు కేవల బాంధవ మాత్రుఁడుగాడు. అట్టివానితో ధర్మజుఁడెంత నమ్రతగాఁ బలికినాఁడో చూడుడు——

క. ఆపదఁ గడవంబెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పను మా
కీ పుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁజూపి చనియె మహాత్మా.

(ఉద్యోగ—2వ ఆ.రవ.ప)

ఎంత వినయము జాలువాఱుచున్నదో ! – పాండురాజు తనకు మాఱుగా నిన్ను మాకు జూపినాఁడనెను. ధృతరాష్ట్రుఁడు దుష్టులైనను తన కుమారులనెట్లు కాచుకొనుచున్నాఁడో అట్లు నీవు మమ్ముగావుమను విస్తృతార్థమిందుఁగలదు. తనయుల మేలు తండ్రితలఁచునను లోకరీతిననుసరించి ధర్మజుఁడు పలికినాఁడు. అందుకే మరల – నిన్ను పెద్దగాఁజూపినాడని మాత్రమేగాదు 'నీకు మేము ప్రద్యుమ్నాది కుమారుల తోడివారము మమ్ము దురితంబులు వొరయకుండ నరసి రక్షింపు'మని స్పష్టపరచినాఁడు. ఇట్టిది ధర్మరాజుయొక్క అతివినయము.

భీమసేన, అర్జున, నకుల, సహదేవులెవ్వరు నింత వినయముగాఁబలుక రైరి. అర్జునుఁడు దైవముగా నెంచినను ఇట్లు ప్రార్థింపలేదు. భీష్మ, విదురులను కుంతిని, ద్రౌపదిని సైతము మించిన భక్తివినయములను ధర్మజుఁడు ప్రదర్శించినాఁడు. కార్యార్థియైనవాఁడు తన మనోగత భావ

ములను తెలిపినఁజాలదు. వినయ, గౌరవములను ప్రకటనను చేయవలెనను ఉద్దేశ్యమును కలిగించుచున్నది ధర్మజు నడవడిక. కృష్ణునకు తెలిపిన విషయములేవైనను మఱల దుర్యోధనుని దురాలోచన, దానికాతని తండ్రి మద్దతు సంజయుని పలుకులలో తెలిసినదిగదా యని పలికినాఁడు (ప.౩). తమ తల్లి, బంధుజనముల కొఱకైనను యుద్ధము చేయవలెనని పలుకుటలో తాను యుద్ధ విముఖుఁడని చెప్పుకొనుటయే ధర్మరాజు నుద్దేశము. ఐదూళ్ళైనను ఇమ్మని తానడుగుట ముఖప్రీతికై కాదనియు పూర్ణ మనస్సుతోనే యనియు చెప్పినాఁడు అనగా ధర్మరాజు ఐదూళ్ళడుగుట నిండు మనస్సుతో గాదని పలువురనుమానించి యుందురని ధర్మజుని భయము. ఆతనియందు, ఆతని మాటయందు అతనికే విశ్వాసములేని ధోరణి ఇచట కనిపించుచున్నది. అప్పటివరకు తన మాటను తానే బలపరచుకొనవలసినఅవసరము ధర్మరాజునకు కలుగలేదు. ఆతఁడేది చెప్పినను నిండు హృదయముతోనే చెప్పెడివాడు. కాని ఇప్పటి స్థితి వేరు. హృదయాంతరమున ఆతనికి రాజ్యకాంక్ష, ధార్తరాష్ట్రులపై ప్రతీకారవాంఛ ముప్పిరిగొనియున్నవి. అయినను ధార్మికుఁడను కీర్తి తనకు లభింపవలెను. ఈ రెండు భావములకు చక్కని సంబంధమును ధర్మరాజు తన చర్చలతో కలిగింప యత్నించెను.

ఆ. క్షత్త్రధర్మమింత కష్టమగునె పెఱ
ధర్మమాచరింపఁదగద యండ్రు
గాన శస్త్రజీవికయ తగియున్నద
దైన వంశనాశ మనభిమతము.

(ఉద్యోగ-౩వఆ. 15వ ప.)

ఆతని సంచలిత బుద్ధి విభేదములీ చిన్నపద్యమునందు ప్రతిఫలించునట్లు చేసినాఁడు తిక్కన.

'క్షత్రధర్మము మిక్కిలి కష్టమ'నినాఁడు. వెనువెంటనే 'ఇతర ధర్మమాచరింపకూడదని అందుర'ని పెద్దల మాటను కొనివచ్చినాఁడు. కాబట్టి యుద్ధమే తగినదని తేల్చినాఁడు. అయినను తనకు మాత్రము వంశనాశనమనభిమతమన్నాఁడు రెండు వాక్యములు యుద్ధవిముఖములు, రెండు వాక్యములు యుద్ధముయొక్క అవసరమును బలపరచునట్టివి. ఈ సందర్భ

మున ధర్మజుఁడాడిన పలుకులన్నియునిట్లే ద్వంద్వభావ మిశ్రమములై అతని చిత్తమునంతుపట్టనీయనివిగా నున్నవి. తిక్కన రచనలో ధర్మరాజు వితర్కము చక్కగా చిత్రీకరింపబడినది. కొంతసేపు తల్లికి, తక్కిన బాంధవలోకము నకు క్షాత్రధర్మమునకు తగినట్లు యుద్ధము మేలనును. మఱల పగతో పగ అణగదనియు, వంశనాశనము చేయలేననియు అనును. తిరిగి పగయున్న నింటిలో సుండుటసాధ్యమనియు గ్రాసవాసములు తననాశ్రయించినవారికి కూర్చుటకైనను సిరి కావలెనుగదా యనును. చివఱకు ఐదూళ్ళిమ్మనినాఁడు, ఇవ్వడని తెలిసి అడుగుట ధర్మజుని లౌక్యము. తానై హింసను కోరినట్లు కాక, ఎదుటివానిని ఇవ్వనివానిగాఁజేసి వానివలననే యుద్ధము సంభవించిన దను పరిణామమునకై ధర్మజుఁడైదూళ్ళడిగెను. ఇంత రాజనీతి చాతుర్యము కలవాఁడుఁగా తిక్కన తీర్చిదిద్దినాఁడు. మూలముకంటె అనువాదమునందు ధర్మజునిపాత్ర బహుధా చిత్రీకరింపబడి, శక్తిసంపన్నమైన అతని ఆలోచన భారత కథకు మూలభూతమను అభిప్రాయము ధ్రువపడును. ధర్మరాజు యుద్ధ మును భీమాదులవలె పరిపూర్ణచిత్తముతో కోరలేదు. భీష్మాదులవలె సంధికై కాంతులేదు. కనుకనే లోకభీతితో కృష్ణుని పొమ్మనినాఁడు. కృష్ణుని రాయబారపు ఫలితము యుద్ధమని ఎఱింగి ఉత్సాహముతో యుద్ధమును ప్రారంభించి, భీష్మద్రోణాదుల మరణములను సాధించినాఁడు. అధర్మమునకు సైతముపాల్పడి. అధర్మ యుద్ధమునకు అర్జునుఁడు కించపడినట్లున్నది కాని ధర్మరాజు పరితపించుట లేదు. అనఁగా ధర్మరాజునకు రాజ్యము మొదటి స్థానములోనున్నది. యుద్ధానంతరము కూడ అతనికి ధర్మచింతకంటెను మిక్కుటముగా పాపభీతి ఏర్పడినది. ఇది సర్వప్రాణి సహజము. ధర్మరాజు ధార్మికుఁడుగాని అంతకంటె ప్రథమముగా రాజనీతిజ్ఞుఁడు. కౌరవుల బలములలో భేదములను తనకనుకూలముగా మలచుకొని ఇటు కృష్ణుని, అటు భీష్మాదులను మెప్పించి, ఒప్పించి తన రాజరికమును, రాచపుట్టువును సార్థకము చేసికొనినాఁడు. పిదప పాపభీతి, యజ్ఞయాగాదులు, స్వస్థత యథావిధిగా ఏర్పడినవి. అతనిలో ధర్మము, యుద్ధమునందలి ఉత్సాహము మిళితమై రూపు కట్టినవి. ధర్మరాజు ధర్మవీరుఁడుగాని యోగికాఁడు, జ్ఞానికాఁడు, పరమధార్మికుఁడును కాఁడు.

ధర్మరాజు నిక్కముగా సంధినే కోరినవాఁడైనచో సంజయుని కురు వీరుల కుశలములడుగునపుడు తన తమ్ముల పరాక్రమ ప్రకటనములను జేయ

కూడదు. ద్రౌపది మానభంగమును పలుమారు ప్రస్తావింపరాదు. దుర్యోధనుని దుశ్చేష్టితములనెన్నుట సంధికోరువాఁడు చేయకూడదు. ఆతని తులువ తనమును ప్రకటింపరాదు. ఇపుడు తిరిగి కృష్ణునితో 'అ దుర్యోధనుఁడంత మాత్రమును చేయంజాలఁడో' అని అనుమానించి యుద్ధమగుట నూహించి 'సమరమునఁ బరాజయము మరణంబునకంటె హృదయపుట భేదనము సేయు' నని అందువలన యుద్ధము లేకుండ రాజ్యము పొందు ఉపాయము సేయుమని కోరెను. అనగా ధర్మరాజుకు యుద్ధమనిన కొంత భీతికలదేగాని కౌరవుల పై నభిమానము లేదు. ఇట్లు ధర్మరాజు ద్వైధీభావములను తిక్కన ప్రముఖ ముగా చిత్రించి, లౌక్యుఁడు, రాజనీతి చతురుఁడునగు ధర్మరాజును మనకు సాక్షాత్కరింపఁజేసెను. మూలమునందైనను ఆతఁడిట్టివాఁడేయయ్యు ఆతని భావములింత స్పష్టపరుపఁబడలేదు.

ధర్మరాజును గూర్చి తిక్కన సంజయ, శ్రీకృష్ణుల చేతఁబలికించిన పలుకులాతని పాత్రమునకు తగిన నిర్వచనములు. 'సాదు రేగెనేనిన్నిను తల పొలయునన కాని నిలువదు' అని ధర్మరాజు సాధువేకాని రేగినచో తుద ముట్టించుననెను. ఆతని క్షాత్రవీరమట్టిదని సంజయుని భావము.

చ. అనయముఁ బుట్టె జూదమున యప్పుడ యొంతయు జిచ్చువెట్టికా
ల్చినయది నీయుపేక్షయ వశీకృత చిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీ పయిఁ బెట్టునంత కు
న్వినఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే.

(ఉద్యోగ - 2వ ఆ. - 14వ ప)

అధర్మమును ధృతరాష్ట్ర, దుర్యోధనాదులపై బెట్టుచే ధర్మజుని ప్రయత్నమని కుండబ్రద్దలు కొట్టినట్లు పలికినాఁడు సంజయుఁడు. చివరికి జరిగినదంతియే. కృష్ణుడును ధర్మరాజులో ధార్మికత అను నివురుచేగప్పఁబడి యున్న క్షాత్రమను నిప్పును రగిలింపవలదని హితవు చెప్పినాఁడు. 'వారలు శాంతశూరులు' అను కృష్ణుని పలుకులో 'శాంతశూరత్వము' ధర్మజునకే ఎక్కుడన్వయించును. ఆతని తమ్ములతని ననుసరించువారే. శాంతత, శూరత అని ఇచట చెప్పవచ్చును. శాంతను వహించియున్న శూరులనియు

చెప్పవచ్చును. కానీ ఇందు రెండవ యర్థమే కృష్ణుని యుద్దేశమైనట్లు సందర్భమునుబట్టి నిర్ణయింపవచ్చును. అనఁగా ఇంతదనుక అజాతశత్రుని శాంతము విదితము. ఇక ముందాతని క్షాత్రము తెలియునని హెచ్చరిక. అందుకే 'నిను గొల్వఁబూని యున్నారటుగాక మీకది మనంబున కప్రియమేని యింతకుం బోరికి వచ్చుచుండుదురు' అని వారి ఉద్దేశముఁ తెలిపినాఁడు.

ధర్మరాజుయందు దాగియున్న ఈ అలుక ఎట్టిదో కృష్ణునిచే చెప్పించి నాఁడు తిక్కన—

ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్లల
నగ్నిపుట్టినట్టిదయ్యొ మీకు
నార్ప వెరవులేదు నేర్పుమైనింకఁ గా
వింపవలయుపనులు వినుఁడు మీరు.

(ఉద్యోగ-2వ ఆ. ;-12వ ప.)

అజాతశత్రుని అలుక నీటిలో అగ్నిపుట్టినట్టిది. అనఁగా ఆర్పుటకు సాధ్యముకానిది. బడబానలమని కవి ఉత్ప్రేక్షించెను. ధర్మరాజు సాధువు. రేగనేని నిలువఁడను సంజయుని మాటలునిట్టివే.

క. ఎఱుఁగవె యజ్ఞాతశత్రుని
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నె
త్తెఱఁగున ననువర్తించునొ
యెఱుఁగవె తగుచేవ గలుగు టెఱుఁగవె యధిపా.

(ఉద్యోగ - 3వ ఆ. - 278 వ ప)

ఇందు అజాతశత్రుఁడు 'తగుచేవ కలుగుట' అనుమాట కృష్ణునిచేఁ చెప్పించుటలో పరమప్రయోజనమున్నది. ధృతరాష్ట్రునకు భీమార్జునుల బల పరాక్రమములన్న భయమెక్కువ. అతఁడు వారిరువురినే పలుమార్లు తలచు కొని భయభ్రాంతుఁడగును సాత్యకి, కవలలు, ధృష్టద్యుమ్నుడు పరాక్రమ

వంతులనియు వృద్ధరాజు భావించెను. కాని ఈ శక్తులన్నింటిని ఏకముఖముగా నడిపింపఁజాలు శక్తి ధర్మజునిదే అని కృష్ణుఁడాడినచో రాజు నమ్మక తప్పదు. కృష్ణుఁడు భగవత్స్వరూపుఁడని ధృతరాష్ట్రుఁ డెఱుంగును. కనుకనే కవి ధర్మజుని చేవను అదియును ఎంతకైనను 'తగు' చేవను కృష్ణునిచే తెలియపఱచెను.

చ. పగ యడఁగించు టెంతయు శుభంబది లెస్స యడంగునే పగం
బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా.
(ఉద్యోగ - 3వ అశ్వా. - 21వ ప.)

పగను గూర్చి ఇంత పలికిన ధర్మరాజు చివరివఱకు పగను వీడలేదు. పగతో పగను అడగించుటకే అతఁడు ప్రయత్నించెనుగాని పగను త్యజించి, యుద్ధముడిగి తాపసికాలేదు. పగకు మేలిమిలేదు గనుకనే యుద్ధానంతరము ధర్మజునకు మిగిలినది శ్మశాన వైరాగ్యము, కర్ణఘటోత్కచాభిమన్యుల, ఉపపాండవుల మరణములతో దుఃఖము, అధర్మపుయుద్ధమునకు పాల్పడితినన్న వగపు, పాపభీతి. ఆతనికి స్వర్గారోహణము పర్యంతము శాంతి కలుగలేదు. స్వర్గములో పైతమాతఁడు ధార్తరాష్ట్రుల యందలి పగనువీడలేదు. ధర్మరాజు జ్ఞానసముపార్జనకై యత్నించెనేకాని జ్ఞానికాలేదు. భారతకథలో ధర్మరాజువలె ఆలోచనాపరుఁడు, భావపరంపరలలో తలమునకలైనవాఁడు మఱియొక్కరు లేరు. ఆతని వ్యక్తిత్వమంత చిత్రమైనది. ఆతని వ్యక్తిత్వములోని బహుముఖములను చిత్రించుటలో తిక్కన కృతకృత్యుఁడాయెను. ఏకపత్నీవ్రతమునకు రాముని వలె, వైవిధ్యమునకు, సంశయాత్మకు ధర్మజుని ప్రతీకగా చెప్పవచ్చును అన్నట్లు తిక్కన చిత్రించెను.



# ద్రౌపది

ద్రౌపది భారతమునందలి స్త్రీ పాత్రలన్నిటికన్నను ప్రముఖమైనది. ద్రౌపది ఒక విశిష్ట వ్యక్తిత్వముగలిగిన స్త్రీ. సీత రామునికి వలె ద్రౌపది ధర్మజునకుగాని ఏ ఇతర వ్యక్తికిగాని ఛాయగాదు. ఆమె ప్రత్యేకతను తిక్కన మఱింత స్పష్టపఱచినాఁడు. ద్రౌపది ధర్మరాజునుగాని శ్రీకృష్ణు నైనను గాని గౌరవించును. అంతమాత్రమున వారిని సంపూర్ణముగా ననుస రింపదు, అనుకరింపదు. అందువలననే తిక్కన ఆమె సంభాషణలలో వేగ మును తీవ్రతను సంతరించి వాడిచేసెను. సంభాషణాచాతుర్యము బుద్ధిజీవి లక్షణము. ద్రౌపది నిశితబుద్ధి, పరిశీలనాశక్తిగల వ్యక్తి. ఈ లక్షణమును వ్యక్తపరచుటకు తిక్కన ద్రౌపదిచేయు సంభాషణలను, ధర్మజాదులతో చేయు సంవాదములను పెంచెను. అంతియకాదు. ఆమెగుణములకన్న నధిక ముగా మనోంతర్గతభావములను వర్ణించి చైతన్యమూర్తిగా చిత్రించెను. గాండీవిగాండీవముగాని, ధర్మజుని ధర్మనిరతిగాని, కృష్ణుని అనునయింపుగాని ద్రౌపది ఆవేశమును నిలువరింపలేవు. ఆమె కోపానలమునవి ఆర్పఁజాలవు. తిక్కన తీర్చిన ద్రౌపది భీరువు, ముగ్ధమనోహరయగు కావ్యనాయిక కాదు. ధీర, నిశితబుద్ధికలిగిన ప్రౌఢనాయిక. ఎచ్చటను ఆమెను వర్ణించునపుడు ఆంగాంగ వర్ణనలు చేయలేదు తిక్కన. ఆ పని ఉత్తరవిషయమునఁ జేసి నాఁడు. ద్రౌపదిని అలౌకిక సౌందర్యప్రతీకగా, ఉదాత్తగా వర్ణింపఁదలచి కీచకునివంటి దుర్విదగ్ధునిచే సైతము ఉచితరీతిని వర్ణనఁ జేయించినాడు.

ఆమె రూపమును, స్వభావమును, తిక్కన వర్ణించిన విధము నుమ్మందు ఆమె చేయు తీవ్రసంవాదములకు భూమికగా భావింపవచ్చును. ద్రౌపదిపరముగా తిక్కన రసభావములను చక్కగా పోషించినాఁడు అభి నయము, చలనము ఆ చైతన్యమూర్తికి తగినట్లే సహజభంగిమలలో వర్ణింపఁ బడినవి. సాధారణ స్త్రీ యొక్క అనుభావములు, ఖేదమోదములు ద్రౌపది యందు తిక్కన ఆపాదించి సహజత్వమును కలిగించినాఁడు. నిష్ఠురోక్తులను ఆవేగమును స్వాభావికముగా ఆమెయందాపాదించినాఁడు తిక్కన. ఇంత

చైతన్యవంతముగా స్త్రీపాత్రను మలచిన కవి ఆంధ్రమున మఱియొక్కఁడు లేఁడు! తిక్కన నాయికానాయకులు సైతము నేలమీద నడచుచుందురుగాని నేల విడిచి సాముచేయరు.

ద్రౌపదిని గూర్చి ధర్మజుని చిత్తము తల్లడిల్లినది—అజ్ఞాతవాస కాలారంభమున. ఒకరికి తలవంచని వనిత ద్రౌపది కనుకనే ఆమెకు మఱింత దుష్కరమా వత్సరము. సౌందర్యవతియైన స్త్రీయగుటవలన తక్కినవారికన్న ఆమెకు సంకటస్థితి ఏర్పడినది. ధర్మజుఁడామె క్లిష్టపరిస్థితికి వగచి ఆమెను మృదువుగా ప్రశ్నించినాఁడు. మూలమునందు ద్రౌపదినిగూర్చి ధర్మజుఁడు పలికిన పల్కులలో ఆమెను గూర్చిన భావము స్పష్టపడుటలేదు. ఆమె 'ఉదాత్తచిత్త' యని ధర్మజునిచే తిక్కన పలికించి నీచకార్యముల చేయ నొల్లదని స్పష్టముచేసెను. భావికథ కనుగుణముగా పాత్రపోషణ జరిగినది.

సుకుమారీచ బాలా చ రాజపుత్రీ యశస్వినీ
పతివ్రతా మహాభాగా కథంతు విచరిష్యతి॥ 4.3.14

ఇట్లామెను గూర్చి మూలమున గంభీరోక్తులుగలవు. తిక్కన లలితముగా ఆమెను వర్ణించెను—

చ. ఇది గడు ముద్దరాలు పనులేమియుఁ జేయఁగ నేర దెంతయున్
మృదు వొక కీడుపాటునకు మేకొనఁ జాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కోర్వదొకటిం దనుదా సవరించు చొప్పెఱుం
గదు తగ నొండులం గొలువఁగా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా! 4.1.103

ఒక కీడుపాటునకును ఓర్చుకొనలేని మృదుస్వభావముగలది, ఉదాత్తచిత్తయనుటలో ఆమె సున్నితమగు మనస్తత్త్వము తెలియుచున్నది. 'ఒంటి దిరుగుదాని కోర్వదు', రాజ్ఞిగనుక పలువురతో కలిసి గడిపినదని, ఇప్పు

డొంటరిగా చరింపవలసి వచ్చుట కష్టమని కవి ఉద్దేశము. తనను తాను సవరించుకొనలేనిది ఒరులను గొల్చియుండలేదమట భావస్ఫోరకముగా, ద్రౌపదిపట్ల జాలినినుమడించునట్లుగా నున్నది. 'ఉదాత్తురాల'ని తొలుత ఆమెను గూర్చి ఒక్క పలుకులోచెప్పి, మున్ముందు ఆమెను తిక్కన అటులనే పోషించెను. ఉదాత్తమైన పాత్రను నుత్తమముగనే చిత్రించినాఁడు కవి.

ద్రౌపది ఎంత ధీరచిత్తయో అంత సుకుమారి. నడకవలన అలసిన ఆమె మనోభావములను కరుణరస నిర్భరముగా తిక్కన వర్ణించినాఁడు.-

తతో జనపదం ప్రాప్య కృష్ణా రాజానమబ్రవీత్
పశ్యైకపద్యో దృశ్యంతే క్షేత్రాణి వివిధానిచ 4 5.5

వ్యక్తందూరే విరాటస్య రాజధానీ భవిష్యతి
వసామేహాపరాం రాత్రిం. బలవాన్ మే పరిశ్రమః 4.5.6

'మే పరిశ్రమః' అనియున్నదానిని గ్రహించి తిక్కన భావస్ఫోరకముగా ఆమెచేఁ బలికించినాఁడు—

ఉ. డప్పిజనించె; వ్రేళుల పుటంబులు పొక్కఁ దొడంగె,- గోళ్ళలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు; చిత్తము నాకుఁ గడున్ వశంబు గా
దప్పుర మిచ్చటచ్చటను నాసలవచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి నొక్కడుగునీఁగెడుదానికి నోర్వనెమ్మెయిన్. 4.1.148

ద్రౌపది తన అలసటను పాండవుల మనసుకెక్కునటుల వివరించినది. తన భావములను స్పష్టముగా ప్రభావమును కలిగించునట్లుగా వెల్లడించెడి నేర్పు ద్రౌపదికి తిక్కన కల్పించెను. అంత అలసి, నొచ్చియుండినగాని. ఒక్క అడుగు వేయలేనని చెప్పినగాని అర్జునుని మోసికొని రమ్మని ధర్మజుఁడు పలుకుట పొసగదు కూడ.

ద్రౌపది సైరంధ్రీజాతిక చితమైన వేషమును ధరించినదని మూలమున కలదు. వేషమునేగాదు, అందుకు తగిన అంతఃకరణమును గూడ కలిగినది ద్రౌపది అని తిక్కన కల్పన.

క. పరిచారికాత్వరేఖా
పరిణతి దనమేన నచ్చువడు భావనకుం
దిరమై తలకొను నంతః
కరణముతోఁ బురను ద్రుపదకన్యక సొచ్చెన్. 4.1.292

తిక్కన ఒకపాత్రముయొక్క వేషమునేగాదు భావమును వర్ణించును. భాషణమును నవరించును. ద్రౌపది రాజ్ఞినను భావముతో ప్రవేశింపఁ జూచిన కార్యము జరుగదు. పరిచారికగా భావించుకొనియే విరాటనగరు ప్రవేశించినది. కాన తత్కార్యమును ఓరిమితో నిర్వహింపఁ జాలినది. మున్ముందు ద్రౌపది ప్రదర్శించు సంయమనమునకిది నాంది.

ద్రౌపది రూపమును తిక్కన ఉదాత్తముగా వర్ణించినాఁడు. అంత రూపసి యగుటవలననే కీచకుని మోహము మితిమీఱినది. ద్రౌపది గౌరవమునకు తగిన రీతిలోనే వర్ణన చేయఁబడినది.

సీ. పలు మొయిల్ గప్పినఁ బాడఱినునుఁ గాంతి
గదలిన యమృతాంశు కళయుఁ బోలెఁ
బెనుమంచుమీఁదఁ బర్విన వికాసము దప్పి
చెలువు గుందిన సరోజిని విధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు
నలఁగి మాసిన దీపకళిక పగిది
ధూళిపైఁ బొరసినఁ దొంగలించుట మాని
లావణ్య మెడలిన లతిక భంగి

తే. గంధకారికావేషంబుకతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱువడియుండఁ బాండు
తనయమహిషి యంచితగతిఁ
జనఁగ రాజవీథిఁ బౌరజనంబు లప్పోలఁదిఁ జూచి. 4.1.294.

మూలమునందు ఈ సందర్భములో ద్రౌపది వర్ణనలేదు. పురజనులామె సౌందర్యమున కబ్బురపడిరని కలదు. అద్దానిని తిక్కన పై రీతిగాఁ బెంచెను. ఆమె మూర్తిని సమగ్ర సౌందర్యము రూపుదాల్చినట్లు వర్ణించెను గాని అంగాంగ వర్ణన లేదు. మబ్బుక్రమ్మిన చంద్రకళ, మంచుగప్పిన పద్మిని. పొగపట్టిన దీపకళిక, దుమ్ము నిండిన తీగవలె సైరంధ్రీ వేషము వలన 'ఉజ్జ్వల త్వము' మఱుగు పడిన ద్రౌపది ఉన్నదట. ద్రౌపది ఉదాత్తచిత్త. ఆమెలో ప్రధాన సౌందర్య హేతువు ఔజ్జ్వల్యము. అవయవముల పొందికవలన కలుగునది సామాన్యసౌందర్యము. అంతకుమించి ఉజ్జ్వలముగ భాసించునది ద్రౌపది సౌందర్యము. ఔజ్జ్వల్యము-హృదయనైర్మల్యము, బుద్ధి వికాసము వలన ఏర్పడునట్టిది. అట్టికాంతి, తేజస్సు ద్రౌపదియందు తిక్కన వర్ణించెను.' ఆమెనుగాంచి పురజనులు భావించిన విధమునందు గూడ తిక్కన తేజమునే పేర్కొనెను.

తస్యారూపేణ వేషేణ శ్లక్ష్ణయాచ తథాగిరి
నశ్రద్ధధతతాం దాసీమన్నహేతో రుపస్థితామ్ (4. 8. 5)

రూపసి అని మాత్రమే వారికి అభిప్రాయము కలిగినది. దాసీత్వము చేయుట పొసగదని వారు ఆమె చెప్పినదానిని నమ్మరైరి.

అల్లంతదూరమున ఆమె కనఁబడినంతనే ఆశ్చర్యపడి ఆమెను రోహిణ్యారుంధతులతోఁ బోల్చి మనుష్యజాతి వనిత గాదని అనుమానించిరని తిక్కన వర్ణించెను. చూచుటతోడనే ఆమె తేజస్సు వారిని ప్రభావితము చేసినదని కవి ఉద్దేశము.

ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతిగాక మనుష్యజాతి యే
యీ హరిణాక్షి చెల్వమున యేడ్తెఱ చూడ్కుల నాఁచి
కోలకా
దాహితగౌరవంబగు శుభాంగముఁదేజము జూడ బుద్ధిసం
దేహముఁ బొందుచున్నది సతీజనమిట్టిదె యెజ్జగంబులన్.
(4.-1.-295)

ఇందు ద్రౌపది సౌందర్యము గాదు వారికి సందేహము కలిగించినది. ఆమె 'శుభాంగముఁదేజము', అంతటి తేజస్విని ఏ జగములలోను లేదని వారు, తదుపరి కీచకుఁడును భావించిరనఁగా అది ఊహాతీతమైనట్టిదే.

ద్రౌపది మిక్కిలి సూక్ష్మబుద్ధిగలది. సుధేష్ణ తను బిలువఁబంపగా "వినయ వైభవము సతీతను వొందిన చందంబున" నేఁగినదని తిక్కన ఆమె నడవడికను సూచించెను. పరిచారిక, స్వామినిని చేరఁబోవునపుడు వినయమే ముఖ్యముగా నుండవలసిన లక్షణము.

సుధేష్ణను చేరఁబోయిన ద్రౌపది కాంతిని, ధాళధళ్యమును తిక్కన వర్ణించినాఁడు. అవయవములను ఆయా ప్రసిద్ధోపమానములతోఁ బోల్పక ఆ అంగముల కాంతి ఎంతటిదో వర్ణించెను. స్త్రీ సౌందర్యములో కాంతి మిక్కిలి ప్రధానమైనది. పురుషునిలో తీక్ష్ణత వలె స్త్రీ యందు కాంతి బుద్ధి వికాసముయొక్క స్థాయిననుసరించి ఏర్పడును. మూలమున లేని వర్ణనను తిక్కన ప్రత్యేక ప్రయోజనము నాశించి చేసెను.

సీ. పదతలంబుల కెంపు పరఁగిన తలము కుం
కుమలిప్తమైన చందము వహింప
నంగంబు నుసఁగాంతి యడరిన గోడలు
వేదులు మణిమయ విధము నొందఁ
గనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందఱఁ
బుష్పోపహారంబు పొలుపుదాల్ప
వేనలికప్పుపర్విన మీఁది నీలదు
కూలంబు మేల్కట్టు కోమరు వడయఁ

తే. దానుజొచ్చిన కతన మత్స్యక్షితీశు
నింటనిమ్మెయిఁ గ్రొత్త యొప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ
బాండురాజ తనూభవపత్ని యరిగె. (4.-1.-308)

ఇందు పదతలములు ఎఱ్ఱనివి. అంగము మణిమయకాంతి గలిగినది ఇత్యాదిగా చెప్పక ఆ పదతలముల కెంపుపరఁగిన తలము కుంకుమ లిప్తమైన చందనము వహించినదనుట వినూత్నము. అంత ఎఱ్ఱనివి అనుట. అట్లే తిక్కన అంగములకాంతి, కనుగవ మెఱుగులు, వేనలికప్పు నీలిమ అవి ప్రసరించిన ప్రదేశములనే ప్రకాశింపఁజేసినవఁట. ఉత్తమస్త్రీకి ఉచితమైన రీతిలో కాంతి వర్ణింపఁబడినది. మూలమునందు కవి సుధేష్ణచే ఆమెసౌందర్యమును శ్లాఘింప జేసెను. రాజుల పరిచారికగానేతెంచిన స్త్రీని అంగవర్ణన చేయుచుఁ గీర్తించుట అసహజము. ఆ వర్ణనయు అతి సాధారణముగా హస్తసాముద్రిక లక్షణముల పేర్కొని నట్లు కలదు.

సూచ్ఛగుల్ఫా, సంహతోరు,స్త్రిగంభీరాషడున్నతా
రక్త పంచసు రక్తేషు హంస గద్గదభాషిణీ
సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణిపయోధరా
తేన తేనైవ సంపన్నా కాశ్మీరీవ మాతురంగమా
అరాళపక్ష్మనయనా బింబోష్ఠీ పూర్ణచంద్రనిభాననా.

4-8-10,11,12.

ఈ వర్ణనలో ద్రౌపది ప్రత్యేకత ఏమియును లేదు. కాంతి, తేజము ఔజ్జ్వల్యము అను ప్రసక్తియే లేదు. ఇది బాహ్యసౌందర్యము. తిక్కన వర్ణించినది ఆమె అంతస్సౌందర్యము, మృదుస్వభావము, సౌకుమార్యము, ఆత్మవిశ్వాసము మొదలగునవి.

సుధేష్ణ ద్రౌపదిని గూర్చి సందేహములు వెల్లడింపగా ద్రౌపది ఆమెను ఒప్పించుటకు ప్రయత్నించునెడ ఆమూలకమగు ద్రౌపది భాషణము, గంభీర ముగా అనునయమును దోపింపజేయుచున్నది. ఇచట ద్రౌపది సుధేష్ణను మించిన స్థాయిలో పలుకఁగలుగుచున్నది. ఇది ఆమె ఆత్మ విశ్వాసము.

చ. మనమున నూఱడిల్లు మనుమానముమానుము నన్నునేలు మే
పనులు నుదాత్తనాగరక భంగుల నీ మది కెక్కునట్లు నే

ర్పును భయభక్తులున్ మెఱయ రూపుగఁజేసెదఁ దజ్ఞు
లైన స
జ్జనులునుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చఁజల్పెదన్.
4-1-328.

తనవర్తనమెట్లుండునో తానే సగర్వముగా వర్ణించినది ద్రౌపది. సాధులు, వృద్ధులుమెచ్చునట్లు ఉదాత్తనాగరిక భంగులలో సుధేష్ణ మనసున కెక్కునట్లు భయభక్తులతో నేర్పుగా సజ్జనులు నుతింపఁదగు విధముగా ప్రవర్తించెద'నను నీ ద్రౌపది పలుకులు తిక్కన కల్పించినవే. ఇందు ద్రౌపది ఆత్మ గౌరవము నిండి యున్నది. సజ్జనులు (తజ్ఞులైనవారు) మాత్రమే మెత్తురనుటలో దుర్జనులకు లొంగని విధముగా వర్తించెదను వ్యంగ్యము గలదు. కొందఱు సర్వుల మన్ననలు పొందగలుగుచుందురు. ద్రౌపది సజ్జనులు మాత్రమే మెచ్చుదగినట్లు మెలగునట. ఇది ఆమె తీవ్రస్వభావము లోని ప్రత్యేకత. ఎంత నిగ్రహము కలిగియుండునో అంత ఉద్వేగమును, వినయమునకు ఈడగు అహంకారమును ద్రౌపది పొందియుండుటను తిక్కన వర్ణించెను.

దుర్విదగ్ధుడగు కీచకుఁడు ద్రౌపది తేజమును గుర్తింపఁజాలక ఆమె అవయవములను విడివిడిగా పొగడినట్లు మూలమున కలదు. కీచకుని నీచము లైన పలుకులలో ద్రౌపది సౌందర్యము వ్యక్తమగుచున్నది.

హారాలంకారయోగ్యౌతే స్తనౌ చోభౌసుశోభనౌ
సుజాతౌ, సహితౌలక్ష్మ్యౌ, పీనౌ,వృత్తౌ,నిరంతరౌ,
కుట్మలాంబురుహాకారౌ, తవసుభ్రూ పయోధరౌ
కామప్రతోదావివమాంతుదతశ్చారుహాసినీ !
వళీవిభంగ చతురం స్తనభారవినామితమ్
కరాగ్రసంమితం మధ్యంత వేదుతను మధ్యమ్
దృష్ట్వైవ చారుజఘనం సరిత్పులిన సన్నిభమ్
కామవ్యాధి రసాధ్యోమామప్యాక్రామతి భామినీ

ఈ వర్ణనలో ద్రౌపది అవయవ వర్ణనము కలదు – కీచకుని కామ దృష్టికలదు. కాని తిక్కన కీచకునిచే వర్ణింపజేసిన ద్రౌపది సౌకుమార్యమునకు ప్రతి రూపుగా నున్నది. ఇచట ద్రౌపది పాత్రను తిక్కన వర్ణించునపుడు కీచకుని దుష్టత్వమును కొంత మరుగువడును. కీచకుని పలుకులలో – ఎందును అట్టి రూపులేదు. అనంగుఁడు ఆ ఇంతి ప్రాపున శివునిగూడ దిక్కరింపజాలును. కుసుమాయుధుని బాణముల ప్రోవు ద్రౌపది. మన్మథుఁడే విరహాతాపము నొందు సౌందర్యమామెది. ఆమె జన్మతో తల్లిదండ్రులు సార్థక్యమును బొందియుందురు. ఆమె నామమునన్ను వర్ణములు నోచిపడసినవి. ఇలలో కీర్తిగాంచిన సొంపు ఆమె వల్లభునిది. ఆమె వాసముతో మందిరమునకే పెంపు ఏర్పడును. ఇట్లు తలచిన కీచకుఁడు——

సీ. తన్వంగి మవ్వంపు దనులత నెసఁగెడు
        నునుఁగాంతి వెల్లువ మునుఁగఁజాలఁ
    గిసలయహస్తకెంగేల నేపారుక్రొ
        మ్మించను లేయెండ మిగులఁబర్వఁ
    గమలాస్య ముద్దు మొగంబు లే మెఱుఁగుల
        మొత్తంబుపరి చుట్టుముట్టికొనఁగ
    ధవళాక్షి తొంగలి తఱచు ఱెప్పల చెన్ను
        కప్పను చీఁకటి గవియు దేర... 4.2.37

ఆమె కాంతి అంధుని చేయగా 'జంత్రంబుపగిది నుండె'నట ఈ వర్ణనలో కాంతియే ప్రధానము.

అంఘ్రితలములు నెత్తమ్మిరేకులనుట సామాన్య వర్ణనా పద్ధతి. కాని తిక్కన అసామాన్యుఁడు. నెత్తమ్మి రేకులనుగాక వాని మెత్తదనమును దెచ్చి ద్రౌపది అంఘ్రితలముల కాపాదింపఁజేసెను. ద్రౌపది పాత్రమునకు తగిన ఉదాత్త వర్ణన గావించెను.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి
        యచ్చునఁబెట్టినట్లుందమొంది

చక్రవాకంబుల చందంబుఁ గొని వచ్చి
కుప్పలు సేసినట్లొప్పు మెఱసి
చందురు నునుఁగాంతికల దేర్చి కూర్చి బా
గునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి
యళికులంబుల కప్పు గలయంతయును దెచ్చి
నాఁబువోసిన భంగి నవక మెక్కి

తే. యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యీ త్రిప్పులేటికిఁ గమలవదన.

4-2-52

ద్రౌపది 'రుచిరమూర్తి'ని కీచకునిచే ఇట్లు వర్ణింపజేయు నపుడును ఒక పరిధిని దాటలేదు తిక్కన. 'అనుపమాన భోగములకు నాస్పదంబు' అనినాడే గాని తనతో భోగింపుమని అనలేదు. అనఁగా ద్రౌపదితేజము కీచకుని గూడ ప్రభావితుని గావించినది. ఆయా ప్రసిద్ధోపమానములను గైకొని వానిలోని ప్రత్యేక గుణములనే ఆమె అవయవములందాపాదింపఁ జేసెను. ఇంత మాత్రమైనను ఆమె తనను నిరాకరించిన పిమ్మట వర్ణించి నట్లున్నది. చూచుట తోడనే అంగాంగవర్ణన చేయక కన్నుగవకాంతి, నెమ్మోమునెలమిసొంపు, దంత మౌక్తికరుచి, ఉల్లము సరసత, తెల్లంబుగా జేయుమని కోరినాఁడు కీచకుఁడు. ఆ తరువాతనైనను ఆమెను చేర సంశయించినాఁడు.

సీ. సుదతి నీమై చక్కఁ జూచుట కోడెదఁ
గనుఁబాటు వొరయునో యని తలంచి
మదిఁబొనర్చి మాట మగువ నీ పెంపునఁ
గుదిసి నా నాలుక తుదికిరాదు

పడఁతి నీ కరములు పట్టంగఁదిపిరి శం
కించి వడంకెడు గేలు సూడు
నెఱి నిట్టిదని యింతి నీ నెమ్మనంబెన్ని
ఁగుల నరసినఁ బట్టువడదు

తే. చెలువ యింక నొక్కించుకసేవు నీవ
నాదరంబున నెప్పటియట్ల యున్న
మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ
బడయవచ్చునె యెన్నియుపాయములను.

4 2.47

ఇందాతని జంకు వర్ణింపఁబడినది. ఆమె పెంపును కీచకునిచేఁబలికించినాఁడు తిక్కన. ఆమె చేయిపట్టుటకు కూడ కీచకుఁడు మిక్కిలి ప్రయత్నము చేయవలసి వచ్చినది. ద్రౌపది అంతరంగము కీచకుని ఆలోచనకు అందదు. ఆమె అనాదరమును చెప్పకయే గ్రహించినాఁడు కీచకుఁడు. ద్రౌపది అతి గంభీర. ఇట్లు కీచకుఁడు పలువిధముల పలవించిన తదుపరి ద్రౌపది 'కలుషించియు దుర్వారంబైన పరిభవ వికారంబు తోఁపకుండఁదన్నుం దాన' యుపశమించుకొనినది తన్నుదాను నిగ్రహించుకొనగలుగుట ధీరలక్షణము. 'వీఁడు దురభిమానియై యున్నవాఁడు వేగిరపాటు వలనుగాదు వెరవుతోడన తప్పించుకొన వలయును' అని తలచినది ఇంగిత మెరిగిన పడతి ద్రౌపది. ఆమె ఈ ఆలోచనాశీలము తిక్కన వర్ణించినదే. తొలుత మెత్తగా బుద్ధిచెప్ప యత్నించినది. 'ఓ యన్న' యని సంబోధించి తనకాతఁడు కోరఁదగినవాఁడు కాఁడని సూచించి సజ్జను లట్లు మాటాడరాదనియు, 'ఆడు బుట్టువుల తోడ నీవును బుట్టినాఁడవు' అని యుక్తియుక్తముగా తానాతనికి సోదరివలె పూజార్హమైన దాననని తెలిపినది. 'హీన వంశాభిజాతను అయినను పతివ్రతను' అని హెచ్చరించినది. మూలమున నున్నదానికంటె ద్రౌపది పలుకులను సూటిగా, క్లుప్తముగా తిక్కన రచించినాఁడు. మితభాషణము పతివ్రత లక్షణము. కీచకుఁడు ఆమె మనస్సును గ్రహింపక ప్రలపించినట్లు మూలమునగలదు. తిక్కన ఆ పొగడ్తలను, ప్రలాపమును విడచి కీచకునిచే నొక్క

చక్కని వర్ణనగావింపఁజేసినాఁడు - ఇంత తరువాత అంగవర్ణన తగురీతిలోఁ జేయించినాడు. ద్రౌపది ఉత్తమజాతి లక్షణములు ప్రస్ఫుటము లై నవని ఇచట తిక్కన వ్యంగ్యముగాఁదెలిపినాఁడు. కీచకుఁడామెను గౌరవించినాఁడనుట కాదని ఈ పలుకు చాలును - నీవు దుర్జాతికామికి నీవసాతి'. ఇందు వర్ణనలేదు. కాని ధ్వని కలదు. ఆమె రూపమే ఆమె ఉత్తమత్వమును వెల్లడించు చున్నదనుట తిక్కన భావము. అప్పుడిక నీచుని జంకించినగాని లొంగఁడని ఆమె కఠినముగాఁ బలికినది. ఈ సందర్భమున మూలమునందు ఐదు శ్లోకములు గలవు. బాలుఁడు తెలివిలేక ప్రవాహముదాటదలచినట్లు, తల్లి ఒడిలో కూర్చుండి చంద్రుని బట్టగోరినట్లు తన్ను కీచకుఁడు కోరుచున్నాఁడని ద్రౌపది పలికినది. ఇందు తీవ్రత లేదు. కీచకని బాలునితోఁ బోల్చుటయు సరిగాదు బాలుఁడు చంద్రునిగోరుట, నదిని దాటదలచుట అపరాధములు కావుకూడ. పతులగూర్చి ద్రౌపది పలికిన పలుకులలో ప్రత్యేకత లేదు. తిక్కన ప్రయోజన రాహిత్యములైన ఆ యుపమానములను వదలి ద్రౌపది తీవ్రమగు పలుకులను సంక్షిప్తముగను, వాడిగను కూర్చెను

శా. దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవురప్పు డిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యంబెమ్మెయిం
గీచకా. (4 -2.-55)

ఈ పలుకులలో వాడిదనము, వేడిదనము ఈడుజోడుగా నున్నవి. ఇట్లు ప్రయత్నించి పలికిన ద్రౌపది తన ఈ పలుకులనే తిరిగి భీమునకు వినిపించినట్లు తిక్కన మఱల పేర్కొనుటలో ద్రౌపది క్రోధము, రౌద్రము ప్రస్ఫుటముగా, ప్రత్యేక గుణములుగా నెన్నఁబడినవి. తొలుత పతుల అతులిత బాహుపరాక్రమమును ప్రౌఢసమాసబంధురముగాఁ బలికి, చివరగా కీచకుని మానము ప్రాణములను దోర్లీలగాఁగొందురని కోపమున పలికినది. ఈ పలుకులు ద్రౌపది రీవిని, దర్పము ప్రతిబింబించుచున్నవి.

క. చనుఁజనదని చూడక యం
దని మ్రాఁకుల పండ్లు గోయఁదలఁచుట హితమే

మును చెడిన రావణాదుల
విని యెఱుఁగవె యెన్నఁడును వివేకవిహీనా. (4.-2.-58)

ఇచట కీచకునకు రావణాదుల గుర్తుజేయుట ద్రౌపది తెలివితేటలకు, సద్యఃస్ఫూర్తికిని తగిన కల్పన. రావణుని వలె కీచకుఁడు నాశనమగును. 'అందని మ్రాఁకులకుఁ జేయిదలఁచుట' హితవుకాదని బలుకుట అత్యంత సహజముగా నున్నది. 'వివేక విహీనా' అను సంబోధన మోహాంధుడైన కీచకునికి తగినది. ద్రౌపది సమయస్ఫూర్తి విదితమగునట్లు ఈ సంభాషణను తిక్కన రచించెను.

ద్రౌపది ధీరవనిత అయ్యును అబల. ధీరగుణము ఆమె స్వభావమునకు సంబంధించినది కాగా అబలాత్వము శరీరసంబంధి. సుధేష్ణ కీచకుని యింట కల్లు దెమ్మని పలికినపుడు అందువలనే ఆమె మానసము డోలాందోళితమైనదని శరీరమున ఘర్మజలము పొడమినదని తిక్కన సహజముగా వర్ణించెను.

ఉ. ఉల్లము దల్లడిల్లఁగను వుద్గత ఘర్మజలంబు దాల్చుచున్
డిల్లపడంగ నాకిది గడింది విచారము పుట్టెనందుఁ బో
నొల్లననంగ రాదచటి కూరకపోవగ రాదు నేర్పు సం
ధిల్లఁగ దీనిఁ బాపికొను దీమస మెట్టిది యొక్కొ దైవమా.
(4.-2.-91)

హృదయమున కల్లోలము పుట్టినది. ఫలితముగా ఘర్మజలము శరీరమున పొడమినది. 'పోరాదు'. 'పోనొల్లననరాదు' అను సందిగ్ధత కలిగినది. నేర్పున తప్పించుకొను దీమసమునకై దైవమును తలచినది ద్రౌపది. ధీమంతురాలు గనుకనే ఎక్కువ వాద ప్రతివాదము చేయక, కీచకుని ప్రసంగమును సుధేష్ణతో బలుకక ధైర్యమునూని వెడలినది. సుధేష్ణ అంతయు తెలిసి తన్నంపునపుడు తానేమి చెప్పినను ప్రయోజనముండదని ద్రౌపది ఎఱుంగును. అయినను తాను చేరవచ్చినప్పుడు పలికిన పలుకులనే గుర్తుచేసినది. డోలాందోళిత మానసయగుచు 'సత్పథవృత్తి బహుమానపాత్రనై యుందు' నని, 'దుష్కృత్పరివార యోగ్య పరిచారము మైఁ జనునట్టిదాననుగాన'ని పలికి

నది. అంతేగాని అక్కవద్ద తమ్ముని గూర్చి ప్రస్తావింపలేదు. మూలమున ద్రౌపది బేలయై తన్నుతండవమానించునని సుధేష్ణకు విన్నవించినట్లుగలదు. ఎఱిఁగి ఎఱుంగమిని ప్రదర్శించు సుధేష్ణకు విన్నవించుకొనుట చెవిటివాని ముందు శంఖు ఊదుట, మేల్కాంచినవానిని మేల్కొలుపుట అగును.

నగచ్ఛేయమహం తస్యా రాజపుత్రినివేశనమ్ ।
త్వమేవరాజ్ఞిజానాసి యథాపని రపత్రపః॥ 4 14.11

ఇట్లుపలుకుట — 'నగచ్ఛేయమహం' — పరిచారికాత్వమునకు పొసగదు. 'నన్నుడుగు మొల్లను బంపు' మనుట వినయముగా పలికినట్లున్నది. పాత్రమునకు తగిన వేషభాషలను తిక్కన కూర్చును.

కీచకస్తుసుకేశాంతే మూఢో మదనదర్పితః ।
సోఽవమంస్యతి మాం దృష్ట్వానయాస్యేతత్రశోభనే॥
4 14.14

సంతిబహ్వ్యస్తవ ప్రేష్యా రాజపుత్రి ! వశానుగాః ।
అన్యాం ప్రేషయ ఛిద్రంతేసహిమామవమంస్యతే.
4 14.15

కీచకుని మూఢుఁడని, మదనదర్పితుఁడని ద్రౌపది పలుకుట అనవసరము తిక్కన ఈ నిందను పరిహరించెను. ఇతరుల ఇండ్లకు వెడలుట నీచ కార్యము గనుక తాఁజేయనని మాత్రమే పలికించెను. అదియును ఫలితము లేని పనియైనది. 'నిన్ను నమ్మి చేరినవారిని రక్షింపకున్న, అపాయము చేసిన నిందపుట్టదే' అని హెచ్చరించినది. 'నా కొఱకు గాదు, నీ మేలు కొఱకు కూడ చెప్పుచున్నాన'ను రీతిలో పలికినది తిక్కన ద్రౌపది.

ఉ. సాధులు చేరి నెమ్మిఁగ నిజస్థిర వృత్తము దుష్టకోటిచే
బాధలఁ బొందకుండఁ దమపాల వసించినఁబెద్దవారు ది
క్కై ధరియించి వారికొక యాపద పుట్టక యుండఁగాచుటొ
ప్పై ధరఁగీర్తి కెక్కుదె యపాయము సేసిన నింద పుట్టదే.

తన సాధుత్వమును, కీచకుని దౌష్ట్యమును వ్యంగ్యము జేసినది ద్రౌపది. అటుపై తనను గతించి వలసిన బాధ్యత సుధేష్ణదనియు అట్లుగాచిన కీర్తి కలుగుననియు కీచకునింటికిఁ బంపి అపాయమును తలపెట్టిన నింద పుట్టుననియు హెచ్చరించినది. మూలమునందు వలె కీచకుని నిందించుట కంటె తన్ను బంపినచో కలుగు పరిణామములకు సుధేష్ణ బాధ్యురాలని సూచించుట మేలుతరము. ఆపలుకలకు సుధేష్ణ కొంచెము జంకినది కూడ.

ఆయమతోనింక వాదించి ప్రయోజనము లేదని గ్రహించిన ద్రౌపది మనమురియాడుచుండ, విచారముతో, అనుమానముతో, ఆర్తిమూర్తియై చనినదని తిక్కన సూచించెను. అట్లు నిర్వేదమునుబొంది చనుచు తన్ను రక్షించువారు లేరని దైవమును మాయవిధియా యని దూఱినదఁట అలమటఁ బొందినది. అశ్రులు తొఱఁగినవి, తొట్రిలపడినది. ఆననంబున వెల్లదనము గదురుట, తనులత కంపమొందుట, పదముల తొట్రుపాటు. అవయవంబుల ఘర్మాంబు కణికలెసఁగుట సంభవించినది (1-2-106). ఈ అబలాత్వమంతయు శరీరసంబంధియే. ఈ ఉద్విగ్నత తిక్కన కల్పనము. ఆసమయమున ద్రౌపది రూః భావములను సంచారీభావ పరిపోషితముగా రసోదంచితముగా కరుణ రస నిర్భరముగా తిక్కన వర్ణించెను. ఈ వర్ణన రసచర్చలో ఎన్నఁదగినట్టిది.

‘మహాపదలకుం బరిహారణంబు హరిస్మరణం’ బని ద్రౌపది భావించి కృష్ణుని నెఱనమ్మి సుధేష్ణ మందిరంబు వెలువడి ‘కీచకునిచేత నన్నొక కీడు తెరువు వొరయకుండఁగ రక్షింపు’ మని కమలమిత్త్రుని ప్రార్థించినది. ఆమె శారీరకముగా అబలకావుననే ‘అత్తరుణిం గాచుటకు నత్యుదగ్ర భుజా విస్ఫురణాఢ్యు నొక్క రక్కసుఁ గరుణార్ద్రమనస్కుఁడగుచు’ దినకరుండు గ్రక్కనఁ బనిచినాఁడు. ఈ హరిస్మరణంబు తిక్కన కల్పనము

కీచకుని గృహమందు వాని సల్లాపములను ద్రౌపది పెడచెవిన బెట్టి ‘ధీరకావున విగత వికారయగుచు’ ‘మదిర పోయింపుఁడద్దేవి ఎదురుచూచు నలుగుఁదడ వైన మగుడఁ బోవలయు’ ననినదఁట. తిక్కన ద్రౌపది ఎప్పుడును ధీరయే. కావున కీచకుని మాటలకు వికారమును బొందలేదు. అనవసరముగా వాదమును జేయలేదు.

శారీరకముగా అబలయైన ద్రౌపది తనంతతానే కీచకుని విదిలించు కొన్నట్లు మూలమున గలదు. కొన్ని ప్రతులలో విదిలించుకొనుటయే గాదు, వానిని క్రింద పడద్రోయగా శాఖలు తెగిన వృక్షము వలె కీచకుడు క్రింద బడెననియు కలదు. ఇది మరింత అసహజము.

సతీ మభిప్రేక్ష్య విశాల నేత్రాం జి
ఘృక్షమాణః పరిభర్త్సయంతీమ్
జగ్రాహతా ముత్తర వస్త్ర దేశే
స కీచకస్తాం సహసా క్షిపంతీమ్
ప్రగృహ్యా మాణాతు మహాజవేన
ముహు ర్వినిశ్వస్యచ రాజపుత్రీ
చికేపతం గాఢమమృష్యమాణా
ప్రవేపమానాఽ తిరుషా శుభాంగీ
తయా సమాక్షిప్త తనుస్స పాపః
పపాత శాఖీవ నికృత్త మూలః3

కీచకుని విదిలించు బలముగలిగిన స్త్రీలో మృదుత్వముండదు. కావుననే-తన్ను గాచి వచ్చుచున్న అదృశ్యాకారుండైన దైత్యుని బలము తన్నావహింపగా ఆతనిని పడవైచి పరువెత్తఁగలిగినదని తిక్కన మార్చి ఆమె సౌకుమార్య మును మన్నించి ఔచితిని పోషించినాఁడు. "దనుజ మహాబలము తనదు తను వొందిన నాతని చే విదిల్చి" (4.2.126)

ధర్మరాజు భీముని కోపమును వారింపగాఁ జూచిన ద్రౌపది సభను సమీపించినది. అప్పటి ద్రౌపది రూపమును తిక్కన కడుదైన్యము తోచునటుల వర్ణించినాఁడు./ 'సర్వజనవంద్యయైన పాంచాలి' 'ఎంతయు దైన్యమొంది' విరాటుని సభఁజేర నరిగి నిలిచినది. అప్పుడామె శరీరముమీద ధూళినిండి యున్నది. నాసికనుండి వేడి నిట్టూర్పు వెడలుచున్నది. కన్నుఁగవ నశ్రుకణ ములు జాలువారుచున్నవి. నెమ్మొగమున కురులు నిండినవి. ఇందు శరీరము దుమ్ముచే గప్పబడిన ఎలతీగవలె, నాసిక నవసౌరభంబెసఁగెడు చంపకము

వలె, కనుగవ తుదిమంచు దొరగెడు తోయజదళములవలె, నెమ్మొగము కళంకయుతమైన ఇందుబింబమువలె కాంతి తరిగియుండుటను కవి సూచించెను. ఇట్టి దైన్య రూపమే సుధేష్ణ మందిరమున కరుగునపుడు కూడ వర్ణింపఁబడినది.

ద్రౌపది కోపములో కొంత విచక్షణ కోల్పోయినది. ఇది ఏ వ్యక్తికైనను సహజ లక్షణము. సభ్యులను జూచినట్లుగా పతులను రూక్షదృష్టితో చూచినదట. ఎలుంగు చలింపఁగా తన పరిభవమును, నాథుల నిర్లక్ష్యమును ఎలుగెత్తి చాటినది. తిక్కన ఆమె హావభావముల నెంత విపులముగా వర్ణించెనో ఆమె తీవ్రమగు పలుకులను కూడ అంత పెంచెను. పతుల గుణగణముల నేకరువు బెట్టి ఇట్టి గంధర్వుల సతికి అవమానము జరిగినదనగా 'అచ్చెరువుగాదె యెవ్వరి యాండ్రు దురింకఁ బరిభవంబునుఁ బొందక బ్రతుకువారు' అని ప్రశ్నించినది. ఈ తీవ్రత మూలమున లేదు. తననుగూర్చి 'పతివ్రతా గుణాస్పందిత వర్తనం బరమసాధ్వి ననిందితశీల' నని కంఠోక్తిగా చెప్పుకొనజాలిన ధైర్యమును తిక్కన ద్రౌపదికి గల్పెను. 'మత్స్యదేశమున యాజ్ఞకితం దొడయుండు' నని సభలో ప్రకటింపగలిగిన ధీరవనిత ఆమె.

ధర్మజుఁడామె కోపమును చల్లార్చి అనునయింపఁ జూచినాఁడు. ఆమె తొలగిపోలేదు. నర్తకివలె ప్రవర్తించుచున్నావని కష్టముగాఁ బలికినాఁడు. ఆ మాటతో మఱింత రెచ్చినది ద్రౌపది అలుక. ఉచితానుచితముల సరకు చేయక ధర్మజు నీసడించినది. 'నాదు వల్లభుఁడు నటుఁడు, పెద్దవారిని బట్టి పిన్నవారు. పతులవలె నేనును శైలూషనే, కాదనలేను' అని అంతటితో నైనను నూరకొనక 'మత్పతి శైలూషుండ కాఁడు కితవుండునుం గావున జూదరి యాలికి గలుపతనం బెక్కుడియది' అని ఎదురు ప్రశ్నించినది. ధర్మరాజును సభాముఖమున 'జూదరి' యనుట దోషము కాదు. ఏలనన అన్ని కష్టములకు మూలమైన దాతని జూదమే. అప్పటి కోపమాబాధను ఇనుమడింపఁజేయగా కొంతవాదము జరిగినది. తొలుత ధర్మజుఁడే ఆమెను 'విచ్చలవిడి నాట్యంబు నలుపు చాడ్పున నిట్లునికి' కులసతుల గలువ చందము తొలగించునని పలికిన పిమ్మటనే ఆమె అతనిని జూదరియని ఆక్షేపించినది. సాధారణదృష్టికి ద్రౌపది పలుకులలో అనౌచిత్యము దోచును. కాని సన్నివేశమును విపులీకరించి తిక్కన ఆ అనౌచిత్యమును పరిహరించెను.

సుధేష్ణను 'జంత' అని ద్రౌపది ఇప్పుడు భావించుటయు, సహజము. కన్నుల బాష్పపూరములు గ్రమ్మఁగ మోమున దైన్యమొందగాఁ నన్నులి వాతి తొట్రిలుచు నంగముదూల సుధేష్ణ పాలికి చనినది. ఈ వర్ణన సందర్భోచితము. సుధేష్ణ అత్యంత ఆశ్చర్యమును నటించి ద్రౌపదిని వర్ణించి – 'ఏది కారణముగ నెవ్వరెచ్చోటు నీ కేమి కీడొనర్చి రెట్టిపాటి సాహసికులో వారిఁ జంపుదు నొంపుదు, భంగపఱుతు నిడుమ పఱుతుఁ జెఱుతు' ననగా ద్రౌపది ఆమె అంతర్యమును గ్రహించి 'నీ వెఱింగియు నెఱుఁగమి భావించిన నింక శేమని పలుకం గలదాన నైనను వినుమని'నది. ఇది TIT FOR TAT అన్నట్లున్నది. 'కుక్క కాటుకు చెప్పుదెబ్బ'–

కీచకుని దండింతునని సుధేష్ణయనఁగా ఆమె అసత్యవాదినియని ఆమె మాటను లెక్కగొనక ద్రౌపది 'నీ వింత యలుగ నేటికి, నా వంత దీర్చుటకు మత్పతులు గలరని' సూటిగాఁ బలికినది. ద్రౌపది కీచకుని ఇంటికి పోవుటకు ముందు సుధేష్ణతోఁ బలికిన విధమునకు, ఇప్పటి ఈ పలుకులకు చాల వ్యత్యాసముగలదు. సుధేష్ణపైని గౌరవము ద్రౌపదికి లేదని తెలియును. ఎవ్వరెన్ని చెప్పినను తేఱదు. మజ్జన భోజనములకుం బోఁబదు పరిభవానలము ఆమెను విశ్రాంతిగా నుండనివ్వలేదు. కోపము పెరిగినది.

క. ప్రబలుం డారయ నా సిం
హబలుం డాతని జయింప ననిలతనయు బా
హుబలంబ చూడఁదగు నై
నబలంబులు నాతనికి నవశ్యముఁ గల్గున్. (4.2.164)

బలాబలములను చక్కగా ఆలోచించినది పాంచాలి. ఆ తరువాత భీముని నివాసమునకుఁ జని ఆతనిని నిద్రలేపి మృతునివలె పరుండినావని నిందించి కోపగించుకున్నట్లు మూలము. ద్రౌపది అంత అసభ్యముగా పలుకదగదు. మంద మంద సంభాషణంబుల సంబోధించి చేతితో మేల్కొలిపినట్లు తిక్కన మార్చెను. 'నా మీద దయతప్పినదా' యని దయనీయముగాఁ బలికినది. పతి మనసున కెక్కునట్లు ప్రవర్తించినది తిక్కన ద్రౌపది. 'ఎఱిగి యెఱిఁగి నన్నడుగనేల' అని ఆ తరువాత తన పరిభవమును దెలిపినది. మూలమునందు

పాండవులొక్కొక్కరిని గూర్చి వగచిన వెనుక అసలు విషయము పలుకుట గలదు. వచ్చిన పని తొలుత చెప్పి పిమ్మట పతులకై దుఃఖించినట్లుండుటయే సహజము.

క. కుంతికి నంత వెఱవ మీ
కంత వెఱవ దైవమునకు నంత వెఱవ న
త్యంత కలుషాత్మ విరటుని
కాంతకు నే వెఱతుఁ బనుల గావించునెడన్. (4 -2.185)

ద్రౌపది -భయమెరుగని తత్త్వము, ప్రస్తుత భయస్థితి రెండును జాలి గొలుపునటు తెలియబలికినది.

దుస్ససేనుని, జయద్రథుని చర్యలను గుర్తుచేసి ఈనాటికింత జరిగినది అని పలికి 'వగ నాకు వింతయే' అని నిష్ఠురమాడినది. మఱల మృదు స్వరముతో.

ఆ అకట యాఁడుఁగూఁతు నాలకూఁతును లాఁతి
వారికైన నరయ వలయుఁ గనిన
నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టులు
సూడనేర్చె ధర్మసూనుఁ డపుడు- (4 -2 -177)

అని అడిగినది. ఇది కార్యసాధనకు తగిన మార్గము.

ద్రౌపది ధర్మజుని నిందించినందులకు బాధపడి 'డెందంబు కొందలంబుఁ బొందిన ధృతిమాలి యేఁబలికితిం దగ వెల్ల నెఱింగియుండియున్' అని తన ధృతి చెడిన అవస్థను తానై వెల్లడింపగలిగిన గుణవతి ద్రౌపది.

ద్రౌపది ఎంత మన్నన నందినదో తిక్కన ఆమెతోనే విపులముగా, బలికించినాఁడు భీమునితో నేకాంతములో నొకసారి, కృష్ణునితో పలువుర ముందఱ ఒకసారి, తన ప్రాభవమును చెప్పుకొనినది ఆ వీరవనిత.

సీ. ద్రుపద భూపాలుఁడు పుత్త్రులకంటె నెంతయుఁ
బెంపు సేయుచు గారవింపఁ బెరిగి
కుంతీమహాదేవి కోడండ్రలోపల
నగ్గలంబునఁ గొనియాడఁబరగి
ప్రాణంబులకు నెల్లఁ బ్రాణంబుగా మీరు
నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి
మదిఁ దల్లిదండ్రుల మాఱుగాఁగొని జను
లనిశంబు భక్తిసేయంగ నెగడి

తే. రూపగుణ విక్రమంబుల రూఢికెక్కు
నట్టి కొడుకులఁగని భరతాన్వయంబు
నందు నాయిల్లు యిల్లుగా నతిశయిల్లి
తగవుమై బాంధవులచేతఁ బొగడు వడసి. 4.-2.-216

మ. వినుతింపందగు రాజసూయము నఁ బృథ్వీదేవతాకోటి కె
ల్లను సంతృప్తి యొనర్చి వారిదయ, గల్యాణాత్మనై పుణ్యవ
ర్తన పాండు క్షితిపాలు కోడలనఁగా రాజన్యమాన్యప్రియాం
గనలం దెల్లఁ బొగడ్తగంటి నతిలోకంబైన మీ మన్ననన్
(4.-2.-217)

ఉ. ఏ మనంబు పెంపునెడి యిప్పుడు నీచతర ప్రకారమున్
బూని నికృష్టనై యుదరపోషణకై తగవేది యెంతయున్
దీనతఁబొంది యిమ్మెయి సుధేష్ణపనుల్ గనుసన్నఁ జేయుచున్
హీనత నున్కి మీకు వగపేమియుఁ జేయొద యేమి
సేయుదున్. (4.-2.-218)

తన అభ్యున్నతియొక్క శిఖరములను దెలిపి ఆ తరువాత తన యిప్పటి భంగిని దయనీయముగాఁ బలికిన ద్రౌపది కార్యోన్ముఖముగా భీముని

మనస్సును జయించినది. చివరకు దుఃఖపరవశయై 'దొరగేఁడు వస్త్రముల మునిగిన మోమతని వక్షమున జేర్చి'నది. ఆమె దుఃఖమునకీచరమ పరాకాష్ఠ. మూలమున ద్రౌపది విషముత్రాగి ప్రాణత్యాగము చేయుదుననినది. తిక్కన ద్రౌపది మఱికొంత భీషణముగా ప్రతిజ్ఞ చేసినది. ఇంతకు చావకున్నదాన. నాదుఃఖము తీరునది గాదని, వారు చూడగా కీచకుఁడు తన్ను కాలదన్నినాఁడని పల్కి అది విధిబలీయమని వారి దోషము కాదని తిరిగిపలికినది. చివరగా తాను ప్రతిన బూనినది.

తే. వానిఁ దెగఁజూడవైతేని వాయుపుత్ర
నీవు గనగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబునవైన నేను
మేఁ దొఱఁగుదు నెట్టు నీయాన సుమ్ము. (4. 2-229)

ఇన్ని విధములలో ఏదో ఒక విధమున శరీరత్యాగము చేసెదనని నిశ్చయముగాఁ బలికి భీముని మీఁదనే ఆన పెట్టినది. ఎంత తీవ్రత!

ద్రౌపది కడునేర్పుతో కీచకుని నమ్మించినది. 'మెత్తబడినయట్లు నటించి సుభగమైనవడి చూపుగాఁజూచి' అపుడు బలికినది. మూలమున ద్రౌపది వెంటనే వానికి వశవర్తినిగాఁ బలికినది.

ఏవం మే సమయం త్వద్య ప్రతిపద్యస్వ కీచక।
నత్వాం సఖా వా భ్రాతా వా జానీయాత్సంగతం మయా
అను ప్రవాదాద్భీతాఽస్మి గంధర్వాణాం యశస్వినామ్
ఏవం మే ప్రతిజానీహి తతోఽహం వశగా తవ (4-21.-12,13)

కాని తిక్కన ద్రౌపదిచే ఇంకకొంత మెలకువగా గంభీరముగాఁ బలికించెను. 'వలదని ఎంతచెప్పినను విడువవు. నీ చిత్తమువలె ఇతరుల మనసులను గూడ మన్మథవశములు చేయతగునా ? కోరిక ఉన్నను ఆలోచన చేయవలెను' అని కొంతనచ్చబలికిన పిమ్మట 'మగవారివలె ఆడువారు ధైర్యముగా తమ మోహాము వెల్లడింప' రనినది. 'రహస్యము చెడకుండ నీ

కోరిక కనుపుగ భోగవిధములను జూడు'మని పలికినదే కాని 'నేనులొంగి పోవుదు నని సూటిగా బలుకలేదు. అట్లు నటనయందైనను బలుకనీయలేదు తిక్కన ఆయనకావాడిన ద్రౌపది గౌరవమట్టిది ఆమెనే సంకేతస్థలమును నిశ్చయింపు మని కీచకుడు కోరగా 'తన యెడలం గీచకుండు తగులుట భావంబున నిశ్చయించి అనురాగాయత్త చిత్తయైనదివోలె' నిట్లనినది ఆ నిశ్చయము కలుగనిదే ఏమియు చెప్పెడిది కాదను భావము కలుగుచున్నదచట. సంకేత స్థలమునకు ఒక్కరుండ రావలయునని, లేకున్న తాను నిలువనని మఱిమఱి జెప్పి ఎక్కువసేపచట నిలువవలదని అనుమానమితరులకు కలుగునని చెప్పి ఆతనిని పంపివైచినది. ఈ యుక్తియుక్తముగా బలుకుట తిక్కన చేర్చిన పెంపు. వెనువెంటనే మహానసశాలలోనికేగి భీమునితో ఆ వృత్తాంతమును జెప్పినట్లు తిక్కన కల్పించెను. భీముని అధికోత్సాహమును గనిన ద్రౌపది సమయభంగమగునని వెఱచి ఆతని ఉత్సాహమును కొంత నియమించినది. ద్రౌపది సమయస్ఫూర్తి యది. 'పాంచాలి సంచలిత స్వాంతయై నిజాంతర్గ తంబున నితని తీవ్రక్రోధంబు గుప్తసాధనంబునకు బాధకంబగునని బోధింప దలచి'— ఒవ్వని వారునవ్వగ, ధర్మజుండు బాధపడునట్లు, జనులు నిందించునట్లు నీవు కోపవశంబున రహస్యభంగము చేసిన నా కోరిక తీరియు నిష్ఫలమగునని హెచ్చరించినది.

క. కావున వంచన బాహిర
 పోవక యుండంగ మనరిపుం బరిమార్పం
 గా వచ్చునేని పట్టిద
 నావలపటుగాక తక్కనన వలదుసుమీ. (4 -2 -287)

కీచకుని జంపకున్న తాను బత్రుకనని తొలుత ప్రతినబూని భీముని ఉత్సాహపరచినది అవధులు లేని ఆతని ఉత్సాహము తమకే హానికరమగు నని భావించినపుడు ఆతనిని శాంతపరచుటగా కీచకుని చంపుటకన్న, సమయ పాలనము ప్రధానమని గుర్తుచేసి భీముని సమయపాలనమును, కీచకుని రహస్య మరణమును సాధించిన ప్రజ్ఞానంతురాలు ద్రౌపది. తనభర్తచే తాను కోరినపనిని పలువురు మెచ్చు పద్ధతిలో చేయింపగలుగుట భార్యయొక్క ప్రజ్ఞ ద్రౌపది అట్టి ప్రజ్ఞాశాలిని.

కీచకుని మరణానంతరము ఆతని శవమునుగాంచి ద్రౌపది భయపడలేదు సరిగదా ఉత్సాహముగాఁజూచినది. క్షత్రియవనిత కెనయగు ధైర్యమును, స్త్రీజన సహజమగు కుతూహలమును తిక్కన చిత్రించెను.

మానుమనఁ జేరె వ్రేల్మిడుచుం దలయూఁచి విదగ్ధచిత్తయై
యోగా చపలాక్షి యల్ల క్రేపంగు నంగుళము గదియించి దీనికై
కీచకుఁ డింత సేసెను సుఖత్వముఁ బొందుదుగాక యింక న
ర్లేచిన నిటుగా కుడుగునే యనుచున్ దెలఁగంపుచుండఁగన్
(4 -2. ౩౫౮.)

ద్రౌపది అభినయము, మాటలు, భావములు ఇచట అతి సహజముగానున్నవి. 'దీనికై కీచకుఁ డింత సేసెను సుఖత్వము బొందుదుగాక' అను పలుకులు వ్యంగ్యార్థ బోధకములు 'ఇక్లేచినసట్లుగా కుడుగునే' అనుటలో వానికి తగిన శిక్ష విధింపఁబడినదను తృప్తి, తన భర్తల పరాక్రమమును గూర్చి నమ్మిక తెలియుచున్నవి.

కృష్ణుఁడు రాయబారమున కేగునపుడు ద్రౌపది తన అభిప్రాయమును తెలిపిన సందర్భములో తిక్కన ద్రౌపది భాషణమును కొంత మార్చెను. ఆమె ఉద్దేశమొక్కటియే. కాని పలుకులలో తీవ్రత మూలమునందుకంటె తిక్కన ఎక్కువ చేసెను. తన బాధలను, భర్తల నిర్లిప్తతను, తన కోరికను దెలిపి శ్రీకృష్ణుని శరణువేడినది - దుస్ససేనుని రణగంగమున చూడఁ దలచినది. తిక్కన మూలముకంటె మార్చి రచించుట వలన ద్రౌపది ఆవేశము, తీవ్రస్వభావము, ప్రతీకారవాంఛ తేటపడును. క్షత్రియకాంతకుచితముగు రీతిలో మాట్లాడినది తిక్కన తీర్చిన ద్రౌపది. ముఖ్యముగా తన భర్తల శాంతివాక్యములను విని హేళనచేసినది, నిష్ఠురమాడినది ఆ తరువాత తాను బాధాతప్తయై ఏమియో మాటలాడుచున్నదనియు వానిని సరకుగొనవలదనియు తానే పలికినది ఈ నిష్ఠురోక్తులు సమయోచిత కార్యోక్తులు తిక్కన ప్రత్యేకతయే. అటుపిమ్మట భీమార్జునుల ఆయుధముల నిరసించుటను తిక్కన కల్పించి, ద్రౌపది దుర్యోధన, దుశ్శాసనాదుల నాశనమును ధర్మజునితో కలిసిచూడవలెనని కోరుట, శ్రీకృష్ణుని దుష్టశిక్షణ, శిష్ట రక్షణము ప్రస్తాపించి

పలుకుటను చేర్చెను. మూలమున శిక్షార్హుల శిక్షింపక వదలుట, శిక్షను అమాయకులకు కలిగించుట పాపములని, బ్రాహ్మణులను క్షమింపవచ్చునని దీర్ఘముగా పలికిన పలుకు లప్రస్తుతములని తిక్కన వదిలి 'వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్' అని మాత్రము కలిపెను. "అచ్చోటన సంగరంబు లగు చొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్ పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానలనుండ నచ్యుతా" అను ద్రౌపది పలుకు లమూలకములు. పైవాక్యములందెంత నిష్ఠురము, ఎత్తిపొడుపు గర్భితములై ఉన్నవో గమనింప వచ్చును.

ఈ సందర్భములో ద్రౌపది పాత్ర ముఖమున తిక్కన పలికించిన వాక్యములలోని తీవ్రభావములు ఆమె స్వభావమును వ్యక్తము చేయుచున్నవి. మూలమునందు దీనాలాపములుగానున్న వాక్యములను తిక్కన తీవ్ర క్రోధానల జ్వాలలుగా మలచినాఁడు.

ఉ. ఆ సభ కేకవస్త్ర నగుచుట్టి ననుం గొనివచ్చి నొంచు దు
శ్శాసనుఁ జూచుచుం బతు లశక్తము లై తగు చేష్టలేక నా
యాసలు మాని చిత్రముల యాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసము తోడ నిన్ గొలువవచ్చె మనం బడియుం దలంపవే.
(5.-3.-111)

ఇందు ద్రౌపది తన పతుల చేతకానితనమును నర్మగర్భముగాఁ బలికినది. సతి అవమానమును చూచుచు నిశ్చేష్టుఁడైన పతి అసమర్థుఁడేఁగదా! వారి ఆ అసమర్థతను ద్రౌపది ఎంత ధైర్యముగా ప్రకటించినది. ఇది తిక్కన ద్రౌపది కల్పించిన ప్రౌఢిమ. విశ్వాసముతో నిన్నుగొలిచిన నన్ను మరువకుము సందేశము కృష్ణునకు అందజేసినది.

అట్లు తన అవమానము నుగ్గడించునపుడు ద్రౌపది ఎంత ఉద్విగ్న చిత్తయైనదో తిక్కన ప్రతిభావంతముగా చిత్రించినాఁడు. మూలమునందున్న భావమునే కొంత వాడిచేసినాఁడు.

సర్వలక్షణసంపన్నం మహాభుజగ వర్చసం
కేశపక్షం వరారోహా గృహ్యసవ్యేన పాణినా ॥
పద్మాక్షీ పుండరీకాక్ష ముపేత్య గజగామినీ।
అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచనమబ్రవీత్ ॥
(5.80.34.35)

మూలమున నిట్లున్న ద్రౌపది రూపమును తిక్కన వర్ణించిన విధము కొంత భిన్నము.

ఉ. ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి వెంద్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగలేక బాష్పజలు గ్రమ్మఁగ డగ్గనలేచి యార్తయై.
5-3-114

మూలమున నున్న 'సర్వలక్షణ సంపన్నం', 'గజగామినీ' ఇత్యాది సమాసములను తిక్కన వదలి 'బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి,' 'అసితచ్ఛవిఁబొల్చు,' 'మనమున బొంగు విషాదరోషముల్ కావఁగలేక,' 'డగ్గనలేచి యార్తయై' అను వాక్యాంశములను చేర్చుటవలన ఆమె రూపు మనమున హత్తుకొనుచున్నది. ఆమె తీవ్రస్వభావము తేటపడుచున్నది.

ఆ వెంద్రుకలు 'దుశ్శాసన కరోద్ధృతః' అని మూలమున చెప్పఁబడఁగా 'దుస్ససేను వ్రేళ్ళందవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి' అని తిక్కన వర్ణించెను చెప్పదలచిన దానిని కడు సమర్థవంతముగా చెప్ప గలిగిన వనిత ద్రౌపది.

దుశ్శాసన భుజం శ్యామం సంఛిన్నం పాంసుగుంఠితమ్ ।
యద్యహం తం న పశ్యామి కా శాంతిర్హృదయస్య మే
5-80-30

అని మూలమున తన కక్షను తెలిపినట్లున్నది.

ధిగ్బలం భీమసేనస్య ధిక్పార్థస్య ధనుష్మతామ్
యత్ర దుర్యోధనః కృష్ణే ముహూర్తమపి జీవతి. ॥

5-80-31

భీమార్జునుల బలపరాక్రమములను గూర్చి ఇంత మాత్రమే పలికినది మూలమున.

ఈ రెండు శ్లోకముల నాధారముగాఁ గొని తిక్కన ద్రౌపది స్వరూప స్వభావములనెట్లు చిత్రించెనో చూడఁదగును.

సీ. ఈ వెంట్రుకలు పట్టి యీడ్చిన యాచేయి
తొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింత లింతలు తునియలై చెదరి రూ
పఱియున్నఁ గని యుడుకాఱుఁగాక
యలుకపాలఁ బోనుపడునట్టి చిచ్చే యిది
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మను నొక విల్లెప్పుడును వహించు

ఆ. క్షత్త్రి విక్రమంబుఁ గాల్పనే యిట్లు బ
న్నములు పడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁబడయమైతి మేని కృష్ణ. 5-2-117

ద్రౌపది కురుక్షేత్ర మహాసంగ్రామమున కెంతవఱకు దోహదకారియో ఈ పద్యమున తిక్కన నిరూపించెను. "దుశ్శాసన భుజం శ్యామం సంఛిన్నం పాంసుగుంఠితమ్' అని మూలమున నుండగా 'ఈ వెంట్రుకలు పట్టి యీడ్చిన యాచేయి', అంతమాత్రమే గాదు, దుస్ససేనుని తనువు కూడ 'ఇంత లింతలు తునియలై' అని ఖండ ఖండములగుటతో తృప్తి కలుగదట

ఆ తువియలు గూడ చెల్లాచెదరై రూపటియున్న గనినగాని ఆమె ఉడుకు చల్లారదట. అంత తీవ్రమైనదన్నమాట ఆమె కోపము. ఆమె కోపానలమే కౌరవాన్వయమును కాల్చిచ్చై దహించినదను స్ఫురణను తిక్కన ఈ పద్యమున ధ్వనింపఁ జేయుచున్నాఁడు. 'రాజరాజు పీనుంగు'ను 'కన్నారఁ గానబడయ'నిచో భీమసేను బాహుబలము, నిత్య గాండీవధారియైన పార్థుని విక్రమము 'కాల్పనే' అని ప్రశ్నింప గలిగినది ద్రౌపది యొక్కటే. అట్లు నిందించినచో ధర్మజు నైనను వారు సహించి యుండెడివారు కారు. కాని ద్రౌపది శక్తిస్వరూపిణి. తేజోమూర్తి. ఆమె అవమానమునకు పాత్రమగుటయే భీమార్జునుల పరాక్రమమునకొక కళంకము. అందువలననే ఆమె తమ ఆయుధములను పేర్కొని నిరసించినను మిన్నకుండిరని తిక్కన మూలమును మించి రచించెను. ద్రౌపది వారినేగాదు శ్రీకృష్ణుని పై తము హెచ్చరింపఁ గలిగిన సమర్థురాలు. తన అలుక ఎన్నడు తీఱదని వగచుచునే 'దుష్టనిగ్రహము పూని జగంబులు కాచునట్టి తోఁబుట్టువు నీవు' గలుగఁగా కూడ నాకింత పరిభవము తప్పదా అని వ్యంగ్యముగాఁ బలికినది. ఇందు శ్రీకృష్ణుని గూడ ధర్మాధర్మ విచక్షణకై సన్నద్ధుని చేయు తోబుట్టువు ద్రౌపది. 'దుష్టనిగ్రహము నీ కర్తవ్యము.' 'జగముల కాచుట నీ ధర్మము' అని శ్రీకృష్ణునే కర్తవ్యోన్ముఖముగా చేయు ద్రౌపది నిందు సాక్షాత్కరింపఁజేసినాఁడు తిక్కన. ఈ సందర్భమున ద్రౌపది ప్రతిభా సామర్థ్యములను తిక్కన వేయి ముఖముల తీర్చిదిద్దెను.

ద్రౌపది ఒక పరిపూర్ణ స్త్రీ, మానవతి, ధీర. స్వాభిమాన, తీవ్రస్వభావ, అబల, కోపాయత్త చిత్త, పతివ్రత, అనిందితశీల, గంభీర — ఈ లక్షణముల నన్నిఁటిని తిక్కన స్పష్టముగా నిరూపించి అదిగాక నేర్పరి, చతుర భాషిణి, ఇంగిత జ్ఞాని, సమయోచిత కార్యవర్తిని - అనియు ఆమె సంభాషణముల ద్వారమున తెలియఁ బఱచెను. తాను దలచిన పని ఎంత దుష్కరమైనను సాధింపనిదే ఊరుకొనదు తిక్కన ద్రౌపది. మూలమునందున్న దానికంటె ఎప్పుడు ఒక కొంత మిన్నగా తిక్కన ఆమెను సంభావించెను. తాను సంభావించుటయేగాదు ఇతర పాత్రలచే సంభావింపఁ జేసెను. అత్తయగు కుంతీదేవి పై తము కొడుకుల కన్న నెక్కువగా నీ కూరిమి కోడలికై పరితపించినది.[5] ద్రౌపది పరిభవమును మఱువక నడువుఁడని కొడుకులకు చెప్పి పంపినది.[6] అనగాఁ ఈ కోడలి విషయమై ఆ అత్తకంత గౌరవమున్నమాట !

# భీమసేనుఁడు

భీముఁడు భారతకథయం దనునాయకుఁడు. అన్నగారి అభిలాష కనుగుణముగా వర్తించుటయే ఆతని ప్రవృత్తి. భీముఁడు ధీరోద్ధతుఁడు. ఆతని ఈ ఉద్ధతిని సమయాసమయములను బట్టి ధర్మరాజు నియమించును. తిక్కన విరాటోద్యోగములలో భీమునకు మూలమునందుకంటె మఱికొంత ప్రాధాన్యమును కల్పించి, ఆతని నొక నాయకతుల్యునిగాఁ జేసెను. భీముని లోని ఉత్తమనాయకత్వమును ద్రౌపదిచే కీర్తింపఁజేసి ఆతని యందు ద్రౌపది కెక్కుడు విశ్వాసము గలదని స్ఫురింపఁ జేసెను. భీముని విషయమై తిక్కన చేసిన అమూలకమైన మార్పులు ఈ అవగాహనకు తోడ్పడును.

విరాటపర్వము స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన ఒక ప్రబంధమయినచో అందు నాయకులు భీమార్జునులు. నాయిక ద్రౌపది. వీరిలో కూడ భీముఁడే ప్రధాన నాయకుఁడని భావింపఁదగును. ఏలన గోగ్రహణములకు కారణభూతమైనది కీచకవధ. దానిని నిర్వర్తించినవాఁడు భీమసేనుఁడు. కీచకుని సంహరించుట కాతని ఇచ్ఛయే కారణము కాని అన్నగారి అనుజ్ఞ కాదు. సతీమానమును కాపాడుటలో సమయభంగమునకు గాని, అగ్రజుని ఆగ్రహమునకు గాని వెరవని వీరోత్తముఁడు, అనుంగుభర్త భీముఁడు. ఇవి ఆతని లోని ఉత్తమ నాయకుని లక్షణములు. వీనిని తిక్కన ప్రస్ఫుటము గావించినాడు.

విరాటపర్వారంభములో ఆయా పాత్రముల గుణగణములను తెల్పుచు పాత్రములను ప్రవేశపెట్టినాఁడు తిక్కన. మూలమునందిట్లు పాత్ర ప్రవేశమునకు ముందు తద్గుణ ప్రశంస ఒక్క ధర్మరాజు విషయముననే పరిమితముగాఁ జేయఁబడినది. తిక్కన భీమసేనార్జునులను, కవలను, ద్రౌపదిని గుఱించి కూడ ధర్మజునిచే ప్రశంసింపఁ జేసెను. పాండవులకే కాక ఇట్టి సూచనలు ఇతరపాత్రములకన్నింటికిని చేయఁబడినవి. విరాటోద్యోగ పర్వములందు

ఎంతటి అప్రధాన పాత్రయైనను ఒక ప్రత్యేకతను సంతరించుకొని తిక్కన కావ్యశిల్పప్రతిభామూలకముగా సంచరించును.

విరాటుని కొలువులో ఏయే కార్యములు చేయుదురని ధర్మరాజు తన సోదరులను ద్రౌపదిని ప్రశ్నించు సందర్భములో- 'వృకోదర విరాటేత్వం వత్స్యసే కేన హేతునా' అని మూలమున కలదు. తిక్కన ఇచట భీముని గుణపరంపరలను పేర్కొనఁజేసి రాబోవు కథయందలి ఆతని నాయకత్వ మును సూచించెను.

సీ. కడిమిమై సౌగంధికవనమున యక్షుల మద
మడఁచి కృష్ణకుఁ బువ్వులట్లు దెచ్చెఁ
గిమ్మీర దానవు నమ్మెయి నిర్జించి
విగతకంటకముఁ గావించె వనము
బకదైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁ జేసి
రక్షించె నేకచక్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జటాసురు నదరి దం
డితుఁ జేసి మనలఁ బెట్టించుకొనియె

తే. నిశఁడు పుట్టిన కోలెను నెసక మెసఁగు
దర్పమునన వర్తిల్లె నుదగ్రమూర్తి
యకట యొరుచిత్తమున కెక్కునట్లుగాఁగ
మెలఁగి యేమివిధంబునఁ గొలుచువాఁడు. 4.1.74.

ఇచట ధర్మరాజునే పేర్కొనఁబడిన కార్యములన్నియు భీముని కీర్తి పతాకలు, వీరకృత్యములు. ప్రారంభించుట తోడనే ద్రౌపది కోర్కెను దీర్చుటకై యక్షుల మదమడంచి సౌగంధిక పుష్పమును దెచ్చెనని పలికెను. విరాటపర్వమున గూడ మాలిని కోరిక మీదనే కీచకుని మదమడంచెను. కిమ్మీర దానవునిజంపి వనమును నిష్కంటకము చేసినట్లు కీచకులజంపి విరాటునగర

యును శాశనము చేసెను. బకదైత్యుని జంపి ఏకచక్రపురమును రక్షించినట్లే సుశర్మను నిలువరించి మత్స్యనగరమును కాపాడెను. జరాసంధుని జంపి సోదరులను గాపాడుకొనినట్లు మల్లుని జయించి విరాటరాజు ప్రతిష్ఠను కాపాడెను. జరుగఁబోవు కథలో భీముని విక్రమము ఇచట సూచన చేయఁబడినది కవిచేత.

అంతేకాక తక్కిన సోదరులకంటె ఎక్కుడు ధర్మరాజు భీముని గూర్చి చింతించినట్లు తిక్కన ఈ సీసపద్య రచనయందు సూచించెను. ఆకారమును బట్టి 'ఉదగ్రమూర్తి' స్వభావమును బట్టి 'దర్పమున వర్తిల్లెడువాఁడు' దాగ నివాఁడు భీముఁడు. అట్లగుటచే ధర్మరాజు యొక్క విచారము సమంజసమే. ఇట్టివాఁడు ఒరుల పంచన ఉండుటయే దుర్లభము. ఇంకను 'ఒరులమనస్సున కెక్కునట్లుండుట దుష్కరము ఈతని ధార్తరాష్ట్రుల తోడి అలుకయు మిక్కుటము'. 'భీముడు ధార్తరాష్ట్రకుల భీషణరోషుఁడు చిత్తమెప్పుడెట్లౌ మద మెత్తునో....' అని భయపడినాఁడు ధర్మతనయుఁడు. ఇది ప్రధానముగా భీమసేనుని చిత్తవృత్తి. దీనికనుగుణముగానే అతని ప్రవర్తన సాగినది. కథయందు అతని ఉద్ధతిని, ప్రయత్నపూర్వకముగా దానిని మార్చుకొనుటను తిక్కన చక్కగా వర్ణించి భీముని పాత్రమును సజీవముగా రూపుదిద్దెను. ధర్మజుఁడు ఆయుధములను భీమునకు మాత్రము వశముగావలదని ప్రత్యేకముగాఁ బలికి అందులకు అలుగవలదని తమ్ముని అనునయించినాఁడు.

విరాటు నగరమున తాఁ జేయఁబోవు కార్యమును భీముఁడుత్సాహముతోఁ జేర్కొనెను. భీముని వంటి వీరాగ్రేసరుఁడు వంటచేయఁదలచుటఁయే వింత కాగా దానినాతఁడు ఇష్టముగా నిర్వర్తింపఁదలచుట మఱింత వింత. ఉత్సాహవంతుఁడైనవాఁడు ఏ కార్యమునైనను సమగ్రముగా నిర్వర్తింప గలఁడని భీముడు నిరూపించెను. తాఁ జేయఁబోవు కార్యమును వర్ణించెను. 'గరగరగాఁగూడు కూర చిత్తమునకు నచ్చిన చందంబునన యొనర్చి నేర్చి మెలగుదు'నని అగ్రజునకు నమ్మిక కలిగించినాఁడు. 'కరము వినీతి మెఱసి' అని చెప్పించుటచే 'సమయభంగము కాకుండునట్లు' అని కవి ఉద్దేశించెను. ఆ వంటను మనోహరముగాఁ జేయుదునని భీముఁడు పూనికను కనఁ బఱచినాఁడు.

ఉ    ఆఱురసంబులం జవుల యందలి క్రొత్తలు పుట్టనిచ్చలున్
వేఱొకభంగిఁ బాకములు విన్నఁ వొప్పగఁ సంఘటించి వ
న్నెలుఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మే
గాఱియ వెట్టియైన నొడికంబుగ వండుదు నెల్ల గ్గూరలున్.

4.1.77

అతనిని మించినవాఁడు లేనట్లుగా శరీరమును శ్రమపెట్టియైనను క్రొత్త రుచులతో వంటచేయుదునని చెప్పుటలో భీముని పాకకౌశలము విదితము

కట్టెలు గొట్టుటకు కత్తి గొడ్డలి యడుగనని కాలుసేతులతో విరుతునని భీముఁడు చెప్పుట అమూలకము. భీముని బలమును బలపరుచుటకే కవి ఈ పెంపు చేసెను. సూపాధ్యక్షుఁడ కడంతకు పూర్వముండియే యుండును. కాని ఈతని గూర్చిన ఆలోచన భీమునకు కలిగినదని తిక్కనయే కూర్చెను. మూలమునందు భీముఁడింత ఆలోచనాపరుఁడుగాఁ జెప్పఁబడలేదు. పెక్కం డ్రతో నొక్కసారి పోరుట, పులి. సింహము, ఎనుబోతు, ఏనుగు మొదలగు జంతువులతో పోరుటను తిక్కన వర్ణించి ఆతని బలోత్సాహములను స్థాపించెను. ఇక్కడింత పలికిన భీముఁడే తిరిగి రాజు వద్ద 'దేవా నాలవజాతివాఁడ నిను వర్ధంగొల్వఁగా వచ్చితి'నని చిత్తము మెచ్చునట్లు వండుదును గాని వేఱు కార్యము రాదనియు వినయముగాఁబలికి, సందర్భోచితముగా ప్రవర్తించినట్లు తిక్కన తీర్చిదిద్దెను

క.    పేరు వలలుండు గూఁకుం
జీవయుసిడి సాకతంబు సేసినఁ జాలుం
గోరిన వంటకములు నా
నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్.

4.1.219

ఇచట రచన పాత్రోచితమగు భాషతో వలలునిరూపమును కన్నుల గట్టించుచున్నది. 'కూడు గుడ్డ ఇచ్చి అనుగ్రహించిన చాలు'నని శూద్రుల కుచితమగురీతిని కల్పించినాఁడు తిక్కన. కోరిన వంటకములను 'నా

నేరమిఁ దగ నెఱపి'యని భీమునకు సహజముగాలేని వినయమును గలిపినాఁడు తిక్కన. 'కొలుతు నిశ్చలభక్తిన్'అని సేవాధర్మము నెరిగినవానివలె పలికించెను. ఇంత వినయాధిక్యమును ప్రదర్శించినను రాజునమ్మలేదనఁగా అని భీముని ఉన్నతాకారమునకు, దాచిన దాగని తేజమునకు ఇచ్చిన ప్రశంసయైనది. ఇక అభినయము ద్వారా తన క్షుద్రత్వమును నమ్మింపఁ దలచినాఁడు భీముఁడు. 'మోఱకు చందంబున మోమడ్డము గదల్చి' 'నా కవియెల్ల నేల నరనాథులకుం బ్రియ మొందునట్లుగాఁ బాకముసేయనేర్తు' నని నిశ్చయముగాఁ బలికి 'కొలువు గొను మొల్లకుండుట గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మేలే వలసినకడకేఁగెద'నని కొంత మొరటుదనమునే ప్రదర్శింపఁజేసినాఁడు కవి. ధర్మజుఁడు, భీమసేనుడు, విరటునితో ప్రసంగించుటలో ఎంతో భేదమును తిక్కన చూపించినాఁడు. ధర్మజుఁడు ద్విజుఁడనని జెప్పగా, భీముడు నాలవజాతి వాఁడనవినాఁడు. వారివారి భాషలో, వ్యక్తీకరణలో అంతరమును స్పష్టము చేసినాఁడు. భీముని వలలవేషధారణమును, అభినయమును, భాషను తిక్కన రక్తి కట్టించినాఁడు.

మల్లునితో యుద్ధము చేయఁబోవునపుడును ధర్మజుని కనుసన్నఁ గైకొనియే యుద్ధమునకు సిద్ధమయినట్లు తిక్కన మార్పుచేసెను. ఇది భీముని యొక్క జాగ్రత్తను, ధర్మజునిపట్ల గల గౌరవమును దెలియఁజేయుచున్నది. అపుడును వినయాతిరేకము దోచునట్లాడెను. రాజుతో 'నీదు వేడ్కకు బెనఁగెద నేర్చినట్లు'అని తన ఉద్ధతి ప్రకటనముగాకుండ నుడివెను. భీమునకు మల్లయుద్ధమునందలి ప్రీతిని తిక్కన వాగ్రూపమున బెట్టెను. అతఁడు 'మల్లవర్గముగని మై వెలుగంగ నిలిచెఁ గౌతూహాలియై'అని తిక్కన వర్ణన. అభిలషించినదగపడినపుడే కుతూహలము కలిగి, మేనుపొంగును. అప్పటి భీముని రూపమట్టిదే. అతని అభినయమును తిక్కన చక్కగా వర్ణించెను. ఈ వర్ణనము 'యుద్ధవర్ణనము'లో చర్చింపబడినది. 'అని మెత్తన యియ్యకొని గర్జించి గజాలాస్యంబునం బ్రాంగణంబుచొచ్చి....' ఇత్యాదిగా భీమసేనుని చర్యలను తిక్కన మల్లయుద్ధ ధర్మానుగుణముగా వేర్కొనినాఁడు. భీముని ఉదగ్రాకారమునకు తగినట్లు తిక్కన అతనిని మత్తేభముతో బోల్చుచుండును. ఇచటకూడా గజాలాస్యమునే అతనియందు వర్ణించినాఁడు తిక్కన. ఇట్లగుటచే భీముని ఉన్నతాకారము స్పష్టముగా నేర్పడును.

ఉ. ఆఱురసంబులం జవుల యందలి క్రొత్తలు పుట్టనిచ్చలున్
వేఱొకభంగిఁ బాకములు విన్ననువొప్పఁగఁ సంఘటించి వ
న్నియుఁగ బాసటీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మే
గాఱియ వెట్టిరైన నొడికంబుగ వండుదు నెల్ల గూరలున్.
4.1.77

అతనిని మించినవాఁడు లేనట్లుగా శరీరమును శ్రమపెట్టియైనను క్రొత్త రుచులతో వంటచేయుదునని చెప్పుటలో భీముని పాకకౌశలము విదితము

కట్టెలు గొట్టుటకు కత్తి గొడ్డలి యడుగనని కాలుసేతులతో విరుతునని భీముఁడు చెప్పుట అమూలకము. భీముని బలమును బలపరుచుటకే కవి ఈ పెంపు చేసెను. సూపాధ్యక్షుఁడ 'కడంతకు పూర్వముండియే యుండును. కాని ఈతని గూర్చిన ఆలోచన భీమునకు కలిగినదని తిక్కనయే కూర్చెను. మూలమునందు భీముఁడింత ఆలోచనాపరుఁడుగాఁ జెప్పఁబడలేదు. పెక్కం డ్రతో నొక్కసారి పోరుట, పులి, సింహము, ఎనుబోతు, ఏనుగు మొదలగు జంతువులతో పోరుటను తిక్కన వర్ణించి ఆతని బలోత్సాహములను స్థాపించెను. ఇక్కడింత పలికిన భీముఁడే తిరిగి రాజువద్ద 'దేవా నాలవజాతివాఁడ నిను వర్ధంగొల్వఁగా వచ్చితి'నని చిత్తము మెచ్చునట్లు వండుదును గాని వేఱు కార్యము రాదనియు వినయముగాఁబలికి, సందర్భోచితముగా ప్రవర్తించినట్లు తిక్కన తీర్చిదిద్దెను

క. పేరు వలలుండు గూడుం
జీరయుసిడి సాకతంబు సేసినఁ జాలుం
గోరిన వంటకములు నా
నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్.
4.1.219

ఇచట రచన పాత్రోచితమగు భాషతో వలలునిరూపమును కన్నుల గట్టించుచున్నది. 'కూడు గుడ్డ ఇచ్చి అనుగ్రహించిన చాలు'నని శూద్రుల కుచితమగురీతిని కల్పించినాఁడు తిక్కన. కోరిన వంటకములను 'నా

తే. మిగిలి బ్రహ్మాండ ఖాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయ కాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతి భయంకరాకారత నతిశయిల్లె. 4.2.134

ఇచట సాధ్యము కాని విషయములను సాధ్యములుగా వర్ణించటంలో తిక్కన భీముని ఉదగ్రతను, ఉత్సాహమును ధ్వనింపఁజేసెను. నేలనింగి కలియుటే అరుదు. కాని నేలను నింగిని తాళములుగాజేసి ఏపున రేగి వాయించియాడుటకు, కులపర్వతములను ఒక దానిపై నొకటి పడునట్లుగా దన్నుటకు, ఏడు సాగరములనింకింపజేసి పలుచని బురదను బూసికొనుటకు, నాలుగు దిక్కుల నొక్కచోటికి దెచ్చి పిసికి ముద్దజేయుటకు, బ్రహ్మాండమునే పగులవ్రేయుటకును భీముఁడు ప్రయత్నించుచున్నాఁడన్నట్లు ప్రళయకాలానలము యొక్క రూపాతిశయమును దాల్చి భయంకరాకారతతో విలసిల్లినాఁడట. భీముని రూపమును తొలుత పద్యమునందు, ఆతని చిత్తవృత్తి ఈ సీసమునందు వర్ణించి, భీముని భయంకరమూర్తిని చిత్రించినాఁడు కవి. ఒక పాత్రముయొక్క స్వరూప స్వభావములు సందర్భోచితముగా వర్ణింపబడుటయే ఆ పాత్రమును పోషించుట యగును. ఇచట ధీరోద్ధతుఁడైన భీముని పాత్రము నిర్దుష్టముగా వర్ణింపబడినది. రెండుసార్లుగా 'భయద స్ఫురణా పరిణద్ధ మూర్తి'యని, 'భీముఁడతి భయంకరాకారత నతిశయిల్లె'నని చెప్పబడుటవలన ఆతని రౌద్రమూర్తి సాక్షాత్కరించును. రౌద్ర రస పోషణమున కనువుగా నిచట పాత్రము చిత్రింపబడుటచే నిది ఉత్తమమగు పాత్రపోషణా విధానము.

ఇట్లు పేర్చిన కోపాటోపంబున 'నవిచారిత సమయవర్తనుండయి వృకోదరుఁడు' అని తిక్కన భీముని మనఃస్థితిని వ్యాఖ్యానించెను. అరిషడ్వర్గములలో నొకటియైన కోపము తీవ్రమగుటచే సమయాసమయములను భీముఁడు తలఁపలేదు. కీచక, విరాటుల నంతమొందింప నెంచెను. అట్టి కోపాటోపమున గూడ భీముఁడు 'యాననంబు పల్లటిల్ల' ధర్మతనయుని అనుజ్ఞకై ఆతనివైపు చూచినాఁడు. 'అవిచారిత సమయ వర్తనుండయి వృకోదరుఁడు' అని వర్ణించి ధర్మతనయుం గనుంగొనినాఁడని మరల

చెప్పుటలో భీమునికి అగ్రజునట్ల గౌరవ మింకను లెస్సగా వ్యక్తమగుచున్నది. ఎంత ఆవేశములోనున్నను అన్నమాటకై చూచినాఁడని కవి చెప్పఁదలచి నాఁడు. దర్మతనయుఁడాతనిని తన నయనాకారంబుననే వారింపఁగలిగె. ననగా ధర్మజుని మనోబలమును, భీముని కాతనిపైఁగల గౌరవమును వ్యక్తములగుచున్నవి. అప్పటి అగ్రజుని వచనములలోని అంతరార్థమును గ్రహించిన వివేకి భీముఁడు. మూలమునందు భీముని విజ్ఞత ఎచ్చటను ప్రత్యేకముగాఁ జెప్పబడలేదు. విరటుని గూడ చంపనెంచిన తమ్మునకు అతఁడు నిగూఢ భాషణములలో రాజు విశాలశాఖలుగల్గి విశ్రాంతినిచ్చునట్టి వృక్షమువంటి వాఁడని ఆతని నీడలో తాము అనల్పప్రీతి నందుచు ఆశ్రయమునంది యున్న వారమని అట్టివానిని అల్పుఁడగు కీచకునికై జంపుట వంటకట్టియలకుగా నీడనిచ్చు చెట్టును గొట్టుటనిగు, వేరొకచో ఆతనిని చంపవచ్చుననియు బోధించెను. ఈ వ్యంగ్య భీమునకవగతమైనది. కనుకనే ఆతఁడు తన కోపమునడంచుకొని, ఆ రాత్రి సైరంధ్రితో నొక ఉపాయమును జెప్పి మరునాటిరాత్రి అతిజాగ్రత్తగా తన పథకమును నిర్వర్తించెను. భీముఁడు పాకశాలలో పరుండియుండ ద్రౌపది వచ్చినది. అపుడు భీముఁడామెవచ్చిన పని నెఱుంగును. అయినను తత్పూర్వాపరముల నెఱుంగఁగోరి ఏమియు నెఱుంగని వాని భంగి ఊరకొనును. 'అత్తెఱంగి తెలవ తాన చెప్పవిందునని తలంచి' నాఁడట వివేకవంతుఁడు భీముఁడు. 'ఇంతప్రొద్దేల యిచ్చోటికేగు దేరగారణంబేమి' అని కూడ అడిగినాఁడట. ఎంత చాతుర్యము. ఇది తిక్కన పరిపోషణయే. ఈ చతురత మూలభారత భీమసేనునకు లేదు. ఆతఁడు మొరటు బలముగల మానిసి, ఈతఁడు బలముతో సమమగు విజ్ఞతకూడ కలిగినవాఁడు, ఆలోచనాపరుఁడు. అతఁడు తెలిసియు తెలియనట్లుడుగు చుండుటను యాజ్ఞసేని ఎఱింగినది. ఇదివారి అన్యోన్యావగాహనను తిక్కన సూచించిన సన్నివేశము. 'ఉన్నరూపెఱిఁగియు నేనచెప్ప విన నిష్టము కల్గుట చాల'లెస్స'యని ద్రౌపది భీముని ఆలోచనాసరణిని గ్రహించి ప్రశంసించినది. కళ్ళతో చూచినదే సర్వము కాదని, నిజమునింకను తెలుసుకొనవలెనని బుద్ధిమంతులు ప్రయత్నించుట ప్రశంసార్హమే. భీముని తిక్కన ప్రశంసాపాత్రునిగా తీర్చిదిద్దెను. 'కీచకుఁడు నిన్ను పరాభవింపఁగాఁజూచి మహోగ్ర కోప వివశుండగు నన్నునుజూచి' ధైర్యహేవాకచలుఁడయిన ధర్మసుతుఁడు వారింపకున్న నేనానీచుని, మత్స్యవిభుని, పరివారమును జంపెడు వాడను

గదా. 'ఆ సంరంభమున జనులు మనలనెఱింగిన సమయభంగమగును. మరల మునుపటి వలె కానలకేగవలసి వచ్చును. అది మనమిరువురము తెచ్చిన ఆపదగా అందఱు నిందింపరా' అని విపులముగా నామెకు నచ్చచెప్పినట్లు తిక్కన రచించెను. ఇది భీముని సహనమునకు గీటురాయి. తొలుత ద్రౌపదిని సాంత్వన పఱచి పిమ్మట తన అభిప్రాయమును వెల్లడించినాఁడు - వానిని జంపి నీ ఆందోళనను తీర్తుమగాని 'మనల నెవ్వరు నెఱుఁగకుండునట్టి తెఱంగు తలపోయవలయుఁగాక పగతుర భంజించుటయెంతపని' (4-2-194వ) అని ఆలోచనకు ప్రాధాన్యమునిచ్చినాఁడు తిక్కన పోషించిన భీమసేనుఁడు. ఆ తఱువాత అయినను నర్తనశాలను సంకేతస్థలముగా నిర్ణయించి కీచకుని రప్పించు నుపాయమును జేసినది భీముఁడే కనుక ఇచటనే ఆతఁడాలోచనను ప్రారంభించినట్లు కవి రచించుట ఉచితమే. మూలమునందు ద్రౌపది పాండవులందఱిని తలచి దుఃఖించి, తన భంగపాటును విన్నవించిన పిమ్మట ఒకేసారి భీముఁడు తనపథకమును చెప్పినట్లు కలదు. ఇచటి భీముఁడు తాను సభలో కోపమునడఁచుకొనిన కారణమును, ధర్మజుని పూజార్హతను ద్రౌపదికి ఎఱుకపరచి సమయభంగముకాని విధమునాలోచింపవలెనని తొలుత బలికెను. ఆమె పాండవుల గుణగణములను ప్రస్తావించి దుఃఖించిన పిదప మరల ఆలోచించి తన ఉద్దేశమును దెలిపెను. ఇట్లు తిక్కన భీముని మాటలను రెండు సార్లుగా రచించి ఆతనికి తగిన ప్రాధాన్యమును గల్పించెను.

ద్రౌపది ననునయించుచు 'వానిని జంపుటకుగా నీవు ప్రాణత్యాగను చేయుదునని ప్రతినబూనవలెనా' 'వానిని నేను శిక్షింపకున్న ఇలలో సతుల మానమును రక్షించు వారింకెవ్వరు' అని ఆమెను నమ్మించుటకుగా తాను శపథమును బూనినట్లు తిక్కన కల్పించెను.

తే. ఎల్లి యెల్లి విధంబుల నెందుఁజొచ్చె
నేని నా ధర్మతనయుండు దానవచ్చి
యడ్డపడెనేని నీవ పెంపారుకరుణఁ
గాచితేని నాచేఁబడుఁ గీచకుండు. (4.-2 -282)

ఈరోజువలె ధర్మరాజడ్డుపడిన భీముఁడు కీచకుని చంపక ఊరుకొను నేమోయను సందియమే ద్రౌపదికి కలుగకుండ తిక్కన ఇట్లు పెంచెను. 'ధర్మజుఁడే వచ్చి అడ్డుపడినను, మిక్కిలి దయకలిగి నీవే రక్షించినను నే కీచకుని జంపుదు' నని పలికించినాఁడు. 'నీవ పెంపారు కరుణఁగాచితేని' అని అసాధ్యమేదైనను సాధ్యమైనను నేను వాని విడువనని బలికినాఁడు సతిమానరక్షణోత్తముఁడు భీమసేనుఁడు. ఇట్లెందుకనినాఁడనగా భీముని యుద్ధోత్సాహమును జూచి సమయభంగమగునని వెఱచి పాంచాలి వాని విజృంభణమును వలదనును. ఇట్లు జరుగుటను తెలిసిన కవి ముందే భీమునిచే పాంచాలి వలదనినను చంపుదునని పలికించినాఁడు. ఆ పిమ్మట 'ఇమ్మాటల పలనం దలంపముగాని వేగుచున్నయది జనులు మేలుకాంచి మనలం గాంచిరేని వంచన బయలుపడినం గార్యంబుదప్పుఁ గీచకవధంబునకుం బూనిన నా మనో రథంబు దుదిముట్టువలయు' నని పలికినట్లు కల్పన చేసెను. భీమునికి పరిసర దృష్టి, సమయాసమయచింతన ఉన్నట్లు చెప్పుటకే తిక్కన ఈ పెంపు చేసెను. అపుడు ఆ పరిశీలనా దృష్టి భీమునకే తిక్కన ఆపాదించినాఁడు. 'మారుతాత్మజుండు కలుషితాత్ముండగుచు పెఱకు వచ్చెను' అని తిక్కన అతని చిత్త వృత్తిని సూచించెను. సతి పరిభవమును తనదిగా నెంచినవాఁడు గనుకనే అందోళిత మానసుఁడైనాఁడు భీముఁడు.

కీచకుని నర్తనశాలాగమనమున కొడంబరచి ఆ విషయమును భీమునకు తెలిపినది ద్రౌపది. మూలమునందు రాత్రియైన తరువాతఁ దెలిపినట్లున్నది. ఆ సమయము వఱకు భీముఁడు సంశయాత్మకుఁడగుట సరికాదని కీచకునితో మాటలాడిన వెంటనే ద్రౌపది భీమునకాసంగతి తెలియజేసినట్లును, అప్పుడు తీవ్రకోపాతిరేకమును, యుద్ధోత్సాహమును భీముఁడు వెల్లడించి నట్లు తిక్కన పెంపుచేసినాఁడు. వీరరసపోషణ కనువుగా నాయకుఁడైన భీముని యందు రణోత్సాహమును తిక్కన వర్ణించినాఁడు. అతని ఆ ఉద్వేగ మును గాంచి సమయభంగమగునని ద్రౌపది భయపడునంతగా భీముని పాత్రమును, పలుకులను తిక్కన వర్ణించెను.

ద్రౌపది కీచకుఁడు నర్తనశాలాగమనమున కియ్యకొనుటను దెలుపఁగా భీముఁడు 'పరమాహ్లాదంబునుంబొంది' నాడఁట. ఆహ్లాదము కీచకుని జంప

వచ్చు గదా యని. ఇది ఒక వీరుని ఉత్సాహము. శత్రువును సంహరింపగలనను భావముచే కలిగిన ఉత్సాహమే ఇట ఆహ్లాదము.

శా. క్రోధంబ ప్రతికారమై హృదయముం గుందింప నత్యంత చిం
తాధూతాత్ముఁడనైన నాకుఁ బరమోత్సాహంబు సంధిల్లదు
స్సాధంబైన విరుద్ధకార్యమిటు లాసన్నంబుగా సంఘటిం
తే ధర్మాత్మజుఁ డాత్మమెచ్చఁ బగ సాధింపంగఁగాస్వల్పమే
4-2-275

ప్రతీకారము చేయ లేక క్రోధముతో మనస్సునందు దుఃఖించు నాకు 'పరమోత్సాహమును' కలిగించితివని ద్రౌపదిని మెచ్చినాఁడు భీముఁడు. అనఁగా నాతఁడే ద్రౌపది కన్న మిక్కిలిగా కీచకునియందు పగఁబూని యున్నాఁడని భావము. అందును ధర్మతనయుఁడు మెచ్చునట్లు గూఢముగా పగసాధింపఁగలుగుట తక్కువా అని మఱింత మదిలోఁ బొంగినాఁడు భీముఁడు. అంత సంతోషపడి పోయినవాఁడు కొఁడొక విచారించి 'వెఱవక సంకేతించిన తెఱఁగున నయ్యేడకు నరుగుదెంచునొకో, కొందఱ దెచ్చునొకో వెడఁగై యటిముటి వెలివుచ్చునొకో రహస్యంబెల్లన్' అని సందియ పడినాఁడు. మఱల ద్రౌపది చెప్పినదానిని గుర్తుచేసికొని అతఁడు తప్పక వచ్చునని, తనచే ఒచ్చునని నిశ్చయముగాఁ బలికినాఁడు. ఆ నిశ్చయమునకు రాగానే తిరిగి ఉత్సాహమును పుంజుకొని తానాతనిని 'మండపంబు సంక్షోభింపఁగానేతుఁ గట్టలుకన్ బెబ్బులి గోలవేసినటులు ప్రాకార మేపారఁగన్' అనియు అతఁడు తనతో సమానబలము గలవాఁడై పెనగినచో తానింకను విజృంభించి అల్లకల్లోలము చేయుదుననియు బలికినాఁడు.

మ. అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముంబొంద న
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు
నొందించి చి
త్రవధ ప్రౌఢి వహించి సూతునకు రౌద్రంబేర్పడం జూపెదన్.
1.2.284

'నింగియు నేలయు దాళముల్ గావించి యేపునరేగి వాయించియాడ' అని వర్ణించిన భీముని భయంకరాకారమునే ఇచట భీమునిచే వర్ణంపజేసినాఁడు కవి. 'సూతునకు రౌద్రంబేర్పడం జూపుదు' నని తన రౌద్రకృత్యములను, తాచేయబోవు అలజడిని పేర్కొనినాఁడు. అవనిచక్రము దివము, ఆశాచయము. కులపర్వతములు, సముద్రములు కల్లోలమగునట్లు కోపము తీరునట్లు, చిత్రవధజేసి నారౌద్రభంగిని చూపెదనని వీరాలాపను లాడి నాఁడు. ద్రౌపది వెఱగంది సమయభంగము గాకుండగా పేరుమని లేకున్న ఆతనిని చంపవలదని వేడినది. భీముని ఉత్సాహమును ద్రౌపది గ్రహించి అట్లనినది. అందుకు భీముఁడు తగినవిధముగా సమాధానము నిచ్చినాఁడు. కీచకాధముఁడు మార్కొని నిలిచినపుడు ప్రకాశరహస్య విభేదబుద్ధి కలుగ నేరదని ఐనను 'ఓపినభంగి' 'నిగూఢప్రవృత్తిమై' జాగ్రత్తగా చంపుదుననియుఁ బలికినాఁడు. భీముని ఈ 'ఓపినభంగి' ఆతని ఉచితానుచితముల ఎఱుకకు మారురూలుకు. కీచకుని రాకను తెలిసిన మారుతసుతుండు కృతనిశ్చయుండై యుండెనఁట. అచట అనిశ్చితత వలన కలుషితాత్ముఁడు, ఇచట కృతనిశ్చయుడైనాఁడు.

భీముఁడు కీచకుని చంపవలెనని అమితోత్సాహముతో నుండుటను తిక్కన పలుమార్లు వర్ణించి ఆతనిని వీరాగ్రేసరునిగాఁజేసెను. రాత్రియగుటను ద్రౌపది తెలుపఁగా భీముఁడు 'పెండ్లికిఁబిలిచినయట్లు వికచ హృదయుఁడై' నాఁడట. అనగాఆతనికి కీచకునెదుర్కొనుట పెండ్లికిఁ బోవునట్లు ప్రమోద మునుగూర్చినదన్నమాట. అప్పటి భీముని భంగి గంభీరముగానున్నదని తిక్కన వర్ణించెను. నాయకుని గంభీరునిగా వర్ణించుట రసపోషకము. ఇది అమూలకము.

చ. గమనమువీఁక వేఱొక వికారము పుట్టక సంగరోత్సవో
ద్యమరభసాతిరేకము బయల్పడుటించుక లేక రోషసం
భ్రమమొకయింతయైనఁ బరభావ నిరూప్యముగాక ద్రౌపదీ
రమణుఁడు వోయె విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్.

4.2.324

తన నడకయందు భేదములేక, తనయుద్ధోత్సాహము బయలుపడ నివ్వక, రోషసంభ్రమమించుకైనను పరులకు తెలియకుండగా విక్రమధురం ధరతతో 'ద్రౌపదీరమణుఁడు' నాట్యశాలకేగెనని తిక్కన వర్ణించెను. ఇచట భీముని సంయమనము, గభీరత, జాగరూకత విదితములు. ఆతనిని ద్రౌపదీ రమణుఁడనుట మేల్తరము. ద్రౌపది పరిభవదుఃఖమును మాన్పు ప్రయత్న ములో వచ్చిన భీముఁడే ద్రౌపదీరమణుఁడని సంభావింపదగిన వాఁడు. తిక్కన భీమునిలో ఈ ఉత్తమగుణములను పోషించి, ఆతని వల్ల భత్వమును వాచ్యము జేసి నాయకనిరూపణమును గావించెను. ఈ ఘట్టమున భీముఁడు సర్వలక్షణ శోభితుఁడైన నాయకుఁడు. భీముఁడతి జాగ్రత్తగా పరిసరములను పరిశీలించి నర్తనశాలలో ప్రవేశించినట్లు తిక్కన కల్పించెను. మూలమునందు భీముఁడింత పరిశీలనా శీలునిగా చెప్పఁబడలేదు. ఆతని గమనమును వర్ణింపఁబడలేదు. 'భీమోఽథ ప్రథమంగత్వా రాత్రౌఛన్న ఉపావిశత్' అనిమాత్రమే కలదు.

క. కెలఁకులుఁ బిఱింది దెసయుం
గలయం బరికించి తన యఖండితబాహా
బలగర్వమ యచ్చట నుం
గలిగా మదమత్త భద్రగజసదృశ గతిన్. (4-2-326)

భీముని గమనము మదమత్త భద్రగజమువలె నున్నదట. ఇది ఆతని ఉన్నతాకారసూచకము. కెలకులు, పిఱింది దెసయుంగలయం బరికించిన పిమ్మ టనే అది తమ పథకము నిర్విఘ్నముగా నిర్వహింపఁబడుట కనువగు స్థలముగా నిశ్చయము కలిగిన తరువాతనే భీముఁడు ప్రవేశించుట ఆతని ఆలోచనకు రూపము. తన బాహుబలమునే నమ్మి భీముఁడందు ప్రవేశించినాఁడట. కీచకుఁడు తద్వ్యతిరేకముగా గర్వాంధకారమున బడి అవంతయు శంకలేక అహంకృతి నిండారగా నేతెంచెను. నాయక ప్రతినాయకులలో ఈ అంతరము పోషింపఁబడుట తిక్కన పాత్రపోషణలో నొక చక్కని అంశము. ఒకరిది బాహుబలగర్వము, మఱియొకరి స్వాంతవు తమోంధము !

నిశ్చలమగు మనసు కలిగిన భీముఁడు కీచకుని జంపు నుద్దేశముతో నత్యుగ్రుఁడై నర్తనశాలలోని కడుగు బెట్టెనని తిక్కన వర్ణన. ద్రౌపదిని

తన్ననుసరించి అల్లంతదూరమున రమ్మనుట, నర్తనశాలలోనికి పతి కేలు పట్టుకొని నడచుట, పాంచాలిని కొంత దూరములో నునుచుట తిక్కన ప్రవేశపెట్టిన అంశములు. మూలమునందు ద్రౌపదిని గురించియేమియును చెప్పఁబడలేదు. కీచకవధానంతరము ఆమె ప్రసక్తికలదు కనుక ఇచటనే ఆమెరాకను, కొంతదవ్వులోనే యుండుటను తిక్కన చెప్పినాఁడు. అదియును భీముఁడే గొనివచ్చి నిలిపినట్లుఁచేసినాఁడు. తాను కీచకునెట్లు చంపునో తన అనుంగుభార్యకుఁజూపి ఆమెచే మెప్పువడయఁదలచినాఁడు భీముఁడు. కీచక వధను కనులారఁగాంచిన గాని ద్రౌపది యుడుకాఱదని భీముఁడు గ్రహించిన వాఁడు. ద్రౌపదిని పరిభవించిన దుర్యోధన దుశ్శాసనులను గూడ భీముఁడు కురుక్షేత్రమున చంపి ఆమెను సాంత్వన పఱచును. కనుక ఇచట నామెను గొనివచ్చుట భీముని ఆలోచనగా చేయుట యుచితము.

కీచకుఁడు కేలుసాచినపుడే భీమునకు కోపవేగమున కంపము కలిగినది నిజాంగములు చలించినవి. కాని తన ధృతియొక్క పెంపుసొంపు వలన ఆ చలనమును అడంచుకొని మిన్నకుండినాఁడట. కీచకుని చేష్టలను, మాటలను తెలిసికొనఁదలచినాఁడు. భీముని ఈ కుతూహలము తిక్కన కల్పనము. ఒక విచిత్ర పరిస్థితియది అట్టిచో పాత్రమునకు గలుగు మనోభావవికారములను కవి వర్ణించుట ఆస్వాదయోగ్యముగా నుండును. భీముని ఆ మానసికస్థితిని తిక్కన చక్కగా సూచించి, కోపమడంచుటను వర్ణించినాఁడు.

భీముఁడు కీచకుని ప్రలాపములను విని కొంత నిగూఢ భాషణములు చేసినటుల మూలమునను క్లుప్తముగా కలదు. కాని అట్లు చేయుటకు కారణంబూహింపఁబడలేదు. తిక్కన ఒక హేతువునూహించినాఁడు

క. అనవుడు మనమున నిక్కి
యని యుచిత నిగూఢ భంగులగు భాషణముల్
దన ప్రియ వినిపించుటకి
ట్లనియెన్ మృదురీతి భీముఁడాతనితోడన్.

(4.-2 -336)

కీచకుని సల్లాపములను అసహ్యించుకొని అయినను తన రమణిని ఉల్లాస పరచుటకుగా కీచకునితో భీముఁడు నిగూఢభాషణముల నాడెను. భీముని హాస్యప్రియత్వము, చమత్కారము, ద్రౌపదిని రంజింపఁజేయు నుద్దేశము కలవు. ఇప్పలుకు లమూలకములు.

దిష్ట్యాత్వం దర్శనీయోఽథ దిష్ట్యాత్మానం ప్రశంసయ
ఈదృశస్తుత్వయాస్పర్శస్పృష్టపూర్వో న కర్హిచిత్.

ఇంత మాత్రమే మూలమున నుండఁగా తిక్కన ఈ భాషణమును హాస్య భరితముగా నొకింత పెంచెను.

"నాపోల్కి యాఁడుదాని వెదకియు నెయ్యెడనైన నీకు బడయ వచ్చునె"; "నా యొడలు నేర్చినప్పుడ నీ యొడలెట్లగునో దాని నీవెఱఁ గెదు"; "నన్ను ముట్టి నీవు వెండియు వనితల సంగతికిఁబోవువాఁడవె.... కనియెదవిదె చిత్తభవ వికారవులెల్లన్"— ఈ పలుకులలో ద్వంద్వార్థములు గలవు. తన్ను తాకిన అనంతరము మఱియొక స్త్రీని తాకవని భీముఁడను టలో కీచకుఁడు తన్ను తాకగానే చచ్చుననియు, చిత్తభవ వికారములు సమసిపోవుననియు, ఇక ఇతర వనితల జోలికి పోలేడనియు, తన్ను స్త్రీగా నెంచి తప్పుచేసెననియు అంతరార్థములు. ఈ పరిహాస చాతుర్యము ఆస్వాద యోగ్యము. సున్నితమైన ఇట్టి హాస్యము మనసున కాహ్లాదము కలిగించు చున్నది. భీమునిలో మొరటు బలమేగాక సున్నితమగు మనస్తత్వమును గలదని తిక్కన తీర్పు.

ఈ విరామము తరువాత పెట్టించిన ఉత్సాహమును, విజృంభణమును కవి వర్ణించెను. "అనుచున్ గ్రక్కనలేచి రోష కఠినంబౌ హాస మాసూతు నెమ్మనముద్వేగముఁ బొందఁజేయ"గా "బలసామగ్రీ సముజ్జృంభణంబున వానిందలవట్టి వంచె"నట. హాసమును రోషకఠినంబని విశేషించుట తిక్కన ప్రత్యేకత. రోషపూరితము, కఠినమునైన హాస మనవచ్చును. రోషముచే కఠినమైన హాసమనియు నెంచవచ్చును. భీముని విజృంభణమున కిది ప్రారంభము. భీముని ఆ పరిహాసముచేత వాని మనము నందుద్వేగము కలిగినదట. వికటాట్టహాసము చేయు భీముని భయంకరాకారమిచట ప్రత్యక్షమైనది.

కీచకుని ప్రతిహతులు తగిలిన భీమసేనుఁడు "దండతాడిత భుజంగము భంగి సముత్థితాంగుఁడై "నాడట. కీచకుఁడు ఆత్మరక్షణకు, భీముడు శత్రుశిక్షణకై పెనంగిరి. భీముని భుజంగముతో బోల్చుటలోనే అతని కోపము, వేగము స్ఫురించును. భీముఁడు బాహుగర్వగరిష్ఠుఁడనుటవల్ల కీచకుని కంటె పర్వడినది. 'అధిక్యత ఇరువురును సింహాబలులే అయినను క్రోధోద్వేగము భీమునిలో నెక్కువ చూపఁబడినది ఆ మల్లయుద్ధమాతని అభిమతము, ఆతఁడద్దానికి ఎదురుచూచి, సిద్ధమైవచ్చినవాఁడు. పైగా నాయకుఁడు

సమయభంగమగుటకు భీముఁడును గొంకుచున్నాఁడని తిక్కన కల్పనము. ఇది సమర్థనీయమని ఇదివఱకే చూపఁబడినది. తొలుత నుండి యును భీముఁడజ్ఞాతవాసకాలమునందు తిక్కనవారికన్నను మిక్కిలి జాగ రూకుఁడై చరించినట్లు తిక్కన చూపుచునేవచ్చును. ఇచట నదియే మఱల చెప్పఁబడినది. అట్లుగాకున్న కీచకవధను ద్రౌపది కూడా మెచ్చదు సరికదా, సమయభంగము చేసినచో నిందించును. ఈ జంకు భీమునికుండుట ఆతనికి మన్ననయగుచున్నది.

కీచకుని బలము తరిగిపోవుట గ్రహించిన భీమసేనుఁడు విజృంభించెనట అది సహజము. ఉత్సాహమినుమడింపగా బలము కలుగును. కీచకుని నిర్జించిన పిమ్మట నాతనిని "వికృతపుజావు సంప మది వేడుక పుట్టిన"దట భీమునకు. ఇదియు అతని ఉత్సాహరూపమే. కార్యము సానుకూలమైన దను వేడుకయే ఉత్సాహము. కీచకునట్లు చంపిన తరువాత తుష్టుఁడైనాఁడట. బీభత్సపుఁజావు జచ్చినాఁడు కీచకుఁడు - ఉత్తమ నాయకుఁడని పొగడ్తనంది నాఁడు భీముఁడు. తనబలమునందు విశ్వాసము కలిగియు, తల్లడపడు ప్రియభార్యకు కీచకుని చావు దెలిపి, అనలము దెచ్చి వెలుగొందజేసి పీను గును చూపెనట. గాఢయత్నముగా ననలము దెచ్చినాఁడని తిక్కన ప్రత్యేకముగా చెప్పెను. భీముని జాగరూకత ఇంకను పోషింపఁబడుచున్న దన్నమాట. మూలమున భీముఁడిట్లు చేయుటలేదు. కీచకుని జంపి, కృష్ణ కుఁజెప్పి వెళ్ళిపోయినట్లు కలదు. భీముని భావములు వర్ణింపబడలేదు. రోష హాస మోదములేవియును లేని జడునిగా భీముఁడుండుట సరిగాదు. భీముని

ఆయా భావములను తిక్కన సందర్భోచితముగాఁ జెప్పెను. ప్రతినను నెర వేర్చుకొంటిని, సతి అవమానమును దుఃఖమును మాన్చితినని భీముఁడు సంతో షించుట మానవ స్వభావానుగుణముగా జేయఁబడిన పెంపు మాత్రమే.

శా. చింతాశల్యము వాసెనే భుజబలోత్సేకంబు నీ కెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దుశ్చారిత్రునిం జూచితే
సంతోషించితె యిట్లుగాక బ్రతుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరినయట్టి పీనులకు నా చేతం బయోజాననా.

4-2-358

ఈ పలుకులలో భీముని గర్వము, ఉద్వేగము, అనునయము, బాహు గర్వము పతియందనురాగము సువ్యక్తములు. కవి తానుగా పాత్రనుగూర్చి చెప్పుట కంటె పాత్రము పలుకులలోను, ఇతరుల మాటలలోను వర్ణించుట యుక్తతరము. భీముని స్వరూపమును తిక్కన వర్ణించెను. స్వభావము నాతనిచేఁబలికించెను. ఉద్ధతిని ఆతని వర్తనాభినయములందుఁ జూపెను. భీముని ఇప్పలుకులకు ద్రౌపది మోదము వెల్లివిరియగా తన భర్తను మఱి మఱి పొగడినది. రక్షించినవాఁడే రమణుఁడైనపుడా సతి ప్రమోదమున కవధులుండవు. భీముఁడు చేసినది మహాత్కార్యముగా నభివర్ణించి కీర్తించి నది ద్రౌపది. భీముని నాయకగుణములిట పేర్కొనఁబడినవి. కృతజ్ఞత, అనురాగము ముప్పిరిగొనిన ఇప్పలుకులు తిక్కన కల్పన. మూలమున కీచక వధానంతరము భీముఁడు పాకశాలకేగెననియు, సైరంధ్రి కావలివారిని పిలిచినదనియు కలదు.

సీ. కొలువులోపల నిన్నఁ గోపముల్లొత్తినఁ
దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేఁడిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులు గప్పిన గౌరవంబు
మన వారలోన నొక్కనినైనఁ బిల్వకు
త్సాహంబు నేసిన సాహసంబు
లోకదుర్జయుఁడగు నీ కీచకునిని ద్రే
ల్మిడి రూపు మాపిన కడిమిసొంపు

తే  చూడఁ దలపోయ మెచ్చన స్తుతి యొనర్ప
నాదరంబె సి యుత్తమ నాయకత్వ
మెఱిఁగి నినుఁగొనియాడ నేనెంతదాన
మహిత విస్మయానంద నిర్మగ్ననైతి.  4 2 360

సభలో కోపము పొంగినను చలింపని ధైర్యము చూడనైనను, ప్రజలకుఁ దెలియకుండ అచటికేతెంచిన గౌరవమును తలచుటకైనను, ఒక్క తమ్మునినైనను పిలువక ఉత్సహించిన సాహసమును మెచ్చుకొనుటకైనను, కీచకుని క్షణములోఁ జంపిన బలమును పొగడుటకైనను, తనవశముగాదనినది పాంచాలి. భీముఁడుత్తమ నాయకుఁడని, ఆతని ఉత్తమ నాయకత్వము నెఱిఁగి కొనియాడుటకు తాను చాలనని ద్రౌపది పలికి—ఆతని గుణగణములచే గొప్పవిస్మయమును, ఆనందమును పొందితి ననినది. ధైర్య, గౌరవ సాహస, బలము లుత్తమ నాయక గుణములగుటచే కవి వానిని పేర్కొని ద్రౌపదిచే ఆతని ఉత్తమ నాయకత్వమును కంఠోక్తిగా నిర్ధరించెను. ఆది నుండియు భీముని పాత్రమును అతి జాగ్రత్తగా, నిండుగా తిక్కన పోషించినాఁడు.

కీచకవధానంతరము ఉపకీచకులు పట్టుకొనిపోవు ద్రౌపది ఎలుగెత్తి పిలువఁగా భీముఁడు 'నాదు వల్లభకు వీండ్రును గ్రమ్మఱ నింతసేసిరే' యని 'సరోష సంభ్రమతనాయితమై' నాఁడు. భీముఁడు ద్రౌపదీ పరిరక్షణమునందు పరమ జాగరూకుఁడనుట నిట తేటపడినది. అట్టిచోఁగూడ తిక్కన భీముని జాగరూకతను వర్ణించుట విడువలేదు. వేగముగా నేఁగి గోడను దాటినాఁడట – గ్రక్కున ముట్టెడు దానికి, గుప్తముగానుండుటకు తగిట్లుగా గోడ దూకినాఁడని తిక్కన కల్పన. ఇంత జాగరూకత కలిగిన ముఖీఁడెలుగెత్తి చెప్పినట్లు మూలమున నున్నది.—

ఆహాంశ్చ్రణోమిశేవాచంత్వయా సైరంధ్రి భాషితమ్
తస్మాత్తే సూతపుత్రేభ్యో భయం భీరునవిద్యతే.

4.22.16

ఇట్లు పలుకుట ఔచిత్యభంగము. పలన సమయభంగమగునను భయము భీమునకు లేదనిపించును ఈ పలుకులవలన. భీముడంత ప్రమత్తుఁడు కాఁడు. తనలో తాను 'నాదువల్ల భకు...ఇంత సేసిరే' అని తలఁచుటయే సందర్భోచితము.

'రౌద్రాతిరేకమడర' నొక భూజమును పెకలించెనట. భీముని మూర్తి వర్ణనయిది. 'కనుగొని కోపవేగమున' అను వర్ణనవలె నున్నది ఇచ్చటి భీముని రూపవర్ణనము.

మ. వికటభ్రూకుటి ఘోరఫాల కలితస్వేదోద్భటుండుం జల
ద్వక్త్రోష్ఠద్వయుఁడుం బ్రవర్ధనదశావిర్భావ సంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహల సమగ్ర క్రోధ వేగుండునై
బకవిధ్వంసకుఁడయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తి తోన్. 4-3-25

ఇట్టి భీమునిఁగాంచి గంధర్వుఁడని పారిపోసమకట్టిన ఉపకీచకులనందఱిని 'చేతుల తీఁటవోనుఱుముసేసె విశృంఖల విక్రమంబునన్' అని తిక్కన పేర్కొనెను. భీముఁడు సహజముగా యుద్ధప్రియుడు. ఉపకీచకులతనికి తగిన వీరులు కారు కనుక వారినిఁజంపుట 'చేతులతీటవోవుటకు' వలె నుండినది భీమునకనుట సమంజసము. భీముని ఆధిక్యము ఇట చెప్పబడినది. వారిని చంపిన పిదప 'శమిత క్రోధుఁడై' నాఁడట. ఉత్తమవీరునకు కోపము సులభముగా శమించుననుమాట తిక్కన భీమునియందు నిరూపించెను.

ఉపకీచకులనుండి తనను రక్షించినందుకు ద్రౌపది భీముని కీర్తించినది. సపరమధర్మరతి' అనినది. పాండవుల ఆసక్తి ధర్మమునందే నిష్ఠమైనదని కవి సూచన. వారు ధర్మవీరమును వహించినవారని భావము. అందులకు భీముఁడు నిర్వికారముగా 'నిగూఢ వచన చాతుర్య ధురంధరుడై' తన ప్రత్యేకత ఏమియులేదని బలికినాఁడు. ఇది మఱియొక్క ఉత్తమగుణము. తన్నితరులు పొగడిన గర్వమును బొందక, నిర్వికారతనుండుట ధీరోదారుని గుణము. భీముఁడు బలమున ఉద్ధతుఁడే కాని గుణమున ఉదాత్తుఁడు.

చ. అతివ యపాయముం బొరయునప్పుడు గావక తక్కె నేని యా
పతి పతియే తలంప మగపాడియె లోకము పాడియే భవ
త్ప్రతు లిటులాచరించుట గదా భవదీయ మనోనువర్తన
స్థితి కుచితంబు వారల నుతింపఁగ నేల నిసర్గవృత్తులన్.

4-3-42

తన్ను నుతింపవలదని, రక్షించుట తనధర్మమేకాని ప్రత్యేకతగాదని 'భవత్ప్రతులు' అని ఎవరినో ఉద్దేశించి పలికినట్లు గూఢముగాఁ బలికినాఁడు.

సుశర్మబారినుండి విరాటుని విడిపింపుమని ధర్మజుఁడానతీయగా భీముఁడొక సాలవృక్షమునుజూపి దానితో సుశర్మ బలంబునడగించెదనని మహాబలుఁడనినాఁడు. ఆతని రణకండూతి, ఆవేశము అట్టివి. కాని ధర్మజుని మాట ఆ భద్రగజమునకు అంకుశము: తరువు పెరికి కవిసినచో ఉభయ బలములు తన్ను వృకోదరునిగా నెరుగగలరని లోకసామాన్యములైన ఆయుధములతో, కవల తోడ్పాటుతో యుద్ధముచేయుమని ఆదేశించెను. ఆ పలుకంకుశము క్రియ గుదియించిన నిల్చి మత్తగజపుంగవు చందమున 'శరీర దోళన విధా పరిశోభిత విక్రమోద్యమంబున విలసిల్లెను' అని తిక్కన వర్ణించెను. భీమసేనుని 'మీ పనిచినట్ల చేసెద నేపారిన వైరిబలము నెల్లను బాహాటోపమున నోర్చి మత్స్యమహీపతివిడిపించి తెచ్చియిచ్చెద మీకు' నని వినమ్రుఁడైనాఁడంతటి బలవంతుఁడును. ఆతనిని విరటుఁడు మెచ్చుకొని మన్నన జేసెను.

ఉ. మంటయుఁబోని శాత్రవసమాజము నించుకయేని శంక లే
కంటఁగఁ దాకి వెండి తెగటార్చె మహోద్భుత శక్తిశాలి యీ
వంటలవాని చేసిన యవార్యపరాక్రమ మొండుచోటులం
గంటిమె వింటిమే యితఁడ కాఁడె వెసన్ గెలిపించె నన్నసన్.

4.3.229

రాజు స్వయముగా వొక వంటలవానిగా భావించువాని నిట్లు ప్రశంసించినాఁడనగా అది భీముని అద్భుత రణక్రీడఫలితమే.

ఇంతకీర్తించిన విరాటుని - ఆతడు ధర్మజుని సారెగొని వేయుటనువిని నప్పుడు భీముఁడు-జమునిపాలికంపెద ననినాఁడు. ఆతనికి అగ్రజునిపట్ల నున్న భక్తి గౌరవములట్టివి !

ఉద్యోగపర్వము నందు భీముని పాత్రమును పెద్దగా పోషించుట కవకాశమేలేదు. భీముని గూర్చి ధృతరాష్ట్రుఁడు సైతము భయపడుటవలన ఆతని పరాక్రమము ఎన్నఁదగినది. భీముని అగ్రజానుసరణ వర్తనము శ్రీకృష్ణుని రాయబారపు ఘట్టమున బయలుపడినది.

భారతకథయందు అర్జునుఁడు భీముని మించిన పరాక్రమవంతుఁడను భావము కలుగునట్లు పాత్రపోషణ చేయఁబడినది. అట్టి అర్జుననిచే భీముని ప్రశంసింపచేసి——నాఁడు తిక్కన మూలమునందు లేకున్నను ఈ సందర్భమును తిక్కన కల్పించి, భీముని పరాక్రమమును పోషించెను.

మ. బలమత్తాకృతియైన భీముఁడనుకుంభత్కుంభి సంరంభమున్
నిలిపెన్ నాఁడును నంకుశంబయి తుదిన్ నేఁడుం దదుద్రేకమున్
మలుగంజేయ నజాతశత్రుని కృపామౌగ్ధ్యంబ చాలంగ వా
రలకేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా.
5.1.379

భీముని బలమత్తాకృతియైన కుంభత్కుంభితోఁ బోల్చుట తిక్కన అభీష్టము. సర్వగా గజసాదృశ్యమును వర్ణించుటలో ఔచిత్యము కలదు. భీముని ఉదగ్ర స్వరూపము, మహోద్రేకము గజౌపమ్యముచే స్పష్టపడును ఇతర మృగములలో సింహ, శార్దూల, వృషభములును వీనులకుపమానములగును గాని అవి భీమునకు తగినవి కావు. పొంచియుండి నేర్పుతో వేటాడునవి గజమువలె ఉద్రేకపడవు, ముందుకు సాగవు. భీముఁడు మత్తగజమనుటలోనే స్వారస్యము కలదు.

ఇంతవఱకు భీముని పాత్రమొకరీతిగా చిత్రీకరింపఁబడినది. ఇఁక శ్రీకృష్ణుని రాయబారపు ఘట్టమునందు చాల మార్పు కనిపించును. మూలము నందు భీముఁడు శాంతికాముకతను ప్రదర్శించుచు కూడ తీక్ష్ణముగాఁబలికి

నట్లు కలదు. తాను సంధికోరుటకు కారణమును చూపించుటకూడ లేదు. పైగా తాము దుర్యోధనాదుల కడఁగియుందుమని కూడఁ బలుకును. ఇది విపరీతము. ధీరోద్ధతుఁడగు భీముని పాత్రవైభవ మిట్లైనచో నమసిపోవును. తిక్కన ఇచట మార్పులుగావించి భీమపాత్రమునకు న్యాయము చేకూర్చెను. ఎంత శాంతికాముకుఁడైనను ధార్తరాష్ట్రులకడంగి యుండగోరునా? మూల మున ఇట్లున్నది.

> అపి దుర్యోధనం కృష్ణ సర్వేవయమధశ్చరాః
> నీచైర్భూత్వానుయాస్యామో మాస్మనోభరతానశన్.

5.72.20

తిక్కన ఇద్దానిని వదలి సమానప్రతిపత్తితో కలిసియుండుటనే వాంఛించినట్లు వ్రాసెను

తే. అన్నదమ్ములమైయుండి యకట మనల
నొరులు దలయెత్తిచూడ నొండొరులతోడఁ
బెనగ నేటికి నీ నేల పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుచుట పోలదొక్కొ.

5.3.50

ఇంతమాత్రమనుటయే చాలు భీముఁడు. అదియును తప్పనిసరియని ముందే చెప్పినాఁడుగదా!

ఉ. చొచ్చిన దోవచొచ్చి తెగఁజూచెదనంచుఁ గడంగుచుండు న
న్మెచ్చఁడు బాహుగర్వమున నీచ సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁబోవక పోవఁగరాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారఁ గురువంశము చేటున కోపకుండుటన్.

5.3.43

తాను యుద్ధమునే కోరుదునని భీముఁడనకపోయినను అవగతమగు చున్నదిచట అతని అంతరంగము, యుద్ధప్రీతి. మూలమునందు చేసిన చక్ర వర్తుల ప్రస్తావనను, కృష్ణుని నెమ్మదిగ, మృదువుగా బలుకుమని చెప్పుటను తిక్కన వదలివేయుట భీముని స్వభావమునకు తగియున్నది.

శ్రీకృష్ణుఁడు పవనాత్మజుని యుద్ధమునకుఁ బురికొల్పు పన్ని వేశమును కూడ తిక్కన భీమపాత్రపోషణకనువుగా మలచెను. భీముని శాంతి వచన ములు పిఱికితనముగా నెంచినట్లు మూలమున కలదు. అతనిని నపుంసకునితో (73 అ. 17శ్లో.) పశువుతో (73 అ. 20శ్లో.) పోల్చి కృష్ణుఁడు పలికినట్లు మూలముననున్నది. ఇట్లుండుట కృష్ణ, భీమసేనుల కిరువురకును ఉచితము కాదు. తిక్కన ఇద్దానిని చాల మార్చెను.

తే. అని సహోదరులాజి కాయాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును
గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ
డైన పవనజుఁ బురికొల్ప నాత్మఁదలఁచి. 5 3 53

సహోదరులపై భీముని ప్రేమ. అతని కరుణ, ఆర్ద్రిత చక్కగా గుర్తింపఁ బడినవి కృష్ణునిచే. ఇది భీమునకుదాత్తత కలిగించు మార్పు. భీముని పిరికి వాఁడని సూటిగా అనిపింపలేదు కవి. 'నీ యట్టివాని కెవ్వదొకో యీ పిరికి తనమింత యలవడఁ గఱపినవారు' అని మాత్ర మనిపించెను. అదియును భీముని పిరికివానిగా భావించి కాదు, పురికొల్పుటకు మాత్రమే. మూల మున భీమపాత్ర మల్పముగా చిత్రింపబడి, కృష్ణుఁడు పరుషములాడినటుల గలదు (శ్లో. 16–23.). అనువాదమున భీముని మార్దవము ప్రజ్వలింప జేయుట మాత్రమే జరిగినది. కృష్ణ భీమసేనుల మధ్యగల బాంధవ్యమును బట్టి వారిభాషణములు సరససల్లాపములుగా తీర్చఁబడి సున్నితములగు ఎత్తి పొడుపులుగా పోయిగొల్పుచున్నవి. భీమునిపాత్ర ముత్తమముగా తీర్పఁ బడినది.

మూలమున భీముఁడును తీవ్రముగ సమాధాన మిచ్చినట్లు కలదు. కృష్ణుని పరిహాసము నర్థము చేసికొని 'దరహాసిత వదనుండగుచు' భీమసేనుఁడు పలికినట్లు తిక్కన మార్చి భీమునకుఁగల ఇంగితమును ప్రస్ఫుటము గావించెను. అందుచే క్లుప్తముగా తన బలము నెఱింగించినట్లు సోదరునకు మారాడలేకుండుటను దెలిపినట్లు తిక్కన మార్చి భీముని అవగాహనను తెలిపెను (ప. 59, 60.). "నృప కుంజరు పల్కుల కడ్డమాడరాకుంట యెఱుంగవే" "మును సుయోధను చందము జూపి యప్పుఁడేమంటి యుపేంద్ర నన్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్". ఈ పలుకులలో పెద్దలయెడల ఆతని గౌరవము తన పరాక్రమమందలి విశ్వాసము చక్కఁగా జెప్పఁబడినవి.

క. నా కొలఁది విచారింపక
నీ కిట్లనఁదగునె మిన్ను నేలయు నిమ్మైఁ
గాక తిరుగంగఁబడినం
బోకే ముంజేతులొడ్డి పోవఁగఁద్రోతున్. 5-3-60

ఇది భీముని ఆత్మవిశ్వాసము - ధీరుఁడు.

నవ్వులాటల కనినానని మాధవుఁడాతనిని శమింపఁజేసినాఁడు. అంతియ కాక యుద్ధార్థులైన తమకు భీముని పరాక్రమమునందాసగలదట. వాసుదేవుఁడిట్లనుట భీముని పరాక్రమమునకే శతపత్రము. తన పరాక్రమము నింకను జెప్పఁదొడగినాఁడు భీముడు (ప. 67). అపుడాతనిని "చెప్పినంతకంటెను మిగులంగఁ జేయుదు గడింది మగండవు నిన్నుఁ దెప్పగాఁ గొని పలుమాఱు నాపదలకున్ భయమొందక దుఃఖవార్ధులీదిన మనువెల్ల నిక్కొఱఁత దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ" అని ప్రశంసించినాఁడు జనార్దనుఁడు.

"తుదిం గుదురింతకు నీవ కావె గుణరత్ననిధీ" అని మఱల పలుకుట భీముని పాత్రకు తిక్కన కల్పించిన మెఱుఁగు. కృష్ణునంతటివానిచే 'పావనీ! గుణరత్ననిధీ' అని పిలిపించుటలో నాంతర్యమును అదియే. కృష్ణుని పలుకులకు మఱల భీముఁడు సమాధానమిచ్చి తన్నుగూర్చి చెప్పుకొనుట తిక్కన కల్పనము (ప. 65, 66, 67).

భీముని పాత్రము ఈ ఘట్టమున మూలమునందువలె భీరువుగా, పిమ్మట రోషావేశ కలితుఁడుగా లేదు తిక్కన రచనలో. ధీరగంభీరుడుగా తొలుత ఎట్లు సంయమనమును ప్రదర్శించెనో చివరివరకు అట్లేయుండి కృష్ణుని మాటలను మేలమాడుటగా నెంచి తానును నవ్వుచునే తగు సమాధానమిచ్చి నట్లును తిక్కన మార్చెను.

తిక్కన చిత్రించిన భీముఁడుదాత్తుఁడు, గంభీరుఁడు, కృష్ణునిచే అర్థింపఁబడిన పరాక్రమము గలవాఁడు. ఆతనిచే మన్నింపఁబడుట ఉత్తమోత్తమము గదా। తిక్కన అదియే చేసి భీముని స్థాయిని పెంచెను. విరాటోద్యోగ పర్వములలో భీముఁడు విజ్ఞులు మెచ్చిన వీరుఁడు।



# కీచకుఁడు

భీముని తరువాత పేర్కొనదగినట్లు తిక్కన మలచిన పాత్రము కీచకుఁడు. మూలమునందు ఈతని మనోభావము లేమియును చిత్రింపఁ బడలేదు. తిక్కన కావ్యజగత్తులో శాశ్వతముగా నిలిచిపోవు విషాదనాయకునిగా కీచకుని చిత్రించినాఁడు. కీచకపాత్రను ప్రవేశపెట్టునపుడే ఆతని స్వభావము స్పష్టమగునట్లు "........రూపాభిమానియు, నానాభరణ ధరణ శీలుండును, దుర్విదగ్ధుండును, బలగర్వితుండును నగు సింహబలుండ"[7] ని వర్ణించెను. ఈతని గూర్చి సన్నివేశకల్పనలందు, రసాధ్యాయమునందు చర్చింప బూనుటవలన నిట క్లుప్తముగా పేర్కొనఁబడినది.



# శ్రీకృష్ణుఁడు

భారతకథకు సూత్రధారి కృష్ణుఁడు. ఆతఁడు పాండవ పక్షపాతిగా కనిపించునే గాని నిజమునకు ధర్మపక్షపాతి. ఆ ధర్మము పాండవపక్షమున ఉండుట వలన ఆతఁడు పాండవులకు బాసటగా నిలిచెను. ఎప్పుడెప్పుడు కథ ఒక పట్టులో నిలిచిపోవునో అప్పుడు కృష్ణుఁడు ప్రవేశించి కథనడచుటకు సూత్రధారి యగుచుండును. పాండవుల అజ్ఞాతవాస పరిసమాప్తి జరిగినది. ఉత్తరాభిమన్యుల వివాహము ముగిసినది. పిదప ఏమి జరుగవలె నన్నది నిర్ణయించినవాఁడు కృష్ణుఁడు. పలువుర అభిప్రాయములను బలికించి ద్రుపదుని చే పురోహితుని కౌరవుల యొద్దకు పంపించినాఁడు. వెంటనే అట నిలువక ద్వారక కేగినాఁడు. దుర్యోధనునకు కొంత సహాయము చేయునెపమున యాదవకులమున పెరిగిన పాపమును కొంత ప్రక్షాళనము చేసినాఁడు - కురుక్షేత్రమునందు వారందఱును నిహతులైనారు.

ద్రుపద పురోహితుని రాయబారమువలన ఫలమేమియు సాధింపఁబడ లేదు. ధృతరాష్ట్రుఁడు సంజయుని బంపినాఁడు, సంజయునకు తానై ఎట్టి సమాధానము నొసంగక ధర్మరాజు శ్రీకృష్ణుని మాట తమకెల్లరకును శిరోధార్యమని తప్పించుకొనినాఁడు. కృష్ణుడు తానై కథలో ప్రవర్తిల్లిన ప్రధానఘట్టము ఉద్యోగపర్వమునందే యున్నది.

కృష్ణుఁడు సంధి జరుగదని తెలిసినవాఁడు. ఆతని అభిమతము కూడ యుద్ధమే అయ్యును లోకాచారము కొఱకు రాజనీతి ననుసరించి రాయబారమునకేగెను. సంధి జరుగలేదు కాన పాండవుల బలిమి, కౌరవుల దౌష్ట్యము, కృష్ణుని ఉద్దేశము ప్రపంచమున కంతటికి స్పష్టపడినవి: కృష్ణుడాశించిన ప్రయోజనమునదియే. కృష్ణుఁడు యుద్ధము జరిగి తీరునని పలుమారు చెప్పుటనుబట్టి ఇతరులుకూడ కృష్ణుఁడే యుద్ధకారకుఁడని భావించినటుల తిక్కన పెంచి వ్రాసెను. భవిష్యదర్థము నెఱింగిన భగవదవతారముగా తిక్కన చక్కఁగా పోషించెను. కృష్ణుని ధర్మపక్షపాతమును నొక్కి చెప్పెను.

బలరాముఁడు తీర్థయాత్రలకు పోవుటకు ముందు పాండవపక్ష సైన్యములు సమీకరింపఁబడిన శిబిరమున కేఁగి తన అభిప్రాయములను అచటివారికి తెలిపెను. ఆ సందర్భములో బలదేవుఁడు కృష్ణుని గూర్చి పలికిన పలుకులకు తిక్కన కొంత అమూలకముగా చేర్చి కృష్ణుని ఉన్నతత్వమును నిర్ధారించెను.

క. హరి యెఱుఁగని చక్కటియుం
బురుషార్థము నా కెఱుంగఁ బోలునె యీ ని
ష్ఠురత వినఁజూడఁ జాలక
సరస్వతీ తీర్థమునకుఁ జని యెదు బుద్ధిన్.

5.4.172

హరిని అందఱిలో మిన్నగ, జ్ఞానిగా తిక్కన స్పష్టము చేయుటకే ఈ కల్పన చేయఁబడినది. విదురుఁడు శ్రీకృష్ణుని కౌరవ సదస్సుకు పోవలదని, ఆ దుష్టుల నడుమకు కృష్ణుఁడేఁగుట మంచిదికాదని పలికినపుడు కృష్ణుడు తన ఉద్దేశమును తెల్లము చేయును.

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గొట్లాడియైన
దాని నడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర
కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు.

5.3.242

"... ఇట్లు సొచ్చి చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా యని యజ్ఞులైన జనులాడుదురు..." అందువలన తాను సంధి ప్రయత్నము చేయుచున్నానే గాని హృదయపూర్వకముగాఁ గాదని కృష్ణుడు తెలిపినాఁడు. ఇది ఇట్లగుటను బలరాముఁడెఱిఁగిన వాఁడగుటచే సంధి చెఱచినవాఁడు కృష్ణుఁడని బాహాటముగాఁ బలికినాఁడు.

తే. ఇట్టి దానికి నోర్వక యెన్నఁడేనిఁ
గృష్ణుతోడ నేఁ జెప్పితిఁ గినిసి యిరుదె
అంగువారికిఁ దగఁ జెప్పి సంగతంబు
సేయుమని యెంత సెప్పినఁ జేయఁడయ్యె.

5.4.168

క. పలుకుల పొందెఱుఁగని వా
రలఁ బూజావాక్యములఁ దిరంబై తనకుం
దెలుపం దగదే యేమని
యలుకమెయిన్ సంధి సెఱిచి హరి యేతెంచెన్. 5.4.169

కృష్ణుని ధర్మపక్షపాతమును అన్నయైన బలరాముఁడు, ధర్మజుఁడు గూడ పూర్తిగ నర్థము చేసికొనరైరి. ఇరువురును ఆతనిని పాండవ పక్షపాతియనిరి. అట్లయిన నతఁడు అర్జున పక్షపాతి అనుటయే మేల్తరము. నరనారాయణుల అనుబంధమట్టిది. దుర్యోధనుఁడా విషయమును లెస్సగా గ్రహించినట్లనిపించును.

చ. అనిన సుయోధనుండు దమయయ్యకు నిట్లను నిజ్జగంబుల
న్నిని నొక వెట్ట మ్రింగినను నెట్టన సర్వము గాచెనేనియు
న్వినుము ముకుందుఁ డర్జునుని నెచ్చెలినాఁ జెవులార వించు నిం
క నతని నొక్కబాహుచేఁగా ధృతి పెంపలు నాశ్రయింతునే.
5.2.322

కృష్ణుని భగవత్తత్వమును ధృతరాష్ట్రునకు సంజయుఁడెఱింగించెను. అపుడు తిక్కన సులభశైలిలో భగవత్తత్వమును వర్ణించెను. కృష్ణుఁడసురులను జంపినట్లు మూలమునఁగలదు. అట్లుండుటకు మారుగా శివుని ఎదిరించి బాణుని నాశనము చేసిన విషయమును, సురేంద్రుని నిలువరించి కల్పవృక్షమును దెచ్చుటను తిక్కన చెప్పెను. శివునితో సమానుఁడనుట కృష్ణుని పరాక్రమమునకు, మహత్త్వమునకు తగి యున్నది.

క. పలుమఱుఁ బాండుతనూజులఁ
కొలఁది వితర్కించెదవు నిగూఢంబదియున్
దెలియం బలికెద వారికి
బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా. 5.2 213

మూలమున నున్న హరితత్త్వమును తిక్కన క్లుప్తముగా స్పష్టముగా చూపినాఁడు. ఆతనిని పదమనునోహరముగా వర్ణించినాఁడు తిక్కన—

సీ. ప్రాణంబుతోఁగూడ రక్కసి చన్నుల
పాలుద్రావిన ప్రౌఢ బాలుఁడితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె
చ్చించిన యా జగజెట్టి యితఁడె
దుర్వృత్తుఁడగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ
బట్టంబు గట్టిన ప్రభువితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁగల
కోర్కి దీర్చిన రసికుండితండె

తే. వెన్నలును గోపికా చిత్తవృత్తములును
నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె
శ్రుతి శిరోభాగములఁ దన సుభగ చరణ
సరసి జామోదమును గూర్చు చతురుఁడితడె. 5.3 175

ఇందు అవ్యాజమైన భక్తి ద్యోతకమగుచున్నది. కృష్ణుని లోకోత్తర కార్యములు వర్ణింపబడుటవలన ఆతని భగవత్తత్వము వ్యంగ్యమగుచున్నది. భగవంతుని అవతారమును, తదుద్దేశమును తిక్కన భక్త్యావేశముతో సంజయునిచే చెప్పించెను.

సీ. పురుషోత్తముండెల్ల భువనంబులును దాక
యఖిల భూతాత్మకుండై విహార
లీల విచేష్టించు నీలోకముల మాయ
దొట్టి యొక్కొక్క మరి పుట్టి పెరిగి

కర్మానుచరణముల్ గైకొని వర్తించు
శిష్టరక్షణమును దుష్టనిగ్ర
హంబును దన పనులగుటఁ బాండవుల నె
పంబిడుకొని ధర్మబాహ్యులైన

తే. నీ తనూజుల నిక్కమ నిగ్రహింపఁ
దలఁచినాఁడమ్మహాత్ముండు దథ్యమతని
నిట్టి చందంబువాఁడని యెఱిఁగి యెవ్వ
రాశ్రయింతురు బ్రదుకుదు రట్టివారు.

5-2-318

శ్రీకృష్ణుని ఆశ్రయించి బ్రదుకుమని సంజయుఁడు ధృతరాష్ట్రునకు చెప్పినాఁడు. మూఢులైన వారు భగవంతుని గ్రహింపలేక నాశనమగుదురు. కౌరవ పాండవుల వైరమువలన కంటె కౌరవులు ధర్మబాహ్యులగుటవలన కృష్ణుడు వారిని నిగ్రహింపఁదలచినాఁడని తిక్కన పెంపుచేసెను. అర్జునుఁడు కృష్ణుని అంశము అనఁదగువాఁడు. అందువలననే చక్కగా ఆతని తత్త్వమును బ్రకటించినాఁడు— 'తథ్యము రెండును నీ వినోదముల్' అని. భగవంతునకసాధ్యమనునది లేదు. అయినచో సంధి ఏల పొసఁగలేదు ? అనినచో భగవంతుడద్దానిని ఉద్దేశింపలేదని యర్థము. మఱి శ్రీకృష్ణుని రాయబారము కేవలము రాజనీతి వర్తనము నడుపుట కొఱకే అని తెల్లము. సంజయునితో ధర్మరాజాడిన మాటల వలననే యుద్ధము నిశ్చయమనీ కృష్ణుఁడనినాఁడు. ధర్మరాజు ఉద్దేశమప్పటికింకను కుదురువడలేదు. అయినను యుద్ధము తప్పదని భావించినాఁడు కృష్ణుఁడు. "పాండవానుజన్మ పలుకుల చందంబు చూడ సంధిలోని చొప్పుదోఁచె"—(5.1.338). ఆతరువాత ధర్మజుఁడు శాంతి వచనములకు గూడ ఇట్టి సమాధానమునే ఒసంగినాఁడు.

తే. ఆ సుయోధను ముక్కువ వావి గలుగఁ
బుడమి నీకీడుఁగావునఁ బోరకలుగు
నేను కయ్యపు శకునంబు లెన్నియేనిఁ
గంటి నీ వనుత్సాహివి గాఁగవలదు. 5.3.41

వ. చతురంగ బలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పికొనుచు నాలస్యంబులేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండవలయు...."

5.3.42

స్పష్టముగా యుద్ధమునే శ్రీకృష్ణుఁడుద్దేశించినట్లు తిక్కన సూటిగా రచించెను. సంజయునితో—

క. ఆ రాజు సేయు నెయ్యము
గా రాముఁను జెప్పె దీవు గడుఁ దీపులుగా
వీరు దమపాలు వడయక
నేరిమి మాటలన తీరనేర్తురె చెపుమా. 5 1 340

క. విను మవమానముఁ పడియి
ట్లునికిఁ బడయు పొగడుకంటె నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స యెట్లయి
నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. 5.1.342

శ్రీకృష్ణుఁడింత కచ్చితవుగ 'యుద్ధము మేలు'అని చెప్పినట్లు తిక్కన కూర్చుటలో కృష్ణుని ధర్మరక్షణ యందలి ఉత్సాహము స్పష్టమగుచున్నది. ధర్మజుఁడు సందేహానివృత్తికై కృష్ణుని ఆశ్రయింపగా నాతఁడు ధర్మనిర్ణయ మునే చేసెను.

కౌరవ సభలో శ్రీకృష్ణుని ప్రసంగమును కూడ తిక్కన మిక్కిలి యుక్తియుక్తముగ స్పష్టముగా రచించి శ్రీకృష్ణుని మృదుమధుర సందేశ మును ఆస్వాదనీయముగాఁజేసి ఆ విరాణ్మూర్తి విజ్ఞతను పోషించెను. కృష్ణుఁడు కుశలమారసిన విధము—

క. రాజునకు దియ్యమెసఁగెడు
పూజా వచనముల నెయ్యపుం బలుకులఁ బే
రోజమెయి బంధుమిత్త్రస
మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్. 5.3.179

ఆయా వచన రీతులతో వారివారికి తగినట్లు పలుకఁగలిగిన చతురుఁడీతఁడు. విదురుఁడు కృష్ణభక్తుఁడగుటంజేసి విదురునితో పాండుపుత్రుల కుశల మును జెప్పించినాఁడు తిక్కన. కౌరవులడుగని విషయమది. కుంతికి కృష్ణుఁడభయ మిచ్చిన తీరు ఉచితము—

చ. సుగుణవు పుట్టినింటికిని చొచ్చినయింటికిఁ దేజమెక్కఁగాఁ
దగు చరితంబునన్ నడుచు ధన్యవు ధీరవు దేవి నీవెడ
న్వగ లడగింపకున్న భువనంబుల నింకిట నెవ్వరోర్చు వా
రు గలరె కక్కుమీ హృదయరోగము లన్నియుఁ బుచ్చి
వైచెదన్. (5-3-203)

ఈ అభయము తిక్కన కల్పించిన చిన్న అంశము. మూలమున పాండవులు జయించుట ఆమెచూడఁగలదని చెప్పి ఓదార్చినట్లు కలదు. కృష్ణుడామె హృదయరోగము లన్నియు మాన్పెదననినాఁడు. ఇది భగవత్తత్త్వము. భవబంధ విముక్తి నిచ్చుట ఇందు వ్యంగ్యముగా స్ఫురించుచున్నది.

దుర్యోధనుని మర్యాదలను తిరస్కరించుచు హరి పలికిన పలుకులు బహు తీవ్రములుగా నుండునట్లు తిక్కన రచించెను.

చ. 'ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడు కూడది లెస్సకూడు ద
క్కయనయహీనతం దమకు నాపదయై నెడ సిట్టునట్టు నే
మియు నసలేని కూడెదరి మేవడియైె చను నీవు మాదెసం
బ్రియుఁడవు గావు మాకు ధృతి పెంపఱ గాసవలేవొకింతయున్
(5-3-222)

ఈ పలుకులలో నిరసన దుర్యోధనిపై భగవంతుని దయలేమిని సూచించునదిగా నున్నది. దుర్యోధనున కీమాటలలోనే కృష్ణుని నభిమత మవగత మగునట్లున్నది. దుర్యోధనుని 'నీవు మాదెసం బ్రియుఁడవు గావ' ని మోమాటము లేక పలికినాఁడు జనార్దనుఁడు. ఆతనికి అరమరికలు లేవు.

సభలో శ్రీకృష్ణుఁడు మాటాడినపుడు ఆ మాటల పొందిక అద్భుతముగా కూర్పఁబడినది. సంధిని హృదయపూర్వకముగా చేయ యత్నించినట్లున్నది. ఇచటి ఈ సంభాషణ. తన అభిలాష ఎట్టిదైనను సభామర్యాదను పాటించి తగిన విధముగాఁ బలికినటుల తిక్కన పెంపు చేసెను. భరతాన్వయము యొక్క పెంపును పొగడి పిదప "నీవు నీ యనుగుఁదమ్ముఁడు నీ తనయుల్ యశోధురంధర శుభశీలురీ సుచరితక్రమ మిప్పుడు దప్పనేటికిన్" అని పలికినటుల ఆంధ్రమున చేర్పు కలదు. నీ అనుఁగుఁదమ్ముఁడని పాండురాజును, నీతనయులని ధార్తరాష్ట్ర పాండవులను గుర్తుచేసి అందఱిని యశోధురంధర శుభశీలురని పొగడుట వారిలో తన పొగడ్తవలన మార్పు కలిగింప వలెనను కోరిక కృష్ణునకు కలదనిపించును. ఇందొక రీతిగా వ్యంగ్యమును గలదు. 'ఈ సుచరిత క్రమ మిప్పుడు. దప్పనేటికిన్' - అప్పటి వఱకు నడచిన వారి చరితము సుచరితమనినాఁడు ఆ తరువాత కౌరవాన్వయము నందెవ్వరు తప్పుజేసినను ఆ ఫలితము ధృతరాష్ట్రునకే అన్వయించుననియు హెచ్చరించినాఁడు.

శా. ఈ వంశంబునకెల్ల నీవ కుదురిందెవ్వారి చందంబు లె
లైవ ర్తిల్లిన గీఁడు మేలుఁ దుది నీ యందొందెడుం గాక స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబుచ్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ.
(5 -3 -260)

నీ తప్పు లేకున్న జాలదు. ఎవరెట్లు వర్తించినను ఆ మేలుకీడులు నీకు అన్వయించును గనుక నీవే ఆలోచించి మనసులో ఆలోచన, బయటి ప్రవర్తన జనులచే బొగడందగినట్లు కావింపుము - ఆ పని నీవే చేయఁగలవని ఆతని బాధ్యతను నొక్కిచెప్పినాఁడు తిక్కన.

తే. నీకు వలసినఁ దీర్పంగ నేరవచ్చు
నధిప తెఱఁగు నీ వశమున యదియ కాన
నీకు వీరలఁదేర్చుట నెఱియ కాదె
సిద్ధమెవ్వారిఁ దెలివొందఁ జేయనేర్తు. (5.-3.-263)

అక్కఱ యున్నదని నీకు తోచినచో వీరలను మార్పగలవు. అది నీకు వశమగు కార్యము. 'ఎవ్వరినైనను తెలివొంద జేయనేర్తువు నీవు' అని కృష్ణుఁడు పలికినట్లు పెంపు చేసినాఁడు తిక్కన. అనఁగా చేయఁగలిగి యుండియు ధృతరాష్ట్రుఁడు రాజ్యలోభముతో సంధికి కుమారుని ఒప్పించుట లేదని కృష్ణుఁడు గ్రహించి నిష్ఠురమాడినాడన్నమాట. వాసుదేవునకు వృద్ధరాజు కపటవినయము, అతిలోభము తెలియునని తిక్కన ఈ పెంపు గావించెను.

తే. జగతిఁగల జనపతులు నీ చరణపీఠ
మర్థిఁ గొలువ సముద్ర వేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లి ప్రజల
యెడ విరోధంబు వాటించు టెంత మేలు (5-3-265)

ఈ భావము మూలమునందున్నదే అయినను తల్లి ప్రజలయెడ విరోధము తగదను పలుకు సూటిగా, పదునుగా నున్నది.

క. కౌరవ పాండవులం దె
వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మేలు
ర్వీరమణ చిత్తమున నె
ట్లారయుమా నీకు దుఃఖమగు నెట్లయినన్. (5-3-267)

పాండవులు చచ్చుట ధృతరాష్ట్రుని అభిమతమని ఎఱింగియు, వారిరు పక్షముల వారిలో నీ కెవ్వరు చచ్చిన మేలగునని అడుగుట కేవలము వ్యంగ్యము. వలన ధృతరాష్ట్రుఁడు పుత్రవ్యామోహి. కాని పాండవుల నాశమును బాహాటముగా కోరఁడని ఎఱింగి కృష్ణుఁడిట్లడుగుట సార్థకోక్తి యగును.

ఆనాడు నీ ఉపేక్ష వలననే ఇంత జరిగినదని సంజయుఁడన్నాఁడు. ఇప్పుడు నీవు ఉపేక్ష వహించిన "కౌరవులక పాండవులక కాదరయఁగ భూప్రజకెల్లను దురితంబొనరించినట్ల తుదిఁ గీడు సుమీ" అని కృష్ణుఁడు కూడ హెచ్చరించినాఁడు. కథలో క్రమము, కృష్ణుని సంభాషణయందు నైపుణ్యము

పోషింపఁబడినవి. యుద్ధములో తనవారెట్లు బాధపడుదురో వర్ణించి ధృతరాష్ట్రుని అంతర్యమును స్పృశించినాఁడు కృష్ణుఁడు.

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు పూని రిత్త బవరంబున నాఁడి, జావఁబోవ నె
ట్లూరక యుండవచ్చు కడునొప్పెడు మేనులు వాఁడి
కైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట యోర్వవచ్చునే.
(5-3-268)

'కడునొప్పెడు మేనులు వాడికైదువులు కూరఁగ నాటినం' భూమిపైఁబడుటను వర్ణించుట వలన ధృతరాష్ట్రుఁడు ప్రేమాతిశయమున భయమందినవాఁడె సంధి కంగీకరించునని కవి కృష్ణుని ఉద్దేశముగా రచించెను. తన కోటిక యుద్ధమేయైనను సంధిని గూర్చుట తన కర్తవ్యముగా నెంచి మానుష యత్నమునంతెట్టి లోపమును లేకుండగా నిర్వహించినాఁడు కృష్ణుఁడు. పాండవులపట్ల ఎల్లరకును సానుభూతి కలిగించుట కృష్ణుని ఆశయముగా తిక్కన వర్ణించినాఁడు.

ఆ. ఇట్లు గాక యుండ నీ రెండు దెఱగుల
వారిఁ గాచికొనుము వసుమతీశ
నీకు ప్రాభవంబు నీఱియు శాంతియు
నఖిల జనులుఁ బొగడునట్లు గాఁగ. (5. 3. 269)

ధృతరాష్ట్రుని లోభపెట్టుచున్నాఁడు కృష్ణుఁడు. హెచ్చరించి, అనునయించి, లోభపెట్టి, జంకించి, పలువిధముల వ్యంగ్యోక్తులాడి, నిష్ఠురములాడినటుల కృష్ణుని సందేశమును బహుభంగుల తిక్కన తీర్చిదిద్దినాఁడు ఈ వైవిధ్యము తిక్కన చేసిన పెంపు.

తే. పాండవులు దండ్రి నచ్చిన ప్రజలు వారి
నరసి పోచితి శైశవ మాదిగాఁగ
నడుమ నిష్కారణమ దిగవిడువఁదగునె
పార మొందంగ రక్షింపు గారవమున. (5.3.271)

ధృతరాష్ట్రునిలో లేని సుగుణములను ఆరోపించి, 'రక్షింపు గారవమున' అని అనునయముగాఁ బలికినాఁడు చతురవచోనిధి వాసుదేవుఁడు. ధృతరాష్ట్రుని మనసుపై ఈ అనునయము ఎట్టి ప్రభావమును చూపించినను, లేకున్నను సహృదయులు శ్రీకృష్ణుని వినయాతిశయమును తప్పక కీర్తింతురు. పాండవులు చెప్పుమనిన పలుకులను క్లుప్తముగా చెప్పిన పిదప సత్యధర్మముల సంరక్షణను గూర్చిన సందేశమును తిక్కన పెంచి కృష్ణుని దైవత్వమును నొక్కి పలికెను.

ఉ. సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపము చేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱిన దైనయవస్థ దత్తు లె
వ్వార లుపేక్ష సేసిరది వారలచేటగుఁగాని ధర్మని
స్తారక మయ్యు సత్య శుభదాయక మయ్యును
దైవముండెడున్. (5.3.278)

మూలమునందును న్యాయము అన్యాయముచే అణఁగద్రొక్కఁబడినపుడు దక్షులైనవారు నిర్లక్ష్యము చేసినచో అన్యాయముయొక్క దెబ్బ వారికే తగులునని కలదు. తిక్కన దానిని మఱికొంత పెంచి సత్యధర్మములను స్పష్టముగా పేర్కొని, ఉపేక్ష దక్షులకే చేటుకూర్చునని అంతతో నాగక ధర్మము నుద్ధరించుటకు, సత్యమును శుభదాయక మొనర్చుటకు దైవము సిద్ధముగా నుండునని పలికి దైవత్వమును చక్కగా దేశకాలాతీతముగా నిరూపించెను. సత్యధర్మములు తమంతతాము ఉద్ధరింపఁబడఁగలవను భావముకంటె సత్యధర్మముల సముద్ధరణకు భగవంతుఁడున్నాఁడను మాట సమంజసము. ధృతరాష్ట్రుని ఉపేక్షకది తగిన హెచ్చరిక కాఁగలదు. భీష్మద్రోణాదులు ఆ హెచ్చరికను గ్రహించి దుర్యోధనునకు తమచేతనైనంత బుద్ధిగఱప యత్నించిరి. ఈ పద్యమునడక ఉదాత్తముగానుండి కృష్ణుని ధీరగంభీరతకు చిహ్నముగా సాగినది. ఇంత గంభీరముగాఁ బలికి తిరిగి అనునయమును ప్రదర్శించినాఁడు కృష్ణుఁడు. పాండవుల పలుకులను గంభీరముగాను, తన మాటలు సాంత్వనము కలిగించు విధముగాను పలికించుటవలన జనార్దనుని వచన చాతుర్యము మెఱయుచున్నది. తన అభిప్రాయమునే ఇతరులు బలపరచునట్లుగా ప్రశ్నించి

నాఁడు. తాను వాక్యకోవిదుఁడు. ఇతరులను సైతము వాక్యవిదులని గౌర వించినాఁడు.

ఆ. పాండుపుత్త్రులకుఁ దగిన పాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్దిగలదు
ధర్మమెద్ది సముచితంబగు విధమెద్ది
శక్యమెద్ది చెప్పుఁడ వాక్యవిదులు (5-3-275)

కార్య, ధర్మ, ఉచితానుచిత, సాధ్యాసాధ్య వివేచనముగలవాఁడు వాసుదేవుఁడు. అందుచేనాతఁడు తన అభిప్రాయమును దెలిపి అంతకు మించిన కార్యమెద్ది, ధర్మమెద్ది, ఉచిత మెద్ది, శక్యమెద్ది అని అడిగినట్లు తిక్కన పెంపు చేసెను. వాసుదేవుని కాదను వారందెవ్వరును లేరు. కాని అట్లితరుల అభిప్రాయములనడుగుట వివేకవంతుల లక్షణము. అట్లడిగిన వెంటనే తానే దానికి సమాధానముగా

ఆ. వారి తండ్రిపాలు వారికినిచ్చి నీ
పాలు నీవుఁ బుత్త్ర పౌత్త్ర చయము
ననుభవించి సుఖులరై యుండుఁడీది బంధు
మిత్త్రసుజన కోటి మెచ్చు తెఱఁగు. (5-3-277)

అని ఉచితరీతిని తెలిపినాఁడు శ్రీకృష్ణుఁడు. ఈ విధమగు ప్రశ్నోత్తర రీతి వలన శ్రీకృష్ణుని ప్రయత్నమునందలి సహజత్వము, ఆతని వచోరీతి యందలి రామణీయకత్వము ద్యోతకమగు చున్నవి.

'అజాతశత్రుం జానీషేస్థితం ధర్మేసతాంసదా' అని మూలమునం దుండగా తిక్కన దానిని పెంచి అజాతశత్రుని శక్తి, కృష్ణుని యుక్తియుక్త మగు వచోరీతి మెఱయునట్లు రచించెను.

క. ఎఱుఁగవె యజాతశత్రుని
నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నె
త్తెఱఁగున ననువర్తించెనో
యెఱుఁగవె తగు చేవగలుగు టెఱుఁగవె యధిపా. (5-3-278)

ఇది ధర్మరాజు గుణప్రశంసయేగాదు. కృష్ణుఁడు ధృతరాష్ట్రునకు చేసిన హెచ్చరిక కూడ. ధర్మరాజు మెత్తని వాడని మీరెఱుఁగుదురు. ఆతనికి యుద్ధమునకు తగిన శక్తి కూడ కలదని హెచ్చరిక. అందును ధర్మజునకు మూలశక్తి కృష్ణుఁడే యగుట ఆ కృష్ణుఁడే ఇట హెచ్చరించుట వారి దుస్సాహసమునకు సమాధాన మగుచున్నది.

సంధి ప్రయత్నము చేయుచునే మధ్యమధ్య పాండవుల గుణగణములను, శక్తిని, బలపరాక్రమములను కృష్ణుఁడు ప్రస్తావించినట్లు తిక్కన కల్పన చేయుట కృష్ణుని అంతస్తునకు తగిన విధానము. 'దేహి' అని చేయిజాపక తమ భాగమును తాము గంభీరముగా నడిగినట్లు కలదు.

కృష్ణుని ప్రసంగమునకు సభాసదులు మిక్కిలి పరవశులైనట్లు తిక్కన మూలమును మించి రచించెను. శ్రీకృష్ణుని వాక్కులకు గల సమ్మోహనత్వ శక్తిని తిక్కన తేటపరచెను.

పాండవుల దిగ్విజయమును ప్రస్తావించుచు 'నీకుం బెంపునుం బేరునుం జేయఁగోరి... భూపతిసమాజము నెల్లను నిన్ను గొల్వఁజేయుదునని' పూను కొనినాఁడు ధర్మజుఁడని తిక్కన పెంపు చేయుట తగిన కల్పన. కృష్ణుని సందర్భోచిత భాషణమునకిది ఒక మెఱుగు.

'సౌబలు జూదమార్చి సంపదగొని యంతఁబోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే' అని ద్రౌపది అవమానమును ప్రత్యేకముగా పేర్కొనుట కౌరవుల దోష్ట్యమునందలి పరాకాష్ఠను చెప్పినట్లగుచున్నది. అనంతరము ధర్మజుని శాంతమును, ఓర్పును కీర్తింపఁజేసినాఁడు కవిబ్రహ్మ.

ఉ. దానికి నీ వొడంబడితి ధర్మజుఁడంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు భుగ్నలుగాఁ బెడచేతఁగన్న నీ
రూనఁగ నొత్తుకొంచుఁజని యుగ్రవనంబున దుఃఖముగ్నుఁడై
దీనత నుండి పూన్కిదగఁ దీర్చియుఁ గూడి మనంగఁ
గోరెడిన్. (5.-3.-281)

ఇందు ప్రత్యక్షరమున ధర్మజుని గొప్పదనమును జూపించుటకు కృష్ణుని ప్రయత్నము గానిపించును. దుర్యోధనాదులు ద్రౌపదికి చేసిన అవమానమునకు ధృతరాష్ట్రుఁడు ఒడంబడెనని కృష్ణుఁడారోపించి అయినను ధర్మజుఁడు మారాడక ఆ అవమానమును అనుభవించెనని, భీమార్జునులవంటి విక్రమోన్నతులు సోదరులుగాఁగలిగియు వారి పరాక్రమములను ప్రయోగించుకొనక ఉగ్రవనంబున దుఃఖమగ్నుఁడై దీనతతో నుండి పూనిక నడపెనని సభాసదుల మనంబులు కలంగునట్లు తిక్కన రచన సాగించెను. 'పెడచేతఁగన్ను నీరూనఁగ నొత్తుకొంచు' అని అప్పటి ధర్మరాజు రూపమును చూచినట్లే వర్ణించినాఁడు శ్రీకృష్ణుఁడు, ఆతఁడూహింపలేనిది లేదుకదా.

క. తనుఁదాన పోలుఁగాకే
మనవచ్చు నజాతశత్రు నతిశాంతతయున్
వినయము సత్యము మున్నె
జనపతులకుఁ గలవు సెపుమ సౌజన్యనిధీ. (5-.3 -282)

ధృతరాష్ట్రుని సౌజన్యనిధి యనుట వ్యంగ్యమర్యాద. కృష్ణుఁడు చతురభాషణ శీలి. ధర్మజుని గుణములను ప్రశంసించుటలో అమూలకముగా తిక్కన పెంచెను. ఇది కృష్ణుని సంభాషణా చాతుర్యమునకు వీలుగా చేసిన కల్పన.

క. ఏ నింతాడితి నీసం
తానం బిరుదెఱఁగునకు హితముగోరి భవ
త్సూనుని మతి యతిలోభము
మానిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా. (5.-3.-283)

దుర్యోధనుని అతిలోభమును కంఠోక్తిగఁ బలుకఁ గలిగినవాఁడు అచ్చట శ్రీకృష్ణుఁడొక్కఁడే! కృష్ణుని ఆధిక్యమును తిక్కన మిన్నగానెంచి పోషించెను. 'వారలు శాంతశూరు'లని, నీ కిష్టమైన నిన్ను గొల్వబూని యున్నారు. లేకున్న రణమునకును సిద్ధముగా నున్నారు. - నీ కదేది పథ్య' మని నిక్కచ్చిగా నడిగినాఁడు అధిక ధీమంతుఁడు వాసుదేవుఁడు.

కృష్ణుని ప్రసంగము నాసభాసదులెట్లు ప్రస్తుతించిరో, వారి భావములను తిక్కన పద్యముకంటె విపులముగా వర్ణించెను.

చ. అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యులె
ల్లను బ్రియమంది నెమ్మనములం బురుషోత్తముఁడింత యొప్పఁబ
ల్కునె మఱుమాటలాడ నయకోవిదుడెవ్వఁడు ధీరుఁడెవ్వఁడిం
దనువరి యెవ్వఁడంచు నచలాకృతులై నెటి నూరకుండగన్.
(5.-3.-285)

అంత ఆనంద నిర్భరాంతఃకరణులై యుండిరట వారు. కృష్ణుని పలుకులను తిక్కన అంత ఒప్పిదముగా దిద్దినాఁడనుట నిర్వివాదాంశము.

ధృతరాష్ట్రునితో గంభీరముగా నాడిన వాసుదేవుఁడు దుర్యోధనునితో తొలుత అనునయముగాను పిమ్మట తీవ్రముగాఁ బలికెను.

చ. తులువలుగాక యిట్టి దొర దుర్ణయవృత్తికిఁ జొచ్చునయ్య పు
త్త్రిలు ననుజన్ములుం జెలులు దుష్టపథంబునఁ బోవకుండఁ జు
ట్టలుఁదగువారుఁ దండ్రియు నొడంబడఁ జేయుము కార్యమల్ప బు
ద్ధుల వెడమాటలూఁకొనకు దోసము సేగియు వచ్చు నమ్మెయిన్. (5.-3.-331)

ఈ వాక్యరచనలో క్లుప్తత, భాషలో పొందిక, భావములో సమగ్రత శ్రీకృష్ణుని రాజకీయ విజ్ఞతకు తిక్కన కల్పించిన మెఱుఁగులు. దుర్యోధనుని 'అయ్య' అని సంబోధించుట కృష్ణుని కారుణ్యబుద్ధికి తగినదనిపించును గాని అందు వ్యంగ్యార్థమును గలదు. తులువలుగాక 'ఇట్టిదొర' అని సూచించుటలో ఇతఁడు తులువగాక బుద్ధిమంతుఁడా అను వ్యంగ్యము గర్భితము. ఇది చెడు త్రోవ. ఇందు తులువలే ప్రవేశింతురని చెప్పుటచే అందు ప్రవేశింపఁదలఁచిన దుర్యోధనాదులు 'తులువలు' అను నిర్ధారణ సిద్ధమైనది. అల్పబుద్ధుల వెడ మాటలూకొనకుమని శకునిని, దుశ్శాసనుని, కర్ణుని ఉద్దేశించి పలికినాఁడు.

లోక సామాన్యరీతిలో పెద్దలు పిన్నవారికి బుద్ధిగఱపినట్టే పలికినాఁడు శ్రీకృష్ణుఁడు. కాని అందు దుర్యోధనుని తులువతనము, తక్కినవారి అల్ప బుద్ధి ఎత్తి చూపింపఁబడినవి. తత్ఫలితముగా నాతనికి పాపము, దుఃఖము కలుగునని హెచ్చరిక చేయఁబడినది. అంతతో వినువాఁడుగాఁడు రారాజు. ఇంక కొంత కఠినముగా మాటాడఁదొడఁగినాఁడు.

ఆ. విను మసత్యలోభమున సిరియగునె యాఁ
కొని ముసిండి దినినఁ గ్రొవ్వులావుఁ
గలుగునయ్య శకుని కర్ణ దుశ్శాసన
మంత్రితంబు గార్యతంత్ర మగునె. (5-3-333)

'ఆకొని ముసిండి దినినచో క్రొవ్వులావు కలుగదు' - అట్లే 'అతిలోభమున శకుని, కర్ణ, దుశ్శాసనుల మంత్రిత్వము నాశ్రయించిన నదిరాచకార్యమున ఫలింపదు.' అని సూటిగ కృష్ణుఁడు పలికినాఁడు. ఆతనికి ఇతరులవలె మెలిక త్రిప్పి చెప్పవలసిన అగత్యము లేదు. అతఁడు నమ్మినబలమును 'ముసిండి' యని నిరసించినాఁడు కృష్ణుఁడు. ఇది తిక్కన చేర్పు. ఇంకను వారిని గూర్చి 'నీకీరసమెత్తి కోల్ గఱపి యిప్పుడు కార్యము దప్పఁజూచు నీవారలు సుట్టు వచ్చిన నవశ్యము నంతకుఁ జాలరుం జుమీ" అని దుర్యోధనుని హెచ్చరించి నాఁడు. కృష్ణునకు ధైర్యము కొదువలేదుగదా।

భీముని గూర్చి 'వాఁడలిగిన శూలాయుధుఁడు వడఁకు' అని ప్రశం సించి దుర్యోధనుని భయపెట్టఁజూచుట రాజకీయపుటెత్తుగడ. ఇది తిక్కన చేసిన పోలిక. అర్జునుని గూర్చి చెప్పుచు ఈ రాజులందఱు, సురాసురులు, గంధర్వులు—— ఎవ్వరైనను అర్జునుని ముందు నిలువలేరని మూలముననుండగా అట్లు చెప్పుట సామాన్యముగా నున్నదని తిక్కన కృష్ణుని విలక్షణతను చూపించెను.

క. ఒక కార్యము సెప్పెద మీ
సకలబలము నందు సవ్యసాచి కెదురుగా
నొకరుఁడు గలిగినఁ గయ్యము
నకుఁ బూనుఁడు రిత్త బహుజనక్షయమేలా. (5-3-338)

ఇట్టుల సవాలుచేయుట ఆ పురుషోత్తముని తీవ్రధోరణిని వ్యక్తపరుచునదిగా నున్నది. తన్నుగూర్చి ప్రత్యేకముగా జెప్పుకొననవసరము లేదు అయినను వారిని ఒంకింపఁ దలచిన గోపాలుఁడు నిన్న మొన్నటి ఉత్తరగోగ్రహణమును గుర్తుచేసి, అప్పటికి, ఇప్పటికి భేదము కలదని అర్జునుఁడిప్పుడు 'తనతోడు' కలిగియున్నాఁడని గుర్తుచేసినాఁడు. 'కినియకవిను' మని బుజ్జగించి దుర్యోధనుని అంతరంగమును మరింత కల్లోలపఱచినాఁడు.

క. తోడు దొనలేని యప్పటి
క్రీడి కోఁలది యట్టి దధిప కినియక వినుమేఁ
దోడై రా నెదురుట గడుఁ
గీడు పలవ దుడుగ వయ్యొ గెలుపరిది సుమీ. (5-3-340)

ఇందు బెదిరింపు, హితోక్తి, అనునయము, హేళన మిశ్రమములై కృష్ణుని వైవిధ్య వాగ్ధోరణి ప్రదర్శితమైనది.

"పాండవుల తోడ నొడఁగూడి బ్రదుకవయ్యొ" ఈ విధముగా 'అయ్యొ' అని సంబోధించి దుర్యోధనునకు అప్రియమైన హితము జెప్పినాఁడు కృష్ణుఁడు. చూచెడువారికి 'అతని హితోక్తిపై' చెప్పెడి తీరుపై గౌరవము ఏర్పడు నట్లున్నదీ రచన. కాని అది (5-3-341) దుర్యోధనునకు 'గాయమునకు కారము పూయుట' వలె నుండుటయు వింతగాదు అంతతో కృష్ణుని చాతుర్యము ముగియలేదు. పాండవుల నధికులఁజేసినగాని దుర్యోధనునకు తగిన బుద్ధి గఱపినట్లు గాదని తిక్కన పెంచినాఁడు.

క. కౌరవనాయక పాండు కు
మారులు నీ తోడిపొత్తు మసియెన మనఁగా
శ్రీ గా మోఁకాలొడ్డిన
వారి విధమకాదె నీవు వలదన్నఁ జెల్లన్. (5-3-343)

అనఁగా పాండవులతోడి పొత్తు సిరి అని, దుర్యోధనుఁడు మూఢుడని చెప్పక చెప్పినట్లయి చమత్కారముగా నున్నది. ఇంతవఱకును బుద్ధిహీనునకు బుద

గఱపఁదలచిన బుద్ధిమంతునివలె కొంత అనునయముగా, కొంత కఠినముగాఁ బలికినాఁడు శ్రీకృష్ణుఁడు. 'ఇప్పరుసున నీవును దామోదర దూఱెదుగాని తగవుఁ దలఁపవు కంటే' అను దుర్యోధనుని మూర్ఖవచనములకు కృష్ణుని యందు కోపము పెరిగినది. నయమున విననివాఁడు అమాయకుఁడు, భయమున లొంగనివాఁడు పొగరుబోతు కాగా తిరిగి తననే నిందించిన దుర్యోధనుఁడు శిక్షార్హుఁడను నిశ్చయమునకు వచ్చిన మాధవుఁడు తిక్కన కల్పనలలో బహుతీవ్రముగా భాసిల్లెను.

తే. అనిన విని కిన్కఁబూనిన యలఁతి నగవు
చెలువు మొగమున కొంక క్రొత్త పొలు పొనర్పఁ
బుండరీకాక్షుఁడగు పెల్లఁబోయి యప్పు
డరుణ కమలాక్షుఁడగుచు మురాంతకుండు. (5-3-364)

పుండరీకాక్షుఁడు అరుణకమలాక్షుఁడైనాఁడు. అంతియకాదు — అతఁడు మురాంతకుఁడును ఇకముందు కౌరవాంతకుఁడును అగునని ధ్వని. 'కిన్కఁ బూనిన అలఁతి నగవు చెలువు మొగమున కొంక క్రొత్త పొలుపొనర్చి'న దని తిక్కన అమూలకముగా వర్ణించెను. ఆ తరువాత కృష్ణుని ప్రసంగము యథామూలముగానే సాగినదిగాని తిక్కన రచనలో తీవ్రతను పొందుపఱచి అరుణకమలాక్షభావమును నిరూపించెను.

క. మొనతలఁ బడియెదు నీ చె
ప్పిన యట్టుల తడవులేదు బిరుదులరై నీ
వును వీరు నిలువుఁడిదె భం
డన మెల్లియవచ్చె నూఱటలు గనుడింకన్. (5-3-365)

నీవు కోరినట్లు యుద్ధము రేపే జరుగునని సన్నిహిత కాలమును సూచించి, తడవు లేదని కూడ తెలియఁబలికి 'ఊఱటలు గనుడింకన్' అని వ్యంగ్యముగాఁ బలికెను. వారికి యుద్ధము వినాశకరమని కృష్ణుఁడెఱింగి మరణము నిశ్చయమను నుద్దేశముతో ఊఱట అనఁగా మృత్యువునే గనుమనెను.

కృష్ణుఁడు తానుద్దేశించిన రణమునకు దుర్యోధనుని ఒక సాధనముగా నొనర్చుకొని, ఆతని కోరిక మేరకే యుద్ధము సంభవించుచున్నదని నొక్కి పలికెను. ధర్మరాజు కోరినది కూడ ఇంతయే. తాను రణమును గోరనట్లును, దుర్యోధనుని దురాశయే యుద్ధమునకు కారణమనియు ధర్మరాజు సభాసదు లెఱుంగ నాడుమని కృష్ణుని కోరుకొనెను. కృష్ణుఁడక్కార్యమును నిర్వహించెను.

తే. అన్నదమ్ములనెత్తంబులాడి సతుల
తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టివారి నెందుఁ
దడవుమా నీ వొకండవు దక్కనధిప. (5.3 367)

'ఇట్టి వారి నెందుఁదడవుమా నేవొకండవు దక్క' అని దుర్యోధనుని నికృష్టకృత్యమునే ప్రత్యేకముగాఁ బలికించినాఁడు కవిబ్రహ్మ. ఒక స్త్రీకి జరిగిన అవమానమునకు వాసుదేవుఁడెక్కుడు కనలినట్లు ఇచట తెల్లము.

తే. ఎత్తి విడిసిన వారని యెల్లతప్పుఁ
బాండవుల మీదఁ బెట్టిన బ్రదుకుగలదె
ద్రోణ భీష్ములు దండ్రియుఁ దోడుతోడఁ
జెప్ప నగు మాటలేవియుఁ జెవులు సొరవు. (5.3.369)

అని నిరసించినాఁడు.

దుర్యోధనుని పరిత్యజింపుమని కంసుని వృత్తాంతమును కౌరవ పరిషత్తునకు కృష్ణుఁడు చెప్పు సందర్భములో మూలమునందు విపులరచన కలదు. ఆ ఉద్రిక్త పరిస్థితిలో ఆ వివరణాత్మకరచన పొసగదనియు ఉపాఖ్యానవిధమప్రస్తుతమనియు తిక్కన మిక్కిలి సంక్షేపించి శ్రీకృష్ణుని భావమును సుస్పష్టము చేసెను. వక్తృ, ప్రకరణౌచిత్యములను పాటించెను.

ఉ. కంసుఁడు నిట్లు తండ్రి మది గందెడు చందమొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం గులమువారలు నాకెఱిఁగింప నేను దు
ర్మాంసము గోయు వైద్యుని క్రమంబున నాతనిఁద్రుంచి
యన్వయో
త్తంసముఁ జేయనే జనకుఁ దద్విధ మొప్పదె మీరుఁజేసినన్.
(5.3.378)

'దుర్మాంసము గోయు వైద్యుని క్రమము' అని తాఁజేసిన కార్యము, వారు చేయదగు కర్తవ్యమును ఒక్క వాక్యములోఁ బలికినాఁడు శ్రీకృష్ణుఁడు. ఈ సంక్షిప్త వాక్య నిర్మాణము శ్రీకృష్ణుని గంభీరతకు తగియున్నది. ఇట్లే తనను బంధింపఁదలచిన విషయమును సాత్యకి తెలిపినపుడు శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో క్రోధావేశపూరితుఁడై భాషించునట్లు కలదు. దుర్యోధనునిపై శ్రీకృష్ణుని ఆగ్రహము సందర్భోచితముకాదని ఎంచి, నిగ్రహమును పోషించి ఆ భాషణమును వదిలివేసెను. శ్రీకృష్ణుని గాంభీర్యము నించుక సడలనివ్వలేదు తిక్కన. ధృతరాష్ట్రునితో పోయివచ్చెదనని మాత్రమనెను.

ఉ. రోషము నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింతసేఁత సం
తోషమ నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని
ర్దోషత నేను నోపుగతి దోర్బల దుర్జయులైన వారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగతీవర యింతకుఁబోయి వచ్చెదన్.
(4.3.400)

సంక్షిప్త వాక్యనిర్మాణము వాక్యకోవిదుఁడైన శ్రీకృష్ణునకు వన్నె తెచ్చినయంశము. 'ఇంత సేఁత' ను పదములో అనంతార్థమున్నది. దుర్యోధనాదుల అవినయము, క్రౌర్యము, దుష్టత్వము ఆ 'ఇంత' లో ఇమిడి యున్నవి.

పాండవుల కడకు తిరిగివచ్చి శ్రీకృష్ణుఁడు—

క. కయ్యము గాని తెఱంగున
నెయ్యంబగునట్లు గాఁగ నెఱిఁబలికితి నే
నెయ్యది సుఖంబు పథ్యం
బెయ్యది యరయంగఁ దథ్యమెయ్యది దానిన్.

(5-4-75)

అని తన రాయబారపు విధమును తెలియఁజేసెను. ఇది ధర్మజుఁడాడిన 'నెమ్మి ఎఱుఁగు దగ్గ సిద్ధి నెఱి ఎఱుఁగుద' ను పద్యమునకు తగిన సమాధానము. "ఏనును నాయోపినంత సామవాదంబులాడితి నారదాది మహామునులును సుయోధనునకు బుద్ధులు చెప్పునట్లు చేసితి నేమి చెప్పినను నెంతటం బోకున్నం గినుక దెచ్చికొని జంకించియు, భంగించియు, ధిక్కరించియుఁ దృణీకరించియుఁం జూచితిఁ గార్యంబు భగ్నంబగుటకొల్లక వెండియు శాంత వచనంబులు పలికితి నతండశక్త దుర్జనత సేయం జూచిన నమానుషంబులగు వానిం గొన్ని వెడమాయలం బన్ని పెక్కుపోకలం బోయితి నెన్నిభంగుల సంధి కావలయునని పొరలంగల యంతయుం బొరలితి" నని తన ప్రయత్నమును ధర్మజునకు వివరించెను. ఇచ్చటచెప్పఁబడిన విధములన్నియు తిక్కన తీర్చిన శ్రీకృష్ణుని యత్నములనియు అందుకుదాహరణ ప్రాయములుగానే శ్రీకృష్ణుని రాయబారపు సంభాషణలు నడిచినవనియు గమనింపఁగలము. ఈ వచనము శ్రీకృష్ణుని రాయబారమునకు సమీక్షవలెనున్నది.

"అచ్యుతుఁడు సమస్త ధర్మ పరిశోధకుఁడ"ని అర్జునుడు, "హరి యెఱుఁగని చక్కటియుం బురుషార్థమునాకెఱుంగఁ బోలునె" యని బలదేవుఁడు, వాసుదేవుండు "ధర్మాధర్మవిదులకు గురుండు కార్యాకార్యనిరూపకులకు శిక్షకుం డుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుండ"ని ధర్మరాజు కీర్తించినట్లు తిక్కన రచించి వారి భాషణముల ముఖముగా శ్రీకృష్ణుని వ్యక్తిత్వమును చిత్రించెను, మహాత్మ్యమును పోషించెను.

ధర్మరాజు సర్వసైన్యసమూహములను అర్జునునకుఁజూపి 'యిందఱకుం దగ నీవు కంటికిన్ ఱెప్పయుఁబోలె' నుండవలెనని చెప్పి 'నీకు రక్షితానిప్పర మేశ్వరుండు కలఁడిచ్చుకుఖంబని చూపెఁ గృష్ణునిన్.'

శ్రీకృష్ణుని విశ్వరూపమును, ఆతఁడు చెప్పినగీతను తిక్కన మూలమున కంటెు విస్తరింపలేదు సరిగదా చాల సంక్షేపించెను. ఇది తిక్కన పాత్ర పోషణలోని మెలకువ. ఏ పాత్రను ఎంతవఱకు చిత్రింపవలెనో, వర్ణింపవలెనో, ఎట్లు భాసింపఁజేయవలెనో తిక్కన ఎఱుఁగును. ఆ పరిధిలోనే శ్రీకృష్ణుని విశ్వరూపత్వము, భగవత్తత్త్వమును పోషించెను.

మహాభారతమున శ్రీకృష్ణుఁడు దివ్యాదివ్యుఁడు. ఆతనిలోని దివ్యత్వము ఉద్యోగానంతర పర్వములలో నధికముగా భాసించినది. ఈ పర్వమునందాతఁడు నారాయణుఁడు మాత్రమే కాఁడు, నరుడు. నరులలో ఉత్తముఁడు. శ్రీకృష్ణుని వాగ్నైపుణ్యము, రాజకీయవేతృత్వము ఉద్యోగపర్వమునందు విశ్వరూపమును దాల్చినవి. చతురవాక్యకోవిదునిగా, ఉత్తమరాజకీయవేత్తగా తిక్కన శ్రీకృష్ణుని వర్ణించి, ఆతని భగవత్తత్త్వమును క్రమక్రమముగా తదనంతర పర్వములలో పోషించెను.

విదురభీష్మాదులకు ఆధ్యాత్మికవేత్తలు, నారదాది దివ్యమునులు ఆతనిని భగవంతునిగా భావించి కీర్తించిరి. నాయకపక్షమాతని దివ్యాదివ్యస్వభావము నుపాసించినది. ప్రతినాయకాదులాతనిని సామాన్యయాదవునిగా భావించి గర్హించిరి. ఈ రెండు భావములను తిక్కన ఈ పర్వమునందు నిపుణముగా నిబంధించెను. కాని ప్రకరణౌచిత్యమును భావించి శ్రీకృష్ణునిలోని ఉత్తమపురుషలక్షణములనే పెంపుచేసి వర్ణించెను. ఉత్తమపురుషుఁడు పురుషోత్తముఁడైన విధమును భారతకథ నిరూపించును. ఉద్యోగపర్వమున శ్రీకృష్ణుని నుత్తముఁడైన రాయబారిగా, రాజకీయకోవిదునిగా తిక్కన చిత్రించెను. ఇది శ్రీకృష్ణుని పాత్ర చిత్రణకు తగిన భూమిక. 'తథ్యము రెండును నీ వినోదముల్' అని అర్జుననిచేఁ బలికించుట శ్రీకృష్ణుని దివ్యాదివ్యత్వమునకెత్తిన వాఙ్మయనీరాజనము.



# ధృతరాష్ట్రుఁడు

చ. కొడుకులఁ గానరే నృపులకుం దిత తేజులనెందు నిమ్మెయిం
జెడు తెరువైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే
పుడమిజనంబులెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ నించుచున్కి నా
చ్చెడు మది యెప్పుడుం జెవులు చీములు గట్టెడుఁ గౌర
వేశ్వరా. (5.2.10)

పుడమిజనులు ధృతరాష్ట్రుని నిందించుటకు కారణమేమి ? పాండవులను ఉపేక్ష చేసినందులకా ? అంతమాత్రమే కాదు. దుర్యోధనుఁడు, కర్ణుఁడు, శకుని, దుశ్శాసనులకు రాజ్యమునప్పగించి వారి కుతంత్రములకు మారువలక కుండినందులకు ప్రజలు ధృతరాష్ట్రుని నిందించియుందురని ఎంచి తిక్కన సంజయునిచే ప్రతిపాదింపఁజేసెను. ఏలన ధృతరాష్ట్రుఁడుత్తముఁడే అయినచో కురుపాండవులకు వైరమింత కాలము సాగిసాగి విశ్వరూపమును దాల్చెడిది కాదు. ధృతరాష్ట్రుఁడు తాననుభవింపలేని రాజ్యమును తన కుమారులనుభవింపవలెనని అత్యంతము కోరినాఁడు. పాండవులు తన కుమారులకన్న పరాక్రమవంతులు, గుణశీలురని ఆతఁడే భావించినాఁడు. అట్టివారెప్పటికైనను ప్రజల మన్ననల నంది తనవారిని రూపఱజేసెదరని భయపడినాడు. ఈ కుశంక ఆతనిలోని విచక్షణను పోఁగొట్టి, వక్రమార్గానుగామిగా నొనర్చినది. దుర్యోధనుని మీఁద నెపము వేయుచు తానేమి చేయనివాఁడై జూదమునకు, ద్రౌపది పరాభవమునకు, పాండవుల అరణ్యాజ్ఞాతవాసములకు, ఘోషయాత్రకు, గోగ్రహణములకు, రాయబారముల వైఫల్యమునకు, చివరగా కురుక్షేత్ర యుద్ధమునకు కారకుఁడైనాఁడు.

సంజయ, విదుర, శ్రీకృష్ణ, భీష్మాదులచే పలుమరు బోధింపఁబడిన వాఁడై కూడ పుత్రమోహము నుండి బయట పడలేక పోయినాఁడు వృద్ధరాజు. అతని ఈ దౌర్బల్యమును మూలకారణముగా నెంచి తిక్కన మూలము

నందున్న దానికంటె ప్రస్ఫుటముగా ధృతరాష్ట్రుని సంశయాత్మకునిగా, పుత్రవ్యామోహము కలవానిగా, పాపమునకు ప్రోది చేసిన వానిగా పోషించెను.

సంజయుని పాండవుల కడకేఁగి నేర్పుమై మాటాడుమని రాజు కోరినాఁడు. వారికి అప్రియముగా నొక్కమాటయైనను పలుక వలదనినాఁడు. ఇది మూలము. దీనిలో ధృతరాష్ట్రుని బుద్ధి ఏమియును తేలదు. తిక్కన ధృతరాష్ట్రుని మాటలలో పాండవుల బలములఁ గూర్చిన వివరములను చాల సంక్షేపించి తన ఉద్దేశమును ప్రకటించినట్లు పెంపు చేసెను.

క. మీయయ్య మీరు వనవా
సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్
డాయుట విని ముదితాత్ముం
డై యిట పుత్తెంచె నన్ను నను మీ మొదలన్. (5-1-260)

ఇచట పాండవులను మెత్తని మాటలతో కూడఁగట్టు కొనవలెనను ప్రయత్నము స్పష్టము. 'మీయయ్య' అని తాను వారికి తండ్రివంటి వాఁడనని గుర్తు చేయుచున్నాఁడు పదమూఁడేండ్లు లేని చుట్టరికమును తిరుగఁదోడి వారిని ప్రసన్నులఁ జేసికొని, రాజ్యభాగమీయకనే యుద్ధమును నివారింప వలెనని ధృతరాష్ట్రుని అభిమతము 'ముదితాత్ముండై' పంపెనని చెప్పుమనుట అందులకే.

పాండవులకు కలిగిన అభ్యుదయ మేమియును లేదు. తమకుగా ఒక్క గ్రామమైనను లేక ఇతరులపై ఆధారపడి బ్రదుకుటయే అభ్యుదయమని ధృతరాష్ట్రుఁడు పలుకుట వారిని అటులనే బ్రదుకుమని కోరుటయే.

క. క్షీరోదక వృత్తి మనము
వారలునుం గలసి బ్రదుక వలదే నెమ్మిన్
వారిడుములఁ బడఁదగిరె యొకు
వారే పితృభాగమేలు వారలుగారే. (5.-1.-263)

కురుపాండవులు క్షీరోదకములవలె కలిసి బ్రదుకవలసిన వారని, పాండవులు పితృభాగమేలఁదగిన వారని ఇప్పుడు పలికిన రాజు వారడవులలో బడియునప్పుడు రకుండెను. ఇప్పుడైనను 'వారికి పితృభాగము పంచి ఇత్తును రమ్మ'ని అనక 'కలిసియుండిన మేలు' అని తటస్థముగా నూరకొనినాఁడు. ఇచ్చుట జరుగదని దుర్యోధనుఁడు మొగమాటము లేక పలుకును. ఈతఁడు మాత్రము 'ఇచ్చినమేలు' అని మాటమాత్రము పలికి చేతలలో కుమారునే అనుసరించుచుండును. సంజయునితోనైనను వారి క్షేమమరసి రమ్మని చెప్పినాఁడే గాని రమ్మని పిలువఁబంపలేదు. ఎట్లు పలుకవలెనో సంజయునకు చెప్పినాఁడు.

క. నెయ్యము వాటించి కడుం
దియ్యమెసఁగ నలుకలెల్లఁ దీఱునటులుగాఁ
గయ్యమను తలఁపులోనుగ
నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగుగన్. (5.1.271)

వ. శాంతిప్రకారంబునం గార్యంబునడిపి యొక్కటియైమనుట యొడఁగూర్చిరమ్ము — ఇంతయేగాని రాజ్యభాగము ప్రసక్తియే చేయలేదు రాజు. పాపము సంజయుఁడేమి చేయును ? 'ఆ రాజు చేయు నెయ్యము గారవమును కడుతీపులుగాఁ' జెప్పినాఁడు. ధృతరాష్ట్రునకు తగిన సమాధానము నిచ్చినాఁడు ధర్మతనయుఁడు వీరిరువురి తెలివిముందు సంజయుని చాతుర్యము నలిగిపోయి వ్యర్థమైనది. అయినను తనకు చేతనైన ప్రయత్నము చేయఁదలచి 'ధృతరాష్ట్రభూపతికి వృద్ధతకతమునఁ జిత్తమొక విధముగామి సుతోద్ధతి మాన్పఁడు నాడు' అని సమర్థింపఁజూచెను. ధృతరాష్ట్రునకు చిత్తమెప్పుడును చంచలనుగా లేదు. యుద్ధానంతరము కుమారుల మరణవార్తవిని 'వారు గెలుతురని అశించి' నానని విలపించును. అనగా ఆతనికి తొలుతనుండియు కుమారుల ప్రవర్తన ఇష్టమైనది. మధ్య మధ్య భీష్మ, ద్రోణ, కృష్ణాదుల హెచ్చరికలు; సంజయ, విదురుల హితోక్తులు వినినపుడు దుర్యోధనునికి బుద్ధిసెప్ప ప్రయత్నించెడువాఁడు.

అదియును హృదయపూర్వకముగా ధర్మబుద్ధి కలిగి కాదు. భీమార్జునుల పరాక్రమము, వాసుదేవుని దైవత్వము తలచి భయమంది యుద్ధముమానుమని పలుకును. దుర్యోధనుఁడు తన శక్తియుక్తులను జెప్పుకొనగానే ఊరుకొనును.

ధర్మరాజాతనిని దుర్యోధనునికంటె ఎక్కువ నిష్ఠురమాడినట్లు తిక్కన పెంచెను.

క. తానైననపుడు వక్రుం
దై నీతిపథంబు విడిచె నక్కట పతి మ
మ్మెమ్మనను జక్కని తెరువున
బూని నడువుఁడనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్. (5-1-311)

ధర్మరాజు ధృతరాష్ట్రుని తమ దుఃఖములకు మూలకేంద్రముగ భావించుకొనినట్లు తిక్కన ఇంకను పెంచి రచించెను.

క. ఎదిరిం దమయట్టుల కా
మదిఁదలఁచినఁ బోఁగుఁ గాక మాకుం గుడుమిం
డిదె మీరు ద్రవక్కఁగొనుఁడని
చదురడిచిన మన సుపోఁదు చక్కంబడునే. (5.-2.-312)

ధృతరాష్ట్రుని అంతరాంతరములలో నున్న ఉద్దేశమును ధర్మరాజు బట్టబయలు చేసినాఁడు. ధృతరాష్ట్రుని ప్రయత్నమిట్టిది కాన సంధిపొసంగదని తేల్చినాఁడు. అ పిమ్మట నడచిన కృష్ణుని రాయబారము సంధికైగాదు రణధర్మము ననుసరించుటకు, నెపమును ధృతరాష్ట్రుపై పూర్తిగా బెట్టుటకు మాత్రమే. తాను పోవుటలోఁగల ఉద్దేశము శ్రీకృష్ణుఁడు కౌరవసభను వీడుచుఁబలికిన పలుకులలో బోధపడును.

ఉ. సంపద దక్కియుండఁగ నశక్తులనం జను మమ్ముఁ బిల్చి పూ
జింపఁగనంత బేలె పతి సెప్పెడువారలు బుద్ధి నాఁడ మ
న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల వచ్చి రిత్తగా
రింపక మాను ఘాతని చరిత్రము నీకును మాకు వింతయే.
(5.-1.-314)

ధృతరాష్ట్రుని వర్తనము తొలుతనుండియు ఇట్టిదేయని ధర్మజునిచేఁబలికించినాఁడు తిక్కన —

క. రండని పిలువఁబనిచి పా
లిడని కొడుకులకుఁ జెప్పి యింద్రప్రస్థం
బొండెను వేఱొక పట్టణ
మొండెం ప్రమాకిచ్చి యనుచుటుచితము కాదే. (5-1-327)

ధృతరాష్ట్రుఁడు చేయఁదగిన కార్యమును ధర్మజుఁడు సూచించినాఁడు. ఇట్లు చేసి యుండిన, దుర్యోధనుడద్దాని కంగీకరింపక ఎదిరించిన అప్పుడు దుర్యోధనునిదే బాధ్యత - కాని ఇప్పుడది వృద్ధరాజు కారణముగానే పెరిగిన వైరమని ధర్మజుని పలుకులలోని అంతరార్థము.

ధర్మజుని ఈ పలుకుల ప్రభావము సంజయునిపైఁ బడినది. అతఁడదే విధముగా ధృతరాష్ట్రుని నిందించినాఁడు. యుద్ధము జరిగినన్నిదినములు ప్రతిసారి రాజు దుర్యోధనుని యుద్ధకారకునిగా నెంచుటయు, సంజయుఁడా మాటను ప్రతిఘటించి రాజును నిష్ఠురమాడుటయు కలిగినది. పాండవుల యొద్ద నుండి తిరిగివచ్చుటతోడనే రాజునుపాలంభించినాఁడు సంజయుఁడు— తిక్కన ఇచట సంజయుని సంభాషణము నతికఠినముగా రచించెను.

ఉ మానుషశక్తి యొల్లఁడు సమంచితదైవము యూఁదియుండు నీ
పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు నీవు నీ
సూను వశంబ కాని యొకచొప్పుఁ దలంపవు కర్ణసౌబలా
ధీనను కార్యనిశ్చయము తెల్లను నీమత మొప్పదేమియున్.
(5-2-8)

సంజయుఁడు ధర్మరాజుయొక్క ఆంతర్యమును చక్కఁగా గ్రహించినాఁడు. అంతమాత్రము ధృతరాష్ట్రుఁడు గ్రహింపలేక పోయినాఁడు. బహుశః ఆతని ఈ బుద్ధిమాంద్యమునకు 'అవిద్య' కారణమని తిక్కన సంజయునిచే చెప్పించెను. దుష్టచతుష్టయమనఁదగిన 'దుర్యోధనాదులు నిన్ను బొమ్మవలె నాడించుచుండగా, నీవు వారి ననుసరింతువ'ని కూడ తిక్కన పలికించెను

చ. అనయము పుట్టి జూదమున యప్పుడ యెంతయుఁ జిచ్చువెట్టి కా
ల్చినయది నీ యుపేక్ష యవశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనిపులి యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే.
(5-2 14)

ఈ పలుకులు సంజయుని ముఖతః కవి అభిప్రాయములు. 'అప్పుడ ఎంతయు చిచ్చుబెట్టి కాల్చినది నీ ఉపేక్షయే' – ఇదియే అందరును వెలిబుచ్చిన అభిప్రాయము గూడ. ధృతరాష్ట్రుని జంకింపఁగాఁదలచి శ్రీకృష్ణుఁడు గూడ తనదైవత్వము తెలియునటులును, ధృతరాష్ట్రుఁడెట్లు దుర్యోధనుని చర్యలకు బాధ్యుఁడగునో తెలిపెను. 'దక్షులెవ్వారలుపేక్ష చేసిరది వారల చేటగు' – ఇచట దక్షులనుమాట ధృతరాష్ట్రునకెక్కువ అన్వయించును. కొడుకు యొక్క వక్రబుద్ధిని పిన్ననాటనే ఉపేక్ష చేసినాఁడు. సజ్జనులగు పాండవుల క్షేమమును ఉపేక్షచేసినాఁడు. యుద్ధమాసన్నమగు తరుణమునందు భీష్మాదుల హితవచనములను, విదురనీతులను ఉపేక్షయే చేసినాఁడు. వాసుదేవుని ఆదేశమును సైతము ఉపేక్షచేసి చేటును చేకొని తెచ్చికొనినాఁడు మోహాంధుఁడు ధృతరాష్ట్రుఁడు. దుర్యోధనుని కన్నను యుద్ధము యొక్క చెడుఫలితమును ధృతరాష్ట్రుఁడే అనుభవించినాఁడు అతని ఆనంతర నికృష్టజీవనమునకు బీజము జూదమును వారింపక ఉపేక్ష చేసినప్పుడే ఏర్పడినది.

సంజయ, విదురులు ధృతరాష్ట్రుని మార్చుటకు శతథా ప్రయత్నించిరి. అప్పటికప్పుడు వారు చెప్పినదానికెల్ల నంగీకరించెడివాఁడు గాని దుర్యోధనునే అనుసరించినాఁడు విదురునిచే సైతము ధృతరాష్ట్రుని కుటిలబుద్ధిని తిక్కన వ్యాఖ్యానింపఁ జేసెను.

ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ముని భాగ మీక నీ
వెక్కటి మ్రింగజూచెదది యెట్లగుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవిగాలము మ్రింగిన చాడ్పునూవె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁగూడునే.
(5.2.52)

తమ్ముని రాజ్యమును గై కొనఁదలఁచినావని సూటిగా ధృతరాష్ట్రునే నిందించినాఁడు విదురుఁడు. విదుర, సంజయులా రాజునకు రెండుకళ్లు ఆతని ఆంతర్యములు తిక్కన వారి పలుకులలోఁ దెలుపుట యుక్తము.

ధృతరాష్ట్రుఁడు విదుర సంజయులనే కాక భీష్మద్రోణులను సైతము అలక్ష్యము చేసెనని మూలమున చెప్పఁబడినది. ఇది అత్యంతము నిక్కమగు టంజేసి తిక్కన యథా మూలముగా రచించినాఁడు.

అనాదృత్యతు తద్వాక్య మర్థవద్ద్రోణ భీష్మయోః
తతః స సంజయం రాజా పర్యపృచ్ఛత పాండవాన్
తదైవ కురవః సర్వే నిరాశా జీవితేఽభవన్
భీష్మ ద్రోణౌ యదా రాజాన సమ్యగనుభాషతే.

(5.48, 46, 47)

వ. అని చెప్పి యప్పాటం బరమహితోపదేశంబు చేసిన భీష్మద్రోణుల పలుకు లాదరింపక వారికి సదుత్తరంబులీక వారలతోడం దదను రూపంబుగా సంభాషింపక ధృతరాష్ట్రుండు వెండియు బాండవులవలని వార్తలడుగుటకు సంజయుదిక్కు మొగంబైనంజూచి కురుపతివీరులందఱుఁ బ్రాణంబుల దెస నిరాశులై యుండిరి. (5-2-167) - పాత్రపోషణకవసరమైన ఇట్టి పట్టులందు తిక్కన మూలానుసరణముగా రచన సేయుననుటకిదియొక ఉదాహరణము. ఇతఁడిట్టివాఁడు గనుకనే ధర్మరాజు -

క తగుమాట లాంబికేయుం
డగునని కైకొనునె యెన్నఁడైనను గొడుకున్
మఁగటిమి గలఁడనియెడు న
విమ్మగఁ జూచుచు గుండు విషము మ్రింగిన యేనిన్.

(5.1.315

అని ఎత్తిపొడిచినాఁడు

పాండవపక్షమున వీరాలాపము లాడుచు ధర్మజాదులను యుద్ధోన్ముఖులుగా చేయువారిని గూర్చి ధృతరాష్ట్రుఁడు సంజయునడిగినాఁడు. ఇది మూలమునందును కలదు. కాని తిక్కన అచటిభాషణమునెట్లు సంతరించెనో చూచినచో ధృతరాష్ట్రుని వక్రబుద్ధి అవగతమగును.

క. సమరమునకుఁ బురికొల్పుచు
మముఁదలఁచిన నుల్లికుట్టు మాటలఁ దచ్చి
త్తము లుడికించుచుఁ బాండవ
సమితిం గడఁగించువారచట నెవ్వరొకో. (5.2 242)

వీరాలాపములను 'ఉల్లికుట్టుమాటల' నుట ఆ పాత్రముయొక్క మనోధర్మము ననుసరించి చూచిన పదౌచిత్యము బోధపడును.

ధృతరాష్ట్రుఁడు భీమార్జునుల పరాక్రమమును తలచి భయపడి దుర్యోధనునితో సంధిసేయుమని చెప్పినాఁడు. దుర్యోధనుఁడు తండ్రివంటి చంచల బుద్ధి గలవాఁడు కాఁడు. తన నిర్ణయమునకు తిరుగులేదని పలికినాఁడు. అపుడు "కొడుకులు జయింపనోపుదురొకో యను నాస సంజయు దిక్కు మొగంబుసేసి పాండవ కౌరవ పక్షంబులం గలవారి నడుగుచుం గొలందులు దలపోయుచు నాతని వచనంబునను బలాబలంబులు నిశ్చయించి పాండవేయు లెక్కుడవుట యెఱుంగుచుఁ గ్రమ్మఱ నా సూతపుత్రుతో లెక్కలు వెట్టుచుం బోలించుచుఁ బెద్దప్రొద్దు వితర్కించి కౌంతేయులశక్తి దేవశక్తియు గాంధారేయుల శక్తి మనుష్యశక్తియుంగాఁ దెలిసినవాఁడై ...."(5-2-256) ధృతరాష్ట్రుఁడు కొడుకును మరలింపఁ జూచెనే గాని ధర్మాధర్మ విచక్షణ చేసిగాని, పాండవులపై అభిమానము కలిగిగాని కాదు. ధృతరాష్ట్రుని ఈ అధర్మబుద్ధిని తిక్కన అవకాశమున్న సందర్భములందెల్ల స్పష్టముగా నేర్పరచెను. హితము కోరినవారి మాటలు కటువులై నొప్పింపఁగా ధృతరాష్ట్రుఁడు కర్ణునుద్దేశించి 'అచ్చలమున నీ సుయోధనుని చావునకోర్చుటఁగాదె యెంతయున్' అని నిందించినాఁడు. తన పుత్రుని బుద్ధి మరల్పఁజాలని తండ్రి అతని సహవాసులను నిందించుట లోకపరిపాటి. ధృతరాష్ట్రుఁ డిచ్చట విశ్వాసపాత్రుఁడైన కర్ణుని నిందించుట అట్టిదే.

క. తనుజ వశవర్తియగు న
మ్మనుజేంద్రుఁడు దన సుతుండు మర్దింపఁగ నో
పునొయని పాండుతనూజుల
నను మతి సంజయునితోడ నాడె దురాపన్. 5.2.303

ఇది ధృతరాష్ట్రుని అనిశ్చిత ప్రవృత్తి. ఇతరులు బుద్ధి గఱపినపుడు పాండు పుత్రులఁ దలఁచి జంకును. తిరిగి తన పుత్రుని వశవర్తియగుచు వారిని దుర్యోధనుఁడు జయించునను పేరాశనొందును. ఆతని దురాశ దుర్యోధనుని దురభిమానము భారతకథకు నాంది ప్రస్తావనలనఁదగినవి.

ధృతరాష్ట్రుని గాంధారి పైతము ఆక్షేపించినట్లు తిక్కన రచించెను. దుర్యోధనునిపై ఆ తల్లికంటె ఈ తండ్రికి మక్కువ ఎక్కువ. "నీ పుత్రుఁడవి నీతుఁడగుట యెఱిఁగి యెఱిఁగి వాని వశంబులనేల పోయెదవు పాండవులకు నేమి యిచ్చితేని వడ్డపడ నెవ్వరికి వచ్చు" నని సూటిగా ప్రశ్నించినది గాంధారి. గాంధారి పుత్రుని ఎడల సహజవాత్సల్యము కలిగి ఆతని క్షేమ మును కోరగా, ధృతరాష్ట్రుఁడు దురాశాపరుఁడై ఆతని నాశనమునకు కారకుఁడైనాఁడు.

ధృతరాష్ట్రుని మఱియొక గుణము అపరాధము నంతయు దుర్యో ధనుని పాల్చేసి తాను నిర్దోషినని భావించుకొని, ఇతరులను నమ్మింపఁ జూచుట. యుద్ధ విశేషములను సంజయుఁడు ధృతరాష్ట్రునకు వివరించినపుడు మధ్యమధ్య రాజు తన తప్పేమియు లేదని దుర్యోధనుని నిందించుట. సంజ యుఁడందుల కియ్యకొనక ధృతరాష్ట్రుని దోషిగా నిర్ణయించుట జరుగును. పాండవులొక్కరైనను 'నొవ్వరు, చావర'ని ధృతరాష్ట్రుఁడు విలపించును. తన కుమారులతోఁబాటు పాండుపుత్రులు కూడ మడిసియుండిన ఆతనికి తృప్తి కలిగెడిది, కర్ణుఁడు ఇంద్రశక్తిని ఘటోత్కచునిపై ప్రయోగించెనని వినినపుడు కూడ ధృతరాష్ట్రుఁడు అర్జునునిపై దానిని ప్రయోగింపలేదని ఖేదమందెను. ఈ రెండు గుణములను తిక్కన చక్కఁగా పరిపోషించెను. ఉద్యోగపర్వమునందే ఆ గుణములకు ప్రతిరూపుగా ధృతరాష్ట్రుని చిత్రిం చెను.

శ్రీకృష్ణుని రాయబారము విఫలమై మరలిపోవునపుడు ధర్మచ్యుతికి చింతింపక తన నిర్దోషిత్వమును నిరూపించుకొనుటకే యత్నించెను.

తే. నీకు శుద్ధుండ నగుటయ నిఖిల బంధు
మిత్ర గురుజనకోటికి ధాత్రి కెల్ల
నంబుజాతు నిర్దోషుండ నగుట గాన
నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁజాలు. (5.2.5)

నని పలికి, తానేమిటికిని ముఖ్యుండఁగాను దప్పు దన దెస లేదని చెప్పివిడిచెను. ఇది ఈతని కుటిలత్వము. కొమరుని దోసమును తాను భరించు తండ్రులుం దురు కాని తన దోషమును కుమారునికే ఆపాదించు తండ్రి ధృతరాష్ట్రుఁడు.

క. బవరము గీడని యెఱుఁగుదు
నవినీతుండైన కొడుకు నదలిచి యుడుపం
దివిరియు నోరాడమి దై
వ వశం బప్పనికి మనకు వగపింకేలా. (5-4-183)

క. ఎయ్యెగి గానున్నది యది
యయ్యెడుఁ జేయునది గలదె యనవీశులకుం
గయ్యానఁజచ్చుటయు మే
లయ్యెప్పటి లెస్సగాక యది యట్లుండెన్. (5-4-184)

అని ధృతరాష్ట్రుఁడు కొడుకను మాత్రము అవినీతునిగాఁదలంచెను. తానా తనిని మందలింప లేమి దైవవశంబని తన చేతగానితనమును, లోభమును కప్పిపుచ్చుకొనెను. చేయునదిలేక అవనీశులకు కయ్యమునఁజచ్చుట కూడ మేలని తృప్తిపడెను. తాను చెక్కుచెదరక యుండి పుత్రులను యుద్ధ మునకు బలిచేసికొనినాఁడు.

తే. అనిన సంజయుఁడిట్లను నకట కొడుకు
మీఁదఁ దప్పు నెట్టెదవు నీ మీఁది కొఱఁత

నీకుఁ గాంగ వచ్చునె నీ వెఱుంగ
కుండఁ బఱచెనె యాతండు పాండుసుతుల. (5-4-186)

అని సంజయుఁడు నిలువరించినాఁడు. తప్పుచేసినవాఁడు దుర్యోధనుఁడైనను చేయించినవాఁడు ధృతరాష్ట్రుఁడు. రోషమయ మహాతరువు సుయోధనుఁడు కాగా మూలశక్తి తండ్రి. దక్షుఁడై యుండియు ఉపేక్ష చేయుట వలన యుద్ధము అతనికే చేటుగా పరిణమించినది. పుత్రశోకముతో నాతని జీవితము దుర్భరముగా గడచినది. విదురుఁడన్నట్లుగా నైనది చివఱకు-

చ. ఒకరుని చేతి ప్రోవును దదున్నతి ప్రాపును గాంచి యెల్ల వెం
టకును గొఱంత లేక పొగడం దగు సంపద నొంది యట్టి దా
తకుఁ దురాగ్రహి సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత ప
ట్టక కబళింపఁగుక్కలు నొడఁబడునే కురువంశవర్ధనా.
(5_2_77)

ఇంత కఠినముగాఁబలికినను ధృతరాష్ట్రునకు బుద్ధి మారలేదు. మారక పోవుటయే భారతకథకు మూలకారణము!

# విదురుఁడు

అధర్మ, లోభములకు ధృతరాష్ట్రుఁడు, నిస్వార్థ, ధర్మములకు విదురుఁడు ప్రతీకలు. విదురుని పాత్ర విషయమై తిక్కన చేసిన మార్పులు తక్కువ. విదురనీతిలో మధ్యమధ్య ధృతరాష్ట్రుని ధర్మమార్గానుగామిగా మరల్ప యత్నించినట్లు మాత్రమే తిక్కన కల్పించెను. విదురుని బోధలో కథ కన్వయింపఁదగిన అంశములనే తిక్కన గ్రహించి ఇతర ధర్మములను పేర్కొనక వదలెను. విదురుని పాత్ర ఔన్నత్యమును 'మహాత్మా', 'అనఘచరిత' అని శ్రీ కృష్ణునిచే సంభావింపఁజేయుట ద్వారా తిక్కన తెలిపెను.

# దుర్యోధనుఁడు

ఉ. ఉగ్రుఁడనూనమాన మహిమోన్నతచిత్తుఁ డజయ్య విక్రమో
దగ్రుఁడు హస్తలాఘవ సమన్వితుఁడేయు నెడన్ సమగ్రకో
పాగ్రహ బుద్ధి మాఁదెస ననార్యుఁడు కార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁడీతనిం గదిసినప్పుడు పండువు నాకు నుత్తరా.
(4-5-15)

భారతకథలో ప్రతినాయకుఁడైన రారాజునుద్దేశించి తిక్కన అర్జునునిచేఁ బలికించిన పలుకులివి. దుర్యోధనుని శీలమందు సమగ్రముగా సువ్యక్తముగా చిత్రింపఁబడినది. దుర్యోధనుఁడు సార్థకనామధేయుఁడు. ఆతని పరాక్రమోన్నతి నిందు అర్జునుఁడు పొగడుట ఆతనికొక ప్రశంసాపత్రమువంటిది. లోకోత్తర వీరుఁడగు పార్థుని మెప్పు వడసిన కొద్ది మందిలో దుర్యోధనుఁడొకఁడు అని తిక్కన భావము. ఆతని శౌర్యమును, భుజబలమును, హస్తలాఘవమును రెండు పాదములందు వర్ణించినాఁడు. ఆతని వ్యక్తిత్వములోని లోపములను మలి పాదములో పేర్కొనినాఁడు. పాండవుల యెడ ఆతఁడు నెఱపిన వైరభావమే ఆతని జీవితమును నడపిన అంశము. అదే మహాభారత కథాసూత్రము గూడ. కార్యమునందనార్యుఁడనుటవలన దుర్యోధనుని మూర్ఖపు పట్టుదలను, రాజ్యము నపాండవముగా నేలవలెనను దుర్బుద్ధిని కవి సూచించుచున్నాఁడు. ఆతనిని ఎదుర్కొనినప్పుడు అర్జునునకు పండువగుట సహజమే. అనగా నంత తీవ్రమైనది, వారి వైరభావము !

ప్రతివీరునితో నైనను అనౌచిత్యము దొరలునటుల నిందింపఁ జేయ లేదు తిక్కన. దుర్యోధనుని శీలమును విరాటోద్యోగములలో తిక్కన చక్కఁగా పోషించినాఁడు. మూలములో లేని విధముగా ఆతఁడు 'తగ విచారించి కార్యంబు తెగువకాంచి'న విధమును తొలి అధ్యాయమున

సమగ్రముగా చర్చించియుండుటవలన ఇచట పేర్కొనునవసరము లేదు. దుర్యోధనుని శీలమునకు వన్నె పెట్టునట్టిది ఆ మంత్రాలోచన సన్నివేశకల్పన. ఆతని బుద్ధికి ఆలోచనా శీలమున కది కలికితురాయి.

కీచక మరణానంతరము దుర్యోధనుని ప్రసక్తిఁగొనివచ్చునపుడు తిక్కన ఒక మాటను వాడినాఁడు. అది సుయోధనుని స్వభావమును వ్యక్తపరచునది. 'పాతకి'యై సుయోధనుఁడు పాండుతనూజులు చల్పుచున్న యజ్ఞాతవిధి వ్రతంబు కలుషంబుగఁజేయఁదలంచి వేగులవారిని పంచినాఁడట. 'పాతకి' యను పదము మాత్రమే ఇట తిక్కన కల్పన. అతఁడు పూర్వము పాండవులను ఎన్నియో కష్టముల పాల్చేసెను. మాయాద్యూతమున వారి సంపద నపహరించి కానల కంపెను. అవి ఆతని పాతకములు. ఇచ్చట తిక్కన ఉద్దేశించినది ఆ గతమును గూర్చి కాదు. ఆతని ప్రస్తుతోద్దేశమును దలంచియే తిక్కన పాతకి యనినాఁడు. వారిని పదమూడేండ్లు కడగండ్ల పాలు జేసిన సిమ్మట కూడ ఆతఁడు వారిపై కక్షబూని యుండుట మహా పాతకము. పైగా వారిని ధర్మమార్గమున గాక నీచకృత్యముల వలన అణఁగఁద్రొక్కవలెనని యత్నించుచున్నాఁడు. వేగులవలన దెలిసికొని అజ్ఞాతవాస వ్రతమును భంగపఱుపదలచుటయే ఆతనిని పాతకిగా భావింపఁ జేసిన అంశము.

ఆ సందర్భమునందే తిక్కన యాతని విభవమును వర్ణించుచు 'నాగేంద్ర కేతున్' అని పేర్కొనినాఁడు. పామువలె పగ సాధింపనున్నాఁడని ధ్వనింపజేయుటయే పై పదప్రయోగమునందలి సార్థక్యము.

కవి తాను స్వయముగాగాని, ఇతర పాత్రముల ముఖమున గాని దుర్యోధనుని చిత్రించిన విధమట్టిది. ఇక ఆతని ప్రవృత్తికనుగుణముగా కూర్పఁబడిన సంభాషణలను, చిత్తవృత్తి వ్యంజకములగు మనోభావచిత్రణ ములను పరిశీలించినచో తిక్కన దుర్యోధనుని పాత్రను పోషించిన తీరుతెన్ను లవగతములగును.

'వచ్చినవాఁడు ఫల్గునుఁడవశ్యము గెల్తుమనంగరాదు', 'ఇత్తఱిఁబొం దగు చేతయుందగున్' అని భీష్ముఁడు పలికినపుడు దుర్యోధనుఁడు 'దర

హాసిత వదనుం'డై నాఁడట. ఈ దరహాసనము దుర్యోధనుని కృతనిశ్చయబుద్ధిని సూచించుచున్నది. భీష్ముఁడట్లు చెప్పిన వెంటనే ఈతఁడు నవ్వినాఁడుఁ. భీష్ముని పలుకులందు నవ్వదగిన అంశమేదియు లేదు. కాని ఆ కార్యము యొక్క అసంభవత్వమును దలచి కురుపతి నవ్వినాఁడని విదితమగుచున్నది.

ఆ. మనకుఁ బాండురాజతనయ వర్గమునకు
నెట్లు పొందు గలుగు నేసు రాజ్య
భాగమీను సమర భంగిక విక్రమ
నిరతిఁ బూనుటిది యు నిశ్చయంబు.

ఈ పలుకు లాతని నవ్వునకు కారణములను వివరించుచున్నవి. 'రాజ్యభాగ మిచ్చు ఆలోచనయే ఉన్నచో ఈ గోగ్రహణములు చేయుట మాత్రమెందులకు ? వారిని కనుగొని తిరిగి అడవులకంపవలెనని ఇంత ప్రయత్నము జేసి ఇప్పుడర్జునుని గాంచి రాజ్యభాగమిత్తునా ! ఇది ఎట్టి మంత్రాలోచనము' అని దుర్యోధనుఁడు నవ్వినాఁడు. తిక్కన వర్ణించిన నవ్వులలో నానార్థము లుండుట ప్రసిద్ధమేగదా !

తత్పూర్వము ద్రోణాచార్యులర్జునుని ప్రశంసించినపుడే దుర్యోధనుఁడు 'అర్జునుఁడైన నేమి సురలైనను నేమగు...... విస్ఫూర్జిత బాహు సంపదలు చూపుద'మని కృతనిశ్చయముతో బలికియున్నాఁడు. ఆతని రణోత్సాహమును, పట్టుదలను దెలుపుచున్న భాషణమిది.

దుర్యోధనుఁడాచార్యుని అధిక్షేపించుచు పలికిన పలుకులను తిక్కన చాల సంక్షేపించెను ఇట్లు చేయుటవలన కథ వేగముగా సాగుటయేగాగ దుర్యోధన ద్రోణాచార్య పాత్రల శీలములు పరిరక్షింపఁబడుచున్నవి. ముఖ్యముగా ఆచార్యుని అంత తీవ్రముగా నిందించుట దుర్యోధనునివంటి రాజనీతిజ్ఞునకు తగనిపని. అధిక్షేపము చేయుటయే జరిగినను అది తగుమాత్రముండుట వలన రారాజు శీలము కొంతవఱకు రక్షింపఁబడినది. ఇంతజరిగిన పిమ్మట భీష్ముఁడు 'పొందగు చేతయుందగున్' అనుట దుర్యోధనుని నవ్వునకు కారణమైనది పూర్వాపరములాలోచించిన గాని ఈ నవ్వునకు పరిపూర్ణార్థము సిద్ధింపలేదు

అర్జునుఁ డుపాలంభించినపుడు దుర్యోధనుఁడు 'పటుకోపాయత్తతతో ద్రొక్కఁబడ్డ యహిగతిఁగవిసినాఁ'డట. ఇచట భుజంగముతో సాదృశ్యము చెప్పుటకూడ దుర్యోధనుని శీలమునకనుగుణముగానున్నది. పాండవుల పట్ల ఆతనికి గల పగ నీ భుజంగసామ్యము మఱి మఱి తెలుపుచున్నది.

అర్జునుఁడు మఱలిపోయిన పిమ్మట 'దుర్యోధనుఁడు నిజపురంబునకుం జని నడుమ విడిసిన యెడం గర్ణశకుని దుర్మంత్రంబు పట్టి గాంగేయుని వచనంబు లప్రమాణంబులు చేసి ధర్మతనయుండసత్యంబున కియ్యకొనమి యెఱింగి యాతని పాలికి దూతంబు త్తెంచి' నాఁడఁట. ఇది తిక్కన అమూలకముగా చేసిన కల్పన. ఇందు 'కర్ణశకుని దుర్మంత్రంబు పట్టి గాంగేయుని వచనంబు లప్రమాణంబులు చేసి' అను మాటను విశ్లేషించి చూచినచో తిక్కన తీర్చిన దుర్యోధనుని పాత్రమవగతమగును. ఆతఁడు స్వయముగా వివేకవంతుఁడు. తొందరపాటు కలవాఁడే కాని కుతంత్రుఁడు గాఁడు. కర్ణ శకుని దుర్మంత్రము వలన గాంగేయుని వచనంబులను అనుమానించెను. అప్పుడైనను ధర్మజుని సత్యనిరతిని నమ్మియుండెను.

ధర్మజుఁడు సమయాబ్దములు నిండెనని చెప్పిపంపిన పిదపఁగూడ ఆతని సందేహము తీరలేదు. ఒకపరి సంశయాత్మకుఁడైన వాని చిత్తము సంశయ రహితమగుట అంత సులభముకాదు. అందుచే నాటి రాత్రి కొలువుదీఱి గురుభీష్మ కృపాదులతో

ఆ. మనము మోసపోయి యనిమిషపతిసూతి
తోడఁ బోడిచితిమి యదోషవృత్తి
నతఁడు సమయకాలమంతయుఁ గడచిన
వచ్చెనో యెఱుఁగవలయు నిజము. (4 5.372)

అని భాషించినాఁడు. ఇది దుర్యోధనుని సంశయాత్మను తిక్కన ప్రకటన మొనర్చిన విధము. తెలివిమాలిన వానికి తెలియఁజెప్పుట, తెలిసినవానికి తెలియఁజేయుట సాధ్యముగాని 'తెలిసియు తెలియని నరుఁదెల్ప బ్రహ్మదేవుని వశమే' అను ఆర్యోక్తి ననుసరించి చూచినచో దుర్యోధనుని తెలిసియు

తెలియని నరుఁడని నిశ్చయముగాఁ బలుక వచ్చును. మూలమునందు లేని ఈ కల్పన సార్థక్యమును తొలి అధ్యాయమున జూచితిమి. ప్రస్తుతాంశము ఆ కల్పనవలన దుర్యోధనుని స్వభావమెట్లు స్పష్టపఱుపఁబడినదా యనునది మాత్రమే. ఆతని తెలిసియు తెలియనితనము ఈ కల్పనవలన రూపు కట్టినది.

దుర్యోధనుఁడు శల్యసహాయమును గోరుటలో, శ్రీకృష్ణుని అర్జునుఁడు కోరుకొనఁగా తనకు పదివేవురు గోపాలురు లభింపఁగా దానికాత్మఁబొంగి వారి ననహరించికొనినయట్లు కాదలచుటలో ఆతని ఈ తెలిసియు తెలియని మూర్ఖత మనకు విదితమగును. శల్యుఁడు తన పక్షముననుండి, శ్రీకృష్ణుఁ డావలి పక్షమున నుండి దుర్యోధనునకు హానిచేసిరి. వారు తారుమారుగా నుండుట తనకు లాభమని గ్రహింపలేకపోయిన దుర్విదగ్ధుఁడు దుర్యోధనుఁడు. దీనినే తిక్కన పై కల్పనలో నిర్ధరించి చిత్రించెను.

దుర్యోధనుఁడు శకుని, కర్ణ, దుశ్శాసనుల మంత్రాలోచనమును అధిక ముగా ననుసరించునని తిక్కన భీష్మునిచే గూడ పలికించెను. 'దుష్ట కష్టనికృష్టా త్ములగు నిమ్మువ్వురుఁజెప్పెడు బుద్ధులు కాని యొండు విననొల్ల వేమి చేయ వచ్చు'నని భీష్ముఁడు పలుకుట పై కల్పనలో తిక్కన ప్రతిపాదించిన అంశ మునే సమర్థించుచున్నది. దుర్యోధనుని దుర్మంత్రంబునకు కొంత వాని బుద్ధి కారణము, కొంత ఆతఁడు నమ్మిన దుర్మంత్రంబు కారణము.

తన పక్షమున నున్న వీరులపై నపారమగు నమ్మకమునుంచినవాఁడు దుర్యోధనుఁడు. ఆతఁడు స్వపక్ష వీరుల సామర్థ్యము చెప్పుటలో వారిని గూర్చి అత్యంతోన్నతముగాఁ బలికినాఁడు. ఒక్కొక్క వీరుని గూర్చిన ఒక్కొక్క పద్యము ఆణిముత్యమై వారివారి బలపరాక్రమములనే గాక వారిపై రారాజుకు గల విశ్వాసమును గూడ ప్రతిఫలించుచున్నవి. (5-2-209... 313). కర్ణుని గూర్చి రెండు పద్యములను రచించి ఆతనిపై రారాజుకుఁగల విశ్వాసాధిక్యతను తిక్కన నిరూపించెను. ఇతరుల విక్రమముల పై మాత్రమే నాధారపడిన దుర్బలుఁడుగాఁడు సుయోధనుఁడు. ఆతని ఆత్మవిశ్వాసమును తిక్కన ఈ క్రింది పద్యములో నిపుణముగా చిత్రించెను.

మ. గద శాతో సరి మూఁడులోకముల నేఁగానం జలంబెత్తియు
న్మద్రుఁడా భీముఁడునింనన్న దొడరిన న్వజ్ర ప్రహారంబు బె
ట్టిదమైన తఁకినఁ గూలుపర్వతముమాడ్కిం గూలనిం గూల ద్రో
సెద నాకోర్కిగదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్.
(5 2.21)

ఎంత ధారాళముగా బలికినాఁడు రారాజు. మత్తేభయానముతో నున్న ఈ పద్యము నడక మత్తేభ సదృశుఁడగు రారాజునకు తగియున్నది. అత్యంతమగు ఆత్మవిశ్వాసము తొణికిసలాడుచున్నదిందు. అంతేగాదు. తన ఈ భుజబలమునకు వెఱచియే ధర్మజుఁడు ఐదూళ్ళడిగినాఁడట. ఏమిసోత్కర్ష ! ఇదిగదా దురభిమాన మనిన.

ఆ. అతఁడు వడిన వెండి యాసేనఁగోల్తల
సేయ నొకఁడు లేమి సిద్ధమింత
యెఱిఁగి వెఱచికాదె యే మూళ్ళయైనను
దమకుఁ జాలునని యె ధర్మసుతుఁడు. 5.2.219

ఇది తిక్కన అమూలకముగా చేసిన పెంపు. దీనితో రారాజు దురభిమానము స్థిరపడినది.

తమ బలమును తండ్రికి దెలిపిన పిదప 'ఈ ఎక్కువ దక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముక్కారి వగచుచున్నవాఁడవు నిన్ను వగవ కుండ నుడుపంజాల మంతియకాని తక్కెల్ల పనులకుం జాలుదు'మని తండ్రి వగపును తూష్ణీభావముతో తిరస్కరించుచు బలికినాఁడు దుర్యోధనుఁడు. ఇది ఆతని గర్వోన్నతికి నిదర్శనమగు సంభాషణము ఈ అవినయమునే గాంధారి కూడ నిరసించినట్లు భారతమునందెల్లెడల గమనింపవచ్చును.

సంజయుని ధర్మరాజు నిశ్చయము నెఱంగింపుమని తానై కోరిన సుయోధనుఁడాతఁడు వారిని కొంత ప్రశంసించుట తోడనే 'సంజయ కైవారము చేసె దీవు కౌంతేయుల'నని నిష్ఠురమాడినాఁడు. ఇది ఆతనికి ఆదినుండిగల అసూయ. పాండవుల పెంపును కనలేని, వినలేని, ఓపలేనివాఁడు రారాజు.

పాండవులును, తామును ఏకకులంబునఁ బుట్టి యొక్కచో పెరిగి చరియించినపుడు సంగ్రామమున వారే జయింతురని నిశ్చయమెట్లు కలిగినదని

ప్రశ్నించినవాఁడు సుయోధనుఁడు. విధి ఈ పుడమిని తమకు సిద్ధముగా కూర్చినదని నమ్మి పెరిగిన మూర్ఖపు పట్టుదలవాఁడాతఁడు. ఆ విధియే తమ్మి సర్వనాశనమొనర్చుటకు, యుద్ధరూపమున ఆసన్నమగుచున్నదని ఆతఁడెఱుఁగఁడు. కొంత తెలిసియు కొంత తెలియని ఈ వైవిధ్యమును తిక్కన ఎక్కువ వర్ణించి చూపినాఁడు

దేవతలు పాండవులకు సహాయపడుదురని తండ్రి పలుకగా నాతఁడిట్లనెను-

క. దేవత లర్జునునకుఁ దో
డై చతురంగ వలవదది యెట్లనినన్
దేవత్వము రాగద్వే
షావేశము లేమిఁగాదె యైనది మొదలన్. (5-2-261)

వ. కావున వారొకళ్ళ వారుంగా రట్లుంగాక పక్షపాతులై పూని వత్తు రేని నది దేవత్వంబు గాదట్టి దేవత్వంబున నర్జునుండును సురక్షితుండు గానేరఁడు నీకు నా పనికిఁ జింతవలవదు..... (5-2-262)

దైవత్వంబును గూర్చి ఇంత తెలిసిన దుర్యోధనునకు దైవము ధర్మపక్షపాతియని, ధర్మము పాండవుల పక్షమున నున్నదని, శ్రీకృష్ణుఁడు దైవమని తెలియకుండుటెట్లు. అదియునాతఁడెఱుంగును, ఎఱింగియు ఎఱుంగనట్లు వర్తించును. అది అతని వ్యక్తిత్వము. కొంతకొంత భీమసేనుఁడు నిట్టివాఁడే. కాని ఆతఁడు ధర్మజానువర్తియై చరించుచుండును.

క. ఏ నలిగిన వారిని సుర
లైనను రక్షింపనోప రమరు లలిగినం
బూని చెడకుండఁ గాతును
మానవులోక సరకె నాకు మనుజాధీశా. (5-2-263)

ఇది ఆత్మస్తుతి. ఆత్మవిశ్వాసమును హద్దునుదాటిన స్వోత్కర్ష ఇది. దీనిని గూడ సమర్థించుకొను వచో నైపుణ్యమును తిక్కన దుర్యోధనునకిచ్చినాఁడు. గర్వపు పలుకులు గావివి, నిక్కమనియు, ఆత్మసంస్తుతి పౌరుషంబుగాదనియు తానే చెప్పినాఁడు (5-2-264). దుర్యోధనుని విదగ్ధత ఇట్టిది.

కృష్ణుని గూర్చిన సర్వవిషయములను సంజయుఁ డెఱుంగనాడినాఁడు. ధృతరాష్ట్రుఁడు ముకుందుని నాశ్రయింపుమని కోరినాఁడు.

చ. అనిన సుయోధనుండు దమయయ్యకు నిట్లను నిజ్జగంబు ల
న్నిని నొక వెట్ట మింగినను నెట్టన సర్వము గాచె నేనియు,
న్నినుము ముకుందుఁడర్జునుని నెచ్చెలివాఁ జెవులార వించు నీఁ
కనతని నొక్క బాముకుఁ గాధృతి పెంపఱ నాశ్రయింతునే
(5-2-322)

ఈ పలుకులు దుర్యోధనుని అభిమానమును వెలయించుచున్నవి. 'ధృతి పెంపఱ నాశ్రయింతునే' అను ముగింపులోనే ఆతని అభిమానోన్నతి వ్యక్తమగుచుండునట్లు తిక్కన రచించెను. తాను సమూలముగా నాశనమైనను బగతుని నాశ్రయింపని ధీరుఁడు దుర్యోధనుఁడు. ఈ ధీరగుణము అస్థానపతితమగుటచే దురభిమానముగా వాసి కెక్కినది. సత్యధర్మములు ధర్మజుని కెంత ప్రియములో, అభిమానధనము, ఆత్మవిశ్వాసము ఈతనికంత ప్రియములు.

ధర్మజుఁడాతనిని, ఆతని మంత్రులను 'కావరపులు చక్కవినరు కార్యవచనముల్' అని పేర్కొనెను. శ్రీకృష్ణుని వారిపాలికి పంపుటకుగూడ ధర్మజుఁడనుమానించెను–

తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్మ
లట్టి నీమలకడకు నిన్ననుపఁజాల
నీవు సంకటపడిరెదు దేవపదవి
యైన నేనొల్ల నొంటి యందరుగుటుడుగు. (5.3.29)

ధర్మజునకు కౌరవాదులపట్ల గల పై యభిప్రాయమునకు మూలకారకుఁడు సుయోధనుఁడే. భీము డాతనిని పాపాత్ముఁడు, మదాంధుఁడు, తులువ, దురాత్ముఁడని పలువిధముల నిందించినట్లు తిక్కన రచించెను. గంభీరుఁడైన ధర్మరాజు కొంత గూఢముగా బలుకగా ఉద్ధతుఁడైన పవనజుఁడు తీవ్రముగా దూషించెను. భీమ దుర్యోధనుల ప్రతిభటత్వమిందులకు దోహ

దము చేసిన ముఖ్యాంశము. ఆతని అభిప్రాయములో దుర్యోధనుఁడెట్టివాఁడో తిక్కన విపులతరముగా వర్ణింపఁ జేసినాఁడు.

శా. పాపాత్ముండు మదాంధుఁడా తులువ నీ పంపెట్లును జేయఁగాఁ
నోపం డడ్డము సెప్పరెవ్వరును మానోద్రేకమున్ గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప నాత్మజబలం గుందించుటం బోయిన
ట్లే పోనిత్తురు గాన నిన్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ.
(5.3.45)

ఉ. చొచ్చిన దోసచొచ్చి తెగఁ జూచెదనంచుఁ గడంగుచుండున
మ్మెచ్చుఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ డట్టి వానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁబోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారిఁ గురువంశము చేటున కోపకుండుటన్.
5 3.46

ఉ. పాండవ కౌరవుల్ గలిసి పాలును నీరునుబోలె నెమ్మిమై
నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁడింతలు సేసె నాతఁడొ
క్కండ కులక్షయంబునకుఁ గారణమం ద్రదది దప్పదైన నీ
వొండన నేల యా బిరుదు నోపినయంతయుఁ దీర్ప నేర్పునన్.
5.3.47

చ. తనపొరపోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాననే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు యశోభరితం బగు భారతాన్వయం
బున కొక నింద వచ్చునను బుద్ధి దురాత్మునకేల కల్గు నా
యన మెయిఁబోయి హీనగతినైన ఘటించిన నెంతయొప్పనో.
(5.3.48)

మూలమున ఈ సందర్భములో కులక్షయకారకులగు పదునెనిమిది మంది చక్రవర్తులను భీమసేనుఁడు పేర్కొని వారివలెనే దుర్యోధనుఁడు కురు

వంశ నాశనమునకు పూనుకొనినాఁడని పలికినట్లు కలదు. శ్రీకృష్ణుఁడు దుర్యోధనుని మనస్సు రంజిల్లు విధముగా మాట్లాడవలెనని కూడ భీముఁడుప దేశించినట్లు కలదు. ఇది సముచితముగాదు. ఆ రాజుల ప్రసక్తివలన నొన గూడిన ప్రయోజనమును లేదు. అందుకు బదులు తిక్కన పై పద్యములలో దుర్యోధనుని దుర్బుద్ధులను వానిని భీముఁడు భావించిన విధమును వివరముగాఁ దెలిపెను దుర్యోధనునిపైని కోపమును ప్రకటనముగాఁ దెలిపినవారు భీమ, సహదేవులు. ద్రౌపది దుర్యోధనుని దౌష్ట్యముకంటె తనపతుల నిర్లిప్తతకు వగచినట్లు తిక్కన చిత్రించినాఁడు.

సుయోధనుని నైచ్యమును కొంత అధికముగా భీమునిచేఁబలికించుటలో ఎంతైనను ఔచిత్యముకలదు. పై పద్యములలో దుర్యోధనుని ప్రవృత్తి ఎంత చిత్రింపబడినదో, అట్లుపలికిన భీమసేనుని చిత్తవృత్తి అంత విదిత మగుచున్నది. మానోద్రేకము, గర్వము. కోపము, బాహుగర్వమున మెచ్చకుండుట అను నవి దుర్యోధనునకు, భీమసేనునకుగల సమానగుణములే.

సుయోధనుని, తదనుచరులను కలిపి 'మొఱకుల'ని మాత్రమే పలికి నాఁడు అర్జునుఁడు. అటుపై సుయోధనుని నిశ్చయబుద్ధిని తెప్పగా బలి నాఁడు సహదేవుఁడు 'సుయోధనుండెక్కడ భూమిలోన సగమిచ్చుట యెక్కడ' అని స్పష్టముగా భాషించినవాఁడీతఁడు. సుయోధనుని దురభి మానమును గూర్చి పలికినది ద్రౌపది. "ఒట యొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ మాటలఁబోవునే దురభిమానమ యెక్కుడు పూనుఁ గాక" అనినది ఈమె. వీరిముప్వురి పలుకులే సుయోధనుని శీలచిత్రణమునకు ఆధారములనదగినవి.

దుర్యోధనుఁడు శ్రీకృష్ణునితో ప్రవర్తించిన విధమును తిక్కన కొంత విపులీకరించెను. దుర్యోధనుఁడాతనిని విందుకుడుపఁబిలిచెనని మూలమున కలదు. ఆ పిలుచుటను తిక్కన వివరించెను. దుర్యోధనుని గర్వోన్నతి, రాజసప్రవృత్తి ఈ సందర్భమున తేటపడినవి. అవినయశీలియైన ఆతని విందును జనార్దనుఁడు తిరస్కరించుటకు తగిన భాషణమును తిక్కన కల్పించెను. 'ప్రియమెసఁగందగం బిలిచి పెట్టెడు కూడది లెస్సకూడు' కాని దుర్యోధ నుఁడు ప్రేమతో వాసుదేవునిఁ బిలువలేదు.

తే. సముచితంబుగఁ గూరల చందముగ్గ
డించి కుడుపు తెఱంగు పుట్టించి పలుకు
నా సుయోధనుతోఁ గృష్ణుఁడచటఁ దాను
గుడువ నొల్లక యునికి యేర్పడఁగఁ జెప్పె. (5-3-212)

అంతతో నూరకొనలేదు తిక్కన తీర్చిన దుర్యోధనుఁడు. కర్ణునితో 'వారి పలికిన విధమెంతయు నెరవై యున్నయది వింటె' ఇత్యాదిగాఁబలికి తాము సిద్ధముచేసిన అన్నపానంబులనొల్ల కుండుట 'బాంధవమునకు నీతికి బాహిరంబు' అని శ్రీకృష్ణునికే ఉచితానుచితముల నుపదేశింపఁదలఁచినాఁడు సుయోధనుఁడు.

దూతలు వచ్చిన కార్యము నెరవేరక మునుపు కుడువకూడదని వాసుదేవుఁడు ముక్తసరిగాఁ జెప్పినను వినక ఇట్లింకను బలికినాఁడు—

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱఁ
దీఱకుండు దాని తెఱఁగు దగిన
యప్పుడాడ రాదె యిప్పుడు ముకుఁద్రాటఁ
గాలు గ్రువ్వనేల కమలనాభ. (5-3-220)

కుడువని కారణంబడిగి, కారణము చెప్పిన పిదప కార్యము తెఱఁగు దగిన యప్పుడాడరాదె యని 'ముకుఁద్రాట గాలు గ్రువ్వనేల' యని మొరటుగా మాటలాడినాఁడు. ఆతనికి శ్రీకృష్ణుఁడిచ్చిన సమాధానమును గూడ తిక్కన పెంచి రచించి దుర్యోధనుని అవినయమును ప్రకటనముగావించినాఁడు. పాత్రపోషణకీ సన్నివేశము తోడ్పడునట్లు తిక్కన పెంపు చేసినాఁడు.

ఆ. కారణంబులేక కౌంతేయులకు బాల్య
మాదిగాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులు దోడఁబుట్టువు లార్యులు
వైరమెత్తఁదగునె వారి తోడ. 5-3-227

ఇచట ఒక చమత్కారము కలదు. దుర్యోధనుని సూటిగా పేర్కొనలేదు శ్రీకృష్ణుఁడు. పుణ్యపరులు, ఆర్యులు ఐన తోబుట్టువులకు ఏ కారణము లేక బాల్యమునుండి కీడునే యాచరింతువు, వారితో వైరమెందులకని నాఁడు. అనగా అట్టివారితో అకారణవైరమును పాటించు మీరు పాపాత్ములు, అనార్యులు అనియే వ్యంగ్యార్థము. దుర్యోధనుని దుర్గుణములునివియే— దుష్టములగు తలంపులు, అనార్యత్వము, అకారణ వైరభావము.

విదురుఁడు దుర్యోధనుని, ఆతని అనుసరించువారిని ఉద్దేశించి 'వెడంగులగుటం గార్య వచనంబులెఱుంగరు మొఱకులగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు వారల తలంపులు కీడు'—అని తెలియఁజెప్పినాఁడు. దానికి శ్రీకృష్ణుఁడు

క. ఎఱుఁగుదు నేను సుయోధను
కొఱగామియు నతనితోడఁగూడిన నృపులం
దఱుఁ బగ మనమున నిడికొని
యఱుమటయును సంధి పొసఁగదనియు మహాత్మా. (5-3-237)

సుయోధనుని వెఱ్ఱితనము, మూర్ఖత్వము విదురుని మాటలలోను, చేతకానితనము వాసుదేవుని పలుకులలోను విదితమగుచున్నది.

దుర్యోధనునకు శ్రీకృష్ణుఁడు సభాముఖమున చేసిన హితబోధ చెవిటికి శంకూదినట్లైనది. పాండవులే తమ్ము అకారణముగా ద్వేషించుచున్నారని ఆతఁడు పలికినాఁడు. వారి ఆరోపణలను తానే పేర్కొని ఆ దోషములు వారివేననుట ఇచట దుర్యోధనుని వాదము యొక్క సారాంశము.—

క. వనితం బట్టిచి రరణ్యం
బున నిడుమల బడితి మనుచుఁ బోటరులై చం
పను జెఱుపఁదలఁచి మాదెసఁ
గనలుదు రపాండుసుతు లకారణమ కడున్. (5-3-357)

తమ్ముని వారే చంపను జెలుపఁ జూతురనుట వితండవాదము ఆ పనులు చేయఁ దలచినది, యత్నించినది తానై ఆరోపణల నితరులపై చేయుచున్నాడని తిక్కన పెంపుచేసి రచించెను.

పాండవులే మాత్స్యపాంచాల పాండ్యాది మనుజపతులఁ గూర్చికొని కయ్యంబుగోరి యెత్తివిడిసిరని సుయోధనుఁడు చేసిన ఆరోపణ తనకే అన్వయించుచుండునట్లు తిక్కన రచించెను. సంధికైన యత్నములను గాదని యుద్ధమునే ఆదినుండి కోరి నిశ్చయించినవాఁడు దుర్యోధనుఁడు. ఆతని మాట లసంబద్ధములని స్ఫురింపజేయుటకై తిక్కన ఇట్లు రచించెను. 'ఉగ్ర కర్మమునకేము దొడఁగుట గలదె చెపుమ' అనునాతని మాటలలో తెచ్చికోలు సౌమ్యము స్పష్టము !

"తొంటి చవిగని యిప్పుడుఁదోఁచి పాండుసుతులు రాజ్యంబు చేయంగఁజూచు" చున్నారని దుర్యోధనుఁడారోపించుట ఆతని ఆలోచనా విధముసుఁ దెల్పు భాషణము 'మునుపు వారికి భాగమిచ్చుటయే తప్పు'ని ఆతఁడు భావించెను.

"యావద్ధి సూచ్యా స్తీక్ష్ణాయావిధ్యేదగ్రేణ మాధవ
తావదప్యపరిత్యాజ్యం భూమేర్నఃపాండవాన్ప్రతి."
(5-126-26)

అని మూలమున నున్న దుర్యోధనుని వచనములకు తిక్కన మఱి కొంత తీవ్రత కూర్చెను.

ఉ. ఏమును వారుఁ బంచికొని యేలుట గల్లదు పల్కకుండు మిం
కేమియు వాఁడి సూదిమొన యించుక మోపిన యంతమాత్రయున్
భూమి యొనర్చి పాండు నృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబుగొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్.
(5-3-363)

మేము పంచికొని పలుట అసంభవము. 'పల్కకుండుమింక' అని కృష్ణునితోనాడుట ఆతని దర్పోద్ధతిని వ్యక్తము చేయుచున్నది. "వాఁడి సూది మొనయించుక మోపిన యంతమాత్రమున్' అను ఉపమానమును తిక్కన యథాతథముగా మూలము నుండి గ్రహించుట ఔచిత్యము. సుయోధనుని సునిశితమైన ఈ ఔపమ్యము విడువ దగినది కాదు. పాత్రపోషణకత్యంత ముపకరించు అంశము కనుక తిక్కన యథామూలముగా గ్రహించెను. ఇది తిక్కన వితరణశీలము.

కొంతదనుక అనునయముగాఁ బలికిన శ్రీకృష్ణుఁ డటుపిమ్మట దుర్యోధనుని దుశ్చేష్టలను, దుర్మంత్రంబును వివరించి, నిందించినాఁడు. ఈ సందర్భమున ఆతని వ్యక్తిత్వములోని లోపములన్నియు నెఱుకపడినవి. మూలమున కన్న తిక్కన రచనలో కొంత వేగమును కల్పించి శ్రీకృష్ణుని ఆగ్రహావేశములను సూచించెను.

దుర్యోధనుఁడు కర్ణాదులం గలసి దుర్మంత్రంబునకుం జొచ్చినపుడు వారిని గూర్చి తిక్కన 'దుష్కార్యాలోచనంబు చేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులగు దుష్టచతుష్టయంబు మొదలుగాఁగల యవినీతులు దైతేయ మర్దను మర్దింపనిశ్చయించిరి' అని పేర్కొనెను. దుర్యోధనుని సుభటత్వము మానధనము ఈ దురాలోచనలవలననే కొఱగానివియైనవి. దుర్యోధనుని దురాశ, దుర్మంత్రంబు లాతనిని భారతకథయందు ప్రతినాయకునిగా చేసినవి. ఆతని ఆత్మాభిమానము దుష్కర్మల కారణముగా దురభిమానమై నెగడినది. దుర్యోధనుని ఈ గుణములే ధర్మజునిలోని సాత్త్వికతను, ధార్మికతను, వినయశీలమును మఱింత ప్రతీయమానములుగాఁ జేసినవి.

మూలముననున్న అంశములనే తిక్కన పెంపుచేసి, కొంత తీవ్రముగా రచించి దుర్యోధనుని పాత్రమునకు వన్నెలు తీర్చినాఁడు. విరాటపర్వమునందలి ఆతని మంత్రాలోచనలు రాజనీతిజ్ఞతను తెలుపునవి కాగా ఉద్యోగపర్వమునందలి ఆతని పలుకులు, వాసుదేవుని ఎడల ప్రవర్తించిన తీరు ఆతని దుర్మంత్రంబును అనార్యత్వంబును తెలియజేయుచున్నవి. పాండవులతోఁ నాఁతడు నెఱపిన అకారణమైన వైరభావమును విడిచిచూచినచో దుర్యోధనుఁడు నిక్కముగా

రారాజుగా నుండదగిన మహిమోన్నతచిత్తుఁడు. ఎన్ని గుణములున్నను ఒక్క ద్వేషభావమే అతఁడు దుష్టుడుగాఁ జిత్రింపబడుటకు హేతువైనదని తిక్కన వ్యంగ్యముగా నిరూపించినాఁడనవచ్చును.

నాయకుని ఉదాత్తతను ప్రస్ఫుటముగాఁజేయుటకు ప్రతినాయకుని ఔద్ధత్యము తోడ్పడును. ఈ శిల్పరహస్యము నెఱింగిన తిక్కన దుర్యోధనుని నిపుణముగా తీర్చిదిద్దెను.



# సుధేష్ణ

మూలమున సుధేష్ణ వ్యక్తిత్వమంత సుబోధకము కాదు. తిక్కన ఆ పాత్రమును సజీవముగా చిత్రించెను. తమ్మునిపై బద్ధానురాగ. సైరంధ్రి పట్ల గల గౌరవభావమును ఆ అనురాగమే మరుగుపఱచినది. అట్లయినను ఉచితానుచితములను పూర్తిగ మరిచిపోలేక పోయినది. ద్రౌపదిని తనరక్షణలో నుంచుకొనునపుడు సుధేష్ణ వర్తించిన విధమును తిక్కన హృద్యముగా చిత్రించినాఁడు.

చ. కనుఁగొని గారవంబును మొగంబునఁ గేలఁ బురః ప్రసారముం
దనువున నమ్రభావమును దంతమరీచుల సామి నిర్గమం
బును దమలోఁగడల్కొనఁగ భూరితరాదరరేఖ నిందుర
మ్మనవుడు నంతనంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్.
(4 1. 310

ద్రౌపదిని చూచుటతోడనే ఆమెకు గౌరవభావము కలిగినట్లు తిక్కన వర్ణించెను. సుధేష్ణ పాత్రాపాత్రముల నెఱిఁగిన స్త్రీ అని ఇచట గమనింపవచ్చును. మూలమునందు సుధేష్ణ ద్రౌపదియందలి హస్తసాముద్రికాది లక్షణములన్నింటిని పేర్కొనినట్లు గలదు. ఎంత సౌందర్యవతియైనను ద్రౌపది పరిచారికా వేషములో నున్నది. అట్టిచో సుధేష్ణతో నట్లు వర్ణింపఁజేయుట ఆమె రాజ్ఞీత్వమునకు తగియుండదని తిక్కన ఆ ప్రసక్తిని వదిలి సుధేష్ణ అనుమానమును సంక్షేపించెను. అప్సరసల పేళ్ళను, ఇంద్రాణి, వారుణి మొదలగు దేవతాస్త్రీలను తిక్కన పేర్కొనక విడిచెను.

క. సురగరుడ ఖచర విద్యా
ధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలో నీ
వరయఁగనొక్కతవగు ది
వ్వారికిం జనుదేరఁగతము బొంకక చెపుమా. (4-1-314)

ఈ సంక్షిప్త భాషణము సుధేష్ణ శీలమునకు పోషకము. నిన్ను చూచిన పిదప విరాటరాజు నన్ను వదలివేయునని సుధేష్ణ పలికినట్లు మూలమున నున్నది. వాచ్యముగానట్లు పేర్కొనుట ఉచితముగాదని 'నీ రూపము చూచి మాన్ప పతి యువ్విళ్ళూరని' సుధేష్ణ ప్రభూతాశ్చర్యయై పలికినదట.

ఈ రంగమున సుధేష్ణ ఎంత ఉదాత్తముగా ప్రవర్తించినదో తిక్కన అంత నిపుణముగా నామె శీలమును, అభిజాత్యమును పోషించెను. అటుపై కీచకుని కోరికను వారింపలేక ఆమె వ్యథననుభవించినది. తమ్ముని కోరిక మేరకు సైరంధ్రిని కల్లుదేరఁబంపునపుడు ఎక్కడలేని అనునయమును తన పలుకులలో రంగరించినది. పనిగొనునపుడెట్లు ప్రవర్తింతురో తిక్కన సుధేష్ణ వల్లే చిత్రించెను.

సుధేష్ణ పాత్రపోషణమును గూర్చి కోరాడ రామకృష్ణయ్యగారీ క్రింది విధముగా భావించిరి – "తెలుఁగులో కూడ భ్రాతృజీవిత రక్షణమే ముఖ్యోద్దేశమైనట్లు తిక్కనయు సూచించినాఁడు. దానికిఁ దగినట్లుగా వీరి సంభాషణాదికమును పెంచి యామె యాతఁడు తలపెట్టిన కృత్యమున సహాయము చేయుటకు దగినదే యనిపించుటకు యత్నించినట్లగు పడుచున్నాఁడు"[8] .... "తిక్కన యామెను కీచకునికిఁదగిన యప్పగాఁ జేసినాఁడు"[9] .... "ద్రౌపదిని గూర్చి యీమె కేమియుఁ జింతయే లేదు"[10] .... "తిక్కన యీమెను చిత్తౌన్నత్యము కలదానినిగాఁ జేయఁదలంప లేదు. ఒక విధముగా నైచ్యగుణము నాపాదింపఁ దలఁచినాఁడు. కావున కీచకుని స్థితికిఁదగినట్లుగానే వారింపఁ జూచినది. తమ్మునికిఁ దగిన యప్పయే యని చెప్పవలసియున్నది"[11] —— అని 'లలితంబులగు మట్టియల చప్పుడింపార నంచకైవడి నడనల్లవచ్చి' ఇత్యాదిగా గల సీసపద్యమును పేర్కొనిరి. "తిక్కనార్యుఁడు సుధేష్ణ యంత యుదాత్త చిత్త, యున్నతస్వభావ కాదని సూచించుచున్నవాఁడు వలె నున్నాఁడు. ఆమె శీలమునకు నైచ్యము నాపాదింపఁ దలఁచియే యిట్లు చేయుచున్నాడు"[12] "సుధేష్ణ శీలమునకుఁ గొంత నైచ్యము నాపాదింపఁదలఁచియే తిక్కన యామెచే జారపొందును గూర్చి యిట్లు పలికించెను."[13]

పై విధముగా వారు భావించుట కొంత సత్యదూరముగా నున్నది. 'జారపొందును' వర్ణించుటలో దోషములేదు. పలనన కీచకుఁడు దుర్విదగ్ధుఁడు,

ఆతనికి నీత్యుపదేశములు తలకెక్కవు. 'అట్టివానికి జారపొందును గూర్చి చెప్పుటలో ఆ సంకట పరిస్థితిని తప్పింపవలెనను సుధేష్ణ ప్రయత్నము సహజము. ద్రౌపదికి తానభయమిచ్చితినని చెప్పకపోవుట ఆమె శీలమునకు నైచ్యము నాపాదించుటగా వారు భావించిరి. కాని అది అటులగాదు. బల గర్వితుఁడైన కీచకుఁడామె తన పరిచారిక పక్షమున మాటలాడిన సహింపఁడు, వినఁడు. అట్లగుటచే వాని క్షేమమునే కోరినదానివలె తిక్కన పలికించుటలో నైచ్యమునాపాదించుట అనునది లేదు. ద్రౌపదిని గూర్చిన చింతయేమియును ఈమెకు లేదనుట తగదు. ఆ చింత యేమియును లేనిచో కీచకుఁడడిగినదే తడవుగా నంగీకరించి యుండెడిది. కాని ఇంత దూరమాతని మనస్సు మరల్ప యత్నించెడిది కాదు. వాచ్యముగాఁ బలుకనంత మాత్రమున ద్రౌపది గూర్చిన ఆలోచన లేదనుట ఎట్లు? ఆమె ప్రయత్నమంతయు కీచకుని నివారించుటకేగదా! కీచకుని కోరికను విధిలేక అనుసరించినపుడు ఆమె ద్రౌపది గంధర్వపతుల గూర్చి తలచినది. అప్పుడామెకు ద్రౌపదిని గూర్చిన చింత కొంత తీరి కీచకుని ప్రాణమును గూర్చిన వంత కలిగినది.

తన్నాశ్రయించిన సైరంధ్రి శీలరక్షణము, తన అనుంగు సోదరుని ప్రాణరక్షణము అను నీ రెండు అంశములను సమన్వయింపలేక సైరంధ్రి పతులు ఆమెను రక్షింపగలరను ధైర్యమును తెచ్చికొనినది సుధేష్ణ. తానై సమర్థింపలేని కార్యమునకు దైవముపై భారము వేసినట్లు, ఇంతమాత్రమున ఆమెను తిక్కన నీచపాత్రముగా మలచినాఁడనుట పొసగదు. సుధేష్ణ అంత రంగమథనమును, తమ్ముని, అటుపై సైరంధ్రిని అనునయించుటను తిక్కన సహజముగా చిత్రించెను. సైరంధ్రిని కల్లుదేరఁబంపుట తప్పనిసరియైనపుడు ఆమె తన వాక్చాతుర్యమునంతటిని వినియోగించి ఆ కార్యమును సాధించినది. 'తృష్ణ భావించుచు' అనఁగా లేని తృష్ణను ఉన్నట్లుగా నెదుటి వారిచే భావింపఁజేయుచుఁ బలికినది. 'వే చని యిచటికి గొనిరమ్మా చూతముగాని నీ గమనవేగంబున్' అని ద్రౌపదిని లాలించినది. సైరంధ్రి మృదువుగా పోలేనని బలికినపుడు—

ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడునాసవ మర్థిఁదేరఁగా
 నొక్క నికృష్టఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో

సెక్కెఁగఁజేసి నిన్ను నతిహీనవిధాన నియుక్తఁజేఁతగా
నిక్కమ యుమ్మలించి తిది నెయ్యము తియ్యము కల్మిరయే సఖీ.
(4.2 58)

అని బుజ్జగించి పలికినది. మూలమునందు అధికార పూర్వకముగా మాడలాడి నట్లుండగా తిక్కన ఇట అనునయ పురస్సరముగా సుధేష్ణ పలికినట్లు మార్పు చేసెను. సందర్భోచిత[14] ముగా సంభాషణలను రచించుటవలన ఇచట సుధేష్ణ పాత్రము సహజసుందరముగా పోషింపఁబడి సజీవ చైతన్యస్ఫూర్తిగల పాత్ర ముగా సహృదయచిత్తములంచావిష్కరింప బడినది. ఎంత చిన్నపాత్రము నైనను తిక్కన సమగ్రముగా పోషింపగలఁడనుటకు సుధేష్ణ పాత్రము నిదర్శ నము.

ద్రౌపదిని చూచి తొలుత ఆశ్చర్యపడుట, కీచకుని కోరికను విని సంఘ ర్షణను పొందుట సైరంధ్రిననునయించి పంపుట, ఆమె పరిభవకారణము తెలి సియు తెలియనట్లడిగి కీచకుని దండింతునని ఓదార్చుట, కీచకమరణానంతరము దురపిల్లుట అను కథాంశముల నాధారముగా తిక్కన ఆమెచిత్తవృత్తి పరి ణామములను వర్ణించెను.

ద్రౌపది కీచకునిచే పరిభవింపఁబడి వచ్చినపుడు ఆమెరూపము చెదటి యుండుటను తత్కారణమును ప్రశ్నించినది సుధేష్ణ. అచట ఆమె వాక్చా తురి అవగత మగుచున్నది. లౌక్యము తెలిసి ప్రవర్తించినదిట. కాని తమ్ముల మరణానంతరము పాపము కుందిన చిత్తముతో దుఃఖపరవశయై సూటిగాఁ బలికినది. తొలుత నిదానముగా నీ వలచునెడకు అనుపుమనియె రాజనిపలికి 'తన మనంబునం గదిరిన యనుజవియోగ తాపంబుత్కటం బగుటయు వెండియు నిట్లనియె.

క. బిరుదుగల మగలు గలరని
తరమిడి చంపింపఁ జూచెదవు జనములు నీ
పొరువునఁ బోవెఱతురు మా
పురమును రాష్ట్రింబు వెడలి పొమ్మెందైనన్. (4.3.61)

ఈ పలుకులలో భ్రాతృవియోగ దుఃఖము, తోడ్తో క్రోధము పొంగిపొరలుచున్నవి. సుధేష్ణ ఇట్లనుట ఉచితము, సహజము. సైరంధ్రితో "నాదు నందనుల మదీయ వల్లభునుదాత్తమతిం బరికించికొమ్ము నీ మనమున కెట్టులూఱట సమప్తము నట్టుల చేసెదం దగన్" అని ఊఱడిల్ల బలుకుట ఆ పాత్ర పోషణములోని చివరి అంశము. ఇట ఊఱడిల్లినది ఎవరనినచో సుధేష్ణ అని కూడ అనుకొనవచ్చును. ఉత్కటమైన అవమానము తీరి ఊఱడిల్లినది సైరంధ్రి. అనుజవియోగ దుఃఖమును వీడి ఊఱడిల్లినది సుధేష్ణ. తిక్కన వర్ణించిన సుధేష్ణపాత్ర అత్యంత సహజరీతిలో వర్తిల్లినది. కొంత దర్పము, గడుసుదనము, సందర్భమున కనువగు వాక్చాతుర్యము మానవ స్వభావానుగుణమగు క్రోధము, లౌక్యము తిక్కన పోషించిన సుధేష్ణలో రాశీభూతమైనవి.



# ఉత్తరుండు

ఉత్తరుని ఆరంభ శూరత్వమును, అపై ఆతఁడు పచరించిన భయోద్వేగములను, బృహన్నలయే అర్జునుఁడని ఎఱింగిన పిదప ఆతఁడు చూపిన యుద్ధోత్సాహమును, యుద్ధ మధ్యముననే ఆతఁడు అలసతతో వివశుఁడగుటను, ఆయా సందర్భములలో ఆతని మనోభావములను భాషణములను తిక్కన మనోజ్ఞముగా వర్ణించినాఁడు. మూలమును కొంత పెంచి ఆతనికొక సమగ్రరూపమును, భావాభివ్యక్తిని కూర్చినవాఁడు తిక్కన "వడకెందొడగెన్ మదితోడ మేను, నీవూరక పోవుచున్కి యిది యొప్పునె, ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా" అను పలుకులలో ప్రాణభయము రూపుదాల్చి ఉత్తరునిలో మూర్తీభవించి నట్లనిపించును.

సీ. వెలవెలఁ బాఱుచు వెగడొందుఁ
బెదవుల తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబులెల్ల నిండఁ జెమర్పుఁ
బదములుఁ గరములుఁ గుదియవడఁకు
హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోముఁ దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థించు మాటఁ గీడ్పాటుదోప

తే. నిష్కళత శుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాప్తవై డూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటి దశకంబు నొక యూరుఁ బురము నొచ్చి
నపుడ యిచ్చెద నీ కను నార్తుఁడగుచు. (4-4-80)

ఈ ఎత్తుగీతి పద్య భావమును మూలమునుండి గ్రహించి తత్పూర్వము ఉత్తరుని భయవిహ్వలతను, సాత్త్విక భావోదయమును తిక్కన చిత్రించిన విధమద్భుతము. భీతావహుఁడైన ఉత్తరుని పాత్రమును తిక్కన సమగ్రముగా పోషించెను.

ఉత్తరగోగ్రహణమునకు పూర్వము ఆలోచనాశూన్యుడైన ఉత్తరుని, అర్జునుని తోడి మెలగుట వలన, వివేకవంతుఁడైనట్లు తిక్కన భావించెను. తదనుగుణముగా తిరిగివచ్చిన పిదప కంకుని తండ్రి గాయపరచెనని విని కలతచెంది తండ్రిచే క్షమాపణ నడిగించును (4-5 277). తండ్రి తమ రాజ్యమును గైకొనుమని ధర్మరాజుని ప్రార్థింపగా, 'యుద్ధ విజయము వలన అది ఎల్లవారిదేయైనది, నూత్నమగు దాని నీయవలెను, ఉత్తరను రావింపుఁడ'ని తండ్రికి సందర్భానుగుణమగు ఆలోచనను తెలిపినటుల తిక్కన మార్పు చేసెను. మూలమునందు విరటుఁడే ఇట్టి ఆలోచన చేసినటుల కలదు. ఇది ఉత్తరుని సమయజ్ఞతను పోషించుచున్నట్టి మార్పు

క. ధనవర్గంబులు వీరి
చ్చిన యవి యట్లగుట వేడ్కసేయవు తగ నూ
తనమగు కానిక యీ వల
యును వేతో డ్తేరఁ బనుపు ముత్తరఁ బ్రీతిన్. (4.5 353)

ఉత్తరుని పాత్ర మాధారముగా హాస్యరసమును పోషించుట కవకాశము కలదు. తిక్కన ఈ అంశమును గ్రహించి ఉత్తరుఁడు భయభ్రాంతుడై పరుగులిడుటను, అర్జునుని బ్రతిమాలుటను కొంత పెంచి హాస్యరస స్ఫూర్తిని భాసింపఁజేసెను. కాని ఆ పిమ్మట ఆతనిలో విరటుని మించిన ఆలోచనా శీలమును పోషించెను. పాత్రమును ప్రకరణానుగుణముగా మలచు నేర్పు తిక్కనకు కలదనుటకు ఉత్తరుని పాత్ర మొక నిదర్శనము.



# సంజయుఁడు

సంజయుని పాత్రమును తిక్కన మూలమునన్న దానికంటె మిన్నగ పోషించెను. ఇందుల కాతని రాయబారపు సంభాషణలు, తదనంతర మాతఁడు ధృతరాష్ట్రునకు చేసిన ఉపదేశములన్నియు ఉదాహరణ ప్రాయములే. ధృతరాష్ట్రుని గూర్చి, ధర్మజుని గూర్చి సంజయుఁడాడిన మాటలు ఆ పాత్రములయొక్క అంతరాంతరములను ఎఱిఁగి తిక్కన చేసిన కల్పనలే. 'రుధిరాభిలాన్నము మేలు భిక్షాన్నముకంటె' అని ధర్మజునితోఁబలుకఁగలదిట్ట సంజయుఁడు. సంజయుని తిక్కన విదురునితో సమానముగా సంభావించెను. 'నీ వొండె, విదురుఁడొండె' యని ధర్మజునిచే శ్లాఘింపఁజేసెను, ధర్మజునితో నీడగు వాక్చాతురి, సందర్భశుద్ధి గల పాత్రముగా తిక్కన మలచెను. ఆతనినగూర్చి-

క. ఎదురున్న రూపు వలుకఁగఁ
దుదిఁ గటకటఁ బడవు నీవు దుర్ణయమును బె
ట్టిదమును బెండును నగు పలు
కొదవదు నీ నాలుకకు నయోన్నత యెపుడున్. (5.1.363)

అని ధర్మజుఁడు చేసిన ఈ ప్రశంస ఆతని పాత్రమును తిక్కన తీర్చిన విధమును తెలుపుచున్నది. సంజయుఁడంత నయోన్నతుఁడగుట వలననే అతని రాయబారము ఇరుపక్షముల వారికిని ఒప్పిదమై యుండినది. తెలుఁగు భారతమున శ్రీ కృష్ణుని రాయబారమున కున్నంత ప్రాముఖ్యము సంజయుని రాయబారమునకును కలుగుటకు తిక్కన ఆ పాత్రము నాధారముగాఁగొని రచించిన సంభాషణలే కారణము. ఆతఁడు కేవలము ద్రుపదపురోహితుని వంటి దూతకాఁడు. తన ప్రభువునకే హితవు చెప్పఁగల ధీమంతుఁడు. పాండవుల కడనుండి తిరిగివచ్చిన పిదప సంజయుఁడాడిన మాటలలో తిక్కన వాడిని, వేడిని సంతరించెను. ధృతరాష్ట్రుని దౌష్ట్యమును ఎట్టఎదుట నిలువరించి అడిగినవారు విదుర, సంజయులు. సంజయుఁడు వాసుదేవ

తత్త్వమును విద్యావిద్యలను గూర్చి ధృతరాష్ట్రునకు బోధించిన సన్నివేశ మాతని జ్ఞానమును తెలియజేయును. అర్జునుఁడాతనిని 'బాలసఖుఁడ'ని ఆదరించి, 'ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచిత ప్రకారంబున మజ్జన భోజనంబులొనరించి మాల్యానులేపనాద్యుపచారంబులు చేయించి మణి భూషణ చిత్రాంబరంబు లొసంగి వీడు కొలిపె'ను.

ఈ మర్యాదలు తిక్కన సంజయునకు కల్పించినవేగాని మూలమున నున్నవిగావు. తిక్కన సంజయుని పాత్రములో జీవించెనా యనిపించునట్లు పాత్రమును తీర్చిదిద్దెను. సంజయుని సంభాషణలు అటనట పేర్కొనఁబడు చుండుటచే నిట వదిలివేయుట జరిగినది. ఆతని మాటలలో ప్రత్యేకతను పరిశీలించి పర్యాలోచింపఁదగినదగుట విమర్శక వేద్యము.

# సహదేవుఁడు

ఇఁక పాండవులలో కట్టకడపటివాఁడగు సహదేవుని తిక్కన అద్వితీయునిగా పోషించెను. తొలుత విరాటపర్వమున అతని గూర్చి ధర్మజుఁడు "అకుటిలుఁడార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిర్మలాత్మకుఁ డనవద్య శీలుఁడు సధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దుసేయు కొడుకు" ఇత్యాదిగా భావించెను.

అకుటిలుఁడు, నీతి నిర్మలాత్మకుఁడనునవి సహదేవుని ప్రత్యేక గుణములను తెలియఁజేయునట్టివి. అకుటిలుఁడనిన వక్రమార్గానుగామి కాఁడని భావము. ఈ వక్రత బుద్ధికిగాని, వర్తనమునకు గాని వాక్కునకుగాని సంబంధింపవచ్చును. తక్కిన పాండవులొక్కొక్క పరి గూఢసంభాషణలను, నయవినయ సంపన్నములగు మాటలను పలుకనేర్తురు గాని సహదేవుఁడెన్నఁడును వక్రరీతినెఱుంగని వాఁడని తిక్కన ఉద్దేశము. అకుటిలుఁడను ఈ విశేషణమునకు తగినట్లుగానే ఉద్యోగపర్వమునందు శ్రీకృష్ణునకిచ్చిన రాయబారపు సందేశమును తిక్కన అమూలకముగాఁ బెంచెను.

మూలమునందు సహదేవుఁడు యుద్ధము జరుగువిధముగా వాసుదేవుని సంభాషింపుమని కోరినట్లు కలదు. అందు సహదేవుని సందేశము నాలుగు శ్లోకములకు పరిమితమై, అతిక్లుప్తముగా, అత్యంత సామాన్యముగా నున్నది. తిక్కన ఈ సన్నివేశమున సహదేవుని విభిన్న వ్యక్తిత్వమును ఆతని సంభాషణముఖమున సంతరించెను ఇచట తిక్కన నాలుగు పద్యములను రచించెను. ఇందులో ఒక పద్యము మూలమునందలి నాలుగు శ్లోకములలోని భావమునకు యథానువాదమనదగియున్నది. తక్కిన పద్యములలో తిక్కన కల్పించిన భావములు కలవు. ఇవియే సహదేవుని స్వతంత్రాలోచనాశీలమును, మనస్తత్వమును మూలముననున్న దానికంటె మిన్నగా భాసింపఁజేయునట్టివి.

ఉ. రక్కసమాటలాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటియైనఁగాదనక యూఁకొనుచుండుట యంతకంటె మే
లక్కట యిట్లువేఁడికొన నైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగమిచ్చుట యెక్కడ దానవాంతకా.
5 3.94

అగ్రజుని అడుగుజాడలలో నడచువారే అందఱును. సహదేవుఁడు నైతమట్టివాఁడే. అయ్యును తన మనోగతాభిప్రాయమును మాత్రము నిర్భీతిగా వెల్లడించినాఁడు. ఇదియే ఆతని అకుటిలత్వము, నీతి నిర్మలాత్మకత్వమును. వారు మాటలాడిన వానినెల్ల 'నీ వొక్కటి యైనను కాదనక యూఁకొనుచుండుట యంతకంటె మేలు'ని శ్రీకృష్ణుని కూడ ఆక్షేపించినాఁడు. 'దానవాంతకా' అను సంబోధనము దుష్టశిక్షణ శ్రీకృష్ణుని కర్తవ్యమని సూచించుటకే.

ధర్మవర్తనుఁడైన సహదేవుఁడు వాసుదేవుని ముందైనను నిర్భయముగా మాటలాడఁగలఁడు. ఆతని 'యుల్లము మెత్తన' యని ధర్మజుఁడనెను. ఆ ఉల్లమెంత మెత్తనిదో అంత వజ్రసన్నిభమని తిక్కన నిరూపించెను. సుయోధనుని నిశ్చయబుద్ధిని, పట్టుదలను సహదేవుఁడు లెస్సగా గ్రహించినాఁడని తిక్కన కల్పనము. 'ఆతఁడెక్కడ, భూమిలోన సగమిచ్చుట

యెక్కడ' అను పలుకులత్యంత నిక్కములగుటవలననే 'సహదేవుండింతి యొప్పనాడునే' యని రధికవరులు ప్రశంసించినటుల తిక్కన రచించెను

"తలఁపం గూడునె యింత లేసి దొరలీ దైన్యంబ'ని సహదేవుఁడు వారిని నిరసించెను. వంకర మాటలు నేర్వని అవక్రశీలుఁడీతఁడు.

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందుం బేరు వంచించియుం
బదుమూఁడేఁడులు నీవనం దిరిగిరా పాలిక పోవచ్చునే
యది గాదేఁదెగి బంటవై యుఱుము మాయల్ వన్ను నేర్పెంకఁజె
ల్లదు సూ నీకని యా సుయోధనుని యుల్లంబుచ్చిపో
నాడుమీ. 5.3.97

ఈ పద్యమున కన్వయము కొంత క్లిష్టము. పెక్కుమంది విమర్శకులు ప్రయత్నమును చేసిరి. 'నీవునుం' అను పాదమునకంటె 'నీవనం' అను పాఠము కొంత సమంజసముగా నుండుటచే అదియే గ్రహింపబడినది. ఏది ఏమైనను సహదేవుని తీవ్ర స్వభావమిందు సువ్యక్తము! తమ నొకప్పుడు దుర్యోధనుఁడవమానించి యుండుటను మనసులో నుంచుకొనియే "ఆ సుయోధనుని యుల్లం బుచ్చిపోనాడుమీ" అని తీవ్రముగాఁ బలుకవలసినదిగా శ్రీకృష్ణుని కోరినాఁడు. ధర్మజుని అభిమతము సంగరమని ఎఱిఁగి యుద్ధ ప్రయత్నను చేసినవాఁడు శ్రీకృష్ణుఁడు కాఁగా తమ అవమానమును దలఁచికొని యుద్ధమును కోరినవారు సహదేవుఁడు, ద్రౌపది కొమరుల కడగండ్లకు వగచి సంగరమును కోరిన తల్లి కుంతి. వీరి ఆశయమే చివ అకు సిద్ధించినదగుటచే ఇఁట సహదేవుని ఈ సందేశము యుక్తముగానున్నది

సహదేవుని వనవాసమునకంపుచు కుంతి'కడుఁబసిబిడ్డ వీఁడ'ని విలపించినదట. అప్పటి సహదేవునకు ఇప్పటి వీరోత్తముఁడైన ఈతనికి ఎంతయో అంతరముకలదు. వనవాసాయాసమాతని మృదుస్వభావము నెంత కఠిన

ముగా మార్చినదో తిక్కన వ్యంగ్యముగాఁ దెలిపెను. పసితనమనునదాతని వయస్సంబంధిగాఁ జెప్పిన మాట కాదు. ఆతని నిష్కల్మషతత్వ మును గూర్చి చెప్పినమాట. ద్రాపదికి మెరుగని సహదేవుని తిక్కన పోషించెను. ఉల్లము మెత్తని సహదేవుఁడు 'సుయోధనుని యుల్లంబుచ్చి పోనాడు'మని పలికి సహృదయుల మన్ననల నందఁజాలినాఁడు.

విరాటోద్యోగములో తిక్కన చేసిన కొన్ని మార్పులు ఆయా పాత్ర ముల చిత్రీకరణకు, సహజత్వనిరూపణమునకెట్లు తోడుపడినవో చర్చింపఁ బడినది.

---

సూచికలు :—

1. "యమునంశమున బుట్టి నధిపతి ధర్మరాజుడు", భారతము - ఆది పర్వము 3-84,
2. తిక్కన కావ్య శిల్పము-డా॥ కేతవరపు రామకోటి శాస్త్రి. పుట423
3. ఆంధ్ర మహా భారతము - విరాటపర్వము. ఆ.1-54ప.
4. ఈ శ్లోకములు దాక్షిణాత్య ప్రతులన్నింటిలో నున్నవి. కనుక తిక్కన చూచియుండవచ్చును. కాని పూనా భండార్కర్ ప్రతిలో ఇవిలేవు. అవకాశమున్నను, మూలమునందున్నను తిక్కన ద్రౌపది విషయమున అంగాంగ వర్ణనను గ్రహింపఁడనుట కివి పేర్కొనఁబడినవి. ఈ శ్లోకములను ప్రక్షిప్తముగా నెంచవచ్చును.
5. ఆంధ్ర మహా భారతము - ఉద్యోగపర్వము - ఆ 3. ప. 187
6. ,, - 5-4-18
7. ,, - 4-2-22
8. ఆంధ్ర భారత విమర్శనము-కోరాడ రామకృష్ణయ్య పుట. 296
9. ,, ,, ,, 297
10. ,, ,, ,, 298

11. ఆంధ్ర భారత విమర్శనము–కోరాడ రామకృష్ణయ్య పుట. 298

12. ,, ,, ,, 299

13. ,, ,, ,, 302

14. ద్రౌపది కీచకుని యింటికి పొమ్మనగానే పోదని సుధేష్ణకు తెలుసు అందుకే గట్టి నెపం ఆలోచించి 'ఒదవెడు తృష పెల్లిదమున వదనము వరువట్లు పట్టె' నని మొదటనే సూచించింది. ఇంకా ద్రౌపది కదిలే సన్నలు కనిపించలేదు. ఆమెను చేరదీసి జుట్టు దువ్వినట్టుగా మాటలు దిగుమతి చేసింది. వారుణి కీచకుని యింట్లో మాత్రం ఎప్పుడూ ఉంటుందనే నమ్మకం ఏముందని ద్రౌపది ప్రశ్నిస్తుందని 'కీచకునియింట నెప్పుడుండు'ననీ, అందులో అలాంటిదీ ఇలాంటిదే కాదు. 'వాచవి యగునది కలదునీ, మొగం మొత్తేట్లుగా ఒకేరకమైనది కాక 'బహువిధముల వారుణికల్గు' ననీ, పుంఖానుపుంఖంగా ఒక్క వాక్యంలో ఇన్ని సమాధానాలు గుప్పించినది. తన తృష్ణాధిక్యాన్ని బలపరచడానికి 'వేచని యిచటికి కొని' రమ్మన్నది. ఇంతవరకు మాట్లాడిన దంతా తన దప్పి గురించియే. సైరంధ్రికి సంతోషం కలిగించేమాట ఒక్కటైనా పడలేదే. వెంటనే అందుకున్నది : 'చూతముగాని నీ గమన వేగంబున్'—తన పని నెగ్గించుకోవడానికి ఎదుటివారిని ఎట్లా దువ్వవలెనో సమగ్రంగా ఒంట జీర్ణించుకున్న ఉక్తియిది. ఇట్లాంటి సహజ రమణీయాలైన సంభాషణలు రచించడమంటే తిక్కన్నకు నల్లేరుపై బండినడక.

—'కవిత్రయ కవితా వైజయంతి' — డా॥ సి. నారాయణరెడ్డి వ్యాసం –పుట. 199



# రసాభ్యుదయము - రసోల్లాసము

భారతమునకు ప్రతిపర్వరసోదయమన్న ప్రసిద్ధి కలదు. భారతమొక చెఱుకు గడయైనచో పర్వమొక గణుపు. గణుపుకొట్టి చెఱుకుగడ తినుట లోకమున ప్రసిద్ధము. భారతమునందలి పర్వములనెడి పదునెనిమిది గణుపులలో ఆశ్వాసాంత పద్యములు గణుపుల ముడుల వంటివి. వానిని వదలినచో మిగిలిన భాగమంతయు ఆస్వాదనీయమయ్యెడిదే. విరాటోద్యోగ పర్వములందలి రసవిషయమును సమీక్షించునపుడు సర్వదృష్టి (అంగిరస సమీక్ష) ప్రధానమైనను, దానికంగమైన పర్వదృష్టి (పర్వరస సమీక్ష) ప్రస్తుతమగుచున్నది.

## ఆంధ్రభారతము కావ్యేతిహాసము :

తిక్కన భారతమును ఇతిహాస రత్నమని సంభావించెను.[1] మఱియు ప్రబంధమండలి[2] యనియు, పుణ్యప్రబంద మనియు[3], మహాకావ్య[4] మనియు సంలక్షించెను. భారతమితిహాసమయ్యును తిక్కన దానికి మహాకావ్యస్వరూపమును కల్పించుటకు సంకల్పించెననుట పై మాటలవలన స్పష్టమగుచున్నది. వెనుక చెప్పినట్లు 'శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయి' అయిన సంస్కృత మహాభారతమును 'కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయి' గా తిక్కన తీర్చిదిద్దినాఁడనుట నిర్వివాదాంశము.

ఇతిహాసమొక కావ్యప్రభేదమని ప్రాచీనలాక్షణికులు భావించిరి. భోజుఁడు సరస్వతీకంఠాభరణమున "కావ్యం శాస్త్రేతిహాసౌచ కావ్య శాస్త్రం తథైవచ కావ్యేతిహాసం శాస్త్రేతిహాస స్తదపిషడ్విధమ్"[5] అని కావ్యములను విభజించెను. నిజమునకు కావ్య శబ్దము రెండువిధములుగా కానవచ్చుచున్నది. ఒకటి సర్వకవితాప్రక్రియా సామాన్య మైనది. రెండు మహాకావ్య ప్రక్రియకు సంబంధించినది. మహాకావ్యమునే 'కావ్య' మందురు. మిగిలిన

వానిని తత్తదవస్థాభేదములచే పిలిచెదరు. ఇతిహాసము కావ్యభేదమనునప్పు డచ్చట కావ్యశబ్దము సర్వకవితాప్రక్రియా సామాన్యవాచి. "ఇమ్మహా కావ్యంబు", "ప్రబంధమండలి" ఇత్యాదిపదములు విరాటపర్వారంభమున తిక్కన చెప్పి ముగింపులో నితిహాసమనుచున్నాఁడు. ఎత్తుగడలో తిక్కనదృష్టి చెప్పబడినది. ముగింపులో భారత మూలస్వభావము పేర్కొనఁబడినది. ఇట్లగుటచే తిక్కన తెలుగుభారత సర్వదృష్టికి సూచకమైనది ఇతిహాసమునందలి మహాకావ్యత్వము. పర్వదృష్టికి సూచకమైనది ప్రబంధమండలీ దర్శనము. ఈ రెండు దృష్టులకును పోష్యపోషక సంబంధమే కాని వైరుధ్యము లేదు. అంగికి సమర్థములైన అంగములను సన్నద్ధము చేయుటయే "ప్రబంధ మండలి" పరమార్థము.

భోజుని విభాగమునననుసరించి కావ్యము శాస్త్రముతోడను, ఇతిహాసము తోడను, శాస్త్రము ఇతిహాసముతోడను మిశ్రమై కావ్యశాస్త్ర, కావ్యేతిహాస, శాస్త్రేతిహాస రూపములేర్పడుచున్నవి. అందు కావ్యేతిహాసమునందు కావ్య స్ఫూర్తి అధికముగా నుండును కావున తిక్కన భావించిన మహాకావ్యత్వ స్ఫూర్తి కలిగిన ఇతిహాసము కావ్యేతిహాసమనుటలో విప్రతిపత్తి యుండఁ బోదు. ఈ వివేచన విద్వాంసులకు సమ్మతమే.[6]

## ఇతిహాసగతి : బహునాయకవాదము :

రాజశేఖరుఁడితిహాస గతిని పరిక్రియా, పురాకల్ప భేదముచే రెండు విధములని పేర్కొని వానికి రామాయణ భారతములుదాహరణములుగా చెప్పెను. ఏక నాయకము రామాయణమనియు, బహునాయకము భారత మనియు ఆతఁడు వివేచించెను.[7] రాజశేఖరుని భావమును సమన్వయించు కొనుటలో విమర్శకులమధ్య అభిప్రాయ భేదములు కలవు. భారతము బహు నాయకమను రాజశేఖరుని అభిప్రాయము భ్రాంతిమూలకమనియు, అన్వయ క్లిష్టమనియు, రసవిరుద్ధమనియు భావించి త్రోసిరాజనినవారు కలరు. న్యాయమీమాంసా దర్శనములననుసరించి మహాభారతేతిహాస స్వరూపమును సమన్వయించిన వారును కొందఱు కలరు.[8]

రాజశేఖరుఁడు రామాయణము నేకనాయకమనియు, భారతమును బహునాయకమనియు తలంచుటలోని తాత్పర్యమును మఱికొంత భావింప వలెను. ఆయన చెప్పినది "ఇతిహాసగతిర్ద్వధా" అని ఇందులోని గతి శబ్దము గమనింపఁదగినది. ఇతిహాసకథాగతికి ఏకనాయక (ఒకనాయకుని) కార్యవృత్తమే పురోగతిని సాధించినచో దానిని ఏకనాయకమనవచ్చును. రామాయణమున రాముఁడు నడిపినదే కథ ఇఁక భారతమున పాండవపంచకము సమష్టిగను, వ్యష్టిగను కార్యసాధనపరులై ఇతివృత్తమును ముందుకుసాగించినారు. అది పాండవులు నడిపిన కథ. రామాయణమున రామునకు తమ్ములు ముగ్గురున్నారు. వారు రామశాసనబద్ధులే. కాని రామకార్యమే వారి కార్యము. రాముఁడు స్వయముగ ధర్మమూర్తి. క్రియాశక్తి. అతఁడు కోదండమును గ్రహించి ముందు నడచును. ఆ వెనుక ఎవరునడచినను అతని నీడలే అనిపించుకొందురు. భారతముననట్లుకాదు. ధర్మజునకు నలుగురు తమ్ములున్నారు. ఆ నలుగురిలో ఇద్దఱొకపద్ధతి వారు. మఱి ఇద్దఱొక పద్ధతివారు. ధర్మజుఁడు ధర్మమూర్తి. లోకమున విశుద్ధధర్మము నీతిమార్గము ననుసరించి ఎట్లు ప్రవర్తింపవలయునో ప్రపంచించెడి ప్రజ్ఞామూర్తి ధర్మరాజు. జ్ఞానరూపమైన ధర్మము వ్యక్తిగా జాలువారినచో ధర్మజుఁడగును. ధర్మము దీపమువంటిది. దీపమును గాలినుండి రక్షింపవలెను. రక్షించినచో అది వెలుగునిచ్చును. 'ధర్మో రక్షతి రక్షితః' అట్లగుటచే ధర్మజుఁడు రామునివలె స్వయముగా క్రియాశీలుఁడు కాఁడు. అనుజ రక్షితుఁడు. కవలలాతనికి కవచతుల్యులు. భీమార్జునులు అతని కార్యప్రవృత్తులు. ధర్మజోద్దిష్టమైన పురుషకారము భీముని పరాక్రమము, అర్జున గాండీవపాండిత్యము. భీమార్జున శక్తులలో ఒకరిది మానుషశక్తి. మఱియొకరిది దైవికశక్తి. నరునకు నారాయణుఁడండగా నుండుటచే అతనిది దైవశక్తి అయ్యెను.౨ ఇట్లు భారతమున కార్యప్రవృత్తి అంతయు భీమార్జునుల నాశ్రయించి నడచుచుండగా ధర్మప్రవృత్తియంతయు ధర్మజునాశ్రయించి వర్తిల్లుచున్నది. ప్రజ్ఞచే ప్రేరితమైన పరాక్రమము ధర్మజానుజుల పరాక్రమ తాత్పర్యము. ధర్మజుఁడు రామునివలె కోదండము పట్టి నడచువాఁడు కాఁడు కావున గదాగాండీవములను పట్టి నడచు భీమార్జునులకు యుద్ధరంగమున నాయకత్వము శోభించుచున్నది. ఉదాహరణమునకు విరాట పర్వమున కీచకవధ చేసినవాఁడు భీముఁడు. ఉత్తరగోగ్రహణమున

విజయ సాధకుఁడు అర్జునుఁడు. "నయతి వృత్తం ఫలం ప్రాప్నోతిచ" 10 అని నాయక లక్షణము కదా! వృత్తమును నడపువాఁడు, ఫలమునను భవించు వాఁడు నాయకుఁడు. పై రెండు ఘట్టములలో ధర్మరాజు అనతిలేకయే భీమార్జునులు స్వతంత్రముగా వర్తించిరి కదా! అయినను వారి స్వతంత్రవర్తనము ఒక ధర్మరక్షణము కొఱకే. ధర్మరక్షణమే ధర్మరాజు రక్షణము. ధర్మజుఁడు అగ్రజుఁడుగా తమ్ములను భౌతికముగా శాసించును. ఒక వర్తనముగా తమ్ముల శీలమును శాసించును. తమ్ముల చేతలలోని ధర్మశీలము కూడ ధర్మరాజే. ధర్మరాజు ఎంతవ్యక్తియో అంతశక్తి. అతని నీతిశక్తి ఉద్యోగపర్వమున ఉన్మీలించినది. అతని నీతిసారమునకు నిండురూపమును కల్పించినవాఁడు శ్రీకృష్ణుఁడు. శ్రీకృష్ణునియందు శక్తియుక్తులు రెండును కలవు. అందుచే ఉద్యోగపర్వమంతయు శ్రీకృష్ణుఁడు ప్రకటించిన నీతిపర్వము వలె కానఁబడును. కాని కృష్ణనీతి ధర్మజమూలమైనది, ఇట్లు ఉద్యోగపర్వము నందు కూడ ధర్మజుఁడేక ప్రజ్ఞామూర్తివలెను, శ్రీకృష్ణుఁడు దానికి ప్రయోక్తవలెను, భాసింపవచ్చును. రామాయణమున రాముఁడు తాను ముందు నడచుచు కథను తనవెంట నడిపించును. కథతోపాటు అతని తమ్ములును నడచుచుందురు. భారతమున ధర్మజుఁడు తాను కూర్చుండి కథనడిపించును. కథనడపు వారాతని తమ్ములు, గోవిందుఁడు. కూర్చున్నవాఁడు సూత్రధారి, కార్యకర్త పాత్రధారి. ఇట్లగుటచే ధర్మజునితోపాటు ఆయా కార్యరంగములందు భీమార్జునశ్రీకృష్ణాదులు నాయకులుగా కథను ముందుకు నడపుచు తత్తత్కార్యములను సాధించుచున్నట్లు భాసించుచుండుటచే భారతేతిహాస కథాగతి బహునాయకలచే ప్రవర్తిల్లుచున్నదని రాజశేఖరుఁడు భావించియుండును.

ఈదృష్టితో గమనించినచో భారతమున యుద్ధవీరులైన భీమార్జునుల వ్యక్తిత్వములను, నీతి చతురుఁడైన శ్రీకృష్ణుని ప్రజ్ఞావిశ్వరూపమును దర్శించుటకు మణిదర్పములవలె భాసించెడి మనోజ్ఞపర్వములు విరాటోద్యోగములు. తిక్కన 'నానారస భ్యుదయోల్లాసి' అని చెప్పుటలోని అంతరార్థము నరసి చూచినచో అంగినాయకుఁడైన ధర్మజునాశ్రయించిన స్థాయిభావము పూసలలో దారమువలె సాగుచుండగా అనునాయక, ఉపనాయకుల యొక్క

ఉజ్జ్వల కార్యసాధనప్రవృత్తులు అంగ రసాభ్యుదయోల్లాసములుగా ఈ పర్వములందు సాధింపఁబడుచున్నవని సంభావింపవచ్చును. స్త్రీ పర్వము ముగియువఱకు కూడ ఇట్టి రసపోషణ విధానమే సాగుచుండును. నానా రసాభ్యుదయోల్లాసమంతయు, కథాగతికి ప్రవాహతుల్య ఫలభోక్త అయిన ధర్మజునియందు. 'నదీనాం సాగరోగతిః' అను న్యాయము ననుసరించి సంగమించుచున్నది. 'సచివాయత్త సిద్ధి' యైన పురుషుఁడు నాయకుఁడైన ఏ కావ్యమునందైనను రససమన్వయమిట్లే యుండును.

## నాయక చిత్తవృత్తి : అంగిరస ప్రవృత్తి

కావ్యేతిహాసముల యందలి రసస్థితినిగూర్చి డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారు ఈ క్రింది విధముగా భావించిరి. "వస్త్వైక్యమును బట్టి రస సాంద్రతయుండును. ఇతిహాసమున నేకవస్తువు పలుచగా పరచబడియుండును, అందువలన రసమును నంతే. కావ్యమునందున్న రససిద్ధివంటి సిద్ధి ఇతిహాసముననుండదు. నాటకమునందున్న రససిద్ధి ఒక విధముగా కావ్యమునందే యుండదు. ఆ లెక్కను జూచినచో ఇతిహాసము సంపూర్ణమైన రససృష్టి కాజాలదు. కనుక ఇతిహాస విమర్శన మధికముగా కథాకథనము, ఉపాఖ్యానములు, ప్రధాన పాత్రలు, అలంకారములు, మొదలైన వాటితోనున్న రచనయందలి యౌచిత్యము-ఈ విషయముల మీద పోవలయును. ఇతిహాసమున ప్రధానకథ మధ్యమధ్య తెగిపోయి, మరల అందిపుచ్చుకొనబడుచుండుట మూలముగా పరిమితమైన పరిధిలో నున్నయెడల తెగని వస్తువుతోడి కావ్యమునందువలె, అంగిరసమును ధ్వన్యాత్మకముగా నిర్వహించుట కవకాశము లేదు. ఏమాత్రమవకాశమున్నను శాస్త్రము ప్రవర్తించుట మూలముగా, దానినుండి ప్రధానేతివృత్తమునందలి రసస్వరూపమును వేరుగా చూపుట కితిహాసకర్త రసమును వాచ్యము చేయకతప్పదు. తిక్కన గారు రసమును తరచు వాచ్యము చేయుచుండునని చెప్పటగలదు. కావ్యమునందది దోషమేయైనను, నితిహాసమున దోషముకాదు. కనుకనే తిక్కన గారట్లు వ్రాయుచుండుట. రసమును శబ్దముచేత పేర్కొనినచో కనీసమపుడా భావమైనను కలుగును. భారతము ముఖ్యముగా శాస్త్రేతిహాసము. వీలైనంతవరకు దానిని కావ్యేతిహాసముగా చేయుటకు కవిత్రయము వారు యత్నించిరి. అధిక భాగము తిక్కనగారి వలననైనది.[11]

మూలమునందు మందముగానున్న రసస్థితిని సాధ్యమైనంత సాంద్ర తర మొనర్చుటయే తిక్కన సాధించిన రసశిల్పమని శాస్త్రిగారి అభిప్రాయము. ఇది సత్యమే. అయినను ఇందు వివేచింపదగిన అంశము మఱియొకటి కలదు. భారత కథకు, నాయకుడైన ధర్మజునివలన అతని స్వభావములోని కొన్ని లక్షణములలవడుచున్నవి. అతనియందు ప్రధానముగా కానవచ్చు నది ధర్మచింత. సర్వజీవిత ప్రవృత్తియు దానికంగభూతము. ధర్మ జిజ్ఞాసువైన నాయకుని వృత్తాంతమునందు ఆచరణమునకంటె ఆలోచనయే అధికముగానుండును. ఆలోచనలో సంశయములు పుట్టుట, వానిని నివృత్తి చేసికొని నిశ్చయజ్ఞానమును పొందుట కానవచ్చుచుండును. ధర్మసంస్కార సాధన రూపమైన మానసిక వ్యాపార ప్రవృత్తి ధర్మజుని సహజలక్షణము. అతని చిత్తపరిపాకమును సిద్ధమొనర్చుటకు భారతమునందు ధర్మోపదేశో పాఖ్యానాదులు ప్రవర్తిల్లినవి. ఒక మానసిక వ్యాపారమునందలి మహ నీయ వికాసమును వ్యంజింపఁజేసెడి కథాప్రవృత్తిని నిర్మించుటకాని, ధ్వనిమార్గము నాశ్రయించి నాయక చిత్తస్థితిని సంభావించుకొని రసస్థితి నొందుటగాని సామాన్యమైన విషయము కాదు.

ధర్మజుఁడు ధర్మసంస్కారమును సాధించుట ఒక ఎత్తు, ధర్మనీతి వర్తనమును వెలయించుట మఱియొక ఎత్తు. రాజనీతిని ధర్మదండముతో సాధించుట సంశ్లిష్టమైన విషయము. అట్లగుటచే ధర్మజుని హృదయగతి ఎల్లప్పుడును ధర్మ నియతిచే శాసింపఁబడుచుండును. కాని అందు విశుద్ధ ధర్మోత్సాహము వినిర్మలముగా ప్రకాశించుచుండును. అతని మనోవీథిలో భాసించు రసభావములన్నియు శుద్ధసాత్త్విక ప్రవృత్తి నాశ్రయించి యుండుటచే పఠితకు మజ్జనోన్మజ్జన స్థితిని కలిగించును, అట్టి స్థితి భీమార్జు నాదుల వృత్తములవలన భాసించును. ధర్మజుఁడు వారాశి. అందలి ఉత్తాల తరంగములు భీమార్జున గోవిందులు. తరంగవిస్ఫూర్తి సాగరప్రవృత్తికి పోషకమే కాని భంజకము కాదు. ఇట్లే ధర్మజునాశ్రయించిన స్థాయి భావమునకు భీమాదులగు అనునాయకులను, శ్రీకృష్ణాదులగు ఉపనాయ కులను ఆశ్రయించిన నానా రసాభ్యుదయోల్లానము పుష్టి కల్పించుటకే వర్తిల్లినదని గ్రహింపవలెను. అనునాయకాదుల రసభావప్రవృత్తి అనుకూల

మార్గమున అంగిరసస్థాయిని పోషించుచుండగా ప్రతి నాయకునియొక్కయు, తత్సహాయకుల యొక్కయు రసభావ సందీప్తి నాయకాశ్రితమైన స్థాయిని ప్రతికూల మార్గముననుసరించి పోషించును. విరాటపర్వము మొదలు స్త్రీ పర్వము వఱకు కథ కార్యశీలమై భాసించును. ఆపై చిత్త సంస్కారమును పండించుకొని పురుషార్థసాధన శీలమును నాయకుఁడు ప్రదర్శించిన వైఖరిని వ్యాఖ్యానించును. మొదటి భాగమున వీర, రౌద్ర, కరుణ, శృంగారాది ప్రసిద్ధ రసముల యొక్క ప్రకృష్టప్రదర్శనము ప్రత్యక్షమగును. ఉత్తర భాగమున ధర్మనియతిని స్థిరీకరించెడి శోక, శమన, రాజ్యపాలన, స్వర్గ సాధన ప్రవృత్తులు పరిపోషింపఁబడినవి. పూర్వభాగమున రసపోషణమునకు మందస్థితియే లేదు. ఇఁక శాంతి పర్వమునుండి మాత్రము రసస్థితి జిజ్ఞాస మార్గమున నడచి సత్వస్థితిని సాధించినది. మొదటిది స్థూలదృష్టి కైనను అందునది. రెండవది సూక్ష్మదృష్టితో వివేచింపఁదగినది. ఒకటి ఆచరణ ప్రధానమైనది. రెండవది ఆలోచన ప్రధానమైనది. ఇట్టి భిన్న ప్రవృత్తులు కలిగిన కథాఘట్టముల సంయోజనస్థితి భారతమున నాయకుని చిత్త సంస్థితివలననే ఏర్పడుచున్నదని గమనించుట అవసరము. ఉదాహరణమునకు విరాటపర్వ కథ ధర్మజుని సమయ పాలన, ధర్మోత్సాహమునకు రస దర్పణమువంటిది. ఉద్యోగపర్వమతని ధర్మనీతి ప్రయోగమునకు పాశుపతమువంటిది. నీతి ధర్మబద్ధము కానిచో శ్రీకృష్ణుని రాయబారపు ఘట్టమే లేదు. ఇట్లు నాయకచిత్తవృత్తి సూత్రము ననుసరించి ప్రవర్తిల్లెడి సర్వపర్వసన్నివేశ కథా సూత్రప్రగతి నాయకాశ్రితమైన[12] అంగిరస ప్రవృత్తికి ఆకృతి నందించు అంగవిస్ఫూర్తియే కాగలదు.

## అంగిరస వాదములు : అన్వయభేదములు :-

ఒక కావ్య రస వివేచనము చేయునెడ అందలి అంగాంగిరసముల వివేచనము మొదట అవసరము. అందు అంగిరసమును నిర్ధరించి అంగరసముఁలచే నది ఎట్లు పరిపుష్టమైనదో పరిశీలించుట అందు పాటించెడి విధానము. మహాభారతమున అంగిరసము శాంతమనియు, ధర్మవీరమనియు రెండు వాదములు కలవు. శాంత రసవాదము ప్రాచీనము. ధర్మవీరవాదము నవీనము. ఆనందవర్ధనాచార్యులచే ధ్వన్యాలోకమున భారతము శాంతరసప్రధానమని

వివేచింపఁబడినది.[13] "తతశ్చ శాంతోరసోరసాంతరై రోమ్రతులక్షణః పురుషార్థః పురుషార్థాంతరై రుపసర్జనత్వేనానుగమ్యమానః అంగిత్వేన వివక్షా విషయః ఇతి మహాభారత తాత్పర్యం సువ్యక్తమేవ భాసతే" అని ఆనందవర్ధనాచార్యుల నిష్కర్ష. వారీ శాంతరస నిర్ణయమును ముముక్షు దృక్కోణములో నొనర్చిరి. కార్ష్ణ వేదమైన మహాభారతమును చదివిన ముముక్షువు వృష్ణి పాండవ విరసావసానమును గమనించి నిర్వేదమూలకమైన వైరాగ్యమును పొంది భారతమునందలి మోక్ష పురుషార్థ ప్రతిపాదకమైన తత్త్వము నాశ్రయించి బ్రహ్మజ్ఞానమును సాధించి తద్ద్వారమున బ్రహ్మానందమును పొందునని ఆనందవర్ధనాచార్యులు నిర్దేశించిరి.[14] మహాభారత తత్త్వ విచక్షణులైన ముముక్షువులకందెడిది బ్రహ్మానందము కావచ్చును లేక సబ్రహ్మచారియైన శాంతరసానందము కావచ్చును. సహృదయులందఱు ముముక్షువులనుటకు వీలులేదు. వారు రసోపాసకులు. నాయకునాశ్రయించి ప్రతీయమానమగు అంగిరసమును భావించి తన్మయులై రసస్థితినొందు సాత్త్విక చిత్తవృత్తులు సహృదయులు. కావ్యమిచ్చెడి ఆనందము రసము. కావ్యమిచ్చెడి సంస్కారము ఉపదేశము. ఉపదేశము వ్యుత్పత్తిగా పరిణమించి బుద్ధిని వికసింపఁజేయును. జ్ఞానోన్మీలనము కావించును. రసము అనుభూతిని కల్గించి హృదయమును ద్రవింపఁజేసి అవ్యక్తమాధుర్యమును చవి చూపించును. సహృదయుల దృష్టితో మహాభారతమున అంగిరసము ధర్మవీరమనియు ముముక్షువుల దృష్టితో మహాభారతము శాంతరస ప్రధానము కావచ్చుననియు, కాని ముముక్షువుల దృష్టి సహృదయ సామాన్య దృష్టి అనుట సంభావ్యము కాదనియు డాక్టర్. జి. వి. సుబ్రహ్మణ్యం భావించిరి.[15]

మహాభారతమునందలి అంగిరసమును నాయకజీవితముతో సమన్వయించి చెప్పెడివారు కొందఱున్నారు. మహాభారతమున నాయకుఁడు శ్రీకృష్ణుఁడని కొందఱును, ధర్మరాజని పలువురును భావించుచున్నారు. ధర్మజునాశ్రయించి శమ స్థాయి భావము పోషింపఁబడినదనియు అందువలన మహాభారతము శాంతరస ప్రధానమనియు పలువురు పండితులచే సంభావింపఁబడుచున్నది.[16] ధర్మజుని నాయకత్వమంగీకరించియు మహాభారతము

ధర్మవీరప్రధానమని స్థాపించుచున్నారు డా. జి.వి. సుబ్రహ్మణ్యంగారు.[17] వీరు ఆనందవర్ధనుని రసనిర్ణయపద్ధతిని ధర్మరాజు నాయక వాదపద్ధతిని ఆశ్రయించియే మహాభారత శాంతరసవాదమును సవిమర్శకముగా వ్రాసి రాజనిరి. డా॥ శలాక రఘునాథశర్మగారు సుబ్రహ్మణ్యంగారి వాదమును ఖండించుచు శాంతరసమంగిరసమని తమ సిద్ధాంత వ్యాసమున నిరూపించిరి.[18]

నేనీ ముగ్గురి వాదములను సావధానముగా చదివి మననము చేసికొనుటకు ప్రయత్నము చేసితిని. ఇచ్చట నాకు స్ఫురించిన అంశములివి.

(1) ముముక్షువుల దృష్టితోఁజూచినచో సంస్కృత మహాభారతము శాంతరస ప్రధానమనుటలో ఎవ్వరికి ఎట్టి సంశయము నుండఁబోదు.

(2) సంస్కృత మహాభారతము ప్రధానముగా శాస్త్రరూపము కలది. "శమార్థం సర్వశాస్త్రాణినిర్మితాని మనీషిభిః" అను న్యాయము చొప్పున శాస్త్రరూపమైన భారతము శమార్థమై నిర్మింపఁబడినది అనవచ్చును. అనినను దోషములేదు.

(3) మూల భారతమును కవిత్రయమువారు తెలుఁగున కావ్య రూపమైన ఇతిహాసముగా సంతరించిరనునది సకల పండిత జనామోదమైన సత్యము. అయినచో ఈ మార్పువలన ఆంధ్ర భారతమునకు కలిగిన గౌరవ మేమి ? మూలమునందలి తత్త్వవిషయములు తెలుఁగున రసపోషణకనువుగా సంగ్రహింపఁబడినవి. తెలుఁగు భారతమున శాస్త్రదృష్టి గౌణము. కావ్యదృష్టి ప్రధానము. శాస్త్రము నధికరించి మూలభారతము శాంతమైనచో నాయకరసభావముల ననుసరించి ఆంధ్రభారతమున అంగిరస నిర్ణయము చేయుటయే సమంజసము.

(4) నాయకుఁడైన ధర్మరాజునందు యుద్ధము ముగియువఱకున్న చిత్తవృత్తి ఒకటి అనియు, ఆ తర్వాత నేర్పడిన చిత్తవృత్తి మఱియొకటి యనియు మొదటిది ధర్మోత్సాహ ప్రధానమైనను, రెండవది శోక మూలముగా నేర్పడిన శమప్రవృత్తియనియు పై విమర్శకులలో శాస్త్రిగారు

వివేచించినారు. శాంతి పర్వాదులలో ధర్మజునకు శోకశాంతియైనను, అతని మనము జ్ఞానము నాశ్రయించి నివృత్తి మార్గమున ప్రసరించలేదనియు, కర్మమార్గమునననుసరించి ప్రవృత్తి ధర్మమును భజించెననియు సుబ్రహ్మణ్యం గారు వివేచించినారు.[19] ఈ రెండు వాదములకును మూలప్రశ్న ధర్మజుఁడు పొందినది మోక్షమా కాదా అనునది. శాస్త్రిగారుధర్మజదేహవిముక్తియే మోక్ష మనిరి, శర్మగారు యమధర్మరాజులో నైక్యమొందుట మోక్షమనితలంచిరి. సుబ్రహ్మణ్యంగారి వాదములో ధర్మజునకు మోక్షసిద్ధి లేదు. ధర్మసాధనకు ఫల మైన సశరీర స్వర్గగమనమే అతనిజీవితమునకుఫలము. వీనినిపరిశీలింప ధర్మజుఁడు పొందినది మోక్షమనుటకు తగిన ఉపపత్తులు పై ఇద్దఱి వాదములలో కానఁ బడుటలేదు.' కాని ధర్మజునకు మోక్షజ్ఞాన ప్రబోధము చేయఁబడినది. అది అతని సంస్కారమునకు ఉపయోగపడినంతగా అతని సాధన కుపయోగపడినట్లు కథలో కానవచ్చుటలేదు. శర్మగారన్నట్లు ఫలాపేక్షలేని కర్మగాని, అశ్వ మేధయాగమున దక్షిణగా భూమినంతయు నిచ్చుటగాని, చివఱకు స్వర్గా రోహణము చేయుటగాని ధర్మజుఁడు నిర్వహించిన ఆశ్రమ ధర్మ కర్మము లగునే కాని వైరాగ్యజనితమైన సన్న్యాసము మాత్రము కాదు. ధర్మజుఁడు సదసద్వివేచన కొఱకై జ్ఞానమును గడించెనే కాని మోక్షసాధనకు గాదు. యమధర్మరాజు నంశమున జన్మించిన ధర్మరాజు ధర్మసాధనకై పుట్టినవాఁడు, అతఁడవతారపురుషుఁడన్నను ధర్మ సముద్ధరణమే అతని జీవిత వ్రతమగును. ధర్మమునకొక పరమార్థముండవలదా అదియే మోక్షమని శర్మగారి వాదము. సమగ్ర ధర్మసాధనయే జీవితవ్రతముగా సాగించెడి కర్మవీరులు లోకమున నున్నారు. వారికి తమ ధర్మనీతి వర్తనమునకు ఫలమేమి అన్న చింతలేదు ధర్మము జ్ఞానపూర్ణమై సమగ్రసిద్ధిని తమ జీవిత ప్రవృత్తిలో ప్రతిఫలింపవలె ననియే వారి తాత్పర్యము. మోక్షలక్షితుఁడైన వానికి ఇట్టి ప్రవృత్తి శీలముండదు. మోక్షజ్ఞానము తెలిసినంత మాత్రమున ధర్మవీరుఁడు విరక్తుఁడు కావలసిన పనిలేదు. ధర్మజుఁడు ప్రభువగుటచే అతనికి ధర్మము జీవలక్షణము. కాని అతనికి కర్మ, భక్తిజ్ఞానములను గూర్చిన వివేచనముండవలెను. అది లేనిచో ధర్మశాసనము నిష్కళంకము కాజాలదు. అందువలన ధర్మజుని ధ్యేయము నిష్కళంక ధర్మ సాధనమే అనునట్లు స్ఫురించుచున్నది. దేవాంశ లలోని నిజరూపస్థితియందు నిలచుటయే మోక్షమైనచో కర్ణాదులు పొందిన.

కూడ మోక్షమేయగునేమో. ధర్మజుఁడు ఆకాశగంగయందు మునిగి దేహమును త్యజించి యమధర్మరాజులో లీనమైనాఁడు. కర్ణుఁడు రణరంగమున తనువునువీడి సూర్యునియందు లీనమైనాఁడు. కావున ధర్మజుఁడు మోక్షమును పొందెననుటకుగాని, అతని మోక్షజ్ఞానము శమవృత్తిని కలిగించిన దనుటకు కాని శాస్త్రి, శర్మ గారల వాదములలో ఇంకను సమగ్రములైన ఉపపత్తులను వెతకవలసి యున్నది.

(5) డా॥ రఘునాథశర్మ గారు ధర్మవీర వాదములోని కొన్ని అంశములను సక్రమముగా నర్థము చేసికొనినటుల కానరాదు. చివఱకు అంగిరస నిర్ధారణము చేయుచు "స్వస్వరూపానుసంధానమునకై ఆతఁడు (ధర్మజుఁడు) భువియందును దివి యందును పడిన పాటులు సహృదయునకు ఐహికాముష్మికసుఖాపేక్షను తుంచివేయును. పారమార్థికానందాపేక్షను పెంపొందించును. ఇట్టి స్థితి ధర్మరాజాలంబక మగు నిరభిమానాత్మకమైన తృష్ణాక్షయరూప స్థాయి భావమువలననే సిద్ధించును. కావున మహాభారతము సంస్కృతమునందువలె తెలుఁగునను శాంతరసాంగిత్వమునే గ్రహించి యుండుట ఇందుమూలమున స్పష్టమగుచున్నది." 20 అని ఆనందవర్ధన మార్గానుసారముగా ధర్మజనాయకత్వము నంగీకరించి రససమన్వయము చేసినారు. సమన్వయమంతయు శ్రద్ధగ పరిశీలించినచో ధర్మజుఁడు స్వస్వరూపానుసంధానమునకై సంకల్పించి, యత్నించి, సాధించిన విధమును వారింకను నిరూపింపవలసియే యున్నదని తోచుచున్నది.

(6) శాంతరసవాదులందఱును యుద్ధపంచకము వఱకు ధర్మజు ప్రవృత్తిలో ధర్మవీరమే అంగియని పేర్కొనియున్నారు. నా పరిశోధనకు సంబంధించినంతవఱకు విరాటోద్యోగపర్వములే రసవిహారక్షేత్రములు. ఇందలి నానారసాభ్యుదయోల్లాసము ధర్మజుని ధర్మవీరమునకెట్లు పోషకమయ్యెనో పరిశీలించుట ప్రస్తుతాంశము.

## అంగి రసాభ్యుదయము — అంగరసోల్లాసము

భారతమునందలి రసాభ్యుదయమును ప్రధానముగా మూడు కక్ష్యలలో పరిశీలింపవచ్చును. మొదటిది పాండవ జననము మొదలుకొని పాండవ

ద్యూతము వఱకు, రెండవది పాండవ వనవాసము మొదలు కురుక్షేత్ర యుద్ధము ముగియువఱకు, మూడవది శాంతిపర్వమునుండి స్వర్గారోహణ పర్వాంతము వఱకు. మొదటి కక్ష్యలో పాండవరాజసూయము, వారి యందు ప్రకాశించుచున్న రాజతేజమునకు పతాకస్థానము. వారి సంపద పగతుర మాయోపాయముచే వీగిపోయినది. భోగభాగ్యములు పోయినను వారియందు పుట్టుకతోవచ్చిన పరాక్రమము నిలిచినది. మాయాద్యూత సభ లోని శపథములు విస్ఫులింగముల వలె వెలుగొంది భావిపరాక్రమాగ్ని తేజమునకు బీజప్రాయములై భాసించినవి. బలవంతులయ్యు ధర్మమునకు తలయొగ్గుటయే పాండవశీలములోని ప్రధాన లక్షణము. పాండవ బల యుద్ధప్రవృత్తియంతయు, రౌద్రోద్ధతి యంతయు ధర్మవిధిచేత శాసింపఁ బడు సభాపర్వ కథావిధానమును గమనించినచో పాండవోత్సాహమంతయు ధర్మవీర లక్షితమని స్పష్టమగుచున్నది. భారత కథాస్థాయి భావపర్యాలోచ నకు ఈ కథా ప్రగతి యందలి అభ్యుదయసూత్రమే ఆధారము.

రెండవ ఘట్టము సభాపర్వమునందలి ప్రతిజ్ఞలను పాలించెడి ఉద్యోగ ప్రవృత్తియే ప్రధానముగా గలది. మఱల ఈ ఘట్టమును మూడుభాగ ములుగా విభజించవచ్చును. ఒకటి అరణ్య, అజ్ఞాతవాస నియమ పాలనము, రెండు భీమార్జునుల యుద్ధశపథసాధనము. మూడు కురురాజ్యమును వీరభోజ్యముగా పాలించుట. ఇందలి మొదటి భాగమును మఱల రెండు శాఖలుగా వింగడింపవచ్చును. మొదటిది వనవాసము, ఇది అరణ్యపర్వము నందలి కథ. రెండవది అజ్ఞాతవాసము, ఇది విరాటపర్వమునందలి కథ. రెండవభాగము కూడ మఱల రెండు విధములు—అందు మొదటిది రణనీతి మంత్రమునకు సంబంధించినది. అది ఉద్యోగపర్వకథ. రెండవది రణతంత్రము. అది యుద్ధ పంచకమునందలి కథ. ఇట్లేర్పడిన అంతర్విభాగములో విరాటో ద్యోగములయందలి రసపోషణ విధానము ప్రస్తుతాంశము. దీనిని పరిశీలించు టకు పూర్వము అంగి రసప్రవృత్తిని గుఱించి ఒక విషయము ప్రస్తావింపఁ దగి యున్నది.

## ధర్మవీర స్వభావము :

ధర్మము చతుర్విధపురుషార్థములలో ఆద్యము. మిగిలిన మూడింటికి మూలము 'తతోఽర్థ కామయోర్ధర్మమూలకత్వాత్ ధర్మప్రధానోవీరః' అను

అభినవగు ప్తుల వాక్యము 'ననుసరించి ధర్మవిరుద్ధమైన ఉత్సాహము వీరమునకు స్థాయి కాజాలదు. జీవితమునందు ధర్మము సాధ్యము. సాధ్యమైన ధర్మము సాధింపఁదగినది. సాధనలో నిష్ఠురమైన వ్రతదీక్ష, అకుంఠితమైన కార్యదీక్ష అవసరము. నియతితోకూడుకొనిన ఉత్సాహశీలమే ధర్మమునకు సాధనము. అర్థ, కామ, మోక్షములను సాధించుటయందు కూడ ధర్మవీరునియందు ధర్మవిరుద్ధమగు ఉత్సాహము భాసించుటకు వీలులేదు. ధర్మమనునది గహనమైన విషయము. ధర్మసాధనలోనది సాధనమును, సాధ్యమును అగుచున్నది. ఆర్థ సాధనాదులలో నది సాధనమే యగుచున్నది. దాన యుద్ధ వీరాదుల యందు ధర్మము సాధనముగా మాత్రమే భాసించును. ధర్మవీరమునందు తత్సాధన సాధ్యవివేచనము సూక్ష్మబుద్ధితో చేయతగియున్నది. ఇట్టిభేదమును గమనించుటకు విరాటోద్యోగపర్వములు చక్కని దృష్టాంతములుగా కానఁ బడుచున్నవి.

అజ్ఞాత వాసమున పాండవులు సాధించినదేమి అను ప్రశ్నకు సమాధానము నన్వేషించినచో ధర్మముచే సాధింపబడిన ధర్మముయొక్క స్వరూప మవగతమగును. విరాటపర్వమున పాండవులజ్ఞాతవాస వ్రతమును నిర్వహించిరి. దానివలన సాధింపఁబడినది నియమపాలన రూపమైన ప్రవృత్తి ధర్మము. ఈ ధర్మమును సాధించుటకు వారు సేవాధర్మమును స్వీకరించిరి. అజ్ఞాతవిధిని రక్షించుకొనుటకు ఆకృతులను మార్చుకొనిరి. ఆకృతులు వికృతులైనను వారి ప్రకృతులు వికృతులు కాలేదు. ప్రచ్ఛన్నవేషములతో సేవాధర్మమును నిర్వహించుచున్నను ఆశ్రమధర్మమునకు భంగము వాటిల్లనున్నపుడు ఆ విపత్తునుండి అజ్ఞాతవ్రతము భంగము కాకుండగనే తప్పించుకొనవలసిన క్లిష్టపరిస్థితి ఏర్పడినది. కీచకోపకీచక సంహారమును గూఢముగా నిర్వహించుట ఎంత ఆత్మధర్మమో అంత వ్రతధర్మము. దక్షిణోత్తరగోగ్రహణ ఘట్టములందు యుద్ధోత్సాహముల ప్రకటించుటకు ఆత్మధర్మము మూలము కాదుకాని సేవాధర్మము ప్రధానము. అందు పరార్థముముందు స్వార్థము వెనుక నడచినవి. గోగ్రహణఘట్ట సమరము పాండవులు తమకొఱకు చేసినది కాదు.తమ కాశ్రయమిచ్చిన విరాటునికొఱకుచేసినది. కృతజ్ఞతాబద్ధమైన మిత్రధర్మ సేవాధర్మములకు పాండవోత్సాహమంతయు అంగమగుచున్నది. కీచకుని చంపి తమ్ముతాము రక్షించుకొనిరి. కౌరవులనోడించి తమ మిత్రుని రక్షించు

కొనిరి. ఈ రెండును ఎట్టి అర్థకామముల నుద్దేశించి చేసినట్టివి కావు. శుద్ధ ధర్మదృష్టితో చేసినవి. అందువలన పాండవ ప్రవృత్తియందలి ధర్మ సాధనోత్సాహమంతయు ధర్మైకకలశితమగుటచే ధర్మవీరమనఁబడుచున్నది.

వీరరసమునకు మూలరూపము ధర్మవీరమే. తదితర వీరభేదము లన్నియు దాని అవాంతర రూపములే. ఈ అంశమును వీరరస గ్రంథకర్త వివేచించుచు "సలిలమొక్కటియేయైనను ఆవర్త బుద్బుద తరంగ వికార ములచే భిన్నభిన్నాకృతులతో నెట్లు కానఁబడుచున్నదో అట్లే ధర్మానుప్రాణిత ములైన వీరరసభేదములన్నియు తత్తదాశ్రయ నిమిత్త భేదములచే వివిధ నామములతో వ్యవహరింపబడుచున్నవ"ని పేర్కొనెను.[21]

వీరరసమునకు విభావాదులను పేర్కొనుచు భరతుఁడు "ఉత్సాహోఽయం ఉత్తమ ప్రకృతిః సచావిషాదశక్తి శౌర్యాదిభిర్విభావై రుత్పద్యతే" అని నుడివినాఁడు. పాండవులు సేవాధర్మమున నిజతేజమును సంఛిన్నము చేసి కొనిన దైన్యమూర్తులు. ఉద్యోగపర్వమున రాజ్యసంపదలులేని చక్రవర్తులు. కాని వారు విషాదమూర్తులు కారు. తమ దైన్యస్థితిని పోగొట్టుకొనుటకై శక్తి ధైర్యశౌర్యాదులను యథావకాశముగా ప్రదర్శించినవారు. కావున వారు వీరరస విభావములగుచున్నారు. స్థైర్య, ధైర్య, త్యాగ వైశారద్యా [22]దులగు అనుభావములచేత ఉత్సాహమభివ్యక్తమగుచుండును. పాండవుల యందు విరాటపర్వమున స్థైర్య ధైర్యములును, ఉద్యోగపర్వమున త్యాగ వైశారద్యాదులును ప్రకటితములైనవి. ధృతిమతి గర్వోగ్రతామర్షస్మృతి ప్రబోధాదులు సంచారులు. ధర్మజుని యందు ధృతియు, భీముని యందు గర్వోగ్రతాదులును, అర్జుననియందు గర్వామర్ష స్మృతి ప్రబోధాదులును విరివిగా పోషింపఁబడినవి. వెరసి ధర్మోత్సాహము పరిపుష్టమై ఈ పర్వ ములయందు ధర్మవీరమును పుష్టిమంతము కావించుచున్నది.

స్థాయియైన ధర్మోత్సాహము విరాటోద్యోగములలో పొందిన అభ్యు దయము వివేచనా రమణీయము. విరాటపర్వమున పాండవాశ్రితమైన ఉత్సాహమును కీచకుని అధర్మరతి ఢీకొనినది. భీమప్రతీకారమున వీరము రౌద్రమై ఆభాసమైన శృంగారమును అంతమొందించి ధర్మమును రక్షించి

నది. ధర్మప్రవృత్తియైన వీరమునకు అధర్మప్రవృత్తియైన శృంగారము విరోధము. రెండు విరుద్ధ రసముల సంయోజనము జరుగునపుడు కవి రసాంతరమును పోషించి రససమన్వయము కావించును. విరాటపర్వమున భీమరౌద్రము, ద్రౌపది శోకము తిక్కన సుష్ఠుగా పోషించిన రసాంతరములు. ఇట్టి సంయోజనశిల్పముచే అంగి సర్వాంగముగా పరిపుష్టమగుచున్నది. గోగ్రహణఘట్టములందలి వీరరౌద్రములు సమగ్రచైతన్యస్థితిని అంగికి సాధించిపెట్టినవి. ఈ చైతన్యము కురుక్షేత్ర యుద్ధము ప్రారంభమగునంత వఱకు పఠితల మనోరంగములయందు నిలిచి యుండవలెను.

ఉద్యోగపర్వమునందు క్రియాశీలమైన ఉత్సాహముకంటె వాగ్రూపమైన ఉత్సాహ మధికము. అదియును మంత్రగర్భితమై శుక్తిమౌక్తికము వలె భాసించును. ఉద్యోగపర్వములోని ఉత్సాహమంతయు ఉపాయ ప్రయోగ కుశలము. ఇందులో సామోపాయప్రయోగము విస్తారము. అది మూడు రాయబారముల మీద పఱచఁబడినది. ఈ మూడు ఘట్టములు చదువు సరికి సామరూపమంత్రోత్సాహము త్రివిక్రమాకారమై భాసించును. శ్రీకృష్ణుని రాయబారము సామమునందు దాన భేదములను దాచుకొనినది. అట్లగుటచే నది ప్రౌఢతరమైనది. యుద్ధము దండోపాయము. సామదాన భేదములు శ్రీకృష్ణుని రాయబారపు ఘట్టమున విఫలమైనవి. అట్లు విఫలము లగునట్లు నిపుణముగా ప్రయోగించుట యుద్ధోద్యోగములోని ఆయువుపట్టు, దీనిని గుర్తించినచో ధర్మజుని సామవాక్యములోని సారమును, 'ధర్మసూతి మెత్తని పులి' యని సంజయుఁడనుటలోని రహస్యమును శ్రీకృష్ణుఁడు పోరుతప్పదని రాయబారము నడపుటలోని వైఖరియును మనకు తేట తెల్లము కాఁగలవు. క్రియారూపమైన ఉత్సాహము హృదయమును వాగ్రూపమైన ఉత్సాహము బుద్ధిని విశేషముగా నాకర్షించును. మనో బుద్ధులను పర్యాయక్రమమున అలరించెడి ప్రక్రియను రసపోషణ విధానమున పాటించుటయే భారతములోని రసాభ్యుదయ రహస్యము. ఉదాహరణ మునకు సభాపర్వము హృదయాహ్లాది, అరణ్యపర్వము ఆలోచనామృతము. అట్లే మఱల విరాటపర్వము హృదయాహ్లాది, ఉద్యోగపర్వము ఆలోచనా మృతము. మఱికొంత ముందుకు సాగినచో యుద్ధషట్కము క్రియాశీలము, శాంత్యనుశాసనములు బుద్ధిప్రధానములు. అశ్వమేధ, ఆశ్రమవాసాదులు

హృదయప్రధానములు. ఇట్లు 'అంగి రసాభ్యుదయము' మనోబుద్ధులను క్రమముగా రంజింపఁజేయుచు సాగుటచే ద్రుతివికాస రూపమైన సమగ్రతను సాధించుచున్నది. ఇట్టి అభ్యుదయ ప్రస్థానమునకుల్లాసమును కలిగించునవి అంగరసవీచీవిలాసములు.

## ప్రబంధ మండలి :-

తిక్కన భారతపర్వములను 'కృతులు'గను 'ప్రబంధమండలి'గను భావించెను. "అందాది దొడంగి మూడు కృతులు" నన్నయ రచించెననియు మిగిలిన పదియేనింటిని తాను రచించి ఆ ప్రబంధ మండలికి అధినాథునిగా హరిహరనాథుని భావించెననియు తిక్కన అవతారికలో చెప్పికొనినాఁడు. నన్నయ విరచిత పర్వములు కృతులైనచో తనవి ప్రబంధములని తిక్కన తీర్పు. కావ్య ప్రబంధశబ్దములు సమాన వాచకములే. ప్రాచీనలాక్షణికులు భారత రామాయణములను ప్రబంధములని సంభావించిరి. తరువాత ఆ ప్రబంధశబ్దము ముక్తకమైన శ్లోకమునకు కూడ వర్తింపఁజేసిరి. తిక్కన ప్రతిపర్వమొక ప్రబంధముగా పేర్కొనెను. ఒక అంగిరసమెచ్చట పుష్టిమంతముగా పోషింపఁబడునో అది ప్రబంధమని ఆనందవర్ధనుని మతము.[23] ఒక ప్రబంధమున ఒక స్థాయి భావముండును. అదియే ఆ కావ్యమునందంగిరసముగా అనుభూయమానమగును. స్థాయిభావమును పోషించు సంచారులవలెనే అంగిరసమును పోషించు అంగరసములు కూడ నుండవచ్చును. అంగరసమునకు కూడ ఒక స్థాయి, తత్పోషకములైన సంచార్యాదులు భాసించును. అట్టియెడ అంగరసస్థాయి భావపరిపుష్టి సంతరించుకొనినట్టియు, ఆరంభ వికాస విస్తర పరిసమాప్తులు కలిగినట్టియు ఇతిహాస కావ్యఘట్టములు కూడ ప్రబంధవాచ్యములగుటకు వీలున్నది అను తాత్పర్యమును పర్వమండలిని ప్రబంధమండలియనుటలో తిక్కన స్ఫురింపఁజేసెను.

తిక్కన 'ప్రబంధమండలి' అని ప్రయోగించిన ప్రకరణమునుబట్టి పర్వమే ప్రబంధమని భావించుటకు వీలుకలుగుచున్నది. స్థూలముగా ఈ విభాగము సంభావింపఁదగినదే. కాని కొన్ని పర్వములలో అవాంతర ఫలసిద్ధి సాధించుచున్న కథాఘట్టములు కొన్ని కలవు. వీనియందు ఆరంభవికాస పరిసమాప్తులకు సంబంధించిన కథానిర్వహణ శిల్పము

కలదు. పర్వములలో భాసించు ఉపపర్వములవలె ఇవియును ప్రబంధశబ్ద వాచ్యములగుటకు యోగ్యత కలిగి యున్నవి. ఉదాహరణమునకు విరాట పర్వము ముచ్చటైన మూడు ఉపపర్వముల సంగమ తీర్థము. ఒకటి కీచకవధ ఘట్టము; రెండు దక్షిణగోగ్రహణము; మూడు ఉత్తర గోగ్రహణము. ఈ మూడింటిలో ఒక్కొక్క ఘట్టమునందు ఒక్కొక్క పాండవపుత్రుడు నాయకత్వము వహించుచున్నట్లు కథ తీర్చిదిద్దఁబడుచున్నది. కీచకవధ ఘట్టమున నాయకుఁడు భీముఁడు; స్థాయి క్రోధము, రసము రౌద్రము. దక్షిణగోగ్రహణమున నాయకుఁడు ధర్మరాజు, స్థాయి ఉత్సాహము, రసము యుద్ధవీరము. ఉత్తర గోగ్రహణమున నాయకుఁడు అర్జునుఁడు, స్థాయి ఉత్సాహము, రసము యుద్ధవీరము. ఇవి ప్రధానరసమైన ధర్మవీరమునకు పోషకములే. ఉద్యోగపర్వమున మూడు రాయబారములు[24] కలవు. రాయబారములలో రాయబారులది కీలక పాత్ర మగుటచే వారు ప్రధానపాత్రములవలె భాసించెదరు. ఈ ఘట్టములందు కర్తృత్వమొకరిది, వక్తృత్వమొకరిది. కర్తలు కురుపాండవులు. వక్తలు పురోహిత, సంజయ, గోవిందులు. ప్రయోక్తలు రాయబారులు, ఫలభోక్తలు నాయక ప్రతినాయకులు. ఇట్లగుటచే అనునాయకోపనాయక వృత్తాంతములందలి రసములు అంగిరసమును పోషించినట్లే రాయబారులు నిర్వహించిన కథాఘట్టములందలి అంగరసములు అంగిరసమునకు పోషకములగుచుండును.

రాయబారులలో ఉత్తములైన సంజయ శ్రీకృష్ణుల వాక్యములందు నీతిచాతుర్యము నింగినందుచున్నది. సంజయుని నీతియంతయు వక్రోక్తుల నాశ్రయించినది. శ్రీకృష్ణుని నీతియంతయు ప్రౌఢోక్తులతో పరిఢవిల్లినది. ఆ భేదములా ఘట్టమునందు కానబడుచుండును. అందుచే సంజయుని రాయబారము ప్రసన్నముగను, శ్రీకృష్ణుని రాయబారము ఉజ్జ్వలముగను భాసించుచున్నవి.

రాయబారులు నాయక ప్రతినాయకుల అభిమతములకు ప్రవృత్తిరూప ప్రతీకలు. వారి ఉద్యోగమునకు వీరు సమర్థములైన ఉపకరణములు. వారికి వీరంగములు. రాయబారములలో భాసించునది నీత్యుత్సాహము. రాజనీతి ప్రధానమైన ముద్రారాక్షసము నందలి రసము నీతివీరమని కొందఱు

పేర్కొనిరి. అట్టిది వీరరస విభాగములలో కానరాదు కాని వీరరస వివేచకులు దీనిని విద్యా, పాండిత్య, యత్నవీరములందంతర్భవింప జేసెదరు. రాయబారుల రాజనీతి వారి ప్రభువుల ప్రవృత్తికి ప్రతిబింబమై ఎదిరి పక్షము వారిని భావోద్రేకములకు పాల్పడఁజేయుచుండును. ద్రుపదపురోహితుని రాయబారము కౌరవపక్షమున క్రోధభావవిస్ఫూర్తిని కలిగించినది. సంజయుని రాయబారపు వాక్యములు ధర్మజాదులలో అధిక్షేపస్ఫూర్తినందుకొనిన ఆగ్రహమును రగుల్కొల్పినవి. శ్రీకృష్ణుని రాయబారపుఘట్టమున కౌరవసభ రౌద్రోద్రేకముతో పొంగిపోయినది. ఈ మూఁడు ఘట్టములలో నాయక ప్రతినాయక భావస్థితి రసస్థితి నందుకొనెడిది సంజయ శ్రీకృష్ణుల రాయబారపు ఘట్టములందే. గోవిందుని రాయబారము కౌరవుల దుర్ణయమును లోకమునకు తెలియఁజెప్పినది, ప్రతినాయకుని అర్థసాధన ప్రధానమైన కుటిలనీతి అధర్మమని నిరూపించినది. దుర్యోధనునియందు ధీరోద్ధతత్వమును స్థాపించినది, ధర్మసాధకులైన నాయకులకు భావి కురుక్షేత్రయుద్ధమున విజయము సంబద్ధమని సహృదయుల వివేచనమునకు స్ఫురింపఁ జేసినది. రసపరముగా దీనిని వ్యాఖ్యానించినచో ప్రతి నాయక రౌద్రకర్మ నాయకుని ధర్మోత్సాహమునకు పోషకమై, సామాజికుల సహానుభూతికి దోహదము కల్పించుచున్నదని భావము. యుద్ధ పంచకమునకు ఉద్యోగము పూర్వరంగము. పూర్వరంగము భావికథార్థ వ్యంజకము. నాయకుఁడు ధర్మసాధకుఁడు, ప్రతినాయకుఁడు అర్థసాధకుఁడు. ధర్మవిజయము కథాఫలము అను నిశ్చయజ్ఞానము ఉద్యోగపర్వమునందలి తర్క వితర్కముల వలన పరమ వ్యంగ్యముగా భాసించుచున్నది. పాండవవిజయము భారత కథలో లోకన్యాయము ననుసరించియు కావ్యన్యాయము ననుసరించియు సమర్థనీయమగుటకు ఉద్యోగపర్వనిర్వహణమే ప్రాతిపదిక. ఈ పర్వమే లేనిచో పాండవ పక్షమున పఠితకు సానుభూతిగాని, సహానుభూతిగాని పొందుటకు తగినంత కావ్యార్థపరిపక్వత కానవచ్చెడిది కాదు. ఉద్యోగపర్వమునందున్మీలించిన నీతిసారము యుద్ధపంచకమునందు యుద్ధవీరమై కార్యసాధనమున స్థాయిత్వమునంది ధర్మవీర రసస్థితిని పోషించుచున్నది. ఇట్లు అంగిరసాభ్యుదయమునకు పర్వరసార్థములెట్లు అంగములై పోషించుచున్నవో భావించిన కొలది భావుకులకు చవులూరుచుండును.

## కీచక వధా ఘట్టము :-

మహాభారతము నందలి రమణీయకథాఘట్టములలో ఇది తల మానికము. ఆంధ్రులు మోదముంబొరయునట్లుగా రచన నారంభించిన తిక్కనకు ఆదిపరీక్షగా నిలిచినదీ ఘట్టము. ఆంధ్ర సాహిత్యములో పెద్దన వరూథినీ ప్రవరుల ఘట్టము పుట్టునంతవఱకు ఈ కథాభాగమే శృంగారరసాభాస చిత్రణమునకు శృంగప్రాయమై ప్రజామోదము నందుకొనుచుండెడిది. అందుకు కారణము ఇందు చిత్రింపఁబడిన తీవ్రవిరుద్ధభావసంఘర్షణము అజ్ఞాతవాస దైన్యపీడితులైన పాండవులకు పులిమీదపుట్ర వలె కామమోహితుఁడైన కీచకుఁడు ద్రౌపదిపట్ల ఉత్కటమైన రతిభావమును ప్రకటించుట ఒకవైపు, స్వీయవ్రతరక్షణతోపాటు శీలరక్షణమును కావించుకొను యత్నమున ద్రౌపది పొందిన శోకాకుల భావతీవ్రత మఱియొకవైపు, ఆవేశము వలన అజ్ఞాత వాసవ్రతము భంగము కాకుండ ఆలిని, అనుజులను అదుపులో పెట్టుటకు ధర్మజుఁడు పొందిన అంతర్వేదన మఱియొకవైపు, ప్రాణసఖి భంగపాటు ప్రళయరౌద్రమును ప్రేరేపగా ప్రకటనముకాని గూఢ మార్గమున విరోధిని విగతజీవుని చేయుటలో సంయమనముతో కూడుకొనిన భీముని క్రోధోద్ధతి మఱియొకవైపునను ఈ ఘట్టమున క్రమ్ముకొని శక్తిమంతములైన భావముల సంఘర్షణకు రంగమును సిద్ధము చేసినవి. ఇందు పఠితల నాకర్షించునది కీచక విరహము. అతని రతి అధర్మమగుటచేతను, ఏకత్రఅనురాగమగుటచేతను ఆభాస మగుచున్నది. రసస్థితికున్నంత లోతు రసాభాసమునకు లేకపోయినను చమత్కారముతో కూడిన ఆకర్షణమొండు దానియందు కానఁబడుచుండును. రసమువలన కలుగునది ఆనందము. రసాభాసమువలన కలుగునది ఆహ్లాదము. ఆహ్లాదమున హాసస్ఫూర్తికలదు. హాసము వికృతివలననేర్పడును. వికృతి ఏకత్రఅనురాగమున భాసించును. అధర్మరతియందు అది పుష్టిని కాంచును. శిల్పియైన కవి అనుచిత రతిభావ వ్యక్తీకరణ మొనర్చు పాత్రమునందు పఠితకు జుగుప్సకలుగకుండ సానుభూతి వొడమునట్లు చిత్రించి తన ప్రతిభను ప్రకటించుకొనును. రసాభ్యుచితబంధ సంవిధాన నిపుణుఁడైన తిక్కన కీచక విరహవృత్తాంతమును విస్తరించి రచించుటలోని శిల్పరహస్యమిదియే.[25]

# కీచక విరహము : శృంగార దశావస్థలు

విరహాతురుఁడైన కీచకుని పూర్వరాగ విప్రలంభము విరాటపర్వములోని శృంగారరసభావ పరిపోషణకు తోడుపడినది. నిజమునకు భారతమున శృంగారమునకు చెప్పుకోదగిన స్థానమే లేదు. నాయికానాయకుల నడుమ వర్ణింపబడిన శృంగారరస ఘట్టములు మచ్చునకు కూడ కానరావు. అట్లు లేకుండుట పరమౌచిత్యమునకు తార్కాణము. ప్రతినాయకుఁడైన కీచకుని విరహము దశావస్థలను సంతరించుకొనిన విప్రలంభముగా విస్తరిల్లినది. మన్మథావస్థలు నాయికలపట్ల వర్ణించుట కావ్యములందు సామాన్యముగా కానవచ్చువిషయము. ధీరులైన నాయకులయందు దశావస్థలు విశదముగా వర్తిల్లినట్లు వర్ణించుట అరుదు. స్త్రైణములైన దశావస్థలు మధురములుగా నుండును. పౌరుషములైనవి రమ్యములుగా నుండును. సింహబలుఁడైన కీచకుఁడు స్వభావతః రూపాభిమానియైన రసికుఁడు.[26] స్వరూపసౌందర్యము నాస్వాదించుట అతని స్వభావము. రూపము నభిమానించువాఁడనుటచే గుణాభిమాని కాఁడని ఊహించుటకు వీలున్నది. అతఁడాస్వాదింపగలిగినది బాహిరమైన సౌందర్యమేగాని ఆంతరమైన గుణసౌందర్యముగాదు. ఈ రూపాభిమానియను విశేషణము నమూలకముగా[27] తిక్కనవాడి ఈఅంశమును వ్యక్తీకరించినాఁడు. ఆకృతినభిమానించు వానికి అలంకారములయందు ఆదరము హెచ్చు ఆతఁడు బలవంతుఁడైనచో అంగబలగర్వితుఁడగుటసహజము. కీచకుని రూపాభిమానమును, నానా భరణశీలమును, బలగర్వమును అనుచిత క్షేత్రము నాశ్రయించి ప్రవర్తిల్లుటచేత నాతఁడు దుర్విదగ్ధుడైనాఁడు. తిక్కన ఆపాత్ర గుణగణములను విశ్లేషించి సూక్ష్మముగా నెట్లు పేర్కొనెనో కీచకుఁడు పొందిన మన్మథావస్థలను నిపుణముగా నట్లే వివేచించి నిరూపించెను.

లాక్షణికులు మన్మథావస్థలను పదియని కొందఱు, పండ్రెండని మఱి కొందఱును పేర్కొని యున్నారు.

"దృఙ్మనస్సంగ సంకల్ప జాగరాః కృశతాఽరతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశా దశ"—

అనునది మన్మథావస్థలు పదియని చెప్పువారి వాదము.

"దశధా మన్మథావస్థా భవేద్ద్వాదశధాఽపి వా
ఇచ్ఛోత్కంఠాభిలాషాశ్చ చింతాస్మృతి గుణస్తుతీ
ఉద్వేగోఽథః ప్రలాపస్స్యాదున్మాదో వ్యాధిరేవచ
జాడ్యం మరణమిత్యాద్యేద్వే కైశ్చిద్వర్ణ్యతే బుధైః"

ఇది మన్మథావస్థలను పండ్రెండనువారు గ్రహించు భావప్రకాశిక లక్షణము.

ప్రలాప సంజ్వరములను దృఙ్మనస్సంకల్పాదులతో కలిపిన పండ్రెండ గుననియు అట్లు గ్రహించుట ఉచితమనియు విమర్శకులు భావించు చున్నారు.[28]

పై దశావస్థలలో మూర్ఛయు, అంతము ననునవి స్త్రీ పాత్రలకుచిత మైనంతగ పురుషపాత్రలకు కావు. అట్లగుటచే తిక్కన వీనిని కీచకునిపట్ల వర్ణించుట మానెను. ఆతనికి అంతము మదనావస్థకాదు. పగవాని చేతిలో పొందిన దురవస్థ. ఇఁక కృశతయు నిందు వర్ణింపబడలేదు. తిక్కన ఆ యవస్థ ఉత్తమ శృంగార నాయకులకే యోగ్యమని భావించియుండ వచ్చును. అరతిని ఒక్క వచనము (4-2-302)లో సూచించి వదిలెను. ఆ సూచనలో కూడ అతనికన్నపానములు పట్టలేదన్నధ్వనిని తిక్కన వెల యించెను. కీచకుఁడు రాత్రులను వేగించు సన్నివేశమవసరము లేకుండుటచే ఆతనికి తిక్కన పగటిజాగరమే కల్పించినాఁడు. చంద్రునిబదులు సూర్యుని ఉపాలంభింపఁజేసినాఁడు. "మాయరవి పల్కుంకఁడొకో" (4-2-312).

ఆ. దివసమకాని యింక భువనంబునందిట,
వట్టి రాత్రి లేని యట్టు గాఁగఁ
జేసెనొక్కొ విధి విశేషించి నాకకా
నేఁడ దివము సాఁగి నిలిచెనొక్కొ. (4.2.313)

అనునవి సాహిత్య జగత్తున ప్రసిద్ధములు.

మిగిలిన మన్మథావస్థలకు ఆలంబనములైన హృద్యపద్యములు.

## (1) చక్షుఃప్రీతి (దృక్ సంగమము)

ఉ. అక్కజమైన చెల్వమున నాత్మకు బ్రేగ(యి పొల్చు పొత్తిపై
నెక్కొను చూడ్కి(గ్రమ్మఱుప నేరక యూరక నిల్చెఁ గాముచేఁ
జిక్కిన నెమ్మనంబుఁ గడుఁ జేడ్పడు మానముఁ జేష్టితంబులం
దక్కిన యంగముం దలఁకు ధైర్యమునై యతఁ డప్పుడయ్యెడన్. (4-2-23)

ఇందు విభావము ద్రౌపది 'అక్కజమైన చెల్వము'; కీచకుని అనుభావము దృక్ సంగమమును మరల్పలేక పోవుట. సాత్త్విక భావము అబ్బురపాటుతో కలిగిన స్తంభము. అతని యందలి స్థాయి 'కాముచే జిక్కిన నెమ్మనంబున' నిలిచిన రతి. మనశ్చాపలము, మోహము, ధృతిని కోల్పోవుట మొదలగునవి సంచారులు. ఇందు రతిభావము వాచ్యముకాదు. విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావములచే నది ధ్వనింపఁబడుచున్నది. తిక్కన వర్ణన లిట్లే సాగును.

## (2) మనస్సంగమము

తే. ద్రౌపదీ రూపమను నురిఁ దగిలి తనదు
హృదయమను మృగమత్తఱి సడిలకొనుచుఁ
గాముఁడను బల్లిదపు వేఁటకాని వారిఁ
బడుట కెంతయు నా సింహబలుఁడు తలరి. (4.2.24)

ఇందలంకారము నాశ్రయించి అవస్థను వ్యంజింపఁజేయు రచనా శిల్పము కానవచ్చుచున్నది. 'హృదయమను మృగ'మను రూపకమాతని

మనోగతమైన పాశవిక కామమునకు కేతనము. ద్రౌపది నురిగా చెప్పుట భావి కథార్థము నందతని విషాదాంతమునకు సూచకము.

తిక్కన చక్షుఃప్రీతి, మనస్సంగమములను (4-2-26 నుండి 35వఱకు) పది పద్యములలో వివరించి వర్ణించెను. పాత్రగతమైన చేష్టలనే కాక మనోగతములైన భావములను వ్యక్తీకరించుచు ఎడనెడ భావసాంద్రత నాలంకారికముగ ధ్వనింపఁజేయుచు తిక్కన రసదీప్తిని కలిగించుచుండును. "ఎందును నిట్టిరూపు నరులెవ్వగు గాంచిరె", "ఇయ్యింతిప్రాపున నయ్యనంగుఁడు పార్వతీశునైనను దక్కనేలకున్నె"; "ఈ నెలతగన్న మన్మథుఁడైన"; "దీని జన్మంబునఁదేజంబునొందిన ఇంతియుఁ బతియు నెవ్వరొకో" యను పద్యములు కీచకుని వితర్కములు.

భావముల తరువాత అనుభావముల పరంపరలను జాలు వార్చెడి పద్యములను చిత్రించుట తిక్కన జిలుగుశిల్పము.

చ అని యని యుగ్గడించు ధృతి యల్లల నాడినఁ దల్లడించుఁ బై
కొను తలపోఁత నించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచటన్ జనులం బరికించు బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై
(4-2-31)

ఇందలి ఉగ్గడించుట, తల్లడించుట, తలపోఁతనించుట, అప్పళించుట, అగ్గలించుట, పరికించుట, కళవళించుట అనునవి మనోజవికారమగ్నుఁడైన వాని భావజచేష్టలు. ఆక్రమములో నొక పొందికయు భావోదయ వికాస విస్ఫూర్తియు భాసించును.

చక్షుఃప్రీతి నిట్లు చిత్రించుచు తిక్కన ఆ భావావస్థకొక తీర్పునిచ్చి నట్లొక పద్యమును రచించుట భావస్థిరీకరణ శిల్పమునందలి ప్రౌఢిమ.

చ. పొలఁతుక కాంతి యింత పొలి వోవఁగ నీ కెసలారఁదార ని
శ్చలతఁగడంగి క్రోలికొనఁజాలుటఁ గీచకముఖ్య లోచనం

బుఖు 'నయనం ప్రధాన' మను పూర్వవచస్థితి తప్పకుండఁగా
నెలమి వహించెఁ దక్కుఁగల యింద్రియవర్గము ధిక్కరిం
చుచున్. (4-2-39)

## (3) అభిలాష (సంకల్పము) ;

ఈ భావము రెండు సీసపద్యములలో రమణీయముగా నావిష్కరింపఁ బడినది. (4-2-45, 47) నిజానురక్తిని తెలుపుటయే ఈ మాటలలోని తాత్పర్యము. ఆసక్తితో నతిశయించుచు, తత్తరముతో తడబడుచు సాగెడి అతని మాటలు తరళ సుందరములు. అభిలాష జ్ఞానేంద్రియ సుఖాసక్తిరూపమున అభివ్యక్తీకరించుట ఇందలి విశేషము. చూడను, చేరను' పలుకను, వినగను, కేలంగేలు కీలు కొలుపను-తలఁచుటలో అభిలాష బహిరింద్రియ వ్యాపార ప్రవాహిక నాశ్రయించినదని తిక్కన వ్యంగ్యముగా సూచించెను.

## (4) హ్రీత్యాగము :

స్వీయ రతిభావమును గురుజనుల యెదుట చెప్పుట, నలుగురకు తెలియునట్లు వర్తించుట, ఆత్మగౌరవమును వదలి వ్యవహరించుట, మర్యాదను పాటింపక మసలుట హ్రీత్యాగము నందు కనఁబడు ప్రధాన లక్షణములు. సుధేష్ణ ఎదుట సైరంధ్రిపట్ల వలపును గూర్చి ముచ్చటించుటయుఁ పలువుర ఎదుట సైరంధ్రిని వెన్నంటి నడచుటయు మొదలగు ఘట్టములందు హ్రీత్యాగ మభివర్ణింపఁబడినది.

## (5) ఉన్మాదము :

కీచకుఁడు మదనోన్మాదమున పలికినట్లు రచించిన సీసపద్యములు తెలుఁగు రసికలోకమున ప్రసిద్ధములు. ఉన్మాదము భావోన్మాద మనియు, చేష్టోన్మాదమనియు రెండు విధముల భావింపవచ్చును. "నెత్తమ్మిరేకుల మెత్తఁదనము తెచ్చి" అను పద్యమున భావోన్మాదమును, "పాడసూపి నట్లైన వడిబట్ట సమకట్టి పరికించి కానక బమ్మరించు" అను సీసమున చేష్టోన్మాదమును వర్ణింపఁబడినవి.

## (6) ప్రలాపము :

"లీల నా ముందట నా లేమ వలసిన చూడ్కికి జబ్బనచూఱ గాదె"; "కాంతి తళ్కొత్తు నీ కడకంటి చూడ్కితోఁ బొందగానని మేను పొగులు టయు", "కెంగేలు గేలితో గీలించి నెయ్యంపు మాటల తగు మారు మాటలార్తు" అను పద్యముల వంటివి ఎన్నియో ఈ అవస్థకుదాహరణ ప్రాయములే.

## (7) సంజ్వరము [తాపము] :

తే. అనుచుఁ గ్రుంకింపరాని ప్రొద్దరసి యరసి
శిశిరపర్యంకమున మేను చేర్చి చేర్చి
వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి
మిగుల వందురి వందురి పొగిలి పొగిలి. (4-2-314)

ఇందలి ఆమ్రేడితములు భావతీవ్రతను వ్యక్తీకరించు సుందరశబ్దసాధనములు. తిక్కన క్వాచిత్కముగా నిట్టి శబ్దాలంకారములను వాడి తన రసానుగుణ మైన రచనా శిల్పమును వెలార్చును.

భావప్రకాశికలో పేర్కొనఁబడిన అవస్థలయందు చింత, స్మృతి' గుణస్తుతి అనునవి ప్రత్యేకముగా నెంచదగినవి.

## (8) చింత :

"వామాక్షిరుచిరలావణ్యమును భావించు" అను సీసపద్యమున "చింత యొసగంబు వడిగొని చిక్కువఱుప" ఎంతయు వంత బొందిన విధమును తిక్కన వర్ణించెను. ఇంకను మఱికొన్ని పద్యములుదాహరింప వచ్చును. (4-2-296, 297)

## (9) స్మృతి :

"పడతి నెమ్మొగ్గరడబలికిన భంగిన నిచ్చమై నిక్కకు వచ్చునొక్కొ" అని కీచకుఁడు తలపోయుట స్మృతికి చక్కని యుదాహరణము.

## (10) గుణవిస్తుతి ;

రూపాభిమానియైన కీచకుఁడు ద్రౌపది సౌందర్యమును కీర్తించిన పద్యములెన్నింటినో హృద్యముగా తిక్కన ఈ ఘట్టమున కూర్చెను.

కీచకుని పరసతీ విరహామదుర్కర్మమగుటచే అనౌచిత్యమనియు, అనౌచిత్యము రసభంగ హేతువనియు భావించినచో ఇచట రసాభాసము కాక రసభంగమైనదని చెప్పవలసి యున్నది. రసభంగ, రసాభాసములకు కల భేదము ఈ క్రింది విధముగా భావింపవచ్చును. కీచకుఁడు ద్రౌపదిని కామించి బలాత్కరించినను ఆమె అతనిని మన్నించినను కలిగెడిది రస భంగము. కీచకుఁడు ద్రౌపదీగతమైన విరహామును పొందుటయు, అతని కామె అనుకూలవతి కాకుండుటయు ఆభాసస్థితికి ఆయువుపట్టు. నిజమునకు ధర్మభంగమెక్కడ కలదో రసభంగమక్కడ కలదు. ద్రౌపది కీచకుల సంగమము ధర్మభంగము, రసభంగము. అతనివలపు భావస్థితి నందుకొని, ఉత్కటమగుచు పఠితలకు హాసగర్భితమైన రతిభావచమత్కారమును కలిగించును. ధర్మరతియొక్క వికృతిని ప్రదర్శించు విభావము కీచకుఁడగుటచేత అతని రతిభావమునందాభాసస్థితి కలదు. అతఁడొక సామాన్యను విషయోపభోగ రతివలన కామించినచో దానికి రసస్థితి లేదు. అతని కామము రతి స్థితికి చేరుకొన్నది. కాని ఆమె అన్యకాంత, అననుకూల. అట్లగుటచే నతనిది ఏకత్రఅనురాగము. ఇట్టి స్థితిలోనున్న కీచకుని విరహామును విస్తరించుటలో స్వానుభూతి ప్రసాధనమైన రసశిల్పము కలదు.

ఈ ఘట్టమున ద్రౌపదీపాత్రగతమైన మానసిక స్థితులను, ఆమె హావభావములను, అనుభావ సాత్త్వికభావాదులలో భాసించెడి భయ రతి భావానుకూల వ్యంజకమైన ద్వంద్వ స్థితులను తిక్కన రసభావశిల్పపోషణమునకు ఉత్తమోదాహరణములుగా విమర్శకులెందఱో కీర్తించి యున్నారు.

సీ. వెలవక నన్నుఁజూచె వేఁడని యెదఁ గలు
షించిన నొండొండ చెమట వొడమ
ననుచిత కృత్యంబులాచరించు విధాతృ
బలిమికి నివ్వెఱపాటు తోఁప

నిచ్చట దిక్కు లేరెవ్వరు నా కను
భయమున మేనఁ గంపఁబు వుట్టఁ
జేయంగ నేమి యుపాయంబు లేమి నా
ననమున వెల్లఁదనంబు గదుర

తే. నున్న పాంచాలిఁ గనుఁగొని యన్నరాధ
ముఁడు వివేకవిహీనుఁడై ముదితుఁడగుచు
మదన వికృతియకాఁ దనమదిఁ దలంచి
రాగసాగర పూర నిర్మగ్నుఁడయ్యె. (4-2-33)

ఇందలి స్వేదము, కంపము, వైవర్ణ్యము మొదలగు ద్రౌపది సాత్త్విక భావములు భయభావవ్యంజకములుగను రతిభావస్ఫోరకములుగను చిత్రించుట ఇందలి ద్వంద్వస్థితి. భయభావస్ఫోరకములైన స్వేదాదులను వివేచించుటకు హేతువులుగు వర్ణింపఁబడినవి. అట్టి వివేకము లేనివాఁడు వివేకహీనుఁడైన కీచకుఁడు. "కామీ స్వతాంపశ్యతి" అను న్యాయముననను సరించి అతఁడు వానినిమదన వికారములుగా భావించెను. ఇచ్చట పఠిత భయభావమును వివేచించి పాత్రగత తాదాత్మ్యమును భజించును. కీచక కామాంధ్యమునకు ఒక చిఱునవ్వు నవ్వుకొని, భయమునందు రతిని దర్శింపఁ గలిగిన అతని మదన భావోత్కటస్థితిని భావించి చమత్కారమును పొంది ఆహ్లాదముననుభవించును. అనగా పఠితకిట్టి ఘట్టములందు ద్రౌపది భావములవలన రసస్థితియు, కీచకుని భావచర్వణములవలన ఆభాసస్థితియు కలుగుచున్నవి. ద్రౌపది భయభావము ఆమె ధర్మశీలమును వ్యంజింపఁ జేయుచున్నది. ఆమె తన్ను తాను రక్షించుకొను యత్నమునందు, దుర్మదాంధుని మడియింపఁ జేయవలెనని పట్టుబట్టి సాధించుటయందు, ధర్మ రక్షణైక లక్షితమైన ఉత్సాహము దీపించుచున్నది. అది నాయక ధర్మ వీరమును పోషించుచున్నది. నాయకపక్ష వృత్తులతో సహానుభూతియు, కీచకునియందు సానుభూతియు కలిగించుట తిక్కన ఉభయ రసభావ సంవిధాన శిల్పప్రౌఢి.29

ద్రౌపది మానరక్షణము ఈ ఘట్టమునందలి కార్యము. ద్రౌపది యందనురక్తుఁడైన ప్రతినాయకుఁడు కథాంగతికి బీజము నాటుచున్నాఁడు. తత్ప్రభావము నాయికపైఁబడినది ఆమెను రక్షించుభారము పతులపైఁ బడినది. పతులలో సింహబలుని పరిమార్పఁగలిగినవాఁడు భీముఁడొక్కఁడే. కావున అతనియందు కార్యారంభము భాసించినది. అనఁగా అర్థప్రకృతి యైన బీజము ప్రతినాయకుని చేష్ట. మానసికావస్థయైన ఆరంభము నాయక కోపోద్దీపనము. దాని కుద్దీపనము కల్గించినది నాయిక దీనావస్థ. కీచకుఁడు వెన్నంటిన ద్రౌపది దీనావస్థను గాంచి భీముఁడు రౌద్రోద్రేకమును ప్రకటించి నాఁడు. భగ్గున మండినట్లు ఆతనియందు క్రోధభావను ఉజ్జ్వలావస్థ నందు కొనినది. అతని అనుభావములు, భావములు, అతని ఉత్కట రౌద్రస్థితికి వ్యాఖ్యానములైనవి. తిక్కన ఈ ఘట్టమున రచించిన రెండు పద్యములు లాంగిక భావాభినయ ప్రతినిధులవలె భాసించుచు తెలుఁగువారి మన్ననలు నందుకొనినవి.30

అజ్ఞాతవాసమున రౌద్రస్థితి వ్రతభంగ హేతువు. ధర్మజుఁడాతనిని నర్మ గర్భప్రౌఢోక్తులతో వారించినాఁడు. క్రోధమునుత్సాహస్థాయికి మార్చుట ఈ ఘట్టములోని రసశిల్పము.

ఉద్ధతుఁడైన కీచకసంహారమునకు రౌద్రమూర్తియైన భీముని ఉత్సా హమునకంటె అతని క్రోధభావస్ఫూర్తియే కార్యసాధకమని భావించినది ద్రౌపది. ధర్మజునితో నాడిన శ్లిష్టాధిక్షేపోక్తులతోను, భీమునితో మహాన సమునందాడిన ప్రేరణోక్తులతోను ఆమె భీమునియందలి ఉత్సాహమును క్రోధముగా మార్చుటకు యత్నించినది. కీచకుని చంపనిచో తానసువులఁ బాసెదనని జంకించినది. అతనియందు క్రోధము మోసులెత్తినను ధర్మభంగము కాకుండ నిర్వహింపవలసిన నియతి దానిని శాసించుచున్నది. గూఢ సంహా రమును సంధించుటకుచితమైన ఉపాయమాలోచింపఁబడినది. నర్తనశాలకేగు నప్పుడు భీమునిలో రౌద్రముప్పొంగినది ద్రౌపది దానిని ఆవేశముగా పొంగ కుండ ఆచరణయోగ్యముగా ప్రవర్తిల్లునట్లు కాంతోపదేశము చేసినది. ధర్మ జుఁడు వ్రతభంగము కాకుండ భీముని నియమించినాఁడు. ద్రౌపది కార్య భంగము కాకుండ అతనిని మలచినది ధర్మజ, ద్రౌపదులను ఒడ్డుబనోరసి

పాటి కీచకోపకీచక జీవనద్వీపములను ముంచిన రౌద్రరసవాహినిగా భీముని వృత్తము కనఁబడును. అతని రౌద్రము నాయక ధర్మసాధనోత్సాహమున కంగము. ఈ తాత్పర్యమును వ్యంగ్యముగా తిక్కన ఈక్రింది పద్యమున ధ్వనింపఁజేసెను.

శా. క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప నత్యంత చిం
తాధూతాత్ముఁడనైన నాకుఁ బరమోత్సాహంబు సంధిల్లఁ దు
స్సాధంబైన విరుద్ధ కార్యమిటు లాసన్నంబుగా సంఘటిం
తే ధర్మాత్మజుఁడాత్మ మెచ్చఁ బగ సాధింపంగఁగా స్వల్పమే.
(4-2-275)

క్రోధమతని జీవలక్షణము అది ఉత్కట కార్యసాధనమునందు నాయకోత్సాహమునకు పుష్టిని కలిగించుచున్నది. పగసాధించుట భీముని కొక గొప్పకాదు. "ధర్మజుఁడాత్మ మెచ్చునట్లు నిర్వహించుట" అనల్పమైన విశేషము. సాధకుఁడు భీముఁడు, సిద్ధి ధర్మజునిది. అంగాంగి రసపోషణలోని ఆంతర్యమిది.

ఈ ఘట్టము నొక ప్రబంధముగా భావించినచో ఇందలి ఉత్తమనాయకత్వము భీమునకు కట్టబెట్టినది ద్రౌపది. కార్యసాధకుఁడే తత్కాలమునందలి ఉత్తమ నాయకుఁడని భావము.[31]

## దక్షిణ గోగ్రహణ ఘట్టము :-

విరాటపర్వ కథాఘట్టములందన్నింటను కథాకార్యము ప్రతినాయక వర్గముచే ప్రారంభింపఁబడును. అది పాండవాజ్ఞాతవాస భంగహేతువై పరిణమించినపుడు పాండవులు దానినెదుర్కొని విజయమును సాధించి తమ వ్రతమును, ధర్మమును రక్షించుకొందురు. అట్టిదే సుశర్మప్రేరితమైన దక్షిణ గోగ్రహణము. ప్రతినాయకపక్షమున అతఁడొక పతాకనాయకునివంటివాఁడు. ఆ యుద్ధమున సుశర్మకు పరార్థమునకంటె స్వార్థమే అధికము. ఇఁక దాడిచేయఁబడిన విరటుని పరిస్థితి విచిత్రమైనది. చనిపోయిన బావమఱది సమరమున నోడించిన సుశర్మ పగకు తానిప్పుడు ఎఱ కావలసివచ్చెను.

అప్పటికిని, ఇప్పటికిని ఆతఁడు సచివాయత్తసిద్ధియే. అప్పుడు సింహాబలుఁడుండెడివాఁడు. ఇప్పుడు పాండవసింహములాతని చెంతనున్నవి.

అర్జునుఁడు పేడియైయుండగా భీముఁడే రణరంగవీరుఁడు. అతని వలన కార్యసిద్ధిని పొందువాఁడు ధర్మజుఁడు. విరటునకు కంకుభట్టు సాయము చేయుచున్నాఁడనగా ఒక సచివాయత్తసిద్ధికి మఱియొక సచివాయత్తసిద్ధి సాయము చేయుచున్నట్లు. వీరిరువురి బలము ధర్మజుని బలమైన భీమునిపై నాధారపడినది. సుశర్మచేత సంకుల సమరమున బంధితుఁడైన విరటుని విడిపించినవాఁడు పవనతనయుఁడు. సుశర్మను బంధించి భీముఁడు ధర్మజుని యెదుట నిలిపెను. విరటుఁడు పాండవరక్షితుఁడు. ధర్మజుఁడు సుశర్మను విరటుని ఎదుట నిలిపెను. నిజమునకీ రంగమున నాయకుఁడెవరు ? బలవీరుఁడైన భీముఁడు ధర్మజునకు వినీతుఁడు. పాండవ రక్షితుఁడైన విరటుఁడు ధర్మజునకు కృతజ్ఞతాబద్ధుఁడు పాండవరక్షకుఁడు పాండవరక్షితుఁడయ్యెడి సన్నివేశమును కల్పించినది దక్షిణ గోగ్రహణము. ప్రచ్ఛన్నముగా నున్న ధర్మజుని నాయకత్వము ప్రత్యక్షముగా చాటఁబడినది. ఆతని వెనుకనున్న కార్యసాధనశక్తి భీముడుగా నిలచియున్నది. దానిని విరటుఁడు గుర్తించినాఁడు.

ఉ. మంటయుబోని శాత్రవసమాజము నించుకయేని శంక లే
కంటఁగఁ బాఁకి వెండి తెగటార్చె మహోద్భుత శక్తిశాలి యీ
వంటలవాని చేసిన యవార్య పరాక్రమ మొండు చోటులం
గంటిమె వింటిమే యితఁడ కాఁడె వెసన్ గెలిపించె నన్ననిన్.
(4-3-229)

యుద్ధమున గెలిపించినవాఁడు భీముడయ్యును ఆతఁడు నాయకుఁడు కాఁడు. ధర్మజుఁడు రంగముపై నుండగా భీమార్జునులెంత పెద్ద కార్యములు నిర్వహించినను వారు పెద్దలు కాలేరు. సుశర్మనోడించుట భీముని కార్యముకాఁగా ఆతనికి దయాభిక్ష పెట్టి విడిపించినవాఁడు ధర్మజుఁడు. భీముని యుద్ధవీరమంతయు చిట్టచివఱకు ధర్మజుని దయావీరము నందంతర్భవించి దాని గౌరవమును కాపాడుచున్నది. ధర్మజుఁడింత చేసినది విరటునిపట్ల

నున్న కృతజ్ఞతాధర్మ ప్రేరణమువలననే. విరటుని ఈ పల్కులు ధర్మజుని ధర్మవీర నాయకమూర్తికి స్నేహనీరాజనములు.

క. ఉపకారమొ బంటుతనమొ
కృపయో పెంపో సమగ్రకీర్తి ప్రియమో
రిపుదుస్సహమగు నీ రణ
నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్.(4-ᐧ-228)

తిక్కన మూలమునకంటె ఈ ఘట్టము నెంతయో చైతన్యోత్సాహ బంధురముగా చిత్రించెను. సంకుల సమరమునకు సన్నద్ధమైన సేనాపతుల రణశృంగారములను మొదలుకొని వీరాలాపములను, శస్త్రప్రయోగ కలాప ములను, ప్రధాన పాత్రముల మానసిక భావచిత్రణములను తిక్కన మూలమునకంటె పెంచి రచించి ఈ ఘట్టమున కొక రస సమగ్రతను కల్పించెను. అట్టి అమూలక వర్ణనలలోని విశేషములను తృతీయాధ్యాయము నందలి యుద్ధవర్ణనలను విభాగమున వివరించుటయైనది.[32]

## ఉత్తర గోగ్రహణ ఘట్టము :

విరాటపర్వ చతుర్థ పంచమాశ్వాసములు కథానిర్మాణదృష్టికి ఒక చక్కని ప్రబంధముగా భాసించును. ప్రతినాయకుఁడు స్వయముగా ప్రారంభించు కథాకార్యము కలది ఈ ఘట్టము. భావి కురుక్షేత్ర యుద్ధమున తారసిల్లు ప్రసిద్ధ కురువీరులందఱు ప్రత్యక్షమయ్యెడి ప్రధాన రంగమిది. గోగ్రహణము నిమిత్తము. పాండవాజ్ఞాతవాస వ్రతభంగ సంకల్పము ప్రధానహేతువు. ప్రభువులేని నగరముపై దాడి జరిగెను. ఉత్తరుఁడున్నను ఊర్జిత బలోపేతుఁడు కాఁడు. విరాట నగరమున విల్లు పట్టువాఁడు కాఁడుగదా, రథము నడపువాఁడు కూడ లేఁడు. పేడియైన బృహన్నల పగ్గములు పట్టవలసిన దీనస్థితి విరాటపక్షమునకేర్పడినది. అర్జునుఁ డొక్కఁడే అనాథమైన విరాట నగరమునకు సర్వరక్షుడైనాఁడు. ఈ సత్యమును సైరంధ్రి గుర్తించినది. ఉత్తరను ప్రేరేచినది. రాకుమారిని ఒప్పించినది. సురేంద్రనందనుని సమరరంగమునకు పంపించినది. అజ్ఞాతవాస వ్రతావ

స్థానము కావచ్చినదని తెలిసిన కిరీటి కురుక్షేత్ర రంగమునకు పూర్వరంగముగా యుద్ధము నారంభించి తన గాండీవనాదమే నాందిగాఁ బలికింప నెంచినాఁడు. ఉత్తర కుమారుని రణభీతి హాస్యమును పోషించి అర్జునుని ఉదాత్త గుణవీరమునకుచితమైన మనోవిశ్రాంతిని పఠితకు సంతరించినది. ఉత్తరుఁడు పోగలెక్కి, కిరీటి రథమెక్కుటతో అర్జుననాయకత్వము ఈ రంగమున స్థాపింపఁబడినది. కౌరవసేనను తునుమాడిన కిరీటి పరాక్రమ విలాసము తిక్కన కలమున నానావిధరచనావిన్యాసమును వెలార్చెను.

వీరోక్తులలో, రణరంగ వర్ణనలలో వివిధములైన అలంకారములు వెలుగులు చిందినవి. అధిక్షేపములలో రౌద్రముతోపాటు స్నిగ్ధహాస్యము చిందులాడినది. సన్నివేశ పరంపరలలో ఉత్సాహభావోద్దీప్తి ఉన్మీలితమైనది. అర్జునుని రణరంగ ప్రవేశమును "సింగం బాకటితో గుహాంతరమునన్ చేడ్పాటుమైనుండి...... సమరస్థేమాభిరామాకృతిన్" అను ఆచార్యోక్తులతో నారంభించి ఆతని అవక్రపరాక్రమోత్సాహములను తత్ప్రబంధవ్యాపిగా నిర్వహింపనున్నట్లు తిక్కన సూచించెను. అడుగడుగున అద్భుతావహమైన కదనపాండిత్యము, కిరీటి రణవీర విలాసము. అర్జునుఁడు గురువులఎడ ప్రదర్శించిన భక్తిప్రపత్తులు, శత్రువీరులపట్ల ప్రసరించిన శాత శరపరంపరలు, కురుకుమారుల నవలీలగా నదలించు బెబ్బులితనము, కర్ణాది ప్రతిద్వంద్వులను ఢీకొనుటయందు ప్రదర్శించెడి అవక్రవిక్రమము, ద్రోణాశ్వత్థామకృపాచార్య భీష్ములతో యుద్ధము సేయునెడ సాఁగించెడి సంయమిత పరాక్రమమును చివఱకు దుర్యోధనునితో అవలీలగా పోరు సలుపుటయందు ఉల్లాసముగా సాగించిన ఉపాలంభవాక్య విన్యాసమును క్రమముగా పలికించినచో అర్జునుని కమనీకాంత యుద్ధోత్సాహ విస్ఫూర్తి భాసింపగలదు. కురువీరులలో కిరీటికెదురు నిలఁబడిన మొదటి ప్రతివీరుఁడు కర్ణుఁడు. అతనినుండి కురువృద్ధుఁడైన భీష్ముని వఱకు క్రమముగా యుద్ధము సాగినది. ఈ క్రమమున ఉత్తరోత్తర సన్నివేశములు బలీయములు. వీరరసాభ్యుదయక్రమ పరిణామ సూచకములు. చివఱ దొరికినవాఁడు ప్రతినాయకుఁడు. బలగమే ఆతని బలము. ఆ బలగము అర్జుననిచే పరాజితమైనది. అతఁడవలీలగా దొరికిపోయినాఁడు. ఇందు ప్రతినాయకుఁడు సచివాయత్తసిద్ధి. నాయకుఁడు స్వాయత్తసిద్ధి. కౌరవపక్షమంతయు నొక్కటి. అర్జునుఁడొక్కఁ డొక్కటి.

అయినను అర్జునునిదే విజయము. ఇంతటి వీరుఁడు దుర్యోధనునితో పోర వలసివచ్చినప్పుడు అలుగుల కంటె అధిక్షేపముల నధికముగా నాడుటయందే ఔచిత్యము కలదు. "జూదమిచ్చట నాడంగ రాదుసుమ్ము" అన్న వాక్యము దుర్యోధనుని అవినీతిపై ననుసంధించిన వాఙ్మయాస్త్రము. రణోత్సాహ మత్యంత ఉత్కటస్థితినందిన తరువాత దుర్యోధనునితో చేసినపోరు నాయకునకు కొంత ఉల్లాసమును పఠితలకు కొంత హాస్యవికాసమును కల్పించి అనంతర కథారసభావములకనువైన సంగతిని కల్పించుచున్నది.

విరాటనగరమున చిత్రింపఁబడిన సన్నివేశము సార్థకమైనది. ఏక వీరుఁడుగా వెలుగొందిన అర్జునుని యుద్ధోత్సాహము ధర్మజోన్ముఖమై అను వర్తింపవలసి యున్నది. పాండవులు బయలుమెఱసిన సన్నివేశము పాండవా గ్రజుని నాయకత్వమును స్థాపించుచున్నది. విరటుని గద్దెపై కూర్చున్న ధర్మజుఁడు అజ్ఞాతవాసపటమును తొలగించుకొని ప్రవేశించిన ప్రధాననాయ కుఁడు. భావి భారత కథారంగమున అతఁడు హస్తినాపుర సింహాసనముపై కూర్చుండుట ప్రధానఫలము. ఈ రెండు గద్దెల మధ్య కురుక్షేత్రయుద్ధ మున్నది. అందును కర్త ధర్మజుఁడే. కార్యకర్తలు భీమార్జునులు. అంగును ఏకవీరుఁడర్జునుఁడు, బలవీరుఁడు భీముఁడు.

భావికథను వ్యంజింపచేసినది విరాటపర్వము. కురుక్షేత్ర యుద్ధ మున విశ్వరూపము దాల్చనున్న విజయోత్సాహమునకు విరాటపర్వము నాంది, ఉద్యోగపర్వము ప్రస్తావన.

తిక్కన అమూలకముగా కల్పించిన రసభావములతో రసవత్కావ్య మైనది విరాటపర్వము. నానారసాభ్యుదయోల్లాసియనుట తిక్కన చేసిన సార్థక పదప్రయోగము. తిక్కన ఎడనెడ చేర్చిన రసభావములు లెక్కకు మించినవి. ఆయన రచనలో ఎచ్చట చూచినను రసము చిప్పిలుచుండును. ఉదాహరణమునకు అమూలకముగా తిక్కన చేర్చిన కొన్ని భావములు మాత్రమిట పేర్కొనఁబడుచున్నవి.

అనుంగుతమ్ములు, ద్రౌపది చేయవలసిన కార్యముల నడుగునపుడు ధర్మజుని ఉత్కటమగు విషాద దైన్యములు, పథశ్రమము. నొందిన

ద్రౌపదిలో శ్రమ, దైన్యములు, విరటుఁడు గాదిలికూతునుపలాలించునపుడు వాత్సల్యము, కీచకపాత్రగతముగా మోహము, ద్రౌపదీపాత్రనాధార ముగా శోక, వ్యాకులములు, ధర్మజుని ధృతి, భీముని క్రోధావేగములు, నర్తనశాలలో భీముని గూఢ భాషణములలో హాసము, కీచకవధలో రౌద్ర, బీభత్సములు, కీచకుని మరణానంతరము ద్రౌపది మోదము సుధేష్ణ ఖేదము, పౌరజనుల పలుకులలో హాసము, దక్షిణ గోగ్రహణమున ఉత్సాహము, ఉత్తరుని బీరములలో హాసము, అర్జునునిలో ఉత్సాహము, కౌరవపక్షమున కొందరిలో మోదము, మఱికొందఱిలో క్రోధోత్సాహములు, ఉత్తరునిలో భయవ్యాకులత, ఉత్తరుని వర్తనములో స్నిగ్ధహాసము, ఆయా వీరుల పలుకులలో ఉత్సాహము, గర్వము, అర్జుని ఉపాలంభనమున రారాజునకు కలిగిన రోషము, విరాటునియందు ఉత్తరుని విజయవార్త వినినపుడు మోదమును, కంకుని మాటలకు క్రోధమును, ఉత్తరాభిమన్యుల వివాహవర్ణన మాధారముగా సాత్త్విక రతిభావములను. ఉత్తమ శృంగారమును తిక్కన పోషించెను.

## ఉద్యోగము—రాయబారములు :

ఉద్యోగపర్వము నందు ప్రవర్తిల్లిన మొదటి రాయబారము ద్రుపద పురోహితుఁడొనరించినది. శ్రీకృష్ణుఁడు ఉత్తరాభిమన్యుల వివాహమునకేగి పాండవులఁగలియుటతో వారివర్గమున నూత్న చైతన్య ముద్భవించినది. పాండవులకాతఁడు పెడుగడ; అండగా నిలిచిన మహాత్ముఁడు, నాయకుఁడైన ధర్మజునకమరిన శక్తిమంతుఁడైన ఉపనాయకుఁడు. అతఁడుద్యోగ యత్నము నారంభించుచు ధర్మజుని ధర్మప్రవృత్తినిట్లు ప్రస్తావించినాఁడు.

తే. ధర్మమార్గంబుదప్పక తల పుఁడొక్క—
తెఱఁగు ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు
వడయ నొడఁబడఁ డయ్యింద్రపదవినైన
నుచితగతి నెంత వడిసిన నుల్లసిల్లు. (5-1-11)

పాండవులకు రాజ్యమున వారి పాలుపంచియిచ్చుట ధర్మమని ధర్మజ పక్షముననున్న రాజులందఱంగీకరించిరి. బలదేవుఁడు కౌరవులకు వినయ వాక్యములతో ప్రార్థించి పాలుపొందెడి రాయబారమును నడుపవలెనని ప్రతిపాదించెను. సాత్యకి దానిని ప్రతిఘటించెను. కౌరవులధర్మపరులని, వారిని వేడికొనఁ బోవుట తగదని తీవ్రముగా భాషించెను. తదితరులుకూడ కౌరవులు దుర్నయపరులని నిందించిరి. సాత్యకి పలుకులచటివారికెల్లరకు సమ్మతమైనవి.

ఉ. దైన్యముదక్కి దూతయుచితంబుగఁ బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొందమ
న్యోన్య విరుద్ధ భాషణము లాడినఁ దత్ఫల మాతఁడందెడున్.
(5-1-32)

అను నిర్ణయమునకు వారు వచ్చినారు. ద్రుపదపురోహితుని రాయబారిగా పంపుట కంగీకరించినారు. సంధియత్నములతోఁబాటు సమరయత్నములు కూడ సాగింప నిశ్చయించినారు. సంధియత్నము 'కీడెంచి మేలెంచు' పద్ధతితో నారంభమైనది. సాత్యక్యాదులలో రణోత్సాహమే ప్రకటితమైనది.

విరాటపర్వమున పాండవ పరాక్రమము ప్రతిష్ఠితమైనది. దుర్యోధనుని కుటిలనీతి బయటపడినది దానితో పాండవులకాత్మవిశ్వాసముతోఁ బాటు ఆత్మాభిమానము కూడ బలపడినది. అందులకే రాయబారమున దైన్యమును ప్రకటించుటకు వారును, వారిమిత్రులును సమ్మతింపలేదు. ఇట్టి ప్రవృత్తి ఉత్సాహమునకు మూలకందము. అహంకారస్పర్శ లేనిది ఉత్సాహము దీపింపదు. అది ఉత్తమప్రకృతిజన్యమై ధర్మము నాశ్రయించి యుండును. పాండవులు స్వీయబలమునందును, ధర్మమునందును, తుల్యమైన గౌరవము కలవారు. నీతిని, నియతిని ఆశ్రయించినవారి అహంకారము ఉద్ధతమై భాసింపదు. ఉదాత్తమై శోభిల్లును. ఇట్టి ఉదాత్త ప్రకృతికమైన పాండవుల ఆత్మాహంకారము ప్రేరితమైన ఉద్యోగమీ పర్వమునందలి రాయబారములందు ప్రతిబింబించుచుండును. మొదటి రాయబారము కౌర

వుల దుర్నయములను నిరూపించి పాండవుల ధర్మవర్తనమును బలాధిక్యమును పగఱకు తెలియజెప్పి న్యాయసమ్మతముగా దాయభాగమునడుగుటకు ప్రవర్తిల్లినది. కురుసభలో పురోహితుని వాక్యములందా ప్రవృత్తి ప్రకటమైనది. కౌరవులకడ అది కార్యసాధకము కాలేదు. కాకపోవుటకు కారణము అధర్మమంతయు కౌరవులదని యెన్నికచేయుట. అది కౌరవుల అభిమానమును గాయపరచినది. వారికి గాయపడిన పాండవుల హృదయమును గుర్తించెడి ఔదార్యము లేదు. ఇరువైపులవారి వ్యక్తిత్వములలోని రాజసములను రాయబారపు ఘట్టములలో గుర్తింపవచ్చును. వారొకరినొకరు గుర్తింపనిచో సంధిపొసగుట సాధ్యముకాని పని. కౌరవులు తమ్ము పాండవులర్థింపవలెనను కొనిన అది వారి దురహంకారము. కార్యమును తప్పించి కదనరంగమునకు కాలుదువ్వుటయే కర్ణసుయోధనాదుల అభిమతము. అందులకై పాండవులలో తప్పులు పట్టుటయే వారిమార్గము. అట్లగుటచే దుర్యోధనాదులెన్నడును రాయబారములను సమర్థింపలేదు. పాండవోద్యోగ నీతిసూత్రమే రాయబారపుతంత్రము. రాయబారములవలన కురుసభలో పాండవుల ధర్మనీతి కీర్తికెక్కవలెను; భీష్మాదుల అభిముఖ్యము పాండవుల కేర్పడవలెను, ప్రజలు ధర్మజుని వర్తనమునకు హర్షింపవలెను. ఇవి నీతిప్రయోగమున సాధించెడి ప్రయోజనములు. పురోహితరాయబారము కురుసభలో కౌరవుల నధిక్షేపించుచు పాండవుల నతకరించుచు న్యాయముగా భూమిలో పాలడిగినది. ఇది వినువారికి పరుషముగా నుండును. భీష్ముఁడామాట బయటపెట్టనే పెట్టినాఁడు. కాని, ఆ పారుష్యములో పాండవులకు కలిగిన అన్యాయము వ్యంగ్యముగా నిరసింపఁబడినది. కురుసభలో కురుపాండవ వర్తనములలోని తారతమ్యములు పరిశీలింపబడుట ప్రారంభమైనది. ధర్మజాదులు సంకల్పించినదదియే. సామోపాయమునందు భేదోపాయము నీతియుక్తముగా నిబంధింపఁబడిన తంత్రము పురోహితుని రాయబారము. ఈ నీతిసారమును ధృతరాష్ట్రుఁడు గమనించినాఁడు. ఎత్తుకు పై ఎత్తువేసి సంజయురాయబారమును నడపినాఁడు.

ధృతరాష్ట్రుఁడు పాండవులకు పాలిచ్చుమాటరాకుండ, ఉత్తములకు యుద్ధప్రవృత్తి పనికిరాదనియు, శాంతికొఱకు గురు, బాంధవ వధ చేయుట కంటె భిక్షాటనము మేలనియు ప్రబోధించి ధర్మజుని ప్రవృత్తిని నివృత్తి

వైపు మరలింప యత్నించినాఁడు. సంజయు రాయబారమిందులకు ప్రవర్తిల్లినది. అహంకారమూలమైన ఉత్సాహమును నాయకునియందుపశమింపఁజేసి, అతనిని విరక్తునిగా, శాంతునిగా నొనర్చినచో పాండవుల ఖండనోద్యోగము శాంతించును. అనగా ధర్మజుని ఉత్సాహము శమమగును. ఇట్టి విరుగుడు మంత్రమే సంజయుని ముఖమున ప్రయోగింపఁబడినది. అది ఫలించినచో కురుక్షేత్ర సంగ్రామము లేదు, అసలు భారతకథయే లేదు. ఇంతటి లోతైన ప్రయోజనమీరాయబారమున కలదు. సంజయుఁడు నయోన్నతుఁడు, మాటలనేర్పరి. ధర్మజుని నయమున భయమున ధృతరాష్ట్రుని నీతిమంత్రముచే బంధింప యత్నించినాఁడు. ధర్మజుఁడు వాక్చాతుర్యము నందాతని తలఁదన్నినవాడు. రాజనీతిలో పండితుఁడు. ఆతని లోగుట్టులను రట్టుచేసినాఁడు.

క॥ ఎదిరిం దమయట్టులకా
మదిఁ దలఁచినఁ బొసఁగుఁగాక మాకుం గుడు మిం
డిదె మీరు ప్రక్కఁగొనుఁడని
చదురడిచిన మనసుపొందు చక్కంబడునే. (5-1-312)

అని నిలువదీసి అడిగినాఁడు. నర్మగర్భితములైన వక్రోక్తులతో సంజయుని రాయబారపు తాత్పర్యమును తుత్తునియలు చేసినాఁడు. సంజయుడు సౌమ్యవచనములతో శాంతమునే ధర్మముగా బోధించినాఁడు. ధర్మజుఁడా వక్రనీతికి క్రుద్ధుఁడై 'రాజులకు సంగ్రామమే ధర్మసమ్మతమని' ధట్టించి చెప్పినాఁడు. ధర్మాధర్మములను చెప్పుమని శ్రీకృష్ణునడిగినాఁడు. అతఁడు "వీరికి పోటుమేలు నాకుం జూడన్" అని నిర్ణయించినాఁడు. ఈ ఘట్టమునందు ఒకరిని మించిన వారొకరు. వీరి సంభాషణలను తిక్కన ప్రతిభావంతముగా కూర్చి ధర్మజుని రాజనీతి పాండిత్యమును, సంజయుని రాయబారపునైపుణ్యమును వెలార్చెను.

సీ. పాండవేయులఁ దగం బ్రార్థించి యందుల
కక్కటయేనైన నరుగుదెంచి
కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి రాజ్యంబు
పాలుచేసిన మృత్యుపాశములకుఁ

దప్పరే వారలు దగవును నేర్పరు
సామీఁద నిలుచుట సాకుఁగీడె
నన్ను మన్నింతురన్యాయంబు చొరని నా
మాటకుఁ దారొడఁబాటు లేక

తే. యుండుదురె కేరడములాడుచుండిరేనిఁ
గవియు పాండవబాణాగ్ని గాదు సువ్వె
తమ్ము దమలోభమను చిచ్చు దరికొనంగఁ
దెగినవారయి పోదురింతియ తలంప. (౫-౧-౩౬౩)

అని వివేచించి ఉభయహితార్థమైన సంధిమేలని వక్కాణించినాఁడు శ్రీకృష్ణుఁడు. తానాపనికై వచ్చెదనని ప్రకటించి, సంజయు రాయబారము విఫలమైనదని ధ్వనింపఁజేసినాఁడు. ఇది శ్రీకృష్ణుని నీత్యుపాయము.

సంజయు రాయబారఘట్టమున కౌరవపాండవుల బలాబలములు, కౌరవ దుర్నయములు, పాండవులు పొందిన అవమానములు పునర్విమర్శకు వచ్చినవి. పాండవుల గాయములు క్రుళ్ళగింపఁబడినవి. శత్రుకృతావమానానిలము వారి క్రోధానలమును ప్రజ్వరిల్లఁజేసినది. ధృతరాష్ట్రుఁడు నాయకోత్సాహమును భంజింపఁబూనిన నీతియత్నము విఫలమగుటయే గాక పాండవుల యందు విపరీత పరిణామము కలిగించినది. ఈ ఘట్టమున పాండవరోషాగ్నికి ప్రచండ మారుతమువలె తోడుపడినవాఁడు శ్రీకృష్ణుఁడు. సంజయు రాయబారము ముగియుసరికి పాండవోత్సాహము ఉగ్రతామర్ష భావదీప్తిచే ఉజ్జ్వలమై ప్రకాశించినది. 'అనయము పుట్టె జూదమున' అను పద్యము ధర్మరాజు నీతివైశారద్యమునకు తిక్కన వ్యాఖ్యానము.

ద్రుపదపురోహితుని రాయబారము కురుసభలో విస్ఫులింగమును వైచినది. సంజయుని రాయబారపు వృత్తాంత కథనము దానిని రాజబెట్టి, ప్రజ్వరిల్లఁ జేసినది. పాండవ కౌరవ వర్తన తుల్యపరిశీలనమునందు కురువీరులలో భేదాభిప్రాయములు పొడసూపినవి. ధర్మజుఁడు దూరమున కూర్చుండి శాంతిపేరిట రాయబారములు పంపుచు శత్రువులను భేదించు

చున్నాఁడు. ఇది దుర్యోధనాదులకు కన్నెఱ్ఱయైనది. పులిమీద పుట్ర యన్నట్లు మఱల శ్రీ కృష్ణుఁడు రాయబారిగా హాస్తినకు వచ్చెదనని నాఁడు. రారాజునకది ఎంతమాత్రము నంగీకారము కాదు. కాని కాదనుట లోకనీతి కాదు. ఆతఁడేమి చేసినను లోకులయెదుట నది ఔద్ధత్యమువలె భాసించుచున్నది. కురురాజు కానరాని కటకట పడినాఁడు. రాయబారములు ధర్మజుఁడాతనిపై సారించిన నీతిసాయకములు. అవి ఆతనిని నిలువెల్ల బాధింపసాగినవి.

ధర్మజుని ధర్మనీతివర్తనమును మఱింత రూపుకట్టించినది శ్రీకృష్ణుని రాయబారము. ఆతఁడు చేసినది ఉద్యోగము. అది సంధికై చేసిన ప్రయత్నమా? రణోద్యోగమా? అజాతశత్రుని నెరియును, ధర్మంబు, సత్యనిష్ఠయు, అతిశాంతతయు, వినయము, గౌరవమును ఏ జనపతులకు కలవని ప్రశ్నించినాఁడు శ్రీకృష్ణుఁడు. ఈ భాషణమే దుర్యోధనాదులలో విముఖతను కలిగించినది. వారి అవినయవర్తనము ధర్మజుని ధర్మనీతివర్తనమును మఱింత ప్రకాశమానము చేసినది. శ్రీకృష్ణుఁడాశించిన ప్రయోజనమదియే, అది నెరవేరినది. అయినను లౌక్యముగా నిట్లనినాఁడు.

ఉ. వారలు శాంతశూరులు భవచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నారటుఁగాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర రెండు దెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది యగు నవ్విధమేర్పడ నిశ్చయింపుమా.
(5-3-284)

పాండవులు మొదట వాంఛించెడి ధర్మము శాంతి. అది ఫలింపనిచో యుద్ధము. రెండింటికిని వారు సిద్ధమే. వారు నడిచెడి మార్గము ధార్తరాష్ట్రుల నిర్ణయముపైనుండును. శాంతియైనను, సమరమైనను కౌరవులే బాధ్యులు. ఇట్టి చిక్కు సమస్యలో పెట్టినాఁడు వారిని శ్రీకృష్ణుడు. దుర్యోధనునననునయింప పెద్దలు యత్నించినారు. వారిని కర్ణాదులు ప్రతిఘటించినారు. వీరిలో యుద్ధోత్సాహము పొంగులు వారుచున్నది. శ్రీకృష్ణుని

వాక్ప్రభావముచే కౌరవసభ ముగ్ధమైనది. పాండవుల ధర్మమచ్చట విశ్వరూపముతో సాక్షాత్కరించినది. దానిని బంధింప యత్నించి భంగపడినాఁడు దుర్యోధనుఁడు. ధర్మజుని నీతిసూత్రములు తన భవిష్యత్తునే బంధించినవని రారాజు గుర్తింపలేకపోయినాఁడు, శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షముగా కురుసభలో ప్రదర్శించిన భేదనీతియంతయు వాకయెత్తు, పరోక్షముగా కర్ణునిపై ప్రయోగించిన భేదోపాయము మఱియొకయెత్తు. శ్రీకృష్ణుని రాయబారము కౌరవులను మానసికముగా జయించినది. రణరంగమున భౌతికవిజయము సాధించుటకు పూర్వరంగమును సిద్ధము చేసినది.

శ్రీకృష్ణుఁడుపనాయకుఁడగుటచే స్వతంత్ర ప్రవృత్తికలవాఁడు. అతడు అవతార ప్రయోజనముతోఁ బాటు, నాయకప్రయోజనమును సాధించి పెట్టినాఁడు. ఉభయతారకమైన శ్రీకృష్ణుని రాయబారము పాండవ రణోద్యోగమున కంగమగుట ఈ కథలోని వైశిష్ట్యము. కురుక్షేత్రయుద్ధమున ప్రారంభముకానున్న సమరసవనమునకు యజమాని ధర్మజుఁడు, ఋత్విజుఁడు శ్రీకృష్ణుఁడు అరణులలో నుండి అగ్నిపుట్టించి స్థాపించెడి ఉద్యోగమే ఈ పర్వకథార్థము. ధర్మము నాశ్రయించి సాగిన యుద్ధోన్ముఖమైన ఉత్సాహము మూడు రాయబారములయందును క్రమముగా మూడడుగులు ముందుకు వేసి త్రివిక్రమావతారమును దాల్చి మహాయుద్ధ కార్యదీక్షా దక్షమైన స్థాయిత్వము నందుకొనినది.

నాయక, ప్రతినాయక పక్షములయందలి వీరులలో క్రోధోద్రేకగర్వములు, ద్రౌపదిపాత్రగతముగా క్రోధ శోకములు ఇందు పోషింపఁబడిన ఇతర భావములు. ఈ పర్వమునందలి నీతిసారమంతయు తిక్కన కల్పించిన రసాత్మక వాక్యనిర్మాణ శిల్పము నాశ్రయించి జాలువారినది. మూలమునందు కంటె తెలుఁగున పాత్రలశీలములు, సంభాషణలు, వర్తనలు, ప్రవర్తనలు, ఉక్తులు, ప్రసక్తులు రసవంతముగా, భావస్ఫోరకముగా కూర్పఁబడినవి. పాండవులు తమతమ యభిప్రాయములను జనార్దనునకు విన్నవించుకొనునపుడు వారివారి భావములు ప్రకటనములగునట్లు తిక్కన రచనమును సాగించెను. 'కావ్యరసముం గొనియాఁడుచునుండు' తిక్కన రసాభ్యుచిత బంధమీ పర్వమున అర్థాశ్రితమైన ఆలోచనామృతము నందించుచున్నది.

సూ చి క లు :

1) స్వర్గారోహణ పర్వము 1.75,79,85,88

2) 4-1-8.

3) 4-1-31.

4) 4-1-37.

5) సరస్వతీ కంఠాభరణము. 2. కారిక 139.

6) తిక్కన కావ్యశిల్పము-పుట.129- డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి.

7) 'పరిక్రియాం పురాకల్ప ఇతిహాసగతిర్ద్విధా
స్యాదేకనాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా
తత్ర రామాయణం భారతంచోదహరణే'
——కావ్యమీమాంస-రెండవ అధ్యాయము.

8) న్యాయదర్శనమునను సరించిన సమన్వయమునకు చూ: తిక్కన కావ్య శిల్పము-పుట. 124.
మీమాంసాదర్శనము ననుసరించిన సమన్వయమునకు చూ:
ప్రథమాంధ్ర మహాపురాణము-పుటలు 32,33.

9) వీరరసము- డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం. పుట. 140-142.

10) కావ్యాలంకార సంగ్రహము, పుట 32.

11) తిక్కన కావ్యశిల్పము- డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి. పుట-148.

12) 'రసస్తు కథానాయకాశ్రయ స్తద్విపక్షాశ్రయోవా' అని ధ్వన్యాలోకకర్త. కొందఱు రసము కథానాయకాశ్రయమనగా నాయక నిష్ఠమని భ్రమపడుచుందురు. ఆశ్రయ, నిష్ఠాశబ్దముల భేదమును పరికించి నిజస్థితి నెఱుఁగవలయును. రసము నాయకాశ్రితము, సామాజిక నిష్ఠము.

13) ధ్వన్యాలోకము-4వ ఉద్ద్యోతము-పుట.298-299

14) ప్రథమాంధ్ర మహాపురాణము. డా॥జి.వి. సుబ్రహ్మణ్యం. పుట.373.

15) 'రామాయణంలో రసం' (వ్యాసము)- "రామాయణ రసవాహిని" (వ్యాస సంకలనం)-(శ్రీసత్యసాయి మహిళాకళాశాల-అనంతపురం 1976-77) పుటలు. 16,17.

16) ఈ వాదమునకు తెలుగులోనొక ఆకృతినిచ్చినవారు డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు. చూ: "తిక్కనకావ్య శిల్పము"-పుటలు 140 నుండి 144 వరకు.

17) వివరములకు చూ: డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి 'వీరరసము. పుటలు 139 నుండి 193వఱకు.

18) 'కవిత్రయము వారి ఆంధ్ర మహాభారతము-ధ్వని సిద్ధాంత సమన్వయము' డా॥ శలాక రఘునాథశర్మ. వ్రాతప్రతి పుటలు 671 నుండి 683 వఱకు.

19) శాంతిపర్వము పీఠిక 'శాంతనవగీత' పుటలు I:l నుండి XVI-డా॥ జి.వి' సుబ్రహ్మణ్యం

20) 'కవిత్రయము వారి ఆంధ్రమహాభారతము-ధ్వని సిద్ధాంత సమన్వయము'-డా॥ శలాక రఘునాథశర్మ వ్రాతప్రతి పుట 622.

21) "వీరరసము"- డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం-పుట 67.

22) వైశారద్యమనగా సామాద్యుపాయ చతుష్టయమును నేర్పుతో ప్రయోగించుట.

23) "ప్రబంధేచ అంగీరస ఏక ఏవ, ఉపనిబద్ధమానోఽర్థ
విశేషలాభం ఛాయాతిశయంచ పుష్ణాతి. కస్మి
న్నితిచేత్ . యథా రామాయణే యథా మహాభారతే"
-ధ్వన్యాలోకము.

24) ఉద్యోగపర్వ చతుర్థాశ్వాసమున ఉలూకుని రాయబారము కలదు కాని దానికొక విస్తృతితో కూడిన సమగ్రత కానరాదు.

25) ఈ సన్నివేశ విస్తరణములోని శిల్పసార్థక్యమును ప్రథమాధ్యాయమున వివరించుటయైనది. పుటలు 19-28.

26) "మత్స్యపతి మఱందియు దండనాథుండును గీచకాగ్రజుండును రూపాభిమానియు నానాభరణ ధరణశీలుండును దుర్విదగ్ధుండును బలగర్వితుండునునగు సింహబలుడు" 4-2-22.

27) "సేనాపతిర్విరాటస్య దదర్శ ద్రుపదాత్మజామ్".

28) "కావ్యాలంకారసంగ్రహము" శ్రీసన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి-పుట 391.

29) ద్రౌపదీపాత్రము నాశ్రయించి పోషింపఁబడిన ఇతర రసభావములను తత్పాత్రచిత్రణ పర్యాలోచన సందర్భమున పరిశీలించుటయైనది పుటలు 323-350.

30) ఆంగికాభినయమునకు - "కనుగొని కోపవేగమున" 4-2 133,134.

31) భీముని ఉత్తమ నాయకత్వ లక్షణములను ప్రబంధార్థౌచిత్యమను విభాగమున భావించుటయైనది. పుటలు 92-102.

32) మూడవ అధ్యాయము. పుటలు 228-294.

# ఉపాఖ్యానములు - ఉపదేశములు

తిక్కన భారతమును పరిశీలించినచో ప్రధానముగా నాతఁడు మూలమును సంగ్రహించినట్లు స్పష్టము కాగలదు. నన్నయవలె కథను సంక్షేపించుటయే కాక తన సంగ్రహ వ్యాఖ్యానరచన వలనకూడ తిక్కన మూలము యొక్క పరిమాణమును తగ్గింపఁ గలిగెను.

తిక్కన సన్నివేశ కల్పనలను, ఔచిత్య పాలనమును, వర్ణనా నైపుణ్యమును, పాత్రచిత్రణమును, రసపోషణమును చూచితిమి. ఇప్పుడు తిక్కన సంక్షేపించిన వృత్తాంతములను సంగ్రహ విధానమును, తత్కారణములను, అందలి సార్థక్యములను పరిశీలింపవలెను.

తిక్కన ప్రధానేతివృత్తముపై దృష్టినిలిపి దీర్ఘములుగా నున్న ఉపాఖ్యానములను సంక్షేపించెను. కొన్ని వృత్తాంతములను సూచించి వదలివేయగా మఱి కొన్నింటిని సూచింపకయే విడిచెను. తిక్కన చేసిన యిట్టి సంగ్రహణమును నాలుగు విధములుగా వివేచింపవచ్చును. అవి—

1. మూలమున నున్న ఉపాఖ్యానమునుగాని, ధర్మబోధనుగాని సూచించి వదలివేయుట. ఉదా :- విదులోపాఖ్యానము, సనత్సుజాతీయము.

2. మూలమున నున్న వృత్తాంతములనసలు పేర్కొనకయే విడుచుట. ఉదా :- దత్తాత్రేయ, సాధ్యుల సంభాషణ, బోయవాఁడు పతుల కథ. ఇట్టివి సంఖ్యలో తక్కువ.

3. అత్యంత సంగ్రహముగా రచించుట. ఉదా :- గరుడ గర్వ భంగము, గాలవోపాఖ్యానము.

4. సారవంతముగా, సమగ్రముగా సంక్షేపించుట. ఉదా :- పురందర విజయోపాఖ్యానము, అంబోపాఖ్యానము.

విడివిడిగా ఒక్కొక్క ఉపాఖ్యానమును గ్రహించి మూలముతోఁ బోల్చి తిక్కన రచనము సారహీనముగా నున్నదనుట పొరపాటు. సంక్షేపము చేయుటవలన ప్రధానేతివృత్తము పట్టు సడలకుండ సాగు నవకాశమేర్పడును. అట్టిచో ఉపాఖ్యానములలో కొన్ని అలంకారములుగాని, ఉపాఖ్యానములలోని పాత్రల భావవిశేషణముగాని ఉజ్జగింపఁబడుట దోషము కాదు. ఉపాఖ్యానమెప్పుడు గాని ప్రధానేతివృత్తమునకంగభూతముగా నిర్వహింపఁబడవలెను.

మూలభారతము ధర్మదృష్టితో రచింపఁబడినది. అందు ఉపదేశము ప్రధానాంశము. ధర్మశాస్త్రమనదగిన మూలభారతమున విస్తరణ తప్పనిసరి. పరిమాణౌచిత్యమందు గౌణము. ధర్మోపదేశము ప్రధానము. ఆంధ్రమహాభారతమున పరిమాణమునందౌచిత్యము పాటింపఁబడుటయే ప్రధానము. మహాకావ్యమనదగిన ఆంధ్రభారతమున అంగిరసము కంటె విస్తారముగా అంగరసపోషణ పనికిరాదు అనగా ప్రధానేతివృత్తమునందలి అంగిరసము ప్రముఖముగా పోషింపఁబడును.[1] ఉపాఖ్యానమునందలి రసములా అంగిరసమునకు పోషకములుగా మాత్రమే తీర్చఁబడును. ఇతిహాసలక్షణము లెక్కువగా కల మూలభారతమున ఏ పాత్రముచే కథ చెప్పఁబడినట్లున్నను కథనము మారదు. తిక్కన రచనమున కథ, కథనముకూడ చెప్పుచున్న పాత్ర మనోభావములననుసరించి మలచబడును. ఈ కారణములవలన ఉపాఖ్యానములు, ధర్మోపదేశములు ఆంధ్రమహాభారతమున సంక్షేపింపఁబడినవి. అది సమంజసముకూడ.

విరాటపర్వమున ఉపాఖ్యానములుగాని, ఉపదేశములుగాని లేవు. అందుచే ఆ పర్వమున రసపోషణమునకనుకూలముగ తిక్కన పెంపుచేయుటయు జరిగినది. తిక్కన కల్పనలలో సార్థక్యమునందు చూచితిమి.

ఇక ఉద్యోగపర్వము విరాటపర్వము వంటిది కాదు. దీనిలో పెక్కుపాఖ్యానములున్నవి. గీతతో సమానముగా నెంచఁదగిన సనత్సుజాతీయము కలదు. నీత్యుపదేశములలో అగ్రగణ్యమగు విదురనీతి ఇందే కలదు. ఇదిగాక కర్ణుని జన్మవృత్తాంతము మఱల నిందు వచ్చినది. ధృతరాష్ట్రునకు, దుర్యోధ

నునకు హితవు చెప్పుట అనునంశము పునరావృత్తమగుచునే యుండును. నాలుగు రాయబారములీ పర్వమున నున్నవి. నాయక, ప్రతినాయక పక్షము వారొండొరులకు చెప్పిపంపు సందేశములు, రాయబారి తిరిగివచ్చిన పిదప వారాతనిముఖమున ఆవలి పక్షమువారి అభిప్రాయములను వినుట కలదు. కథ ఎక్కువ ముందుకు జరుగలేదు. సంధికై ఇరుపక్షముల వారిలో కొందఱు యత్నించిరి. ఫలింపలేదు. సైన్యములను సమీకరించుకొని సేనాధిపతులను నియమించుకొని ఇరుపక్షముల వారు కురుక్షేత్రమును సమీపించి, విడిసిరి. ఇంతకు మించి కథలేదు. ఈ పర్వమున కథ తక్కువగుటచే తక్కిన అంశములనే మాత్రము మించి రచించినను కథలోబలముపోయి. నీరసమగును. ఇట్లగుట గమనించిన తిక్కన వివిధాంశములను పరిమితములుగా సంక్షేపించి ప్రధాన కథకు భంగము రాకుండగాఁ రచించెను.[2] ఆయా వృత్తాంతములను తిక్కన ఎట్లు కుదించెనో, ఎందులకు పరిత్యజించెనో పరిశీలింపవలెను.

## 1. సూచించి వదలివేసిన వృత్తాంతములు :

### (అ) సనత్సుజాతీయము ;

"ఎత్తివైచిన ఆధ్యాత్మిక భాగములలో ముఖ్యమైనది. భగవద్గీతతో సాటివచ్చునది, శ్రుతి ప్రపంచములోఁ జేరదగినది సనత్సుజాతీయము. గీతకు వలెనే దీనికిని శంకరులు భాష్యము వ్రాయుట దానిమహాత్వమునకు నిదర్శనము. దీనిని వదులుటలో తిక్కన వహించిన అధికారము నిరుపమానమైనది. ఈ ఘట్టమువలన కథకు కలిగిన మేలేమియులేదు. అదియుండియు లేకయు నిర్విశేషమే. ఆ ఉపదేశము నాలకించు ధృతరాష్ట్రుఁడు భగవద్గీత నాలకించి యుద్ధోన్ముఖుడైన అర్జునునివలె ధర్మమార్గోన్ముఖుఁడు కాజాలఁడు. అతని చంచలతను, కృత్రిమబుద్ధిని మరల్పఁజాలని ఆ ఉపనిషత్తు నిష్ప్రయోజనముగా నుండుటకంటె తొలగుటయేమేలు. అట్లు తొలగించుటవలన అమూల్యమైన మహర్షివాక్యము వ్యర్థముగాఁబోక ఆత్మగౌరవమును కాపాడుకొన్నదయ్యెను ఆ సనత్సుజాతీయములోని విషయములు ఇటుగాక గ్రంథమునందచ్చటచ్చట కొన్నిచోట్ల అనేక విధములుగా వివరింపఁబడుటచే దానినిట తొలగించుటవలన నష్టమేమియు కలుగలేదు."[3] ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పై అభిప్రాయము సర్వవిమర్శకామోద[4] యోగ్యమైనట్టిది

ఆచార్య లక్ష్మీకాంతంగారు కథలో దానిప్రయోజనము లేమి పరిత్యజింపఁబడుటకు కారణముగా నూహించిరి. సనత్సుజాతీయమును తిక్కన వదలివేయుటకు మఱియొక కారణమునూహింపవచ్చును. ఇది దేశ కాల పాత్రౌచిత్యములకు సంబంధించినది. యుద్ధరంగ మధ్యమున కృష్ణుఁడర్జునునకు గీతనుపదేశించుట ఎట్లు అసంభవమనిపించునో అట్లే వివేకవిహీనుఁడైన ధృతరాష్ట్రునకు సనత్సుజాతుఁడంత దీర్ఘము, దురవబోధకమైన వేదాంతతత్త్వమును సుబోధకము చేయుట, అదియు ఒక్కరాత్రి కాలములో, అసాధ్యము. సంజయుఁడు మాటలాడి వెళ్ళిన తరువాత విదురుఁడేతెంచి ఆతనికి ధర్మనీత్యుపదేశమును చేయును. ఆ విదురనీతికే ఆ రాత్రికాలము సరిపోవును. ఇక సనత్సుజాతీయమునకు కాలము మిగులుటెట్లు? ఈ సాధ్యాసాధ్యములను వివేచించి తిక్కన వదలివేసిన ఘట్టమిది.

"మూలమునందలి సనత్సుజాతీయము తెలుగున నించుమించుగా లుప్తమైనట్లే ఎంచవచ్చును. ఇందులకు కొందఱు తిక్కనను మహాపరాధిగా బరిగణించుచున్నారు. కాని కావ్యరసదృష్టితో జూచినపుడు ఈ శాస్త్ర గంధ మిక్కడ లేకుండుటవలన రసము, వస్తువు రెండును నిఃప్తములుగాలేదు శాస్త్రభాగమునంతను శాంతి, అనుశాసనికము, అశ్వమేధము మున్నగు పర్వములలో విశదీకరింపవచ్చుననియు అచ్చటనున్నచో వస్తుగమనమునకట్టే వనియు కావ్యరసతత్త్వవేత్తయగు తిక్కన నిర్ణయించుకొనియుండవచ్చును. కొందఱిది గుహ్యామైనయోగశాస్త్రముగావున నాతఁడు విడిచిపెట్టి యుండవచ్చునని యూహించుచున్నారు. 'పరతత్త్వము ప్రసాదించునట్టి గూఢోక్తులను గ్రహించుచుండ' అను వాక్యభాగము వారి ఈ వాదనకు జేయూతగానున్నది. కాని యోగశాస్త్రమును గూఢమనీ ఎంచి విసర్జింపవలసి వచ్చినచో పైన చెప్పిన మూడు పర్వములలో విస్తారభాగము లుప్తము కావలసినదే. భారతమున శాస్త్రభాగమున జాల పునరుక్తియున్నది. సనత్సుజాతీయము, భగవద్గీత, ఉత్తరగీత, అనుగీత మున్నగునవెన్నియో ఒక్కొక్కటి ప్రత్యేకముగ గైకొన్నప్పుడు ఎంతో మనోహరములగు గ్రంథరాజములే యయ్యును సమూహముగ చేర్చిచూచినప్పుడు చాల భాగము చెప్పినదే చెప్పుట యగుచున్నది, తిక్కన కేవలము 'వేదభారవాహి'గా నందున ఆధ్యాత్మిక సంపదనంతయు గ్రంథముల మూలముననే గాకుండ అనుభవమునగూడ

నాపోశనము పట్టిన వాడగుటచే శాస్త్రభాగమునంతను బూర్ణముగా జీర్ణము చేసికొని దానిని ప్రత్యేకముగ కేటాయించి సమరసంరంభము ముగిసిన వెనుక శాంతియుతముగ కూర్చున్నపుడు ధర్మజాదుల ప్రసంగములలో క్రోడీకరించి నాడు ఇట్లగుటచే విషయవిభాగమునందును, రసస్ఫూర్తియందును గూడ నాంధ్రమహాభారతమున్నత సోపానములధిరోహించుచు మూలమును మించుచున్నది."[5]

శ్రోత తత్ఫలమును గ్రహింపకపోవుట, అది కథకు మిక్కిలి ఆటంకముగా నుండుట కూడ దీనిని వదలివేయుటకు కారణములే. ఉపదేశముగాని హితోక్తిగాని శ్రోత అర్హతను బట్టి ప్రయోజనకారియగును. విదురనీతికూడ ఫలితములేని వ్యాపారమేయైనది చివరకు. కాని విదురుడు ధృతరాష్ట్రుని హితుడు, సచివుడు, మిత్రుడు, బాంధవుడు. అట్లగుటంజేసి ధృతరాష్ట్రుడు ఆచరించినను లేకపోయినను అతడు కర్తవ్యముపదేశింప వలసి వచ్చుచుండును ఇచట నిదురలేని రాజు కొంత కలతదేరుటకైనను అతడు ప్రసంగింపవలెను విదురనీతికి కొంత ఫలితముకూడ కనుపించినది. తాత్కాలికముగా ధృతరాష్ట్రుడు కలతదేరి విదురుని హితవును పాటింతునని[6] పలికినాడు. ఇంతమాత్రము మార్పు కూడ సనత్సుజాతీయము వలన కలుగక పోవుటచే దానిని వదలివేయుట తప్పనిసరియైనది తిక్కనకు. మూలమునందిది నూట ఇరువదియొక్క శ్లోకములలో[7] విస్తరింపబడియున్నది. కొన్నిప్రతులలో నూట తొంబది ఒక్క శ్లోకములును కలవు. తిక్కన దీనిని ఒక వచనములో సూచించి వదలివేసెను.

మూలభారతమున ధర్మప్రబోధమునకు కురుపాండవ కథ ఆలంబనముగా గైకొనబడినది. తిక్కన కురుపాండవ కథకు ధర్మోపదేశములనంగములుగాఁ జేసెను. సనత్సుజాతీయము సూచించి వదలుటకి అనువాదప్రణాళిక ఒక కారణము.

రసదృష్టిగల తిక్కన ఈ తత్త్వజ్ఞానమును విడిచివేయుట సమంజసమే. మొత్తముమీద తిక్కన సనత్సుజాతీయమును విడిచిపెట్టుటకు మూడు ప్రధానకారణములు కనిపించుచున్నవి. 1. ప్రయోజన రహితమగుట.

2. సాధ్యాసాధ్యనిరూపణము 3. తిక్కన అనువాదపద్ధతికిగాని, కావ్యకళా శిల్ప ప్రణాళికకుగాని సరిపడకుండుట. ఈ మూఁడు కారణముల సమ్మేళనమే దానిని తొలగింపఁజేసినది. ఇఁక దీనిని విడుచుటవలన ఒనగూడిన ప్రయోజనములు మూఁడు కలవు. 1. మహర్షివాక్కు వృథాగాకుండుట. 2. కథ వేగముగా సాగుట. 3. అసంభవమను మాటకు ఆంధ్రభారతము పాత్రము కాకుండుట.

సనత్సుజాతీయమునకు మఱి మూలభారతమునందుగల స్థానమెట్టిదను ప్రశ్న ముదయించును. మూలభారతము ప్రధానముగా ధర్మశాస్త్రము. అది పంచమవేదమను ప్రఖ్యాతి నందినది. అందు సనత్సుజాతీయము, భగవద్గీత శాంతనవగీత ఇత్యాదులు మూలస్తంభములు. వానిపైనల్లుకొనిన తీగయే భారతకథ. మూలభారత నిర్మాణమునకు ఆ స్తంభములే ఆధారములుగాని, భారతకథగాదు. కనుక మూలమున దీని స్థానమనల్పము. అదియందుండుటయే న్యాయము, సమంజసము.

## (ఆ) విదులా సంజయోపాఖ్యానము :

శ్రీకృష్ణుఁడు రాయబారమును నెఱపి విఫలుఁడై తిరిగిపోవునపుడు కుంతి ఆతనితో నీ ఉపాఖ్యానమును చెప్పి ధర్మజునకు వినిపింపుమని కోరెను. ఇది మూలమున నూటనలువది శ్లోకములలో విస్తరించి యున్నది. ఇందు విశేషమేమియును లేదు. కుంతి ఏవిధముగా ధర్మజునుద్బోధించి యుద్ధోన్ముఖుని చేయునో అదేవిధముగా విదుల తనకుమారుఁడైన సంజయుని పిఱికితనమును పోగొట్టి యుద్ధమునుండి మఱలి వచ్చిన ఆతనిని తిరిగి యుద్ధమునకు పంపును. ఇది కుంతిసందేశము వంటిదే. పైగా ఈ వృత్తాంతమున కథకన్నను రాజధర్మములు ప్రముఖముగా పేర్కొనఁబడినవి. "పరధర్మో భయావహః" అనునది ఆ ప్రసంగముయొక్క సారాంశము. విదుల సంజయునకొసంగిన సందేశ సారాంశమునే కుంతి ధర్మజునకు చెప్పిపంపినట్లు రచించి తిక్కన ఆ ఉపాఖ్యానమును, అంతకు ముందు పేర్కొనఁబడిన ముచికుందుని విషయమును, ఆయా యుగధర్మములను క్షత్రియధర్మములను విడిచివేసెను.

"…. విక్రమోప జీవులయిన ముచుకుందుండును సంజయుండును నను తొంటి నరపతుల చరిత్రంబులు సెప్పి యుధిష్ఠిరుండు వీరిని వినండో

కాకయని పలికి యెల్లవారును వినుచుండ వెండియు నిట్లనియె.” (5-4-13వ. వ.)

ఉ. రాజుల కెందు నారయఁ బరాక్రమ జీవన వృత్తి దక్కనొం
డోజ నిషిద్ధమండ్రు మునులుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు బుద్ధివిహీనులు వానిఁదక్కి ని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదురంబుజోదరా.
(5-4-14)

పై వచనమునందు ఆ రాజుల చరిత్రలను పద్యమునందా రాజధర్మము తిక్కన సూచించి కథాగమనమున కెట్టి కొరత లేకుండునట్లు రచించెను. మూలమున అతివిస్తృతముగా నున్న ఇట్టి ఉపాఖ్యానములు ప్రధానకథకా టంకములగుచుండుట నిర్వివాదాంశము. ఇతిహాసమున అట్లుండుట దోసము గాదు. కాని మహాకావ్యముగా సంతరింపఁదలచిన తిక్కన వానిని విధిగా సంక్షేపింపవలసి వచ్చినది.

ఇట్లే సుధన్వ విరోచనుల వృత్తాంతమును, దంభోద్భవుని వృత్తాంతమును యయాతి విషయమును, కంసుని విషయమును, భోయహారు-తేనె కథను తిక్కన మిక్కిలి సంక్షేపించెను.

సుధన్వ-విరోచనుల ధర్మసందేహము, ప్రహ్లాదుఁడు సత్యము నాశ్రయించి న్యాయమును పలుకుట, సుధన్వుఁడు ప్రీతుఁడై విరోచనుని ప్రహ్లాదునకనుగ్రహించుట సుధన్వ-విరోచనుల వృత్తాంతము. దీనిని విదురుఁడు ధృతరాష్ట్రునకు చెప్పును సత్యముయొక్క ఆవశ్యకత, అసత్యవచన దుష్ఫలితములు మూలమున వివరింపఁబడినవి. ధృతరాష్ట్రునకు చెప్పుట చెవిటికి శంకూదుటయైనది. అందువలననే తిక్కన యద్దానిని మిక్కిలి సంగ్రహించెను. ఆ కథ చెప్పఁబడిన ఉద్దేశ్యము నిట్లు సంగ్రహముగాఁ బేర్కొనెను. “నీవును ధర్మంబు విడువక యధర్మోపేతులైన నీకొడుకుల వలని పక్షపాతంబువిడిచి తెఱంగుచేయుము వారును నాపదలేక బ్రదుకుదురు నీకును శోకంబు లేక తక్కు న”ని విదురుడుపదేశించెను.

ఊరక యే కథచెప్పుటకాక ఆకథలోని అంతరార్థమును సూక్ష్మముగా వివరించి, ప్రయోజనమునాశించి అది చెప్పఁబడినదో తెలుపుట తిక్కనపద్ధతి. దంభోద్భవవృత్తాంతము మూలమునందు నలుబదియైదు శ్లోకములలో చెప్పఁబడి యున్నది (5-94 అ). తిక్కన దీనిని ఒక్క పద్యములో చెప్పివైచెను (5-3-287). దీనిని జామదగ్ని దుర్యోధనునకు వినిపించెను. అర్జున శ్రీకృష్ణులే నరనారాయణులని తెలుపుటయే ఈ కథ వలన ప్రయోజనము. తిక్కన ఈ విషయమును మాత్రము తెలిపి దంభోద్భవుని ప్రగల్భగుణములు, పట్టుదల, వృథా ప్రయాస, నరునితో నాతనికైన యుద్ధము, ఓటమి ఇత్యాది విషయములను వివరింపలేదు. సభాంతరమున కథరసవత్తరముగా సాగుచున్న సందర్భములో ఇట్టి ఉపాఖ్యానము లవాంతర ప్రవర్తితములు. వీనిని విపులముగా రచించినచో ప్రకరణౌచిత్యము చెడి రసభంజకమగును. తిక్కన సంక్షేపించుటకిదియే కారణము. దంభోద్భవ, గరుడ, గాలవ్య, యయాతి వృత్తాంతములను వినినపిదపనైనను దుర్యోధనుని ఉద్ధతి ఇసుమంతయు మారలేదు సరిగదా మునులనే తిరస్కరించి పలికినాఁడు. ఎవరినుద్దేశించి ఆ వృత్తాంతములు చెప్పబడుచున్నవో ఆతఁడే అనాసక్తుఁడైనపుడు వానిని విపులముగా వివరించుట ఫలములేని కృషి. ఆ కథలు దుర్యోధనుని గర్వమును తగ్గించుకొమ్మని చెప్పుటకే రచింపఁబడగా అహంకారము, అవినయము మఱింత ఎక్కువైనవి.

యయాతి వృత్తాంతము నిట్టిదే. ఇది మూలమున ఎనుబది ఎనిమిది శ్లోకములలోనున్నది. తిక్కన ఒక్క వచనములో సూచించి వదలివైచెను. మూలమున మాధవీ స్వయంవరము, యయాతి స్వర్గారోహణ వృత్తాంతము ఒక అధ్యాయమునన, స్వర్గ భ్రష్టత ఒక అధ్యాయములో, పతితుఁడై మనుమల మధ్యపడుట, వారి తపోబలములను గైకొనుట ఒక అధ్యాయములో, స్వర్గారోహణము, తన పతనమునకు కారణమెరుంగుట ఒక అధ్యాయములో వర్ణింపబడినవి. 10

"కావున నెట్టివారికి నిర్బంధము దగదు. దురభిమానంబు దుర్దశ నాపాదించు నయ్యయాతి దురభిమానంబునం గాదె పుణ్యలోక పరిభ్రష్టుండై మాధవీ పుత్రులగు నన్నలువురు దౌహిత్రులకతంబున నూర్ధ్వగతిం గనియె

..." (5-3-322) అని తిక్కన సంక్షేపించెను. యయాతి వృత్తాంతము దుర్యోధనుఁడు తదితరులు తప్పక ఎఱింగి యుందురు. తిక్కన దీనిని ఇంత సంక్షేపించుటకిది మఱియొక కారణముగా నూహింపవచ్చును. 'దుర్మా నంబునం గాదె' అనుటలో ఇతఃపూర్వము తెలిసినదానిని తిరిగి చెప్పుచున్న ధ్వని కలదుకూడ.

## 2. సూచింపకయే వదలిన అంశములు ;

మూలమునందున్న [11]దత్తాత్రేయ-సాధ్యుల సంభాషణము విడువబడినది. ఈ దత్తాత్రేయోపదేశము ఆ సందర్భమునకంత తగియుండలేదు. ఏ ప్రయోజనము నాశించి విదురుఁడా విషయమును ధృతరాష్ట్రునకు తెలుపఁబూనినాడో అదియును విదితమగుటలేదు. ఇట్లు సందిగ్ధముగా నుండుటచే తిక్కన దీనిని పూర్తిగా వదలివేసెను. ఆ తరువాత విదురునిచే చెప్పఁబడినట్లున్న "బోయ వాఁడు-పక్షులు" కథను[12] కూడ తిక్కన విడిచెను. జ్ఞాతులు తమలోతాము పోరుటవలన పతనమొందుదురని ఈ కథ తాత్పర్యము. విదురుఁడు ధృతరాష్ట్రుని సమ్ముఖమున దుర్యోధనునకీ కథచెప్పినట్లు మూలముననున్నది. ఇంత కంటె ముఖ్యములగు విషయములను ఎఱింగిన సుయోధనుఁడు ఎఱుఁగనివానివలె ప్రవర్తించినాఁడట్లగుటచే దీనివలన నాతఁడు మారుటలేదు. విదురుని సంభాషణమచట అంత సమంజసముగా కుదురుటలేదు. అదే సందర్భమున విదురుఁడు చెప్పిన బోయలు-తేనెకథను[13] తిక్కన భీష్మునిచే చెప్పించుట జరిగినది. "మనవారలు మున్న దుర్బలులు తమలోనం బెనంకు వలయు విరసవచనంబు లాడుచు నీంతలు పుట్టించుట యిది యర్జుననకుఁగార్యంబ"... ని విదురుఁడు భాషించెనని మాత్రము తిక్కనరచించెను. హైహయులతో విప్రులు యుద్ధము చేసిరని దుర్యోధనుఁడు భీష్మునితో చెప్పును.[14] ఇది భీష్మునకు తెలిసియుండును. తిక్కన ఈ భాగమును వదలి నాటకీయ రచనలో దుర్యోధనుడు భీష్ముని ప్రార్థించినట్లు రచించెను.

## 3. మిక్కిలి సంగ్రహముగా రచించిన భాగములు;

మూలమున నున్న కొన్ని ఉపాఖ్యానములను సన్నివేశములను తిక్కన కొంత సంగ్రహముగా రచించిన సందర్భములు కలవు. అవి గరుడగర్వ భంగము, గాలవోపాఖ్యానము, ఉలూకునిరాయబారము, సుక్మివృత్తాంతము.

## గరుడ గర్వభంగము ;

ఈ గరుడుని వృత్తాంతము మూలమున 9 అధ్యాయములలో. 206 శ్లోకములలో విస్తరింపఁబడియున్నది. తిక్కన యిద్దానిని పదునాలుగు పద్య గద్యములలో సంగ్రహముగా రచించెను.[15]

మాతలి తన కుమార్తెయైన గుణకేశి కొఱకు వరాన్వేషణ చేయుచు నారదునితోఁగూడి సకలలోకములు తిరిగెనని మూలమున కలదు. ఆ సందర్భమున వరుణ, పాతాళ, రసాతల, నాగలోకములను ఆయాలోకములలో ప్రఖ్యాతులగు పురుషులను గూర్చి వివరముగా చెప్పఁబడియున్నది. తిక్కన ఈ భాగమును వదలివైచెను. వరాన్వేషణము నసలు పేర్కొనలేదు.

ప్రస్తుతాంశము గరుడగర్వభంగమగుటచే పై కథాభాగమనవసర ప్రసంగముగాఁ దోచుచున్నది. "అమరేంద్ర రథసూతుఁడైన మాతలి దన సుత గుణకేశికిఁబతిఁదగంగ నారసి" అని పేర్కొని ఆ కథార్థమును గ్రహించి నాఁడు తిక్కన. గుణకేశి కళ్యాణమాదిగా కథను ప్రారంభించినాడు. మాతలి సుముఖునితో గుణకేశి వివాహమును చేయనెంచుట, ఆర్యకుఁడు గరుడుని నియమమును దెలుపుట, మాతలి దేవేంద్రుని యొద్దకు వారిని తీసుకొని పోవుట-ఇత్యాదికథ మూలమున ఇరువదితొమ్మిది శ్లోకములలో నుండగా తిక్కన రెండు గద్యపద్యములలో రచించెను.

ఇంతవఱకు అత్యంత సంగ్రహరచన కావించిన తిక్కన గరుడుని గర్వభంగమును, నారాయణుని మాహాత్మ్యమును కొంత విపులముగా రచించెను. మూలమున ముప్పదియైదు శ్లోకములున్న ఈ భాగమును పది పద్య గద్యములలో రచించెను. ఉద్ధతుల గర్వభంగము, నారాయణుని దైవత్వము కణ్వుఁడు బోధింపఁదలచిన ప్రధానాంశములగుటచే తిక్కన విపులీకరించెను.

తాను, దేవేంద్రుఁడు, విష్ణువు కూడ కశ్యపప్రజాపతి కుమారులే కనుక సమానప్రతిపత్తి కలవారని గరుత్మంతుఁడనుట దుర్యోధనుని తలపించుచున్నవి పాండవులు, తాము ఒకే వంశమున జన్మించి, ఒక్కచో విద్యాభ్యాసమొనరించినందున పాండవులు తమకన్న పరాక్రమవంతులెట్లగుదురని అతఁడు

తండ్రితోఁ బలికినట్లు ఇచట గరుత్మంతుఁడనీనాఁడు. గరుత్మంతునివలెనే దుర్యోధనుఁడును గర్వభంగమును పొందునని ధ్వనింపచేయు ఈ భాగమును తిక్కన యథామూలముగా ననువదించెను. మునుపే కథార్థమును ప్రవచింపఁ జేసినాఁడు తిక్కన. మూలమునందు కథాంతము వఱకు ఆ కథ పల చెప్పబడు చున్నది తెలియకుండును.

క॥ అదివోలుఁ దప్పు నెదిరిని
మది నెఱుఁగక విగ్రహించి మదమెత్తుట యొ
ప్ప దహంకారం బొనరిం
పదె పౌరుషహానిఁ దొల్లి పక్షీంద్రునకున్ (5 3-289)

సారసంగ్రహమనగా నిట్టిదని నిర్దేశించి చూపుటకు తగియున్నదీపద్యము.

వరాన్వేషణమునకు నారదుఁడు తోడ్పడి సకలలోక విశేషములను మాతలికి తెలిపినట్లు మూలమునమన్నది. ఇంతయు నీ మహానుభావుండెఱుంగు నని నారదుంజూపి 'యితఁడు మాతలి కన్యాకార్యంబునకుఁదోడై నడచె'నని కణ్వుఁడు చెప్పెనని మాత్రము తిక్కన అనువదించెను. కణ్వుఁడు గరుడుని వృత్తాంతమంతయును చెప్పిన పిదప నారదుఁడు గర్వము తగదని బోధించి నాఁడు. కథారంభాంతములలో కథాప్రయోజనమును సూచించుట విశే షము.

క॥ బలవంతుల బలముల న
గ్గలమగు బల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడునే
కొలఁదుల వారికి గర్వము
నిలుచునె నయమార్గవృత్తి నిలిచిన భంగిన్.(5-3-302)

మూలమున ఉపాఖ్యానములు ప్రధానకథకెట్లు తోడుపడునో సూచింపఁబడదు. తిక్కన ఎంత చిన్న కథలోనైనను ఉపక్రమణిక, ఉపసంహారములను నిర్వ హించి తత్ప్రయోజనమును సమీక్షించి చెప్పుననుటకీ వృత్తాంతమొక నిదర్శ నము.

## గాలవోపాఖ్యానము :

దీనిని నారదుఁడు దుర్యోధనునకు చెప్పును. ఇది గరుత్మంతుని వృత్తాంతము తరువాత చెప్పఁబడినది. మూలమున నిది అతి విస్తృతమైయున్నది, ఇరువదినాలుగు అధ్యాయములలో రెండువందల తొంబది తొమ్మిది శ్లోకములందు నిబంధింపబడిన ఉపాఖ్యానమిది దీనిని తిక్కన పందొమ్మిది పద్యగద్యములలో సంక్షేపించెను.16

కణ్వుఁడు గరుడుని వృత్తాంతమును వివరించిన పిదప దుర్యోధనుఁడు వారి మాటలను లెక్కచేయక తన్ను భగవంతుఁడెట్లు సృష్టించెనో అట్లేచేయుదునని అట్టహాసముగాఁబలికినట్లు మూలమున కలదు. దుర్యోధనుఁడట్లు నిర్లక్ష్యముగా ప్రవర్తించిన తరువాత నారదుఁడు గాలవుని గురించి చెప్పినట్లున్నది. అట్లుండుట సరికాదని తిక్కన దుర్యోధనుని తిరస్కారభాషణమును గాలవోపాఖ్యానము కూడ ముగిసిన పిదప రచించెను.

అంతియగాదు. వ్యాసుఁడు దుర్యోధనునకు హితబోధ చేయలేదా అని జనమేజయుఁడడుగఁగా వైశంపాయనుఁడు దేవర్షి నారదుఁడు కూడ హితబోధ చేసెనని చెప్పుచు గాలవోపాఖ్యానమును వినిపించినట్లు మూలమునను న్నది. అత్యంతాసక్తిదాయకముగా, బిగువుగా కథ నడచుచుండగా మధ్యలో జనమేజయుఁడడుగుట వైశంపాయనుఁడు సమాధానము నొసంగుట అనవసర ప్రసక్తి. నాటకము మధ్యలో ప్రేక్షకుఁడు రంగము మీఁదికి వచ్చి మాటలాడినట్లున్నది. సాధారణముగా తిక్కన, జనమేజయ, వైశంపాయనుల ప్రశ్నోత్తరములను ఆశ్వాసాద్యంతములతో నుంచును.

విశ్వామిత్రుని పరీక్షించుటకు యమధర్మరాజు వసిష్ఠరూపములో వచ్చి, ఆహారము పచనము చేసినతరువాత అటులనే ఉంచుమని, వందయేళ్ళ తరువాత వచ్చి అనుగ్రహించెనని అప్పుడే గాలవుఁడు విశ్వామిత్రునకు శిష్యుఁడాయెనని మూలమునయున్నది (అ. 104. శ్లో 8-18). తిక్కన ఈ వివరములను వదలివేసి 'గాలవుఁడు విశ్వామిత్రుపాల విద్యాభ్యాసము చేసి' అని నేరుగా కథను ప్రారంభించెను. ప్రస్తుతాంశము విశ్వామిత్రుని తపోదీక్ష కాదు. గాలవుని మూర్ఖపు పట్టుదల- అజ్ఞానివలన కలిగిన కష్టములు. తిక్కన కథా

ప్రయోజనమును దృష్టియందుంచుకొని తత్పోషకములగు నంశములనే గ్రహించి తక్కిన భాగములను వదలివైచెను.

ఒక అధ్యాయములో, పదునేను శ్లోకములలో గాలవుని విచారము, అసత్యవాదికి కలుగు అనర్థములు చెప్పఁబడినవి. అనువాదమున ఒక పద్య-మున విషయము కలదుకాని విషయవివరణములేదు.

మూలమునందు దిక్కులు నాల్గింటియొక్క ప్రాశస్త్యమును గ్గడించి, ఆ దిక్కులలో నున్న ఆశ్రమములను, ఆ దిక్కులందు జరిగిన యుద్ధములను గరుత్మంతుఁడు వివరించినట్లున్నది. నాలుగు అధ్యాయములలో నున్న ఈ దిశావర్ణనమును వదలి తిక్కన ఒకపద్యములో గరుడుని పేర్కొనెను (308)

తూర్పు దిక్కునకు తీసుకొనిపొమ్మని గాలవుఁడడుగగా గరుత్మంతుఁడు వేగముగా తీసికొనిపోవుట, గాలవుఁడు భయభ్రాంతుఁడగుట, ఋషభపర్వతముమీద దిగుట, శాండిలి ఆతిథ్యము, గరుడుని రెక్కలుపోయి మఱలివచ్చుట, విశ్వామిత్రుఁడు గురుదక్షిణనిమ్మని గుర్తుచేయుట మూలమున రెండధ్యాయములలో నున్నవి. ఇవి ఉపకథలో ప్రాసంగికములు, ప్రధానకథకు పోషకములు కాని అంశములగుటచే తిక్కన మిక్కిలి సంక్షేపించి పై కథనంతయు మూడు గద్యపద్యములలో నిమిడ్చెను. విశ్వామిత్రుఁడు కోరిన హయముల కొఱకు యయాతి వద్దకు వెళ్ళి గాలవుని సంగతి తెలుపగా నాతఁడు తనకట్టి హయములు లేకునికి తన కూతురు మాధవినిచ్చును. ఈ కథ రెండధ్యాయములలో వ్యాప్తిచెందియున్నది. యయాతి గుణగణములు, దానముయొక్క విశిష్టత విపులముగా కలవిచట. తిక్కన ఒక వచనములో (వ. 311, ప. 312). కథాక్రమమును మాత్రము తెలిపెను.

ఇక్ష్వాకు కులజుఁడగు హర్యశ్వుఁడను రాజు మాధవి సౌందర్యమును ప్రశంసించుచు అంగాంగవర్ణన చేసినట్లు మూలమునమున్నది. తిక్కన హర్యశ్వుని నామమును పేర్కొనలేదు. ఇక్ష్వాకుఁడని తెలిపి, మాధవి సౌందర్యవర్ణనను కూడ వదలివైచెను. ఈ అంశము అనౌచిత్య పరిహారణమై ఒప్పినది. ఇక్ష్వాకుని ప్రసక్తిని, ఇరువది రెండు శ్లోకములందున్నదానిని, తిక్కన ఒక పద్యమునందు, ఒక వచనమునందు సంగ్రహించెను.

గాలవుఁడు కాశీరాజగు దివోదాసునకు మాధవినిచ్చి ఆతనినుండి రెండు నూర్ల అశ్వములను బడసెను. ఈ సందర్భమున మూలమునందు - మాధవీ దివోదాసుల దాంపత్యము, పురాణప్రసిద్ధులగు దంపతులెల్లరతోఁ బోల్పఁ బడినది. సంవత్సరకాలము ఒక్కొక్కరితో కాపురము చేసినది మాధవి. అట్టిచో మాధవీ దివోదాసుల దాంపత్యమును ఆదిదంపతుల దాంపత్యముతోఁ బోల్చుట అనౌచిత్యము తిక్కన దీనిని వదలివైచుట ఔచిత్యమునకు పరమావధి.

మాధవిని ఔశీనరునకు సమర్పింపఁబోవునపుడు గాలవుఁడు 'అపుత్రస్య గతిర్నాస్తి' అని వివరించుట, ఔశీనరుఁడు ప్రజాధనమును స్వార్థమునకు వాడుకొనగూడదని చెప్పుట మూలమునందతి విస్తారముగా ఇరువదియొక్క శ్లోకములలో నున్నది. రాజధర్మము, లోకధర్మము చర్చింపఁడుట, వానికి సంఘర్షణ ఏర్పడుట మూలమునందుండుట సమంజసమే కాని అనువాదమున అవి అనవసరము.

క. ఆ సమయంబునను దివో
దాసుఁడు నౌశీనరుండుఁ దక్షిణకి నిచ్చా
జేసి హయంబుల నిచ్చి మ
హోసత్త్వుల సుతులఁ బడసిరధిక ప్రీతిన్. (5-2-317)

అని తిక్కన రెండధ్యాయములందున్న కథను సంక్షేపించెను. మాధవి విషయము, ఆ రాజుల విషయము లు సంగ్రహింపఁబడుట వలన కథ వేగముగా సాగినది. అశ్వములారువందలే ఉండుటకు కారణము మూలమున చెప్పఁబడి యున్నది. అనువాదమున "ఒక్క కారణంబున నీరాజుల మువ్వురకు నివ్వాజులు కలిగె నింతియ కాని యొండెడ నీచందంబున మొత్తంబులై దొరకనేర' వని గరుత్మంతుఁడనినట్లు తిక్కన రచించెను. అప్రధాన విషయవివరణము నుజ్జగించి "ఒక్క కారణంబున" అని సూచించుట చమత్కారము. మొత్తము మీద రెండువందల తొంబది తొమ్మిది శ్లోకములలో నున్న గాలవోపాఖ్యానమును పందొమ్మిది గద్యపద్యములలో నిమిడ్చినాఁడు తిక్కన. దీర్ఘ సంభాషణలవలన పురాణము చెప్పుచున్నట్లు చెప్పు ఇట్టి అప్రధాన కథలవలన సాధా

రణముగా ప్రధాన కథ నడక కుంటువడును. చదువరులకు కొంత విసువు జనించు నాస్కారమేర్పడును. సకలలోకముల వర్ణనలు, దిక్పాలకవర్ణనల విపులీకరణ ఇత్యాదులు సంస్కృత భారతమువంటి ధర్మశాస్త్రగ్రంథములో నుండవచ్చునేమోగాని, ఆంధ్రావళి మోదమునందొరయుటకై రచింపబడిన తెలుగు భారతమున అవి తగవు పైగా ప్రధానకథలోని రసమునకివి పోషకములు గావలయును. పోషకములుకాని సన్నివేశములుండుట ఎడనెడ సంభవించును. కాని రసభంజకములగునంత దీర్ఘములుగా ఉపాఖ్యానములు పదేపదే యుండుటను రసదృష్టికల కవి అంగీకరింపడు, సహృదయులును సమ్మతింపరు.

రుక్మివృత్తాంతమునుకూడ తిక్కన మిక్కిలి సంక్షేపించెను.[17] రుక్మియే ఔచిత్యము తెలియని మూఢుడు. అట్టివాని చరితమును వర్ణించుట అనౌచిత్యమేయగును. మూలమున శార్ఙ్గ, గాండీవ విజయములను గూర్చిన వర్ణన ఎక్కుడున్నది. రుక్మినిగూర్చి అతని పరాక్రమమును గూర్చి కూడ కలదు. ధనుస్సులను గూర్చి తిక్కన ఒక్కపద్యములో రచించెను. రుక్మి కురుక్షేత్రమున పాల్గొనని రాజు ఆ కారణము తప్ప ఆతనిని పేర్కొనవల సిన అవసరమే భారత కథయందు లేదు. అందువలననే తిక్కన ఆతని పరా క్రమాది వర్ణనలను విడిచి ఆతని ఉద్ధతిని, అవినయభాషణములను మాత్రము గైకొనెను, ఆతడు కురుక్షేత్ర సంగ్రామమున పోరకుండుటకివి ప్రధాన కారణములు.

రుక్మివృత్తాంతములో తిక్కన సంభాషణలను రచించిన తీరు మాత్రము అతని ప్రతిభకు తగియున్నది. ఆతడు "తన్ను నాక్రమించి తనతోబుట్టువు రుక్మిణింగొనివచ్చిన యా కృష్ణుసన్నిధిన సిగ్గులేక" అర్జునునితో 'సమరంబుసేయ వెఱచితేనిఁ జెప్పు నాకు నెదురులేదు జగతినెవ్వరు నీకుఁదోడ్పడి జయింతు నెట్టి పగఱనైన' లని ఆడినమాటలు అహంకారి, లజ్జావిహీనుఁడగు నాతనికి తగియున్నవి. కృష్ణుని సన్నిధిలో నాతఁడట్లాడెనని చెప్పుటలోనే చమత్కా రమున్నది. ఈ మాటలు విని చిఱునవ్వు నవ్వుచు కవ్వడి ఆతనియుత్తరము నకుఁదగిన యట్లు పలికెను. ఆ పలుకులెంత వ్యంగ్య గర్భితములుగా నున్నవో పరికించిన వ్యంగ్యభాషణముయొక్క శక్తి అవగతమగును.

తే॥ చెనసి గంధర్వసేన నిర్జించునపుడు
మత్స్యనాథు గోవర్గంబు మరలఁదెచ్చు
నెడను దప్పి నీకందువ యెఱుఁగనైతి
నింక నొంగాని తోడు గమ్మోచటికైన. (5-4-186)

ఎదుటివాడెంత నిర్లజ్జాపరుడైనను ముఖము దించుకొని పోవలసిన మాటలివి. "నీకందువ యెఱుఁగనైతి"-అను మాటలోనున్నది వ్యంగ్యమంతయును.

రుక్మి అర్జునునకు తెలిసినవాఁడే. అతఁడు కృష్ణుని చేతిలో ఓడిపోయి పరాభవింపఁబడుటకూడ ఎఱుగును. "ఎఱుఁగనైతి" అని ఆతని పరాక్రమ హీనత నెఱుఁగుదునని ఎత్తిపొడిచినాఁ డర్జునుఁడు. "ఇంకనొంగాని తోడు గమ్మోచటికైన' అని ముగింపు మాటిగాఁబలికెను. వెక్కిరింత, తిరస్కారము మిళితమైన అర్జునుని పలుకులు ములుకులైనవి-తిక్కన కూర్పులో.

## ఉలూకుని వృత్తాంతము ;

దుర్యోధనుఁడు పాండవుల యొద్దకు ఉలూకుని పంపగా వారాతని మాటలకు తగిన ప్రత్యుత్తరమిచ్చి పంపిరి. ఈ ఘట్టము మూలమున నూట ఒక్క శ్లోకములలో నుండగా తిక్కన ఇరువది నాలుగు పద్యగద్యములలో సంక్షేపించెను.18

దుర్యోధనుఁడు ఉలూకునకు చెప్పినట్లు ఇరువదేను శ్లోకములు రచింపబడినవి. పాండవుల సమక్షమున దుర్యోధనుని పలుకులను ఉలూకుఁడు వినిపించునపుడు ఈ శ్లోకములే కొన్ని పునరుక్తములైనవి. రెండుచోట్ల చెప్పఁబడియున్న ఈ మాటలను తిక్కన ఒకేసారి పాండవసముఖమున ఉలూకుఁడాడినట్లు రచించెను. ఇచట "దుర్యోధనుండు దుశ్శాసన శకుని కర్ణులతో విచారించి యులూకుంబిలిపించి నీవుపోయి పాండవులంగని వాసుదేవు సన్నిధిని బాంచాల విరాట ప్రముఖులు వినఁబలుకుమని పరుసని మాటలు గఱపిపుచ్చె" నని మాత్రము సూచించెను. 'పరుసని మాటల' నుటలోనే దుర్యోధనుని పలుకులన్నియు గతార్థములైనవి.

పాండవులకడ దుర్యోధనుని మాటలను ఉలూకుఁడు వినిపించునపుడు తిక్కన మూలమునే అనుసరించెను. ఈ సందర్భమున మూలమున నలువది యొక్క శ్లోకములున్నవి. తిక్కన వానిలో పదునాలుగు శ్లోకములను మాత్రము విడిచి, మిగిలిన శ్లోకభావములను గ్రహించి పదునాలుగు పద్యములను రచించెను. యథామూలముగా ననువదించినను తిక్కన తన రచనలో అమూలకములగు కొన్ని తిరస్కారపు పలుకులను, కొంత వాడిని, వేడిని సంతరించెను. 'దుశ్శాసనస్య రుధిరం పీయతాం యది శక్యతే' అనియుండ 'త్రావఁగ శక్యంబేనిం ద్రావుమనన్ రాదే' అనియు, "కిందర్దుకః కూప యశోయథేమాం' అను దానిని' నూతికప్ప విధమున నిను నీవు యెఱుంగుదు' అనియు 'జానామి తే గాండీవం తాళమాత్రం' అనియుండ "గాండీవమను నొక విల్లు తాటిపొడవు గలిమియు' అనియు "క్వ శదా గాండీవం.. .క్వత దా భీమసేనస్య బలం' అనుటకు "పవనజు గదయును, నీ గాండీవము నెటవోయె నంగడికి' అనియు 'నమాయాహీంద్రజాలం వా కుహకా వా బిభీషికా' అనియుండ 'మాయయు నింద్రజాలముఁ బూధవుఁడిందును కొన్నివన్నినన్' అనియు 'వాసుదేవ సహస్రం వా ఫాల్గునానాం శతాని' అనుదానిని 'పార్థులును విష్ణులు వే పదివేలు వచ్చినన్' అని ఇత్యాదిగా తిక్కన అనువదించెను. మూలముననున్న చక్కని భావములను ఆ సొబగుచెడకుండ తిక్కన గైకొనెననుటకు ఈ ఉదాహరణ లీయబడినవి. ఇట్టివి విదురనీతిలో కూడ పెక్కులు గలవు. సంస్కృతము నుండి గ్రహించిన భావములనైనను ఆ గీర్వాణభాష ప్రభావమించుకైనను తోపకుండ తిక్కన అనువదింపఁగలఁడు. ఇది తిక్కనకు తప్ప ఏ ఇతర కవికిని సాధ్యముకాని ప్రక్రియ.

ఇంత సంగ్రహముగా ననువదించుచు కూడ తిక్కన కొన్నిమాటలను తానై కల్పించినాడు. 'కృష్ణుని చేతన సకలంబుఁ జక్కఁజేసి కొనుండీ' 'వీని నెల్ల శంకించి భూమి పాలీనుగాని' 'సవ్యసాచి యిది శౌర్యమొ బాహుబలమ్మొ చెప్పుమా' 'ఒక చీరయు సంపదఁ బంచియిత్తుమె'-ఇంకను పెక్కులిట్టి వాక్యములు కలవు. ఇవియన్నియు తిక్కన సంభాషణా వైచిత్రికి ఉదాహరణప్రాయములు.

తిక్కన సంక్షేపము వలన భావము కొరపడదు మూలముననున్న భావములను గ్రహించుటయేగాక ఆ భావములకుపోషకములగు మఱికొన్ని భావములను కల్పించునని ఇచట చూచితిమి కావున సంక్షేపించుట మూలమును పాడుచేయుట కాదనియు అనువదింపచేతగాక కాదనియు గ్రహింపనగును.

అటుపిమ్మట శ్రీకృష్ణుఁడు క్రోధావేశములతోఁ బలికినటుల మూలమున పదమూడు శ్లోకములుకలవు. దుర్యోధనుని ప్రలాపములను సరకుగొనక నవ్వుచు యుద్ధమునకు సిద్ధముకమ్మని, భీమార్జునులు తమ ప్రతిజ్ఞలను తప్పక నెరవేర్చుకొందురని మాత్రము పలికినట్లు మూడు పద్యములలో తిక్కన రచించెను కుపితుఁడైన శ్రీకృష్ణుఁడు రాజులను ఎండు గడ్డివలె దహించునని మూలమున కలదు. తన్నుగూర్చి తాను చెప్పుకొను నవసరము ఆ వాసుదేవునకు లేదు. అదియునుంగాక, కురుక్షేత్రమున కృష్ణుఁడు స్వయముగా యుద్ధము చేయబోవుటలేదు. తన సారథ్యమునుగూర్చి మాత్రమే ప్రస్తావించినట్లు తిక్కన కూర్పు- "కృష్ణ సారథికంబగు జిష్ణురథము"....

క॥ ఈ వాయుపుత్త్రుఁడాజిం
ద్రావుదు నే దుస్ససేను రక్తంబనియెం
బ్రావఁగ శక్యంబేనిం
ద్రావుమనన్ రాదె యింకఁ దడవేమిటికిన్. (5-4-195)

అను సందేశమునకు తగిన ప్రత్యుత్తరమునే తిక్కన సిద్ధము చేసి సంభాషణలకు తగిన పుష్టిని సంతరించెను. వారు పలికినదానికి, వీరు పలికినదానికి సంబంధము లేనియట్లుండిన స్వారస్యము కొఱవడును తిక్కన కూర్చిన సమాధానమిది-

క॥ రిత్తలు రజ్జెడు వాఁడే
మత్తగజాయుతబలుండు మారుతి యని ను
ద్వృత్తుఁడగు దుస్ససేనుని
నెత్తురురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్. (5-4-204)

'ఉరము వ్రచ్చి వ్రాలు నీవుం జూడన్' అనుమాట పద్యమునకు ప్రాణాధారము. ఊరక వ్రాలుటగాదు; నీవు నిస్సహాయుడవై చూచుచుండగా ఉరము వ్రచ్చి నెత్తురు వ్రాలునని భావము ఈ సంక్షిప్త, ప్రకృష్ట భాషణము శ్రీకృష్ణునకు తగినది.

కృష్ణుడు మాటలాడిన అనంతరము అర్జునుని భాషణము కలదు. దీనిని కూడ తిక్కన మిక్కిలి సంక్షేపించెను. వీరాలాపములను పెక్కింటిని వదలి ప్రత్యర్థి ఆడిన దుర్భాషలకు మాత్రము ప్రత్యుత్తరమిచ్చినట్లు తిక్కన రచించెను. ఈ సందర్భమున కొన్ని ప్రతులలో 63 శ్లోకములు కూడ నున్నవి. ధర్మజ, భీమ, నకుల, సహదేవులు, విరాట, ద్రుపద, శిఖండి, ధృష్టద్యుమ్నాదులు కూడ మాటాడినట్లు ఈ శ్లోకములున్నవి. కాని వీరందఱూ మాట్లాడవలసిన ఆవశ్యకత అంతగా లేదు. భండార్కర్ వారి ప్రతిలో ఇరువదితొమ్మిది శ్లోకములున్నవి. ఇదియే తిక్కన గ్రహించిన ప్రతికి కొంత దగ్గఱగానున్నది.

క. వారు గలరు వీరు గలరు
పోరికినని చెప్పె దీవు పొంగారుచు నీ
వారిని మిమ్ముఁను రేపు గ
దా రూపేర్పడఁగఁ జూచెదం గితవసుతా. (5-4-202)

ఇంత మాత్రము చాలును అర్జునుని పరాక్రమమును దెలుపుకొనుటకు. మఱలమఱల వీరాలాపములుండుట విసువు పుట్టించును. భీష్ముని సర్వసేనాధిపతినిగా జేయుటను అర్జునుడు నిరసించి, అయినను అతనినే రణమున 'తొలుముద్ద గొందుము' అని పలికినాడు. ఆపై ఆచార్యుని, అపుడు సూతసుతుని సమయింతుమని పలికినట్లు తిక్కన రచించుట సందర్భోచితముగా నున్నది. ఇచటి రచనలో తెలుగుభాష పటుత్వము, జీవము అవగతమగుచున్నవి.

అనువాదమున తిక్కన అర్జునుని ధీరగంభీర వాక్యవిదునిగా పోషించెను. ''ధర్మనందనుండులూకునకుం దాంబూలాభరణంబులిచ్చి వీడు

క్రాలిపి'' నాడని తిక్కన పెంపు చేసెను. దూతకు ఉచితజ్ఞుడైన రాజు చేయు సత్కారమిది. సంజయునకు కూడ ఇట్లే సత్కారమొనర్చినట్లు తిక్కన కల్పించియుండుట స్మరణీయము.

దుర్యోధనుడు రేపు కయ్యమని చెప్పి పంపుట మూలమున కలదు. అట్లే ధర్మజుడు కూడ ధృష్టద్యుమ్నునకు చెప్పినట్లనువాదము కలదు.

''ధృష్టద్యుమ్నుండును ద్రోణులం దొడరం బడసితినని యుబ్బుచు వెడలి భీష్మం దలపడఁగంటినని పొంగు శిఖండి దోడుగా రాజుశాసనంబు నిర్వర్తించె'' ఇది తిక్కన చేసిన పెంపు. యుద్ధము ఆయావ్యక్తులపై నెట్టి ప్రభావను కలిగించినదో తెలియుచున్నది.

అచట దుర్యోధనుఁడు 'కర్ణుదెస కనుంగొని' చెప్పెనట. ''ఇట్లుభయ కటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్లసిల్లెను.'' ఉభయ పక్షములు యుద్ధోత్సాహముతో నుల్లసిల్లుచున్నవని వీరరసానుగుణముగా నిట స్థాయిని పోషించెను.

సంక్షేపము జరిగినది కాని భావములో కథాగమనములో ఎట్టి లోపమును లేదు. పైగా అనవసరమగు విషయములు పరిహరింపఁబడుట వలన పునరుక్తి కలుగకుండ కథ వేగముగా సాగినది.

## విదుర నీతి

భారతమునందు ధర్మోపదేశములు, నీత్యుపదేశములు, ఆధ్యాత్మిక బోధలు పెక్కు కలవు. ధర్మ, నీత్యుపదేశములలో తలమానికము విదుర నీతి. మంచిచెడులు, పాపపుణ్యములు, ధర్మాధర్మములు, సత్పురుష కాపురుష గుణములు–ఇదియది అననేల లౌకికవ్యవహారమున కవసరమగు అన్ని విషయములు ధర్మమూర్తి యగు విదురునిచే పేర్కొనఁబడినవి. అతి విస్తృతమగు నీ విదురనీతిలో పునరుక్తి దొరలుటకవకాశము కలదు. మూలమునందదియే జరిగినది. తిక్కన విదురనీతిని సనత్సుజాతీయమును వలె సూచించి వదలివేయుటకు వీలులేదు. కథకు సంబంధించిన అంశమిందుకలదు. అదియేమన ధృతరాష్ట్రుఁడు కలత చెందిన మనసుతో నిదురలేక బాధపడు

చున్నాఁడు. తన మనసులోని ఆరాటమును విదురునకు చెప్పికొనినాఁడు రాజు. విదురుఁడు ధర్మాధర్మముల నాతనికి వివరించి సన్మార్గానుగామిగా చేయుటకు యత్నించినాఁడు. ఆతని ఉపదేశముల నీతఁడు అనుసరింపలేదు కాని తాత్కాలికముగా నాతని మనసు కలఁతదేఱినది. ఇంతమాత్రమైనను ఇందు ప్రయోజనము కలదు. సనత్సుజాతీయమట్లు కాదు అతనికి ధృతరాష్ట్రుని పరితాపముతో సంబంధము లేదు. విదురుని పూనికపైవచ్చి సనత్సుజాతుఁడు ఆధ్యాత్మికబోధ చేసి వెడలినాఁడు. ధృతరాష్ట్రునకుగాని, కథకుగాని ఆ ఉపదేశము అందరానంత ఎత్తులోనున్నది. విదురునివలె సనత్సుజాతునకు కురుపాండవులతో, వారి ప్రస్తుత వైరభావముతో ప్రత్యక్ష సంబంధము లేదు. విదురుఁడట్లుకాదు. ధృతరాష్ట్రుని మనఃస్థితి నెఱిఁగి మాటలాడినాఁడు. ఇది ఇట్టిదగుట వలననే తిక్కన సంక్షేపించినను, సమగ్రతను, సారస్యమును సాధించినాఁడు.

విదురనీతి మూలమునందు 580 శ్లోకములలోనున్న సుదీర్ఘ విషయము. అనువాదమునందు 82 పద్యములు కలవు.[19] ఈ పద్యములలో కూడ వృత్తములు తక్కువ. గీత, కందము లెక్కువ. అనఁగా విదురనీతి 5వ వంతునకు తగ్గినది. ఈ సంక్షేపమెట్లు సాధింపఁబడినదనఁగా అత్యంత సన్నిహిత భావార్థములు గల శ్లోకములు మూలమునందు రెండు మూడు సార్లు చెప్పబడియుండగా తిక్కన ఒక్కచో చేర్చి రచించెను. ప్రస్తుతాంశమునకుగాని, కథకుగాని ఎట్టి సంబంధము, ప్రయోజనము లేని కొన్ని శ్లోకములను తిక్కన గ్రహింపలేదు. రెండు శ్లోకములలోనున్న విషయమును తిక్కన ఒక్క పద్యములో నిమిడ్చెను. అన్నిటికంటెను ప్రధానముగా సత్పురుష కాపురుష లక్షణములను, పుణ్యపాపముల చర్చను తిక్కన విస్తృతముగా పేర్కొనలేదు. మూలమునందివి వందల శ్లోకములలో నున్న విషయములు.

విషయమును సంక్షేపించుటయే గాక తిక్కన మఱియొక్క మార్పును గావించినాడు. కథతో విదురుని పలుకులకు సంబంధమును కలిపినాఁడు. మూలమున లేని పెంపు ఇది. ఇందువలన విదురుఁడు సందర్భోచితముగా భాషించుచున్నట్లనిపించును.

మూలమున తన మనసులోని కలతకు ధృతరాష్ట్రుఁడు కారణము చెప్పినట్లు లేదు. 'ధర్మసుతుమాట చొప్పెవిధంబొ యెఱుఁగ కునికిఁ జేసి చింతిల్లితి' నని ధృతరాష్ట్రుఁడు చెప్పినట్లు తిక్కన కూర్చెను.

కాపురుషగుణములు మూలమున సుమారేబది శ్లోకములలో నుండ తిక్కన అందు ముఖ్యమైన వానిని మాత్రమెుక్క పద్యమున పేర్కొనెను.

క. కోపము నుబ్బును గర్వము
నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుష గుణంబులండ్రు కౌరవనాథా. (5-2-32)

అట్లని విదురనీతిని మిక్కిలి సంక్షేపించుటయే తిక్కన చేసిన పనియని భావించుటకు వీలులేదు. ముఖ్యమైన పెక్కు శ్లోకములను యథాతథముగా ననువదించుటయు జరిగినది. మచ్చున కొకటి చూపఁబడును—

శ్లో. ఏకయా ద్వే వినిశ్చిత్య
త్రీంశ్చతుర్భిర్వశే కురు
పంచజిత్వా విదిత్వా షట్
సప్తహిత్వా సుఖీభవ. (5-33-43)

అను దానిని తిక్కన అనువదించిన విధము—

తే. ఒకటఁగొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి
మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱిటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. (5-2-37)

'సుఖీభవ' అను మూలమును మార్చి 'వర్తించువాడు వివేకధనుఁడ'ని తిక్కన చేర్చెను. మూలమున లేని నీతిని తిక్కన పేర్కొనలేదు. కాని ధర్మరాజు లోని సుగుణములను, దుర్యోధనుని, ధృతరాష్ట్రుని దుర్గుణములను

ప్రముఖముగా పేర్కొని ఆ సుగుణముల వలననే ధర్మజుఁడట్టివాఁడైనాఁడు, నీవిలోపభూయిష్ఠమగు వర్తనము వలననే కుందుచున్నావని విదురునిచే పలికించెను. మధ్యమధ్య కథతో సంబంధమును కలుపు పలుకులను అమూలకముగా కూర్చెను.[20] ఉదా:—

ఉ. దక్కెను రాజ్యమంచు నకటా యిటు దమ్ములనిభాగమీక నీ
వెక్కటి మ్రింగఁ జూచెదది యెట్లరుగున్ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు నూవె యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లము నున్నటు లాడఁగూడునే.
(5-2-52)

ఇట్టివే మఱికొన్ని 5-2-63, 65, 70,72, 73, 89, 94, 95.

ఇంద్రియ నిగ్రహము అలవరచుకొను విధమును, అది లేనివారికి కలుగు అనర్థములను, ఉత్తమ, మధ్యమాధమ పురుషులను, వారి భయ కారణములను, వారి ఆహారములలో భేదములను, దరిద్రుల ఆకలిని, ధనికుల జీర్ణశక్తి లేమిని వ్యాసుఁడత్యంత విపులముగా పేర్కొనియుండగా, కథకు సంబంధింపని విషయములని కాబోలు తిక్కన పేర్కొనలేదు.

ఈ సందర్భముననే విదురుఁడు చెప్పిన సుధన్వ విరోచనుల వృత్తాంతమును తిక్కన ఒక్క వచనములో పేర్కొని దత్తాత్రేయ సాధ్యుల సంభాషణను పూర్తిగా వదలివేసెను. అనృతమాడరాదనునీతి మొదటిదానిలో కలదు. రెండవదానిలో నట్టిది లేదు కనుక తిక్కన సూచింపకయే వదలి యుండవచ్చును.

ఉత్తమకులీనులెవరని ధృతరాష్ట్రుఁడడుగఁగా విదురుఁడు మఱల ఉత్తములకు తగిన నడవడిని వర్ణించినట్లు మూలముననున్నది. తిక్కన పునరుక్తిని గ్రహింపలేదు.

స్వాయంభువ మనువు చెప్పిన మనుష్యులలో భేదములు మూలమున సవిరముగా పేర్కొనబడియున్నవి. తిక్కన అనువదింపలేదు.

జ్ఞానియగువాఁడు, బుద్ధిమంతుఁడైనవాఁడు ఎట్లు ప్రవర్తింతురో, మూఁర్ఖుని తెలివిలేమివలన కార్యములెట్లు చెడునో మూలమునందు 44 శ్లోకములలో కలదు. తిక్కన పేర్కొనలేదు.

మానవ జీవితము క్షణికమనియు, ప్రవాహామువంటిదనియు, ఆత్మ శాశ్వతమనియు, పవిత్రమనియు, కావున తెలివిగలవాఁడు మోహామునందు పడక శాశ్వత కీర్తికి పాటుపడవలెననియు మూలమునందు 27 శ్లోకము లలో నున్నది. ఈ తాత్పర్యమును తిక్కన ముఁడు పద్యములలో సంక్షే పించెను.

రాజు ప్రజలనెట్లు ప్రీతిగ చూడవలెను, రాజ్యమునెట్లు సంపాదింప వలెను, ఎట్లు కాపాడుకొనవలెను, రాజధర్మములెట్టివను విషయములు మూల మున 20 శ్లోకములలో కలవు. ఆ విషయములు చక్కగానున్నవి కాని అవి విదురునిచే ధృతరాష్ట్రునకు చెప్పఁబడుట సందర్భోచితముగా లేదు. ఈ విషయ ములనే యుద్ధానంతరము భీష్ముఁడు ధర్మజునకు బోధించును. అది సమం జసము. తిక్కన ఈ రాజనీతినిచట వదలివేసెను.

మూలమున నున్న విదురనీతిని తిక్కన కథనుమించకుండ పరిమిత ముగా రచించెను. తిక్కన ఈ సందర్భమునందు రచించిన పద్యములలో ఎక్కువభాగము యథామూలముగా ననువదించినవే యగుట గమనింపదగినది. ఆ మహర్షిపట్ల ఈ మహాకవికి గల గౌరవమునకీ విదురనీతి నిదర్శనము. ఒక మహాకవి యథాతథముగా గ్రహించుటయే ఆ మహర్షికి చూపిన గౌరవము గదా!

4. సంక్షేపించినను సారవంతముగాను సమగ్రముగాను నున్న భాగములు :

## శ్రీకృష్ణ కర్ణ సంవాదము :

రాయబారము విఫలమై, కృష్ణుఁడు హస్తినాపురిని వీడి చనునపుడు కర్ణుని తన రథముపై కూరుచుండఁబెట్టుకొని కొంత దూరము చనినపిదప అతని జన్మ రహస్యమును తెలుపును. ఈ సందర్భమునఁగల కృష్ణ కర్ణ సం

వాదము మూలమున 4 అధ్యాయములలో, 154 శ్లోకములలో వ్యాపించి యున్నది. దానిని 25 గద్యపద్యములలో తిక్కన సంక్షేపించెను.21

శ్రీకృష్ణుఁడు కర్ణునితో నేమిపలికెనని ధృతరాష్ట్రుడు సంజయునడు గగా, సంజయుఁడు వారి సంభాషణను వివరించినట్లు మూలమున కలదు. ఇట్లుండుట అనౌచిత్యము. కర్ణుఁడు కుంతీపుత్రుడని యుద్ధానంతరముగాని ఎల్లరకు తెలియదు. యుద్ధమింకను ప్రారంభము కాలేదు. అట్టియెడ శ్రీకృష్ణ, కర్ణ సంవాదము ధృతరాష్ట్రునకుగాని, సంజయునకుగాని తెలిసి నట్లుండుట పూర్వాపర విరుద్ధము. ఒకవేళ యుద్ధానంతరమే సంజయుఁడు ధృతరాష్ట్రునకు తెలిపినను ఇచట ప్రస్తావింపఁబడుట అంత ఉచితము కాదు. సంజయుఁడీ విషయము నెప్పుడు చెప్పెనను సందేహమున కాస్కారమిచ్చి నట్లగును. వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినట్లుండగా మధ్యలోనే చేర్పు అనవసరము కూడ. సందేహాస్పదముగా నున్నదానిని సందేహమున కాస్కారమేలేని విధముగా తిక్కన అనువదించెను.

శ్రీకృష్ణుఁడు తొలుత చెప్పిన విషయము మూలమున 23 శ్లోకము లలో నున్నది. తెలుఁగులో 5 పద్యములలో నాభావమే ఇమిడియున్నది. అనవసరమగు ధౌమ్యుని ప్రసక్తిని, రాజులందఱినీ పేరుపేరున పేర్కొను టను తిక్కన వదలివైచెను.

ద్రౌపది కర్ణుని ఆఱవభర్తగా గ్రహించునను విషయము పట్టాభిషేక వర్ణనమునందే చెప్పఁబడినది. అట్లుకాక తిక్కన ఆ విషయమును ప్రత్యేక ముగా పేర్కొని కర్ణుని శీలమునకు సానపెట్టెను. వాసుదేవుఁ డిట్లడుగునా- మూలమునన్నున్న దీనిని వదలివేయక ఇంకను ప్రముఖముగా తిక్కన రచిం చుటనుచితముగదా అనిపించు సందర్భమిది. కాని ఇందొక ధర్మసూక్ష్మము కలదు. మున్ముందు కుంతి కర్ణుని అర్థింపవచ్చునని శ్రీకృష్ణుఁడూ హించి, అతఁడు మెత్తబడిపోకూడదనియే ఈ ప్రయత్నము చేసెను. కర్ణుఁడు దాత్తుడు, రాజ్యలోభమునగాని, భ్రాతృప్రేమతోఁగాని రారాజును వీడు చపలుఁడు కాఁడు. ఇది శ్రీకృష్ణుఁడెఱిఁగిన విషయమే. ఇంకను ద్రౌపది పైని మోహాభావముతో కూడ అతఁడు చలింపఁడని నిశ్చయించుటకే మాథ

వుడీ మాటలాడి కర్ణుని శీలమునకు మెరుగు కూర్చెను. తిక్కనద్దానిని ప్రస్ఫుటము చేసెను. ఇది కర్ణుని శీలచిత్రణమునకై ప్రత్యేకముగా చెప్పఁబడి నదేగాని ఇందనుచితమేమియును లేదు.

'ఇట్లైన కుంతికి .... ప్రియంబగు' నని కుంతిని కూడ తిక్కన ప్రత్యేకముగా పేర్కొనెను. కర్ణుఁడు లోభ. మోహాములతోగాని, భీతితో గాని, కరుణవలనగాని స్వామిభక్తిని వీడఁడను నిర్ధారణను కృష్ణుఁడు సాధించెను. తిక్కన రచన ఇందుకుపకరించుచున్నది. కృష్ణుని రాజకీయ వేతృత్వమును కూడ తిక్కన ఈ మార్పుల వలన పోషించెను. ఆ సందర్భములోనంత దీర్ఘ సంభాషణలు తగవని తిక్కన సంక్షేపించెను. ఎవ్వరికిని అనుమానము రానివ్వనంత క్లుప్తముగా వారు భాషించుట యుక్తముగదా!

కర్ణుని సమాధానము అనువాదమునందును కొంత విపులముగానే యున్నది. మూలమునందు 'సర్వం చైవాభిజానామి పాండోఃపుత్రోఽస్మి' అని యుండుట అంత సరికాదు. కర్ణునకప్పటికే సర్వము నిశ్చయముగా తెలియుటకు వీలు లేదు. భారతకథలో కర్ణునికాతని జన్మరహస్యమును తెలిపినవారు శ్రీకృష్ణుఁడు, కుంతి, భీష్ముఁడు. ఈ ముప్వురిలో వాసుదేవుఁడే ప్రప్రథమము ఆతనితోనీ విషయము ప్రస్తావించినాఁడు. ఇతరులద్వారా విని యుండిన కొంత వినియుండవచ్చును. కాని అప్పటికి కర్ణునకు తాను కుంతీపుత్రుఁడనను నిశ్చయబుద్ధి కలుగలేదు. అందువలన 'సర్వం చైవాభి జానామి' అను పలుకులను వదలి 'వెడ వెడ యేనుఁ దొల్లి యిదివింటి' నని మాత్రము తిక్కన రచించెను. అనువాదములో ఔచిత్యానుశీలన మిట్టిది. సూత దంపతులు తననెంత ప్రేమతో పెంచినారో కర్ణుఁడు కడు ఆర్ద్రముగా వివరించు సందర్భమిది. మూలముననున్నదాని నించుక కూడ విడువకుండ, మఱికొంత హార్దకమగు రచనను తిక్కన సంతరించినాఁడు. సందర్భాను గుణముగా పెంచుట, త్రుంచుట ప్రజ్ఞావంతుఁడగు అనువాదకుని కర్తవ్యము మూలమున 'సామే మాత్రం పురీషంచ ప్రతిజగ్రాహ' అని యున్నదానిని తిక్కన మఱింత పెంచి రచించినాడు.

క. మూత్ర పురీషాదులు దమ
గాత్రములం దింక వారు గారవ మెసఁగం
బుత్త్రిండని సంవర్ధిత
గాత్త్రినిఁగాఁ జేసిరింతకాలముఁ గూర్మిన్. (5-4-34)

దుర్యోధనుఁడు కర్ణుని ఎంత ఆదరించెనో అనువాదమున లెస్సగా చెప్పఁబడినది.

ఉ. సూతసుతుండు వీఁడనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును పెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసియుండ నే
నే తగవూఁది యాకురుకులేశ్వరుఁ బాయుదు ముట్ట వచ్చినన్.
(5-4-39)

కృతజ్ఞతాభావము కర్ణునిలో ఎంత నిండియున్నదో పై పద్యము వలన తెలియఁజేసినాఁడు తిక్కన. కర్ణుని ఈ స్వామిభక్తియే అతని అవగుణములను కప్పిపుచ్చి అతనినొక ఉదాత్తచరితునిగా చేసినది. తిక్కన ఈ పద్యమున ఆతని శీలమును రమ్యముగా చిత్రించినాఁడు.

"...... ...... అట్టి తల్లిదండ్రులకుఁ బుత్రకృత్యంబులు నిర్వర్తింపక వారలం బాసి యేను వచ్చుట ధర్మంబగునే" అని ధర్మాధర్మములను విచారించి పలికిన మానిసిగా తిక్కన ఈ సందర్భమున కర్ణుని పోషించెను. 'దామోదర నన్నిట్లు పిలుచుటుచిత మె చెపుమా' అని ఉచితానుచితముల నెఱింగి మసలిన ఉచితజ్ఞునిగా మలచెను.

మూలమునందు ఇరువదిరెండు శ్లోకములలో కర్ణుఁడు వర్ణించినటులున్న రణయజ్ఞవర్ణనమును తద్వివరములను తిక్కన ఒక్క పద్యములో సంక్షేపించి రచించెను. ఈ యజ్ఞవర్ణన వలని ప్రయోజనము లేకునికి ఈ సంక్షిప్తత ఆదరణీయము.

క. అనుజులు ఋత్విజులుగ నీ
పని యిటు సేయుమని నీ వుపద్రష్టవుగా
విను కురుకుమార పశువిశ
సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్. (5-4-45)

ధర్మజునకు సహాయపడు వారినందఱినీ మూలమున ఏడుశ్లోకములలో పేర్కొనగా తిక్కన గ్రహింపలేదు.

కురుక్షేత్ర యుద్ధములో రాజులెల్లరు సద్గతిపడయుదురనియు, ఆ సంగ్రామ కథనమెల్లప్పుడు కీర్తింపబడవలెనని మూలమున 6 శ్లోకములలో కర్ణుఁడు విపులముగా పలికియుండగా తిక్కన "పుణ్యభూమియగు కురుక్షేత్రంబున మముబోంట్లెల్లను సద్గతి వడయుదురుగాక" యని పలికినట్లు సంక్షేపించెను.

కర్ణుని ఆర్ద్రభావములను విపులముగా వర్ణించిన తిక్కన రణయజ్ఞమును రాజుల పేళ్ళను మిక్కిలి సంక్షేపించెను. రసౌచిత్యోచితబంధముగా ననువదించుటయనిన ఇదియే.

శ్రీకృష్ణుఁడు పాండవవిజయమును, అర్జునుని పరాక్రమమును వర్ణించి కర్ణుని అధిక్షేపించినట్లు మూలమునందిరువది శ్లోకములలో విపుల భాషణము కలదు తిక్కన శ్రీకృష్ణుని ఈ ప్రసంగమును మూడు పద్య గద్యములలో నిమిడ్చెను. పాండవ పరాక్రమమును మఱలమఱల వర్ణింపఁ జేయుట అనవసరము కూడ.

మఱల కర్ణుని సమాధానము కూడ 44 శ్లోకములలో అతి విస్తృతముగా నున్నది. కర్ణుని స్వప్న వివరములు, ఆయా వీసులు, శకునములు 39 శ్లోకములలో వర్ణింపఁబడినవి.

క. కలవు నిమిత్త స్వప్నం
బులు కౌరవపాండవులకుఁ బోటగు దానన్
గెలుపయ్యుధిష్ఠిరునకును
గల దెఱుఁగుదు నీవు సెప్పఁగా నేమిటికిన్. (5-4-50)

అని కర్ణుఁడనినట్లు మాత్రము అతిక్లుప్తముగా తిక్కన రచించెను.

"నిమిత్తం తత్ర శకునిరహం దుశ్శాసన స్తథా
దుర్యోధనశ్చ నృపతిర్ధృతరాష్ట్ర సుతో౽ భవత్"

అని మూలమున నున్నదానిని తిక్కన వదలి

క. దీనికి మూలము శకునియు
నేనును దుశ్శాసనుండు నింతియ కుంతీ
సూనులు వారలు గలసిన
రానేరఁగ వచ్చు నాకు రాజీవాక్షా. (5-4-52)

అని పలికినట్లు మార్చెను. అనగా ధార్తరాష్ట్రులు శకునియు పాండవులతో కూడినగాని తాను కలువలేనని భావము. అసంభవమును నిశ్చయముగా పలికించినాఁడు తిక్కన.

దీనికి తిరిగి శ్రీకృష్ణుఁడు సమాధానము నొసంగినట్లు మూలమున నుండగా తిక్కన విడిచి వైచెను. పైవిధముగా 135 శ్లోకములలో నున్న శ్రీకృష్ణ కర్ణ సంవాదమును తిక్కన 25 గద్య పద్యములలో అనువదించెను. భావము చెడకుండ, కథకు ఆటంకము రాకుండ సంక్షేపించి స్వప్న, రణ యజ్ఞాదులను గూర్చిన అనవసరమగు వివరములను వదలివైచెను.

కుంతి కర్ణునితో ఆతని జన్మవృత్తాంతమును తెలుపు సన్నివేశము కూడ అనువాదమున సంక్షేపింపఁబడినది. విదురుఁడు కుంతీసదనమునకేగి కురు పాండవుల సంగరమనివార్యమని తెలుపుట, ఆమె కర్ణుని యుద్ధ విముఖునిగా చేయనెంచి ఆతనికి జన్మరహస్యమును తెలుపఁదలంచుట మూలమున 40 శ్లోకములలోనుండ తిక్కన 6 పద్యగద్యములలో సంక్షేపించెను. 22 కుంతి కర్ణుఁడెట్లు తనకు జన్మించెనో తలపోసినది. మఱల మఱల ఆ విషయము వచ్చుచుండుటచే తిక్కన వదలివైచెను. "కర్ణునకుం బుట్టువు దెలిపి సహోదర స్నేహంబావహించెద" నని మాత్రము కుంతి తలపోసినట్లు తిక్కన రచించెను.

కుంతి కర్ణునితోనాడిన మాటల సారాంశమునంతయు తిక్కన ఒక్క పద్యములో గ్రహించినాఁడు. పాండునందనుండ, కురుకులవరేణ్య, కొడుకు

గుఱ్ఱ అను సంబుద్ధులు కుంతి ఆశను, ఆశయమును, ఆదరమును పట్టి ఇచ్చుచున్నవి. 'ఏలుమీలోకమెల్ల' అని ప్రలోభ పెట్టినది. 'రాధకొడుకి తండను తక్కువ నీకేల' అని అనునయించినది. ఒక్క పద్యములో కుంతి ప్రయత్నము నంతయు నిబంధించినాఁడు తిక్కన. మూలమున ఈ విషయమే పది శ్లోకములందున్నది. 'కొడుకుఁగుఱ్ఱ' యను కుంతి పిలుపు మాటలలో చెప్పలేని మాతృభావమును స్ఫురింపఁజేయుచున్నది. కర్ణుని జనన విషయము కొంచెము ముందుగా కృష్ణునిచే ప్రస్తావింపఁబడియున్నది కనుక ఇట అనవసరమని తిక్కన ప్రస్తావింపకయే ముందుకు సాగెను.

కర్ణుఁడు తల్లి కొసగిన సమాధానము సంస్కృతమున ఇరువదిరెండు శ్లోకములలో నున్నది. తిక్కన కూడ దీనిని కొంత విపులముగానే అనువదించెను. కర్ణుని ఈ సమాధానము ఆతని దృఢ చిత్తమును, సంయమనమును, ధర్మశీలమును తెలుపునట్టిది.

ఆ. సవ్యసాచి చేతఁ జచ్చుటయును గీర్తి
కరమ యతఁడు లోనుగాఁగ నేవు
రేను లోనుగాఁగ నేవురుగాని నీ
కొడుకు లార్వురనుట విడువుమింక. (౬-4-౮౨)

అని కర్ణునిచే దేల్చి పలికించినాఁడు తిక్కన. నాతిదీర్ఘ వాక్య నిర్మాణముతో సంక్షిప్తతను సాధించినాఁడిచట.

ఉద్యోగపర్వమునందు పరిమాణమును బట్టియే కాక ప్రాధాన్యతను బట్టియు ఎన్నఁదగిన ఉపాఖ్యానములు పురందరవిజయోపాఖ్యానము, అంబోపాఖ్యానము.

## పురందర విజయోపాఖ్యానము

పురందర విజయోపాఖ్యానము ఉద్యోగపర్వారంభమున నున్నది. దీనిని శల్యుఁడు ధర్మరాజునకు వినిపించును. పాండవ పక్షపాతియైన శల్యుఁడు దుర్యోధనునకు సహాయము చేయవలసినవాఁడైనాఁడు.

అయినను ధర్మజునకే శుభము కోరు శల్యుఁడు ఆతనికి ఉత్సాహమును, ధైర్యస్థైర్యములను కలిగించు విధముగా ఇంద్రుఁడు తన ప్రత్యర్థులను జయించి విజయియైన వృత్తాంతములను చెప్పినాడు. పర్వారంభమున నున్న ఈ ఉపాఖ్యానమునకు ప్రధానేతి వృత్తముతో చాల సామ్యము కలదు. ఇదివరకే ధర్మజునకీ విషయములు తెలిసియుండును. అయినను సందర్భాను గుణముగా శల్యుఁడు మఱల చెప్పినాఁడు. ఇట్లగుటచే తిక్కన దీనిని మూలానుసరణముగా నిర్వహించినాఁడు. శ్లోకసంఖ్యతో పోల్చిచూచిన ఇచట కూడ సంక్షేపము జరిగినదని చెప్పవలయును. కాని ఇతఃపూర్వము ప్రస్తావించిన ఉపాఖ్యానములలోవలె సన్నివేశములనే ఎత్తివేయలేదు. ఒండు రెండు పట్ల దీర్ఘముగా సాగిన కథనమును కుదించినాఁడు. ఈ పురందర విజయోపాఖ్యానము మూలమునందు పది అధ్యాయములలో 304 శ్లోకములలో రచింపఁబడి యున్నది. అనువాదమున నిదియే 98 పద్యములలో పరిమితమై యున్నది.[23] అనగా మూఁడవవంతునకు కుదింపఁ బడినది.

ఈ ఉపాఖ్యానమును మూఁడు భాగములుగా విభజించి చూడవలెను మొదటి భాగము విశ్వరూపుని వృత్తాంతము.

త్వష్టప్రజాపతి విశ్వరూపుఁడను త్రిశిరుని సృజించెను. వాఁడింద్ర పదవికోరి తపంబుసేయుచుండెను. ఇంద్రుఁడు భయపడి తత్తపోభంగ మొనరింపుమని అప్సరసలఁబంపెను. విశ్వరూపుఁడు చలింపలేదు. దేవేంద్రుఁడు వానిని జంపి ఎవ్వరెరుగకుండునట్లొక పడు గడిపి, భూత గణంబులాక్రోశింప ఒక విషమవ్రతమాచరించెను. తన బ్రహ్మహత్యా పాపమును సముద్ర, తరు, ధరణీ, స్త్రీ జనములయందు వదలి వేసెను. ఈ ప్రధాన ఘట్టములను తిక్కన గైకొని నాలుగు పద్యములలో కథను నిర్వహించెను.

మూలమునందు విశ్వరూపుని త్రిశిరముల వర్ణన, దేవేంద్రుని భయము అప్సరలతో సంభాషణ, త్రిశిరుని చంపిన పిదప కూడ తేజోవంతముగా కాన్పించిన వానిశిరములను జూచి భయపడుట, ఒకానొకఁడు గొడ్డలితోనటు వైపు వచ్చుట, వానితో ఇంద్రుని సంభాషణ, వాఁడు మృతుఁడైన విశ్వ

రూపుని తలలు ఖండింపగా నందుండి పక్షులు ఎగిరిపోవుట ఇత్యాది విషయము లుండుటవలన ముప్పది ఏడు శ్లోకములలో త్రిశిరుని వృత్తాంతము విస్తరించి యున్నది 24 తిక్కన ఈ విషయములను వదలినాఁడు.

ఈ ఉపాఖ్యానమున రెండవ ఘట్టము వృత్రాసురుని వృత్తాంతము. త్వష్టప్రజాపతి వృత్రుని సృష్టించుట, వాఁడింద్రునితో యుద్ధముసేయుట, ఇంద్రుఁడోడి మందరగిరి శిఖరమునకేగుట, మునులు ఇంద్రునిగూడి విష్ణుని ప్రార్థించుట, విష్ణువు వృత్రునితో సంధి చేసికొనుమనుట, వృత్రుఁడు కొన్ని నిబంధనలతో సంధికొడంబడుట, సమయముచూచి ఇంద్రుఁడు వృత్రుని సంహరించుట – ఇవి వృత్రాసుర వధలోని ముఖ్యవిషయములు. వీనిని తిక్కన గ్రహించెను. మునులతో నింద్రుఁడు సంభాషించుట, వారు విష్ణువును ప్రార్థించుట, వృత్రాసురునితో ఋషులు సంభాషించుట అను ఘట్టములు అత్యంతము సంక్షేపింపఁబడినవి. అందువలన మూలమున అరువది శ్లోకములలో నున్న విషయము ఇరువదిపద్యములలో నిమిడినది. కాని కథ యథామూలముగా సాగినది. వృత్రుఁడు ఇంద్రునితో మైత్రికొడంబడుటకు విధించిన ఆంక్షలను తిక్కన మూలమునందువలె వివరముగా పేర్కొనెను. అవసరమగు ఇట్టి విషయములను యథాతథముగా గ్రహించి అనావశ్యకములగు వివరములను మాత్రమే వదలివేయుటవలన అనువాదమున సొబగు చెడలేదు. మూలమునందరువది శ్లోకములలోనున్న వృత్రాసురవధ అనువాదమున ఇరువది పద్యములలో నొదిగినది.25 త్రిశిరుని విషయముకంటె ఇది కొంత విస్తృతము.

ఈ రెండు ఘట్టములకంటె ప్రధానమైనది మూడవ ఘట్టము. అది నహుషుని వృత్తాంతము.

నహుషుఁడు స్వర్లోకాధిపతియగుట, స్వర్గభోగములనుభవించుట, శచిని చూచి మోహించుట, ఆమె బృహస్పతి శరణుచొచ్చుట, నహుషుఁడాగ్రహావేశ పరవశుఁడగుట – ఈ విశేషములను తిక్కన మూలమునందువలె ననువదించెను. మునులు పరసతినిగోరుట పాడికాదని పలుకుట, 'మున్ను దేవేంద్రుఁడహల్యను కోరినపుడు మీరేల బుద్ధిచెప్పరైరి' అని నహుషుఁడడు

గుట మూలమున ఎనిమిది శ్లోకములలో నున్నది. వీరి సంభాషణను తిక్కన ఒక్కపద్యములో పొందికగా కూర్చెను.

చ. అనుడు మునీంద్రులున్ సురలు నక్కట నీ మహనీయ గౌరవం
బునకుఁ బరాంగనం గవయుబుద్ధి జనించుట యీడుగాదు నా
విని మును పూని యిమ్మెయి వివేకము గౌతముభార్యఁ బాకశా
సనుఁడెదఁ గోరుచోఁ గఱపఁ జాలర మీరది యెట్లు సెప్పుడా.
(5-1-154)

పదముల పొందికవలన నొనగూడిన సంక్షేపమిది.

మునులు బృహస్పతికడకేగి శకుని నహుషుని వరించుట యుక్తమని చెప్పుట కూడ మూలమున 5 శ్లోకములలో నున్నది. తిక్కన ఒక కందములో వారి తాత్పర్యమును పొందుపఱచెను. శరణాగతులకు రక్షణ ఇవ్వనివారికి కలుగు దుష్ఫలితములను బృహస్పతి 8 శ్లోకములలో పేర్కొనినట్లున్నది మూలమున. తిక్కన ఆ దుష్ఫలితములను వివరింపలేదు. 'ఊర్ధ్వలోకములు దప్పుఁ బుణ్యకర్మంబు లఫలతఁ బొందు' నని మాత్రమే పేర్కొనెను ఇచట బృహస్పతి మునుల నుల్లస మాడినట్లు తిక్కన ఒకపద్యమునందు మూలకముగా రచించెను. దుష్ఫలితముల నేకరువు పెట్టుట మునులకు తెలిసిన విషయము మఱల చెప్పుట అగును. అట్లుకాక ఈ పేళన వారి తప్పును వారు గ్రహించునట్లు వేయు చురకవంటిదగుచు ఇందు సున్నితమగు హాస్యము తొంగి చూచుచున్నది.

క. నహుషుండు పనుచువాఁడటె
విహితానుష్ఠానపరులు వీరటెతా లో
కహితం బటె యిది మనకున్
మహనీయము కాక యెట్లు మానఁగవచ్చున్. (5-1-159)

ఇందు ప్రతిపదమునందు వ్యంగ్యము నిండియున్నది. నహుషుండు మునులను ఇట్టి నీచకార్యమునకు పంపువాఁడా. వీరు విహితానుష్ఠానపరులా.

అధర్మమును చేసినవారు, చూచినవారు, తోడుపడిన వారెల్లరు నింద్యులే. అట్టిచో వీరు అధర్మాయుతచిత్తులు. ఈకార్యము లోకవినాశహేతువు కదా! ఇది ఎంత అనుచితము, నీచను. ఇట్టి కార్యము మనమాచరింపవచ్చునా అను భావమిందు వ్యతిరేక ముఖమున కలుగుచున్నది. మునులకీ పలుకులు ములుకులై తాకునట్లు తిక్కన రచించినాఁడు. బృహస్పతికి తిక్కన గఱపిన మెలకువ ఇది. సూటిగాఁబలుకుట తెలియని మూర్ఖులపట్ల, హేళన తెలిసియు తెలియమిని వర్తించువారిపట్ల పనిచేయును. లోకములో సామాన్యముగా నున్న ఈ పద్ధతిని గ్రహించి తిక్కన ఈ పెంపు చేసెను.

అప్పుడిక కర్తవ్యంబెద్దియని మునులడుగఁగా కొంత సమయమును కోరుకొనుట యుక్తమని బృహస్పతి వచించుట తిక్కన యథామూలముగా గ్రహించెను. మునిగణము శచిని కీర్తించుటను తిక్కన వదలివైచెను. శచీదేవి నహుషుని పాలికిఁబోయి 'కాలమిచ్ఛామ్యహం' అని పలికినది. 'వేగిర పాటు మేలె నీ వెల్ల నెఱుంగుదిప్పుడెడ యిచ్చుట యుక్తము నాకుఁజూడ గన్' అని శచి యుక్తియుక్తముగా కార్యసిద్ధికనువగురీతిలో భాషించినట్లు తిక్కన మార్చెను.

మహర్షు లగ్నిపురస్సరులై విష్ణుదేవుని చేరి ప్రార్థించిరి. నహుషుఁడిది గ్రహింపఁడా అను సందేహమునకాస్కారము లేకుండగా 'విష్ణుదేవు పాలికి రహస్య వృత్తింబోయి' రని తిక్కన చేర్చెను.

ఇంద్రుఁడశ్వమేధయాగమొనరించి తన బ్రహ్మహత్యా పాతకమును నదీ, పృథ్వీ, పర్వత, వృక్ష, నారీ సమూహావళులకు పంచెనని మూలము. వృత్రాసుర వధానంతర మొకపరి విష్ణ్వాదేశమున సముద్ర, భూతల, నదీ, తరు, నారీ జనంబులలో తన పాపమును వదలెననియున్నది. ఈ రెండింటినీ వదలి విశ్వరూప వధానంతరమే ఇంద్రుఁడిట్లు చేసెనని తిక్కన రచించెను. విశ్వరూపవధానంతరమే ఆ పాపమును ప్రక్షాళన మొనరించుకొనని యెడల ఆతఁడు వృత్రుని సంహరింపఁజాలఁడని ఎంచి తిక్కన ఇట్లు మార్చి యుండనోపును. ఎచ్చటనున్నను ఒక్కపరి యుండుటయే యుక్తముగాఁ దోచుచున్నది.

నహుషుని తేజమును చూచి ఇంద్రుఁడు భయపడి మరల నంతర్హితుఁ డాయెను. శచీదేవి నిశాసమయంబున ఉపశ్రుతినారాధింపగా తదీయాధి, దేవతయగు ఉపశ్రుతి ప్రత్యక్షమగును.

ఉపశ్రుతి తన్నెఱుక పరచుకొని ఇంద్రుని వెదకుట, ఆతనినిగాంచుట శచి ఇంద్రుని పూర్వవిజయములను కీర్తించుట, అతఁడు తన్నెట్లు కనుగొంటి వని శచినడుగుట, ఆమె జరిగిన విషయమును వివరించుట మూలమున కొంత విస్తృతముగానున్నది. పదునేను శ్లోకములలోనున్న దీనిని తిక్కన నాలుగు పద్యగద్యములలో నిర్వహించెను. 'తన్నెట్లు కనుగొంటివను' ఇంద్రుని ప్రశ్నకు మూలమున సమాధానము లేదు. నహుషుఁడు పోయిన పోకలు, తాను కాలయాపనము చేసిన భంగియు చెప్పి 'యుపశ్రుతి తెఱంగును నతని కెఱింగించి' నదని తిక్కన పెంపుచేసెను. ఉపశ్రుతి ప్రత్యక్షమగుటనే కాక అదృశ్యంబగుటయు కూడ తిక్కన పేర్కొని, ఇంద్రుఁడు తన్నెట్లెఱింగితివను ప్రశ్నకు ఆస్కారమేర్పరచెను. తిక్కన సూక్ష్మపరిశీలనాశక్తికి చిన్న విషయములు నిదర్శనములు.

ఇంద్రునికై ఉపశ్రుతి వెదకిన ప్రదేశముల వర్ణనకూడ మూలమున కలదు. తిక్కన ఇంద్రుఁడున్న ప్రదేశమును మాత్రము పేర్కొనెను.

ఋషులు వహించిన వాహనముపై నెక్కిరమ్మని నహుషుని కోరుమని శచికి ఇంద్రుఁడుపాయమును తెలిపెను. ఇది యథామూలముగా ననువదింపఁ బడినది. నహుషుఁడు శచీదేవిని గాంచి ఉన్మత్తుడై ప్రణయకలాపముల నాగింపఁజూచుట అప్రస్తుతము. తిక్కనిద్దానిని విడిచెను. ఇంద్రాణిని కోరుటయే వాని నాశమునకు చాలిన అపరాధము కాగా ఈ ప్రణయాలాపవర్ణన అనవసరము.

తన కోరికను వెల్లడించుచు శచీదేవి పలికిన పలుకులను తిక్కన తగ్గించెను. ఇంద్రాదులు రథగజాశ్వముల నధిరోహింతురను భాషణమును తిక్కన గ్రహింపలేదు. "నీవు మహామునివాహనుండవు గావలయు నది నాకు ప్రియంబ"ని స్పష్టముగా చెప్పించినఁడు.

నహుషుఁడు తన దర్పమును చెప్పుకొనుట కూడ అనువాదమున సంక్షేపింపఁబడినది. ఆ తదుపరి జరిగిన సంఘటనలను తిక్కన యథావకాశముగా సంక్షేపించెను. అగ్నితాను జలములందు ప్రవేశింపలేనని చెప్పుటను తిక్కన చాల తగ్గించెను. అగ్నిని, దేవేంద్రుని, బృహస్పతి కీర్తించుటకూడ అనువాదమున క్లుప్తముగానున్నవి. కుబేర వరుణాగ్నియమాదులింద్రుని శ్లాఘించుట అనువాదమున వదలివేయఁబడినది. యమ, వరుణ, కుబేరాదులు నహుషుఁడు నశించినగాని తమకు యజ్ఞభాగస్వామ్యము లభింపదనిరి. అగ్ని తనకును యజ్ఞభాగమునుకోరగా ఇంద్రుఁడంగీకరించెను. ఈ విషయము లనువాదమున విడువఁబడినవి.

అగస్త్యుఁడు నహుషుని పతనమును ఇంద్రుని కెఱింగించుట మూలమున 25 శ్లోకములలో విపులముగా కలదు. తిక్కన 5 పద్యములలో దీనిని సంక్షేపించెను. అగస్త్యుని ఇంద్రుఁడు సత్కరించుట మూలమున విపులతరమై యున్నది. "సమ్మతి నుచితాసనమిడి యర్ఘ్యముఁ బాద్యము నొనరిచె" నని తిక్కన సూచించెను. నహుషునకు మునులొసంగిన శాపము మూలమున పేర్కొనఁబడినది. తిక్కన తద్విమోచనమును కూడ పేర్కొనెను. ఇది యుధిష్ఠిరునకు సంబంధించి యుండుటచే నిట పేర్కొనఁబడుట అవసరము. సమగ్రమును.

ఇంద్రుఁడు తిరిగి స్వర్గాధిపత్యమును బొందుట, బృహస్పతి తక్కుంగల దేవతలు కూడియుండగా శచీదేవితో సుఖంబుననుండుట యథామూలముగా తిక్కన అనువదించెను. కౌరవనాయకుఁడా నహుషుకైవడి నాశముఁ బొందు వాసవ శ్రీ రమణీయుఁడై జయము సేకొని ధర్మజుఁడు సన్నుతి కెక్కునని తిక్కన ముగించెను.

పురందర విజయోపాఖ్యానము విన్నను, తద్వ్యాఖ్యానము సేసినను సౌఖ్యంబులు వొందు జగత్ప్రఖ్యాతులుఁ జెందునని తిక్కన ఫలశ్రుతిని తెలిపెను. ఇది మూలమునలేని పెంపు. ముఖ్యముగా అప్పటి ధర్మజుని పరిస్థితి కుపకరించు విషయమును ఫలశ్రుతిగాఁ బలుకుట ఉచితము.

క. మోహాగము నడచుచుండఁగ
నీ హారివిజయంబు విను నరేంద్రుఁడు రిపు సం
దోహంబు గెల్చుటకు సం
దేహం బించుకయు లేదు ధీరవిచారా. (5-1-213)

యుద్ధోన్ముఖుఁడు కాబోవు ధర్మజునికి ఫలము తప్పక లభించునను ఆగామి కథా సూచన మిందు కలదు. ధర్మజునకి ఉపాఖ్యానమును వినిపించుటకిది కారణముగా తిక్కన నిబంధించెను. కల్యఁడే ప్రయోజనము నాశించినాఁడో అది నెరవేరినది. తిక్కన అందువలననే దీనికి తగిన ప్రాధాన్యము నిచ్చెను.

## అంబోపాఖ్యానము

మూలమునందు విస్తృతముగా చెప్పఁబడి యున్నది అంబోపాఖ్యానము. దీనిని తిక్కన నాలుగవవంతు కు తగ్గించినాఁడు. సంగ్రహణము కవిత్రయమువారి అనువాదవిధానములో ప్రముఖము కనుక ఈ ఉపాఖ్యానమును సంక్షేపించుటలో విపరీతమేమియును లేదు. పైగా దీనిని చెప్పుచున్నవాఁడు భీష్ముఁడు. వినుచున్నవారాతని మనుమలు దుర్యోధనాదులు. ఇది అంబకథయే కాదు భీష్ముని కథ కౌరవవంశ కథ కూడ. దీనిని దుర్యోధనుడు, ఆతని పరివారములోని ఇతరులు తెలిసియే యుందురు మఱికొందఱు చూచియు నుందురు. ఇట్టి సమీప భూత కాలమున జరిగిన దానిని సూక్ష్మ వివరణములతో చెప్పియుండనవసరము లేదు. అసలు చెప్పుట ఎందునకనిన; దుర్యోధనుఁడు ఇతరులనుండి వినిన అంబ-భీష్ములవివాదమును భీష్మునివలన వినదలంచుటయే ఈ ఉపాఖ్యానమిచట చెప్పఁబడుటకు ప్రధానకారణము. ఇతరులవలన ఎఱిఁగిన విషయమైనను, ఆ విషయముతో ప్రత్యక్ష సంబంధము కలిగిన వ్యక్తి ద్వారా వినఁదలంచుట లోక సహజము. కాని అట్టియెడ చెప్పుచున్న వ్యక్తి తన ఆలోచనారీతిని ప్రసరించు మార్గములో చెప్పఁదలంచునే కాని జరిగిన దానినెల్లను వివరింపఁడు ఈ మెలకువను గ్రహించిన తిక్కన ఈ ఉపాఖ్యానమును భీష్ముని హృదయ మెఱింగి నడిపెనే కాని అంబ హృదయము ననుసరించి కాదు.

అంబోపాఖ్యానమని అనుటయే కాని ఇది శిఖండి వృత్తాంతము కూడ. అసలు దుర్యోధనుఁడడిగినది కూడ శిఖండిని చంపననుటకు గతంబేమి యనియే కాని అంబ విషయుపెట్టిదని కాదు. కావున అంబోపాఖ్యానమును దీనిని అంబ చితిలో ప్రవేశించునందాక మాత్రమే గైకొనరాదు. అంబ ద్రుపదునకు స్త్రీగా జన్మించి పురుషత్వమును బడయునందాక గ్రహింపవలెను. మూలమునందును చివఱిదాకా అంబోపాఖ్యాన పర్వమనియే కలదు.

ఈ ఉపాఖ్యానవిషయమును చాల పరిశీలించినవారు శ్రీ కాశూరి హనుమంతరావుగారు. వీరు అంబోపాఖ్యానమును అంబ చితారోహణ పర్యంతము గ్రహించి ఈ క్రింద విధముగా పేర్కొనినారు.

"ఈ కథను వ్యాసుఁడు (అంబ చితారోహణ పర్యంతం) నాలుగు వందల తొంభై ఆరు శ్లోకాలలో రచించాఁడు. దీనిని తిక్కన తొంభై ఏడు పద్యగద్యాలలో అనువదించాఁడు. వీటిలో భీష్మ పరశురాముల యుద్ధ వర్ణన మూలంలో నూట తొంభై ఐదు శ్లోకాలు, తెలుగులో నలభై అయిదు గద్య పద్యాలు. పోతే కథారచన మూలంలో మూడువందల ఒక్క శ్లోకాలు, తిక్కనవి ఏభై రెండు పద్య గద్యాలు."

"ఈ లెక్కంతా ఎందుకంటే సాధారణంగా ఆంధ్రమహాభారత విమర్శకులు వ్యాసుని రచనలోని ఆధ్యాత్మిక నీతి బోధలు, క్షేత్ర మాహాత్మ్య యుద్ధాది గతానుగతిక వర్ణనలు మొదలైన రసహీన భాగాలను అపనయించో సంక్షేపించో గ్రంథబాహుళ్యాన్ని తగ్గించి ఎక్కువగా కథా నిర్వహణ, పాత్రచిత్రణ చేసి మూలరచన కన్నా తన అనువాదంలో తిక్కన సాహిత్య గౌరవాన్ని చాలా ఎక్కువ చేశాఁడని అంటూ ఉంటారు. ఈ అభిప్రాయం సత్యదూరమైనదని పై గణనవలన స్పష్టమవుతుంది. అంబోపాఖ్యానంలో యుద్ధవర్ణనకన్నా కథాభాగాన్నే తిక్కన అధికంగా సంక్షేపించాడు."[26]

హనుమంతరావుగారి పై వివేచనము అంత సమంజసముగాదు. వారు పేర్కొనినట్లు "కథయినా, ఆధ్యాత్మిక చర్చ అయినా ఏదైనా మూలంలో ఉన్నది సంగ్రహంగా చెప్పడమే చాలవరకూ తిక్కన అనువాద సరణి" కాదు. సంగ్రహంగా చెప్పడంలోనే తిక్కన ఒక పద్ధతిని పాటించి

నాఁడు. దేనైనా సంగ్రహించాలని మాత్రమే తిక్కన భావించియుండిన ఒక్కొక్క విషయమును నొక్కొక్క భిన్నమార్గములో రచింపవలసిన పని ఏమి? కొన్నింటిని క్లప్తముగా రచించి. మఱికొన్నింటిని విపులముగా నిర్వహించి ఆయా ఉపాఖ్యానములను ప్రాధాన్య వివక్షతతో రచించినాఁడు తిక్కన. ఈ వృత్తాంతమునే గైకొందము. అంబోపాఖ్యానమునకు అంబ చితిలో ప్రవేశించుట ముగింపు కాదు. అంబ శిఖండిగా జన్మించి స్త్రీపూర్వుఁడై యుండుట వలన తానాతనిని వధింపనని భీష్ముఁడు పలుకుట ఈ వృత్తాంతమునకు ముగింపు. అట్లయినపుడు ఇది మూలమున ఆఱువందల ఏభై ఒక్క శ్లోకములలో నున్నది. తిక్కన నూట ముప్పది రెండు పద్యములలో నిబంధించినాఁడు. భీష్మ పరశురాముల యుద్ధము మూలములో నూట తొంబది యైదు శ్లోకాలు. తెలుగులో నలభై ఐదు గద్యపద్యాలు. ఇక కథారచన మూలములో నయిగువందల ఏభై ఆఱు శ్లోకములు కాగా అనువాదమున ఎనభై ఎనిమిది పద్య గద్యములు. అనఁగా యుద్ధవర్ణన, కథారచన కూడ నాలుగవ వంతునకు తగ్గినది,

"కిమర్థం భరతశ్రేష్ఠనైవ హన్యాస్త్వం శిఖండినమ్
ఉద్యతేషు మధోదృష్ట్వా సమరేష్వాతతాయినమ్
పూర్వముక్త్వా మహాబాహో పంచాలనీప సోమకైః
హనిష్యామీతి గాంగేయతన్మే బ్రూహిపితామహా"
5.170 .1 2

అని మూలములో నున్న దానిని తిక్కన మార్చెను.

క. అనవుడు దుర్యోధనుఁడా
తని మీరు వధింపమికిఁ గతం బేమి యొకో
వినఁదగు నేనిం జెపుఁడా
యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్ (5-4-21)

"మునుపు అందఱినీ చంపుతానన్నావు. మఱి ఇప్పుడు శిఖండిని ఎందుకు చంపవు" అని మూలంలో భీష్ముణ్ణి దుర్యోధనుఁడు ప్రశ్నించడంలో

అతని మనస్సులోని ఆరాటం తెలుస్తోంది తిక్కన రచనలో అది లేదు" అని హనుమంతరావుగారి విమర్శ ఇవియును పూర్వాపరములను విచారింపక చేసిన విమర్శ మూలముగా వచ్చు దుర్యోధనుని ప్రశ్నకే ఆస్కారములేదు ఏలన తాను శిఖండిని చంపనని చెప్పినపుడే భీష్ముఁడు తత్కారణమును కూడ వివరించును

"దేవవ్రతత్వం విఖ్యాతం పృథివ్యాం సర్వరాజసు ।
నైవ హన్యాం స్త్రియం జాతు న స్త్రీపూర్వం కథంచన ॥
స హి స్త్రీ పూర్వకో రాజన్ శిఖండీ యది తే శ్రుతః ।
కన్యాభూత్వా పుమాన్ జాతో న యోత్స్యే తేన భారత ॥

5 169 19,20

భీష్ముఁడింత స్పష్టముగా తన నియమమును తెలిపిన పిమ్మట దుర్యోధనుఁడు 'కిమర్థం భరతశ్రేష్ఠ నైవ హన్యాస్త్వం శిఖండినం' అనుట పొసగదుగదా పూర్వాపరములు పొసగని సందర్భమిది ముందు భీష్ముని జవాబు, పిదప దుర్యోధనుని ప్రశ్న ఉండుట దుర్యోధనుని ఆరాటమును కాక అజ్ఞతను తెలుపుచున్నది 'శిఖండిని నొక్కరుని జంపఁగాని కుమారా' అని భీష్ముఁ డనినపుడు 'అతని మీరు వధింపమికిఁ గతంబేమి' యని దుర్యోధనుఁ డడిగినట్లును "ఏనా శిఖండిని జంపమికి మూలంబు సాలంగలదు తత్ప్రపంచంబంతయు వివరించెద నాకర్ణింపుము"ని భీష్ముఁడు దుర్యోధనునకు అంబోపాఖ్యానము సెప్పినట్లును తిక్కన మార్పు చేసెను 'శిఖండి అంగనాపూర్వుఁ డగుటచే నేను చంపన'ని భీష్ముఁడు తొలుతనే పలికినచో ఇంక చెప్పవలసినదేమియు నుండదు తిక్కన ఈ భీష్ముని నియమమును తొలుత తెలుపక కుతూహలమును (SUSPENSE) పరితలలో పోషించెను అంబోపాఖ్యానమునంతయు వినిపించి చిట్టచివరకు భీష్ముని వ్రతమును తెలిపెను

"ఇవ్విధంబునఁ గాశిపతి కన్యక సిద్ధమూర్తియయి సెగడె" నని భీష్ముఁడు కథను ముగించువరకు కూడ శిఖండిని చంపమికి కారణము చెప్పఁబడదు "నేను నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింపకుండ వ్రతంబు పూనిన వాఁడం గావున నంగనాపూర్వుండగు

శిఖండి నాడ ఖండనంబునం గొదండ పాండిత్యంబు నెఱపినను జంపను నొంపను గడంగితినయేని నింతకంటె దుర్యశంబుగలదె యెట్లయిన నగుదుం గాని భగ్నవ్రతుండనగుట కోర్వనిది నా తెఱంగు" — ఇవ్విధముగా భీష్ముఁడనినంత దనుక ఉత్కంఠ చెడకుండ నిలుచును. ఇది ఆఖ్యానశిల్పము. కాశూరి వారి విమర్శయంతయు నిట్లే సాగినది ఏ భాగమునకాభాగమును విడదీసి మూలముతో అనువాదమును పోల్చి మూలము సారవంతమనియు, అనువాదము సారహీనమనియు వారనుట ఒకానొక సౌందర్యవతి అంగాంగములను ఖండించి మఱియొక సౌందర్యవతి అంగములతో పోల్చి చూచుటవలెనున్నది. ఆ తరువాత భీష్ముఁడు తాను రాజులందఱినీ ఓడించి కన్యలను గొనివచ్చిన విషయమును వ్యాసుఁడు పది శ్లోకాలలో వర్ణించినాఁడు. 'సేనానాయకుఁడుగా అభిషిక్తుఁడైన భీష్ముఁడు పరమోత్సాహంతో ఉన్నాఁడు. ఆ సన్నివేశంలో అతఁడు తన పరాక్రమాన్ని చెప్పుకొనడం చాలయుక్తం. తిక్కన టూకీగా నిరుద్వేగంగా వ్రాశాఁడ"ని హనుమంతరావుగారు పేర్కొనిరి. ఇట్లనుట సబబుకాదు. సేనానాయకుఁడుగా అభిషిక్తుఁడైన భీష్ముఁడు పరమోత్సాహముతో నున్నట్లు ఎచటను సూచింపఁబడలేదు. సూచింపకున్ననేమి ఊహింపవచ్చునని అనుకొన్నను పాండవసేనాధిపతియైన ధృష్టద్యుమ్నుని సమరోత్సాహము పేర్కొనఁబడినది. పేర్కొనకున్నను అతనిలో, శిఖండిలో, సాత్యకిలో ఉత్సాహ మురికలు వేయుచుండెనని ఊహింపవచ్చును. కౌరవులలో కూడ దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణాదులకట్టి ఉత్సుకతయే యుండినది. కాని భీష్మ, ద్రోణ, కృపాదులలో ఉత్సాహము లేదు. వారు యుద్ధమునకు విముఖులు. యుద్ధము జరుగుచున్నపుడు కూడ వారిలో నిర్లిప్తతయే కనుపించును. ఉత్సాహమప్పుడప్పుడు ప్రేరేపింపఁ బడినదై కాననగునే కాని నిశ్చయముగా వారిలో నా భావము లేదు. ఒకవేళ భీష్ముఁడిట ఉత్సాహవంతుడై యుండెనని భావించినను, శిఖండి వృత్తాంతము చెప్పఁబోవునపుఁ డాతని ఉత్సాహమరికట్టఁబడునే కాని పోషింపఁబడదు. తన పరాక్రమమును ప్రకటనము చేయుట భీష్ముని అభిమతమే అయిన అది తగిన సందర్భమునుకాదు. పరశురాముని జయించిన వీరుఁడు భీష్ముఁడు. అప్రసిద్ధులగు కొందఱు రాజులను జయించుట ఒక ఘనకార్యముగా నాతఁడు భావించి అదియును ఇన్నేళ్ళ తరువాత చెప్పికొనుట ఆతని శీలమునకే భంగకరము. పరశురాముని నెదిరించిన పవి

యము రాబోవుచుండగా ఈ అల్పవిషయమును వర్ణింపవలెనా? ఖాండవమును నేర్చి, శివుని మెప్పించిన అర్జునుఁడు ఆ విషయములను సగర్వముగా చెప్పుకొనునేమో గాని ధర్మజుని రాజసూయమునకు ముందు తాను జయించిన రాజులను, ద్రౌపదీ స్వయంవరమున ఇతర రాజులను, జయించుటనుగాదు. అట్లే ఇచట భీష్ముఁడును: తిక్కన ఇచట రాజుల నెదిరించిన విషయమును సంక్షేపించి పరశురామునితో భీష్ముని యుద్ధమును విపులముగా వర్ణించుట అత్యంతయుక్తము. తిక్కన నిరుద్వేగముగా వ్రాయలేదు సరిగదా ఔచిత్యవంతముగా సంగ్రహించినాఁడు.

"మూలంలో అంబాసాళ్వుల సంవాదం, సాళ్వుఁడు అంబను నిరాకరించడం వివరంగా హృదయావర్జకంగా కథితమైంది. ఈ సన్నివేశంలో తిక్కన పద్యాలు పొడిపొడిగా ఉన్నాయి. తిక్కన రచనలో కథ చెప్పుకుపోవడం తప్ప పాత్రచిత్రణ మృగ్యం" అను వీరి అభియోగం అవిచారమూలమైనది. అంబాసాళ్వుల సంవాదము ప్రస్తుతకథా ప్రయోజనమునకవసరము కాదు. చెప్పుచున్న భీష్ముఁడుకాని వినుచున్నవారుగాని అందాసక్తులు గారు. ఈ సందర్భముననే అంబ 'మనస్సులో రేగిన ఉద్విగ్న భావపరంపరను వ్యాసుఁడు చక్కగా అభివర్ణించాఁడు. తిక్కన సంక్షిప్త రచనలో కథ తప్ప పాత్రల మనో విశ్లేషణం లేద'ని వారభిప్రాయపడిరి. అంబభావపరంపరను జాలిపుట్టించునట్లు భీష్ముఁడు చెప్పి పరోక్షముగా తన్ను ఆమె స్థితికి కారకునిగా చిత్రించుకొనునా? ఇక పాత్రచిత్రణ విషయము చూచినను భారతేతిహాసమున అట్లు ప్రతిపాత్రమును చిత్రించుట సాధ్యము, సమంజసము. కాని ఆంధ్ర భారతము వంటి మహాకావ్యమున అది అసాధ్యము, అసమంజసమును. ఉపాఖ్యానము లందలి పాత్రములను చిత్రించుచుపోయిన ప్రధానేతివృత్తమునందలి పాత్రములు నిరవకాశములగును. 'తిక్కన ఉపాఖ్యానములలోని పాత్రముల కన్నను ప్రధానేతివృత్తములోని పాత్రములకే ప్రాధాన్యమిచ్చెననుట నిర్వివాదాంశము. ఈ పాత్రముల మనోవిశ్లేషాదులను తగ్గించి ప్రధానపాత్రముల మనోభావములను తిక్కన చక్కఁగా చిత్రించుటవలననే ఆంధ్రభారతమునకు కావ్యగౌరవము కలిగినది. అందలి ప్రధాన పాత్రములు రూపుకట్టి నిలిచినవి.

కవుల రచనా విధానముల ననుసరించి కథనము మారుచుండును. వ్యాసుఁడు తాను కథ చెప్పుటకు పాత్రము నాధారముగా గైకొనును. కథకుఁడు వ్యాసుఁడే యగుటవలన కథను జరిగినది జరిగినట్లు రచించును. అన్ని పాత్రములను సమీక్షించును. తిక్కన తాను కథను చెప్పఁడు. పాత్రముచే చెప్పించును. తిక్కన ఆ పాత్రములో లీనమై ఆ పాత్ర మనుభవించిన రాగద్వేషముల ననుసరించి కథను సాగించును. ఇట కథనములేదు, నాటకములోవలె ఒక పాత్రము నటించును. భీష్ముఁడు అంబపాత్రమును సాను భూతికాకరమగునట్లు చిత్రింపఁడుగదా! నిర్లిప్తుఁడై పలుకును. ఈ కారణముననే భీష్ముఁడు అంబసాళ్వుల సంవాదమును గాని, అంబాపరశురాముల సంభాషణమునుగాని, ఆమె తపశ్చర్యను గాని వివరింపలేదు. తిక్కన భీష్ముని లో ప్రవేశించి రచించినాఁడనుటకీ విధానమే నిదర్శనము. వ్యాసుని భారతము వ్యాసునిచే నడుపఁబడినది. తిక్కన భారతము అతఁడు తీర్చిదిద్దిన పాత్రములచే నిర్వహింపఁబడినది.

ప్రస్తుతము అంబోపాఖ్యానము భీష్మునిచే నిర్వహింపఁబడినది. అనగా వ్యాసుని భీష్ముఁడు కథకుఁడు కాగా తిక్కన భీష్ముఁడు నటకుఁడు. ఈతఁడు తన భావములను ప్రకటించునుగాని ఇతరుల భావములను ప్రదర్శించి చూపఁడు.

"అత్యజద్భరత శ్రేష్ఠ జీర్ణాంత్వచమివోరగః" అని మూలము. పాము కుబుసమును విడుచుట సహజమగు చర్య. కాని సాళ్వుఁడు అంబను విడనాడుట ఏమి సమంజసము? అసలు అంబ సాళ్వునకు దత్తమై యున్న స్త్రీ కాదు గదా ఇపుడు పరిత్యజించుటకు. ఇట్టి ఈ ఉపమానమును తిక్కన గ్రహింపకపోవుటయే అనౌచిత్య పరిహారణము. అంబను "కరుణంబుగ నేడ్చు తలోదరిన"ని తిక్కన పేర్కొనుట చాలు. అంతకన్న మిన్నగ వర్ణించుట తగదు. కావ్యశోభాకరములగు వర్ణన లావశ్యకములే కాని కావ్యేతివృత్తమును మరపించు వర్ణనలనవసరములు. అప్రస్తుతాలంకారములు నిట్టివే.

అకృతవరణుని రాక, ఆతనికి హోత్రవాహనుఁడంబ విషయమును చెప్పుట, ఆతడు అంబను 'భీష్మ సాళ్వులలో నెవరిని దండింపగోరెదవని

యడుగుట, పరశురాముని రాకను తెలుపుట మూలమున నలభై నాలుగు శ్లోకముల నుండగా తిక్కన ఒక్కవచనములో సంక్షేపించెను. అకృతవ్రణునితో అంబకథను చెప్పుట అనవసరము. మఱల పరశురామునితో నీ విషయములే చెప్పఁబడుచున్నవి గదా! పరశురాముని రాకను తెలుపుటయే ఆ పాత్రమువలని ప్రయోజనము. తిక్కన దానిని గ్రహించెను. పరశురామునికంబ తన వృత్తాంతమును వినిపించుట, పరశురాముని వర్ణన, అతఁడంబకభయ మిచ్చుట కూడ మూలమున అతి విపులముగా చెప్పఁబడినవి. అంబవృత్తాంతము మఱల చెప్పుట యగుచున్నదని తిక్కన సంగ్రహముగా రచించెను.

అంబ చేసిన భీష్మనిందను తిక్కన అనువదింపలేదు. "సదా లుబ్ధశ్చ మానీచ జితకాశీచ భార్గవ"—భీష్ముడు చెప్పినట్లున్న కథలో దీనిని వేర్కొనవచ్చునా ?

"భీష్మ పరశురాముల సంభాషణలో మూలంలోని కొన్ని మనస్సును పట్టివేసే వాక్యాలని తిక్కన అనువదించలేద" ని, తిక్కన రచనలో కథ తెలుస్తున్నది తప్ప అంబ పడిన కష్టాలు మన కళ్ళకు కట్టడంలేదు; అంబ దృఢనిశ్చయం మనను ఆశ్చర్యభరితులను చెయ్యడం లేద"ని; "అర్థం ఒకటే అయినా వ్యాసుని రచన కలిగిస్తున్న విషాదానుభూతిని తిక్కన రచన కలిగించడం లేద"ని, "తిక్కన మాటలలో భావచిత్రణ కొరవడింద"ని కాశూరి హనుమంతరావుగారభిప్రాయపడినారు.

అనువాదంలో ప్రధానంగా సంగ్రహణము జరిగినదగుటచే కొన్ని సంభాషణలు విడువవలసి వచ్చినది. కాని ప్రధాన కథలో తిక్కన సంభాషణలను పెంచుటయు, సంస్కరించుటయు జరిగినదని రాయబారములలో విదితమైనది కదా. అంబ వృత్తాంతము కరుణరసనిర్భరముగా నుండవలెననునది శ్రీ రావుగారి అభిప్రాయముగా నున్నది. కాని ఇచట శిఖండిపై దుర్యోధనునకు కాని పఠితకు కాని ఆగ్రహమే కలుగును కాని అభిమానము కాదు. తన తప్పునకు తాను బలియైన పడతి అంబ. ఇందు భీష్ముని దోసము లేదు. ఈ వృత్తాంతము అంబ తనకు తానై చెప్పుకొన్నను అంబపై సానుభూతి అంతగా నేర్పడదు. అట్టిచో భీష్ముఁడు

చెప్పునపుడు విషాదస్ఫురణ కలుగలేదని భావించుట మృగతృష్ణలో చాలి నంత నీరు లేదనుట వంటిది. అంబ చితిలో ప్రవేశించునపుడు దైన్యమా మెయందే లేదు. పరమశివుని వలన వరము పడసి సఫలమనోరథయైన అంబ ఒక కృతనిశ్చయముతో చితారోహణమును కావించినదే కాని భగ్న హృదయకాని, వంచింపఁబడి. పరిభవింపఁబడి కాదు. ఆ అవమానముల కామె మరణించి యుండిన అపుడు సానుభూతి కలిగెడి అవకాశముండెడిది. కాని అంబ భీష్మునిపై కతుబూని అకారణద్వేషమును పెంచుకొని, పగ తీర్చుకొనుటకు చితిలో ప్రవేశించినది కనుక జాలి కలుగుట అరిది.

"తిక్కన అనువాదసరణిని గూర్చి ఆంధ్ర మహాభారత విమర్శకులు తరచుగా వ్యక్తపరచే రెండు అభిప్రాయాలు ఈ పందర్భంలో పరిశీలింపదగినవి తిక్కన రచనలో నాటకశిల్పం ప్రదర్శితమవుతుంది, పాత్రలు అవసరమైనంత మేరకు మాటాడతారు అని మొదటి అభిప్రాయం. రెండవది వ్యాసుఁడు చారిత్రక దృష్టితో రచించిన మహాభారతాన్ని తిక్కన కావ్యదృష్టితో తెనిగించినాడు అని. ఉదాహరణకు ప్రస్తుతం చర్చించిన అంబోపాఖ్యానం కవి కథనం కాదు. భీష్ముఁడు దుర్యోధనుఁడికి రాజసభలో చెబుతున్నది. కనుక ఆ పరిస్థితికి అనువుగా అవసరమైనంత మేరకు తిక్కన సంక్షేపించాఁడు. ఇలా సంక్షేపించడం గొప్ప రచనా శిల్పం అని'' హనుమంతరావుగారి పై అభిప్రాయం సత్యమే. కాని వారు "మహాభారతంలోని ప్రతి ఉపాఖ్యానమూ ఇంకొకరితో చెప్పినదే తప్ప అన్యం కానరాదు మార్కండేయుఁడు ధర్మరాజుకి రామోపాఖ్యానం, సావిత్ర్యుపాఖ్యానం చెబుతాడు; ఎర్రన ఈ రెండు ఉపాఖ్యానాలనీ అట్టే సంక్షేపించకుండ చక్కగా ఆంధ్రీకరించాఁడు" అని అభిప్రాయపడినారు అచట మార్కండేయునకు ఆ రెండు కథలతో ప్రత్యక్ష సంబంధము లేకునికి తటస్థునివలె కథను చెప్పియుండెను. కాని తన కత్యంత సంబంధమును కలిగినదేకాక తన మరణముతో ముడివడియున్న కథను భీష్ముఁడట్లు చెప్పలేడు కదా. చెప్పకుండుటయే సమంజసము కూడ

మయసభలో తాను భంగపడిన వృత్తాంతాన్ని దుర్యోధనుఁడు తండ్రికి చెప్పునపుడు "పాండవుల మీద ద్వేషం పెంచే ప్రయత్నం దుర్యోధనుఁడి కథనంలో కనిపిస్తుంది. ఇలా ప్రయోజనాన్ని బట్టి కథనంలో మార్పు ఉండ

వచ్చును. ఇతివృత్త నిర్వహణంలో శిల్పం చూపవచ్చును.'' అని వారన్నారు. కాబట్టి భీష్ముని కథనంలో అంబ మనోభావవిశ్లేషణ లేకపోవడం కూడ శిల్పమేయగుచున్నది కదా. అందువలననే మూలమునందలి కథ వ్యాసుడు చెప్పినట్లున్నది. అనువాదమున భీష్ముడు చెప్పినట్లున్నది.

"భీష్ముడు స్వార్థపరుడై, దీనిలో నా తప్పేమీ లేదు. అంతా అంబా సాళ్వులదే అని సభలో అందరినీ నమ్మించే ప్రయత్నంతో ఈ కథ చెప్పి ఉన్నట్లైతే అప్పుడు కథనంలో మార్పు ఉండవచ్చును. కాని భీష్ముడు మహానుభావుడు. జరిగింది జరిగినట్లు చెప్పాడు కనుక తిక్కన సంక్షేపించడం వలన కావ్యగౌరవం లోపించినదే తప్ప కథనంలో ఏమీ శిల్పం ప్రదర్శితం కాలేదు". అను వారి విమర్శ స్వవచనవ్యాఘాత మగుచున్నది. వలన జరిగినది జరిగినట్లు చెప్పుటకాతడు వ్యాసుని వలె దివ్యదృష్టి కలవాడు కాడు. నారదుని వలన సాంతము వినియుండినను దానిని వివరణాత్మకముగా చెప్పవలసిన పని లేదు. భీష్ముడు తన తప్పులేదని చెప్పుటకు ప్రయత్నించలేదు. అది నిస్వార్థ లక్షణమని కాదు. తన తప్పు లేదు కనుక. ప్రయోజనాన్ని బట్టి కథనం మారవచ్చుననినవారే ఇచట భీష్ముని వైపునుండి ఆలోచించి విమర్శించుట లేదు. ఇదే ఇతివృత్తమును శిఖండి ధర్మజునకు చెప్పిన ఎట్లుండవలెనని పర్యాలోచించిన తిక్కన అనువాదములోని ఔచిత్యము బోధపడును. అప్పుడు (శ్రీ) రావు గారన్నట్లు అంబకథ దయనీయముగా చెప్పబడి భీష్మ పరశురాముల యుద్ధము ముక్తసరిగా పేర్కొనబడినది. అదే ఇతివృత్తమును వైశంపాయనుడు జనమేజయునకు, సూతుడు శౌనకాది మునులకు చెప్పియుండినట్లయుండిన సంస్కృతము నందున్నట్లు ఉండవలయును. భీష్ముడు చెప్పినట్లుండవలెననినచో తిక్కన అనువాదము సరిపోవుచున్నది.

తిక్కన యుద్ధవర్ణన నెక్కువ రచించెననుట కూడ సరికాదు. ఉత్తరగోగ్రహణమున అర్జునుని యుద్ధము వర్ణింపబడిన దానిలో నాలుగవ వంతు పరశురామ, గాంగేయుల యుద్ధము కలదు. ఇది తిక్కన సంయమనమును తెలుపుచున్నదే కాని అశక్తతనుగాని, అభినివేశమునుగాని కాదు. కాశూరి హనుమంతరావుగారు ప్రయత్నించి తిక్కన అనువాదమును

విమర్శింపబూనిరే కాని మొత్తము గ్రంథములో ఆ ఉపాఖ్యానమునకున్న పరిమిత ప్రయోజనమును వారు గమనింపలేదు.

ఆంధ్రమహాభారత విమర్శకులు కొందఱు వ్యాసు కించపరచినారని వారి విచారము పై విమర్శయందు ద్యోతకమగుచున్నది. కాని తిక్కన అనువాదము బాగుగానున్నదనినంత మాత్రమున వ్యాసభారతము తక్కువ యని ఎంత మాత్రమును కాదు. సూర్యుని కాంతి సోకని చంద్రునివలె మూలభారతము లేకున్నచో, కవిత్రయభారతము కాంతిహీనమగును. వ్యాసభారతములోని కావ్యాంశములను కవిత్రయమువారెట్లు గ్రహించి తమ రచనానుకూలముగా పెంపుచేసికొనిరో అది ఈ విమర్శకు ఆధార భూతము. వారి రచనా ప్రణాళికలో సంగ్రహణము ప్రధానాంశమగుటచే అదియు నిట చర్చనీయాంశమైనది.



సూచికలు :

1. "ఇతిహాసకర్త జాగరితుఁడు గానిచో అంగరసములు, ఉపకథల మూలమున పరిపుష్టములై, అంగిని మ్రింగివేయగలవు. అనగా ప్రతియుప కథను, సముచితమైన పరిధిలో నిర్వహించుచు, ప్రధానేతివృత్తమున కుత్కర్షాపాదకముగానుండు నంతవఱకే దానిని పుష్టము చేయుచు, అంగికి లోబడి యుండునట్లుగా నితిహాసకర్త జాగ్రత్త పడవలయును." —'తిక్కన కావ్యశిల్పము'–డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి. పుట 146.

2. "ఉద్యోగపర్వమున నన్నింటికంటెను మిక్కిలి మెచ్చుకొనదగినది వస్తు సంవిధాన చాతుర్యము. దీనినే వస్తుప్రదర్శనశక్తి యని కూడ పేర్కొన వచ్చును. ఇందున్న రాయబారములకుగాని, ప్రసంగములకుగాని, సారాంశము తేల్చవలసివచ్చినచో మూడు వాక్యములలో జెప్ప వచ్చును.........ఎవరు చెప్పిన వాక్యములకైన నింతే సారాంశము. అందుచే పర్వమునందలి వస్తువునంతను నించుమించుగ బునరుక్తిక్రింద జమకట్టుకొనవలసియున్నది. కాని యీ పునరుక్తిని ఏమాత్రమును విసుగురానీయకుండ ప్రపంచించుటలోనే ప్రదర్శన ప్రాగల్భ్య మున్నది."—'మహాభారతోపన్యాసములు–తిక్కన ఉద్యోగపర్వము–పుట 141 – శ్రీ నండూరి బంగారయ్య.

3. ఆంధ్రసాహిత్యచరిత్ర – ఆచార్య పింగళి లక్ష్మీకాంతం – పుటలు 219, 220.

4. కవిత్రయము – ఆచార్య దివాకర్ల వేంకటావధాని.

5. మహాభారతోపన్యాసములు – తిక్కన. ఉద్యోగపర్వము – శ్రీ నండూరి బంగారయ్య – పుటలు–139, 140.

6. 'డెందము తాపంబు గొంత డిందుపడియె' – 5–2–24; 'నీదు పలుకులఁ గలఁక దేఱి బుద్ధి దెలివినొందె నిట్ల చేయువాఁడ నిదియ కర్జము....' 5–2–96.

